# వేదాలలో దేవతలు

## గాథలు

ఆంగ్ల మూలకర్త

ఎ. ఎ. మేక్డొనెల్

అనువాదకర్త

పి.ఎస్. సుబ్రహ్మణ్యం

తెలుగు విశ్వవిద్యాలయం

పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి

హైదరాబాద్ - 500 004

# వేదాలలో దేవతలు

## గాథలు

ఆంగ్ల మూలకర్త
ఎ. ఎ. మేక్డొనెల్

అనువాదకర్త
పి.ఎస్. సుబ్రహ్మణ్యం

తెలుగు విశ్వవిద్యాలయం
పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి
హైదరాబాద్ - 500 004

**VEDALALO DEVATALU - GADHALU**

by A. A. Macdonell

Translated by : Prof. P.S. Subrahmanyam

---



ప్రచురణ సంఖ్య: 176

ప్రథమ ముద్రణ - 1995

ప్రతులు - 1000

వెల : రూ . 80/-

ప్రతులకు,

రిజిస్ట్రార్,

తెలుగు విశ్వవిద్యాలయం,

పబ్లిక్ గార్డెన్స్, నాంపల్లి, హైదరాబాద్.

ముద్రణ:

ఫిన్‌ఫాస్ ప్రింటర్స్,

బాగ్ అంబర్‌పేట్, హైదరాబాదు - 500 013.

✆ : 7614507

ISBN 81-86073-14-0

ఆచార్య పేర్వారం జగన్నాథం
ఉపాధ్యక్షులు

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

# ముందుమాట

తెలుగుభాషా కళాసంస్కృతుల సర్వతోముఖ వికాసం ధ్యేయంగా తెలుగు విశ్వవిద్యాలయం స్థాపితమైంది. బోధన, పరిశోధన, ప్రచురణలు మొదలైన వివిధ కార్యక్రమాలను చేపట్టి ఈ విశ్వవిద్యాలయం గత పదిసంవత్సరాలుగా కృషిచేస్తున్నది.

ప్రచురణ కార్యక్రమంలో భాగంగా అలభ్యంగానూ, అముద్రితంగానూ ఉన్న గ్రంథాలను ముద్రించే కార్యక్రమాన్ని చేపట్టి ఎన్నో ప్రముఖ గ్రంథాలను తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించింది.

ప్రాచీన తెలుగు సాహిత్యవైభవానికి కరదీపికలైన ఆంధ్రమహాభారతం, ఆంధ్రమహాభాగవతం, పండితారాధ్య చరిత్ర, రంగనాథ రామాయణం వంటి ఎన్నో ప్రాచీన గ్రంథాలు విశ్వవిద్యాలయం ప్రచురణల్లో చోటు చేసుకున్నాయి.

డా. బి. ఆర్. అంబేద్కర్ రచనలు - ప్రసంగాలు 12 సంపుటాలు తెలుగులోకి అనువదించే బాధ్యతను విశ్వవిద్యాలయం చేపట్టి ఇప్పటికి 9 సంపుటాలను ప్రచురించింది. మిగతా సంపుటాలు త్వరలో రానున్నాయి.

విశ్వవిద్యాలయం 'వ్యాఖ్యా స్రవంతి' ప్రణాళికను చేపట్టి క్లిష్టమైన కావ్యప్రబంధాలను వ్యాఖ్యాసహితంగా ప్రచురిస్తున్నది. ఈ ప్రణాళికలో కుమారసంభవం, కాశీఖండం మొదలైన కావ్యాలను వ్యాఖ్యాసహితంగా ప్రచురించడం జరిగింది.

భాషాభివృద్ధి పీఠం పక్షాన నిఘంటు నిర్మాణశాఖ సిద్ధంచేసిన 'పత్రికా నిఘంటువు' ను ఇటీవలే విశ్వవిద్యాలయం ప్రచురించింది. ''ఆరె భాషానిఘంటువు'' కూడా త్వరలో వెలుగు చూస్తుంది. విశ్వసాహిత్యంలోని

ప్రముఖ గ్రంథాలను తెలుగులోనికి, తెలుగులోని ప్రముఖగ్రంథాలను ఇతర భాషల్లోకి అనువదించే ప్రణాళికనుకూడ చేపట్టినాము. ప్రస్తుత గ్రంథం 'వేదాల్లో దేవతలు - గాథలు' ఆంగ్లంలో ఎ.ఎ. మేక్డొనల్ రచించిన 'Vedic Mythology' అనే గ్రంథానికి తెలుగు అనువాదం. వేదవాఙ్మయం పై కృషిచేసిన అగ్రగణ్యులైన పాశ్చాత్య విద్వాంసుల్లో మాక్స్‌ముల్లర్ తరువాత పేర్కొదగిన వాడు ఎ.ఎ. మేక్డొనల్. ఈగ్రంథంలో ఆర్యులు ఆరాధించిన దేవతలు, వారికి మూలభూతమైన ప్రకృతి శక్తులు, వేదకాలం నాటి మానవుల సంఘజీవనం మొదలైన అంశాలకు సంబంధించిన వివరాలు మనకు లభిస్తాయి. భారతీయ చరిత్ర, సంస్కృతి, సాహిత్యం వంటి విషయాలపై పరిశోధన చేసే విద్యార్థులకే కాక వేదవిజ్ఞానం గురించి తెలుసు కోదలచే వారికి కూడా ఈ గ్రంథం ఎంతో ఉపకరిస్తుంది.

వేదవిజ్ఞానం గురించి తెలియజేసే గ్రంథాలు తెలుగులో చాలా తక్కువగా ఉన్నాయి. ఈలోటును తీరుస్తూ సుప్రసిద్ధ భాషాశాస్త్రవేత్తలు, సంస్కృత విద్వాంసులు ఆచార్య పి. ఎస్. సుబ్రహ్మణ్యం (అన్నామలై విశ్వవిద్యాలయం, భాషాశాస్త్ర శాఖ ఆచార్యులు) గారు మేక్డొనల్ గ్రంథాన్ని తెలుగులోకి అనువదించి తెలుగు పరిశోధకులకు, పాఠకులకు ఎంతో ఉపకారం చేసినారు. వారికి నా ధన్యవాదాలు.

తెలుగు పాఠకలోకం ఈగ్రంథాన్ని సముచితంగా ఆదరిస్తుందని ఆశిస్తున్నాను.

(పేర్వారం జగన్నాథం)

3-10-1995
హైదరాబాదు
యువ, విజయదశమి

# ప్రస్తావన

**1. మూలగ్రంథం, గ్రంథకర్త:** ఈ గ్రంథం ఎ.ఎ. మేక్డొనెల్ (Macdonell) సుమారు వంద సంవత్సరాల క్రితం (1896లో) రచించిన Vedic Mythology అనే గ్రంథానికి అనువాదం. ప్రపంచంలోని సాహిత్యాలు అన్నింటిలోకీ అతి ప్రాచీనమైన నాలుగు వేదాలలోనూ వాటికి అనుబంధాలైన బ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఉపనిషత్తులలోనూ ఉన్న విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి విషయ విభాగం చేసి దాన్ని మూలగ్రంథకర్త పాఠకుల ముందు ఉంచారు. ఆర్యులు ఏయే దేవతలని ఆరాధించారు? ఆ దేవతలకి మూలభూతమైన ప్రకృతి శక్తులు ఏమిటి? అంత పురాతనకాలంలో మానవుల సంఘజీవితం ఎలా ఉండేది? వారికి ఇహలోక విషయాల మీదా పరలోక విషయాల మీదా ఎటువంటి నమ్మకాలు ఉండేవి? ఆర్యులు వేదాలని దర్శించిన కాలంలో ఏ ప్రాంతంలో ఉండేవారు? మొదలైన ప్రశ్నలకి ఈ గ్రంథంలో ఆధారపూర్వకమైన సమాధానాలు దొరుకుతాయి. అందువల్ల ఇది ప్రాచీన భారతీయ సంస్కృతి మీద, పురాతన చరిత్ర మీదా, పురాతన సాహిత్యం మీదా పరిశోధన చేసే విద్యార్థులకీ, జిజ్ఞాసువులకీ అత్యంతోపయోగకరమైన గ్రంథం అనడంలో సందేహం లేదు. అది చదవగానే నాకు దానికి తెలుగు అనువాదు ఉంటే ఇంగ్లీషుతో ఎక్కువ పరిచయం లేని తెలుగు వారికి అది చాలా ఉపయోగిస్తుందనిపించింది. దాని ఫలితమే ఈ అనువాదం. మూలగ్రంథకర్త అయిన మేక్డొనెల్ పందొమ్మిదో శతాబ్దిలో సంస్కృత భాష మీద, ముఖ్యంగా వేద వాఙ్మయం మీద, పరిశోధన చేసిన పాశ్చాత్య పండితులలో అగ్రగణ్యులు, వేద వాఙ్మయం మీద అమూల్యమైన కృషి చేసిన వారిలో మేక్స్ ముల్లర్ తరవాత ఈయన్నే చెప్పుకోవాలి. వైదిక భాషకి ఈయన రాసిన వ్యాకరణాలు, Vedic Grammar, A Vedic Grammar for students పరమ ప్రామాణికమైనవి. ఈయన ఇతర గ్రంథాలు : A Sanskrit Grammar for students, A Practical Sanskrit Dictionary, A Vedic Reader for Students, Vedic Index of Names and Subjects (A.B. Keithతో), బృహద్దేవతా ఆంగ్లానువాదం, మొ.

**2. అనువాదంలో సమస్యలు:** ఒక భాషనుంచి మరొక భాషలోకి అనువదించేటప్పుడు చాలా సమస్యలు ఉత్పన్నమవుతాయి. ఆ రెండు భాషలూ భిన్న కుటుంబాలకి చెందినవి అయినప్పుడు (ప్రస్తుత సందర్భంలోలా) ఈ సమస్యలు ఇంకా ఎక్కువగా ఉంటాయి. ఇవి

శబ్దపరమైనవీ, వాక్యపరమైనవీ అని రెండు రకాలు. ఈ అనువాద నిర్వహణలో నాకు ఎదురైన సమస్యలూ, వాటిని నేను అధిగమించడానికి చేసిన ప్రయత్నమూ విపులంగా వివరిస్తూ ఒక వ్యాసమే రాయవచ్చు. అయినా అది ఇక్కడ ప్రస్తుతం కాదు కాబట్టి కొన్ని ఉదాహరణలు మాత్రం కింద ఇస్తాను. ఈ గ్రంథం పేరులోనే ఉన్న Mythology అనే శబ్దమే శబ్దపరమైన ఒక అనువాద సమస్యని సృష్టించింది. దీనికి 'పరంపరగా వచ్చే గాథల సంపుటి' అని మాత్రమే కాక 'గాథల విశ్లేషణ', 'గాథలపై పరిశోధన గ్రంథం' అనే అర్థాలు కూడా ఉన్నాయి. ఈ మూడు అర్థాలూ ధ్వనించే తెలుగు పదం సృష్టించుకోవడం అనివార్యమైంది; 'గాథాతత్వం' దీనికి సరిపోతుందని నేను నిశ్చయించుకొన్నాను. అదేవిధంగా ''మరణం, దాని తరవాత పరలోకంలో జరిగే న్యాయవిచారణ, పరలోక జీవితం, మొ'' వాటిని సూచించే Eschatology అనే పదానికి 'పరలోకజీవితతత్త్వం' అనే పదం సరిపోతుందని అనుకొన్నాను. Verse, Stanza అనే పదాలు ఈ గ్రంథంలో వేదమంత్రాలని సూచించేవిగానే వాడబడ్డాయి కాబట్టి వీటికి సమానార్థకంగా అనూచానంగా వస్తున్న 'మంత్రం' అనే పదమే వాడేను. అదేవిధంగా Hymn కి 'సూక్తం' అనే ప్రాచీన వ్యవహారంలోనే ఉన్న పదమే వాడేను.

ఇక వాక్యపరమైన అనువాద సమస్యలలో రెండు రకాలు ఉన్నాయి : ఒక వాక్యాన్ని రెండు వాక్యాలుగా విడదీయవలసి రావడం; తెలుగు నుడికారానికి అనుగుణంగా వాక్యంలోని పదాలని మార్చడం లేక కొన్ని కొత్త పదాలు చేర్చడం. వాక్యం మరీ పెద్దదైనపుడు దాన్ని అర్థసారళ్యం కోసం విడదీసి అనువదిస్తేనే బాగుంటుంది అనుకొన్నచోట్ల అలానే చేశాను. మరికొన్ని వాక్యాలని భాషా నిర్మాణంలో భేదం దృష్ట్యా విడదీయడం అనివార్యమైంది. Being, since, for వంటి పదాలు ఉన్న వాక్యకల్పాలని (clauses) విడదీయడం తప్పనిసరి అయింది. ఉదాహరణ : Savitri is celebrated in eleven whole hyms of the R.V., and in parts of others, his name being mentioned about 170 times (15.1) -- సవిత ఋగ్వేదంలో పదకొండు పూర్తి సూక్తాలలోనూ మరికొన్నింటి భాగాలలోనూ స్తుతించబడ్డాడు; ఆయన పేరు సుమారు 170 సార్లు వచ్చింది.... the evidence, as far as it goes (60.7) (అనేదాంట్లో goes అనే పదాన్ని యథాతథంగా అనువదించడం తెలుగు నుడికారానికి విరుద్ధం; దీన్ని ''సాక్ష్యాధారం ఉన్నంతలో'' అనే అనువదించాలి. Brhaspati heard him (23.2) అనేదాంట్లో ప్రార్థన అనే పదాన్ని చేర్చి ''బృహస్పతి ఆయన ప్రార్థన విన్నాడు'' అని అనువదించడం తప్పనిసరి.

ఇక ఈ గ్రంథంలో వేదమంత్రాలకి లేక మంత్రభాగాలకి ఇచ్చిన ఆంగ్లానువాదాలను తెలుగులోకి అనువదించడంలో తెలుగు అనువాదాలు మంత్రార్థాలకి దూరం కాకుండా చూడడం ఒక ప్రత్యేక సమస్య అయింది. అందువల్ల ఇంచుమించు ఇటువంటి చోట్లు అన్నింటిలోనూ వేదగ్రంథాలని చూసి అనువాదం మంత్రానికి వీలైనంతవరకూ దగ్గరగా ఉండేటట్లు చూశాను. ఈ కారణం వల్ల మూలకర్త ఆంగ్లానువాదానికీ, తెలుగు అనువాదానికీ స్వల్పమైన భేదాలు ఉండవచ్చు. ఉదాహరణకి, 22.5 లో ఇంద్రుడికి arrows 'బాణాలు' ఉన్నట్లుగా మూలకర్త రాశారు. కాని అక్కడ ఆయన ఆధారంగా ఇచ్చిన మంత్రాలన్నిటిలోనూ ఇంద్రుడికి ఒక బాణం మాత్రమే ఉన్నట్లు ఉంది. అందువల్ల అనువాదంలో తదనుగుణంగా మార్పు చేశాను. కొన్నిచోట్ల మంత్ర వాక్యానికి సాయణుడు ఒకరకమైన అర్థమిస్తే మేక్డొనెల్ మరొక అర్థం ఇచ్చారు; ఉదాహరణకి 17.6లో 5వ అథస్సూచిక చూడండి. ఇటువంటి చోట్ల మూలగ్రంథకర్త ఇచ్చిన అర్థం గ్రంథభాగంలో ఇచ్చి అథస్సూచికలో సాయణుడు ఇచ్చిన అర్థం ఇచ్చి రెండింటిలోనూ ఉన్న బాగోగులు పరామర్శించడం జరిగింది. ఇలా అడుగడుగునా వేదగ్రంథభాగాన్ని చూసే అనువాదం చెయ్యడం వల్ల మరొకవిధమైన మేలు కూడా జరిగింది. అది మూలగ్రంథకర్త అభిప్రాయాన్ని సరిగా అర్థం చేసుకొని అనువాదం చెయ్యగలగడం. ఉదాహరణకి, One of three verses (44.2లో 2 వాక్యంలో) అన్నదానికి మూలకర్త ఉద్దేశించిన అర్థం ''మూడు మంత్రాలు కల ఒక సూక్తం'' అని మాత్రమే కాని ''మూడు మంత్రాలలో ఒకటి'' అని కాదు అనే విషయం ఋగ్వేద భాగాన్ని చూడడం వల్లనే తెలిసింది. ఇలాగే, అథర్వవేదం చూడకపోతే.... the A.V. (6, 4, 1) mentions her brothers as well as her sons (41.4, 3వ వాక్యం) అనే వాక్యాన్ని ''అథర్వవేదంలో ఆమె (= అదితి) సోదరుల పేర్లూ, కొడుకుల పేర్లూ ఉన్నాయి'' అని తప్పుగా అర్థం చేసుకోవడం తటస్థించేది; ఈ మంత్రంలో అదితికి సోదరులూ, కొడుకులూ ఉన్నారని మాత్రమే ఉంది కాని వారి పేర్లు లేవు.

**3. కొన్ని మార్పులూ, చేర్పులూ :** మూలగ్రంథకర్త మంత్రాలని అనువదించిన చోట్ల గాని మంత్రభావాన్ని తన మాటలలో చెప్పినచోట్ల గాని ఎక్కడా మంత్రం లేక మంత్రభాగం ఇవ్వలేదు. మంత్రం సంఖ్య మాత్రం ఇచ్చారు (ఉదాహరణకి 3.34.4 అంటే ఋగ్వేదం 3వ మండలంలో 34వ సూక్తంలో 4వ మంత్రం అని అర్థం; ఈ గ్రంథంలో స్మరించిన మంత్రాలు చాలావరకూ ఋగ్వేదంలోవే కాబట్టి అక్షరసంకేతం లేని

సంఖ్యలు ఋగ్వేద మంత్రాల సంఖ్యలు అని అర్థం చేసుకోవాలి; సంఖ్యకు ముందు అ.వే. ఇత్యాది సంకేతం ఉంటే అది అథర్వవేదం ఇత్యాది వైదిక గ్రంథ భాగానికి సంబంధించిన సంఖ్య అని అర్థం). మంత్రభాగం కూడా ఇస్తే తెలుగు పాఠకులకి ఆసక్తికరంగా ఉంటుందని వీలైనన్నిచోట్ల కుండలీకరణాలలో సంఖ్యతోపాటు మంత్రభాగం కూడా ఇచ్చాను. మూలకర్త కొద్దిచోట్ల మాత్రం ఒకటిరెండు పదాలు మాత్రమే ఇచ్చారు అనిగమనించాలి. మంత్రంలో ఉన్న శబ్ద సౌకుమార్యం దృష్ట్యా కాని భావౌన్నత్యం దృష్ట్యా కాని పూర్తి మంత్రం ఇస్తే బాగుంటుందని నాకు తోచినచోట్ల ఆ మంత్రమూ, దాని అర్థమూ అథస్సూచికలో ఇచ్చాను. గ్రంథభాగంలో వివరణకోసం వాక్యంలో ఒకటిరెండు పదాలు చేరిస్తే బాగుంటుందని తోచినచోట్ల అలా చేర్చిన పదాలకి ముందు పువ్వుగుర్తుపెట్టి వాటిని కుండలీకరణాలలో ఇచ్చాను. విపులమైన వివరణలు అవసరమైతే వాటిని అథస్సూచికలుగా ఇచ్చాను.

మూలగ్రంథంలో ఒక్కొక్క అధ్యాయంలో పేరా విభజన అనువాదంలో అలాగే ఉంచాను. కాని పేరాలకు సంఖ్యలు ఇచ్చాను. మూలంలో ముందు వెనుక భాగాలకు రిఫరెన్సుల కోసం పుటల సంఖ్య ఇచ్చారు. వాటికి బదులు అనువాదంలో అధ్యాయం సంఖ్య, పేరా సంఖ్య ఇచ్చాను. ఇలా ఇవ్వడం వల్ల చూడవలసిన గ్రంథభాగం స్థానం ఇంకా సునిశితంగా సూచించడం సాధ్యమవడమే కాక ప్రూఫు దిద్దేటప్పుడు అచ్చులో పుటల సంఖ్య చేర్చుకోవడమనే శ్రమకూడా తప్పింది. ( మన ముద్రణలో వెనుక భాగాల పుటల సంఖ్య ఇవ్వడం ఎలాగా అసాధ్యమే).

మూలకర్త ఇచ్చినమంత్రసంఖ్యలలో చాలా అచ్చుతప్పులు దొర్లేయి. అటువంటిచోట్ల మూలకర్త ఉద్దేశించిన మంత్రాన్ని కనుక్కోవడం కష్టసాధ్యమయింది. ఆయన మంత్రంలోని ఒకపదం ఇచ్చినచోట ( ఇటువంటివి చాలా అరుదు) ఋగ్వేద పదసూచి ఆధారంగా ఆ మంత్రం అసలు సంఖ్య కనిపెట్టగలిగేను. ఉదాహరణకి, అధ్యాయం 44.4లో 'దస్యు' అనే పదం ఆధారంగా ఆమంత్రసంఖ్య 6.28.4 కాదనీ 4.28.3 అనీ తెలిసింది. అధ్యాయం 77.8లో 10.165.4కి బదులు 1.165.4 అని తప్పుగా పడిందని ఆ అధ్యాయంలో 10వ మండలంలో మంత్రాలు ఎక్కువగా స్మరించబడి ఉండడం వల్ల గ్రహించగలిగేను. కొన్నిచోట్ల అదే ప్రభావం వేరు అధ్యాయంలో కూడా స్ఫురించబడి ఉండడం వల్ల మంత్రసంఖ్యలు సవరించాను. అన్నింటికన్నా ఎక్కువ చిక్కు కలిగించినవి 8వ మండలంలో సూక్తాల సంఖ్యలు. ఇందులో వాలఖిల్యసూక్తాలు అనబడే పదకొండు సూక్తాలు (49-59 సూక్తాలు)

మూలకర్త ఉపయోగించిన ఋగ్వేద సంహితలో మిగిలిన సూక్తాలతో పాటు లెక్కలోకి తీసుకోబడలేదు (మేక్స్‌ముల్లర్, పూనావైదికపరిశోధన మండల్ ప్రచురణలలో ఇవి పైన ఇచ్చినసంఖ్యలతోనే ఉన్నాయి). ఈ విషయం అనువాదం కొంతభాగం సాగినతరవాతగాని నాకు తెలియలేదు. ఇది తెలుసుకోవడానికి అధ్యాయం 17.12లో మూలకర్త ఇచ్చిన 'ఏముషం' అనేపదం సాయపడింది; దీనివల్ల అక్కడస్మరించిన మంత్రం సంఖ్య 8.66.10 కాదు అనీ 8.77.10 అనీ (ఋగ్వేదపదసూచివల్ల) తెలిసింది. ఇక ఆ తరవాత 8వ మండలంలో 48 సూక్తం తరవాతసూక్తాలకి మూలకర్త ఇచ్చిన సంఖ్యకి 11 కలుపుకోవాలని స్పష్టమయింది. ఇలా ఏదో ఒక ఆధారం దొరికినంత వరకూ మంత్రసంఖ్యలు సవరించి ఇచ్చాను. ఏ ఆధారమూ దొరకని కొన్నిచోట్ల మాత్రం మూలకర్త ఇచ్చినసంఖ్యనే దానిముందు ప్రశ్నార్థకం పెట్టి ఇవ్వవలసి వచ్చింది.

మూలంలో అథస్సూచికలలో మొత్తం పదిపదిహేను మినహాయిస్తే మిగిలిన అన్నింటిలో గ్రంథకర్త తన కాలం నాటి జర్మన్, ఫ్రెంచి భాషలలోని గ్రంథాలూ వ్యాసాల రిఫరెన్సులు ఇచ్చారు. అవన్నీ మనదేశంలో దొరకడం అసాధ్యం; అవి దొరికినా వాటిని చదివే సామర్థ్యం ఉన్నవారు మనదేశంలో చాలా తక్కువ. వాటిలో సారాంశం ఎలాగూ మూలకర్త ఇచ్చారు కాబట్టి అటువంటి అథస్సూచికలు అనువాదంలో వదిలేశాను. మూలకర్త కొన్ని అథస్సూచికలలో కొత్తగా చెప్పిన విషయాల సారాంశం గ్రంథభాగ అనువాదంలో అథస్సూచికలన్నీ నేను చేర్చినవే. వీటిలో వేదమంత్రాలూ, వాటి అర్థాలూ, మూలకర్త ఇచ్చిన అర్థానికీ సాయణవ్యాఖ్యకీ భేదం ఉంటే ఆ విషయమూ, మూలకర్త వాక్యానికి నేను అవసరం అనుకొన్న వివరణలూ, సవరణలూ మొదలైనవి ఉన్నాయి. ఇటువంటివి చిన్న చిన్న వాక్యాలలో చెప్పడం సాధ్యమైనచోట్ల వాటిని గ్రంథభాగవాక్యంలోనే వాటిముందు పువ్వుగుర్తుపెట్టి కుండలీకరణాలలో ఇచ్చాను.

**4. కృతజ్ఞతలు :** వేదాలలో విషయాన్ని ఇంత విశదంగా సప్రమాణంగా వివరించిన గ్రంథం ఏదీ నాకు తెలిసినంతవరకూ తెలుగులో ఇంతవరకూ లేదు. ఇది తెలుగు పాఠకులకు వేద విషయాలపై ఆసక్తి కలిగిస్తుందనీ, చరిత్ర, సంస్కృతి, సాహిత్యం వంటి విషయాలపై పరిశోధనచేసేవారికి ఒక ముఖ్యమైన ఆధారగ్రంథంగా ఉపయోగిస్తుందనీ నమ్ముతున్నాను. ఈ గ్రంథప్రాశస్త్యం గ్రహించి, నా ఈ అనువాదాన్ని ప్రచురించడానికి అంగీకరించిన

మిత్రులు ఆచార్య పేర్వారం జగన్నాథం ( ఉపాధ్యక్షులు) గారికీ, తెలుగు విశ్వవిద్యాలయం ఇతర అధికారులకూ నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు అర్పిస్తున్నాను.

## కొన్ని పదాలు - వివరణలు

**అనుక్రమణి :** అనుక్రమణులు అనే గ్రంథాలు వేదానికి సూచికల వంటివి. ఒక్కొక్క వేదానికి అనుక్రమణులు విడివిడిగా ఉన్నాయి. అనుక్రమణిలో ఆవేదంలో ఉన్న సూక్తాల సంఖ్య, ఒక్కొక్క సూక్తాన్ని దర్శించిన ఋషి పేరూ, ఛందస్సులూ, ఒక్కొక్క సూక్తానికి అధిదేవతలూ మొదలైన వివరాలు సంహితలో ఉన్న క్రమంలో ఇవ్వబడ్డాయి. ఋగ్వేదానికి ఏడు అనుక్రమణులు ఉన్నాయి; వీటన్నిటికీ కర్త శౌనకుడు అని సంప్రదాయం. ఇవి శ్లోకరూపంగా ఉన్నాయి; త్రిష్టుప్ అనే ఛందస్సులో కూడా వీటిలో కొంత భాగం ఉంది. కాత్యాయన విరచితమైన సర్వానుక్రమణి అనే సూత్రరూపమైన గ్రంథంలో ఛందోరూపంలో ఉన్న అనుక్రమణులలోని వివరాలన్నీ సంగ్రహించబడ్డాయి. ఇందులో ఋగ్వేదంలోని ప్రతిసూక్తానికీ మొదట వచ్చే పదం ( లేక పదాలు) , ఋక్కుల సంఖ్యా, దాన్ని దర్శించిన ఋషిపేరూ, దేవత పేరూ, ఛందస్సూ ( కొన్ని ఋక్కులకి ఛందస్సు వేరయితే దానిపేరూ) ఇవ్వబడ్డాయి.

**అవెస్తా :** ఇది పార్శీల పవిత్ర గ్రంథం ( వీరు మొదట్లో ఇరాన్‌దేశానికి చెందినవారు) . ఇందులో గాథలు అనబడే మంత్రాలలో కొన్ని క్రీ. పూ. 6వ శతాబ్దికి చెందిన జొరొ ఆస్టర్ (Zoroaster) రచించినవి అని సంప్రదాయం. అవెస్తాలోని మంత్రాలకీ ఋగ్వేదమంత్రాలకీ అర్థంలోనూ శబ్దాలలోనూ చాలా సామీప్యం ఉంది. కొన్ని అవెస్తా మంత్రాలలో ఒకటి రెండు వర్ణాలను మారిస్తే అవి ఋగ్వేదమంత్రాలతో ఇంచుమించు సమానం అయిపోతాయి. అందువల్ల ఋగ్వేదంలో కొంతభాగం ఆర్యులు భారతోపఖండానికి రాకముందే రచించబడ్డాయని పండితుల విశ్వాసం.

**అసురశబ్దం :** ఋగ్వేదంలో అసురశబ్దం ( ప్రథమైకవచనం అసురః) 'దేవత' అనే అర్థంలోనే ప్రచురంగా వాడబడింది. అవెస్తాలో దీనికి తుల్యమైన 'అహుర' శబ్దం దేవతలందరిలోకీ గొప్పవాడైన దేవతకి వాచకం. ఋగ్వేదంలో అసురశబ్దం వరుణుడికి విశేషణంగా వాడబడింది. ఋగ్వేదం అర్వాచీన భాగాలలోనూ అథర్వవేదంలోనూ దీనికి

అర్థంలో మార్పు వచ్చి ఇది 'రాక్షసుడు' అనే అర్థంలో వాడబడింది; ఈ అర్థమే తరవాత కాలంలో స్థిరపడింది. దీని మౌలికార్థం 'మాయాశక్తి' కలవాడు అని చెప్పవచ్చు. పైనచెప్పిన అర్థవిపరిణామం జరిగేక ఇందులో మొదట ఉన్న అకారం వ్యతిరేకార్థకం అని భ్రమించడం వల్ల 'సుర' శబ్దం దేవతలకి పర్యాయంగా సృష్టించబడింది. సురశబ్దం మొట్టమొదటగా ఉపనిషత్తులలో మాత్రమే కనపడుతుంది. (చూ. అధ్యాయం 11, అథస్సూచిక 4).

**ఆప్రీసూక్తాలు (ఆప్రసూక్తాలు) :** 'ఆప్రీ' శబ్దంలో ఆ - ఉపసర్గ, ప్రీ - ప్రీతికలిగించు' అనేధాతువు; అందువల్ల ఆప్రీసూక్తం అంటేదేవతలకి ప్రీతి కలిగించడానికి ఉద్దిష్టమైనసూక్తం అని మౌలికార్థం. ఆప్రీసూక్తాలు యజ్ఞనిర్వహణలో మొదటిభాగమైన ప్రయాజహోమంలో ఉపయుక్తమవుతాయి. ఋగ్వేదంలో 1.13; 1.142; 1.188; 2.3; 5.5; 7.2; 10.70; 10.110; (సోమసూక్తం) 9.5 అనే సంఖ్యలు గల సూక్తాలు ఆప్రీసూక్తాలు. ఒక్కొక్క ఆప్రీసూక్తంలో 11 లేక 12 మంత్రాలు ఉంటాయి; ఈ మంత్రాలలో ఒక్కొక్కటి ఒక్కొక్క దేవతకి ఉద్దిష్టమైనది. ఆప్రీసూక్తాలలో 2.3, 5.5, 7.2, 10.70లలో తనూనపాత్ అనే దేవతకి ఉద్దిష్టమైన మంత్రం లేదు కాబట్టి వీటిని 'ఆప్రసూక్తాలు' అని కూడా అంటారు. యజ్ఞకర్మ సాంగోపాంగంగా విస్తరించడానికి ముందున్న అతిప్రాచీనకాలంలో ఆప్రీసూక్తాలు త్వష్ట, సరస్వతి, ఇళ, భారతి (లేక మహీ) అనే దేవతలని తృప్తిపరచడానికి ఇంట్లోనే జరిగే ఆరాధనలో ఉపయుక్తమయ్యేవి అనీ, తరవాతకాలంలో ఇవి యజ్ఞకర్మలో ఉపయుక్తమయ్యే ఇతరమంత్రాలతోపాటు చేర్చబడ్డాయనీ ఆధునిక పండితుల అభిప్రాయం. (చూ. Lourens P. Vanden Bosch, The Aipri: hymns of the Rgveda and their interpretation, Indo-Iranian Journal 28 (1985) : 95-122; 169-189.

**ఇండో – ఇరానియన్:** ఇది ఇండో-యూరోపియన్‌భాషా కుటుంబంలోని ఒక శాఖ. దీంట్లో సంస్కృతం, దానినించి వచ్చిన హిందీ, మరాఠీ, బెంగాలీ మొదలైన ఆధునికార్యభాషలు ఒకవిభాగం; ఇరాన్‌ప్రాంతంలో వ్యవహారంలో (పూర్వం, ఇప్పుడూ) వ్యవహారంలో ఉన్న భాషలు మరొకవిభాగం. వీటిలో ముఖ్యమైనవి అవెస్తాలో భాష (ఇది ప్రాచీన పర్షియన్ తూర్పు మాండలికం), ప్రాచీన పర్షియన్ (పశ్చిమ మాండలికం), ఆధునికపర్షియన్ (క్రీ.శ. 9వ శతాబ్ది నించి), కుర్దిష్, ~ ష్తో (ఆఫ్ఘనిస్తాన్). ఈ భాషలన్నీ

విడిపోకముందు ఒకేభాషగా ఉండేవి; ఆ భాషసాంకేతికనామం మూల ఇండో- ఇరానియన్. అది వ్యవహారంలో ఉన్నకాలం మూల ఇండో- ఇరానియన్‌కాలం.

**ఇండో- యూరోపియన్:** ఇది ప్రపంచంలో భాషా కుటుంబాలన్నిటిలోకీ పెద్ద భాషా కుటుంబం. అతి ప్రాచీనమైన సాహిత్యం కల సంస్కృతం, గ్రీక్, లాటిన్ భాషలు దీనికిచెందినవే. ఇందులో పది ముఖ్యశాఖలు ఉన్నాయి. ఈ భాషలన్నీ ఒకానొక కాలంలో ఒకే భాషగా ఉండేవి అని శాస్త్రజ్ఞుల నిర్ణయం; ఆ భాషసాంకేతికనామం మూల ఇండో- యూరోపియన్. అది వ్యవహారంలో ఉన్న కాలం మూల ఇండో- యూరోపియన్ కాలం. ఇందులో శాఖలు : 1. ఇండో- ఇరానియన్ (చూ. పైన). 2. బాల్టో-స్లావోనిక్ (లిథువానియన్, రష్యన్, మొ.), 3. ఆర్మేనియన్, 4. అల్బేనియన్, 5. గ్రీక్, 6. లాటిన్ (దీనినించి వచ్చినవి ఫ్రెంచి, ఇటాలియన్, మొ.), 7. కెల్టిక్ ( ఐరిష్, వెల్ష్, మొ.), 8. జర్మానిక్(జర్మన్, ఇంగ్లీషు, మొ). 9. టొకేరియన్, 10. హిట్టైటీ, ( థ్రాసియన్, ఫ్రిజియన్, ఇలిరియన్, ఆస్కో- ఉంబ్రియన్, వెనెటిక్ అనే భాషలు ఇప్పుడు నశించాయి; వీటికి అతి స్వల్పమైన ఆధారాలు లభించాయి.

**ఋగ్వేదమండలాల ప్రాచీనతలో తారతమ్యాలు :** ఋగ్వేదంలో సుమారు పదివేల ఋక్కులు (మంత్రాలు) ఉన్నాయి; ఋక్కులన్నీ ఛందోబద్ధాలు; ఛందస్సుననుసరించి ఒక్కొక్క ఋక్కులో మూడు లేక నాలుగు పాదాలు ఉంటాయి. ఋగ్వేదం పదిమండలాలుగా విభజించబడింది; ఒక్కొక్క మండలం కొన్ని సూక్తాలుగా విభజించబడింది (ఉదా. మొదటి మండలంలో 191 సూక్తాలూ, రెండో మండలంలో 43 సూక్తాలూ ఉన్నాయి). ఒక్కొక్క సూక్తంలో కొన్ని ఋక్కులు ఉంటాయి (ఉదా. మొదటి మండలంలో 1, 2 సూక్తాలలో తొమ్మిదేసీ, 3వ సూక్తంలో 12 ఋక్కులు ఉన్నాయి); మొత్తంసూక్తాలసంఖ్యసుమారువెయ్యి(1028). ఒకఋక్కునిగుర్తించడానికి మండలం సంఖ్యా, సూక్తం సంఖ్యా, ఋక్కుసంఖ్యా ఇవ్వడం పరిపాటి. ( ఋగ్వేదాన్ని ఎనిమిది అష్టకాలు (కాండలు), 64 అధ్యాయాలు, 85 అనువాకాలు, సుమారు రెండువేల వర్గాలు అనేవిధంగా విభజించడం కూడా ఉంది). ఋగ్వేదంలో రెండు నించి ఏడు వరకూ ఉన్న మండలాలు ( చూ. సగోత్రమండలాలు) మొట్టమొదట కూర్చబడినవి. ఒకటి, ఎనిమిది, తొమ్మిది మండలాలు ఆ తరవాత వీటికి చేర్చబడ్డాయి. మొదటి తొమ్మిది

మండలాలలోని మంత్రాలు (స్వల్ప సంఖ్యాకమైనవి మినహాయిస్తే) అతి ప్రాచీనమైనవే అనీ వాటిని మండలాలుగా కూర్చడంలో మాత్రమే కాల తారతమ్యం ఉందనీ గమనించాలి (తొమ్మిదో మండలంలో మంత్రాలన్నీ సోముడికి ఉద్దిష్టమైనవి). పదో మండలంలో మంత్రాల ఆవిర్భావమూ, వాటి కూర్పూ మొదటి తొమ్మిది మండలాల కూర్పు తరవాతనే జరిగేయి.

**నిరుక్తం, నిఘంటువు :** పాణినికి ముందుకాలంవాడైన యాస్కుడు రచించిన నిరుక్తం వేదమంత్రాలకి అర్థం వివరించడంలో ప్రథమప్రయత్నం. వేదాలలోని కొన్ని పదాలకి వాటిని ధాతువులనించి పుట్టినవిగా నిరూపించి అర్థ నిర్ణయం చెయ్యడం దీని ప్రధానోద్దేశం. ఇందులో 12 అధ్యాయాలు ఉన్నాయి (వీటికి మరి రెండు అధ్యాయాలు తరవాతకాలంలో చేర్చబడ్డాయి). నిరుక్తానికి ఆధారం యాస్కుడికాలానికే పరంపరాగతంగా వచ్చిన అయిదు అధ్యాయాలు ఉన్న నిఘంటువు. ఇందులో నైఘంటుకకాండ అనబడే మొదటి మూడు అధ్యాయాలలో ఒకే అర్థం ఉన్న పర్యాయపదాల జాబితాలు ఉన్నాయి; నైగమకాండ అనబడే నాలుగో అధ్యాయంలో భిన్నార్థాలు కల పదాల జాబితా ఉంది. దైవతకాండ అనబడే అయిదో అధ్యాయంలో దేవతల పేర్లు ఉన్నాయి. నిరుక్తం నిఘంటువుకి వ్యాఖ్యానం.

**పవిత్రం :** యజ్ఞంలో సోమరసాన్ని వడగొట్టే సాధనం; దీన్ని గొర్రెబొచ్చుతో కాని దర్భలతో కాని చేస్తారు. ఇది పాలువంటి ఇతర ద్రవాలని కూడా శుద్ధిచెయ్యడానికి కూడా ఉపయోగిస్తుంది.

**పురోడాశం :** యజ్ఞంలో దేవతలకి ఆహుతి ఇవ్వడం కోసం బియ్యపుపిండితో చేసిన రొట్టె వంటిది. దీన్ని ముక్కలుగా చేసి దేవతలకి అగ్నిలో ఆహుతి చేస్తారు.

**ప్రాచీనతర దేవతాత్రయం :** ఋగ్వేదంలో అగ్నికి మూడు రూపాలున్నట్లూ వాటిలో ఒకటి స్వర్గంలో, మరొకటి అంతరిక్షంలో (మెరుపు), మరొకటి భూమి మీద పుట్టినట్లు భావన. అగ్నికి మూడు రూపాలున్నాయనే భావన తరవాతకాలంలో ముగ్గురు దేవతల సముదాయాల భావనికి దారితీసింది. ఋగ్వేదంలోనే సూర్యుడు, వాయువు, అగ్ని అనే దేవతాత్రయం వేదకాలం తరవాత ప్రచురమైంది. యజ్ఞంలో అగ్నిని మూడుగా (ఆహవనీయం, దక్షిణాగ్ని, గార్హపత్యం) విభజించడం కూడా అగ్ని త్రిరూపత్వానికి ప్రతీక కావచ్చు.

**బ్రాహ్మణాలు :** బ్రహ్మన్- అంటే 'ప్రార్థన, స్తుతి'; అందువల్ల బ్రాహ్మణం అంటే దేవతారాధన విధానానికి సంబంధించిన గ్రంథం. బ్రాహ్మణాలలో యజ్ఞం నిర్వహించే విధానం, అందులో వేదమంత్రాలు ఉపయోగించే విధానం, వేదమంత్రాల తత్త్వం మొదలైన విషయాలు ఉన్నాయి. ఇవి నాలుగు వేదాలూ రూపుదిద్దుకొన్న తరవాతనే ఉద్భవించాయి. ఆరణ్యకాలూ (అరణ్యంలో, అంటే, నిర్జనప్రదేశంలో అధ్యయనం చేయవలసినవి), ఉపనిషత్తులూ వీటిలో భాగాలే. ఒక్కొక్క వేదానికి బ్రాహ్మణాలు ఉన్నాయి. ఐతరేయ బ్రాహ్మణం, కౌశీతకీ బ్రాహ్మణం ఋగ్వేదానికీ, తైత్తిరీయ బ్రాహ్మణం (కృష్ణ) యజుర్వేదానికీ, శతపథబ్రాహ్మణం (శుక్ల) యజుర్వేదానికీ, పంచవింశ (తాండ్య/ ప్రౌఢ) బ్రాహ్మణం సామవేదానికీ, గోపథబ్రాహ్మణం అథర్వవేదానికీ చెందినవి.

**యాజకులు :** యజ్ఞం చేయించేవారు; వీరినే ఋత్విక్కులని కూడా అంటారు. యజ్ఞంలో మొత్తం పదహారుమంది యాజకులు ఉంటారు. వీరిలో హోత (హోతృ-), అధ్వర్యుడు (అధ్వర్యు-), ఉద్గాత (ఉద్గాతృ-), బ్రహ్మ (బ్రహ్మన్-) అనే నలుగురు ముఖ్యులు; వీరిలో ఒక్కొక్కరికి ముగ్గురేసి సహాయకులు ఉంటారు. హోత ఋగ్వేద మంత్రాలు చదువుతాడు; ఈయనకి మైత్రావరుణుడు, అచ్ఛావాకుడు, గ్రావస్తుత్ అనేవారు సహాయకులు. అధ్వర్యుడు యజుర్వేదమంత్రాలు చదువుతూ యజ్ఞ కర్మ అంతా నిర్వహించే ప్రధానుడుగా ఉంటాడు; ప్రతిప్రస్థాత (తృ-), నేష్ట (ష్టృ-), ఉన్నేత (తృ-) ఈయనకి సహాయులు. ఉద్గాత సామవేదగానం చేస్తాడు; ఈయనకి ప్రస్తోత (తృ-), ప్రతిహర్త (ర్తృ-), సుబ్రహ్మణ్యుడు సహాయులు. బ్రహ్మ అన్ని వేదాలూ తెలిసిన పండితుడు: ఈయన యజ్ఞంలో దోషాలు లేకుండా చూస్తాడు; తరవాతకాలంలో ఈయన చేసే పనులకి అథర్వవేదం ఆధారమయింది; బ్రాహ్మణాచ్ఛంసి (న్-), అగ్నీధ్రుడు, పోత (పోతృ-) ఈయనకి సహాయులు.

**వేదాల ప్రాచీనతలో తారతమ్యం :** ఋగ్వేదం అన్నివేదాలలోకీ ప్రాచీనతమమైనది. యజుర్వేదంలో ఒక్కటే ఛందోబద్ధం కాని మంత్రవాక్యాల సముదాయం; ఇది వివిధమైన యజ్ఞాలు నిర్వహించే పద్ధతికి అనుకూలంగా కూర్చబడింది; ఇందులో ఛందోబద్ధమైన మంత్రాలన్నీ ఇంచుమించు ఋగ్వేదంనించి తీసుకొన్నవే. సామవేదంలో 75 తప్ప మిగిలిన మంత్రాలన్నీ ఋగ్వేదంలోవే; ఇందులో మంత్రాలు సోమయాగనిర్వహణలో అవసరమైన వరసలో కూర్చబడ్డాయి; సామవేదమంత్రాలు రాగయుక్తంగా గానం చేస్తారు. మొదట్లో ఈ

మూడు వేదాలే ఉండేవి; అందువల్లనే వేదవిద్యని త్రయీవిద్య అంటారు. అథర్వవేదం మొదటి మూడు వేదాలూ స్థిరపడిన తరవాత ఏర్పడింది; ఇందులో ఋగ్వేదం పదో మండలాన్నించి తీసుకొన్న మంత్రాలు కూడా కొన్ని ఉన్నాయి. అథర్వవేదం అర్వాచీనమైనదే అయినా ఇందులో దెయ్యాలూ, భూతాల వంటి క్షుద్రశక్తులని పూజించడం, నీచమైన కోరికలు తీరడానికి అభిచార హోమాలు చెయ్యడం వంటి అనాదికాలం నించీ వచ్చిన నమ్మకాలు పుష్కలంగా ఉన్నాయి.

**సగోత్ర మండలాలు :** ఋగ్వేదంలో రెండునించి ఏడువరకూ ఉన్న ఆరుమండలాలకీ సగోత్రమండలాలు (Family Books) అనే పేరు ఉంది. వీటిలో ఒక్కొక్క మండలం ఒక్కొక్క ఋషిలేకఆయనసంతతివారు (సగోత్రులు) దర్శించినది అవడం వల్ల వీటికి ఈ పేరు వచ్చింది. ఉదాహరణకి, గృత్సమదుడు రెండో మండలానికి ద్రష్ట; విశ్వామిత్రుడు మూడోమండలానికి ద్రష్ట. ఈ సగోత్ర మండలాలూ, తొమ్మిదో మండలమూ ఋగ్వేదంలో ప్రాచీనతమమైనది.

**సంహితలు :** నాలుగు వేదాలకీ 'సంహితలు' అనే పేరు కూడా ఉంది.

**సూక్తం :** ఋగ్వేదంలోని పది మండలాలూ ఒక్కొక్కటి కొన్ని సూక్తాలుగా విభజించబడింది. ఒక్కొక్క సూక్తం కొన్ని ఋక్కుల (అంటే, ఋగ్వేమంత్రాల) సముదాయం. కొన్ని సూక్తాలలో ఋక్కులన్నింటికీ అధిదేవత ఒక్కరే; మరికొన్ని సూక్తాలలో ఋక్కులకి అధిదేవతలు వేరు వేరుగా ఉంటారు. ఉదాహరణకి, పురుషసూక్తంలో ఋక్కులన్నింటికీ అధిదేవత విశ్వాన్ని సృష్టించిన 'పురుషుడు' (ఇది పదోమండలంలో 90వ సూక్తం).

**సూత్రగ్రంథాలు :** సూత్రగ్రంథాలు కల్పసూత్రంలో భాగాలు. వీటిలో శ్రౌతసూత్రాలు, గృహ్యసూత్రాలు అని రెండు రకాలు ఉన్నాయి. శ్రౌత సూత్రాలు యజ్ఞం చేసే విధానాన్ని చిన్నచిన్న వివరాలతో సహా వివరిస్తాయి. యజ్ఞంలో ఒక్కొక్కపని ఏ క్రమంలో చెయ్యాలి, ఏ పని చేసేటప్పుడు ఏ మంత్రం చదవాలి, యజ్ఞశాలలో ఎక్కడ నిలబడి లేక కూర్చొని ఏ పని చెయ్యాలి మొదలైన వివరాలన్నీ వీటిలో ఉంటాయి. అలాగే గృహ్యసూత్రాలు ఇంట్లో చేసే ఉపనయనం, వివాహం వంటి కృత్యాలు ఎలా చెయ్యాలో వివరిస్తాయి. సూత్రగ్రంథాలు ఒక్కొక్క వేదశాఖకి విడివిడిగా ఉన్నాయి; ఉదా. బౌధాయన

శ్రౌతసూత్రం, ఆపస్తంబశ్రౌతసూత్రం, ఆపస్తంబ గృహ్యసూత్రం కృష్ణ యజుర్వేద శాఖకిచెందినవి.

# వైదిక గ్రంథాలూ, సంకేతాలూ.

| సంకేతం | గ్రంథం |
|---|---|
| అ.వే. | అథర్వవేదం |
| ఆ.గృ.సూ. | ఆశ్వలాయనగృహ్యసూత్రం |
| ఆ.శ్రౌ.సూ. | ఆశ్వలాయన శ్రౌతసూత్రం |
| ఆప.శ్రౌ.సూ. | ఆపస్తంబ శ్రౌత సూత్రం |
| ఉప. | ఉపనిషత్తు. |
| ఋ.వే. | ఋగ్వేదం |
| ఐ.బ్రా. | ఐతరేయ బ్రాహ్మణం |
| కా.శ్రౌ.సూ. | కాత్యాయన శ్రౌతసూత్రం |
| కౌ.సూ. | కౌశికసూత్రం |
| తా.మ.బ్రా. | తాండ్య మహాబ్రాహ్మణం ( = పం.బ్రా.) |
| తై. ఆ. | తైత్తిరీయ ఆరణ్యకం |
| తై.బ్రా. | తైత్తిరీయ బ్రాహ్మణం |
| తై.సం. | తైత్తిరీయ సంహిత ( = కృష్ణయజుర్వే సంహిత) |
| ధ.సూ. | ధర్మ సూత్రం |
| పం.బ్రా. | పంచవింశ బ్రాహ్మణం ( = తా.మ.బ్రా.) |

| | |
|---|---|
| పా.గృ.సూ | పారస్కరగృహ్యసూత్రం |
| మా.గృ.సూ | మానవగృహ్యసూత్రం |
| మై.సం. | మైత్రాయణీసంహిత |

వా.సం. వాజసనేయ సంహిత ( = శుక్లయజుర్వేదసంహిత)

| | |
|---|---|
| సా.వే. | సామవేదం |
| శ.బ్రా. | శతపథబ్రాహ్మణం |
| శాం.గృ.సూ. | శాంఖాయనగృహ్యసూత్రం |
| శా.శ్రౌ.సూ. | శాంఖాయనశ్రౌతసూత్రం |
| హి.గృ.సూ. | హిరణ్యకేశిగృహ్యసూత్రం |

# విషయ సూచిక

## ఆ. అంతరిక్షదేవతలు

## ఇ. పృథివీస్థాన దేవతలు



## ఈ. అమూర్తభావ దేవతలు



## ఉ. స్త్రీ దేవతలు



## ఊ. దేవతాద్వంద్వాలు

## ఎ. దేవతా గణాలు



## ఏ. ద్వితీయ శ్రేణి దేవతలు



## IV. గాథలలో పురోహితులు, వీరులు



## V. జంతువులూ అచేతన పదార్థాలూ

## VI. రాక్షసులూ, దెయ్యాలూ



## VII. పరలోక జీవిత తత్త్వం



*(మూలగ్రంథం లిఖితప్రతి సెప్టెంబరు 23, 1896న ముద్రణకు పంపబడింది.)*

# 1. ఉపోద్ఘాతం

## 1. మతమూ, గాథాతత్త్వమూ

1.1 ''మతం'' అనేపదం దాని అతి విస్తృతార్థంలో ఒకపక్క దైవికమైన లేక మానవాతీతమైనశక్తులనిగురించి మానవులకున్న అభిప్రాయాలనీ మరొకపక్క ''మానవుల యోగక్షేమాలు అటువంటి శక్తుల అధీనం'' అనేనమ్మకాన్నీ సూచిస్తుంది; ఈ నమ్మకం అటువంటి శక్తులని వారు పూజించే విధానాల ద్వారా వ్యక్తమవుతుంది. గాథాతత్త్వం (Mythology) దేవతలు లేక వీరుల పుట్టుక, స్వభావం, పనులు, పరిసరాలని వర్ణించే కథల సముదాయం కాబట్టి ఇది ''మతం'' మొదటి అర్థానికి సంబంధించినది. శాస్త్రీయజ్ఞానం లేని అతి పురాతనకాలంలో మానవుడు తనకెదురయ్యే ప్రకృతిశక్తులకీ, ప్రకృతి పదార్థాలకీ తన మేధతో కారణాలు అన్వేషించే ప్రయత్నమే ఇటువంటి గాథలకి మూలం. నిజానికి ఇవి పురాతనమానవుడి మనఃస్థితి కనుగొన్న ఊహాత్మకమైనశాస్త్రజ్ఞానానికి ప్రతిబింబాలు. ఎందువల్లనంటే, నాగరికత అభివృద్ధి పొందినకాలం వారి మనస్సులకి కవితాదృష్టితో మాత్రమే చెప్పినవిగా కనపడే ప్రతిపాదనలు ఆ పురాతన కాలంలో వారికి తాము చూసిన ప్రకృతి పదార్థాలకీ, పరిణామాలకీ అసలైన కారణాలుగానే కనపడేవి. ఆకాశంలో గ్రహాల గమనం, తుఫానులు రావడం, ప్రపంచం పుట్టుకా, నిర్మాణం అనేవాటిని గురించి ఆలోచించడం వల్ల ఉత్పన్నమయ్యే ప్రశ్నలకిసమాధానాలు వీటిలో కథల రూపంలో ఉన్నాయి. ప్రకృతి.అంతా జీవంగల పదార్థాల సముదాయం అని పురాతన మానవుడు అనుకోవడమే ఈ కథలకి ఆధారం. ప్రకృతిలోని ఒక సంఘటనని మానవుడి వంటి మానవాతీతవ్యక్తి చేసిన పనిగా ఊహించి వ్యాఖ్యానించినప్పుడే ఒక కథ పుడుతుంది. ఉదాహరణకి, చంద్రుడు సూర్యుణ్ణి దాటకుండా సూర్యుడి వెనకాలే ప్రయాణిస్తాడు అనే సత్యాన్ని గ్రహించి దీన్ని చంద్రుడు అనే కన్య తనని తిరస్కరించిన సూర్యుడు అనే పురుషుణ్ణి వెంటాడుతోంది అని వర్ణించినప్పుడు ఇది కథగా మారుతుంది. అటువంటి ఒకమూలగాథసృజనాత్మకశక్తికల వ్యక్తుల ద్వారా మరికొన్ని కవితాత్మకమైనఅందచందాలని తనలో నింపుకొని వృద్ధి పొందిన స్థాయికి వస్తుంది. అది ఒకరినించి ఒకరికి పాకడంలో ఒక్కొక్క కథకుడి ఊహలకి అనుగుణంగా అందులో కొత్తకొత్త అంశాలు వచ్చి చేరతాయి. మానవుల మనోవికారాలను ప్రతిబింబించే విపుల వర్ణనలు చేరినకొద్దీ కథకి ఆధారమైన

ప్రకృత్యంశం కనుమరుగైపోతూ ఉంటుంది. ఒక కథ దాని పరిణత దశలో మాత్రమే మనకి దొరికినప్పుడు అది అసలు కథకి సంబంధంలేని అప్రధాన విషయాలతో పెరిగిపోయి ఉండడం వల్ల దీని విశ్లేషణ కష్టసాధ్యమూ అసాధ్యమూ కూడా అవవచ్చు. ఉదాహరణకి, గ్రీకు దేవతల కథలు వారికి అతిగా మానవలక్షణాలని ఆపాదించిన యూరిపిడెస్ (Euripides; క్రీ.పూ. 480?-406?) అనే కవి నాటకాల ద్వారా మాత్రమే లభ్యమై ఉంటే వారి స్వభావాలలోనూ పనులలోనూ అంతర్లీనమై ఉన్న ప్రకృతి లక్షణాలని కనుక్కోవడం మనకి అసాధ్యమై ఉండేది.

## 2. వేదాలలో గాథాతత్త్వం లక్షణాలు

2.1 వైదికగాథాతత్వం మతాల చారిత్రకపరిశోధనలో చాలా ప్రముఖస్థానం వహిస్తుంది. దీని ప్రాచీనతమమైన ఆధారం (★ అంటే ఋగ్వేదం) ప్రపంచంలో ఇతర ప్రాచీన సాహిత్య గ్రంథాల కన్నా ఎక్కువగా ప్రకృత్యంశాల పురుషతారోపం, పూజలమీద ఆధారపడిన నమ్మకాల పరిణామంలో ప్రాచీనతమమైన దశని మనకి చూపెడుతుంది. ఇప్పటి కాలంలో భారతీయులలో అధిక సంఖ్యాకులైన వారి (★ అంటే హిందువుల) మత సంబంధమైన నమ్మకాల బీజాలు మధ్యలో ఆగకుండా కొనసాగిన పరిణామం ద్వారా ఈ ప్రాచీనతమమైన దశకి అన్వయించవచ్చు. ఇండో-యూరోపియన్ భాషా కుటుంబంలో, మిగిలిన శాఖలలోలాగాకాక, ఈ ఒక్క శాఖలో మాత్రమే ప్రాచీనమైన ప్రకృతిపూజ స్థానాన్ని చాలా శతాబ్దాల క్రితమే విదేశంనించి వచ్చిన ఏకదేవాత్మకమైన మతం పూర్తిగా ఆక్రమించుకోలేదు. వైదిక గాథాతత్త్వం ఒకకాలంలో అనుకొన్నంత ప్రాచీనమైనది కాకపోయినా అది ఇతర సాహిత్యాలలో కనపడని ప్రకృత్యంశాలు పురుషతారోపం ద్వారా దేవతలుగా మారడంలోని పరిణామపద్ధతి మనకుస్పష్టంగా చూపెట్టడానికితగినంత ప్రాచీనమే. ఇందులో ఐతిహ్యాలూ భాషా కూడా చాలా సందర్భాలలో ఒక దేవతకీ ఆయన పేరుకీ కూడా ప్రకృతిలోని ఆధారంతో ఉన్న సంబంధాన్ని చూపడానికి తగినంతగా సరళమైనవే. అంతేకాదు; చాలా ఉదాహరణలలో పురుషతారోపం ఇంకా ప్రాథమికదశలోనే ఉంది. ఉదాహరణకి, ఉషస్సు (ప్రాతిపదిక ఉషస్-) అనే దేవతల విషయంలో వ్యక్తిత్వారోపం చాలా పల్చని ముసుగు వంటిదే; అదేవిధంగా 'అగ్ని' అనే పదం దేవతాపరంగా వాడబడినప్పుడు ఆ దేవత వ్యక్తిత్వం ప్రకృత్యంశమైన నిప్పుతో పూర్తిగా ముడిపడి ఉంది.

2.2 ప్రకృతిలో మానవుడు చుట్టూ ఉన్న పదార్థాలన్నీ సజీవమైనవీ, దైవాంశగలవీ అనే అతి పురాతనకాలంనించీ వచ్చిన నమ్మకం మీదే వైదికైతిహ్యతత్త్వం పునాది ఆధారపడి ఉంది. వేదకాలంలో హృదయాన్ని గౌరవపూర్వకమైన ఆశ్చర్యంతో నింపగలిగిన ప్రతిపదార్థాన్నీ, మానవుడికి మంచిగాని చెడుగాని కలిగించగలిగినదిగా భావించబడిన ప్రతిపదార్థాన్నీగౌరవార్హమైనదిగా మాత్రమే కాకపూజార్హమైనదిగా కూడా భావించేవారు. స్వర్గం, భూమీ, పర్వతాలూ, నదులూ, మొక్కలూ కూడా దైవాంశాలుగా పూజించబడ్డాయి. గుర్రం, ఆవూ, శకునపక్షీమొదలైన జంతువులు కూడా ప్రార్థనార్హమయ్యాయి. ఆయుధాలూ, రథమూ, భేరీ, నాగలీ, యజ్ఞంలో సోమరసం పిండడానికి ఉపయోగించే రాళ్ళూ, యూపస్తంభమూ మొదలైన పనిముట్లు కూడా ఆరాధించబడ్డాయి.

2.3 కాని ఇటువంటి తక్కువస్థాయి పూజాకి వైదికమతంలో తక్కువ స్థానమే ఉంది. వేదాలలో నిజమైన దేవతలు గొప్పతనం ఆపాదించబడ్డ మానవులవంటివారే; వారు మానవులలాగే పుట్టి, మానవుల ఉద్దేశాలు, మనోవికారాలతో ప్రభావితులైనవారే అయినా మరణం మాత్రం లేనివారు. ఈ దేవతలు ప్రకృతిలోని వస్తువులకీ, సంభవాలకీ ప్రతినిధులు అనడానికి ఇంచుమించు అపవాదమే లేదు. కాని వీరిమధ్య పురుషతారోపం పొందినస్థాయి విషయంలో తరతమభేదాలు ఉన్నాయి. ఒకదేవత పేరూ; ఆ దేవతకి ఆధారమైన ప్రకృత్యంశం పేరూ ఒకటే అయినప్పుడు పురుషతారోపం ప్రాథమికదశని దాటిపోలేదు. ద్యౌస్ (ద్యౌస్-) 'స్వర్గం', పృథివీ 'భూమి', సూర్యుడు (సూర్య-), ఉషస్సు - ఇవి ఇటువంటి దేవతలు; ఈ పేర్లు ప్రకృత్యంశాలకీ, వాటి ప్రతినిధులైన దేవతలకీ కూడా వర్తిస్తాయి. అదేవిధంగా యజ్ఞంలో ప్రాధాన్యం వహించే దేవతలైన అగ్ని (అగ్ని-), సోముడు (సోమ-) - వీరి విషయంలో కూడా పురుషతారోపణ కొంతవరకూ పరిమితమవడానికి కారణం వీరికి ఆధారాలై అవే పేర్లతో వ్యవహరించబడే 'నిప్పు', 'సోమరసం' అనే నిత్యపరిచితమైన ప్రకృత్యంశాల స్వభావజ్ఞానమే. ఒక దేవతపేరూ, ఆ దేవతకి ఆధారమైన ప్రకృత్యంశం పేరు, వేరయినప్పుడు ఆ రెండింటిమధ్య సంబంధం తెగిపోయి పురుషతారోపం వృద్ధిపొందుతుంది. తుఫాను దేవతలైన మరుత్తుల (మరుత్-) విషయంలో ఇలా జరిగింది. వేద ఋషులకి మరుత్తులకీ తుఫానుకీ ఉన్న సంబంధం కొంతవరకూ తెలిసి ఉన్నా, అది వాయువు (వాయు-) అనేదేవతకీ 'గాలి'కీ మధ్య ఉన్న సంబంధమంత సన్నిహితం కాదు. చివరగా, పేర్లలో ఉన్న తేడాతోబాటు, ఒక దేవత వేదకాలానికి ముందే కల్పించబడి

ఉన్నప్పుడు, ఆ దేవతకీ ప్రకృత్యంశానికీ మధ్య సంబంధం పూర్తిగా తెగిపోయి ఉంటుంది. వరుణుడి (వరుణ-) విషయంలో ఇదే జరిగింది; వరుణుడికీ ప్రకృత్యంశానికీ మధ్య ఉన్న సంబంధం వేదాల ముందుకాలంనించీ మిగిలిన ఐతిహ్యాలద్వారానే ఊహించగలం. వరుణుడి విషయంలో ఈ భేదం ఎంతవరకూ వెళ్లిందంటే, ఆయన వ్యక్తిత్వం ఏకదేవాత్మకమైన మతంలో ఉన్నతుడైన దైవప్రభువు వ్యక్తిత్వంతో పోలి ఉంది. కాని వైదికైతిహ్యతత్త్వంలో పురుషతారోపం ఎక్కడా గ్రీకుదేవతలలో ఒక్కొక్కరికి ఉన్న విశిష్ట వ్యక్తిత్వ లక్షణాల స్థాయికి చేరుకోలేదు. వేదాలలో దేవతలకి ఒకరినించి ఒకరిని వేరుపరిచే విశిష్ట వ్యక్తిత్వ లక్షణాలు చాలా తక్కువ; చాలా విశేషణాలు అందరికీ సమానంగా వాడబడ్డాయి; చాలా శక్తులు కూడా అందరు దేవతలకీ సమానంగా ఉన్నట్లు చెప్పబడింది. దీనికి ఒకకారణం ఈ దేవతలు ప్రాతినిధ్యం వహించే ప్రకృత్యంశాలు ఒకదాన్ని ఒకటి పోలి ఉండడం; పురుషతారోపం పూర్తిగా అభివృద్ధి చెందకపోవడం దానికి మరొక కారణం. ఉదాహరణకి, ఉరుముని కలిగించే దేవతా, మెరుపు రూపంలోని అగ్ని దేవతా, తుఫాను దేవతలైన మరుత్తులూ - వేదఋషుల దృష్టిలో వీరందరు చేసే ముఖ్యమైనపని వానని వదలిపెట్టడమే కాబట్టి వీరందరి పనులనీ ఒకరకమైన పదజాలంతో వర్ణించవచ్చు. పైగా, కొందరు వేదదేవతలు ఒకేమూలంనించి ఉద్భవించినా, వారిలో ఒక్కొక్కరి ప్రత్యేకలక్షణాన్ని చెప్పే విశేషణం ఒక్కొక్కరికి కాలక్రమేణా స్థిరపడిపోవడం వల్ల వారు వేరు వేరు దేవతలుగా మారిపోయారనడంలో సందేహం లేదు. సూర్యదేవతల విషయం ఇటువంటిది. వేదఋషుల వచనాలలో దేవతల పనులనుగురించి చెప్పేటప్పుడు తరచు స్పష్టత లోపించింది; దీనికి కారణం వేదాల స్వభావమే (★ అంటే, ఇవి ముఖ్యంగా దేవతాస్తుతులు అవడమే); వీటిలో గాథలు సూచించబడ్డాయే కాని వివరంగా వర్ణించబడలేదు. వేదాలు వేరువేరు కాలాలకి చెందిన అనేక ఋషులచేత దర్శించబడ్డాయి అనే విషయం మనం జ్ఞాపకం పెట్టుకొంటే, వీటిలోని ఐతిహ్యసూచనలలో పూర్తి సమానత్వం ఉండాలి అని మనం ఆశించనక్కర్లేదు.

## 3. వైదిక గాథాతత్త్వం ఆధారాలు

3.1 వైదిక గాథాతత్త్వానికి చాలా ముఖ్యమైన ఆధారం భారతదేశంలోని గ్రంథాలన్నింటిలోనూ ప్రాచీనతమమైన ఋగ్వేదం. దీనిలోని ఐతిహ్యసంచయం సమాన ప్రతిపత్తి కలిగినా ఎక్కువ తక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడిన అనేక ప్రకృతి దేవతలకు

సంబంధించినది. ఈ బహుదేవతా విశ్వాసం ఋగ్వేదకాలం చివరిభాగంలో తుల్యలక్షణ క్రోడీకరణకులోనైనదవడం వల్ల ఋగ్వేదంలో అర్వాచీనభాగం (★ అంటే 10వ మండలం) లో ఏకదేవ విశ్వాసం ప్రారంభదశా ఒకదేవుడే సర్వపదార్థాలలోనూ ఉన్నాడనే విశ్వాసం సూచనలూ కూడా మనకు కనపడతాయి. ఋగ్వేదంలో సూక్తాలు యజ్ఞకర్మలో, ముఖ్యంగా సోమయాగంలో, ఉపయోగానికి తగినట్లు సంగ్రహించబడి ఉండడం వల్ల, ఆకాలపు ఐతిహ్యసంచయంలోని అన్ని విషయాలకీ ఇందులో సమప్రాధాన్యం లేదు. సోమయాగంలోనూ రాజులూ ఇతర ధనవంతుల యాగాల్లోనూ ప్రముఖపాత్ర వహించే పెద్ద దేవతలకి ఇందులో ప్రాముఖ్యం ఉంది. కాని సోమయాగంతో సంబంధంలేని భూతాలూ, చేతపాడీ, మరణానంతర జీవితం వంటి వాటికి సంబంధించిన ఐతిహ్యాలు ఇందులో అసలులేవు. పైగా, ఈ సూక్తాలు దేవతలని ఉద్దేశించినవీ, వారి ముఖ్య లక్షణాలని పొగిడేవీ కాబట్టి వీటిలో వారి స్వభావమూ ముఖ్యకృత్యాలూ సమగ్రంగా వర్ణించబడ్డాయి; కాని వారు చేసిన మిగిలినపనులు వివరంగా చెప్పబడలేదు. యజ్ఞకర్మకి సంబంధించి ఉండి కథాకథనం అతి స్వల్పంగా ఉన్న గ్రంథంలో ఇటువంటి ఐతిహ్యాలు చెదురుమదురుగా మాత్రమే ఉండడం సహజమే. దెయ్యాలూ, భూతాలూ, మరణానంతర జీవితంపై ఉన్న అసమగ్రత అర్వాచీన భాగమైనపదోమండలంలో కొంతవరకూ సరిచేయబడినా అందులో కూడా అసమగ్రంగానే ఉండిపోయింది. ఉదాహరణకి, దుష్టులకి మరణం తరవాత ఏమవుతుంది అనే విషయం ఇందులో కూడా ఏమీ చెప్పబడలేదు. ఋగ్వేదంలోని మతంలో దేవతల స్తుతులూ, మృతులైన పూర్వుల ఆరాధనలతోపాటు జీవరహితమైన వస్తువులని దేవతలుగా ఆరాధించడం అనేది కూడా కొంతవరకు కనపడుతుంది.

3.2 సామవేదంలో ఋగ్వేదంలో లేని మంత్రాలు డబ్బై అయిదు మాత్రమే ఉన్నాయి కాబట్టి ఇదివైదికైతిహ్య పరిశోధనకి ముఖ్యం కాదు.

3.3 అథర్వవేదంలో ఎక్కువ ప్రచారంలో ఉన్న భాగాలు ఇంట్లో చేసే పూజలకీ తాంత్రిక పూజలకీ సంబంధించినవి. ఇందులో రెండో భాగమూ, కౌశిక సూత్రం అనే పూజా విధానాన్ని చెప్పే గ్రంథమూ దెయ్యాల భూతాల ప్రపంచాన్ని గురించిన విషయాలకి గని వంటివి. మతంలో ఇటువంటి తక్కువ స్థాయిని గురించి అథర్వవేదంలో చెప్పబడిన విషయాలు ఋగ్వేదంలో వాటికన్నా ప్రాచీనతరమైనవి. కాని మతంలో ఉన్నతస్థాయి

విషయాలలో ఇది పరిణతదశని సూచిస్తుంది. ఇందులోని దేవతలలో పరిణతదశ కనబడుతుంది; కొన్ని పదార్థాలకి కొత్తగా దైవత్వం ఆపాదించబడింది; మతంలో సర్వదేవతారాధన ప్రాముఖ్యం వహించింది. ఇందులో ఒక్కొక్క దేవతని ప్రత్యేకంగా పొగిడే మంత్రాలు అరుదు; చాలా దేవతలని వారివారి ప్రత్యేక స్వభావాలు చెప్పకుండా ఒకే సమయంలో ఆహ్వానించి పూజించడం ఇందులోని ప్రత్యేకత. ఇందులో కూడా ఋగ్వేదంలోలాగే దేవతల కృత్యాలు వైవిధ్యం లేకుండా ఒకేరకంగా పొగడబడ్డాయి. అథర్వవేదంలో దానికన్న ప్రాచీనమైన ఋగ్వేదంలో లేని ఐతిహ్య విషయం ఏదీ ఉందని చెప్పలేం.

3.4 యజుర్వేదం ఇంకా తరవాత కాలపు స్థితిని ప్రతిబింబిస్తుంది. ఇందులోని సూత్రాలవంటి వాక్యాలు యజ్ఞకర్మ కోసం కూర్చబడినవే కాని దేవతలని సంబోధించేవికావు; ఇందులో దేవతలు లీలామాత్రంగానే గోచరిస్తారు. దేవతలకీ యజ్ఞకర్మకీ ఉన్న సంబంధం శిథిలంగానే ఉంది. యజుర్వేదంలో గాథాతత్త్వం ప్రముఖ లక్షణాలు - ప్రజాపతి అనే ముఖ్యదేవత ఉండడమూ, విష్ణువుకి ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడడమూ, ఋగ్వేదంలోని రుద్రుడు శివుడనే కొత్తపేరుతో కనపడడమూ. ఇందులో దేవతలకి యజ్ఞకర్మకి ఉన్నంత స్థానంకన్న తక్కువ ఉండడంవల్ల ఈ వేదంలో ఐతిహ్యవిషయాలు చాలా తక్కువ.

3.5 యజుర్వేదానికీ బ్రాహ్మణాలకీ ముఖ్యమైన భేదం ఏమీ లేదు; బ్రాహ్మణాలలో ముఖ్యమైనవి ఐతరేయం, శతపథం. వీటిలో కూడా యజ్ఞకర్మకే ప్రాధాన్యం ఎక్కువ కాబట్టి, దేవతల ప్రత్యేక లక్షణాలు అంతరించిపోయాయి. కొందరు దేవతల స్వభావం మారింది; కొందరి దేవతల ప్రాధాన్యం ఎక్కువైతే మరికొందరిది తక్కువైంది. ఇంతే తప్ప మొత్తం మీద బ్రాహ్మణాలలో దేవతలు ఋగ్వేదం, అథర్వవేదాలలో ఉన్నవారే; జీవరహితమైన పదార్థాల ఆరాధనకి కూడా వీటిలో ఇంకా గుర్తింపు ఉంది. బ్రాహ్మణాలలో ప్రజాపతిని దేవతల తండ్రిగా పరిగణించి ఆయనకి ప్రధానస్థానం ఇవ్వడమే వీటిలోని గాథాతత్త్వానికీ ఋగ్వేదంలోని గాథాతత్త్వానికీ ముఖ్యభేదం. పైగా, బ్రాహ్మణాలలో సర్వదేవతాపూజ స్పష్టంగా ఉంది; ప్రజాపతే సర్వదేవతలు అనీ (శ.బ్రా. 1, 3, 5, 10), ప్రజాపతే సర్వమూ, సర్వపదార్థాలూ అనీ (శ.బ్రా. 1.6.4.2; 4.5.7.2) చెప్పబడింది.

3.6 వీటిలో దేవతలు ప్రత్యేకలక్షణాలు మరుగుపడడం వల్ల, వారిని గణాలుగా విభజించే

అలవాటు ఉంది. ఈకాల విభాగం ప్రత్యేకత అతిమానుషశక్తుల్ని దేవతలు అసురులు లేక రాక్షసులు అని రెండు పరస్పర విరోధంగల సముదాయాలుగా విభజించడం. దేవతలలో మూడు అంతర్విభాగాలు ఉన్నాయి: వసువులు భూమికి చెందినవారు, రుద్రులు అంతరిక్షానికి (★ అంటే భూమ్యాకాశాల మధ్యభాగానికి) చెందినవారు, ఆదిత్యులు (45వ అధ్యాయం) స్వర్గానికి చెందినవారు. అగ్నీ, వాయువూ, సూర్యుడూ - ఈ ముగ్గురూ ఉన్నది ఒక ముఖ్యమైన సముదాయం. ఒక ప్రత్యేక దేవతకి ఉన్న విభిన్న విశేషణాలు ఆధారంగా ఆ దేవతని వేరు వేరు వ్యక్తులుగా చిత్రించడం కూడా వీటిలో ఉంది; ఉదాహరణకి, 'అన్నానికి అధిపతి అయిన అగ్ని' వేరు, 'ప్రార్థనకి అధిపతి అయిన అగ్ని' వేరు.

3.7 బ్రాహ్మణాలలో వాటి ముఖ్యవిషయానికి ఉదాహరణలుగా అనేకమైన ఐతిహ్యాలు చెప్పబడ్డాయి. వీటిలో కొన్ని వేదసంహితలలో స్మరించబడనివి. సంహితలలో స్మరించబడిన ఐతిహ్యాలు కూడా బ్రాహ్మణాలలో వృద్ధిపొందిన రూపాలలోనే ఉండడం వల్ల, ఇవి వాటి ప్రాచీనస్వరూపాన్ని స్పష్టంగా తెలుసుకొందుకు ఉపయోగించవు. కాని ఇవి వేదాలలో ఐతిహ్యాలకీ వేదకాలం తరవాత వచ్చిన ఐతిహ్యాలకీ అనుసంధానం కల్పించేవిగా ఉపయోగపడతాయి.

## 4. పరిశోధనలో అవలంబించవలసిన పద్ధతి

4.1 వైదికగాథాతత్త్వం మన (★ అంటే, పాశ్చాత్యుల) సాంఘిక శీతోష్ణపరిస్థితులకు చాలా భిన్నమైన కాలంలోనూ దేశంలోనూ పుట్టినది. పైగా, మనకు లభ్యమయ్యే ఆధారాలు వాస్తవ పరిస్థితిని చెప్పే గ్రంథాలు కావు; ఇవి ప్రకృతిని గురించి ఇప్పటివారికున్న అభిప్రాయాలకంటే భిన్నమైన అభిప్రాయాలు గల కవుల కల్పనలు. ఇంత ప్రాచీనమైన దశలోని వైవిధ్యంగల అభిప్రాయాలని పరిశీలించడంలో ఏర్పడే క్లిష్టత ఈ అభిప్రాయాలు పొదిగిన కవిత్వం స్వభావం వల్ల ఇంకా ఎక్కువ అయింది. ఇందులో పరిశోధనకి, ఏ పరిశోధనలోనైనా అవసరమయ్యే శాస్త్రీయనైశిత్యంతోపాటు, కవితాధోరణులని అర్థం చేసుకోగలిగిన సహృదయతా, జాగరూకతా, నిష్పక్షపాతవైఖరీ ముఖ్యంగా కావాలి. అయినా వైదికైతిహ్య పరిశోధనలో (★ ఇంతవరకు జరిగిన కృషిలో) ముఖ్యంగా అవసరమైన శాస్త్రీయనైశిత్యం కొరవడింది. వేదపరిశోధకులలో ఐతిహ్యవిషయక సమస్యల మీద

భిన్నాభిప్రాయాలు ఉండడానికి ఇది ఒక ముఖ్య కారణం; దీనికి మరొక కారణం ఆధార గ్రంథాలలోని అస్పష్టత.

4.2 వేదపరిశోధన ప్రారంభదశలో పరిశోధనమొదలుపెట్టకూడనిచోట మొదలుపెట్టే అలవాటు ఉండేది. ఆకాలంలో వేదాలలో పేర్లని ఇతర భాషా సాహిత్యాలలోని పేర్లతో పోల్చి వ్యుత్పత్తిపరమైన సాజాత్యం కల్పించడంతో పరిశోధన మొదలయ్యేది. ఈ వ్యుత్పత్తి మూలకమైనసాజాత్యాలు తప్పులని నిరూపించబడినా, ఇప్పటికీ ఇవి పరిశోధనని ప్రభావితం చేస్తూనే ఉన్నాయి. ఇంతకుముందు జరిగిన పరిశోధనలో వ్యుత్పత్తికి అధిక ప్రాధాన్యం ఇవ్వడం ఒక లోపమైతే, మరొకలోపం సాక్ష్యాధారాలని జాగ్రత్తతో సంగ్రహించకుండా క్వాచిత్కమూ, అప్రధానమూ అయిన విషయాలకి ప్రధాన విషయాలతోపాటు సమాన ప్రతిపత్తి కల్పిస్తూ సాధారణమైన అభిప్రాయాలు ఆధారంగా సిద్ధాంతాలు ప్రతిపాదించడం. ఒకే సూత్రాన్ని అతిగా నమ్మి సంకుచిత దృష్టితో వ్యాఖ్యానించడమనే పొరపాటు కూడా ఆకాలపు పరిశోధనలో స్పష్టంగా కనపడుతుంది. ఉదాహరణకి, ఐతిహ్యాలలోని చాలామంది వ్యక్తులు ఉషఃకాలం, మెరుపు, సూర్యుడు, చంద్రుడు - వీటిలో ఒకటి ఆధారంగా ఉత్పన్నమైనట్లు చెప్పబడింది. ఇటువంటి అసమగ్రమైన పాక్షికదృష్టి సాక్ష్యాధారాలని అనుకోకుండానే కొంతవరకే ఉపయోగించుకోవడానికి దారితీస్తుంది.

4.3 ఇటువంటి పరిస్థితిలో పరిశోధకులు జాగ్రత్తతో కూడిన పద్ధతిని అవలంబించడాన్ని ప్రోత్సహించే కొన్ని సూచనలు ఇవ్వడం ఉపయోగకరం. శాస్త్రీయ పరిశోధన బాగా తెలిసినదానితో మొదలై తక్కువగా తెలిసిన దానివైపుకి పురోగమించాలి అనేది ఒక సూత్రం కాబట్టి వేదాలలో దేవతల స్వభావాలూ, వారి కృత్యాలని గురించిన పరిశోధన, అసమగ్రమూ అస్పష్టమూ అయిన తులనాత్మక దృష్టితో కాక, ఋగ్వేదంతో మొదలై ఇప్పటివరకూ అవిచ్ఛిన్నంగా ఉన్న భారతీయ గ్రంథాల ఆధారంతో మొదలవ్వాలి. ఒక దేవతని గురించి కాని ఒకగాథని గురించి కాని ఉన్న విషయమంతా సంగ్రహించి వివిధ గ్రంథాలలో విషయైక్యంగల వాక్యాలని పోల్చి చూసి వడగొట్టిన తరవాతనే ఒక నిర్ణయానికి రావాలి. ఈ పద్ధతితో పురుషతారోపణకి ఆధారమైన ప్రాచీన లక్షణాలని తరవాత కాలంలో చేర్చబడిన లక్షణాలనించి విడతియ్యాలి.

4.4 ఊహలో ఒక ప్రకృతిశక్తి స్థానాన్ని ఒక వ్యక్తి ఆక్రమించుకొన్నాక కాలక్రమేణ

కవితాశక్తి ప్రాథమికసృష్టితో సంబంధంలేని పైనించి వచ్చిన విషయాలతో దాని చుట్టూ గూడు అల్లుతుంది. సాక్ష్యాధారం పరిమితం కానప్పుడు చాలాచోట్ల మళ్ళీ మళ్ళీ చెప్పబడినవి ప్రాథమికమైన ముఖ్య లక్షణాలు అని మనం గ్రహించవచ్చు. ఉదాహరణకి, ఇంద్రుడి కథలో వృత్రుడితో ఆయన యుద్ధం ముఖ్య లక్షణం కాబట్టే అది చాలా సందర్భాలలో చెప్పబడింది; కాని ఆయన వృత్రుడి తల్లిని తన వజ్రంతో కొట్టాడు అనేది ఒక్కచోటనే (1.32.9) చెప్పబడింది కాబట్టి దీన్ని ఒక కవి నాటకీయత కోసం చేర్చి ఉంటాడు అనేది స్పష్టం.[1] అలాగే వృత్రహన్- 'వృత్రుణ్ణి చంపినవాడు' అనే విశేషణం నిస్సందేహంగా మొదట్లో ఇంద్రుడికి చెందినదే అయినా ఇది ఋగ్వేదంలో చాలాచోట్ల సోముడికి కూడా చెప్పబడింది. కాని 'సోమ- అనేది ''వృత్రుణ్ణి చంపే మత్తు కలిగించే మొక్క'' (6.17.11)[2] అనే వాక్యం వల్ల ఈ విశేషణం ఇంద్రుడినించి సోముడికి మారింది అనే విషయం స్పష్టం; ఇంద్రుడు యుద్ధానికి వెళ్ళేముందు సోమరసాన్ని తాగడం ప్రసిద్ధం. ఋగ్వేదంలో కవులకి ఒకే ముఖ్యకృత్యంలో పాల్గొని తుల్యలక్షణాలు కలిగిన ఇద్దరు దేవతలని ఒక జంటగా చేసి స్తుతించే అలవాటు ఉంది కాబట్టి ఇలా విశేషణాలు ఒక దేవతనించి మరొక దేవతకి సంక్రమించడం సులభం (చూ. అధ్యాయం 44). ఇలా సంక్రమించిన విశేషాలని ముఖ్య లక్షణాలనించి వేరు చెయ్యాలి. చాలా దేవతలకి ఇంచుమించు సమానంగా వర్తించే విశేషణాలూ, శక్తుల విషయంలో కూడా ఇదే పద్ధతి అవలంబించాలి. ఇటువంటివి ఒక ప్రత్యేక దేవతకి చెందినవిగా తీసుకోకూడదు. అటువంటి విశేషణాలూ, శక్తులూ ఒక ప్రత్యేకదేవతకి చెందినట్లుగా చాలా చోట్ల చెప్పబడినప్పుడే అవి ఆ దేవత లక్షణాలని నొక్కి చెప్పవచ్చు. ఎందువల్లనంటే, అటువంటి సందర్భాలలో అవి మొదట్లో ఒక ప్రత్యేకదేవతకి చెందినవై ఉండి కాలక్రమేణ ఇతర దేవతలకి సంక్రమించి ఉండవచ్చు. కొందరు దేవతలు చాలా సూక్తాలలో మరికొందరు తక్కువ సూక్తాలలో స్తుతించబడ్డారనే సత్యం మనం ఈ సందర్భంలో జ్ఞాపకం పెట్టుకోవాలి. ఒక విశేషణం భిన్నదేవతలకి సమానంగా వాడబడినపుడు

---

1. నీచావయా అభవద్వృత్రపుత్రేంద్రో అస్యా అవ వధర్జభార
ఉత్తరా సూ రధరః పుత్ర ఆసీ ద్దానుః శయే సహవత్సా న ధేనుః

(వృత్రపుత్రా = వృత్రుణ్ణి పుత్రుడుగా కలిగిన తల్లి, నీచావయాః = కింద అడ్డంగా పడినది, అభవత్ = అయింది; ఇంద్రః = ఇంద్రుడు, అస్యాః = దీనికి, అవ = కింద, వధః = ఆయుధాన్ని, జభార = వేశాడు; సూః = తల్లి, ఉత్తరా = పైన ఉన్నది (అయింది), పుత్రః = కొడుకు, అధరః = కింద ఉన్నవాడు, ఆసీత్ = అయ్యాడు; దానుః = రాక్షసి, సహవత్సా = దూడతో కూడిన, ధేనుః = ఆవు; న = లాగా, శయే = పడుకొంది.)

2. వృత్రహణం మదిర మంశుం (అంశు = మొక్క, సోమలత)

అది ఏ దేవతకి ఎక్కువసార్లు వాడబడిందో చూడాలి. ఉదాహరణకి, ఇంద్రుణ్ణి స్తుతించే సూక్తాలు వరుణుణ్ణి స్తుతించే సూక్తాలకన్న సంఖ్యలో సుమారు పదిరెట్లు ఎక్కువ కాబట్టి వీరిద్దరికీ తుల్యంగా తరచు వాడబడిన విశేషణం మొదట్లో వరుణుడికి చెందిన ముఖ్యలక్షణమై ఉంటుంది. ఒక ప్రత్యేకమైన వాక్యానికి సాక్ష్యాధారంగా ఉన్న విలువ అది ఉన్న సూక్తం ప్రాచీనత మీద ఆధారపడి ఉంటుంది. ఒక అర్వాచీన సూక్తంలో మొట్టమొదటుగా చెప్పబడిన విషయం దానిముందు కాలం నించీ పారంపర్యంగా వచ్చేదిగా ఉండడానికి కొంత అవకాశం ఉన్నప్పటికీ అది ప్రాచీనతరమైన కాలానికి చెందిన ఒక సూక్తంలో చెప్పబడినదానికి భిన్నంగా ఉన్నప్పుడు అది బహుశా అర్వాచీన పరిణామమై ఉండవచ్చు. అందువల్ల ఋగ్వేదంలో అర్వాచీన కాలానికి చెందిన పదో మండలంలోనూ, మొదటి మండలంలో చాలా భాగంలోనూ చెప్పబడిన విషయాలు ఇతర మండలాలలోని విషయాల కంటె అర్వాచీన కాలానికి చెందినవి. పైగా, సోమపవమానుడికి మాత్రమే సంబంధించిన తొమ్మిదో మండలంలోని ఐతిహ్య విషయాలు మిగిలిన మండలాలలోని వాటికన్న భిన్నరూపంలో ఉండడానికి అవకాశం ఉంది. ఉదాహరణకి, ఇందులో వివస్వత్తూ ( వివస్వత్- ), త్రితుడూ ( త్రిత- ) సోమరసం తయారు చెయ్యడంతో చాలా ప్రత్యేక పద్ధతిలో సంబంధం కలిగినవారుగా చెప్పబడ్డారు. ( చూ. 18 , 23 అధ్యాయాలు). ఇక బ్రాహ్మణాల విషయంలో, ఇవి దూర సంబంధంగల ఊహలూ, కల్పనలూ, సమీకరణాలతో నిండి ఉన్నాయి కాబట్టి, వీటిలో చారిత్రకంగా ప్రాచీనమైన విషయాలు ఇవి అని నిర్ణయించడానికి చాలా జాగ్రత్త అవసరం.

4.5 సాదృశ్యం గల వాక్యసమూహాలు ఆధారంగా చూపెట్టేటప్పుడు అవి ఉన్న సందర్భాలకి తగిన ప్రాముఖ్యం ఇవ్వాలి. సందర్భాన్ని నిశితంగా అన్ని కోణాలనించీ పరిశీలించి, వాటిలోని అభిప్రాయాలకి ముందు వెనక ఉన్న వాటితో అన్వయించినప్పుడే వాటి నిజమైన విలువ నిర్ణయించడం సాధ్యమవుతుంది. వేదాలలోని అంతస్సాక్ష్యాన్ని దాన్ని ధ్రువీకరించే తరవాతకాలపు భారతీయ సాహిత్యం సాహాయ్యంతో జాగ్రత్తగా పరిశీలించిన తరవాత, దీనితో అతి సన్నిహిత సంబంధం గల ఇరాన్‌దేశపు ఐతిహ్య సంచయం వల్ల ఇంకా స్పష్టత లభిస్తుందా అని చూడాలి. భారతీయ సాహిత్య సామగ్రి మీద ఆధారపడిన నిర్ణయాలు ఇరాన్ దేశపు ఐతిహ్య సంచయంతో పోల్చి చూడడం వల్ల ధ్రువపడవచ్చు; లేకపోతే, భారతీయ సాహిత్య సామగ్రి అసమగ్రంగా ఉన్నప్పుడు దీనివల్ల ఏది పాతదో ఏది కొత్తదో నిర్ణయించడమో లేక వేదకాలపు భావనలని గురించి ఎక్కువ స్పష్టమైన నిర్ణయానికి

రావడమో సాధ్యమవుతుంది. ఉదాహరణకి, అవెస్తా సాహాయ్యం లేకపోతే మిత్రుడు (మిత్ర-) అనే దేవత ప్రాచీన స్వభావం విషయంలో స్పష్టమైన నిర్ణయం చెయ్యడం అసాధ్యమై ఉండేది.

4.6 ఆ తరవాత చేయవలసినపని తులనాత్మకైతిహ్య సంచయ పరిశోధనా ఫలితాలని సమీక్షించడం, ఇలా చేయడం వల్ల ఇండో-యూరోపియన్ కాలంనించీ వేదాలలోకి సంక్రమించిన చారిత్రకతా, దాని మూలలక్షణాలనీ వీలైనంతవరకూ నిర్ణయించడం సాధ్యమవుతుంది. చివరగా, మానవుడి అభివృద్ధిలో ఇంకా ప్రాచీనతరమైన దశనించి కొనసాగివచ్చిన లక్షణాలని తెలుసుకోవాలంటే జాతుల చరిత్ర చెప్పే ఉపదేశాలు నిర్లక్ష్యం చెయ్యకూడదు. ఇలా వేదాల పరిధికి అతీతమైన సాక్ష్యాధారాల మీద ఆధారపడడం ఒకవైపు కొన్ని ఐతిహ్యాంశాలు పూర్తిగా భారతదేశంలో పుట్టినవే అనుకోవడమూ, మరొకవైపు అన్ని ఐతిహ్య లక్షణాలకీ మూలస్థానం ఇండో-యూరోపియన్ కాలమే అనుకోవడమూ అనే పొరపాట్లనించి కాపాడడానికి రక్షణకవచంగా ఉపయోగిస్తుంది. పైన చెప్పిన రెండో అభిప్రాయం ఆర్యుల భాష మూల ఇండో-యూరపియన్ భాషతో సమానం అనుకోవడమంత సత్యదూరమైనది.

## 5. అవెస్తా – వైదికైతిహ్య సంచయం

5.1 వైదికైతిహ్యసంచయంలో పరిశోధన చేసేవారు అవెస్తా సాక్ష్యాన్ని నిర్లక్ష్యం చెయ్యకూడదని పైన చూశాం. అవెస్తాలోని ప్రాచీనతమమైన భాషకీ వేదాలలో భాషకీ వాక్యనిర్మాణంలోనూ, పదాలలోనూ, ఛందస్సులోనూ, కవితాశైలిలోనూ ఎంత సాన్నిహిత్యం ఉందంటే అవెస్తాలోని గీతాలలో పదాలలో ధ్వనులకి ధ్వనిసూత్రానుసారంగా మార్పులు చేస్తే ఆ గీతాలు భాషలోనే కాక కవితాత్మలో కూడా సరిగా ఋక్కులలాగానే కనపడతాయి. ఐతిహ్యం విషయంలో మాత్రం వీటికి సన్నిహితత్వం అంత ఎక్కువగా లేదు. జరథుష్ట్రుడు చేసిన మత సంస్కరణ ఐతిహ్యవిషయకమైన భావనలలో మార్పులు తీసుకురావడమే దీనికి కారణం. ఋగ్వేదమంత ప్రాచీనమైన అవెస్తా సాహిత్యం మనకు దొరికి ఉంటే ఈ విషయంలో కూడా సాదృశ్యం ఎక్కువగా ఉండి ఉండేది. అయినప్పటికీ, ఐతిహ్య సంచయంలోనూ దేవతారాధనలోనూ చాలా సందర్భాలలో సాదృశ్యం ఆశ్చర్యకరంగానే ఉంది. యజ్ఞకర్మకి సంబంధించిన చాలా పదాలు సమానంగా ఉన్నాయి; వీటికి ఈ కింది

ఉదాహరణలు చాలు:

| | |
|---|---|
| వేదం | అవెస్తా |
| యజ్ఞ- | యస్న |
| హోతృ- | జవోతర్ |
| అథర్వన్- | ఆత్రవన్ |
| ఋత - | అష 'క్రమం, యాగం' |
| సోమ- | హవోమ |

వీటిలో అన్నిటికన్న ముఖ్యమైనది సోమరసాన్ని సూచించే చివరి పదం. ఈ రెండు తెగలవారూ సోమలతనించి సోమరసాన్ని పిండి, జల్లెడతో వడబోసి, పాలతో కలిపి దాన్ని ముఖ్యమైన నివేదనగా దేవతలకు అర్పిస్తారు. రెండు గ్రంథాలలోనూ సోమలత లతల అధిపతిగానూ, కొండలమీద మొలిచేదిగానూ, గద్దచేత లేక గద్దలచేత కిందకి తీసుకురాబడినదిగానూ వర్ణించబడింది (చూ. అధ్యాయం 37). మనకుప్రస్తుతాంశం ఐతిహ్యసంచయంలో సాదృశ్యాలు. రెండు మతాలలోనూ అసుర = అహుర అనే పదాలు అత్యున్నతులైన దేవతలని సూచిస్తాయి; వారి ఊహల ప్రకారం ఈ దేవతలు బలవంతులైన రాజులు, వేగంగల గుర్రాలులాగే రథాలమీదగాలిలో ప్రయాణించేవారు, దానబుద్ధిగలవారు, మోసం మొదలైన నీతిబాహ్యమైన పనులు చేసేవారు కారు. అగ్ని, ఆతర్ అని సంబంధం లేని పేర్లు వాడినా భారతీయులూ, ఇరాన్‌దేశీయులూ కూడా నిప్పుని పూజించేవారు. అంతతరచుగా కాకపోయినప్పటికీ, రెండు తెగల వారూ ఆపః = ఆపా అనే పేర్లతో నీటిని పూజించేవారు. వేదాలలో మిత్రుడే 'సూర్యుడు' అవెస్తాలో మిత్ర. ఆదిత్య భగుడికి అవెస్తాలో 'దేవుడు' అని అర్థమిచ్చే బఘ సమానం, వాయు = వయు. అపాంనపాత్ 'నీటికి కొడుకు/ మనుమడు; అగ్ని' = అపం నపాట్. గంధర్వ = గందరెవ, కృసను = కెరెశాని అనే దేవతలు సోమ = హవోమ అనే దానికి సంబంధించినవారు, 'త్రిత ఆప్త్య' అనే ఒకే దేవుడికి సమానంగా అవెస్తాలో 'థ్రిత', 'ఆథ్వ్య' అనే ఇద్దరు ఉన్నారు. అలాగే 'వృత్రహన్' అనే విశేషణంగల ఇంద్రుడికిసమానంగా 'ఇంద్ర' అనే భూతమూ, 'వెరెథ్రఘ్న' అనే జయానికి

అధిదేవతా, ఇద్దరు ఉన్నారు. వివస్వత్ కొడుకూ, మరణించిన వారికి రాజూ అయిన యముడికి సమానంగా వివఙ్హ్వాంత్ కొడుకూ, స్వర్గానికి రాజూ అయిన 'యిమ' ఉన్నాడు. వరుణుడికి పేరులో కాకపోయినా స్వభావంలో తుల్యుడుగా బుద్ధిశాలి అయిన భూతం 'అహురమజ్ద' ఉన్నాడు. రెండు మతాలలోనూ చెడు కలిగించే భూతాలకి పేర్లుగా ద్రుహ్ = ద్రుజ్, యాతు అనేవి తుల్యంగా ఉన్నాయి.

## 6. తులనాత్మక గాథాతత్త్వం

6.1 మూల ఇండో-యూరోపియన్ కాలానికి సంబంధించిన ఐతిహ్య విషయాలలో మనకి దృఢమైన ఆధారాలు చాలా తక్కువగా ఉన్నాయి. పరిశోధన ప్రారంభదశలోని ఉత్సాహంలో రూపసాదృశ్యం గలవిగా నిర్ణయించబడిన పేర్లలో చాలావాటిలో సాదృశ్యం తరవాత కాలంలో నిరాకరించబడింది; ఇక మిగిలిన వాటిలో చాలా కొన్నింటికే దృఢమైన ఆధారం ఉంది. ద్యౌస్ = (గ్రీక్) జెఉస్ (Zeus) 'ఆకాశం' అనేది ఒకటి మాత్రమే సందేహాస్పదం కానిది అని చెప్పవచ్చు. వరుణ = (గ్రీక్) ఒ ఉరనోస్ (Ouranos) అనేదానిలో ధ్వనిసూత్రాలకి సంబంధించిన సమస్యలు ఉన్నా, కొంతవరకు అంగీకార్యం. వానకు అధిపతి అయిన పర్జన్యుడికి లిథువానియన్ భాషలో ఉరుముకి అధిపతి అయిన 'పెర్కూనస్'తో అర్థంలో పోలిక ఉంది. కాని ధ్వనుల విషయంలో పై పదంలోకన్నా ఎక్కువ సమస్యలే ఉన్నాయి. 'భగ-' అనే పదం స్లావోనిక్ 'బొగు', పర్షియన్ 'భగ' అనే పదాలతో సమానమే అయినా ఆ రెండు భాషలలోనూ ఆ పదాలకి 'దేవుడు' అనే సాధారణమైన అర్థమే ఉండడం వల్ల మూలభాషాపదం ఒక ప్రత్యేకమైన దేవతని సూచించేది కాదని చెప్పవచ్చు. 'ఉషస్-' కీ లాటిన్ (> ఇంగ్లీషు) అరోరా (Aurora), గ్రీక్ ఏఓస్ లకీ ధాతువులలో సాజాత్యం ఉన్నా ఉషఃకాలాన్ని దేవతగా పూజించడం భారతదేశంలో ప్రత్యేకంగా జరిగిన పరిణామమే. ఇండో-యూరోపియన్ కుటుంబానికి చెందిన వివిధ శాఖలలో ఉరుముకి అధిదేవతలైన వారి పేర్లలో సాజాత్యం లేకపోయినా వారి లక్షణాలలో సాజాత్యం ఉండడం వల్ల మూలభాషాకాలంలో పేరు పునర్నిర్మించడం సాధ్యం కాకపోయినప్పటికీ ఉరుముకి అధిదేవత ఉండి ఉండాలి అని ఊహించబడింది. ఇలా స్వభావంలోని సాదృశ్యం మాత్రమే ఆధారంగా ఏర్పరచబడి కొంతవరకు విశ్వసించదగిన సమీకరణాలు ఇంకా ఒకటి రెండు ఉన్నాయి. అత్యున్నతుడైన 'దేవుడు' అనే అర్థమిచ్చే పదం 'దైవోస్' మూల

ఇండో-యూరోపియన్ భాషలో ఉన్నదిగా పునర్నిర్మించవచ్చు (దీనినించి వచ్చిన పదాలు సంస్కృతం దేవ-స్ > దేవః, లిథువానియన్ దేవ-స్, లాటిన్ దే ఉ-స్) కాబట్టి ఈ భావన ఆ కాలానికే ఆవిర్భవించి ఉండవచ్చు; ఇది దివ్- 'ప్రకాశించు' అనే ధాతువుతోనూ, దివ్ 'స్వర్గం' అనే పదంతోనూ సంబంధించినది. భూమిని తల్లిగా భావించడమూ (ఇది వైదిక, గ్రీక్ ఐతిహ్యాలలో తుల్యంగా ఉంది), స్వర్గాన్ని తండ్రిగా భావించడమూ (సంస్కృతం ద్యౌః పితా, గ్రీక్ జెఉపతేర్, లాటిన్ జూపితేర్) మూల ఇండో-యూరోపియన్ భాషకాలానికన్న ఇంకా ప్రాచీనకాలానికి చెందినది కావచ్చు.[1] ఎందువల్లనంటే ఈ భావనలు చైనా, న్యూజీలాండు, ఈజిప్టు దేశాల ఐతిహ్యాలలో కూడా కనపడుతున్నాయి. వేదాలకాలం దాకా మిగిలి ఉన్న తాంత్రికపూజలూ, అచేతనపదార్థాల పూజా మానవమేధపరిణామంలో ఇటువంటి అతిప్రాచీనదశనించి వచ్చినవే కావచ్చు; అయినా, ఈ విషయాలలో భారతదేశంలో స్థానికులైన ఆటవికుల ప్రభావం విజేతలయిన ఆర్యులపై పడి ఉండవచ్చు అనే అభిప్రాయం కూడా పూర్తిగా నిరాకరించదగినది కాదు.

---

1. సంస్కృతంలో పితా 'తండ్రి' పితృ - అనే ప్రాతిపదికనించి ఏర్పడిన ప్రథమైక వచనరూపం; దీనికి పితర్ - అనే రూపాంతరం పితరః 'తండ్రులు' వంటి పదాలలో ఉంది.

# II. ప్రపంచం, దాని పుట్టుకా గురించి వేదాలలో భావనలు

## 7. ప్రపంచం స్థితిగతులు.

7.1 దేవతల కృత్యాలకి రంగస్థలం వంటిదైన ప్రపంచం వేదఋషులదృష్టిలో భూమి, వాయువు (లేక వాతావరణం, అంతరిక్షం) స్వర్గం అనే మూడు భాగాలుగా విభజించబడింది. భూమికి పైన ఉన్న ప్రదేశమంతా ఆకాశంగా పరిగణించబడినప్పుడు ప్రపంచం ఊర్ధ్వలోకం, అధరలోకం అనే భాగాలుగా విభజించబడింది. ఆకాశం పైకప్పు (నాక-) మనకు కనపడే ఊర్ధ్వలోకాన్ని కనపడని స్వర్గలోకం (లేక మూడవలోకం) నించి విడదీసే సరిహద్దుగా పరిగణించబడింది; స్వర్గలోకం కాంతికీ దేవతలకీ నివాసస్థానం. స్వర్గం, వాయువు, భూమి అనే మూడింటి సముదాయం ఋగ్వేదంలో చాలాసార్లు వాచ్యంగానో వ్యంగ్యంగానో పేర్కొనబడింది (8.10.6, 8.101.6 మొ.). ఆకాశం కప్పుమీద జరిగినట్లు కనపడే సూర్యసంబంధి విషయాలు స్వర్గానికి చెందినవిగానూ, మెరుపూ, వానా, గాలీ అంతరిక్షానికి చెందినవిగానూ భావించబడ్డాయి. కాని 'స్వర్గం' 'ద్యౌః' అనే పదం భూమికి పైనున్న ప్రదేశాన్నంతా సూచించేటట్లు వాడబడినప్పుడు ఈ రెండు రకాలూ స్వర్గానికి చెందినవిగానే పరిగణించబడ్డాయి. అధర్వవేదంలో ఒక సందర్భంలో (4.14.3 వాజసనేయీ సంహిత 17.67) ఆకాశం కప్పు భూమి, అంతరిక్షం, స్వర్గం అనే మూడులోకాల కూటమికీ కాంతిలోకం అనే నాలుగో భాగానికీ మధ్య ఉన్నట్లు చెప్పబడింది. మూడులోకాలలో ఒక్కొక్కదానికి కూడా అంతర్విభాగాలు ఉన్నాయి. మూడు భూములు, మూడు అంతరిక్షాలు, మూడు స్వర్గాలు ఉన్నట్లు కొన్నిచోట్ల చెప్పబడింది; ప్రపంచం రెండు భాగాలుగా ఉన్నట్లు భావించబడినప్పుడు ఆరులోకాల లేక ప్రదేశాల (రజాంసి) ప్రసక్తి కూడా ఉంది. ఈ అంతర్విభాగం 'పృథివ్యః' అనే పృథివీశబ్దం బహువచనరూపం మూడులోకాలకీ ఉపలక్షణంగా వాడబడడం (1.108, 9-10; 7.104.11) నించి పుట్టి ఉండవచ్చు (ఇటువంటివాడుక పితృశబ్దం ద్వివచనరూపమైన పితరౌ అనేది 'తల్లిదండ్రులు' అనే అర్థంలో వాడబడడంతో తుల్యం).

7.2 భూమికి సమానార్థకాలుగా ఈ పదమే కాక క్షమ్, క్షా, గ్మా, మహీ 'పెద్దది', పృథివీ 'విశాలమైనది', ఉర్వీ 'విశాలమైనది', ఉత్తానా 'వ్యాపించినది', అపారా 'హద్దులు లేనిది'. ఇదం (' ఇది' - పైభాగానికి వ్యతిరేకంగా, 1.22.17, 1.154.1-3) అనే పదాలు

కూడా వాడబడ్డాయి.

7.3 భూమి సముద్రం మధ్య ఉన్న చక్రం అనే భావన సంహితలలో కనపడదు. కాని ఇది చక్రంతో పోల్చబడడం (10.89.4) వల్ల గుండ్రనిదిగా భావించబడినట్లు తెలుస్తుంది; శతపథబ్రాహ్మణంలో ఇది వాచ్యంగానే పరిమండలం 'గుండ్రనిది' అని చెప్పబడింది.

7.4 ఋగ్వేదంలో నాలుగు దిక్కుల పేర్లూ క్రియావిశేషణాలుగా వాడబడ్డాయి (7.72.5; 10.36.14, 10.42.11); అథర్వవేదంలో ఈ పదాలు నామవాచకాలుగానే వాడబడ్డాయి (15.2.1, దానితరవాతవీ). నాలుగు దిక్కులూ గుర్తించబడడమే (ప్రదిశశ్చతస్రః, 1.164.42) కాకుండా భూమి నాలుగు దిక్కులు కలదిగా వర్ణించబడింది (భూమిం చతుర్భృష్టిం 10.58.3). వక్త ఉన్న మధ్యభాగాన్ని (10.42.11) వీటితో కలిపి ఐదు ప్రదేశాలు అరుదుగా చెప్పబడ్డాయి (9.86.29; అథర్వవేదం 3.24.3. మొ.). అథర్వవేదంలో ఆకాశం మధ్యభాగాన్ని కూడా చేర్చి ఆరు ప్రదేశాలు చెప్పబడ్డాయి; ఇందులోనే ఏడు ప్రదేశాల ప్రస్తావన కూడా ఉంది. ఋగ్వేదంలో ఏడు దిశలు (9.114.3), ఏడుచోట్లు (ధామ-, 1.22.16) అని చెప్పిన సందర్భాలలో ఈ ఏడు ప్రదేశాలే ఉద్దేశించబడి ఉండవచ్చు.[1]

7.5 దివ్- 'స్వర్గం' వ్యోమన్- ' ఆకాశం' అనీ రోచన- 'కాంతివంతమైన ప్రదేశం' అనీ కూడా చెప్పబడింది. కనపడని స్వర్గాన్ని వేరుచేసే బాగానికి పేర్లు నాక-, సాను- 'శిఖరం', విష్టప్- 'పైభాగం', పృష్ఠ- 'పైభాగం'; ఇవికాక నాకస్యపృష్ఠే (1.125.5) 'స్వర్గలోకం యొక్క ఉపరిదేశంలో', నాకస్యసానవి (8.103.2) అనేపదబంధాలు కూడా వాడబడ్డాయి. కాంతివంతమైన స్వర్గంలో మూడవ ఉన్నతప్రదేశం కూడా చెప్పబడింది (9.86.27). మూడు స్వర్గాలూ ప్రత్యేకంగా గుర్తించబడినప్పుడు (త్రీ రోచనా) అవి పైది, మధ్యది, కిందది అని చెప్పబడ్డాయి (5.60.6). వీటిలో ఉన్నతమైన దానికి ఉత్తమ- / ఉత్తర-, పార్య- అని వ్యవహారం ఉంది (4.26.6; 6.40.5). పరమే రోచనే/ వ్యోమన్ అనిచెప్పబడిన ఈ ఉన్నతస్వర్గం దేవతలకీ, పితరులకీ, సోముడికీ నివాసస్థానం.

7.6 స్వర్గమూ భూమీ ఒకద్వంద్వంగా భావించబడి రోదసీ, క్షోణీ (ద్వివచనరూపం),

1. కాని 1.22.16లో సప్తధామభిః అనేదానికి 'గాయత్రి మొదలైన ఏడు ఛందస్సులు అనే సాధనాలతో' అని సాయణాచార్యుడి వ్యాఖ్య

ద్యావాపృథివీ మొదలైన పదాలతో సూచించబడ్డాయి (చూ. అధ్యాయం 44); ఇవి రెండు అర్ధ భాగాలుగా చెప్పబడ్డాయి (2.27.15). ఇది ఒకదానికొకటి అభిముఖంగా ఉన్న రెండు పెద్ద గిన్నెలు (చమ్వా) అని చెప్పబడినప్పుడు (3.55, 20) భూమి ఆకారం ఊహలో మారింది. ఒకచోట ఇవి ఇరుసు రెండు చివరలా ఉండే చక్రాలతో పోల్చబడ్డాయి (10.89.4).

7.7 ఋగ్వేదంలో ఎక్కడా భూమికీ స్వర్గానికీ మధ్య (ఊహలో) ఉన్న దూరాన్ని గురించిన స్పష్టమైన సూచన ఏమీ లేదు; కాని ''పక్షులు కూడా విష్ణువు స్థానానికి ఎగరలేవు'' వంటి పదాలలో ఇది అస్పష్టంగా సూచితమైంది (1.155.5). కాని అథర్వవేదం (10.8.18)లో ''స్వర్గానికి ఎగిరే పసుపు పచ్చని పక్షి (సూర్యుడు) రెండు రెక్కల మధ్యదూరం వెయ్యి రోజుల ప్రయాణం'' అని చెప్పబడింది. ఇదేవిధంగా ఐతరేయ బ్రాహ్మణం (2.17.8) లో '' ఇక్కడనించి ఒక గుర్రం వెయ్యి రోజులలో వెళ్లే దూరంలో స్వర్గం ఉంది'' అనీ, పంచవింశ బ్రాహ్మణం (16.8.6; 21.1.9) లో ''స్వర్గలోకం ఈ లోకాన్నించి వెయ్యి ఆవులు ఒకదానిమీద ఒకటి నిలబడితే ఉన్నంత దూరంలో ఉంది'' అనీ చెప్పబడింది.

7.8 వాయువు లేక మధ్యప్రదేశం (అంతరిక్ష-) అనేదానికి పురుషతారోపం సాధ్యం కాదు. ఇది మంచూ, మబ్బులూ ఉండే ప్రదేశం అవడం వల్ల దాన్ని రజస్ - అని కూడా అన్నారు; ఇది నీటితో నిండి ఉంటుంది (5.85.2) అని కొన్నిచోట్లా, చీకటితో నిండి ఉండడంవల్ల నల్లనిది అని మరికొన్నిచోట్లా (కృష్ణేన రజసా 1.35.2, 4, 9; 8.43.6) చెప్పబడింది. మూడుగా అంతర్విభజన మూడు ప్రదేశాలు (రజాంసి) అని సూచించబడింది (4.53.5; 5.69.1). వీటిలో ఉన్నతమైన దానిని ఉత్తమ- (9.22.5), పరమ- (3.30.2), తృతీయ- (9.74.6; 10.45.3; 10.123.8) అనే పేర్లతో వ్యవహరించారు; ఇది నీళ్లకీ, సోముడికీ, దేవతారూపమైన అగ్నికీ నివాసస్థానం. ఇది విష్ణువుకి చెందినది (7.99.1, చూ. 1.155.5); గూఢమైన ప్రదేశం అని 10.105.7లో సూచించబడినది ఇదే కావచ్చు. దీనికింద రెండు ప్రదేశాలూ మనకి కనపడేవి. అంతరిక్షాన్ని రెండుగా విభజించడం తరచు కనపడుతుంది. ఈ విభజనలో కిందది (ఉపర-) లేక భూమికి సంబంధించినది (పార్థివ-) ఒకటి; మరొకటి స్వర్గానికి సంబంధించిన ప్రదేశం (దివ్యం/దివః; 1.62.5; 4.53.3). రెండుగా విభజించినా మూడుగా విభజించినా, దీని

ఉన్నత ప్రదేశం స్వర్గానికి ఆనుకొన్నదే కాబట్టి ఇది స్వర్గమనే అర్థంలో కూడా ఉపలక్షణంగా తరచు వాడబడింది. ఇటువంటి విషయాలలో ఒక కవి వాక్యాలలోగాని వేరు వేరు కవుల వాక్యాలలోగాని స్పష్టతా, భేదరాహిత్యం ఆశించలేం.

7.9 ప్రపంచాన్ని మూడుగా చేసిన విభజనలో అంతరిక్షం భూమికిపైన ఉంది కాబట్టి దాని అంతర్విభాగాలు, అవి రెండయినా మూడయినా, కూడా సహజంగా భూమిపైన ఉన్నవిగానే పరిగణించబడాలి; ఒక ఋక్కు (1.81.5, చూ. 1.90.7) పార్థివమైన (★అంటేపృథివికిసంబంధించిన) ప్రదేశం ఈ స్థానంలో ఉన్నట్లు స్పష్టంగాచెప్తోంది. కాని ఋగ్వేదంలో మూడు ఋక్కులు (6.9.1; 7.80.1; 5.81.4) అంతరిక్షంలో కింద భాగం రాత్రి సూర్యగమనానికి అనుకూలంగా భూమికి కింద ఉన్నట్లుగా ఊహించబడింది అనే అభిప్రాయాన్ని సూచించేవిగా ఉన్నాయని కొందరి ఉద్దేశం. ఈ మూడింటిలో అస్పష్టత తక్కువగా ఉన్నదాంట్లో (5.81.4) సవిత (సవితృ- 'సూర్యుడు') రాత్రివేళ రెండువైపులా (ఉభయతః) చుట్టూ తిరుగుతాడు అని చెప్పబడింది. దీనికి అర్థం ''రాత్రి సూర్యాస్తమయం సూర్యోదయం అనే హద్దుల మధ్య ఉంది'' అనేదానికన్న ఎక్కువ ఏమీ కాకపోవచ్చు. ఇది ఎలా ఉన్నా, ఐతరేయ బ్రాహ్మణం (3.44.4) లో రాత్రివేళసూర్యగమనాన్ని గురించి చెప్పబడిన అభిప్రాయం - రాత్రివేళ సూర్యుడు పైకి ప్రకాశిస్తాడు; పగలు కిందకి తిరిగి ప్రకాశిస్తాడు- అని. ఋగ్వేదంలో ''సూర్యుడి గుర్రాలులాగే కాంతిలో ఒకరకం ప్రకాశించేదీ, మరొకరకం నల్లనిదీ'' (అనంతమన్యద్ రుశదస్య పాజః కృష్ణమన్య ద్ధరితః సంభరంతి; 1.115.5) అనే వాక్యానికీ, ''సూర్యుడు తూర్పుకి వెళ్లేటప్పుడు కూడా వెళ్లే రజస్సు ఆయన ఉదయించేటప్పుడు ఉన్న కాంతికి భిన్నమైనది'' (10.37.3) అనే వాక్యానికీ ఇటువంటి అభిప్రాయమే మూలం కావచ్చు.

7.10 సూర్యుడు భూమికింద ప్రయాణిస్తాడు అనడానికి ఆధారం లేకపోవడం వల్ల, ఆయన వచ్చిన దోవనే తూర్పుకి తిరిగి వెళ్తాడు, కాని తిరుగు ప్రయాణంలో కాంతి ఉండదు అనేదే వేదఋషుల అభిప్రాయమని చెప్పవచ్చు. పగలు నక్షత్రాలు ఏమవుతాయో అనే సందేహమే వ్యక్తం చేయబడింది కాని దీనిని గురించిన ఊహ ఏమీలేదు (అమీ య ఋక్షా నిహితాస ఉచ్చా నక్తం దదృశ్రే కుహ చి ద్దివేయుః; అమీ = ఇవి, యే = ఏవయితే, ఋక్షాః = నక్షత్రాలు, ఉచ్చా = పైన, నిహితాసః = పెట్టబడినవి; నక్తం = రాత్రి, దదృశ్రే = చూడబడతాయి; దివా = పగలు, కుహచిత్= ఎక్కడికో, ఈయుః = పోతాయి; 1.24.10).

7.11 అంతరిక్షం దేవతా సంబంధమైన నీటికి స్థానం కాబట్టి ఇది తరచు సముద్రం అని వ్యవహరించబడింది. ఇందులో పర్వతాలు ఉన్నాయనీ (1.32.2, మొ.), అనావృష్టిని కలిగించే రాక్షసులతో యుద్ధం సంభవించినప్పుడు ఏడునదులు ప్రవహిస్తాయనీ (1.32.12, మొ.) చెప్పబడడంవల్ల ఇది భూమికి సదృశంగా భావించబడింది అని తెలుస్తుంది. పర్వత శబ్దానికి ఋగ్వేదంలో 'మబ్బు' అనే అర్థంకూడా చాలాతరచుగా ఉండడం వీటి మధ్య ఉన్న స్పష్టమైనసాదృశ్యం మూలంగా సంభావ్యమయింది. మబ్బుకి పెద్దరాయి అనేముఖ్యార్థమున్న అద్రి శబ్దం కూడా వాడబడింది; ఇంద్రుడు మొదలైనదేవతలు విడిపించినఆవులని మబ్బు అంతకుముందు దాచి ఉంచుతుంది అని భావన.

7.12 వానమబ్బులు నీరుకారుతూ, కదులుతూ, ఉరుముతూ ఉంటాయి కాబట్టి. ఇది ఆవులుగా ఊహించబడ్డాయి; వానే ఈ ఆవుల పాలు.

7.13 ప్రకృతిలో ఉండే క్రమంలేక నియమబద్ధతకి పేరు ఋతం; ఇది ఉన్నతమైన దేవతల ఆధీనంలో ఉంటుంది. ఈ పదానికి నీతిపరంగా వాడబడినప్పుడు అర్థం 'సత్యం' లేక 'సరియైన పద్ధతి'; మతపరంగా దీని అర్థం 'యజ్ఞం' లేక 'యజ్ఞకర్మ'.

## 8. ప్రపంచం ఉత్పత్తి

8.1 ఋగ్వేదంలో ప్రపంచం ఉత్పత్తికి సంబంధించిన ఐతిహ్యాసంచయం రెండు సిద్ధాంతాలపై ఆధారపడి ఉంది; ఈ రెండూ ఒకే ఋక్కులో కూడా కనపడవచ్చు; ఈ రెండు సిద్ధాంతాలూ పరస్పరం పూర్తిగా భిన్నమైనవి కావు. వీటిలో ఒకటి ప్రపంచం వడ్రంగులు మొదలైనపనివారి పనితనం వల్ల తయారైంది అనేది; మరొకటి ఇది సహజంగానే పుట్టినది అనేది.

8.2 ఋగ్వేదకవులు ప్రపంచోత్పత్తిని గురించి చెప్పేటప్పుడు ఇల్లు కట్టడంలోని చిన్నచిన్న వివరాలను లాక్షణికంగా సూచించారు. కొలవడం అనే పని చాలాసార్లు సూచించబడింది. ఇంద్రుడు ఆరు ప్రదేశాలనీ కొలిచాడు; విశాలమైన భూమినీ, స్వర్గం అనే ఎత్తైన కప్పునీ చేశాడు (6.47.3-4). విష్ణువు భూమికి సంబంధించిన ప్రదేశాలని కొలిచాడు; తన ఉన్నతమైనస్థానాన్ని నిలబెట్టాడు (1.154.1). కొలిచేసాధనం సూర్యుడు (2.15.3; 3.38.3); కొలిచేవాడు వరుణుడు (5.85.5). పితరులు రెండు లోకాలనీ

కొలతబద్దలతో కొలిచి విశాలమైనవిగా చేశారు (3.38.3; చూ 1.190.2). కొలవడం సహజంగా ముందుభాగంలో అంటేతూర్పునమొదలవుతుంది (2.15.3; చూ. 7.99.3). భూమిని పరవడం ఈ పనితో సంబంధించినదే; ఇది అగ్ని, ఇంద్రుడు, మరుత్తులు మొదలైనవారు చేశారు. వేదకాలంలో ఇంటిని కలపతో కట్టేవారు కాబట్టి ప్రపంచం కూడా కలపతో కట్టబడివట్లు ఒకటిరెండుచోట్ల చెప్పబడింది. 10.31.7 (=1-.81.4) లో కవి ''స్వర్గమూ భూమీ ఏ చెట్టు కలపతో చెయ్యబడ్డాయి?'' అని అడిగాడు.[1] దీనికిసమాధానంగా తైత్తిరీయబ్రాహ్మణం (2.8.9.6)లో ఆ చెట్టు బ్రహ్మ అని చెప్పబడింది. స్వర్గానికీ భూమికీ స్తంభాలు (స్కంభ-, స్కంభన-) ఆధారంగా ఉన్నాయని తరచు చెప్పబడింది; కాని ఆకాశానికి వాసాలు లేవు (2.15.2; 4.56.3; 10.149.1). అయినా ఆకాశం పడకపోవడం ఆశ్చర్యానికి హేతువు (5.29.4; 6.17.7; 8.45.6). ద్వారానికి లేక ద్వారబంధానికి పేరు ' ఆతా'; ఇంద్రుడు స్వర్గద్వారంలో వాయువుని నియమించాడు (1.56.5).[2] ప్రపంచం అనే ఇంటికి ద్వారం తూర్పు; ఇందులోంచే ఉషస్సు (కాంతి) లోపలికి ప్రవేశిస్తుంది (1.113.4; 4.51.2; 5.45.1). పునాది కూడా కొన్నిచోట్ల చెప్పబడింది. సవిత భూమిని తాళ్లతో గట్టిగా కట్టేడు (10.149.1); విష్ణువు కొయ్యముక్కలతో దాన్ని బిగించాడు (7.99.30; బృహస్పతి దాని చివరలని మోస్తాడు (4.50.1; చూ. 10.89.1). ప్రపంచం నిర్మాణానికి కర్తలుగా దేవతలు అని సాధారణంగా చెప్పడమూ లేక ప్రత్యేక దేవతలని పేర్కొనడమూ కూడా ఉంది. కాని వృత్తి నైపుణ్యం అవసరమైన విషయాలలో దేవతల వడ్రంగి అయినత్వష్ట (త్వష్టృ-), నిపుణులైన ఋభువులు (ఋభు-) చెప్పబడ్డారు. ప్రపంచ నిర్మాణానికి కారణమైన ఉద్దేశమేదీ చెప్పబడలేదు కాని మనుష్యులు ఇల్లు నివసించడానికి కట్టుకొంటారు కాబట్టి అలాగే విష్ణువు మనుష్యులకి నివాసస్థానంగా ప్రపంచాన్ని కొలిచి విశాలమైనదిగా నిర్మించాడు అని సూచించబడింది (6.49.13; 6.69.5; చూ. 1.155.4).

8.3 ఋగ్వేదంలో ప్రపంచ సంబంధి విషయాలలో జనకత్వం అనే భావన మూడు

---

1. కింస్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః ( ఈ ఋషిపేరు కవషుడు)

2. కాని ఇక్కడ సాయణాచార్యుడు '' ఓ ఇంద్రా! నువ్వు స్వర్గలోకాన్నించి నీటిని తీసి దిక్కులలో ఉంచావు'' అని అర్థం చెప్పేరు. ''రజో ఉతిష్ఠిపో దివ ఆతాసు'' అనే దానికి ఆయన ఇచ్చిన అర్థం : రజః = ఉదకాన్ని, దివః = స్వర్గలోకాన్నించి (తెచ్చి), ఆతాసు = దిక్కులలో, అతిష్ఠిపః = స్థాపించావు.

విషయాలకి అన్వయించబడింది; ఇది ముఖ్యంగా పొద్దున్న సూర్యుడు పుట్టడానికీ, అనావృష్టి తరవాత వానకురవడానికీ సంబంధించినది. ఇందులో ఒకటి పూర్వాపరాలను నిర్ణయించే కాలానికి అన్వయించేది. ఒక సంఘటన దాని తరవాత జరిగే సంఘటనకి జనకంగా పరిగణించబడుతుంది. ఉషస్సు రాత్రినించి పుట్టింది (1.123.9); ఉషస్సు సూర్యుణ్ణీ ప్రాతఃకాలంలో చేసే యాగాన్నీ పుట్టించింది (7.78.3).[3] వక్తదృక్కోణం మారినప్పుడు ఇటువంటి సంబంధాలలో మార్పు తప్పదు (చూ. అధ్యాయం 20.6). '' ఉషస్సు పితృదేవతలు యజ్ఞం నించి పుట్టింది'' అనే వాక్యాన్ని మనం అర్థం చేసుకుందుకు పూర్వాపరాల జనకత్వజన్యత్వభావం తోడ్పడుతుంది. ఒక వస్తువు ఉండే లేక తయారయ్యే చోటు దాని తల్లి లేక తండ్రిగా భావించబడడం రెండోది. దీనికి ఉదాహరణలైన వాక్యాలన్నీ లాక్షణికార్థంతో నిండినవే: అమ్ములపొది బాణాలకి తండ్రి (6.75.5);[4] సూర్యుడి గుర్రాలు ఆయన రథానికి కూతుళ్లు (1.50.9). ఆధారస్థానాన్ని జనకంగా భావించడం స్వర్గం, భూమి విషయంలో ముఖ్యంగా కనిపిస్తుంది. ద్యౌస్- 'స్వర్గం' యొక్క పురుష తారోపంలో పితృత్వం ముఖ్య లక్షణం (చూ. అధ్యాయం 11). ఉషస్సు తరచు ''స్వర్గం కూతురు'' అని చెప్పబడింది. తన విశాలమైన హృదయంలో మొక్కల్ని పుట్టించే భూమి (5.84.3) తల్లిగా భావించబడిది (1.89.4, మొ.). భూమినీ స్వర్గాన్నీ కలిపి అన్నిటికీ/ అందరికీ తల్లిదండ్రులుగా భావించడం తరచు కనపడుతుంది; భూమిలో సస్యాలు పుట్టడం; దీనికి కారణమైన వాననీ కాంతినీ స్వర్గం లేక ఆకాశం ఇవ్వడం; దీనివల్ల జీవరాశికి ఆహారం దొరకడం ఈ భావనకి హేతువులు. ఈ రెండూ దేవతలకి తల్లిదండ్రులు (చూ. అధ్యాయం 44.). కాని దేవతలు భూమినీ స్వర్గాన్నీ పుట్టించారు అని కూడా చెప్పబడడం వల్ల పిల్లలే తల్లిదండ్రుల్ని పుట్టించారు అనే విరోధాభాసాలంకారం వేదకవుల వాక్యాలలో ఉంది. ఉదాహరణకి, ఇంద్రుడు తన శరీరంలోంచి తన తల్లిదండ్రుల్ని పుట్టించాడు అని చెప్పబడింది (1.159.2; 10.54.3)[5]. వానని ఇచ్చే మేఘం అనే ఆవు మెరుపు/ పిడుగు

---

3. అజీజనన్ త్సూర్యం యజ్ఞ మగ్నిం

4. బహ్వీనాం పితా..... ఇషుధిః

5. పైన ఇచ్చిన 1.159.2 వ సంఖ్యగల ఋక్కులో ఈ అర్థం లేదు. కాని 1.160.3లో వహ్ని 'అగ్ని' స్వర్గానికీ భూమికీ పుత్రుడని చెప్పబడితే దాని తరవాత ఋక్కులో స్వర్గాన్నీ భూమినీ దేవుడు పుట్టించాడు (యో జజాన రోదసీ) అని చెప్పబడింది.

యన్మాతరం చ పితరం చ సాకమజనయథాస్తన్వః స్వాయాః (10.54.3)

అనే దూడకి తల్లి. ఆకారంలోని నీటిలో అగ్నిరూపమైనమెరుపు ఉంటుంది కాబట్టి నీరు అగ్నికితల్లి; అపాం నపాత్ 'నీటికికొడుకు' అనేది అగ్నికి ఒకపేరు (చూ. అధ్యాయం 24). అథర్వవేదంలో (1.13.2-3; చూ. 1.26.3; ఋగ్వేదం 10.142.2) అగ్ని 'ఏటవాలు ప్రదేశానికికొడుకు' అని కూడా చెప్పబడింది. సాధారణీకరణ దృష్టితో ఒకసముదాయంలో నాయకుణ్ణి లేక ముఖ్యుణ్ణి తండ్రిగా చెప్పడం జనకత్వారోపంలో మూడోరకం. వాయువు తుపాను దేవతలకి తండ్రి (1.134.4); రుద్రుడు మరుత్తులకి లేక రుద్రులకి తండ్రి; సోమలత మొక్కలకి తండ్రి; అలాగే సరస్వతి నదులకి తల్లి.

8.4 ఋగ్వేదంలో జనకత్వం అనే భావన మరిరెండు విషయాలకి కూడా అరుదుగా అన్వయించబడింది. సెమిటిక్ భాషలలోలాగా, ఒకరూపరహితమైనగుణం తరచు ఆ గుణం ఉన్నవారికి లేక దాన్ని దానం చేసేవారికి జనకంగా చెప్పబడింది; అటువంటిగుణాన్ని వ్యక్తిగా ఊహించిన సందర్భాలు కూడా ఉన్నాయి. దేవతలంతా అమర్త్యత్వం 'చావులేకపోవడం' లేక దక్ష- 'నేర్పు' అనేగుణాల కొడుకులు (సూనవః పుత్రాః; 8.25.5; చూ. అధ్యాయం 19). అగ్ని బలం లేకె శక్తి కొడుకు (అధ్యాయం 35). పూషుడు బంధవిముక్తికి కొడుకు. ఇంద్రుడు సత్యానికి కొడుకు (8.69.4) లేక ఆవులని పొందడానికి కొడుకు (4.32.22); లేక శక్తికి కొడుకు (శవసః, 4.24.1; 8.92.14; ఆయన తల్లి 'శవసీ' అని రెండుచోట్ల (8.45.5; 8.77.2) చెప్పబడింది). మిత్రుడూ, వరుణుడూ గొప్పశక్తికి కొడుకులు. ఇంకొక రకం జనకత్వారోపం చాలా అరుదు. కొడుకుకి తండ్రి గుణాలు సంక్రమించినట్టు తండ్రిపేరు కూడా ఇంటిపేరులా సంక్రమించడం ఉంది. త్వష్టకి విశేషమైన 'విశ్వరూప-' అనేది ఆయన కొడుకు పేరయింది. వివస్వత్తు కొడుకైన మనువుకిపేరుగా వైవస్వతుడు అనే తద్ధితరూపమేకాక వివస్వత్తు అనేది కూడా వాడబడింది (వాలఖిల్యసూక్తం 4.1 = 8.52.1).

8.5 ప్రపంచోత్పత్తికి 'తయారుచెయ్యడం', 'పుట్టించడం' అనేభావాలు లేనిగాథారూప వివరణ ఋగ్వేదంలోని ఒక అర్వాచీనసూక్తమైన ప్రసిద్ధమైన 'పురుషసూక్తం' (10.90) లో ఇవ్వబడింది.[6] ఈ గాథలో కొన్ని వివరాలు ఇది ఋగ్వేదకాలం చివరిభాగానికి

6. ఇందులో బ్రాహ్మణో ఽస్యముఖమాసీత్ 'ఆయన ముఖం బ్రాహ్మణుడు అయింది' వంటికొన్ని వాక్యాలలో పుట్టడం/పుట్టించడం అనే భావం లేకపోయినా పద్భ్యాం శూద్రో అజాయత '(ఆయన) పాదాలనించి శూద్రుడు పుట్టేడు' వంటి మరికొన్ని వాక్యాలలో ఈ భావం ఉంది అనిగమనించాలి.

చెందింది అని సూచిస్తున్నా, ఇందులోని ''ప్రపంచం ఒక పెద్ద పురుషుడి శరీరంనించి రూపంపొందింది'' అనేముఖ్యభావం చాలా పురాతన్మైనది. దేవతలు పురుషుణ్ణి పశువుగా చేసి యజ్ఞం చేసినప్పుడు ఆయన తల ఆకాశమూ/ స్వర్గమూ, నాభి అంతరిక్షమూ, పాదాలు భూమీ అయ్యాయి. ఆయన మనస్సులోనించి చంద్రుడూ, కంటిలోనించి సూర్యుడూ, నోటిలోనించి ఇంద్రుడూ, అగ్నీ, ప్రాణంలోనించి వాయువూ పుట్టేరు. నాలుగు వర్ణాలు కూడా ఆయనలోనించే పుట్టేయి. ఆయన ముఖం 'నోరు' బ్రాహ్మణుడు అయింది; చేతులు రాజన్యుడు అయ్యాయి; తొడలు వైశ్యుడు అయ్యాయి; పాదాలనించి శూద్రుడు పుట్టేడు. పురుష ఏ వేదం సర్వం, యద్భూతం యచ్చభవ్యం ''పుట్టినదీ, పుట్టబోయేదీ అయిన ఇది అంతా పురుషుడే'' అని ఈ సూక్తంలోనే భగవంతుడు సర్వవ్యాపకుడు అని వాచ్యంగానే చెప్పబడింది. అథర్వవేదం (10.17) లోనూ, ఉపనిషత్తులలోను (ముండకోపనిషత్తు 2.1.10) ప్రపంచమే పురుషుడు అని పురుషుడి సర్వవ్యాపకత్వం ప్రతిపాదించబడింది. ఛాందోగ్యోపనిషత్తు (1.7.5) లో పురుషుడికీ బ్రహ్మకీ ఐక్యభావం చెప్పబడింది. శతపథబ్రాహ్మణం (11.1.6.2) లో సృష్టికర్త అయిన ప్రజాపతే పురుషుడు.

8.6 ఋగ్వేదంలోని ఆఖరి మండలంలో కొన్ని సూక్తాలలో ప్రపంచోత్పత్తి గాథారూపంగాకాక వేదాంతపరంగా వివరించబడింది. ఇందులో చాలా సందర్భాలలో ప్రపంచాన్నిగురించి చేసిన ఊహలలో దాని ఉత్పత్తికి సూర్యుడు ఒక ముఖ్యమైన కర్త అనే అభిప్రాయం కనపడుతుంది. ఆయన కదిలేవాటికీ, కదలని వాటికీ ఆత్మ (సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ, 1.115.1) అని చెప్పబడ్డాడు. '' ఒకడే అయిన సూర్యుణ్ణి పండితులు ఇంద్రుడూ, మిత్రుడూ మొదలైన వివిధమైన పేర్లతో వ్యవహరిస్తారు'' వంటి వాక్యాలవల్ల సూర్యుడికి దేవతలందర్లోకీ గొప్పవాడైన ''మహాదేవుడు'' అనే ఉన్నతస్థానం ఇచ్చినట్లు తెలుస్తుంది; ఇది తరవాతకాలంలో బ్రహ్మకి ఇచ్చినఉన్నతస్థానంతో సమానం (1.164.46; 10.114.5; చూ. వాలఖిల్యసూక్తం 10.2)[7]. ఈ అర్థంలో ఒకసందర్భం (10.121.3) లో

---

ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు
రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్
ఏకం సద్ విప్రా బహుధా వదం
త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః (1.164.46) (మిగతా ఫుట్‌నోట్ ప్రక్క పేజీలో)

సూర్యుడు హిరణ్యగర్భుడు 'బంగారుపిండం' అనే పేరుతో ప్రపంచంలో ఒకగొప్ప శక్తిగా వర్ణించబడ్డాడు. వాయుప్రదేశాన్ని కొలిచేదీ, సూర్యుడు ఉదయించేచోట ప్రకాశించేదీ ఆయనే (10.121.5-6). ఈసూక్తం చివరి ఋక్కులో ఆయన ప్రజాపతి 'ప్రజలకు అధిపతి' అని చెప్పబడ్డాడు; ఈ పేరే బ్రాహ్మణాలలో ముఖ్యదేవతని సూచిస్తుంది. ఋగ్వేదంలో ఈ పదం వచ్చిన వాటిలో ప్రాచీనతమమైన ఋక్కు (4.53.2) లో ఈ పదం సూర్యదేవత అయినసవితకి విశేషణంగా ఉండడం గుర్తించదగినది; సవితే చరాచరమైన జగత్తుని పరిపాలిస్తాడు అని ఈ సూక్తంలోనే (6వ మంత్రం) చెప్పబడింది.

8.7 ప్రపంచోత్పత్తిని లేని దాన్నించి (అసత్) ఉన్నది (సత్) పుట్టడం అనేపరిణామం ద్వారా వివరించేసూక్తాలు మరిరెండు ఉన్నాయి. 10.72.6లో బ్రహ్మణస్పతి కమ్మరిలాగా ఈ ప్రపంచానికి ఒక రూపం ఏర్పరిచాడు అని చెప్పబడింది. లేనిదాన్నించి ఉన్నది పుట్టించబడింది. ఆ తరవాత వరసగా భూమీ, శూన్యప్రదేశాలూ, దక్షుడితోపాటు అదితీ పుట్టేరు; అదితి తరువాత దేవతలు పుట్టేరు. తరవాత దేవతలు సూర్యుణ్ణి పుట్టించారు. ఆదితికి ఎనిమిదిమంది కొడుకులు; కాని ఎనిమిదోవాడైన మార్తాండుణ్ణి ఆమె పారేసింది. ఆమె మార్తాండుణ్ణి పుట్టడానికీ మరణించడానికీ (అంటే, ఉదయించడానికి; అస్తమించడానికీ) పుట్టించింది. ఈసూక్తంలో మూడుదశలు చెప్పబడ్డాయి: మొదట ప్రపంచమూ, తరవాత దేవతలూ, చివరగా సూర్యుడూ పుట్టేరు.

8.8 ఎక్కువ అమూర్తమూ, ఉన్నతమూ అయిన భావాలుగల 10.129 సూక్తంలో మొదట ఏమీలేదు, అంతా శూన్యప్రదేశమే అని చెప్పబడింది. భేదరహితమైన నీళ్ళచుట్టూ చీకటీ, శూన్యప్రదేశమూ ఉండేది (చూ. 10.82.9, 10.121.7; అథర్వవేదం 2.8). వేడివల్ల ఒకమూలపదార్థం పుట్టింది. ఆ తరవాత మనస్సుకి ప్రథమబీజమైన కామం పుట్టింది. ఇదే లేనిదానికీ ఉన్నదానికీ మధ్య బంధం. ఈ ఉత్పత్తిప్రక్రియ ద్వారా దేవతలు పుట్టేరు. కాని సందేహాలు ఎక్కువై ఉత్పత్తి అనే పొడుపు కథకి సమాధానం చెప్పలేమని కవి

(7 వ ఫుట్‌నోట్ మిగతా భాగము) (సూర్యుణ్ణి) ఇంద్రం = ఇంద్రుడనీ, మిత్రం = మిత్రుడనీ, వరుణం = వరుణుడనీ, అగ్నిం = అగ్ని అనీ, ఆహుః = అంటారు; అథః = ఇంకా (ఆయనే), దివ్యః = దేవలోకంలో పుట్టిన, సః = ప్రసిద్ధుడైన, సుపర్ణః = మంచి రెక్కలుగల, గరుత్మాన్ = గరుత్మంతుడు; విప్రాః = మేధావులు, ఏకం = ఒకటే అయిన, సత్ = సత్పదార్థాన్ని, బహుధా = అనేక ప్రకారాలుగా, వదంతి = అంటారు; అగ్నిం = అగ్ని అనీ, యమం = యముడనీ, మాతరిశ్వానం = మాతరిశ్వుడనీ, ఆహుః = అంటారు. (యాస్కుడు ఈ మంత్రాన్ని అగ్నిపరంగా వ్యాఖ్యానించారు.)

ఇంతటితో వదిలివేశారు. పైనస్థూలంగా వర్ణించిన ఉత్పత్తి క్రమానికి తరవాయిగా మూడు బుక్కులు ఉన్న ఒక చిన్న సూక్తం (10, 190) ఉంది. ఇందులో వేడి (తపస్-) నించి క్రమం లేక నియమబద్ధత (ఋత-) పుట్టిందనీ ఆ తరవాత రాత్రీ, సముద్రమూ, సంవత్సరమూ పుట్టాయనీ చెప్పబడింది; సృష్టికర్త (ధాతృ-) వరసగా సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ, స్వర్గాన్నీ భూమినీ, వాయువునీ (మబ్బులపైన ఉండే) ఆకాశం పై భాగాన్ని పుట్టించాడు.

8.9 ఋగ్వేదంలో 10, 129 సూక్తంలాగే తైత్తిరీయ బ్రాహ్మణం (2.2.9.1, దాని తరవాతవీ) ''మొదట స్వర్గమూ, భూమీ, అంతరిక్షమూ ఏమీలేవు; ఆ శూన్యమే సత్పదార్థంగా మారడానికి నిశ్చయించుకొంది'' అని చెప్తోంది. బ్రాహ్మణాలలోని ప్రపంచోత్పత్తిని గురించిన ఊహలలో సృష్టికర్త ఒకడు ఉంటాడు; కాని ఆయనే సర్వత్రా ప్రారంభకుడు కాదు. ఇక్కడ సృష్టికర్త ప్రజాపతి లేక బ్రహ్మ; ఆయన దేవతలకీ మనుష్యులకీ, రాక్షసులకీ తండ్రిమాత్రమే కాక సర్వవ్యాపి. ఋగ్వేదం 10.129లో ప్రథమబీజంగా చెప్పబడిన కామానికి పురుషరూపమే ప్రజాపతి. బ్రాహ్మణాలలో కథనాలలో ప్రపంచోత్పత్తికి ప్రారంభదశ ప్రజాపతి సంతానాన్ని కోరి పుట్టించడం లేక ప్రాచీన జలాలు; వీటిపై తేలే హిరణ్యగర్భం 'బంగారు అండం' నించి ప్రపంచాన్ని కోరి పుట్టించే భూతం పుట్టింది. ప్రజాపతి పూర్వుడా? ప్రాచీనజలాలు పూర్వమా? అనేదాంట్లో ఏకాభిప్రాయం లేకపోవడానికి కారణం ఉత్పాదనా, సహజపరిణామమూ అనేరెండు ఊహలూ కలిసిపోవడమే. ఇందులోనే కాక మరికొన్ని చిన్న చిన్న విషయాలలో పరస్పర వైరుధ్యాలు ఉన్నాయి; దీనికి ఒక ఉదాహరణ 'దేవతలు ప్రజాపతిని సృష్టించారు' అనడమూ, 'ప్రజాపతి దేవతలని సృష్టించాడు' అనడమూ. ఛాందోగ్యబ్రాహ్మణం (5.19; చూ. ఛాందోగ్యోపనిషత్తు 3.19.1-4) లో చెప్పిన ప్రకారం ''అసత్తు సత్పదార్థం అయింది; సత్పదార్థం అండంగా మారింది; ఆ అండం ఒక సంవత్సరం తరవాత రెండుగా బద్దలై స్వర్గమూ భూమీ ఏర్పడ్డాయి; పుట్టినదంతా సూర్యుడు; ఆయనే బ్రహ్మ'' (ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః..... అథయ త్తదజాయతసోఽ సావాదిత్యః''. బృహదారణ్యకోపనిషత్తు (5.6.1) లో ప్రపంచోత్పత్తి క్రమం ఇలా చెప్పబడింది; ''ఇది (ప్రపంచం) మొదట్లో నీళ్లే; అవి సత్పదార్థాన్ని పుట్టించాయి; సత్పదార్థం బ్రహ్మనీ, బ్రహ్మ ప్రజాపతినీ, ప్రజాపతి దేవతలనీ (పుట్టించారు) (ఆప ఏవేదమగ్ర ఆసుః; తా ఆపః సత్యమసృజంత, సత్యం బ్రహ్మ, బ్రహ్మ ప్రజాపతిం, ప్రజాపతిర్దేవాన్....).

8.10 సర్వవ్యాపి అయిన దేవుడు సృష్టికర్తగా అథర్వవేదంలో స్కంభ- 'ఆధారం', ప్రాణ- 'ప్రాణం' (11.4), రోహిత- 'సూర్యుడి ఒకపేరు, 'కామ- 'కోరిక' మొదలైనకొత్త పేర్లతో పేర్కొనబడ్డాడు. బ్రాహ్మణాలలో ఎక్కువ ప్రసిద్ధికెక్కినగాథ నీటిలో మునిగిన భూమిని ఒకవరాహం ఎత్తినట్లు చెప్తుంది; వేదకాలం తరవాతకాలపు ఐతిహ్యాసంచయంలో ఈ వరాహమే విష్ణువు అవతారంగా భావించ బడింది.

## 9. దేవతల, మనుష్యుల ఉత్పత్తి.

9.1 వేదాలలో దేవతల ఉత్పత్తిని గురించి చెప్పిన విషయాలన్నీ ఇంచుమించు ఇంతకుముందే సూచించబడ్డాయి కాబట్టి ఇక్కడ ఈ విషయాన్నిగురించి సంగ్రహంగా చెప్తే చాలు. వేదాంతపరమైనసూక్తాలలో దేవతల ఉత్పత్తి పంచభూతాలలో ఒకటైన నీటితో సంబంధించినదిగా చెప్పబడింది. అథర్వవేదం (10.7.25) లో వారు అసత్తు (అంటే లేనిది) నించి పుట్టినట్లు చెప్పబడింది. ప్రపంచోత్పత్తిని వివరించే ఒకసూక్తం (10.129.6) లో వారు ప్రపంచం పుట్టాక పుట్టినట్టు చెప్పబడింది. మిగిలినచోట్ల సాధారణంగా వారు స్వర్గానికీ, భూమికీ పిల్లలు అని చెప్పబడింది. ఒకసందర్భం (10.63.2) లో మాత్రం వారు అదితి, నీరు, భూమి అనే మూడు మూలాలనించి పుట్టినట్టు ఉంది (చూ. 1.139.11); ఇలా మూడు మూలాలు చెప్పడాన్ని ప్రపంచాన్ని మూడు విభాగాలు చెయ్యడంతోపోల్చవచ్చు. కొందరు దేవతలు మరికొందరు దేవతల్ని పుట్టించారు అనే ఊహ ద్వితీయదశకు చెందినది అనడంలో సందేహం లేదు. ఉదాహరణకు, ఉషస్సు దేవతలకు తల్లి అని చెప్పబడింది (1.113.19), బ్రహ్మణస్పతీ (2.26.3), సోముడూ (9.87.2) వారి తండ్రులుగా చెప్పబడ్డారు. ఆదిత్యులు అనే ఏడుగురు లేక ఎనిమిది మంది దేవతలు అదితి పుత్రులుగా భావించబడ్డారు. అథర్వవేదం (1.30.2) లో కొందరు దేవతలు తండ్రులుగానూ మరికొందరు పుత్రులుగానూ చెప్పబడ్డారు.

9.2 మానవుడి ఉత్పత్తి విషయంలో వేదాలలో వివిధమైన భావనలు ఉన్నా, సాధారణంగా మానవజాతి ఒక ప్రథమ మానవుడినించి పుట్టినదిగా భావించబడినట్టు కనపడుతుంది. ఈ ప్రథమమానవుడు వివస్వత్తు కొడుకైన మనువు అని ఒకచోటా (10.63.7), ఆయన (వివస్వత్తు) కొడుకే అయిన యముడు అని ఒకచోటా చెప్పబడింది. మనువు మొట్టమొదట యజ్ఞం చేసినవాడు; ఈయన మనువుల తండ్రి (1.80.16). వైవస్వతుడైన యముడు

తనతో పుట్టిన సోదరి యమి (యమీ-) తోపాటు మానవజాతిని పుట్టించాడు. ఈ ప్రథమ మానవుడికన్నా వెనుకకు పోతే మానవుడి ఉత్పత్తి దేవతా సంబంధం కలదిగా ఊహించబడినట్లు కనపడుతుంది. వివస్వత్తు (అధ్యాయం 18) మొదటి కవలల తండ్రి; ఒకచోట (10.10.4) దేవలోకంలో గంధర్వుడూ, జలాలలోని అప్సరసా ఈ కవలలకు నాభి అంటే 'ఉత్పత్తిస్థానం' అని చెప్పబడ్డారు.[1] మానవులకు దేవతలతో సంబంధం కూడా కొన్నిచోట్ల సూచించబడింది; సర్వానికీ పితరులైన స్వర్గానికీ భూమికీ పుట్టిన పిల్లలలో మానవులు కూడా చేర్చబడి ఉంటారు. ఇంతేకాక, అగ్ని మానవుల సంతాన్ని పుట్టించినట్లు చెప్పబడింది (1.96.2-4); తరవాత కాలపు ఋషి కుటుంబాలకు పూర్వులైన (సగందివ్యత్వంగల) అంగిరస్సులు అగ్నికి పుత్రులని చెప్పబడింది. ఇంకా అనేక మానవ కుటుంబాలు అత్రి, కణ్వుడు, మొదలైన (1.139.9) వారి వారి మూల పురుషుల ద్వారా దేవతలనించి పుట్టినట్లు చెప్పబడింది. వసిష్ఠుణ్ణి మిత్రుడూ, వరుణుడూ అసాధారణ పద్ధతిలో పుట్టించారు; ఉర్వశి (ఉర్వశీ-) అనే అప్సరస ఆయన తల్లి (7.233.11)[2] ఒక (మహా) పురుషుడి అంగాలనించి వేరువేరు వర్ణాలకి చెందిన మానవులు పుట్టేరు (అధ్యాయం 8.5) అనే భావన పైనచెప్పినవాటికంటె చాలా విభిన్నమైనది.

---

1. గంధర్వో అప్స్వప్యాచయోషా సానోనాభిః పరమంజామితన్నౌ
ఈ మంత్రం కవలలైన యముడు, యమి అనే వారి సంవాదంలోది.

2. మిత్రావరుణుల పుత్రుడైన వసిష్ఠుడు ఉర్వశి మనస్సునించి పుట్టేడు (....మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్ మనసో ఒధి జాతః, 7.33.11). మిత్రావరుణులు యోగంలో (ఉర్వశిని చూసి) తమరేతస్సుని కుంభంలో వదిలేరు; దాన్నించి అగస్త్యుడూ వసిష్ఠుడూ పుట్టేరు అంటారు (..... కుంభేరేతః సిషిచతుః సమానం, తతో హ మాన ఉదియాయ మధ్యాత్తతో జాతమృషిమాహుర్వసిష్ఠం, 7.33.13).

# III. వేదాలలో దేవతలు

## 10. సాధారణ లక్షణాలు, విభజన.

10.1 వేదాలలో దేవతలని గురించిన భావనలలో స్పష్టతా, ఒక్కొక్క దేవుడికి ఉన్న ప్రత్యేకతలు చెప్పడం అనేవి లేవు. దీనికి కారణం వేదాలలో దేవతలు మిగిలిన ఇండో-యూరోపియన్ జాతుల దేవతలకన్న ప్రకృతి పదార్థాలకు చాలా సన్నిహితంగా ఉండడమే. వేదాలకు అతి ప్రాచీతమ వ్యాఖ్యాత అయిన యాస్కుడు తన నిరుక్తం (7.7)లో దేవతల రూపం గురించి చెప్తూ సూర్యుడు, భూమి మొదలైన దేవతల విషయంలో మనకు కనపడేది పురుషాకారం కాదు అనిచెప్పేరు ( అపితు యద్ దృశ్యతేఽ పురుషవిధంతత్, యథాగ్నిర్వాయు రాదిత్యః పృథివీ చంద్రమా ఇతి) . వేదాలలో దేవతలకు ఒక్కొక్కరికి ప్రత్యేక లక్షణాలు తక్కువ; వారికి ఆధారభూతమైన ప్రకృతి పదార్థాన్ని అనుసరించి చెప్పబడిన విశేషణాలు అందరికీ సమానంగా ఉంటాయి. ఉదాహరణకి, ఉషస్సు, సూర్యుడు, అగ్ని - ఈ ముగ్గురికీ ప్రకాశించడం, చీకటిని పోగొట్టడం, పొద్దున్న కనపడడం అనే లక్షణాలు తుల్యం. చాలామంది దేవతలు ఒకే ప్రకృతిపదార్థంపై ఆధారపడి ఉన్నప్పుడు వారిలో ఒక్కొక్కరికి ప్రత్యేకలక్షణాలు లేకపోవడం ఇంకా ఎక్కువగా ఉంటుంది. అందువల్ల, ప్రతి దేవత స్వభావంలోనూ అతి స్వల్పమైన ప్రత్యేక లక్షణాలతోపాటు ప్రకాశం, శక్తి, దానగుణం, జ్ఞానం వంటి అందరికీసామాన్యమైనలక్షణాలు కలిసి ఉంటాయి. కొన్ని విశ్వసంబంధమైనగొప్ప కృత్యాలు ఇంచుమించు ప్రతిదేవతకీ ప్రత్యేకంగా ఆపాదించబడి ఉన్నాయి. స్వర్గాన్ని భూమినీ సృష్టించడం లేక మొయ్యడం అనే కృత్యం అందరికీ ఆపాదించబడింది, అథర్వవేదం (19.32) లో ఇది శక్తివంతమైన దర్భలకి కూడా ఆపాదించబడింది. ఇంచుమించు పన్నెండుమంది దేవతలు రెండు లోకాలనీ సృష్టించినట్లు చెప్పబడింది; సూర్యుణ్ణి పుట్టించడం, ఆయన్ని ఆకాశంలో పెట్టడం, ఆయనకి త్రోవ ఏర్పరచడం అనే కృత్యాలు ఇంకా చాలాముందే చేసినట్లు చెప్పబడింది. భూమినీ, ఆకాశాన్నీ లేకరెండు లోకాలనీ వ్యాపింపచేయడం నలుగురైదుగురికి ( విడివిడిగా) ఆపాదించబడింది. చరాచరాలు అన్నిటికీ చాలామంది (సూర్యుడు, సవిత, పూషుడు, ఇంద్రుడు, పర్జన్యుడు, ఆదిత్యులు) ప్రభువులు.

10.2 ఇటువంటితుల్యలక్షణాలకి ప్రార్థనలు, పొగడ్తలతో కూడినసూక్తులలో సహజంగా

ప్రాముఖ్యం ఉంటుంది కాబట్టి ఇది ప్రత్యేక లక్షణాలని మరుగుపరుస్తాయి. వేరు వేరు విభాగాలకు చెందిన దేవతలు చేసే ముఖ్యమైన పనులలో సామ్యం ఉన్నప్పుడు వారిమధ్య భేదం తగ్గిపోతుంది. ఉదాహరణకి, భూలోకంలో నిప్పుకి అధిదేవత అయిన అగ్ని కాంతితో చీకటి దెయ్యాలని నాశనం చేస్తాడు; తుఫానుకి అధిదేవత అయిన దేవ లోకానికి చెందిన ఇంద్రుడు తన మెరుపుతో వాటిని నాశనం చేస్తాడు. ఈ సామ్యం వల్ల అగ్నిని గురించిన భావనలో భాగంగా అంతరిక్షంలోని మెరుపు చోటుచేసుకుంటుంది. ఇలా లక్షణాలలో కలగలుపు వారిని జంటలు జంటలు (దేవతాద్వంద్వాలు) గా ఆహ్వానించడం వల్ల ఇంకా ఎక్కువ అవుతుంది. ఇలా కలగలుపు ఏర్పడ్డాక ఒకదేవతని గురించి ప్రత్యేకంగా చెప్పేటప్పుడు కూడా (జంటలోని) మరొక దేవత లక్షణాలు ఆయనకి సంక్రమిస్తాయి. ఉదాహరణకి, ముఖ్యంగా ఇంద్రునికిచెందే విశేషణాలయిన 'సోమం తాగేవాడు', 'వృత్రుణ్ణి చంపేవాడు', 'గోవులని/ నీళ్లని/ సూర్యుణ్ణి/ ఉషస్సుని గెలుచుకొన్నవాడు' అనేవి అగ్నికి కూడా విశేషణాలుగా వాడుకలోకి వచ్చాయి.

10.3 చాలా గుణాలని అందరు దేవతలకీ ఆపాదించడం కారణంగా వచ్చే అస్పష్టత వల్లా, ప్రతి శక్తినీ ప్రతి దేవతకీ ఆపాదించి ఉన్న కొద్ది ప్రత్యేక గుణాలకీ ప్రాముఖ్యం ఇవ్వకపోవడం వల్లా ఒకదేవతకీ మరొకదేవతకీ ఏకీకరణం సులభమయింది. ఇటువంటి ఏకీకరణం ఋగ్వేదంలో చాలా తరచుగా కనపడుతుంది. ఒకకవి (వసుశ్రుతుడు) అగ్నిని ఉద్దేశించి ఇలా అంటాడు: ''అగ్నీ! నువ్వు పుట్టినప్పుడు వరుణుడవు; నువ్వు ప్రజ్వలించినప్పుడు మిత్రుడవు అవుతావు; శక్తికి పుత్రుడా! నీలో అందరు దేవతలు (గుమిగూడి ఉన్నారు); నువ్వు భక్తుడికి ఇంద్రుడవు.'' (5.3.1).[1] అగ్నిని ముఖ్యదేవతగా ఆరాధించిన వేదఋషుల దృష్టిలో అగ్నికి భూమిమీద నిప్పు, అంతరిక్షంలో మెరుపు, స్వర్గంలో సూర్యుడు అనే బహురూపాలు ఉన్నాయని మనం తెలుసుకొన్నప్పుడు వారికి అందరు దేవతలూ ఒకదేవత భిన్నరూపాలే అనే అభిప్రాయం ఉన్నట్లు చెప్పవచ్చు (అగ్నికి ఈ బహురూపాలు ఉన్నట్లు పాదుపుకథలో చాలాసార్లు సూచించబడింది). ఋగ్వేదంలో అనేక మంత్రాలలో ఈ అభిప్రాయం వ్యక్తం చేయబడింది. ''ఒకే సత్పదార్థాన్ని పండితులు

---

1. త్వమగ్నే వరుణో జాయసే యత్ త్వం మిత్రో భవసి యత్సమిద్ధః
త్వే విశ్వే సహసస్పుత్ర దేవాస్త్వ మింద్రో దాశుషే మర్త్యాయ
(దాశుషే = యజ్ఞం చేసేవాడైన, మర్త్యాయ = మనుష్యుడికి అనేదానికి బదులు పైన 'భక్తుడికి' అని స్థూలార్థంలో చెప్పబడింది).

అనేక విధాలుగా చెప్తారు; (దానినేవారు) అగ్ని, యముడు, మాతరిశ్వుడు అంటారు'' (1.164.46 (చూడు. అధ్యాయం 8.6); చూ. అథర్వవేదం 10.8.28; 13.4.15). ''పండితులూ, కవులూ మాటలతో ఒకటే అయిన పక్షిని (అంటే సూర్యుణ్ని) చాలా విధాలుగా కల్పిస్తారు'' (సుపర్ణం విప్రాః కవయో వచోభిరేకం సంతం బహుధా కల్పయంతి, 10.114.5). ఇలా ఋగ్వేదకాలంలో చివరిభాగానికి బహురూప వదేకదేవతాత్వ సిద్ధాంతం ఏర్పడినట్లు కనపడుతుంది. ఒకదేవతే అందరు దేవతలకి మాత్రమే కాక, మనుష్యులతోనూ, పుట్టినవాటితోనూ, పుట్టబోయే వాటితోనూ, అంతరిక్షంతోనూ, స్వర్గంతోనూ కూడా ఐక్యభావం చెప్పబడింది (1.89.10).[2] అలాగే, ప్రజాపతి దేవతలు అందర్లోకీ గొప్పవాడు (యో దేవేష్వధి దేవ ఏక ఆసీత్) మాత్రమే కాదు; ఆయన అన్నింటిలో వ్యాపించి ఉన్నాడు (ప్రజాపతే నత్వద్ ఏతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ, 10.121.8, 10). ఈ దైవ సర్వాత్మకత్వసిద్ధాంతం అథర్వవేదం (10.7.14, 25) లో పూర్ణంగా విస్తరించబడి తరవాత కాలపు వేదవాఙ్మయంలో వాచ్యంగానే ప్రతిపాదించబడింది.

10.4 ఋగ్వేదంలో ప్రాచీనతరమైన భాగాలలో ఒక్కొక్క దేవుడు అందరు దేవతలలోకీ గొప్పవాడుగా స్తుతించబడ్డాడు; కాని ఈ పద్ధతిని కొనసాగించి ఏ ఒక దేవుడూ మిగిలిన అందరికంటె గొప్పవాడని ఋషులు చెప్పలేదు. ఏ ఒకదేవుణ్ణి స్తుతించేటప్పుడయినా ఆ దేవుడే అందరిలోకీ గొప్పవాడని వర్ణించడం వారి పద్ధతి. ఈ పద్ధతికి కారణాన్ని అన్వేషిస్తూ మాక్స్ ముల్లర్ హెనోథీయిజం (Henotheism) లేక కేథెనోథీయిజం (Kathenotheism) అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు; ఈ సిద్ధాంతం మీద చాలా చర్చ జరిగింది. ఈ సిద్ధాంతం సారాంశం: ''దేవతలలో ఒకరి తరవాత ఒకరిని అత్యున్నతమైన దేవతగా భావించడం''; వేదఋషులు ఒక సమయంలో తాము స్తుతించే దేవతలపైనే మనస్సు కేంద్రీకరించి ఆ దేవతకే అత్యున్నతలక్షణాలన్నీ ఆపాదించి ఆయనని పూర్తిస్వతంత్రుడుగానూ అందరిలోకీ గొప్పవాడుగానూ చిత్రించారని మాక్స్‌ముల్లర్ అభిప్రాయం. ఈ సిద్ధాంతానికి వ్యతిరేకంగా (విట్నీ మొదలైనవారు) ఎత్తిచూపిన అంశాలు : వేదాలలో దేవతలలో ఏ ఒక్కరూ మిగిలినవారిపై ఆధారపడకుండా స్వతంత్రులుగా ఉన్నట్లు చిత్రించబడలేదు; మరి

---

2. అదితిర్ద్యౌరదితి రంతరిక్షమదితిర్మాతా సపితా సపుత్రః
విశ్వేదేవా అదితిః పంచజనా అదితి ర్జాత మదితి ర్జనిత్వం.
(జాతం = ప్రజల ఉత్పత్తి, జనిత్వం = పుట్టుకకి ఆధారం)

ఏమతంలోనూ లేనంత ఎక్కువగా ఈ దేవతలు తరచు వివిధమైన జంటలుగా ఏర్పరచబడ్డారు. అంతేకాక చాలాశక్తిమంతులైన దేవతలు కూడా ఇతరదేవతపై ఆధారపడి ఉన్నట్లు చెప్పబడ్డారు; ఉదాహరణకి, వరుణుడూ, సూర్యుడూ ఇంద్రుడి అధీనంలో ఉన్నవారు (1.101.3); వరుణుడూ, అశ్వినులూ విష్ణువు శక్తికిలోబడినవారు (1.156.4); ఇంద్రుడూ, మిత్రావరుణులూ, అర్యముడూ, రుద్రుడూ సవిత ఆదేశాలని ధిక్కరించ లేదు (2.38.9). విశ్వేదేవతలని ఉద్దేశించిన సూక్తాలలో చిన్న చిన్న దేవతలతో సహా అందరు దేవతలూ వరసగా స్తుతించబడ్డారు. వేదాలలో చాలా సూక్తాలు సోమయాగంలో దేవతలనందరినీ స్తుతించడానికి ఉద్దేశించబడ్డాయి కాబట్టి ఋత్విక్కులైన వేదఋషులకి సోమయాగంలో దేవతలకి ఉన్న తరతమ భేదం తెలియకుండా ఉండదు. పొగడ్తలలో సహజంగా వచ్చే ధోరణిలో ఒక దేవత ముఖ్యుడుగా చెప్పబడినప్పటికీ ఆ అభిప్రాయం దృఢమైనది కాదని అదే మంత్రంలోని వేరుపదాలో సందర్భమో స్పష్టం చేస్తాయి. ఉదాహరణకి, ఒక కవి ''అగ్ని ఒక్కడే, వరుణుడులాగా, ధనానికి ప్రభువు'' అన్నారు. తరచుగా దేవతలు జంటలుగా, ముగ్గురి సముదాయంగా లేక ఇంకా ఎక్కువమంది ఉన్న సముదాయంగా ఆహ్వానించబడ్డారు అని జ్ఞాపకం పెట్టుకోవాలి; ఉన్నతస్థానంగల వరుణుడు కూడా తరచు మరొకదేవుడితో పాటు (6.67లోలా) గాని చాలామంది ఇతర దేవతలతో పాటు (2.28లోలా) గాని స్తుతించబడ్డాడు. అందువల్ల హెనోథీయిజం అనేది బాహ్యదృష్టికి పరిమితమైన భ్రమే కాని నిజమైనది కాదు. ఈ భ్రమకి కారణాలు అపరిపక్వమైన పురుషతారోపం వల్ల వచ్చిన అస్పష్టత, వైదికదేవతలలో జెవుస్‌లా ముఖ్యస్థానాన్ని స్థిరంగా ఆక్రమించుకొన్నవారు ఎవరూ లేకపోవడం, పొగడ్త ధోరణితో కవి తానుస్తుతించే దేవతనే అతిశయోక్తులతో వర్ణించడం, దేవతలందరూ ఒకరికొకరు రూపాంతరాలే అనే సర్వదేవైకత్వంలో నమ్మకం క్రమక్రమంగా వృద్ధిపొందడం (చూ. 3.55 సూక్తం మంత్రాలలో సమానంగా ఉన్న చివరి పాదం - మహద్దేవానా మసురత్వమేకం ''దేవతలందరికీ ఒకటే ప్రాముఖ్యం ఉంది; అదిగొప్పది'') కాని హెనోథీయిజం అనే సిద్ధాంతాన్ని ఇది ఒక రకం ఏకైక దేవత్వం అనేదానికి ఋగ్వేదంలో ఉన్న బీజాభిప్రాయాలకి సూచకం అని సమర్థించవచ్చు.

10.5 పైన చెప్పినట్లు, వేదదేవతలు స్వర్గానికీ, భూమికీ, లేక మరికొందరు ఇతర దేవతలకీ సంతానం అని చెప్పబడడం వల్ల వేదఋషుల దృష్టిలో వారికి పుట్టుక ఉంది. ఇదే

దేవతలలో వేరువేరు తరాలు ఉన్నాయని సూచిస్తుంది; చాలాచోట్ల ముందు తరాలకి చెందినదేవతలని (పూర్వేదేవాసః) గూర్చిన ప్రస్తావనవాచ్యంగానే ఉంది (7.21.7, మొ). దేవతల ముందటి లేక మొదటి వయస్సు (దేవానాం పూర్వ్యేయుగే 10.72.2, దేవానాం యుగే ప్రథమే 10.72.3) ని గురించిన ప్రస్తావన కూడా ఉంది. పదిమంది దేవతలు మిగిలిన వారికన్న ప్రాచీనులని అథర్వవేదం (11.8.10) చెప్తుంది. దేవతలు కూడా మొదట్లో మరణం కలవారే. ఈ విషయం అథర్వవేదం (11.5.19, 4.11.6) లో వాచ్యంగానే చెప్పబడింది. బ్రాహ్మణాలలో ఇది అందరికీ వర్తించినట్లుగానూ (శతపథబ్రాహ్మణం 10.4.3.3), ఇంద్రుడికీ (ఐతరేయం 8.14.4), అగ్నికీ (ఐతరేయం 3.4), ప్రజాపతికీ (శతపథం 10.1.3.1) వర్తించినట్లుగానూ చెప్పబడింది. వారు మొదట్లో అమర్త్యులు కారు అని ఋగ్వేదంలో సూచించబడింది; సవిత (4.54.2 సవాజసనేయీ సంహిత 33.54) లేక అగ్ని (6.7.4; అథర్వవేదం 4.23.6) వారికి అమర్త్యత్వాన్ని ప్రసాదించినట్లు చెప్పబడింది.[3] సోమం తాగడం వల్ల కూడా వారు అమర్త్యత్వాన్ని పొందినట్లు చెప్పబడింది (9.106.8; చూ. 9.109.2-3); సోమమే అమర్త్యత్వానికి సూత్రం అని శతపథం (9.5.1.8) లో చెప్పబడింది. ఋగ్వేదంలో ఇంకొక సందర్భం (10.53.10) లో వారు అమర్త్యత్వాన్ని సాధించినట్లు చెప్పబడింది; కాని ఏవిధంగా సాధించారు అనేది స్పష్టంగా చెప్పబడలేదు (దేవాసో అమృతత్వ మానశుః; ఆనశుః = పొందేరు). ఇంద్రుడు తపస్సువల్ల స్వర్గాన్ని జయించినట్లు ఋగ్వేదకాలం చివరిభాగానికి చెందిన భావన (త్వం తపః పరితప్యాజయః స్వః 10.167.1; ★ ఇక్కడత్వం 'నువ్వు' అంటే 'ఇంద్రుడు' అని అర్థం). దేవతలు కూడా అదేవిధంగా (అంటే, తపస్సు వల్ల) దైవత్వాన్ని పొందినట్లూ (తైత్తిరియ బ్రాహ్మణం 3.12.3.1), మృత్యువుని జయించినట్లూ (అథర్వవేదం 11.5.19) చెప్పబడింది. వారు అమర్త్యత్వాన్ని రోహితుడిద్వారా సాధించారు (అథర్వవేదం 13.1.7). మరొకచోట (తైత్తిరీయ సంహిత 7.4.2.1) దేవతలు ఒకయాగం చెయ్యడం వల్ల మృత్యువుని జయించినట్లు చెప్పబడింది. ఇంద్రుడికీ మరికొందరు దేవతలకీ ముసలితనం లేదని చెప్పబడింది (3.46.1, మొ.) కాని దేవతల అమర్త్యత్వం వేదఋషుల దృష్టిలో నిత్యమైనది అని చెప్పడానికి ఆధారంలేదు. వేదకాలానికి తరవాత కాలపువారి అభిప్రాయంలో దేవతల అమర్త్యత్వం ఒక్కొక్క యుగానికి మాత్రమే పరిమితం.

---

3. దేవేభ్యోహి..... అమృతత్వం సువసి... సవితః (4.54.2);
తవక్రతుభిరమృతత్వమాయన్ వైశ్వానర (6.7.4)

10.6 దేవతల రూపం మానవుల రూపం వంటిదే; కాని వారి కృత్యాలని వర్ణించడానికి వారి వారి ప్రకృత్యాధారాలే రూపకల్పనకి సామగ్రిగా వాడబడడం వల్ల ఈ రూపారోపం ఛాయామాత్రమే. దేవతలకి తల, ముఖం, నోరు, బుగ్గలు, కళ్ళు, జుట్టు, బుజాలు, చాతీ, కడుపు, చేతులు, వేళ్లు, కాళ్లు ఉన్నట్లు చెప్పబడింది. ఇంద్రుడికీ మరుత్తులకీ తల, ఛాతీ, చేతులూ, ముంజేతులూ ఉన్నాయని ముఖ్యంగా వారి యుద్ధ సన్నాహాన్ని వర్ణించేటప్పుడు చెప్పబడింది. సూర్యుడి కిరణాలే ఆయన చేతులు; ఆయన మూర్తరూపమే కన్ను. అగ్నిజ్వాలలే ఆయన నాలుకా, అవయవాలూ. త్రితుడు సోమరసం తయారుచేసేవాడు కాబట్టే ఆయన వేళ్లని గురించి ప్రస్తావన ఉంది; అలాగే ఇంద్రుడికి సోమరసం తాగడంలో ఉన్న శక్తికి ప్రాముఖ్యం ఇవ్వడానికి ఆయన కడుపుని గురించిన ప్రస్తావన చేయబడింది. ఇద్దరు ముగ్గురు దేవతలకి అన్ని రూపాలూ ఉన్నాయని వారు విశ్వరూపులుగా చిత్రించబడ్డారు. ఋగ్వేదంలో విగ్రహాలని (అధ్యాయం 66.12) గురించి కాని గుళ్లని గురించి కాని ప్రస్తావన లేకపోవడానికి కారణం దేవతల బాహ్యరూపాలని గురించిన ఊహలు అస్పష్టంగా ఉండడమూ వారిలో చాలామందికీ వారి ప్రకృత్యాధారాలకీ మధ్య ఉన్న సంబంధం అప్పటికి ఇంకా స్పష్టంగా ఉండడమూ అని మనం అర్థం చేసుకోవచ్చు.

10.7 కొందరు దేవతలు దుస్తులు వేసుకొన్నట్లు చెప్పబడింది. ఉదాహరణకి ఉషస్సు ఆడంబరమైన దుస్తులతో అలంకరించుకొన్నట్లు వర్ణించబడింది. కొందరు దేవతలకి కవచాలూ శిరస్త్రాణాలూ ఉన్నాయి. ఇంద్రుడికి వజ్రం ఆయుధం; మిగిలినవారికి ఈటెలూ, గండ్రగొడ్డళ్ళూ, విల్లమ్ములూ ఆయుధాలు. ప్రతి దేవతకీ ప్రత్యేకంగా ఒక్కొక్క ప్రకాశించే రథం ఉంది. సాధారణంగా రథాన్ని గుర్రాలు లాగుతాయి; కాని పూషుడి రథాన్ని మేకలూ, మరుత్తుల రథాలని మచ్చలున్న లేళ్లు కాని గుర్రాలు కాని, ఉషస్సు రథాన్ని ఆవులు కాని, గుర్రాలు కాని లాగుతాయి.

10.8 దేవతలు తమ రథాల మీద వచ్చి యాగంలో పరిచిన దర్భల మీద కూర్చుంటారు; మరొక దృక్కోణంలో అగ్ని స్వర్గంలో ఉన్న దేవతల దగ్గరకి యాగాన్ని తీసుకువెళ్తాడు అని భావించబడింది (అధ్యాయం 35.32). దేవతల పానీయం సోమరసం. వారు తినేది మనుష్యులు ఇష్టంగా తినేదీ, వారు దేవతలకి యాగంలో నివేదించేదీ. ఈ ఆహారం వివిధ రూపాలలో పాలూ, వెన్నా, బార్లీ గింజలూ, బియ్యమూ (బియ్యం ప్రాచీన వేదాలలో చెప్పబడలేదు), పశువులూ, మేకలూ, గొర్రెలూ; ఒక దేవత ప్రత్యేక లక్షణాలకి ఏదో విధంగా

సంబంధించిన జంతువులు ఆయనఎక్కువ ఇష్టపడే ఆహారం. ఉదాహరణకి, ఇంద్రుడు తరచు ఎద్దుతో గాని దున్నపోతుతోగాని పోల్చబడ్డాడు; ఈ జంతువునే, కొన్నిచోట్ల చాలా అధిక సంఖ్యలో ఆయనకి నివేదించడమూ, ఆయన దాన్ని తినడమూ చెప్పబడింది (అధ్యాయం 22). అలాగే, ఇంద్రుడి గుర్రాలు ధాన్యాలు తింటాయని చెప్పబడింది. దేవతల నివాసస్థానం స్వర్గం అనీ, మూడో స్వర్గం అనీ, విష్ణువు అత్యున్నతమైనపాదం అనీ రకరకాలుగా వర్ణించబడింది; అక్కడవారు సోమపానం వల్ల కలిగిన ఆనందంతో సంతోషమయమైన జీవితం గడుపుతారు. సాధారణంగా దేవతలంతా స్నేహభావంతో కలిసిమెలిసి జీవిస్తారని ఊహించబడింది. యుద్ధప్రియుడూ, పరులపై అధికారం చెలాయించే గుణంగల ఇంద్రుడు ఒక్కడు మాత్రమే ఇతరులకి భిన్నంగా ఉంటాడు. ఆయన ఒకసారి మిగిలిన దేవతలతో యుద్ధం చేసినట్లు కనపడుతుంది (4.35.3, 5); ఆయన తన తండ్రినే చంపేడు (అధ్యాయం 22.10); ఆయన ఉషస్సు రథాన్ని విరగొట్టేడు (అధ్యాయం 20.6). ఆయన ఒకసారి విశ్వాసం కలవారూ తనకు సహచరులూ అయిన మరుత్తులని చంపుతానని బెదిరించినట్లు కూడా కనపడుతుంది (అధ్యాయం 29.11)

10.9 విజయవంతులవడం వల్ల తమ అభివృద్ధిపై విశ్వాసంగల వేదకాలపు భారతీయులకి ప్రకృతిలో ముఖ్యశక్తులైన నిప్పు, సూర్యుడూ, తుపానూ వంటి వాటికి ప్రతీకలైన దేవతలు లాభంకలిగించేవారుగానూ, అభివృద్ధిని ఇచ్చేవారుగానూ మాత్రమే కనపడ్డారు. హానికరమైన లక్షణాలు కొంతవరకూ ఉన్న ఒకే ఒక దేవుడు రుద్రుడు మాత్రమే. మానవజీవితంలో సంభవించే రోగం మొదలైన చెడ్డ లక్షణాలు తక్కువ స్థాయికి చెందిన భూతాలవల్లా, అనావృష్టీ, చీకటీ మొదలైన ప్రకృతికి సంబంధించిన చెడ్డ లక్షణాలు వృత్రుడు వంటి శక్తివంతులైన రాక్షసులవల్లా కలుగుతాయి. ఇటువంటి రాక్షసులని దేవతలు జయించడం వల్ల వారిలోని లాభదాయక స్వభావం మరింత ప్రాముఖ్యం పొందుతుంది. దేవతల దానగుణం మానవుల దానగుణాన్ని పోలి ఉంటుంది. యాగాన్ని స్వీకరించేవారు దేవతలే; యాగంలో సోమరసాన్ని పిండేటప్పుడూ, హవిస్సుని అగ్నిలో వేసటప్పుడూ దేవతలని ఉద్దేశించినసూక్తాలు చదువుతారు. యాగకర్మలో పరస్పరసంబద్ధమైనపనులని యాజకులు (పురోహితులు) నిర్వహిస్తారు. అందువల్ల దేవతలు యాగం చేసేవాడికిమిత్రులు; పిసినిగొట్టు వాడిపైవారు కోపం చూపెట్టి శిక్షిస్తారు. ఇది ముఖ్యంగా ఇంద్రుడి స్వభావం; ఆయన కూడా తన అనుగ్రహం చూపెట్టడంలో పూర్తిగా అక్రమబుద్ధి లేనివాడుకాదు.

10.10 వేదదేవతల స్వభావం నీతిబద్ధమైనది, దేవతలందరూ సత్యవంతులు; మోసం లేనివారు. వారు నిజాయితీకి ఋజుమార్గ ప్రవర్తనకీ మిత్రులూ, రక్షకులూ. కాని నీత్యను శాసనానికి ముఖ్య రక్షకులు ఆదిత్యులూ, ముఖ్యంగా వరుణుడూ. దేవతలకి చెడ్డపనులు చేసేవాడిమీదకోపం వస్తుంది; కాని తప్పు, పాపం అనే భావాలతో వరుణుడికోపానికి చాలా సన్నిహితసంబంధం ఉంది. అగ్ని కూడా తప్పునించి కాపాడడానికి ప్రార్థించబడ్డాడు; కాని ఆయననిగురించిన ప్రార్థనలలో ఇది ఒక చిన్న అంశమే కాని వరుణుణ్ణిగురించి ప్రార్థనలలో లాగా ముఖ్యాంశం కాదు. ఇంద్రుడు కూడా పాపులని శిక్షించేవాడే; కాని ఈ లక్షణం ఆయన స్వభావంతో లోతుగా ముడిపడినది కాదు. దేవతల నీతిబద్ధతస్థాయి సహజంగా నాగరికత ప్రాచీనదశని మాత్రమే ప్రతిబింబిస్తుంది. ఉదాహరణకి, వరుణుడికీ ధర్మమార్గ ప్రవర్తనకీ ఉన్న సంబంధం ఆయనతన విరోధులమీదా మోసం చేసేవారి మీదా కుయుక్తులు పన్నడానికి అడ్డువచ్చేటంతటిది కాదు. కాని మంచివారిమీదా భక్తుల మీదా ఆయనకి ఉన్న అనుగ్రహం చలనం లేనిది. కాని ఇంద్రుడు మంచి ఫలితం కోసం అన్న సమర్థనలేనప్పుడు కూడా అప్పుడప్పుడు మోసంతో కూడిన పన్నాగాలు పన్నడానికి అతీతుడు కాదు.

10.11 కాని వేదదేవతల విశేషణాలలో శక్తికి ఉన్నంత ప్రాముఖ్యం నీతిలో ఔన్నత్యానికి లేదు. 'సత్యవంతుడు', 'మోసంలేనివాడు' వంటి విశేషణాలకి 'గొప్పవాడు', 'శక్తిమంతుడు' వంటి విశేషణాలకన్న చాలా తక్కువ ప్రాముఖ్యం ఉంది. దేవతలు వారు చెయ్యదలచుకొన్నది చెయ్యగలరు. (మానవుల) కోరికలు తీరడం వారి మీద ఆధారపడి ఉంది. వారికి అన్ని జీవరాశుల మీదా అధికారం ఉంది; వారి శాసనాలని ఎవరూ ధిక్కరించలేదు; వారు ఇచ్చిన జీవితకాలాన్ని దాటి ఎవరూ జీవించలేరు.

10.12 ఋగ్వేదమూ అథర్వవేదమూ కూడా దేవతలు ముప్ఫైమూడుమంది అని చెప్తున్నాయి (3.6.9 మొ; అథర్వవేదం 10.7.13); ఈ సంఖ్య కొన్నిచోట్ల (8.35.3. మొ.) 'మూడుపదకొండ్లు' అని చెప్పబడింది. ఒక మంత్రం (1.139.11) పదకొండు మంది స్వర్గంలో ఉన్నట్లు గానూ, పదకొండుమంది భూమిమీద ఉన్నట్లుగానూ, పదకొండుమంది నీటిలో (= అంతరిక్షంలో) ఉన్నట్లుగానూ చెప్పి వారిని సంబోధించింది. అథర్వవేదం (10.9.12) లో కూడా స్థానవిభాగం ఇలాగా ఉంది కాని సంఖ్యలు చెప్పబడలేదు. కొన్ని మంత్రాలలో (1.34.11, 1.45.2; 8.35.3, 8.39.9) 33 మందితోపాటు ఇతర

దేవతలు కూడా ఉన్నట్లు సూచించబడడం వల్ల ఈసంఖ్య ఎల్లప్పుడూ స్థిరమైనది అనుకోవడానికి లేదు. ఒక మంత్రంలో (3.9.9 = 10.52.6 = వాజసనేయీ సంహిత 33.7) అసాధారణంగా దేవతల సంఖ్య 3339 అని చెప్పబడింది.[4] దేవతలు మూడు గణాలుగా ఉన్నారు అని కూడా స్థూలంగా చెన్పబడింది (6.51.2). దేవతలు స్వర్గం, భూమి, జలాలతో సంబంధం ఉన్నవారు అని చెప్పినప్పుడు మూడు సముదాయాలుగా విభజన సూచితమయింది (7.35.11, 10.49.2, 10.65.9). బ్రాహ్మణాలు కూడా దేవతలసంఖ్య 33 అని చెప్తాయి. శతపథానికీ ఐతరేయానికీ ఎనిమిదిమంది వసువులు, పదకొండు మంది రుద్రులు, పన్నెండుమంది ఆదిత్యులు అని మూడు గణాలుగా విభజించడం వరకూ సమానత్వం ఉంది; కాని శతపథంలో ఈ మూడుగణాలకీ ఒకచోట ద్యౌస్, పృథివి, ప్రజాపతి చేర్చబడి మొత్తం 34 మంది (4.5.7.2) అయితే మరొకచోట (11.6.3.5) ఇంద్రుడూ, ప్రజాపతీ చేర్చబడి మొత్తం 33 మంది అయ్యారు; ఐతరేయంలో (2.18.3) వషట్కారమూ, ప్రజాపతి చేర్చబడి మొత్తం 33 మంది అయ్యారు.

10.13 ఋగ్వేదం (1.139.11)[5] లోని మూడు రకాల విభజనని అనుసరించి యాస్కుడు తన నిరుక్తం (7.5) లో నిఘంటువు అయిదో అధ్యాయంలో చెప్పబడిన వివిధదేవతలని లేక ఒకేదేవతల వివిధరూపాలని పృథివీస్థానులు (నిరుక్తం 7.14-9.43), అంతరిక్షస్థానులు లేక మధ్యమస్థానులు (10.1-11.50), దుస్థానులు (12.1-46) అని మూడురకాలుగా విభజించారు. ఇంతేకాక ఆయన నిరుక్తకారుల అభిప్రాయంలో ముగ్గురే దేవతలు; వారు భూమిమీద అగ్ని, అంతరిక్షంలో వాయువు లేక ఇంద్రుడు, స్వర్గంలో సూర్యుడు అనికూడా చెప్పేరు. (ఈ అభిప్రాయం ఋగ్వేదం 10.158.1 వంటి మంత్రాలపై ఆధారపడినది కావచ్చు: సూర్యోనో దివస్పాతు వాతో అంతరిక్షాత్, అగ్నిర్నః పార్థివేభ్యః

---

4. త్రీణిశతా త్రీ సహస్రాణ్యగ్నిం త్రింశచ్చదేవా నవ చా సపర్యన్ ''మూడువందల మందీ, మూడువేలమందీ, ముప్పైమందీ, తొమ్మిదిమందీ దేవతలు అగ్నిని పూజించారు''; ఈ సంఖ్యకి అగ్నినికూడా కలుపుకొంటే మొత్తం 3340 మంది అవుతారు.

5. యే దేవాసో దివ్యేకాదశస్థ పృథివ్యామధ్యేకాదశస్థ
అప్సుక్షితో మహినైకాదశస్థ తే దేవాసోయజ్ఞ మిమం జుషధ్వం

(యే = ఏ, దేవాసః = దేవతలు, దివి = స్వర్గంలో, ఏకాదశ = 11, స్థ = ఉన్నారో, పృథివ్యాం అధి = భూమిమీద, ఏకాదశ = 11, స్థ = ఉన్నారో, అప్సుక్షితః = అంతరిక్షంలో ఉన్నవారు, మహినా = గొప్పతనం వల్ల, ఏకాదశ = 11, స్థ = ఉన్నారో, తే = ఆ, దేవాసః = దేవతలు, ఇమం = ఈ, యజ్ఞం = యజ్ఞాన్ని, జుషధ్వం = (సేవించి) ప్రీతిపొందండి.)

''సూర్యుడు మమ్మల్ని స్వర్గలోకంనించి రక్షించుగాక!, వాతుడు అంతరిక్షంనించీ, అగ్ని మమ్మల్ని పృథివిలోని భాగాలనించీ (రక్షించుగాక!)'') ఒకే వ్యక్తి హోతగానూ, అధ్వర్యుడుగానూ, బ్రహ్మగానూ, ఉద్గాతగానూ (యజ్ఞంలో) వ్యవహరించినట్లు ఈ ముగ్గురిలో ఒక్కొక్కరికి పనులలో తేడాలని బట్టి వేరువేరు రూపాంతరాలు (ప్రాచీనుల అభిప్రాయంలో) ఉన్నాయని ఆయన చెప్పారు. యాస్కుడు మాత్రం దేవతలందరూ ఈ ముగ్గురు రూపాంతరాలే అనేది అంగీకరించకపోయినా ఒక్కొక్క సముదాయంలో వారికి స్థానంలోనూ కృత్యాలలోనూ పరస్పర సంబంధం ఉందనే విషయం సమ్మతించారు. ఆయన వ్యాఖ్యానించిన నిఘంటువు పంచమాధ్యాయంలోని దేవతల జాబితాలో చాలామంది అప్రధాన దేవతలూ, దైవత్వం ఆపాదించబడిన పదార్థాలూ ఉండడం వల్ల ఒక్కొక్క సముదాయంలో మొత్తం సంఖ్య పదకొండుకన్న చాలామించిపోయింది. ఈ దేవతల జాబితాలో త్వష్ట, పృథివి మూడు సముదాయాలలోనూ, అగ్ని, ఉషస్సు అంతరిక్ష పృథివీస్థానసముదాయాలలోనూ, వరుణుడు, యముడు, సవిత అంతరిక్షద్యుస్థానంలోనూ కూడా ఉన్నారయనే విషయం గమనించదగినది.

10.14 వేదదేవతలని వారి గొప్పతనంలోని తరతమభేదం ఆధారంగా విభజించే ప్రయత్నం చెయ్యవచ్చు. ఋగ్వేదం (1.27.13)లో దేవతలలో కొందరు గొప్పవారు, కొందరు చిన్నవారు, కొందరు యువకులు, కొందరు వృద్ధులు అని చెప్పినచోట ఇటువంటి విభాగం స్థూలంగా సూచితమయింది (నమో మహద్భ్యో నమో అర్భకేభ్యో నమో యువభ్యో నమ ఆశినేభ్యః; ఆశినేభ్యః = వృద్ధులకి). ఇందులో సూచితమైన దేవతల తరతమభేదం వేదఋషుల నిశ్చితాభిప్రాయమే కావచ్చు (అధ్యాయాలు 9.1; 10.5) ఒక మంత్రం (8.30.1)లో దేవతలని ఉద్దేశించి ''మీలో ఎవ్వరూ అల్పుడుకాని యువకుడుకాని కారు; మీరందరూ గొప్పవారే'' (నహివో అస్త్యర్భకో దేవాసోనకుమారకః విశ్వేసతో మహాంత ఇత్) అని చెప్పడంపై అభిప్రాయంతో బాహ్యదృష్టికి మాత్రమే విరుద్ధంగా కనిపిస్తుంది; ఎందువల్లనంటే కవి దేవతలని ప్రత్యక్షంగా సంబోధించి స్తుతించేటప్పుడు వేరేవిధంగా చెప్పడం సమంజసం కాదు. ఇంద్రుడూ, వరుణుడూ అనే ఇద్దరు దేవతలు సమానశక్తి గలవారూ, మిగిలిన దేవతలకంటె అగ్రగణ్యులూ అనేది నిశ్చయం; ఇంద్రుడు బలవంతుడైన యోద్ధ, వరుణుడు ఉన్నతనీతిపరిరక్షకుడు. జొరొ ఆస్ట్రియన్‌మతంలో నీతికిసంబంధించిన గుణాల ఆధిక్యం వల్ల వరుణుడి ప్రాచీనరూపం అహురమజ్ద అనే అత్యున్నతుడైన దేవుడుగా

మారితే, భారతదేశంలో జయశీలురైన ఆర్యులమతంలో ఇంద్రుడు యుద్ధం చేసే దేవుడుగా పరిణామం చెందేడు. ప్రపంచంలోని క్రమబద్ధతని గురించీ ఉన్నతనీతి సూత్రాలని గురించీ ఆలోచన వచ్చినప్పుడే వరుణుడు ముఖ్యుడుగా కనపడతాడు కాని ఆయన ప్రసిద్ధుడైన దేవుడు అని చెప్పలేం. చాలామంది పండితులు వరుణుడూ, ఆదిత్యులూ ప్రాచీనదశలో అత్యున్నతులైన దేవతలనీ, తరవాతకాలంలో ఇంద్రుడు వారి స్థానాన్ని ఆక్రమించాడనీ అభిప్రాయపడ్డారు (చూ. అధ్యాయం 12). కాని ప్రాచీనతమమైన ఋగ్వేదకాలంలో కూడా ఇంద్రుడికి తక్కువస్థానం ఉందనడానికి సాక్ష్యాధారం ఏమీలేదు. అవెస్తాలో అహురమజ్ద అత్యున్నతుడైన దేవుడూ, ఇంద్రుడు ఒక భూతం మాత్రమే అనేది నిజం. కాని ఇండో-ఇరానియన్ కాలంలో ఇంద్రుడికీ వరుణుడికీ సమాన ప్రాధాన్యం ఉండి ఉన్నా, అవెస్తా మతంలో సంస్కరణ వల్ల అహురమజ్ద అత్యున్నతుడైనప్పుడు ఇంద్రుడిస్థానం వెనకబడడం అనివార్యమైంది. యజ్ఞకర్మలో గొప్పదేవతలైన అగ్నీ, సోముడూ ఇంద్రవరుణుల తరవాత ప్రాముఖ్యం వహిస్తారు. వీరిద్దరూ, ఇంద్రుడూ- ఈ ముగ్గురు ఋగ్వేదంలో చాలా ప్రసిద్ధులైన దేవతలు అని వారి నుద్దేశించిన సూక్తాల ప్రాచుర్యం వల్ల తెలుస్తుంది. అందులో ఇంచుమించు ఐదింట మూడోవంతు సూక్తాలు వారిని ఉద్దేశించినవి. అగ్నినీ ఇంద్రుణ్ణీ ఉద్దేశించిన సూక్తాలు ప్రతిమండలంలోనూ మొదట ఉండడమూ, సోముణ్ణి ఉద్దేశించినసూక్తాలలో చాలావాటికి ప్రత్యేకంగా ఒకమండలం, తొమ్మిదవది, ఉండడమూ ఈ అభిప్రాయాన్ని ధ్రువపరుస్తాయి. మిగిలిన దేవతల విషయంలో కూడా సూక్తాల సంఖ్యా, వారి పేర్లు ఋగ్వేదంలో ఎన్నిసార్లు వచ్చాయి అనేదీ కలిపిచూస్తే, మొత్తం దేవతలని అయిదుగణాలుగా విభజిరిచవచ్చు:

1. ఇంద్రుడు, అగ్ని, సోముడు

2. అశ్వినులు, మరుత్తులు, వరుణుడు

3. ఉషస్సు, సవిత, బృహస్పతి, సూర్యుడు, పూషుడు

4. వాయువు, ద్యావాపృథివీ (స్వర్గమూ, భూమీ), విష్ణువు, రుద్రుడు

5. యముడు, పర్జన్యుడు.

కాని సంఖ్యల మీద ఆధారపడడం పాక్షికంగానే సరియైనది. ఎందువల్లనంటే, వరుణుడికి

12.20 ప్రజాపతి (అధ్యాయం 39) అత్యున్నత దేవత అనే భావం వృద్ధి పొందడంలో తరవాతకాలంలో వరుణుడి ప్రాముఖ్యం తగ్గిపోయింది. మొదట్లో ఆయన స్వభావంలో ఒకభాగం మాత్రమే అయిన జలాధిపత్యం మాత్రమే తరవాతకాలంలో ఆయనకి మిగిలింది. వేదకాలం తరవాత కాలపు ఐలిహ్యంలో చివరికి ఆయన ఇలా సముద్రాధిదేవత అయిన నెప్ట్యూన్(Neptune) లా మిగిలిపోయారు.

12.21 వరుణుడు ముఖ్యంగా చంద్రుడికి ప్రతినిధి అని ఇటీవలి కాలంలో ఓల్డెన్‌బెర్గ్ ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని ఇక్కడ చర్చించకుండా వదిలెయ్యలేము. ఆయన చెప్పిన విషయాలు (i) ఆదిత్యులు ఏడుగురు, (ii) వారు అవెస్తాలోని అమేషస్ పెంటాస్‌తో అభిన్నులు అనేది విప్రతిపత్తి లేని సిద్ధాంతం (iii) వరుణుడు = చంద్రుడూ, మిత్రుడు = సూర్యుడూ, మిగిలినతక్కినస్థాయి ఆదిత్యులు = ఐదుగ్రహాలు, (iv) వీరు ఆర్యులకన్న ఖగోళశాస్త్రంలో నిపుణులైన సెమిటిక్ జాతివారి నించి ఇండో- ఇరానియన్ కాలంలో ఎరువుతెచ్చుకోబడిన దేవతలేకాని ఇండో-యూరోపియన్ దేవతలు కారు. ఎరువు తెచ్చుకొన్నకాలానికే వరుణుడికి నీతి విషయంలో ప్రాముఖ్యం ఉండి, ఆ తరవాత ఆయన స్వభావంలో చాలా మార్పులు వచ్చి ఉండాలి. ఇలా జరిగి ఉండకపోతే చంద్రుడికి సంబంధించినదేవతసూర్యుడికి సంబంధించినదేవతని ఇండో- ఇరానియన్ కాలంలో మూలకినెట్టివెయ్యడమూ ఆయన ( = అవెస్తాలో అహురమజ్ద, వేదాలలో వరుణుడు) కి, నీతి పరిరక్షకుడుగా అమూర్త లక్షణంతో కూడిన ఉన్నతస్థానాన్ని ఆక్రమించడమనే వృద్ధి లభించడమూ జరిగి ఉండేవి కాదు. ఈ ప్రతిపాదన ఋగ్వేదంలో చెప్పబడిన వరుణుడి లక్షణాలని ఏమాత్రమూ సరిగా వివరించేదిగా కనపడదు. ఈ ప్రతిపాదన అంగీకరిస్తే వరుణశబ్దానికీ గ్రీసు భాషలోని ఒయ్‌రనోస్ అనే శబ్దానికీ జన్మసంబంధం పూర్తిగా నిరాకరించవలసి ఉంటుంది.

12.22 అవెస్తాలోని అహురమజ్దకీవరుణుడికీ పేరులో కాకపోయినా స్వభావంలో సాదృశ్యం ఉండడం వల్ల వరుణుడు ఇండో- ఇరానియన్ కాలానికి చెందినవాడని ఇంతకుముందే (అధ్యాయం 25) చెప్పబడింది. వరుణ శబ్దం మూల ఇండో-యూరోపియన్‌కాలానికే చెందినది కావచ్చు. దానికీ గ్రీకులోని ఒయ్‌రనోస్ అనేపదానికీ కొన్ని ధ్వనివిషయకమైన సమస్యలు ఉన్నా సంబంధం ఉందని చాలాకాలంగా అంగీకరించబడింది; ఇటీవలి కాలంలో

తులనాత్మక భాషాశాస్త్రంలో ప్రామాణికులైన పండితులలో అధమపక్షం కొందరు (బ్రూగ్‌మన్‌మొదలైనవారు) దీనిని నిరాకరించలేదు.

12.23 ఇది ఇండో-యూరోపియన్‌కు చెందినదైనా, తరువాతకాలంలో ఏర్పడినది అయినా, ఈపదం వృ- 'కప్పు, వ్యాపించు' అనేధాతువు నించి పుట్టిందని చెప్పవచ్చు; అందువల్ల దీని మౌలికార్థం ''వ్యాపించేది/ వాడు''. సాయణుడు (1.89.3 పై వ్యాఖ్యలో) ఈవ్యుత్పత్తి ఇచ్చి ''పాపం చేసేవారిని తనపాశాలతో ఆవరిస్తాడు'' అని వివరించారు (వృణోతి పాపకృతః స్వకీయైఃపాశైరావృణోతీతి వరుణః); తైత్తిరీయ సంహిత (1.8.16.2) వ్యాఖ్యలో ''చీకటిలా ఆవరిస్తాడు'' అని వివరించారు (చూ. తై.సం. 2.1.7.4). ఇది ఇండో-యూరోపియన్‌కి చెందిన పదమైతే 'ఆకాశం' అని అర్థమిచ్చే సాధారణపదమైన ద్యౌస్‌కి ఇది విశేషణమై ఉంటుంది; తరవాతకాలంలో ఇది గ్రీసులో 'ఆకాశం' అనే అర్థం ఇచ్చే సాధారణపదంగానూ, భారతదేశంలో ఆకాశానికి సంబంధించిన ఉన్నతదేవతని సూచించే పదంగానూ అర్థంలో మార్పుచెందింది.

## 13. మిత్రుడు

13.1 మిత్రుడికి వరుణుడితో సాహచర్యం ఎక్కువగా ఉండడంవల్ల ఆయన్ని మాత్రం ఉద్దేశించిన సూక్తం ఋగ్వేదంలో ఒకే ఒకటి (3.59) ఉంది. ఇందులో ఈ దేవతస్తుతిలో వైశిష్ట్యం ఏమీ లేదు; కాని మొదటి మంత్రంలో కొంత ప్రత్యేకత చెప్పబడింది. ఆయన శబ్దం చేస్తూ మనుష్యుల చేత పనులు చేయిస్తాడు; దున్నేవారిని కనురెప్పవేయకుండా చేస్తాడు (ఇదేవిషయం మిత్రావరుణులిద్దరికీ 7.60.6లో చెప్పబడింది).[1]

13.2 మరొక మంత్రం (7.36.2)లో కూడా మిత్రుణ్ణి గురించి ఇంచుమించు ఇవేమాటలు ఉన్నాయి (జనంచ మిత్రో యతతి బ్రువాణః); ఇందులో వరుణుడు

1. మిత్రో జనాన్‌యాతయతి బ్రువాణో మిత్రోదాధారపృథివీముతద్యాం
మిత్రః కృష్టీరనిమిషాభిచష్టే మిత్రాయ హవ్యంఘృతవజ్జుహోత

(3.59.1. బ్రువాణః = శబ్దంచేస్తూ, మిత్రః = మిత్రుడు, జనాన్ = జనులని (చేత), యాతయతి = ప్రయత్నం చేయిస్తాడు, మిత్రః = మిత్రుడు, పృథివీం = భూమిని, ఉత = ఇంకా, ద్యాం = స్వర్గాన్ని, దాధార = ధరిస్తాడు, అనిమిషా = రెప్పపాటు లేని దృష్టితో, కృష్టీః = పనులుచేసేవారిని, అభిచష్టే = అంతటా చూస్తాడు, మిత్రాయ = మిత్రుడికి, హవ్యం = హోమద్రవ్యాన్ని, ఘృతవత్ = నేతితో, జుహోత = హోమంచెయ్యండి; సర్వైః మీయతే = జ్ఞాయతే ఇతి మిత్రః ''అందరికీ తెలిసినవాడు'' అని సాయణుడు ఇచ్చిన వ్యుత్పత్తి).

అజేయుడైన (అదబ్ధః) ప్రభువు (ఇనః) అని చెప్పబడ్డాడు. దీన్ని సూర్యసంబంధి దేవత అయిన ''సవిత ఈ అందరు జనులకీ తన శబ్దం వినిపిస్తాడు; వారికి ప్రేరణ కలగజేస్తాడు'' (య ఇమా విశ్వా జాతాన్యాశ్రావయతి శ్లోకేన, ప్రచసువాతి సవితా, 5.82.9) అనే మంత్రంతో పోల్చిచూస్తే, మిత్రుడు కూడా సవితలాగే సూర్య సంబంధి దేవత అనే సూచన ఉన్నట్లు స్పష్టం. మైత్రసూక్తం (3.59) అయిదో మంత్రంలో ఈయన గొప్ప ఆదిత్యుడనీ (మహాన్ఆదిత్యః), ''జనుల్ని ప్రవర్తింపజేసేవాడు'' (యాతయజ్జనః) అనీ చెప్పబడ్డాడు.[2] యాతయజ్జనః అనే విశేషణం ఋగ్వేదంలో మరిమూడు చోట్లే వచ్చింది. ఒకచోట (5.72.2) దీని ద్వివచనరూపం (యాతయజ్జనా) మిత్రావరుణులకి విశేషణం, మరొకచోట (1.136.3) ఇది మిత్రుడికీ, వరుణుడికీ, అర్యముడికీ వాడబడింది; మూడోచోట (8.102.12) అగ్నిమిత్రుడిలా ''యాతయజ్జనః'' అని చెప్పబడింది. అందువల్ల ఈ విశేషణం ముఖ్యంగా మిత్రుడికే చెందుతుంది అని చెప్పవచ్చు. మైత్రసూక్తం ఇంకా ఆయన స్వర్గాన్నీ భూమినీ భరిస్తాడనీ, ఐదుజాతులవారూ ఆయనకి విధేయులనీ, దేవతలందరినీ ఆయన పోషిస్తాడనీ చెప్తుంది. ఒకచోట (5.81.4) సవిత తన ధర్మాలవల్ల మిత్రుడే అవుతాడు (మిత్రో భవసి దేవ ధర్మభిః) అని చెప్పబడింది. మరొకచోట (8.52.3 = వాలఖిల్యసూక్తం 4.3) మిత్రుడి ధర్మాలవల్ల విష్ణువు తన మూడు పాదాలూ పెడతాడు అని చెప్పబడింది. ఈ రెండు మంత్రాలవల్ల మిత్రుడు సూర్యుడి గమనాన్ని క్రమబద్ధం చేస్తాడనేది సూచితమయింది అనుకోవచ్చు. ఉషస్సులకి ముందు వెళ్ళే అగ్ని తన శరీరం కోసం మిత్రుణ్ణి పుట్టిస్తాడు (10.8.4). అగ్ని ప్రజ్వలించినప్పుడు మిత్రుడూ, వరుణుడూ (మిత్రో అగ్నిర్భవతి యత్సమిద్ధో మిత్రో హోతావరుణో జాతవేదాః, 3.5.4); అగ్ని పుట్టినప్పుడు వరుణుడూ, ప్రజ్వలించినప్పుడు మిత్రుడూ (త్వమగ్నే వరుణో జాయసే యత్త్వం మిత్రో భవసి యత్సమిద్ధః, 5.3.1). అథర్వవేదం (13.3.13) లో సూర్యోదయమప్పుడు ఉండే మిత్రుడికీ సూర్యాస్తమయమప్పుడు ఉండే వరుణుడికీ భేదం చెప్పబడింది; అందులో మరొకచోట (9.3.18) వరుణుడు మూసినదాన్ని ప్రాతఃకాలంలో తెరవమని మిత్రుడు ప్రార్థించబడ్డాడు. మిత్రుడికి పగటితోనూ వరుణుడికి

---

2. మూలంలో యాతయజ్జనః అనే సమాసానికి ''మనుష్యుల్ని పోగు చేసేవాడు'' అనే అర్థం ఇవ్వబడింది; యాతయతి అనే క్రియకి కూడా ''(మనుష్యుల్ని) పోగుచేస్తాడు'' అనే అర్థమే ఇవ్వబడింది. యత్- అనే ధాతువుకి అర్థం ''ప్రయత్నం చెయ్యడం'' కాబట్టి పైన అర్థాలు (సాయణుడి ప్రకారం) మార్చి ఇవ్వబడ్డాయి.

రాత్రితోనూ సంబంధం ఉండనే బ్రాహ్మణాలలోని అభిప్రాయం ప్రారంభదశకే ఈ సందర్భాలు సూచకాలు. మిత్రుడు సూర్యసంబంధి దేవతగా ఊహించబడి, దీనికి వ్యతిరేకంగా వరుణుడు రాత్రి దేవతగా (తరవాతకాలంలో) స్థిరపడడం వల్ల ఈ అభిప్రాయం పుట్టి ఉంటుంది. మిత్రుడు పగటిదేవత, వరుణుడు రాత్రి దేవతా అనే ఈ భేదమే యజ్ఞకర్మలో మిత్రుడికి తెల్లని బలినీ వరుణుడికి నల్లని బలినీ ఇవ్వాలని చెప్పినప్పుడు సూచితమయింది (తై. సం. 2.1.7.4; 2.1.9.1; మైత్రం శ్వేతమాలభేత వారుణం కృష్ణం; మైత్రాయణీ సంహిత 2.5.7). మిత్రుడు సూర్యసంబంధి దేవత అని చెప్పడానికి వేదాలలో ఉన్న అల్పమైన ఆధారం అవెస్తావల్లా పర్షియన్ మతం వల్లా ధ్రువపడుతుంది. అందులో మిథ్ర స్పష్టంగా సూర్యసంబంధి దేవత లేక సూర్యుడి కాంతికి దేవత.

13.3 మిత్రశబ్దం వ్యుత్పత్తి అస్పష్టం.[3] కాని వేదంలోనే దీనికి 'స్నేహితుడు' అనే అర్థం కూడా ఉండడం వల్లా, మిత్రుడు దయాస్వభావుడూ, శాంతికి అధిదేవతా (తై.సం. 2.1.8.4) అని చెప్పబడడంవల్లా, అవెస్తాలోని మిథ్ర విశ్వాసానికి రక్షకుడు అవడం వల్లా దీని ప్రాచీనార్థం 'కలిసి ఉన్నవాడు', 'స్నేహితుడు' అయి ఉంటుంది. ఉపకారం చేసే ప్రకృతిశక్తి అనే సూర్యదేవుడి లక్షణానికి వాచకంగా ఇది వాడబడి ఉంటుంది.

## 14. సూర్యుడు

14.1 ఋగ్వేదంలో సూర్యుణ్ణి ప్రత్యేకంగా స్తుతించే సూక్తాలు పది ఉన్నాయి. సూర్య- సూర- అనే శబ్దాలు సూర్యబింబం అనే అర్థంలోనూ దేవుడు అనే అర్థంలోనూ కూడా వాడబడడం వల్ల దేవతార్థంలో ఈ శబ్దాలు ఎన్నిసార్లు వచ్చాయి అనేది చెప్పడం అసాధ్యం. ఈ పేరు బింబాన్ని కూడా సూచిస్తుంది కాబట్టి సూర్యుడు దేవలోకంలోని దేవతలందరిలోకీ ప్రత్యక్షస్వరూపుడు; బింబానికీ దేవతకీ ఉన్న సంబంధం ఎక్కడా మరుగున పడలేదు. ఆకాశంలోని సూర్యుడు పూజించదగిన తెల్లని మండలంగొప్పవాడైన అగ్నిముఖం (అనీకం) వంటిది (అగ్నేరనీకం బృహతః సపర్యం దివి శుక్రం యజతం సూర్యస్య, 10.7.3).

---

3. ఈ అస్పష్టతవల్లే సాయణుడు 3.59.1 వ్యాఖ్యలో రెండు వ్యుత్పత్తులు ఇచ్చారు: ప్రకర్షేణ = ర్వైర్మీయతే జ్ఞాయతే (అందరిచేతా ఎక్కువగా తెలుసుకోబడతాడు) సర్వాన్ వృష్టి ప్రదానేన త్రాయతే (వృష్టి ఇచ్చి అందరినీ రక్షిస్తాడు) ఇలివా మిత్రః = సూర్యః. ఇందులో మొదటిది కొంతవరకు అంగీకారయోగ్యం; రెండోదాని ప్రకారం మిత్ర- లో త్ర త్రా- 'రక్షించు' అనే దాన్నించి వచ్చిందనడానికి అవకాశం ఉన్నా మి-కి అర్థం చెప్పడం కష్టం.

సూర్యుడి కన్ను కొన్నిసార్లు (5.40.8, మొ. - అత్రిః సూర్యస్య దివి చక్షు రాధాత్ ''అత్రి స్వర్గంలో సూర్యుడికన్ను (= మండలం) పెట్టేడు'') చెప్పబడింది; కాని తరచుగా ఆయనే మిత్రావరుణుల, అగ్ని యొక్క (1.115.1) కన్ను అని చెప్పబడ్డాడు. ఒకచోట (7.77.3) ఉషస్సు దేవతలకన్నుని తెచ్చేది (దేవానాం చక్షుః సుభగా వహంతీ) అని చెప్పబడింది. మృతుడికన్ను సూర్యుడిదగ్గరికివెళ్లగాక (సూర్యం చక్షుర్గచ్ఛతు 10.16.3, చూ. 10.90.3, 10.158.3, 4) అనిచెప్పినప్పుడు సూర్యుడికీ కన్నుకీ ఉన్న సంబంధం సూచితమయింది. అథర్వవేదంలో ఆయన 'కన్నులకు అధిపతి' (5.24.9) అనీ, సృష్టించబడిన వారి కన్ను అనీ, ఆకాశానికీ, భూమికీ, నీటికీ అవతలివైపు (కూడా) చూస్తాడనీ (13.1.45) చెప్పబడింది. ఆయన దూరదృష్టి కలవాడనీ (దూరేదృశే; 7.35.8; 10.37.1), అన్నీ చూసేవాడనీ (1.50.2), ప్రపంచానికంతకీ చారుడు (స్పశ్) అనీ (స్పశం విశ్వస్య జగతః, 4.13.3), మనుష్యుల మంచి పనులనీ చెడ్డపనులనీ చేస్తాడనీ (1.50.7; 6.51.2; 7.60.2, 7.61.1; 7.63.1, 4) చెప్పబడింది. సూర్యుడి చేత ప్రేరితులైన జనులు వారి వారి పనులు చేస్తారు (7.63.4). అందరికీ సమానుడై అందరినీ ప్రేరేపించేవాడుగా ఆయన ఉదయిస్తాడు (7.63.2, 3). ఆయన కదిలేదానికీ కదలని దానికీ ఆత్మ (సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ, 1.115.1; 7.60.2). ఆయనకి ఏతశ - అనే పేరుగల గుర్రంలాగే రథం ఉంది (7.63.2); గుర్రాలు చాలా అని సంఖ్య అస్పష్టంగా కొన్నిచోట్లా (1.115.3; 10.37.3; 10.49.7); ఏడు గుర్రాలు అని కొన్ని చోట్లా (1.50.8; 5.45.9), ఏడు ఆడ గుర్రాలు అని కొన్నిచోట్లా (హరితః సప్త యహ్వీః, 4.13.3 (యహ్వీః = గొప్పవి), అయుక్త సప్త శుంధ్యువః సూరో రథస్యనప్త్యః, 1.50.9; అయుక్త సప్త హరితః 7.60.3; సూర్యస్యహరితః పతంతాః, 5.29.5 - వీటిలో శబ్దాలు స్త్రీలింగాలు) చెప్పబడింది.

14.2 సూర్యుడి గమనానికి తోవని వరుణుడు చేశాడు (ఉరుం హి రాజా వరుణశ్చకార సూర్యాయ పంథా మన్వేతవా ఉ, 1.24.8; 7.87.1); లేక ఆదిత్యులైన మిత్రుడూ, వరుణుడూ, అర్యముడూ చేశారు (7.60.4). పూషుడు ఆయన దూత (6.58.3). ఉషస్సు సూర్యుణ్ణీ, అగ్నినీ, యజ్ఞాన్నీ తెలిసేటట్లు చేస్తుంది/ పుట్టిస్తుంది (7.80.2;

---

1. 7.63.2 వ్యాఖ్యలో సాయణుడు ఏతశ శబ్దానికి పచ్చనిరంగు కలది (హరితవర్ణః) అని అర్థం ఇచ్చారు. అక్కడ ఆయన సప్తయుంజంతి రథమేకచక్రమేకో అశ్వోవహతి సప్తనామా (1.164.2) అనే ఋక్కుని ఉద్ధరించారు. దీని అర్థం : ఏకచక్రంగల రథాన్ని ఏడు గుర్రాలు లాగులాయి; (వస్తుతః) ఏడుపేర్లు గల ఒకే గుర్రం లాగుతుంది.

7.78.3). ఉషస్సు ఒడిలోంచి ఆయన ప్రకాశిస్తాడు (విభ్రాజమాన ఉషసాముపస్థాత్, 7.63.3), మరొక దృష్టిలో ఉషస్సు సూర్యుడి భార్య (సూర్యస్య యోషా, 7.75.5).

14.3 ఈయనకి అదితి పుత్రుడు అనే అర్థం ఇచ్చే ఆదిత్యుడు, ఆదితేయుడు అనే పేర్లు కూడా ఉన్నాయి (1.50.13; 1.191.9; ? 8.90.11; 10.88.11). కాని మరొకచోట (8.35.13-15) ఈయనకీ ఆదిత్యులకీ భేదం సూచించబడింది. ఈయనతండ్రి ద్యౌస్ అనీ ఈయనదేవతల చేత పుట్టించబడ్డాడనీ చెప్పబడింది (దేవజాతాయ కేతవే దివస్పుత్రాయ సూర్యాయ శంసత, 10.37.1). సముద్రంలో దాగి ఉన్న ఈయన్ని దేవతలు బయటికి తెచ్చారు (10.72.7). అగ్నిరూపమైన ఈయన్ని దేవతలు స్వర్గంలో పెట్టేరు (10.881.11). పురుషసూక్తం (10.90.3) లో ఈయన పురుషుడి కన్నునించి పుట్టినట్లు చెప్పబడింది (చక్షోః సూర్యో అజాయత). అథర్వవేదం (4.10.5) లో ఈయన (దివాకర-) వృత్రుడినించి పుట్టినట్లు ఉంది (సముద్రాజ్జాతో మణిర్వృత్రాజ్జాతో దివాకరః).

14.4 ఇతర దేవతలు చాలామంది ప్రత్యేకంగా సూర్యుణ్ణి పుట్టించినట్లు చెప్పబడింది. ఇంద్రుడు ఆయన్ని పుట్టించాడు (యః సూర్యంయ ఉషసం జజాన........స..... ఇంద్రః, 2.12.7); ప్రకాశించేటట్లు చేశాడు (3.44.2). ఇంద్రుడూ విష్ణువూ ఆయన్ని పుట్టించారు (7.99.4). ఇంద్రుడూ సోముడూ ఆయన్ని కాంతితో పైకి తెచ్చారు (ఇంద్రాసోమా వాసయథ ఉషాస ముత్సూర్యం నయథో జ్యోతిషా సహ, 6.72.2). ఇంద్రావరుణులు ఆయన్ని స్వర్గానికి తెప్పించారు (7.82.3). మిత్రావరుణులు ఆయన్ని స్వర్గానికి ఎక్కించారు/స్వర్గంలో పెట్టేరు (4.13.2; 5.63.4, 7). సోముడు సూర్యుడిలో కాంతిని స్థాపించాడు (అయం సూర్యే అదధాజ్జ్యోతి రంతః, 6.44.23; 9.97.41), సూర్యుణ్ణి పుట్టించాడు (జనితా సూర్యస్య, 9.96.5; 9.110.3); ప్రకాశించేటట్టు చేశాడు (.63.7); స్వర్గానికి ఎక్కించాడు (ఆ సూర్యం రోహయో దివి, 9.107.7). అగ్ని ఊర్ధ్వ ప్రదేశంలో సూర్యుడి కాంతిని స్థాపించాడు (ఊర్ధ్వం భానుం సూర్యస్య స్తభాయన్, 10.3.2); సూర్యుణ్ణి స్వర్గానికి ఎక్కించాడు (10.156.4). సృష్టికర్త అయిన ధాత సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ కల్పించాడు (సూర్యచంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్, 10.190.3). అంగిరసులు తమ యజ్ఞంవల్ల సూర్యుణ్ణి స్వర్గానికి ఎక్కించారు (10.62.3). సూర్యుడి ఉత్పత్తిని గురించి చెప్పే ఈ సందర్భాలన్నింటిలోనూ ప్రాముఖ్యం వహించేది నిస్సందేహంగా సూర్యమండలమే.

14.5 చాలా సందర్భాలలో సూర్యుడు ఆకాశంలో ప్రయాణించేపక్షిగా ఊహించబడ్డాడు. ఆయన పక్షి (పతంగం, 10.177.1, 2); ప్రకాశించే పక్షి (అరుషః సుపర్ణః, 5.47.3); ఆయన్పైన ఎగురుతున్నాడని చెప్పబడింది ( ఉదపప్త దసౌ సూర్యః, 1.191.9). ఆయన్ని ఎగిరేగద్దతో పోల్చడమే కాక (శ్యేనో నదీయన్ 7.63.5, శ్యేనః = గద్ద, న = లాగా, దీయన్ = వెళ్తూ), ఆయన గద్ద అనే చెప్పబడింది (రఘుః శ్యేనః, 5.45.9). ఒకచోట ఆయన ఎద్దు (ఉక్షా) అనీ పక్షి అనీకూడా చెప్పబడ్డాడు (5.47.3); మరొకచోట (10.189.1) మచ్చలుగల ఎద్దు (గౌః పృశ్నిః) అని చెప్పబడ్డాడు. ఆయన ఒకచోట (7.77.3) ఉషస్సు తెచ్చిన తెల్లని మంచిరూపం గల గుర్రంగా భావించబడ్డాడు. (దేవానం చక్షుః సుభగా వహంతీ శ్వేతం నయంతీ సుదృశీకమశ్వం। ఉషా అదర్శి; సుదృశీకం = మంచిరూపంగల). సూర్యుడి గుర్రం/గుర్రాలు (చూ. 14.1) ఆయన కాంతి/కిరణాలే కావచ్చు; వహ - ధాతువుకి 'లాగు' అనే అర్థమే కాక 'భరించు, తీసుకువచ్చు' అనే అర్థాలు కూడా ఉండడం వల్ల ఈ ఊహ సమంజసం. ఆయన ఏడు ఆడగుర్రాలూ రథం యొక్క కూతుళ్లు అని ఒకచోట (1.50.9) చెప్పబడింది.[2]

14.6 మరికొన్నిచోట్ల సూర్యుడు అచేతనపదార్థంగా చెప్పబడ్డాడు. ఆయన ఆకాశానికి ఆభరణం (రుక్మః, 7.63.4; 6.51.1); సూర్యుడు అనే ప్రకాశించే ఆయుధాన్ని మిత్రావరుణులు మబ్బుతోనూ వానతోనూ మరుగుపరుస్తారు (5.63.4). ఆయన మిత్రావరుణుల (రథ) చక్రం (పవిః, 5.62.2); మిత్రావరుణులు స్వర్గంలో పెట్టిన ప్రకాశించే రథం (5.63.7). సూర్యుణ్ణే చక్రం అని చెప్పడమూ (1.175.4; 4.30.4), సూర్యుడి చక్రం అని చెప్పడమూ కూడా (4.28.2; 5.29.10) ఉంది.

14.7 సూర్యుడు ప్రపంచం అంతటికోసం ప్రకాశిస్తాడు (విశ్వచక్షాః, 7.63.1); మనుష్యులకోసం దేవతలకోసం ప్రకాశిస్తాడు (1.50.5). ఆయన తనకాంతితో చీకటిని పారదోలాడు (10.37.4). ఆయన చీకట్లని తోలుని చుట్టగా చుట్టినట్లు చుట్టివేస్తాడు

---

2. రథస్య నప్త్యః. మరొకశాఖలో ఇక్కడ నప్త్ర్యః అనే పఠించబడుతుంది అని సాయణుడు చెప్పేరు. ఇది నప్తృశబ్దం ('కొడుకు, మనమడు') స్త్రీలింగరూపం; ఇందులో ఒకరూపంలో రేఫ లోపించడం వేదంలోని ప్రత్యేకత. అర్థాన్ని సమర్థించేందుకు సాయణుడు నప్త్యః = న పాతయిత్ర్యః "(రథాన్ని) పడగొట్టనివి" అని యౌగికార్థం ఇచ్చారు. ఇక్కడ ఒక వస్తువు ఉండే చోటుకీ ఆ వస్తువుకీ పితృపుత్ర సంబంధం ఆపాదించబడడం సాధారణం అనే విషయం అనుసంధించుకోవాలి (చూ. అధ్యాయం 8.3).

(చర్మేవయః సమవివ్యక్తమాంసి, 7.63.1). ఆయనకిరణాలు చీకటిని తోలుని పారవేసినట్లు నీటిలో పారవేస్తాయి (4.13.4). ఆయన కనపడని (దుష్టశక్తులనీ), రాక్షసస్త్రీలనీ హింసిస్తాడు (అదృష్టాన్త్సర్వాన్జంభయన్త్సర్వాశ్చ యాతుధాన్యః, 1.191.8, 9, చూ. 7.104.24). ఋగ్వేదంలో సూర్యుడు హానికరమైన శక్తిగా ఎక్కువ భావించబడలేదు కాబట్టి సూర్యుడి మండించేవేడి రెండు మూడు చోట్ల మాత్రమే సూచించబడింది (తపంతి శత్రుం స్వర్ణ, 7.34.19) స్వః = సూర్యుడి, న = లాగా); 9.107.20); ఇటువంటి భావన అథర్వవేదంలోనూ బ్రాహ్మణాలలోనూ మాత్రమే ఎక్కువగా కనపడుతుంది.

14.8 సూర్యుడు రోజుల్ని కొలుస్తాడు (అహా మిమానో అక్తుభిః, 1.50.7 (అక్తుభిః = రాత్రులలో, అహా = పగళ్లని, మిమానః = కొలుస్తూ); వర్ధిల్లజేస్తాడు (8.48.7). ఆయన కరువునీ, హోమం చెయ్యలేకపోవడాన్నీ, రోగాన్నీ, చెడ్డకలలనీ పోగొడతాడు (10.37.4). బతకడం అంటే పైన చరించే సూర్యుణ్ణే ఎప్పుడూ (విశ్వదానీం) చూడడమే (విశ్వదానీం ..... పశ్యేమను సూర్యముచ్చరంతం, 6.52.5; 4.25.4). జీవులందరూ సూర్యుడిమీద ఆధారపడినవారే(1.164.14); ఆకాశం సూర్యుడిచేత ఎత్తి ఉంచబడింది (సూర్యేణోత్తభితా ద్యౌః, 10.85.1). విశ్వకర్మన్- 'అందరినీ సృష్టించేవాడు' అనే విశేషణం ఆయనికి కూడా వాడబడింది (10.170.4; చూ. అధ్యాయం 39). ఆయన దేవతలకి గొప్ప పురోహితుడు (అసుర్యః పురోహితః, 8.101.12). మిత్రావరుణులకీ ఇతర దేవతలకీ మేము పాపులం కాము అని చెప్పమని సూర్యుడు ఉదయించేటప్పుడు ప్రార్థించబడతాడు (7.60.1; 7.62.2). ఆయన ఉదయించేటప్పుడు వృత్రుణ్ణి చంపిన ఇంద్రుడి దగ్గరకి వెళ్తాడని చెప్పబడ్డాడు; ఇంద్రుడితో కలిపి ఈయనని ప్రార్థించినప్పుడు ఈయన కూడా వృత్రుణ్ణి చంపినవాడని చెప్పబడింది (8.93.1, 2, 4).

14.9 సూర్యుణ్ణి గురించి చెప్పబడిన ఒకే ఒక గాథ ఆయన్ని ఇంద్రుడు ఓడించాడనీ (యన్మసువా సూర్యం జయత్, 10.43.5), ఇంద్రుడు ఆయన చక్రాన్ని దొంగిలించాడనీ (ముషాయ సూర్యం కవే చక్రమీశాన ఓజసా, 1.175.4; 4.30.4). ఇది తుఫానులో సూర్యుడు మరుగుపడడాన్ని సూచించేది కావచ్చు.

14.10 అవెస్తాలో హ్వారె 'సూర్యుడు'కి కూడా వేగవంతమైన గుర్రాలు ఉన్నాయి; వేదాలలో

లాగే ఆయన అహుర మజ్ద (= వరుణుడు) కన్ను అని చెప్పబడ్డాడు. హ్వారె వేదంలోని స్వర్/ స్వః అనే పదానికి సజాతీయం; దీనినించే సూర్యశబ్దం పుట్టింది; గ్రీకు భాషలోని హేలియోస్ 'సూర్యుడు' అనే పదానికీ దీనికీ కూడా సంబంధం ఉంది.

## 15. సవిత

15.1 సవిత(సవితృ-) ఋగ్వేదంలో పదకొండు పూర్తి సూక్తాలలోనూ మరికొన్నింటి భాగాలలోనూ స్తుతించబడ్డాడు; ఆయన పేరు సుమారు 170 సార్లు వచ్చింది. సవితకు చెందినపూర్తి సూక్తాలలో ఎనిమిది లేక తొమ్మిది సగోత్రమండలాలలో[1] ఉండగా, సూర్యుడికి చెందినవి మూడు తప్ప మిగిలినవి అన్నీ ఒకటి, పదిమండలాలలో ఉన్నాయి. సవిత అవయవాలూ, సామగ్రి ఇంచుమించు అన్నిచోట్లా బంగారుమయమైనవి అని చెప్పబడడం వల్లం ఈ దేవత ముఖ్యంగా హిరణ్యమయుడు అని చెప్పవచ్చు. ఈయన బంగారు కన్నులూ (హిరణ్యాక్షః సవితాదేవః, 1.35.8), బంగారు చేతులూ (హిరణ్యపాణిః/ హిరణ్యహస్తః, 1.35.9, 10), బంగారునాలుకా (హిరణ్య జిహ్వః, 6.71.3) కలవాడు; ఈ విశేషణాలు అన్నీ ఈయనకే ప్రత్యేకంగా వాడబడ్డాయి. ఈయన పెద్ద చేతులు కలవాడు (పృథుపాణిః, 2.38.2), మంచి చేతులు కలవాడు (సుపాణిః; 3.33.6); సంతోషం కలిగించే నాలుక కలవాడు (మంద్రజిహ్వః, 6.71.4), మంచి నాలుక కలవాడు (సుజిహ్వః, 3.54.11). ఒకచోట ఈయన ఇనప దవడలు కలవాడు (అయోహనుః, 6.71.4) అని చెప్పబడ్డాడు. ఈయన పసుపుపచ్చని జుట్టుకలవాడు (హరికేశః, 10.139.1); ఈ విశేషణం అగ్నికీ ఇంద్రుడికీ కూడా వాడబడింది. ఈయన పసుపుపచ్చా గోధుమరంగూ కలిసిన రంగుగల (పిశంగం) కవచం (ద్రాపిం) ధరిస్తాడు (4.53.2). ఈయన బంగారు రథం మీద లోకాలని చూస్తూ వస్తాడు (హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్ (1.35.2); ఈ రథానికి కాడినికట్టే కర్ర (చివరిభాగం) బంగారపుది (హిరణ్యప్ర ఉగం, 1.35.5). ఈయన అన్ని రూపాలు ధరించినట్లే (విశ్వారూపాణి ప్రతిముంచతే కవిః, 5.81.2) ఈయన రథం కూడా అన్ని రూపాలు కలది (విశ్వరూపం, 1.35.4). ఈయనగుర్రాలు

---

1. సగోత్రమండలం అంటే ఒకే వంశపరంపరకు చెందిన ఋషులు దర్శించిన సూక్తాలు ఉన్న మండలం. ఋగ్వేదంలోని పదిమండలాలలో రెండునించి ఏడు వరకు ఉన్న మండలాలు మాత్రమే ఇటువంటివి. మిగిలిన మండలాల (1, 8, 9, 10) లోని సూక్తాలు వేరువేరు వంశాలకు చెందిన ఋషులు దర్శించినవి (చూ. కొన్ని పదాలు- వివరణలు).

రెండూ తెల్లనివి (యాతి శుభ్రాభ్యాం యజతో హరిభ్యాం, 1.35.3) లేకఅవి (రెండుకన్న ఎక్కువ) గోధుమ రంగు కలిగి (శ్యావాః), తెల్లనికాళ్లు కలవి (శితిపాదః, 1.35.5); 7.451.1లో కూడా అశ్వైః అని బహువచనం వాడబడింది.

15.2 దీప్తి ముఖ్యంగా సవితకే ఉందని చెప్పబడింది; బంగారుమయమైన దీప్తి (అమతి) ఆయనకే స్వంతం (హిరణ్యయీ మమతిం, 3.38.8, 7.38.1). ఈ దీప్తిని ఆయన సర్వత్రా వ్యాపించేటట్టు చేస్తాడు. ఆయన అంతరిక్షాన్నీ, భూమినీ, స్వర్గాన్నీ, ప్రపంచాన్నీ, భూమిలో భాగాలనీ ప్రకాశించేటట్టు చేస్తాడు (1.35.8; 4.14.2; 4.53.4). ఆయన ఎత్తిన పెద్ద బంగారుచేతులు ఆకాశం చివరల వరకూ వ్యాపిస్తాయి (ఉదస్య బాహూశిథిరా బృహంతా హిరణ్యయా దివో అంతాన్ అనష్టాం, 7.45.2 (శిథిరా = చాచినవి)); వాటితో ఆయన అందరినీ లేపి అనుగ్రహిస్తాడు (2.38.2; 4.53.3, 4; 6.71.1, 5). ఇతర దేవతల పనులు ఆయన చేతులెత్తడంతో పోల్చబడ్డాయి కాబట్టి చేతులెత్తడం ఆయన ప్రత్యేకత. అగ్ని సవితలా చేతులెత్తుతాడు (ఉద్యంయమీతి సవితేవ బాహూ, 1.95.7); ఉషస్సులు కాంతిని సవిత తన చేతులు ఎత్తినట్లు వ్యాపించేటట్టు చేస్తాయి (7.79.2). సవిత చేతులెత్తినట్టు స్తుతులని ఎక్కువచేయమని బృహస్పతి ప్రార్థించబడ్డాడు (1.190.3). ఆయన తన బంగారు రథంలో భువనాలు చూస్తూ కిందకు వెళ్లేతోవలోనూ (ప్రవతా), పైకి వెళ్లేతోవలోనూ (ఉద్వతా) ప్రయాణిస్తాడు (1.35.2, 3). ఆయన ఉషస్సుకి ముందు అశ్వినుల రథం వెళ్లేటట్టు చేస్తాడు (1.34.10). ఆయన ఉషస్సు ప్రయాణం తరవాత ప్రకాశిస్తాడు (అను ప్రయాణ ముషసో విరాజతి, 5.81.2). ఆయన భూప్రదేశాలని కొలిచాడు (యః పార్థివాని విమమే); మూడు కాంతిమంతమైన స్వర్గాలకి వెళ్తాడు; సూర్యుడి కిరణాలతో కలిసిపోతాడు (సూర్యస్య రశ్మిభిః సముచ్యసి, 5.81.3, 4). సూర్యరశ్మిః ''సూర్యుడి రశ్మియే రశ్మిగా కలవాడు'' అనే విశేషణం ఋగ్వేదంలో వాడబడిన ఒకే ఒకచోట అది సవితకి అన్వయిస్తుంది: ''సూర్యుడిరశ్మియే రశ్మిగా కలవాడూ, పసుపు పచ్చని జుట్టు కలవాడూ, జ్యోతీ అయిన సవిత ఎల్లప్పుడూ తూర్పున ఉదయిస్తాడు'' (సూర్యరశ్మిర్హరికేశః పురస్తాత్సవితా జ్యోతి రుదయాన్ అజస్రం, 10.139.1). ఆయన అంతరిక్షాన్నీ మూడు స్వర్గాలనీ మూడు భూములనీ మూడుసార్లు చుట్టి వ్యాపించి ఉంటాడు (4.53.5; చూ. విష్ణువు, అధ్యాయం 17). ''అంతరిక్షంలో నీ ప్రాచీనమైన తోవలు దుమ్ములేనివి; బాగా వెయ్యబడినవి; సులభంగా ప్రయాణించదగినవి; వాటిలో

వచ్చి మమ్మల్ని రక్షించు; మమ్మల్ని గురించి (మంచిగా) చెప్పు'' అని ఆయన ప్రార్థించబడ్డాడు (1.35.11).[2] మృతుడి ఆత్మను మంచిపనులు చేసిన వారు వెళ్ళి ఉండేచోటుకి తీసుకువెళ్లమని ఆయనని ప్రార్థించారు (10.17.4). ఆయన దేవతలకి అమృతత్వమూ మనుష్యులకి సంతతితో కూడిన జీవితాలూ ఇస్తాడు (4.54.2). ఋభువులకి కూడా ఆయన అమర్త్యత్వం ఇచ్చాడు; వారు వారి గొప్ప పనుల వల్ల ఆయన గృహానికి వెళ్లేరు (1.110.2, 3). సూర్యుణ్ణే ప్రార్థించినట్లే ఈయన్ని కూడా చెడ్డ కలలని పోగొట్టమనీ (5.82.4) మనుష్యుల్ని పాపరహితుల్ని చెయ్యమనీ (4.54.3) ప్రార్థించారు. ఈయన రాక్షసులనీ పిశాచాలనీ అపకారం చేసేవారినీ, రోగాలనీ తొలగిస్తాడు (1.35.10; 7.38.7).

15.3 చాలామంది ఇతర దేవతలలాగే ఈయన కూడా అసురుడు అని చెప్పబడ్డాడు (4.53.1).[3] ఆయన నియమితమైన ధర్మాలని పాటిస్తాడు (సత్యధర్మా, 4.53.4; 10.34.8; 10.139.3). నీళ్లూ, వాయువూ ఆయన శాసనానికి లోబడతాయి (2.38.2). ఆయన ప్రేరణవల్ల నదులు పెద్దవిగా ప్రవహిస్తాయి (3.33.6; చూ. నిరుక్తం 2.26). ఇతర దేవతలు ఆయనని అనుసరిస్తారు (5.81.3). ఇంద్రుడూ, వరుణుడూ, మిత్రుడూ, అర్యముడూ, రుద్రుడే కాక మరి ఎవ్వరూ ఆయన ధర్మాన్నీ, అధికారాన్నీ ధిక్కరించలేదు (నయస్యేంద్రో వరుణో న మిత్రో వ్రత మర్యమా న మినంతి రుద్రః, 2.38.9; 2.38.7; 5.82.2). ఆయన్ని వసువులూ, అదితీ, వరుణుడూ, మిత్రుడూ, అర్యముడూ స్తుతిస్తారు (7.38.3, 4). పూషుడూ, సూర్యుడి లాగ ఆయన చరాచరమైన వాటి అన్నిటికీ ప్రభువు (4.53.6). కోరదగిన వస్తువులు అన్నిటికీ ఆయన ఈశ్వరుడు (ఈశానం వార్యాణాం, 1.24.3); ఆయన కోరిన ధనం స్వర్గాన్నించీ, అంతరిక్షాన్నించీ, భూమినించీ ఇస్తాడు (2.38.11). ఈయన రెండుచోట్ల (1.123.3; 6.71.4) దమూనాః ''ఇంటికి సంబంధించినవాడు'' అని చెప్పబడ్డాడు; ఈ విశేషణం మిగిలిన చోట్ల అగ్నికి మాత్రమే వాడబడింది.[4] ఇతర దేవతలలాగే ఈయన కూడా స్వర్గలోకాన్ని నిలబెట్టేవాడు (దివో ధర్తా,

---

2. యేతే పంథాః సవితః పూర్వ్యాసో ఽరేణవః సుకృతా అంతరిక్షే
తేభిర్నో అద్యపథిభిః సుగేభీ రక్షాచనో అధిచ బ్రూహిదేవ
(ఇక్కడ పంథా 'తోవలు' అనేది బహువచనం)

3. అసుర శబ్దానికి అసు - అంటే జలం, అది కలవాడు అసురుడు అని సాయణుడు ఇచ్చిన వ్యుత్పత్తి (చూ. కొన్ని పదాలు - వివరణలు)

4. దమూనా దమమనా వా దానమనా వా దాంతమనా వా (దమూనా అంటే నియంత్రించబడిన మనస్సు కలవాడు లేక దానం ఇచ్చే మనస్సు కలవాడు) అని యాస్కుడిని అనుసరించి సాయణుడు చెప్పిన అర్థం.

4.53.2; 10.149.4); భువనాన్ని అంతనీ ధరిస్తాడు (4.54.4). సవిత భూమిని తాళ్లతో (యంత్రైః) కట్టేడు; స్తంభాలు లేనిచోట (అస్కంభనే) స్వర్గాన్ని నిలబెట్టేడు (సవితాయంత్రైః పృథివీ మరమ్ణా దస్కంభనే సవితా ద్యా మదృంహత్, 10.149.1)

15.4 సవిత అధమపక్షం ఒకచోట అపాంనపాత్ ''నీటికి పుత్రుడు'' అని చెప్పబడ్డాడు (1.22.6); ఈ విశేషణం మిగిలిన చోట్ల అగ్నికి మాత్రమే చెందుతుంది. 10.149.2లో కూడా ఇది సవితకి విశేషణమే కావచ్చు (★ సాయణుడు ఇక్కడ దీనికి అగ్ని అని అర్థం ఇచ్చారు). యాస్కుడు (నిరుక్తం 10.32) ఈ మంత్ర వ్యాఖ్యానంలో సవిత వృష్టిని కలిగిస్తాడు కాబట్టే ఈయన అంతరిక్షస్థానానికి చెందినవాడు అని చెప్పి స్వర్గానికి చెందిన ఆదిత్యుణ్ణే ( = సూర్యుణ్ణే) కూడా సవిత అంటారు అని చెప్పేరు. బహుశా ఈ విశేషణం ఈయనకి ఉపయోగించబడడం వల్లా, ఒక మంత్రం (1.35.11; చూ. అధ్యాయం 15.2) లో సవిత తోవలు అంతరిక్షంలో ఉన్నాయని చెప్పబడడం వల్లా, నిఘంటువులో ఈయన పేరు ద్యుస్థాన దేవతలలోనూ అంతరిక్ష స్థాన దేవతలలోనూ కూడా ఉంది. ఒకచోట సవిత భువనానికి ప్రజాపతి (భువనస్య ప్రజాపతిః, 4,53.2) అని చెప్పబడ్డాడు. శతపథ బ్రాహ్మణం (12.3.5.1)లో జనులు సవితా ప్రజాపతీ ఒక్కరే అంటారు అని చెప్పబడింది; తైత్తిరీయ బ్రాహ్మణం (1.6.4.1)లో ప్రజాపతి సవిత అయిన జీవులని సృష్టించాడు అని చెప్పబడింది. సవిత ఒక్కడే ప్రేరణ శక్తిని ఇవ్వగల సమర్థుడు; ఆయన తన గమనాలవల్ల పూషుడు అవుతాడు (5.81.5).[5] సవిత ప్రేరణశక్తితో రక్షకుడైన పూషుడు అన్ని భువనాలూ చూస్తూ ప్రయాణిస్తాడు (అస్య పూషా ప్రసవేయాతి విద్వాన్త్సంపశ్యన్ విశ్వా భువనానిగోపాః, 10.139.1; తస్య = ఆసవిత యొక్క). ఒకదానితరవాత మరొకటిగా వచ్చే రెండు మంత్రాలలో (3.62.9, 10) పూషుడూ సవితా పరస్పర సంబంధం ఉన్నవారు అని సూచించబడింది. వీటిలో మొదటిదాంట్లో అన్ని భువనాలూ చూసే పూషుడు మాకు రక్షకుడు అవుగాక అనీ రెండోదాంట్లో సవిత యొక్క గొప్ప తేజస్సుని గురించి చింతించడానికి మా బుద్ధిని (సవిత) ప్రేరేపించుగాక అనీ ప్రార్థించబడింది.

---

5. ఉతేశిషే ప్రసవస్య త్వమేక ఇదుత పూషా భవసి దేవ యామభిః (త్వం = నువ్వు, ఏకః ఇత్ = ఒక్కడవే; ప్రసవస్య = సర్వకర్మలకీ ప్రేరణ / అనుజ్ఞ ఇవ్వడానికి, ఈశిషే = సమర్థుడవు; ఉత = ఇంకా, యామభిః = గమనాల వల్ల, పూషా = పూషుడవు, భవసి = అవుతావు).

6. యో విశ్వాభి వి పశ్యతి భువనా సం చ పశ్యతి
సనః పూషావితా భువత్ (9) (తక్కినది తర్వాతి పుటలో)

వీటిలో రెండోది ప్రసిద్ధమైన సావిత్రీమంత్రం; వేదాధ్యయన ప్రారంభంలో ఈ మంత్రంతో సవితని ధ్యానించడం సంప్రదాయంగా వస్తోంది. సవిత తన ధర్మాలవల్ల మిత్రుడు అవుతాడు అని కూడా చెప్పబడింది (5.81.4). కొన్నిచోట్ల భగశబ్దం విశేషణం అని అనుకోకపోతే సవితకీ భగుడికీ అభేదం చెప్పబడింది అనుకోవచ్చు (5.82.1, 3; 7.38.1, 6). (లాభాలు కలిగించే మంచి దేవుడైన) భగుడిపేరు సవితపేరుకి చేర్చబడి సవితాభగః/ భగః సవితా అనే ప్రయోగాలు తరచుగా ఉన్నాయి. కాని ఇతర గ్రంథాలలో మిత్రుడూ, పూషుడూ, భగుడూ - వీరికీ సవితకీ భేదం సూచించబడింది. చాలా మంత్రాలలో సవితా సూర్యుడూ ఒకరే అని చెప్పినట్లు కనపడుతుంది. ''సవిత తన జ్యోతిని పైకి తెచ్చి లోకానికంతకీ కాంతి కలిగించాడు; సూర్యుడు తన రశ్మిలలో ఆకాశాన్నీ, భూమినీ అంతరిక్షాన్నీ పూరించాడు'' (4.414.2) అని ఒక ఋషి (వామదేవుడు) అన్నారు. మరొకసూక్తం (7.63) లో 1, 2, 4 మంత్రాలలో సాధారణంగా సవితని వర్ణించే పదజాలం (ఉదా. ప్రసవీతా 'ప్రేరకుడు') సూర్యుడికి ఉపయోగించబడి ఉండగా మూడో మంత్రంలో సవిత వీరిద్దరూ ఒకటే అయినట్లు ప్రస్తావించబడ్డాడు. మరికొన్ని ఇతరసూక్తాలలో (10.158.1-4; 1.35.1-11; 1.124.1) కూడా ఈ ఇద్దరి దేవతల మధ్య భేదం ఉందని చెప్పడం కష్టం. కాని కింద ఇచ్చిన మంత్రాలవంటి వాటిలో సవితకీ సూర్యుడికీ మధ్య భేదం స్పష్టంగా సూచితమయింది.[7] ''సవిత స్వర్గమూ భూమీ - ఈ రెండింటిమధ్యా ప్రయాణిస్తాడు; రోగాలని పోగొడతాడు; సూర్యుణ్ణి ప్రేరిస్తాడు'' (హిరణ్యపాణిః సవితా విచర్షణి రుభే

---

(యః = ఏ పూషుడు, విశ్వా భువనా = అన్ని లోకాలనీ, అభివిపశ్యతి = అభిముఖ్యంతో విశేషంగా చూస్తాడో, చ = ఇంకా, సంపశ్యతి = బాగా చూస్తాడో, సః = ఆ, పూషా = పూషుడు, నః = మాకు, అవితా = రక్షకుడు, భువత్ = అవుగాక).

తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యోనః ప్రచోదయాత్ (10)

(యః = ఏ సవిత, నః = మా, ధియః = బుద్ధులు, ప్రచోదయాత్ = ప్రేరిస్తాడో, తత్ సవితుః దేవస్య = ఆ దేవుడైన సవిత యొక్క, వరేణ్యం = భజించదగిన, భర్గః = (అవిద్యని నాశనం చేసే) స్వయం జ్యోతిని, ధీమహి = ధ్యానిస్తాము). 10.139.1 (చూ. పైన) లో వీరి ఇద్దరి సంబంధం ఇంకా స్పష్టంగా చెప్పబడింది.

7. పైన ప్రస్తావించబడిన 7.63.2 మంత్రం ( ఉద్వేతి ప్రసవీతా జనానాం మహాన్ కేతు రర్ణవః సూర్యస్య) లో సూర్యస్య అనే షష్ఠీ విభక్తి రూపం సూర్యః అనే ప్రథమా విభక్తికి బదులుగా వాడబడింది అని సాయణుడు దీన్ని సూర్యపరంగా వ్యాఖ్యానించడం ఉచితంగా లేదు. ఇక్కడ జనానాం ప్రసవీతా ''జనులకు ప్రేరకుడు'', సూర్యస్యకేతుః ''సూర్యుడికి ప్రేరకుడు'' - ఈ రెండూ తరవాత మంత్రంలో స్పష్టంగా చెప్పబడిన సవితకే విశేషణాలుగా అన్వయించడం సముచితం. ఇప్పుడు ఈ మంత్రంలో కూడా వీరిద్దరి మధ్యా భేదం చెప్పబడినట్లు స్పష్టమవుతుంది.

ద్యావాపృథివీ అంతరీయతే, అపామీవాం బాధతే వేతి సూర్యం, 1.35.9) "సవిత మేం పాపులం కాము అని సూర్యుడికి చెప్తాడు (సవితా దమూనా అనాగసో వోచతి సూర్యాయ, 1.123.3). సవిత సూర్యరశ్మిలతో కలుస్తాడు (5.81.4); వాటితో ప్రకాశిస్తాడు (10.139.1; చూ. 10.181.3; 1.157.1; 7.35.8, 10). "సూర్యుడు ఉదయించిన తరవాత సవిత మిత్రుడూ, అర్యముడూ, భగుడూ - వీరితోపాటు ప్రేరించాలి" అని ప్రార్థించారు (యదద్య సూర ఉదితేఽనాగామిత్రో అర్యమా, సువాతి సవితా భగః, 7.66.4).

15.5 యాస్కుడి అభిప్రాయంలో (నిరుక్తం 12.12) సవితకి సంబంధించిన కాలం చీకటిపోయి వెలుగువచ్చేకాలం. సాయణుడు (5.81.4 వ్యాఖ్యలో) ఒకే దేవుడు ఉదయానికి పూర్వం సవితగానూ, ఉదయాస్తమయాల మధ్యకాలంలో సూర్యుడుగానూ ఉంటాడు అని చెప్పేరు. కాని సవిత కొన్నిచోట్ల (4.53.6; 7.45.1) జీవులని (తమతమ స్థానాలలో రాత్రి) పెడతాడు (నివేశయన్చ), (పగలు) ప్రేరిస్తాడు (ప్రసువన్చ) అని కూడా చెప్పబడడం వల్ల ఆయనకి ప్రాతఃకాలంతోనూ సాయంకాలంతోనూ కూడా సంబంధం ఉందని చెప్పాలి.[8] పైగా ఆయన ఒక సూక్తం (2.38) లో అస్తమించే సూర్యుడుగా స్తుతించబడ్డాడు; ఆయనని ఉద్దేశించిన సూక్తాలలో ఎక్కువసంఖ్య ప్రాతఃకాలయాగంలో కాని సాయంకాల యాగంలో కాని ఉపయోగించబడతాయి అనడానికి ఆధారాలు ఉన్నాయి. ఆయన రెండుకాళ్లుకలవారినీ / వాటినీ నాలుగు కాళ్లు కలవాటినీ విశ్రాంతి తీసుకునేటట్టు చేసి లేపుతాడు (6.71.2; చూ. 4.53.3; 7.45.1). ఆయన గుర్రాలని విప్పుతాడు; తిరిగి వాళ్లని ఆపుతాడు; ఆయన ఆజ్ఞవల్ల రాత్రి వస్తుంది; సాలీడు గూడు అల్లుతుంది; పనిచేసేవాడు పని మధ్యలో ఆపుతాడు (2.38.3, 4). తరవాత కాలంలో పశ్చిమదిక్కుని సవితకీ, తూర్పుదిక్కుని అగ్నికీ, దక్షిణదిక్కుని సోముడికీ కేటాయించడం సంప్రదాయం అయింది (శ. బ్రా. 3.2.3.18).

15.6 సవిత అనే పేరు భారతదేశంలోనే ఏర్పడినట్లు కనపడుతుంది. దీనికి మూలమైన సూ- ధాతువే ఈ పేరుతోపాటు ఋగ్వేదంలో చాలా ప్రచురంగా వాడబడడం ఈ ఊహకి ఆధారం. ఇతర దేవతల విషయంలో వారు ముఖ్యంగా చేసే పనిని సూచించడానికి

---

8. ఉత రాత్రీ ముభయతః పరీయసే (5.81.4, రాత్రిని రెండువైపులా చుట్టి ప్రయాణిస్తావు) - ఈ మంత్రంలో కూడా పై అభిప్రాయమే వ్యక్తమయింది.

సమానార్థకాలైనవేరువేరు ధాతువులు వాడబడ్డాయి. సవిత విషయంలో సూ- ధాతువు మాత్రమే కాకదానినించి వచ్చిన ఇతర నామాలు ( ప్రసవితా 'ప్రేరకుడు', ప్రసవ- ' ఆజ్ఞ, ప్రేరణ' వంటివి) కూడా శబ్దాలంకారదృష్టితో వాడబడినట్లు వాడబడ్డాయి. తరచుగా ఉన్న ఇటువంటి సహప్రయోగాలు ఈ ధాతువుకి 'ప్రేరణ కలిగించడం, లేపడం, జీవనశక్తి కలిగించడం' అనే అర్థాలు ఉన్నట్లు స్పష్టంగా సూచిస్తాయి. ఈ ప్రత్యేకమైనసహప్రయోగాలకి కొన్ని ఉదాహరణలు ఇక్కడ ఇవ్వవచ్చు. ''దేవుడైనసవితకదిలే ప్రతి పదార్థాన్నీ ప్రేరించాడు'' (ప్రాసావీద్దేవః సవితా జగత్పృథక్, 1.57.1). ''నువ్వు ఒక్కడవే ప్రేరణకు ఈశ్వరుడవు'' (ఉతేశిషే ప్రసవస్య త్వమేకః, 5.81.5). ''సవిత ఆ అమృతత్వాన్ని మీకు ఇచ్చాడు'' (తత్సవితా వోऽమృతత్వ మాసువత్, 1.110.3), ''దేవుడైన సవిత ప్రేరణ కలిగించడానికి లేచాడు'' (ఉదుష్య దేవః సవితా సవాయ .... అస్థాత్, 2.38.1). ''రోజుకి మూడుసార్లు సవిత ప్రేరించుగాక!'' (త్రిరాదివః సవితా సోషవీతి, 3.56.7). ''నువ్వు మమ్మల్ని ఇక్కడ పాపరహితులం అవడానికి అనుజ్ఞ ఇయ్యి'' (త్వం నోऽత్ర సువతా దనాగసః, 4.54.3), ''దేవుడైనసవిత ప్రేరణలో (మేం) అదితికి అపరాధం చెయ్యకుండా అన్ని ధనాలూ పొందుతాము'' (అనాగసో అదితయే దేవస్య సవితుః సవే. విశ్వా వామాని ధీమహి, 5.82.6). ''ఓ దేవుడైన సవితా! ఈ రోజు మాకు పుత్రులతో కూడిన సౌభాగ్యం కలగజెయ్యి, చెడ్డకల తొలగించు'' (అద్యానో దేవసవితః ప్రజావ త్సావీః సౌభగం, పరా దుఃష్వప్న్యం సువ, 5.82.4). '' ఓ దేవుడైన సవితా! అన్ని పాపాలూ పోగొట్టు, ఏది భద్రమో అది మాకు కలిగించు'' ( విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ, యద్భద్రం తన్న ఆ సువ, 5.82.5). ''సవిత రోగాన్ని పోగొట్టుగాక'' (అపా మీవాం సవితా సావిషత్, 10.100.8). ఈ ధాతువునించి వచ్చిన క్రియతోనే తరచుగా సవిత ధనంకోసం ప్రార్థించబడ్డాడు (3.56.6, మొ.). సూ- ధాతువునించి పుట్టిన రూపాలు సర్వసాధారణంగా సవితకే అన్వయించడం ఒక విశిష్టత; కాని రెండు మూడు చోట్ల ఈ ధాతువు సూర్యుడి విషయంలో కూడా వాడబడింది (7.63.4; 10.37.4). ఇది ఉషస్సుకీ (7.77.1), వరుణుడికీ (2.28.9), ఆదిత్యులకీ (8.18.1), సవితతోపాటు మిత్రుడికీ, అర్యముడికీ (7.66.4) కూడా అన్వయిస్తుంది. (సవితతో) ఈ ధాతువు ప్రయోగం అంతప్రచురం కావడం వల్లనే యాస్కుడు (నిరుక్తం 10.31) సవితృ శబ్దాన్ని సర్వస్య ప్రసవితా ''అంతటికీ ప్రేరకుడు'' అని నిర్వచించారు.

15.7 సవితృ శబ్దానికి ఉన్న ప్రయోగాలలో ఇంచుమించు సగం వాటిలో ఇది దేవశబ్దంతో కూడి ఉండడం ఇది ఇంకా దీని విశేషణ స్వభావాన్ని పోగొట్టుకోలేదు అనే విషయాన్ని తెలియజేస్తుంది (వ్యుత్పత్తి ప్రకారం సవితా దేవః అనే దాని అర్థం ''ప్రేరణ కలిగించే దేవుడు''). ఈ విషయం ఎలా ఉన్నా, దేవస్త్వష్టా సవితా విశ్వరూపః అని రెండుచోట్ల (3.35.19; 10.10.5) ఉన్న ప్రయోగంలో సవితా ''ప్రేరకుడు'' అనే శబ్దం త్వష్టకి విశేషణంగానే వాడబడింది.

15.8 అందువల్ల (i) సవితృశబ్దం లోకంలో అన్ని క్రియలకీ ఆధారభూతమైన సూర్యుడి ప్రేరణ శక్తినీ గమనాన్నీ సూచించే సూర్యసంబంధి విశేషణంగా భారతదేశంలో ఆవిర్భవించిందనీ, (ii) ఇది (సూర్యుడి శక్తిని సూచించేది కాబట్టి) సూర్యుడికన్న వేరైన అమూర్త దేవతని సూచిస్తుందనీ నిర్ణయించవచ్చు. వేదఋషుల దృష్టిలో సవిత సూర్యుడి దివ్యశక్తికి పురుషతారోపం; సూర్యదేవుడికీ సూర్యమండలానికీ ఉన్న సంబంధం ఎప్పుడూ మరుగున పడలేదు కాబట్టి సూర్యుడు మనం చూడగలిగిన మూర్త స్వరూపం కలవాడు (చూ. 1.35.9; 1.124.1).

15.9 ఓల్డెన్‌బెర్గ్ అనే పండితుడు సాధారణంగా అందరూ అంగీకరించిన పరిణామక్రమానికి వ్యతిరేకంగా సవిత ప్రేరణశక్తి అనే అమూర్త భావానికి ప్రతినిధి అనీ, సూర్యుడికీ లేక ఒక దిశలో ఉన్న సూర్యుడికీ ఆయనకీ మధ్య ఉన్న సంబంధం ఆయన స్వభావంలో అప్రధానమైనది మాత్రమే అనీ అభిప్రాయపడ్డారు.

## 16. పూషుడు

16.1 పూషుడి (పూషన్-) పేరు ఋగ్వేదంలో సుమారు 120 సార్లు వచ్చింది; ఆయన ఎనిమిది సూక్తాలలో స్తుతించబడ్డాడు (వీటిలో అయిదు ఆరో మండలంలోనూ, రెండు ఒకటో మండలంలోనూ, ఒకటి పదో మండలంలోనూ ఉన్నాయి). ఒక సూక్తం (6.57) లో ఇంద్రుడితోనూ మరొకసూక్తం (2.40) లో సోముడితోనూ జంటగా కూడా స్తుతించబడ్డాడు. అందువల్ల సంఖ్యల ప్రకారం ఆయనకి విష్ణువుకన్నా (అధ్యాయం 17) కొంచెం ఉన్నతస్థానం ఉంది. అర్వాచీన వేదకాలంలోనూ వేదకాలం తరవాతా ఈయనపేరు అరుదుగానే కనపడుతుంది. ఈయన ప్రత్యేకత అస్పష్టం; ఈయన పురుషతారోపలక్షణాలు స్వల్పం. ఈయన క్రూరులని అణగదొక్కాలి అని

ప్రార్థించబడినప్పుడు ఈయన పాదం గురించి ప్రస్తావన ఉంది. ఈయన కుడిచేయి కూడా ప్రస్తావించబడింది (6.54.10). (రుద్రుడిలా) ఈయనకి కొప్పులా కట్టుకొన్న జడలూ (6.55.2; కపర్దినం), గడ్డమూ (10.26౫7; శ్మశ్రు) ఉన్నాయి. ఈయనకి బంగారు ఆయుధం ఉంది (1.42.6; హిరణ్యవాశీమత్తమ); పశువుల్నితోలే ఇనపముక్కు చివరగల కర్ర ఉంది (ఆరా/ అష్ట్రా, 6.53.5, 6, 8, 9; 6.58.2). ఈయన రథానికి చక్రమూ, ఆసనమూ ఉన్నట్టు చెప్పబడింది (6.54.3 - ★ ఈ చక్రం ఆయుధం అని సాయణుడు); ఈయన మంచి రథికుడు (రథీతమం 6.55.2). ఈయన రథాన్ని గుర్రాలకి బదులు మేకలు లాగుతాయి (అజాశ్వ-, 1.138.4; 6.55.3, 4). ఈయన భక్షించేది కరంభం (★ = పెరుగుతో కలిపిన పిండి (3.52.7) / నేతితో కలిపిన బార్లీ పిండి (6.56.1) అని సాయణుడు); కాబట్టి ఈయనకి కరంభాత్ 'కరంభం తినేవాడు' అనే విశేషణం 6.56.1లో వాడబడింది. అందువల్లనే ఈయనకి పళ్ళులేవని (పూషా ప్రపిష్టభాగో౽దంతకో హి) తైత్తిరీయ సంహిత (2.6.8.5) లోనూ శ.బ్రా. (1.7.4.7) లోనూ చెప్పబడింది.

16.2 పూషుడు అన్ని లోకాలనీ స్పష్టంగా చూస్తాడు (యో విశ్వాభి విపశ్యతి భువనా సంచపశ్యతి, 3.62.9), ఇవే పదాలు అగ్నికి కూడా వాడబడ్డాయి (10.187.4). ఆయన కదిలేవీ కదలనివీ అయిన అన్నిటికీ ఈశ్వరుడు; ఇంచుమించు ఇవే పదాలు సూర్యుడికి కూడా వాడబడ్డాయి (1.115.1; 7.60.2). ఆయన తల్లికి పతి; చెల్లికి జారుడు (6.55.4, 5);[1] ఇటువంటి పదాలు సూర్యుడికీ (1.115.2), అగ్నికీ (10.3.3) కూడా వాడబడ్డాయి. దేవతలు కామంచేత వశీకృతుడైన పూషుణ్ణి సూర్య (సూర్యా= ★ సూర్యపత్ని లేక సావిత్రి అని సాయణుడు) అనే స్త్రీ దేవతకి ఇచ్చారు (యందేవాసో అదదుః సూర్యాయై, కామేనకృతం, 6.58.4). బహుశా సూర్యకి భర్త అవడం వల్లనే పూషుడికి వివాహకార్యంతో సంబంధం ఉందని వివాహ సూక్తం (10.85) లో చెప్పబడింది; పూషుడు వధువుని భర్తతో కలిపి దాంపత్యసుఖంతో ఆశీర్వదించాలి అని ప్రార్థించబడ్డాడు (10.85.37). మరొకమంత్రం (9.67.10) లో ఆయన భక్తులకి కన్యలని ఇవ్వాలని ప్రార్థించబడ్డాడు.

---

1. స్వసుర్యో జార ఉచ్యతే (4) ''చెల్లెలికి (= ఉషస్సుకి అని సాయణుడు) ఎవరు జారుడు (= ఉపపతి) అని చెప్పబడలాడో'', మాతుర్దిధిషు మబ్రువం స్వసుర్జారః శృణోతునః (5) ''తల్లి (= రాత్రి అని సాయణుడు) యొక్క పతిని (దిధిషుం) స్తుతిస్తాము; చెల్లెలికి జారుడు మాస్తుతులని విన్నాలి''. సాయణుడు కూడా పైఅర్థాలే ఇచ్చారని గమనించాలి.

సముద్రంలోనూ అంతరిక్షంలోనూ చరించే తన బంగారు నావల మీద పూషుడు కామవశీకృతుడై సూర్యుడి దూతగా ప్రయాణిస్తాడు (6.58.3).[2] ఆయన ప్రపంచాన్ని చూస్తూ ముందుకి కదులుతాడు (2.40.5; 6.58.2); ఆయన స్వర్గలోకంలో తన నివాసస్థానం చేసుకొన్నాడు (2.40.4). ఆయన సవిత ప్రేరణలో అందరినీ చూస్తూ అందరిగురించీ తెలుసుకొంటూ వెళ్లే రక్షకుడు. పూషుణ్ణి స్తుతించే మరొకసూక్తంలో గొప్ప రథికుడైన (రథీతమః) ఆయన సూర్యుడి బంగారు చక్రాన్ని కిందకి దొర్లించాడు (6.56.3) అని చెప్పబడింది; కాని ఇక్కడ సూచించబడిన సంబంధం అస్పష్టం (చూ. నిరుక్తం 2.).[3] పూషుడికి మాత్రమే తరచు వాడబడిన విశేషణం ఆఘృణి- 'ప్రకాశించేవాడు' (10.17.5) ఈయన ఒకచోట అగోహ్య- 'దాచదగనివాడు' అని కూడా చెప్పబడ్డాడు. ఈ విశేషణం ఇంచుమించు సవితకు మాత్రమే ప్రత్యేకం.

16.3 పూషుడు తోవలలో ప్రకృష్టమైన తోవలో, స్వర్గంలో ప్రకృష్టమైన తోవలో, భూమిలో ప్రకృష్టమైన తోవలో పుట్టేడు; ఆయన రెండు ప్రియతమమైన స్థానాలకీ (మనుష్యులనిగురించి) తెలుసుకొంటూ వెళ్లివస్తాడు (10.17.6).[1] ఆయనికి తోవలలో ఉన్న పరిచయం వల్ల ఆయన మృతులని పితృదేవతల దగ్గరకి, అగ్ని సవితా పుణ్యాత్ములు వెళ్లి దేవతలలో ఉండేచోటుకి వారిని తీసుకువెళ్లినట్లు, అసలు భయంలేని తోవలో దారిచూపుతే తీసుకువెళ్తాడు (10.17.3-5). అథర్వవేదం (16.9.2; 18.2.53)లో కూడా పూషుడు (మృతులని) పుణ్యాత్ముల లోకానికి, అందమైన దేవతలలోకానికి తీసుకువెళ్తాడు అని చెప్పబడిది. అందువల్ల పూషుడి మేక యాగాశ్వానికి ముందు వెళ్తూ తోవచూపుతుంది (1.162.2, 3). పూషుడి రథాన్ని జారని గిట్టలుగల మేకలాగుతుంది అనే భావనవల్ల పూషుడికి ఎగుడుదిగుడు తోవలతో పరిచయం ఉంది అనే భావన ఏర్పడి ఉండవచ్చు.

16.4 తోవలు తెలిసినవాడవడం వల్ల పూషుడు తోవలకి రక్షకుడుగా భావించబడ్డాడు.

---

2. దూత్యాం సూర్యస్య అనేదానికి "సూర్యుడి భార్య దగ్గరికి (పూషుడు వెళ్లాడు)" అని సాయణుడి వివరణ.

3. నైరయత్ అనే పదానికి సాయణుడు నితరాం ప్రేరయతిస్మ "ఎప్పుడూ ప్రేరించాడు" అని అర్థం ఇచ్చాడు (ని = నితరాం).

1. ప్రపథే పథామజనిష్ట పూషా ప్రపథే దివః ప్రపథే పృథివ్యాః
ఉభే అభి ప్రియతమే సధస్థే ఆ చ పరా చ చరతి ప్రజానన్.

ఆయన తోవలలో అపాయాలనీ, తోడేళ్లనీ, దొంగలనీ తొలగించమని ప్రార్థించబడ్డాడు (1.42.1-3). ఈ సందర్భంలో ఆయన విముచోనపాత్ 'విముక్తికి కొడుకు' అని చెప్పబడ్డాడు (1.42.1). ఇదే విశేషణం ఆయనికి మరొకచోట (6.55.1) కూడా వాడబడింది; విమోచన- 'విముక్తి కలిగించేవాడు' అనే విశేషణం కూడా ఆయనకి రెండుచోట్ల (8.4.15, 16) వాడబడింది. ఈయిన పాపాన్నించి విముక్తి కలిగించమని ప్రార్థించబడ్డాడు (అ.వే. 6.112.3). శత్రువులని తొలగించి ధనం దొరికే తోవలు చూపమనీ (6.53.4), శత్రువులని తొలగించి మంచితోవలు చేసి పంటలు పండేచోటు (సుయవసం ''మంచి మొక్కలుగల (దేశం)'') కి తీసుకువెళ్లమనీ (1.42.7-8) ప్రార్థించబడ్డాడు. ఆయన తోవలో ప్రమాదాన్ని పోగొట్టమనీ (6.53.4), స్వస్తికరమైన తోవని ఇవ్వమనీ (10.59.7) ప్రార్థించబడ్డాడు. ఆయన ప్రతితోవకీ అధిపతి (6.49.8; 6.53.1, పథసతి-). ఆయన మార్గదర్శకుడు (వాజసనేయీసంహిత 22.20). అందువల్లనే సూత్రగ్రంథాలలో అర్థార్జనకై ప్రయాణమై వెళ్లేవారూ, తోవతప్పినవారూ ఋగ్వేదంలోని 6.53 సూక్తం జపిస్తూ పూషుణ్ణి ప్రార్థించాలని చెప్పబడింది (ఆశ్వలాయన గృహ్యసూత్రం 3.7.8, 9; శాంఖాయన శ్రౌతసూత్రం 3.4.9). ఇంతేకాక, అందరు దేవతలకీ ఇతరులకీ ప్రాతఃకాలంలోనూ సాయంత్రమూ పెట్టే నైవేద్యాలలో తోవలకి అధిపతి అయిన పూషుడు తన భాగాన్ని ఇంటి గుమ్మందగ్గర గ్రహిస్తాడు (శాంఖాయనగృహ్యసూత్రం 2.14.9).

16.5 తోవలు తెలిసిన పూషుడు దాచబడిన వస్తువులు కనపడేటట్టు చేసి దొరికేటట్లు చేస్తాడు (6.48.15). ఆయన ఒకచోట (1.23.14-15; చూ. తై.సం. 3.3.9.1) గుహలో దాగి ఉన్న ఒకరాజుని (బహుశా సోముణ్ణి) వెతికి పట్టుకొన్నట్టు చెప్పబడింది. అందువల్ల సూత్రగ్రంథాలలో ఏదైనా పోయిన వస్తువుని వెతికేటప్పుడు పూషుణ్ణి అర్చించాలి అని చెప్పబడింది (ఆశ్వలాయనగృహ్యసూత్రం 3.7.9). గోవులనీ గుర్రాలనీ వెంబడించి రక్షించడమూ, తప్పిపోయిన వాటిని రప్పించడమూ ఆయన ప్రత్యేకత (6.54.5, 6, 10; 6.58.2; చూ. 10.26.3). ఆయన గోవులని గోతులో పడడం వంటి అరిష్టాలనించి కాపాడి తప్పిపోయిన వాటిని తీసుకువచ్చి రక్షిస్తాడు (6.54.7, 10). ఆయన దండం గోవులని సరియైన మార్గంలో నడిపిస్తుంది (6.53.9). ఆయన నాగటిచాలుని నియమిస్తాడు అనే భావన (4.57.7) బహుశా గోవులని సరియైన మార్గంలో నడిపించడం అనే భావనకు సంబంధించినది కావచ్చు. పూషుడు గుర్రాల్ని కూడా రక్షిస్తాడు (పూషారక్షత్వర్వతః,

6.54.5); ఆయనగొర్రెలబొచ్చుతో వస్త్రాలునేయించి వాటినిశుద్ధిచేస్తాడు (వాసోవాయో౽వీనా మా వాసాంసిమర్మృజత్, (10.26.6). అందువల్ల జంతువులు పూషుడికిపవిత్రమైనవి (6.53.10; ఆయన జంతువులని పుట్టించేవాడు అని చెప్పబడ్డాడు (మై.సం. 4.3.7; తై.బ్రా. 1.7.2.4). సూత్రగ్రంథాలలో గోవులు మేతకు వెళ్లేటప్పుడూ, తప్పిపోయినప్పుడూ పూషుణ్ణి స్తుతించే మంత్రాలు పఠించాలని విధించబడింది (శాంఖాయన గృహ్యసూత్రం 3.9).

16.6 పూషుడికి ఇతర దేవతలకి కూడా ఉపయోగించబడిన విశేషణాలు ఉపయోగించబడ్డాయి: అసుర- (5.51.11, చూ. అధ్యాయం 15, అధస్సూచిక 3). తవ్యస్- 'గొప్ప బలంకలవాడు' (5.43.9), తుర- 'వేగం కలవాడు' (5.43.9), అనర్వన్- 'ఎదురులేనివాడు' (6.48.15). ఆయన మనుష్యులకన్న అధికుడు, వైభవంలో దేవతలతో సమానుడు (పరోహిమర్త్యైరసి సమోదేవై రుతశ్రియా, 6.48.19). ఈయన ముందు వీరులు క్షీణిస్తారు (క్షయద్వీర-, 1.106.4), ఈయన రక్షకుడూ, ఓటమిలేనివాడూ (రక్షితా, అదబ్ధ- 1.89.5); యుద్ధాలలో కాపాడేవాడు (6.48.19). ఈయన లోకానికి రక్షకుడు (భువనస్యగోపాః, 10.17.3, చూ. 2.40.1). ఈయన ఋషి, యాజకులకి రక్షణ కల్పించే స్నేహితుడు, అందు యాచకులకీ ప్రాచీనుడైన స్థిరుడైన స్నేహితుడు (10.26.5, 8). ఈయన జ్ఞానం కలవాడు (మంతుమత్-, 1.42.5; విశ్వవేదాః, 1.89.6), దానగుణం కలవాడు. ఈయన దాతృత్వం తరచుగా ప్రశంసించబడింది. ఈయన చాలా ధనం కలవాడు (పురూవసు-, 8.4.15), ధనవృద్ధిని కలిగిస్తాడు (1.9.5), సుఖం కలిగిస్తాడు (మయోభువ-, 1.138.2), దానం కలిగినవాడు (మఘవా, 6.58.4; 8.4.18), అన్ని రకాల ధనాలూ ఇస్తాడు (ధనాని సుషణా కృధి, 1.42.6). ఈయన అన్నాలకు పతి, పుష్టికలిగించే మిత్రుడు (ఇనో వాజానాం పతి రినః పుష్టీనాం సఖా, 10.26.7). అశ్వినులకు ప్రత్యేకంగా వాడబడిన దస్ర- 'ఆశ్చర్యకరమైన పనులు చేసేవాడు' అనేపదం పూషుడికికొన్నిసార్లు వాడబడింది (1.42.5; 6.56.4); అదేవిధంగా సాధారణంగా ఇంద్రాగ్నులకి వాడబడిన దస్మ- 'ఆశ్చర్యకరమైనవాడు', దస్మవర్చస్- 'ఆశ్చర్యకరమైన వర్చస్సుకలవాడు' (1.42.10; 1.138.4; 6.58.4) అనే పదాలు ఈయనకి కూడా వాడబడ్డాయి.[5] రెండుచోట్ల (1.106.4; 10.64.3) నరాశంస-

5. దస్ర- అంటే 'చూడదగినవాడు' లేక 'వైరులను నాశనం చేసేవాడు' అని సాయణుడు (1.42.5 వ్యాఖ్యలో) అర్థం ఇచ్చారు. దస్మ శబ్దానికి కూడా ఆయన ఈ అర్థాలే ఇచ్చారు.

'నరులు ప్రశంసించదగినవాడు' అని చెప్పబడ్డాడు; ఈ విశేషణం సాధారణంగా అగ్నికే ప్రత్యేకం. ఈయన ఒకచోట (2.40.6) విశ్వమిన్వః ''విశ్వవ్యాపకుడు/★విశ్వానికి ప్రీతికలిగించేవాడు (సాయణుడు)'' అనిచెప్పబడ్డాడు. ఈయన ధీజవన- '(భక్తి) బుద్ధిని ప్రేరేపించేవాడు' అని చెప్పబడ్డాడు (9.88.3); భక్తిని ప్రేరించమని ప్రార్థించబడ్డాడు (2.40.6). ఆయనకర్ర ప్రార్థనలను ప్రేరించేది అనిచెప్పబడింది (6.53.8, చూ. సవిత, అధ్యాయం 15.4)[6]

16.7 పూషుడికి ప్రత్యేకంగా సంబంధించిన విశేషణాలు ఆఘృణి- 'ప్రకాశించేవాడు', అజాశ్వ- 'మేకలుగుర్రాలుగా కలవాడు', విమోచన- 'విముక్తి కలిగించేవాడు', విముచో నపాత్ 'విముక్తికి పుత్రుడు', (ఈ తరవాతవి ఒక్కొక్కసారే వచ్చాయి) పుష్టింభర- 'పుష్టికలిగించేవాడు', అనష్టపశు- 'పశువులు పోవనివాడు', అనష్టవేదస్- 'వస్తువులు పోవనివాడు', కరంభాత్ 'పెరుగుతో కలిపిన పిండి తినేవాడు'. ఈ చివరి విశేషణం ఈయనికి ఉండడం వల్ల ఈయనని తక్కువగా చూసినట్లు కనుపడుతుంది (చూ. 6.56.1; 1.138.4). ఇంద్రుడికి సోమంలా, ఋగ్వేదంలో మూడుచోట్ల వచ్చిన కరంభం (అధ్యాయం 16.1) పూషుడికి ప్రత్యేకాహారం (6.57.2). కాని ఇంద్రుడుకూడా పూషుడితో దీన్ని ఆరగిస్తాడు (3.52.7). కరంభిన్- 'కరంభంతో కూడినది' అనే పదం ఉన్న రెండు మంత్రాలలోనూ (3.52.1; 8.91.2) ఇది ఇంద్రుడికి ఇచ్చే ఆహుతికే వర్తిస్తుంది. పశుపా- 'పశువులని రక్షించేవాడు' అనే విశేషణం (6.58.2) (ఉపమానాలలోకాక) తిన్నగా అన్వయించేది పూషుడికే.

16.8 దేవతా ద్వంద్వాలలో పూషుడి పేరు సోముడితోనూ (సోమాపూషణా, 2.40.1), ఇంద్రుడితోనూ (ఇంద్రాను పూషణా, 6.57.1) మాత్రమే కలిపి స్తుతించబడింది; ఒకచోట (6.55.5) ఈయన ఇంద్రుడి సోదరుడు (భ్రాతేంద్రస్య, 6.55.5) అని చెప్పబడింది. వీరిద్దరితోనూ కాక పూషుడు తరచుగా భగుడితోనూ (1.90.4; 4.30.24; 5.41.4; 5.46.2; 10.125.2; చూ.శ.బ్రా. 11.4.3.3;

---

6. యాం పూషన్ బ్రహ్మచోదనీ మారాం బిభర్ష్యాఘృణే
(బ్రహ్మచోదనీం = స్తుతులను ప్రేరించే, ఆరాం = కర్రని, బిభర్షి = భరిస్తావు)

7. ఈ ఊహకి ఆధారం రెండోచోట్లో 'నేను నిన్ను అవమతించను' (నహిత్వాపూషన్నతిమన్యే), 'నీసఖ్యం విడవను' (నతే సఖ్యమపహ్నువే) అని ఉండడం కావచ్చు.

కాత్యాయనశ్రౌత సూత్రం 5.13.1), విష్ణువుతోనూ (1.90.5; 5.46.3; 6.21.9; 7.44.1; 10.66.5) కలిపిస్తుతించబడ్డాడు. ఈ సందర్భాలలో పూషుడి పేరు వీరి పేర్లతో ద్వంద్వసమాసంలో కలిపికాక విడిగా ఉంది. ఈయన మరికొందరు ఇతర దేవతలతో పాటు కూడా అరుదుగా స్తుతించబడ్డాడు.

16.9 పైన ఇచ్చిన ఆధారాలు పూషుడు ఏ ఒక ప్రకృతిశక్తికీ ప్రతినిధి అని స్పష్టంగా చెప్పవు.[8] కాని మొదట్లో ఉదాహరించబడిన మంత్రాలలో అనేకం ఈయనకీ సూర్యుడికీ సన్నిహిత సంబంధం ఉందనే విషయం సూచిస్తాయి. యాస్కుడు (నిరుక్తం 7.9) కూడా పూషుడు అంటే ఆదిత్యుడు (= సూర్యుడు) అని చెప్పేరు; వేదకాలం తరవాత సాహిత్యంలో పూషశబ్దం అరుదుగా సూర్యుడికి పర్యాయంగా వాడబడింది. ఒక సూర్యసంబంధి దేవత మృతుల ఆత్మలని (సవితలా) స్వర్గానికి తీసుకువెళ్లేవాడుగానూ, సాధారణంగా మార్గాలు అన్నిటికీ రక్షకుడుగానూ ఊహించబడడానికి భూమినించి దేవతలూ పుణ్యాత్ములూ నివసించే స్వర్గానికి వెళ్లే సూర్యుడితోవ ఆధారం అయి ఉండవచ్చు. మార్గరక్షకత్వ లక్షణం నించి జంతువులకు తోవచూపడం, వాటిని రక్షించడం అనే లక్షణాలు పుట్టి ఉండవచ్చు; ఇవి సాధారణంగా అభివృద్ధి కలిగించడం అనే ఆయనకున్న స్వభావానికి అంగాలే. అవెస్తాలో సూర్యసంబంధి దేవుడైన మిత్రకి పశువులని వృద్ధిచెయ్యడం, తప్పిపోయిన వాటిని వెతికి తీసుకురావడం అనే పశుపాలక లక్షణాలు ఉన్నాయి.

16.10 పూషన్ శబ్దం పుష్- 'పోషించు' అనే ధాతువు నించి వచ్చింది కాబట్టి వ్యుత్పత్తి ప్రకారం దీని అర్థం 'పోషకుడు'. ఆయన స్వభావంలోని ఈ లక్షణం విశ్వవేదస్- 'అన్నీ తెలిసినవాడు/ అన్ని సంపదలూ కలవాడు', అనష్టవేదస్-, పురూవసు- 'గొప్ప సంపదకలవాడు', పుష్టింభర- (అధ్యాయం 16.7) అనే విశేషణాలవల్లా, సంపదకోసం రక్షణకోసం తరచుగా ఉన్న ప్రార్థనలవల్లా (6.48.15, మొ.) స్పష్టమవుతుంది. ఆయన

---

8. కాని సాయణుడు (1.42.1 వ్యాఖ్యలో) ఇతరవేదాలనించి ఉదాహరిస్తూ భూమే పూషుడు (పృథివ్యా ఏవ పూషత్వాత్) అని చెప్పేరు. ఆయన వివరణ ఇలా ఉంది: ''పూషుడికి విశేషణమైన విముచోనపాత్ అంటే జలవిమోచక హేతువె మేఘం యొక్క పుత్రుడు. ఇతర వేదంలో ''అద్భ్యః పృథివీ'' (పృథివి నీటినించి పుట్టింది) అనీ ''తద్యదపాం సార ఆసీత్తత్సమహన్యత సా పృథివ్యభవత్'' (జలాల సారమే పృథివి అయింది) అనీ చెప్పబడింది. మేఘం నీటిని ధరిస్తుంది కాబట్టి మేఘపుత్రుడు అంటే నీటికి పుత్రుడు. అయితే మేఘపుత్రుడు పృథివి అవుతుంది కాని పూషుడు ఎలా అవుతాడు అంటే భూమే పూషుడు అని శ.బ్రా. 14.4.2.25లో చెప్పబడింది.'' పూషుడికి మార్గాలతో ఉన్న పరిచయం శ.బ్రా.లోని ప్రతిపాదనకి చాలా బలం ఇస్తుంది.

గొప్ప సంపదకి ఈశ్వరుడు (ఈశానం రాధసో మహః, 6.55.2), ధనధార, ధనరాశి (రాధో ధారా స్యాఘృణే వసో రాశి రజాశ్వ, 6.55.3). కాని ఆయన ఇచ్చే సంపద ఇంద్రుడూ, పర్జన్యుడూ, మరుత్తులూ ఇచ్చే సంపదలా వర్షంతో సంబంధించినది కాక కాంతితో సంబంధించినది అనే విషయాన్ని ఆఘృణి- 'ప్రకాశించేవాడు' అనే విశేషణం నొక్కి చెప్తుంది. ఆయన కలిగించే క్షేమం ఆయన మనుష్యులకీ పశువులకీ భూమిమీద ఇచ్చే రక్షణమూలంగానూ, మనుష్యులని ఆయన పరలోకంలోని సుఖస్థానాలకు తీసుకువెళ్లడం మూలంగానూ లభిస్తుంది. అందువల్ల పంటలని వృద్ధి చెయ్యడంలో వ్యక్తమయ్యే సూర్యుడి లాభదాయకమైన శక్తే పూషుడి స్వభావం గురించిన ఊహకి ఆధారమైనట్లు కనపడుతుంది.

## 17. విష్ణువు

17.1 విష్ణువు బ్రాహ్మణాలలోని ఐతిహ్యాలలో చాలా ప్రాముఖ్యం ఉన్న దేవతే అయినా ఋగ్వేదంలో ఆయనకి తక్కువ స్థానమే ఉంది. అయినా ఆయన ప్రశంస ఉన్న సూక్తాల సంఖ్యా ప్రమాణం సూచించేదానికన్నా ఎక్కువ ప్రాధాన్యమే ఆయన వ్యక్తిత్వానికి అందులో ఉంది. ఆయనకి ఉద్దేశించిన పూర్తి సూక్తాలు అయిదు మాత్రమే ఉన్నాయి; ఇవికాక మరొకసూక్తంలో కొంతభాగంలో ఆయన స్తుతించబడ్డాడు; ఆయనపేరు ఋగ్వేదంలో సుమారు 100సార్లు మాత్రమే వచ్చింది. ఈ సంఖ్యా ప్రమాణం వల్ల ఆయన నాలుగో స్థానానికిచెందిన దేవత మాత్రమే అవులాడు. విష్ణువుకి చెప్పబడిన స్వల్పమైన పురుషతారోప లక్షణాలు: ఆయన వేసే మూడు అంగలు ( = మూడుచోట్ల పాదాలు పెట్టడం; ఇది తరచు చెప్పబడింది); ఆయన పెద్ద శరీరం కలవాడు (బృహచ్ఛరీరః); బాలుడు కాని యువకుడు (యువా (అ) కుమారః, 1.155.6). ఆయన స్వభావంలో ముఖ్య లక్షణం మూడు అంగలు (లేక అడుగులు) వేస్తాడనేది (దీనికి వి- క్రమ్- అనే ధాతువు ఉపయుక్తమయింది); ఇది సుమారు పన్నెండుచోట్ల చెప్పబడింది. ఆయనకి ఉపయోగించబడిన ఉరుగాయ- 'గొప్ప గమనం కలవాడు' ఉరుక్రమ- 'పెద్ద అంగలువేసేవాడు' అనే విశేషణాలు ఈ క్రియనే సూచిస్తాయి; ఇవి కూడా సుమారు పన్నెండుచోట్ల ప్రయుక్తమయ్యాయి. ఈ మూడు అంగలతో విష్ణువు భూమిని లేక భూప్రదేశాలని అధిగమిస్తాడని వర్ణించబడింది. వీటిలో రెండు అడుగులు లేక ప్రదేశాలు మనుష్యులకు కనపడలాయి; కాని అత్యున్నతమైన మూడో అడుగు పక్షులు ఎగిరి చేరుకోడానికిగాని మనుష్యులు చూడడానికీ తెలుసుకోవడానికి

గానిసాధ్యంకానిది (1.155.5; 7.99.2). '' ఆయన మూడోపేరు ప్రకాశించేస్వర్గంలో ధరిస్తాడు'' (దధాతి... నామ తృతీయ మధిరోచనే దివః, 1.155.3) అనిచెప్పినచోట ఇదే అభిప్రాయంగూఢోక్తితో సూచితమయింది అనుకోవచ్చు. విష్ణువు అత్యున్నతస్థానం అగ్ని అత్యున్నతస్థానంతో సమానమని భావించబడింది అనడానికి ఆధారం అగ్ని అత్యున్నతమైన మూడోస్థానాన్ని విష్ణువు రక్షిస్తాడు (10.1.3); అగ్ని విష్ణువు అత్యున్నతస్థానంతో రహస్యమైన గోవులని ( = బహుశా మేఘాలని) రక్షిస్తాడు (తేనపాసి గుహ్యం నామగోనాం, 5.3.3). విష్ణువు అత్యున్నత స్థానాన్ని పండితులు స్వర్గంలో కన్నులా చూస్తారు (దివీవ చక్షు రాతతం, 1.22.20). అది ఆయన ప్రియమైనస్థానం; అక్కడ పుణ్యాత్ములు సంతోషంతో ఉంటారు; అక్కడ తేనె ఊట (మధ్వ ఉత్సః) ఉంటుంది (1.154.5); అక్కడ దేవతలు కూడా సంతోషంతో ఉంటారు (8.29.7). ఆ అత్యున్నతస్థానం ప్రకాశిస్తూ ఉంటుంది; అది ఇంద్రుడికీ విష్ణువుకీ నివాసస్థానం; అందులో పెద్దకొమ్ములు కలిగి వేగంగా కదిలే గోవులు ( = బహుశా మేఘాలు; యత్రగావో భూరిశృంగా అయాసః) ఉంటాయి; భక్తులు ఆస్థానం చేరుకోవాలని ఆశిస్తారు (1.154.6). పెద్దవైన ఆయన మూడు అడుగులలో అన్ని భువనాలూ ఉంటాయి (యస్యోరుషు త్రిషు విక్రమణేష్వధిక్షియంతి భువనాని విశ్వా, 1.154.2); అవి మధువుతో నిండి ఉంటాయి (యస్యత్రీ పూర్ణా మధునా పదాని, 1.154.4). విష్ణువు అత్యున్నత స్థానాన్ని రక్షిస్తాడు (3.55.10); అది ఆయన నివాసం అనేది ఇందులో సూచనామాత్రంగానే ఉన్నా 1.154.5లో ఈ విషయం స్పష్టంగానే చెప్పబడింది. మరొకమంత్రం (7.100.5)లో విష్ణువు ఈలోకానికిదూరంలో నివసిస్తాడని అస్పష్టంగా చెప్పబడింది. ఒకచోట (1.156.5) ఆయన త్రిషధస్థః ''మూడు స్థానాలు కలవాడు'' అని చెప్పబడ్డాడు; ఈ విశేషణం ముఖ్యంగా అగ్నికి ఉపయోగించబడింది (పేరా 35).

17.2 విష్ణువు మూడు అడుగులూ సూర్యుడిగమనాన్ని సూచిస్తాయి అనేది ఇంచుమించు అందరూ అంగీకరించారు. కాని అవి మొదట్లో వేటిని సూచించేవి? చాలామంది పాశ్చాత్య పండితులూ (మేక్స్‌మ్యుల్లర్, విట్నీ మొదలైనవారు), యాస్కుడికన్నా ప్రాచీనుడైన ఔర్ణవాభుడూ (నిరుక్తం, 12.19) అంగీకరించిన ప్రకృతి సంబద్ధమైన అర్థం ప్రకారం అవి సూర్యుడి ఉదయాన్నీ, ఆయన ఆకాశంలోని ఉన్నతస్థానంలో ఉండడాన్నీ, అస్తమయాన్నీ

సూచిస్తాయి.[1] వేరొకవివరణ ప్రకారం మూడు అడుగులు అంటే లోకంలోని మూడు విభాగాలలో (స్వర్గం, అంతరిక్షం, భూమి) సూర్యుడి గమనం; ఈ అర్థం ఋగ్వేదం తప్ప మిగిలినవేదాలలోనూ, బ్రాహ్మణాలలోనూ, వేదకాలం తరవాత సాహిత్యంలోనూ ఇవ్వబడింది; దీన్ని యాస్కుడికన్న ప్రాచీనుడైన శాకపూణి, పాశ్చాత్య పండితులలో బెర్గెయిన్, ప్రస్తుత గ్రంథకర్తా (= మేక్డొనెల్) అంగీకరించారు. విష్ణువు మూడో పదానికీ సూర్యాస్తమయానికీ సంబంధం ఉన్నట్లు ఎక్కడా చెప్పబడకపోవడం మొదటి వివరణకి బాధకం; విష్ణువు మూడోపదమే అత్యున్నత స్థానం అని చెప్పబడి ఉండడం కూడా మొదటి వివరణకి బాధకమూ రెండో వివరణకి సాధకమూ. రెండో వివరణ ఋగ్వేదంలో చెప్పబడిన ఏ విషయానికీ విరుద్ధం కాదు; పైగా అది ఇతరవేదాలకాలంనించీ సంప్రదాయ సిద్ధంగా ఉంది.

17.3 విష్ణువుకి గమనం అనే భావం ప్రత్యేక లక్షణమని మూడు అడుగులవల్లే కాక ఇతర పదాలవల్ల కూడా స్పష్టమవుతుంది. ఉరుగాయ-, ఉరుక్రమ-, అనే విశేషణాలూ (17.1), వి- క్రమ్- అనే క్రియా విష్ణువుకి మాత్రమే ప్రత్యేకంగా ఉపయోగించబడ్డాయి. ఈ క్రియ సూర్యుడికి కూడా ఉపయోగించబడింది (5.47.3). విష్ణువు ఏష- 'వేగం కలవాడు' (ఇది బృహస్పతికి ఒకచోట మాత్రమే వాడబడింది), ఏవయా- / ఏవయావన్- 'వేగంగా వెళ్లేవాడు' (మిగిలినచోట్ల ఇది మరుత్తులకి మాత్రమే వాడబడింది). వేగవంతమై దూరవ్యాపకమైనగమనం అనే పునః పునః చెప్పబడిన భావంతో క్రమయుక్తత అనే భావం కూడా కలిసి ఉంది: విష్ణువు తన మూడు అడుగులు వెయ్యడంలో ధర్మాలు పాటిస్తాడు (1.22.18).[2] క్రమపద్ధతిలో పునః పునః జన్మించే ఇతర దేవతల (అగ్ని, సోముడు, సూర్యుడు, ఉషస్సు) లా విష్ణువు కూడా క్రమతకి ప్రాచీనబీజం, సృష్టికర్త; ఆయన (అగ్ని, సూర్యుడు, ఉషస్సులలా) ప్రాచీనుడూ, నవీనుడూ కూడా (యః పూర్వ్యాయ వేధసే నవీయసే, 1.156.2-4). సూర్యదేవుడైన సవిత విషయంలో చెప్పిన మాటలతోనే

---

1. త్రిధా నిధత్తే పదం, (త్రేధాభావాయ), పృథివ్యామంతరిక్షే దివీతి
శాకపూణిః, సమారోహణే, విష్ణుపదే, గయశిరసీత్యౌర్ణవాభః (నిరుక్తం, 12.19)

2. త్రీణి పదా వి చక్రమే విష్ణుర్గోపా అదాభ్యః
అతో ధర్మాణి ధారయన్.
(గోపాః = రక్షకుడూ, అదాభ్యః = అజయ్యుడూ అయిన, విష్ణుః = విష్ణువు, ధర్మాణి = ధర్మాలను, ధారయన్ = ధరిస్తూ, త్రీణిపదా = మూడు అడుగులు, విచక్రమే = వ్యాపించాడు).

(5.81.3), ఈయన కూడా భూ ప్రదేశాలని కొలిచినట్లు చెప్పబడింది (యః పార్థివాని వి మమే రజాంసి, 1.154.1; 6.49.13). వరుణుడు సూర్యుడితో లోకాలని కొలిచాడు (5.85.5, చూ. పేరా 8.1) అనే ఉక్తిని కూడా దీనితో పోల్చవచ్చు. ఒకమంత్రం (1.155.6; చూ. 1.164.4, 48)లో విష్ణువు తన గుర్రాలని (= రోజులని) వాటి నాలుగు పేర్లతో (= ఋతువులతో) చక్రాన్ని తిప్పినట్లు కదిలించాడని వర్ణించబడింది.[3] ఇది 360 రోజులు గల సౌరమాన సంవత్సరాన్నే సూచిస్తుంది. అథర్వవేదం (5.26.7)లో ''విష్ణువు ఈయజ్ఞంలో తపస్సులని కలిగించుగాక!'' అని ప్రార్థించబడ్డాడు.[4] బ్రాహ్మణాలలో విష్ణువునించి వేరుచేయబడిన తల సూర్యుడు అని చెప్పబడింది. వేదకాలం తరవాత సాహిత్యంలో విష్ణువు ముఖ్యాయుధం చక్రం (చూ. సూర్యోజ్యోతి శ్చరతి చిత్రమాయుధం, ఋగ్వేదం 5.63.4; ఇందులో సూర్యుడు చిత్రమైన ఆయుధం అని వర్ణించబడ్డాడు), ఆయన వాహనం పక్షులకి రాజైన గరుడుడు / సుపర్ణుడు / గరుత్మంతుడు (గరుడుడు అగ్నిలా ప్రకాశిస్తాడని చెప్పబడింది; చివరి రెండు పదాలు ఋగ్వేదంలో సూర్యుడికి విశేషణాలుగా వాడబడ్డాయి. ఇక, వేదకాలం తరవాత సాహిత్యంలో విష్ణువు ఉరఃస్థలంమీద ధరించేదిగా చెప్పబడిన కౌస్తుభమణి సూర్యుడు అని కున్ (Kuhn) అనే పండితుడు వివరించారు. అందువల్ల విష్ణువుకి ఏ ప్రకృతి పదార్థంతోనూ స్పష్టమైనసంబంధం లేకపోయినా పైన ఇచ్చిన ఆధారాలవల్ల వేగవంతమైన కదలికతో (= పెద్ద అంగలతో) లోకాన్ని అంతటినీ చుట్టివచ్చే సూర్యుడే విష్ణువుగా ఊహించబడ్డాడని మనం భావించవచ్చు. ఋగ్వేదంలో కొంత ప్రచురంగా ఉండి ''చురుకుగా ఉండడం'' అనే ముఖ్యార్థం కల విష్- అనే ధాతువు నించి విష్ణుశబ్దం నిష్పన్నమైనది అనే వ్యుత్పత్తి కూడా ఈ వివరణని సమర్థిస్తుంది. ఈ వ్యుత్పత్తి ప్రకారం విష్ణువు అంటే సూర్యగమనానికి ప్రతినిధియైన ''చురుకైనవాడు'' అని అర్థం. కాని ఓల్డెన్‌బెర్గ్ సూర్యసంబంధి స్వభావం ఏదీ విష్ణువులో లేదనీ, ఆయన విశాల ప్రదేశాన్ని చుట్టివచ్చేవాడుగానే మొదటినించీ భావించబడ్డాడనీ, ఆయన మూడు అడుగులకీ సరిపోల్చదగిన దృశ్యమైన ప్రకృతి పదార్థం ఏదీ లేదనీ అభిప్రాయ పడ్డారు. ఐతిహ్యాలలో చాలావాటిని మూడింటి సముదాయంగా భావించడంలోని అభిలాషే విష్ణువు అడుగుల

---

3. చతుర్భిః సాకం నవతించ నామభిశ్చక్రం న వృత్తం వ్యతీఁరవీవిపత్.

4. విష్ణుర్యునక్తు బహుధా తపాం స్యస్మిన్‌యజ్ఞే సుయుజః స్వాహా.

ఇక్కడ 'తపాంసి' అనే పదానికి మూలగ్రంథకర్త 'వేడి' అని సామాన్యార్థం ఇచ్చారు. ఈ అర్థం సందర్భోచితంగా లేదు. దీనికి 'తపస్సులు > స్తుతులు / మంత్రాలు' అని ఇక్కడ అర్థం చెప్పడం సముచితం.

సంఖ్య మూడు అని చెప్పడానికి కారణమని ఆయన అన్నారు.

17.4 పైనచెప్పినట్లు విష్ణువు అత్యున్నతపాదమే ఆయన ప్రత్యేకస్థానంగా భావించబడింది. సూర్యుడు మిగిలినచోట్లలోకన్నా ఆకాశం మధ్యభాగంలో నేస్థిరంగా ఉన్నాడు అనుకోవడం సహజంగా ఉంటుంది. అందువల్లనే యాస్కుడు (చూ. 17లో అథస్సూచిక 1) ఆకాశమధ్యభాగాన్ని విష్ణుపదం అన్నారు. ఒకే సూక్తం (1.154.2-3)లో విష్ణువుకి ఉపయోగించబడినగిరిక్షిత్-, గిరిష్ఠా- 'పర్వతం మీదఉండేవాడు' అనేవిశేషణాలు కూడా ఈభావాల పరిధికిసంబంధించినవేకావచ్చు; తరవాతసూక్తంలో ''అజయ్యులైన(విష్ణువూ, ఇంద్రుడూ) మంచి గుర్రంమీద ఎక్కి వెళ్లినట్లు పర్వతాల శిఖరం మీద ఉన్నారు'' అని చెప్పబడడం దీనికి అనుసంధించుకోవాలి (యా సానుని పర్వతానా మదాభ్యా మహస్తస్థతు రర్వతేవ సాధునా, 1.155.1). ఇది మేఘాలనే పర్వతాల ఉన్నతస్థానంలో సూర్యుడు ఉండడాన్ని సూచిస్తుంది (చూ. 5.64.4). ఋగ్వేదంలోని ఇటువంటి వర్ణనల వల్లే తరవాతకాలంలో (యజుర్వేదంలో) విష్ణువు పర్వతాలకి అధిపతి అని చెప్పబడ్డాడు (విష్ణుః పర్వతానాం మరుతో గణానా మధిపతయస్తేమాఽవంతు, తై.సం. 3.4.5.1).

17.5 విష్ణువు మూడు అడుగులు వెయ్యడానికి గల కారణం ఆయన స్వభావంలో ద్వితీయశ్రేణికిచెందిన ఒకలక్షణం. ఆయన భూప్రదేశాలని మూడుసార్లు కష్టంలో ఉన్న మనుష్యుడికోసం ఆక్రమించాడు (మనవే బాధితాయ, 6.49.13), ఆయన మనుష్యుడికి నివాసం కోసం ఇవ్వడానికి భూమిని ఆక్రమించాడు 1.100.4); ఆయన భూప్రదేశాలని విశాలమైన నివాసంకోసం ఆక్రమించాడు (1.155.4); ఇంద్రుడూ విష్ణువూ మన జీవనం కోసం లోకాలని విస్తీర్ణం చేశారు (6.69.5, 6). మహాభారతంలోనూ పురాణాలలోనూ ఉన్న విష్ణువు వామనావతార కథకు బీజం పై ఋగ్వేదమంత్రాలలో ఉంది. ఈ రెండిటికీ మధ్య దశ బ్రాహ్మణాలలో ఉంది; వాటిలో విష్ణువు భూమిని అసురుల నించి తీసుకొని దేవతలకి ఇవ్వడానికి వామనావతారం ఎత్తి మూడడుగులతో వ్యాపించాడని చెప్పబడింది (స ఏతం విష్ణు ర్వామన మపశ్యత్, తై.సం. 2.1.3.1; తై.బ్రా. 1.6.1.5; శ.బ్రా. 1.2.5.5).

17.6 విష్ణువు స్వభావంలో ద్వితీయశ్రేణికి చెందిన లక్షణాలలో ముఖ్యమైనది ఇంద్రుడితో ఆయన స్నేహం; వృత్రుడితో యుద్ధంలో ఇంద్రుడికి ఆయన సహాయం

చేశాడు. ఇంద్రుడికీ విష్ణువుకీ ఉన్న సాన్నిహిత్యం ఈకింది విషయాల వల్ల తెలుస్తుంది. (i) వీరి ఇద్దరికీ ఒకపూర్తి సూక్తం (6.69) ఉద్దేశించబడి ఉంది; (ii) ఇంద్రుడి పేరూ, విష్ణువు పేరూ కలిసి ఉన్న దేవతాద్వంద్వ సమాసం ( ఇంద్రావిష్ణూ- ) ఇంద్రుడిపేరు సోముడిపేరూ కలిసి ఉన్న దేవతాద్వంద్వం సమాసమంత ప్రచురంగా ప్రయుక్తమయింది; కాని విడిగా వచ్చినప్పుడు సోముడిపేరు విష్ణువు పేరుకన్న ఋగ్వేదంలో చాలా ప్రచురం; (iii) విష్ణువుని ముఖ్యుడుగా స్తుతించే సూక్తాలలో వాచ్యంగా కాని (7.99.5, 6; 1.155.2) సందర్భానుసారంగా కాని (7.99.4; 1.154.6; 1.155.1; చూ. 1.61.7) స్మరించబడిన ఇతర దేవత ఇంద్రుడొక్కడే. విష్ణువు ఇంద్రుడిశక్తి వల్ల ( ఓజసా) మూడడుగులు వేశాడు (8.12.27); దీనిముందు మంత్రం (8.12.26) లో ఇంద్రుడు వృత్రుణ్ణి చంపినట్లు చెప్పబడింది; విష్ణువు ఇంద్రుడికోసం మూడు అడుగులు వేసినట్లు వాలఖిల్యసూక్తం (ఋగ్వేదం 8.49.4.3) లో చెప్పబడింది. వృత్రుణ్ణి చంపబోయేముందు ఇంద్రుడు ''మిత్రుడైన విష్ణూ! విశేషంగా వ్యాపించు ( విక్రమించు)'' అన్నాడు ( అథాబ్రవీ ద్వృత్ర మింద్రో హనిష్యన్ త్సఖే విష్ణో వితరం విక్రమస్వ, 4.18.11). విష్ణువు సహాయంతో ఇంద్రుడు వృత్రుణ్ణి చంపేడు (6.20.2). ఇంద్రావిష్ణువులు వృషశిప్రుడు అనే రాక్షసుణ్ణి జయించారు ( దాసస్యచి ద్వృషశిప్రస్య మాయా జఘ్నథుః, 5.99.4); శంబరుడి 99 పురాలు నాశనం చేశారు ( శంబరస్య నవపురో నవతించ శ్నథిష్టం, 5.99.5); వర్చిన్ అనే రాక్షసుడి వందలు వేల సంఖ్యలోని వీరులని చంపేరు ( శతం వర్చినః సహస్రంచసాకం హథో అప్రత్యసురస్య వీరాన్, 5.99.5). విష్ణువు ఇంద్రుడికి అనుకూలుడైన స్నేహితుడు ( ఇంద్రస్య యుజ్యః సఖా, 1.22.19). ఆయన తన స్నేహితుడితో కలిసి ఆవులు ఉండేచోటుని తెరుస్తాడు (1.156.4). శ.బ్రా. (5.5.5.1) లో విష్ణువు వెనక వస్తూ ఉండగా ఇంద్రుడు వజ్రాన్ని వృత్రుడిమీదకి వేసినట్లు వర్ణించబడింది ( చూ. తై.సం. 6.5.1.1.). విష్ణువు ఇంద్రుడితోపాటు చాలా విడివిడి మంత్రాలలో స్తుతించబడ్డాడు (4.2.4; 4.55.4; 8.10.2; 10.66.4). ఇంద్రావిష్ణువులు దేవతాద్వంద్వంగా చెప్పబడినచోట విష్ణువుకి కూడా ఇంద్రుడిలా సోమపానశక్తి ఉన్నట్లూ (6.69), ఇంద్రుడి విజయాలలో ఆయనకి భాగం ఉన్నట్లూ (7.9.4-6) చెప్పబడింది. అలాగే విష్ణువు వ్యాపకశక్తిలో ఇంద్రుడికి భాగం ఉంది (6.69.5; 7.99.6). ఈ ఇద్దరూ కలిసే అంతరిక్షాన్ని సృష్టించినట్లూ, లోకాలని విశాలం చేసినట్లూ (6.69.5), సూర్యుణ్ణీ, ఉషస్సునీ అగ్నినీ సృష్టించినట్లూ

(7.99.4) చెప్పబడింది. ఈ స్నేహంవల్ల ఇంద్రుడు విష్ణువుతో కలిసి సోమం తాగుతాడు (8.3.8; 8.12.16); దానివల్ల శక్తి పొందుతాడు (8.3.8; 10.113.2). ఇంద్రుడు విష్ణువు తయారుచేసిన సోమాన్ని మూడు పాత్రలలో తాగేడు (2.22.1; చూ. 6.17.11);[5] ఈ ఉక్తి విష్ణువు మూడు అడుగులు మధువుతో నిండి ఉన్నాయి అనే ఉక్తిని జ్ఞాపకం చేస్తుంది (1.154.4). విష్ణువు ఇంద్రుడికోసం 100 దున్నపోతులనీ (పాలతో చేసిన పానాన్నీ) వండుతాడు (6.17.11; 8.12.8; 8.77.10; చూ. 1.61.7).[6] మిత్రుడూ, వరుణుడూ, మరుత్తులతో కలిసి విష్ణువు ఇంద్రుణ్ణి స్తుతిస్తాడు (8.15.9).

17.7 ఇంద్రుడికి వృత్రయుద్ధంలో సహాయం చేసే మరుత్తులకి విష్ణువుతో కూడా సాహచర్యం ఉంది. విష్ణువు మదం కలిగించే సోమాన్ని కోరినప్పుడు మరుత్తులు పక్షులలా వచ్చి ప్రియమైన దర్భలమీద కూచుంటారు (1.85.7). విష్ణువుకి హోమం చేసేటప్పుడు మరుత్తులని కూడా ఆహ్వానిస్తారు (2.34.11; చూ. 7.40.5). మరుత్తులు విష్ణువుకి సంబంధించిన (ఉదకాన్ని) ఇచ్చేవారు (8.20.3). పూషుడూ విష్ణువూ ఇంద్రుడికోసం 100 దున్నపోతులని వండేరు. మరుత్తులు ఇంద్రుడికి సహాయం చేశారు (6.17.11). మరుత్తులకు సంబంధించిన విష్ణువుని వరుణుడూ అశ్వినులూ సేవిస్తారు (1.156.4). ఒకసూక్తం (5.87; ముఖ్యంగా 4, 5 మంత్రాలు) అంతటిలోనూ విష్ణువుకీ మరుత్తులకీ ఉన్న సాహచర్యం చెప్పబడింది; ఆయన మరుత్తులతో బయల్దేరి వేగంగా ప్రయాణిస్తాడు.

17.8 విష్ణువు గురించి ఒక్కొక్క మంత్రంలో మాత్రమే చెప్పబడిన విషయాలలో ఒకటి ఆయనకి వేరు వేరు రూపాలు ఉన్నాయి అనేది: "ఈ రూపం మానించి దాచకు; ఎందువల్లనంటే నువ్వు యుద్ధంలో అన్యరూపుడవు అవుతావు" (మా వర్పో అస్మదపగూహ ఏతద్యదన్యరూపః సమిథే బభూథ, 7.100.6; వర్పః = రూపం). ఆయన గర్భాలకి రక్షకుడు (శిపివిష్ట-, 7.36.9); ఆయనని ఇతరదేవతలతోపాటు గర్భధారణకోసం ప్రార్థించారు (విష్ణుర్యోనిం కల్పయతు, 10.184.1). 10.184 తరవాత వచ్చే ఖిలసూక్తాల (30)లో మూడోదాంట్లో విష్ణువు యొక్క శ్రేష్ఠమైనరూపం గల మొగపిల్లవాణ్ణి కలిగించమని

5. సోమ మపిబ ద్విష్ణునా సుతం (2.22.1) - దీనికి సాయణుడు "పిండబడిన సోమాన్ని విష్ణువుతో కలిసి (విష్ణునాసహ) ఇంద్రుడు తాగేడు" అని అర్థం చెప్పేరు. మంత్రంలో పదాలకి రెండు అర్థాలూ సాధ్యమే.

6. పచ చ్ఛతం మహిషాన్ ఇంద్రతుభ్యం పూషా విష్ణుః (6.17.11; పచత్ = వండేడు). పైన ఇచ్చిన అర్థం సాయణాచార్యసమ్మతమే (మహిషాన్ = పుంపశూన్).

ప్రార్థన ఉంది (విష్ణోః శ్రేష్ఠేన రూపేణాస్యాం నార్యాంగవీన్యాం, పుమాసం పుత్రానా ధేహి దశమే మాసి సూతవే) ఇందులో మొదటిపదం విష్ణో అనిపాఠాంతరం ఉంది; దాని అర్థం ''విష్ణూ! మంచిరూపం గల మొగపిల్లవాణ్ణి కలిగించు!.

17.9 విష్ణువు ఇతర లక్షణాలు అందరి దేవతలకీ ఉన్నవే. ఆయన మేలుచేసేవాడు (సుకృత్తరః, 1.156.5), అపకారం చెయ్యనివాడు (అఘ్నతే), మంచిదానం కలవాడు (సుదానవే, 8.25.12), రక్షకుడు (గోపాః, 3.55.10), ఎవరూ జయించలేనివాడు (అదాభ్యః, 1.22.18), హింసించనివాడు (అవృకస్య), దానం ఇచ్చేవాడు (మీఢుషః, 1.155.4). ఆయన ఒక్కడే భూమినీ, ఆకాశాన్నీ, అన్ని భువనాలనీ ధరించాడు (పృథివీ ముతద్యా మేకో దాధార భువనాని విశ్వా, 1.154.4). ఆయన భూమిని పర్వతాల రూపంతో ధరించాడు (దాధర్థ పృథివీ మభితో మయూఖైః, 7.99.3).[7] ఆయన ఆజ్ఞాపకుడు (వేధసః, 1.156.4)

17.10 బ్రాహ్మణాలలో విష్ణువు తనమూడు అడుగులని భూమిమీదా, అంతరిక్షంలోనూ స్వర్గంలోనూ వేస్తాడని చెప్పబడింది (శ.బ్రా. 1.9.3.9; తై.బ్రా. 3.1.2.7). యజ్ఞం చేసే ఆయనవిష్ణువుని అనుకరిస్తూ మూడు అడుగులు వేస్తాడు; ఇవి భూమితో ప్రారంభమూ గమ్యమూ, రక్షణస్థానమూ, సూర్యుడితో అభిన్నమూ అయినస్వర్గంతో అంతమవుతాయి (శ.బ్రా. 1.9.3.10, 15). ఇదేవిధంగా అవెస్తాలో చెప్పబడిన యాగంలో అంషస్పందేస్ భూమినుంచి సూర్యమండలం దాకా వేసిన మూడడుగులు అనుకరించబడతాయి. యజ్ఞానికీ విష్ణువుకీ అభిన్నత్వం చెప్పడం బ్రాహ్మణాల ఒక ముఖ్య లక్షణం (యజ్ఞోవై విష్ణుః).

17.11 ఋగ్వేదంలో బీజాలు ఉన్న విష్ణువుకిసంబంధించినరెండుగాథలు బ్రాహ్మణాలలో ఇంకా విస్తరించబడ్డాయి. విష్ణువు ఇంద్రుడితో కలిసి రాక్షసులని జయించినట్లు ఋగ్వేదంలో వర్ణించబడింది. బ్రాహ్మణాలలో దేవతలూ రాక్షసులూ పరస్పర శత్రుత్వం గల రెండు సముదాయాలుగా కనపడతారు; కాని దేవతలు ఋగ్వేదంలో ఉన్నట్లు ఎప్పుడూ జయం పొందేవారు కాక తరచు ఓడిపోతూ ఉంటారు. అందువల్ల వారు వారి ఆధిక్యం తిరిగి పొందడానికికృత్రిమోపాయాలుపన్నుతూ ఉంటారు. ఐ.బ్రా. (6.15) ప్రకారం ఇంద్రుడూ విష్ణువూ అసురులతో యుద్ధంలో విష్ణువు మూడు అడుగులతో ఆక్రమించగలిగిన ప్రదేశం

7. మయూఖైః అంటే పర్వతాలలో అని సాయణుడు; మూలగ్రంథకర్త ''కొయ్యముక్కలతో'' అని అర్థం ఇచ్చారు.

తమకు చెందాలని ఒప్పందం ఏర్పరచుకొంటారు; విష్ణువు ఈ లోకాలనీ, వేదాలనీ, వాక్కునీ ఆక్రమించాడు. శ.బ్రా. (1.2.5) చెప్పిన కథ: అసురులు దేవతలని జయించి భూమిని విడదియ్యడం మొదలు పెట్టారు. యజ్ఞమే అయిన విష్ణువుని నాయకుడుగా చేసుకొని దేవతలు వచ్చి భూమిలో భాగం అడిగేరు. పొట్టివాడైన విష్ణువు పడుకోగలిగినంత భూమిని ఇవ్వడానికిఅసురులు అంగీకరించారు. అప్పుడు యజ్ఞంతో సమానమైనఆకారంగల విష్ణువుతో కలిసి దేవతలు యజ్ఞంచేసి భూమినంతటినీ పొందేరు. ఇక్కడ మూడు అడుగులని గురించిన ప్రసక్తి లేదు కాని మరొకచోట (శ.బ్రా. 1.9.3.9) విష్ణువు మూడులోకాలనీ ఆక్రమించి దానివల్ల దేవతలకి ఇప్పుడున్న సర్వవ్యాపకశక్తి సంపాదించి ఇచ్చాడని చెప్పబడింది. తై.సం. (2.1.3.1) లో విష్ణువు తాను చూసినపొట్టివాడి ఆకారం ధరించి మూడులోకాలనీ జయించాడని చెప్పబడింది (చూ. తై.బ్రా. 1.6.1.5). విష్ణువు పొట్టివాడుగా రూపమెత్తడం అసురులకి అనుమానం రాకుండా ఉండడానికిచేసినపన్నుగడ అని చెప్పాలి. వేదకాలపు తరవాతసాహిత్యంలో విష్ణువు వామనావతారానికిఈ బ్రాహ్మణాలలో కథ మధ్యమ సోపానం.

17.12 బ్రాహ్మణాలలోని ఇంకొకగాథకు బీజం ఋగ్వేదంలో రెండు మంత్రాలలో (1.61.7; 8.77.10) ఉంది. వీటి భావం: విష్ణువు సోమంతాగి, ఇంద్రుడిచేత ప్రేరితుడై, వరాహానికి (= వృత్రుడికి) చెందిన 100 దున్నపోతులనీ పాయసాన్నీ అపహరించాడు; పర్వతాన్ని (= మేఘాన్ని) ఛేదించే ఇంద్రుడు ఆ భయంకరమైన (ఏముషం) వరాహాన్ని చంపేడు: ఈగాథ తై.సం. (6.2.4.2, 3) లో ఇలా విపులీకరించబడింది: ''ఒకవరాహం అసురులధనం అపహరించి ఏడుకొండలకి అవతలవైపున దాచింది. ఇంద్రుడు దర్భలకట్టతో ఏడుకొండలని బద్దలుకొట్టి వరాహాన్ని చంపేడు. యజ్ఞమే అయిన విష్ణువు ఆ ధనాన్ని యజ్ఞంగా తీసుకువచ్చాడు. అందువల్ల దేవతలు అసురుల ధనం పొందేరు.'' కాఠక సంహితలో ఆ వరాహం పేరు ఏమూష-. కొన్ని చిన్న చిన్న మార్పులతో ఇదే కథ చరకబ్రాహ్మణంలో ఉంది (దీన్ని సాయణుడు 8.77.10 వ్యాఖ్యలో ఉద్ధరించారు).[8]

---

8. చరకబ్రాహ్మణంలోని కథ: విష్ణువే యజ్ఞం. ఆయన దేవతలకి కనపడకుండా దాగుకొన్నాడు. ఆయన ఇతర దేవతలకి కనపడలేదు కాని ఇంద్రుడికి కనపడ్డాడు. ఆయన ఇంద్రుణ్ణి ''నువ్వు ఎవరు?'' అని అడిగేడు. ఆయనతో ఇంద్రుడు ''నేను దుర్గాలనీ అసురులనీ చంపేవాడినీ. నువ్వు ఎవరు?'' అన్నాడు. ఆయన 'నేను దుర్గాన్నించి తెచ్చేవాడిని, నువ్వు దుర్గాలనీ అసురులనీ చంపేవాడివైతే ధనాన్ని దొంగిలించిన ఈ వరాహం రాళ్లతో కట్టిన 21

విశ్వసృష్టిలో పాత్ర ఉన్న వరాహం గురించి శ.బ్రా. (14.1.2.11) లో చెప్పబడింది; ఏమూష- అనే పేరుగల ఆ వరాహం భూమిని నీళ్లలోంచి పైకెత్తినట్లు అందులో ఉంది. తై.సం. (7.1.5.1) లో నీళ్లలోంచి భూమిని పైకెత్తిన వరాహం ప్రజాపతి అవతారమని చెప్పబడింది. ఈగాథలోని ఈమార్పు తై.బ్రా. (1.1.3.5) లో ఇంకా విస్తరించబడింది. వేదకాలం తరవాతకాలానికిచెందినరామాయణంలోనూ పురాణాలలోనూ ఈ వరాహం విష్ణువు అవతారాలలో ఒకటైంది.

17.13 బ్రాహ్మణాలలో విష్ణువు మరి రెండు అవతారాలకి బీజాలు ఉన్నాయి; కాని వాటికీ విష్ణువుకీ అప్పటికి సంబంధం లేదు. శ.బ్రా. (1.8.1.1) లో మనువుని ప్రళయం నించి కాపాడిన చేప మహాభారతంలో ప్రజాపతి ఒక రూపంగానూ, పురాణాలలో విష్ణువు అవతారంగానూ మారింది. శ.బ్రా. (7.5.1.5; చూ.తై. ఆ. 1.23.3) ప్రకారం సంతానాన్ని పుట్టించదలుచుకొన్న ప్రజాపతి ప్రాచీనజలాలలో తిరగేలాబేలుగా మారతాడు. ప్రళయంలో కొట్టుకుపోయిన అనేక వస్తువులని సంగ్రహించడానికి విష్ణువే ఈ తాబేలుగా అవతారం ఎత్తేడని పురాణాలు చెప్తాయి.

17.14 శ.బ్రా. (14.1.1) లో యజ్ఞమే అయిన విష్ణువు యజ్ఞం ప్రాముఖ్యం మొదట తెలుసుకొన్నవాడవడం వల్ల ఆయన దేవతలు అందరిలోకీ గొప్పవాడు అయ్యాడనీ, ఆయన ధనుస్సు విరగడం వల్ల ఆయన తల తెగి అది సూర్యుడు (= ఆదిత్యుడు) అయిందనీ ఒక కథ ఉంది. ఈ కథకి తై. ఆ. (5.1.1-7) వైద్యులైన అశ్వినులు యజ్ఞానికి వేరేతల ఏర్పరచడం వల్ల దేవతలు యజ్ఞాన్ని పూర్తిరూపంలో చేయగలిగి స్వర్గాన్ని జయించారనే అంశాన్ని చేర్చింది (చూ. పం.బ్రా. 7.5.5).

17.15 ఐ.బ్రా. (1.1) లో వారువారు ఉండేస్థానం దృష్ట్యా విష్ణువు ఉన్నతుడనీ అగ్ని అందరికీ కింద ఉండేవాడనీ వీరిద్దరికీ తారతమ్యం చెప్పబడింది; మిగిలిన అందరు దేవతలూ వీరిద్దరి మధ్యా ఉంటారు. అదే బ్రాహ్మణం (1.30) ''స్నేహితుడితో కూడిన విష్ణువు గోవులు ఉండేస్థానాన్ని తెరుస్తాడు'' (వ్రజంచ విష్ణుః సఖివాన్ అపోర్ణుతే, 1.156.4) అని ఉన్న ఋగ్వేదమంత్రాన్ని ఉద్ధరిస్తూ విష్ణువు దేవతలకి ద్వారపాలకుడు అని చెప్పింది.

---

పురాలు అవతల ఉంది; దాని దగ్గిర అసురుల ధనం ఉంది; దాన్ని చంపు'' అన్నాడు. ఇంద్రుడు ఆ పురాలని భేదించి దాని హృదయం పగలగొట్టేడు. అక్కడ ఉన్నది ఆ విష్ణువు తెచ్చేడు.

## 18. వివస్వత్తు.

18.1 వివస్వత్తు (వివస్వత్-) ఋగ్వేదంలో ఏ ప్రత్యేకసూక్తంలోనూ స్తుతించబడలేదు కాని ఆయనపేరు అందులో సుమారు ముప్పైసార్లు వచ్చింది; సాధారణంగా ఈ పదంలో రెండో అచ్చు ఉదాత్తం (వివస్వత్-), కాని అయిదు ప్రయోగాలలో ఇందులో మొదటి అచ్చు ఉదాత్తంగా ఉంది. ఆయన అశ్వినులకీ (10.17.2), యమునికీ (10.14.5; 10.17.1) తండ్రి. వేదకాలంతరవారసాహిత్యంలోలా వేదాలలోనే ఆయన మానవజాతికి ఆదిపురుషుడైన మనువు (అధ్యాయం 50) కి తండ్రి అని చెప్పబడ్డాడు; మనువుకే వివస్వత్తు అనే పేరు ఒకచోట (వాలఖిల్య 4.1) వాడబడింది; అథర్వవేదంలోనూ శ.బ్రా. లోనూ మనువు వైవస్వతుడని చెప్పబడింది. మానవులు కూడా ఆదిత్యుడైన వివస్వత్తు సంతానమే అని తై.సం. (6.5.6.2), శ.బ్రా. (3.1.3.4) లలో చెప్పబడింది. ఒకచోట (10.63.1) దేవతలు కూడా వివస్వత్తు సంతానమే అని చెప్పబడింది. త్వష్ట కూతురైన సరణ్యు (సరణ్యూ-) వివస్వత్తు భార్య (10.17.1, 2).

18.2 వివస్వత్తుకీ మాతరిశ్వుడికీ అగ్ని మొదట కనపడ్డాడు (1.31.3). వివస్వత్తు దూత మాతరిశ్వుడని ఒకచోట (6.8.4) ఉంది కాని సాధారణంగా ఆయన దూత అగ్ని (1.58.2; 4.7.4; 8.39.3; 10.21.5). ఒకచోట (5.11.3) తన తల్లిదండ్రులనించి (= అగ్నిని పుట్టించే కర్రలైన అరణులనించి) పుట్టిన అగ్ని వివస్వత్తు యొక్క కవి (= ఋషి) అని చెప్పబడ్డాడు.

18.3 వివస్వత్తు స్థానం (సదన-) ఐదుచోట్ల చెప్పబడింది. దేవతలూ (10.12.7), ఇంద్రుడూ (3.51.3) ఆస్థానంలో కూచుని ఆనందిస్తారు; అక్కడ గాయకులు ఇంద్రుడి (1.53.1; 3.34.7) లేక జలాల (10.75.1) గొప్పతనాన్ని కీర్తిస్తారు. వివస్వత్తు కేంద్రం (నాభా) అయినచోట ఒక కొత్తసూక్తం తయారుచేయబడిందని చెప్పినచోట (1.139.1) బహుశా ఈ అభిప్రాయమే సూచితమై ఉంటుంది.

18.4 ఋగ్వేదంలో చాలా సందర్భాలలో వివస్వత్తుకీ ఇంద్రుడికీ సంబంధం సూచితమైంది. ఇంద్రుడు వివస్వత్తు స్తుతికి ఆనందిస్తాడు (8.6.39); ఆయన తన ధనాన్ని వివస్వత్తుకి ఇస్తాడు (2.13.6). వివస్వత్తు పది (వేళ్లతో) ఇంద్రుడు ఆకాశాన్నించి

మేఘాన్ని వంచి వర్షించేటట్టు చేస్తాడు (?8.61.8; చూ. 5.53.6). వివస్వత్తుస్థానంతో ఇంద్రుడికి అంతసన్నిహితసంబంధం ఉండడం వల్ల సోముడు కూడా అక్కడ ఉండడం సహజం. సోముడికీ వివస్వత్తుకీ సంబంధం తొమ్మిదో మండలంలో చెప్పబడింది. సోముడు వివస్వత్తుతో నివసిస్తాడు (9.26.4); వివస్వత్తు కూతుళ్లచేత (=వేళ్లతో) శుభ్రం చేయబడతాడు (9.14.5). వివస్వత్తు ప్రార్థనలు పసుపు గోధుమరంగులు గల సోమం ప్రవహించేటట్టు చేస్తాయి (9.99.2). ఏడుగురు అక్కచెల్లెళ్లు (= నదులు) సోమం వివస్వత్తు మార్గంలో ప్రవహించేటట్టు చేస్తారు (9.66.8). వివస్వత్తు (ఆశీస్సు) పొంది. ఉషస్సు ఆశీస్సు (భగం) కలగజేస్తూ సోమప్రవాహాలు జల్లెడలో ప్రవహిస్తాయి (9.10.5).

18.5 వివస్వత్తులో ఉండే అశ్వినులు యజ్ఞానికి రమ్మని ప్రార్థించబడతారు (1.46.13). ఋభువులు చేసిన అశ్వినుల రథం పూన్చేటప్పుడు ఆకాశం యొక్క పుత్రికా (= ఉషస్సు) వివస్వత్తు యొక్క ప్రకాశించే రెండు రోజులూ (= బహుశా పగలూ, రాత్రీ) పుడతాయి (10.39.12; చూ. శ. బ్రా. 10.5.2.4).

18.6 వివస్వత్తు కూడా వరుణుడు మొదలైన దేవతలతోపాటు పూజనీయుడు (10.65.6). ఒక మంత్రంలో వివస్వత్తుకి అపకారం చేసే లక్షణం కనపడుతుంది; అందులో ఆదిత్యులని పూజిస్తూ భక్తులు వివస్వత్తు పదునైన బాణం తమని ముసలితనానికి ముందు చంపకూడదని ప్రార్థిస్తారు (?8.56.20; చూ. అ.వే. 19.9.7). దీనికివ్యతిరేకంగా, వివస్వత్తు యముడినించి కాపాడతాడని కూడా చెప్పబడింది (అ.వే. 18.3.62).

18.7 వివస్వత్- అనేపదం ''ప్రకాశించే'' అనే అర్థంతో అగ్నికీ, ఉషస్సుకీ విశేషణంగా కొన్నిసార్లు వాడబడింది. అగ్ని మనుష్యుల సంతానాన్నీ, తన కాంతితో స్వర్గాన్నీ జలాలనీ పుట్టించినట్లు చెప్పబడింది (వివస్వతా చక్షసా ''ప్రకాశించే తేజస్సుతో'', 1.96.2). అగ్ని తెలివైనవాడు, హద్దులులేనివాడు, ప్రకాశించే (వివస్వాన్) కవి; ఆయన ఉషస్సు ముందు ప్రకాశిస్తాడు (7.9.3). అగ్ని ఉషస్సు యొక్క ప్రకాశించే ధనం తెమ్మని ప్రార్థించబడ్డాడు (అగ్నే వివస్వదుషస శ్చిత్రం రాధో అమర్త్య, 1.44.1; రాధః = ధనం). మనుష్యులు ప్రకాశించే ఉషస్సు యొక్క చిత్రమైన ముఖం చూడాలని కోరతారు (దిదృక్షంత ఉషసోయామన్నక్తో ర్వివస్వత్యా మహి చిత్రమనీకం, 3.30.13). ''ప్రకాశించు'' అనే వ్యుత్పత్త్యర్థం (వి అనే ఉపసర్గ + వస్-) ఇదే ధాతువునించి వచ్చిన ఉషస్సుకి చాలా బాగా

అన్వయిస్తుంది; ఉషస్- శబ్దంతో మాత్రమే ''ప్రకాశించడం, ఉషఃకాలం'' అనే అర్థాలుగల వి ఉష్-, వి ఉష్టి అనే పదాలు ఎక్కువగా వాడబడ్డాయి. ఆదిత్యుడైన వివస్వత్తు రాత్రినీ పగలునీ ప్రకాశించేటట్లు చేస్తాడు (వి వస్తే) అని ఈ వ్యుత్పత్తి శ.బ్రా. (10.5 2.4) లో ఇవ్వబడింది.

18.8 యజుర్వేదం (వా.సం. 8.5; మై.సం. 1.6.12) లోనూ బ్రాహ్మణాలలోనూ వివస్వత్తు ఆదిత్యుడని చెప్పబడ్డాడు; వేదకాలపు తరవాత సాహిత్యంలో ఈ పేరు సూర్యుడికి పర్యాయంగా ప్రచురంగా వాడబడింది.

18.9 వివస్వత్- అనే పదం అవెస్తాలోని వీవజహ్వాంత్ అనే పదానికి సంబంధించినది కావడం వల్ల ఈ దేవత ఇండో- ఇరానియన్ మూలభాషా కాలానికి చెందినవాడు. అవెస్తాలో మొదటగా హ ఓమ (= హోమం) చేసినవాడు అని చెప్పబడ్డాడు; ఈయన పెద్దకొడుకు యిమ (= యముడు), రెండవవాడు ఆథ్వ్య, మూడవవాడు థ్రిత (= త్రిత-) (యస్న, 9.10). పెద్దకొడుకూ, మూడవకొడుకూ ఋగ్వేదం (వాలఖిల్య 4.1) లో నిర్మించబడ్డారు; ఇంద్రుడు మను వివస్వత్తుతోనూ త్రితుడితోనూ సోమం తాగినట్లు అందులో చెప్పబడింది.

18.10 ఋగ్వేదకాలానికి వివస్వత్తుకీ త్రితుడికీ ప్రాధాన్యం తగ్గింది. వివస్వత్- అనే పదం వ్యుత్పత్తీ, ఆయనకి అశ్వినులతోనూ, అగ్నితోనూ, సోముడితోనూ ఉన్న సంబంధమూ, ఆయన స్థానం యజ్ఞం చేసే స్థలం అని చెప్పబడడమూ చూస్తే వివస్వత్తు మొదట్లో ఉదయించే సూర్యుడికి ప్రతినిధి అని చెప్పడం సమంజసం అనిపిస్తుంది. చాలామంది పండితులు ఆయన సూర్యుడే అని అన్నారు. కొందరు ఆయన ప్రకాశించే ఆకాశానికి, లేక, సూర్యుడికి సంబంధించిన స్వర్గానికి ప్రతినిధి అయిన దేవత అన్నారు. వివస్వత్తు స్వభావంలో యజ్ఞం చేసే లక్షణానికి ప్రాముఖ్యం ఉండడంవల్ల ఆయనకూడా సూర్యుడిలా అగ్ని రూపాంతరమే అని బెర్గెయిన్ (1.88) అభిప్రాయపడ్డారు. ఓల్డెన్‌బెర్గ్ వివస్వత్తుని మొదటగా హోమం చేసిన మనుష్యుడుగా అవెస్తాలో చెప్పబడిన వివజహ్వాంత్‌తో పోల్చి, వివస్వత్తు కాంతికి సంబంధించిన దేవతగా చెప్పడానికి ఉన్న కారణాలు చాలవనీ, ఆయన మానవజాతికి మూలపురుషుడూ, మొదట యజ్ఞం చేసినవాడూ మాత్రమే అని చెప్పేరు.

## 19. ఆదిత్యులు

19.1 ఆదిత్యులని చెప్పబడే దేవతల సముదాయం ఋగ్వేదంలో ఆరు పూర్తి సూక్తాలలోనూ మరిరెండుసూక్తభాగాలలోనూ ప్రశంసించబడింది. ఈసముదాయంలోని దేవతల పేర్ల విషయంలోనూ వారి సంఖ్య విషయంలోనూ ఋగ్వేదంలో కొంత అస్పష్టత ఉంది. ఆరుగురి కన్న ఎక్కువమంది ఎక్కడా చెప్పబడలేదు; ఆరుగురిని చెప్పినది కూడా ఒకచోటే (2.27.1): మిత్రుడు, అర్యముడు, భగుడు, వరుణుడు, దక్షుడు, అంశుడు. ఋగ్వేదం చివరి మండలాలలో వీరిసంఖ్య ఏడు అని ఒకచోటా (9.114.3), ఎనిమిది అని ఇంకొకచోటా (10.72.8) ఉంది; అదితి మొదట ఏడుగురినే దేవతలకి ఇచ్చింది; ఆమె ఎనిమిదోవాడైన మార్తాండుణ్ణి తరవాత కంది (10.72.9). ఈరెండుచోట్లా కూడా పేర్లు చెప్పబడలేదు. అథర్వవేదం (8.9.21)లో అదితికి ఎనిమిది మంది పుత్రులని ఉంది; తై.బ్రా. (1.1.9.1) ప్రకారం వీరిపేర్లు: మిత్రుడు, వరుణుడు, అర్యముడు, అంశుడు, భగుడు, ధాత, ఇంద్రుడు, వివస్వత్తు (మొదటి అయిదూ ఋగ్వేదం 2.27.1లో ఇవ్వబడ్డాయి); ఇవేపేర్లు తై. ఆ. (1.13.3) కూడా ఉన్నాయని వాటిని సాయణుడు (ఋగ్వేదం 2.27.1 వ్యాఖ్యలో) ఉద్ధరించారు. శ.బ్రా.లో ఒకసందర్భంలో మార్తాండుణ్ణి కలుపుకోవడంతో ఆదిత్యులు ఎనిమిది మంది అయ్యారని చెప్పబడింది; మరి రెండు సందర్భాలలో (6.1.2.8; 11.6.3.8) వారు పన్నెండు మంది అనీ వారే పన్నెండు మాసాలనీ చెప్పబడింది. వేద కాలానికి తరవాత సాహిత్యంలో సర్వత్రా ఆదిత్యులు పన్నెండుమంది అనీ, వారికీ మాసాలకీ సంబంధం ఉందనీ, వారిలో ఒకడైన విష్ణువు అందరిలోకీగొప్పవాడనీ ఉంది. ఋగ్వేదం 2.27.1లో చెప్పబడిన ఆరుగురు ఆదిత్యులేకాక, సూర్యుడు కూడా ఆదిత్యుడని కొన్నిసార్లు చెప్పబడ్డాడు (అధ్యాయం 14.34); బ్రాహ్మణాలలోనూ తరవాతసాహిత్యంలోనూ సూర్యుడికి ఆదిత్యుడని వాడడం సాధారణం. అగ్నీ, ఆదితేయుడూ అయిన సూర్యుణ్ణి దేవతలు ఆకాశంలో పెట్టేరు (10.88.11). భగుడు, వరుణుడు, మిత్రుడు, అర్యముడు అనే నలుగురు ఆదిత్యులతోపాటు కలిపి సవితకూడా ఒకచోట చెప్పబడ్డాడు (8.18.3). అందువల్ల ఆదిత్యుల సంఖ్య ఏడు అని ఋగ్వేదఋషుల నిశ్చితాభిప్రాయం అయితే సూర్యుడు ఏడోవాడు అవుతాడు; అదితి పారవేసి మళ్ళీ తెచ్చే ఎనిమిదోవాడయిన మార్తాండుడు (10.72.8, 9) బహుశా అస్తమించే సూర్యుడు. అథర్వవేదం (13.2.9, 37)లో సూర్యుడు అదితి పుత్రుడనీ, సూర్యుడూ

చంద్రుడూ ఆదిత్యులనీ (8.12.15) చెప్పబడింది; ఇందులోనే మరొకచోట (11.6.2) ఋగ్వేదంలో ఆదిత్యులని చెప్పబడిన వారిమధ్య విష్ణువు కూడా చేర్చబడ్డాడు: వరుణుడు, మిత్రుడు, విష్ణువు, భగుడు, అంశుడు, వివస్వత్తు. ఇందులో ఒకచోట (9.1.4) ఆదిత్యుల తల్లి అదితి లసికా కవసువుల కూతురైన బంగారురంగు కలిగిన మధుకశా అని చెప్పబడింది.

19.2 ఋగ్వేదంలో ఒకచోట (7.85.4) ఇంద్రుడు ఆదిత్యులలో ముఖ్యుడైన వరుణుడితో కలిపి దేవతాద్వంద్వం (ఇంద్రావరుణా) గా చెప్పబడి స్తుతించబడ్డాడు; వాలఖిల్య 4.7లో ఇంద్రుడు నాలుగో ఆదిత్యుడని (తురీయాదిత్య) స్పష్టంగానే చెప్పబడ్డాడు. మై.సం. (2.1.12)లో ఇంద్రుడు అదితి కొడుకు; కాని శ.బ్రా. (11.6.3.5)లో ఆయనకీ పన్నెండుగురు ఆదిత్యులకీ భేదం చెప్పబడింది., ఒకే దేవత ఆదిత్యుడుగా చెప్పబడినచోట ఆదేవత సాధారణంగా వారిలో ముఖ్యుడైన వరుణుడు; కాని మిత్రుడు ఒక్కడే స్తుతించబడిన సూక్తం (3.59) లో ఆయన ఆదిత్యుడనీ సూర్యుడనీ చెప్పబడ్డాడు. ఇద్దరు చెప్పబడినచోట వారు వరుణుడూ, మిత్రుడూ; ఒకచోట మాత్రం వరుణుడూ, ఇంద్రుడూ. ముగ్గురు చెప్పబడినచోట వరుణుడూ, మిత్రుడూ, అర్యముడూ; ఐదుగురు చెప్పబడిన ఒకేఒకచోట పై ముగ్గురూ, సవితా, భగుడూ. ఆరుగురు చెప్పబడిన మంత్రం (2.27.1) లో మాత్రమే దక్షుడి పేరు ఉంది. ఆదిత్యులు తరచుగా ఒక సముదాయంగా చెప్పబడ్డారు; ఈ సముదాయంతోపాటు మిత్రుడి పేరూ వరుణుడి పేరూ సాధారణంగా విడిగా చెప్పబడతాయి. ఈ రెండు పేర్లూ ఇతర సముదాయాలైన వసువులూ, రుద్రులూ, మరుత్తులూ, అంగిరస్సులూ, ఋభువులూ, విశ్వేదేవతలూ (అధ్యాయం 45) - వీటితోపాటు కూడా తరచు వస్తాయి. ఆదిత్యులు అనేపదం దేవతలు అనే విస్తృతార్థంలో వాడడం కూడా అరుదు కాదు. ఆదిత్యులలో ముఖ్యులైన మిత్రుడికీ వరుణుడికీ ఉన్నట్లు మిగిలిన వారికి ప్రత్యేక వ్యక్తిత్వం లేకపోవడం వల్ల ఈ సముదాయం దేవతల సముదాయాన్ని పోలి ఉంది. ఒకసముదాయంగా వారు దివ్యకాంతికి సంబంధించిన దేవతలు; అంతేకాని వారు ఆదివ్యకాంతికి సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ, ఉషస్సులలా ప్రత్యేకరూపంగల ప్రతినిధులు కారు. ఆదిత్యులు మొదట్లో సూర్యుడూ, చంద్రుడూ, అయిదు గ్రహాలూ అనే ఓల్డెన్‌బెర్గ్ ప్రతిపాదనకి ఆధారాలు ఆదిత్యుల అమూర్త స్వభావమూ పేర్లూ (భగుడు, అంశుడు, దక్షుడు వంటివి), వారి సంఖ్య అవెస్తాలోని అమేషస్పెంటాల సంఖ్యలా ఏడు అనే ఊహ, ఇక్కడ మనం ఈ రెండు సముదాయాలలో ఒక్కపేరు కూడా తుల్యంగా లేదు

అనేది గమనించాలి; మిత్ర కూడా అమేషస్పెంటాలలో వాడుకాదు. ఆదిత్యులు ఏడుగురు అనేది కూడా సర్వసమ్మతమూ ప్రాచీనమైనదీ అయిన అభిప్రాయం కాదు. రాథ్వ్యాసం కాలంనించీ ఆదిత్యులూ అమేషస్పెంటాలూ ఒకరేఅనేఅభిప్రాయం సాధారణంగా పండితులు అంగీకరించినా అవెస్తా పండితులలో అగ్రగణ్యులైన కొందరు దీన్ని నిరాకరించారు.

19.3 ఋగ్వేదంలో ఆదిత్యులని స్తుతించినకొన్ని సూక్తాలలో (ముఖ్యంగా 2.27లో) తరచుగా కలిపి చెప్పబడే మిత్రుడూ, వరుణుడూ, అర్యముడూ అనే ముగ్గురే ఉద్దేశించ బడినట్లు కనపడుతుంది. దూరంగా ఉన్నది వారికి దగ్గరిది; వారు భువనాలని రక్షిస్తారు; చరాచరమైన వాటికన్నిటికీ వారే ఆధారం (2.27.3, 4). వారు మనుష్యుల హృదయాలలో మంచినీ చెడునీ చూస్తారు; ఎవరికి కపటత్వం ఉన్నదీ ఎవరికి లేనిదీ తెలుసుకొంటారు (2.27.3); 8.18.15). వారు అబద్ధాన్ని అసహ్యించుకొంటారు; పాపాన్ని శిక్షిస్తారు (2.27.4; 7.52.2; 7.60.5; 7.66.13). వారు పాపాన్ని క్షమించమనీ (2.27.14, 2.29.5), పాపం యొక్క పరిణామాలనించి తప్పించమనీ, భక్తుల పాపాన్ని త్రిత ఆప్త్యుడికి మార్చమనీ (8.47.13) ప్రార్థించబడ్డారు. వారు తమ పాశాలతో శత్రువులని బంధిస్తారు (2.27.16); కాని భక్తులని పక్షులు రెక్కలు కప్పి వాటిసంతానాన్ని కాపాడినట్లు కాపాడతారు (8.47.2). భక్తులని వారు ఆయుధమూ పాపమూ తగలకుండా కవచంలా రక్షిస్తారు (8.47.7, 8). వారు రోగాన్నీ బాధనీ దూరం చేస్తారు (8.18.10); కాంతి, దీర్ఘాయుస్సు, సంతానం, సలహా వంటి వరాలు ఇస్తారు (2.27; 8.18.22; ?8.56.15, 20).

19.4 వారిని వర్ణించేవిశేషణాలు: శుచి- 'ప్రకాశించే', హిరణ్యయ- 'బంగారురంగుగల' భూర్యక్ష- 'చాలా కన్నులు కల', అనిమిష- 'రెప్పవేయని', అస్వప్నజ్- 'నిద్రలేని', దీర్ఘధీ 'దీర్ఘాలోచనకల'. వారు బలవంతులైన రాజులు (క్షత్రియ-), గొప్పవారు ( ఉరు-) గంభీరులు (గంభీర-), ధిక్కరించలేనివారు (అరిష్ట-), స్థిరమైనఆజ్ఞకలవారు (ధృతవ్రత-) నిందలేనివారు (అనవద్య-), పాపరహితులు (అవృజిన-), పరిశుద్ధులు (ధారపూత-) పవిత్రులు (ఋతావన్-).

19.5 ఆదిత్యశబ్దం 'అదితి పుత్రులు' వారి తల్లిని సూచించే అదితి శబ్దం నించి వచ్చిన తద్ధితరూపం అనేది స్పష్టం; వారితోపాటు తరచు అదితి కూడా ప్రార్థించబడింది. యాస్కుడు నిరుక్తం (2.13; చూ. తై. ఆ. 1.14.1) లో ఇచ్చిన మూడు వ్యుత్పత్తులలో

ఇది ఒకటి.[1]

19.6 ఈ సముదాయానికి చెందిన ప్రధానులైన దేవతలని గురించి ఇంతకుముందే ప్రత్యేకాధ్యాయాలలో చెప్పడింది; ప్రత్యేకతలు ఏమీలేని అప్రధానులైన ఆదిత్యులనిగురించి వరసగా ఇక్కడ చూద్దాం.

19.7 అర్యముడి (అర్యమన్-) పేరు ఋగ్వేదంలో సుమారు 100 సార్లు వచ్చినా ఆయనకు ప్రత్యేక లక్షణాలు ఏమీ లేకపోవడం వల్ల నిరుక్తంలోని నిఘంటువులో దేవతల జాబితాలో ఆయనపేరు చేరలేదు. రెండు మంత్రాలలో తప్ప ఆయనపేరు ఇతరదేవతలతోనే ముఖ్యంగా మిత్రుడితోనూ వరుణుడితోనూ - వస్తుంది. పన్నెండుకన్న తక్కువ మంత్రాలలో ఈ పదానికి 'స్నేహితుడు', 'వధూవరులకు హితుడు' అనే విశేషణార్థమే ఉంది. ఉదాహరణకు ఒకచోట (5.3.2) అగ్ని ''నువ్వు కన్యకలతో సంబంధంలో అర్యముడవు'' (త్వ మర్యమా భవసి యత్కనీనాం) అనిచెప్పబడ్డాడు. ఈ శబ్దంనించి వచ్చిన విశేషణరూపమైన అర్యమ్య- 'అర్యముడికి (మిత్రుడికి) సంబంధించినది' అనే పదం మిత్ర్య- 'మిత్రుడికిసంబంధించినది' అనేపదంతోపాటు సమానార్థంలో ఒకచోట (5.85.7) వచ్చింది. అందువల్ల అర్యముడిని గురించిన భావనకీ ఈయకన్న గొప్ప ఆదిత్యుడైన మిత్రుడిని (= స్నేహితుడు) గురించిన భావనకీ అట్టే భేదం లేదు. ఈపేరు అవెస్తాలో కూడా ఉంది కాబట్టి ఈయనమూల ఇండో- ఇరానియన్‌కాలానికిచెందినవాడు.

19.8 ఋగ్వేదంలో ఒకసూక్తం (7.41), అందులో కొందరు ఇతరదేవతల స్మరణ కూడా ఉన్నా, ముఖ్యంగా భగుడికి (భగ-) ఉద్దేశించబడినది; ఈపేరు 60కన్న ఎక్కువసార్లు వచ్చింది. ఈపదానికి వ్యుత్పత్త్యర్థం 'విభజించి ఇచ్చేవాడు, దాత'; ఈ అర్థంలో ఇది ముఖ్యంగా సవితకి విశేషణంగా సుమారు ఇరవైసార్లు వచ్చింది. ఈ పేరుగల దేవతకూడా ధనాన్ని పంచి ఇచ్చేవాడుగా భావించబడ్డాడు; ఇంద్రాగ్నుల దానగుణాన్ని ప్రశంసించడానికి వారు భగుడితోపోల్చబడ్డారు. ఈపదం సుమారు ఇరవైచోట్ల 'దానం, సంపద' అనే అర్థాలలో కూడా ఉపయోగించబడింది. ఈ పదానికి ఉన్న అనేకార్థాలవల్ల కొన్నిచోట్లశ్లేష

---

1. మిగిలినరెండూ (ఆదత్తే రసాన్/ భాసం ''రసాలని/ కాంతిని తీసుకొనేవాడు'', ఆదీప్తో భాసా ''కాంతితో ప్రకాశించేవాడు'') అంగీకార యోగ్యాలు కావు. అదితి శబ్దానికి అపత్యార్థంలో ణ్యప్రత్యయం చేర్చడం వల్ల ఆదిత్యశబ్దం ఏర్పడుతుంది (దిత్యదిత్యాదిత్యపత్యుత్తరపదాణ్ణ్యః, అష్టాధ్యాయి 4.1.85).

సాధ్యమయింది. భగుడు 'పంచి ఇచ్చేవాడు' (విధర్త) అని చెప్పిన ఒక మంత్రం (7.4.12)లో దరిద్రుడైనా రాజైనా భాగం భక్షి "భగుణ్ణి / ధనాన్ని ఇయ్యి" అంటాడు అని చెప్పబడింది (ఆధ్రశ్చిద్యం మన్యమానస్తురశ్చిద్రాజా చిద్యం భగం భక్షీత్యాహ; ఆధ్రః = దరిద్రుడు). ఇంకొక మంత్రం (5.46.6)లో విభజించేవాడైన భగుడు (భగో విభక్తా; ఈ రెండు శబ్దాలూ భజ్- అనే ధాతువు నుంచి వచ్చినవే) ఉన్నంతోనూ (శవసా), రక్షణతోనూ (అవసా) వచ్చుగాక! (ఆగమత్) అనే ప్రార్థన ఉంది (భగో విభక్తా శవసావసాగమత్).

19.9 ఉషస్సు భగుడికీ వరుణుడికీ సోదరి (భగస్య స్వసా వరుణస్య జామిః, 1.123.5). భగుడికన్ను రశ్మిలతో కూడి ఉంది (1.136.2). భగుడి మార్గంలోలా (లేక, ధనాన్ని కలిగించేవిలా ఉన్న, భగస్యేవకారిణో యామని) స్తోత్రాలు విష్ణువు దగ్గరకి వెళ్తాయి (3.54.14). భగుడి మధ్యాహ్నకాలానికి ముందు కాలానికి (ప్రాగుత్సర్పణాత్) అధిదేవత అని యాస్కుడు (నిరుక్తం 12.13)లో చెప్పారు. దీనికి సదృశమైన పదం అవెస్తాలో బఘ 'దేవుడు'; ఇది అహురమజ్దకి విశేషణం. ప్రాచీన చర్చిస్లావోనిక్ అనే భాషలో 'దేవుడు' అనే అర్థం ఇచ్చే 'బొగు' అనే పదం ఉండడం వల్ల ఈ పదం మూల ఇండో-యూరోపియన్ కాలంలో ఇది ఒక ప్రత్యేక దేవతకి పేరు అనడానికి ఆధారమేదీ లేదు; అప్పట్లో దీని అర్థం 'ధారాళంగా ఇచ్చేవాడు' అని కాని ఇంతకన్న కొంచెం ఎక్కువ ప్రత్యేకార్థంలో 'ధారాళంగా ఇచ్చే దేవుడు' అని కాని అయి ఉంటుంది; ఇంతకన్న ప్రత్యేకార్థం ఆ ఆకాలంలో ఉండడానికి అవకాశం లేదు.

19.10 ఋగ్వేదంలో పన్నెండుకన్న తక్కువసార్లు వచ్చిన అంశ శబ్దానికి 'భాగం', 'విభాగం చేసేవాడు' అనే భగ శబ్దానికి ఉన్న అర్థాలే ఉన్నాయి. ఇది ఒక దేవత పేరుగా మూడుచోట్ల మాత్రమే వచ్చింది; వాటిలో ఒకచోట మాత్రమే పేరుతోపాటు ఆయన్ని గురించి కొంతచెప్పబడింది. అక్కడ "(అగ్నీ!) నువ్వు యజ్ఞంలో భాగం ఇచ్చే అంశుడవు" అని చెప్పబడింది (త్వమంశో విదథే దేవ భాజయుః, 2.1.4).

19.11 ఋగ్వేదంలో దక్షశబ్దం దేవతాపరంగా వాడబడినచోట్లు ఆరుకన్న ఎక్కువ లేవు. ఇది తరచుగా 'సమర్థుడు, బలశాలి, తెలివైనవాడు' అనే అర్థాలలో అగ్నికీ (3.14. ), సోముడికీ(9.61.18, మొ.) విశేషణంగానూ, 'సామర్థ్యం, బలం, తెలివి' అనే అర్థాలలోనూ వాడబడింది. అందువల్ల పురుషారోపణ ఉన్నప్పుడు దీని అర్థం 'సమర్థుడైన/తెలివైన

దేవుడు' అనడం సమంజసం. ఆరుగురు ఆదిత్యుల పేర్లు చెప్పబడిన మంత్రం (2.27.1) లో కాక ఈయన పేరు ఒకటో, పదో మండలాలలోనే వస్తుంది. ఒక మంత్రం (1.89.3) లో ఈయన పేరు మిగిలిన ఆదిత్యుల పేర్లతో పాటు వచ్చింది; మరొకదాంట్లో (10.64.5) మిత్రుడు, వరుణుడు, అర్యముడు - ఈ పేర్లతో పాటు వచ్చింది; ఇక్కడ ఈయన జన్మతో అదితికి సంబంధం ఉన్నట్లు కూడా చెప్పబడింది. ప్రపంచోత్పత్తిని వివరించే ఒక సూక్తం (10.72.4, 5) లో దక్షుడు అదితినించి పుట్టేడని చెప్పిన వెంటనే అదితి దక్షుడినించి పుట్టడం వల్ల ఆమె ఆయనకు కూతురనీ దేవతలు తరవాత పుట్టేరనీ చెప్పబడింది. మరొక మంత్రం (10.5.7) లో ఉన్నవీ లేనివీ దక్షుడి జన్మస్థానమైన అదితిగర్భంలో ఉన్నాయని చెప్పబడింది. అందువల్ల చివర చెప్పిన రెండు మంత్రాలలోనూ అదితీ దక్షుడూ విశ్వంలోని అందరికీ తల్లిదండ్రులుగా భావించబడినట్లు కనపడుతుంది. పిల్లలే తల్లిదండ్రులని పుట్టించినట్లు చెప్పడంలోని విరోధాభాసం వేదఋషులకు అపరిచితంకాదని ఇంతకుముందు (8.3) చెప్పబడింది. ప్రస్తుత విషయంలో ఇది ఈకింద చెప్పినవిధంగా సంభవించి ఉండవచ్చు. ఆదిత్యులు దక్షపితృ - 'దక్షుడు తండ్రిగాగలవారు' అని చెప్పబడ్డారు (6.50.2); దక్షపితరా అనే విశేషణం మిత్రావరుణులకి కూడా వాడబడింది (7.66.2); అదే మంత్రంలో వారు సుదక్ష 'మంచి సమర్థులు' అని కూడా చెప్పబడింది. ఈ పదం అసలు అర్థాన్ని ఇంకొక మంత్రం (8.25.5) ఇంకా స్పష్టం చేస్తుంది; అందులో మిత్రావరుణులు సూనూ దక్షస్య అనీ నపాతా శవసో మహః 'గొప్ప బలానికి పౌత్రులు' అనీ చెప్పబడ్డారు. పక్కపక్కన ఉన్న ఈ రెండు విశేషణాలనీ పోల్చిచూస్తే ఇక్కడ దక్షశబ్దం పురుషపరంగాకాక 'దక్షత, సామర్థ్యం' అనే అర్థంలో వాడబడిందని తెలుస్తుంది (కాబట్టి దీని అర్థం 'దక్షతకి పుత్రులు' అని); ఇలాగే అగ్నికి కూడా 'దక్షతకు తండ్రి' (దక్షస్యపితృ-, 3.2.7.9), 'బలానికి కొడుకు' అనే విశేషణాలు వాడబడ్డాయి (అధ్యాయాలు 8,35). యాగంచేసే సాధారణ మానవులు కూడా దక్షపితరః 'దక్షతతండ్రిగాకలవారు' (8.52.10) అని చెప్పబడడం ఈ నిర్ణయానికి బలం చేకూరుస్తుంది. ఇటువంటి ప్రయోగాలనించే పురుషతారోపం ఏర్పడి దక్షుడు ఆదిత్యుల తండ్రి అనే భావన కలగడమూ ఆయనకీ అదితికీ సంబంధం ఊహించబడడమూ జరిగి ఉండవచ్చు. తై సం. లో దేవతలందరూ దక్షపితరః అని చెప్పబడ్డారు; శ.బ్రా. (2.4.4.2) లో దక్షుడూ సృష్టికర్త అయిన ప్రజాపతీ ఒకరే అని చెప్పబడింది.

## 20. ఉషస్సు

20.1 తెల్లవారే సమయానికి అధిదేవత అయిన ఉషస్సు (ఉషస్-) ఋగ్వేదంలో సుమారు 20 సూక్తాలలో స్తుతించబడింది; ఈ పేరు 300 కన్న ఎక్కువసార్లే వచ్చింది. దేవతకీ కాలానికీ పేరు ఒకటే అవడం వల్ల పురుషతారోపం చాలా తక్కువగా ఉంది; దేవతని సంబోధించినప్పుడు కవి మనస్సులో ఉషఃకాలం వాస్తవస్వరూపం ఎప్పుడూ చెరిగిపోలేదు. ఉషస్సు వైదిక సాహిత్యం సృష్టించిన పాత్రలన్నిటిలోనూ ఎక్కువ ఆకర్షణీయమైనది; ఏ ఇతరసాహిత్యంలోని మతసంబంధమైన కవిత్వంలోనూ ఇంతకన్న ఎక్కువ ఆకర్షణీయమైన పాత్ర లేదు. ఆమె రూపంలోని స్వచ్ఛత మతసంబంధమైన ఊహలవల్ల మాసిపోలేదు; పురుషతారోపం యజ్ఞకర్మకి సంబంధించిన సూచనలవల్ల దెబ్బతినలేదు. అందమైన వస్త్రాలు/రూపం ధరించిన ఉషస్సు నర్తకిలా తన వక్షఃస్థలాన్ని బయటపెడుతుంది (1.92.4; చూ. 6.64.2) తల్లిచేత అలంకరించబడిన స్త్రీలా ఆమె తన శరీరాన్ని చూపుతుంది (మాతృమృష్టేవ యోషా, 1.123.11). ఆకాశానికి కూతురైన ఆమె కాంతిని ధరించి తూర్పున కనపడి తన అందాలని ప్రదర్శిస్తుంది (ఏషా దివో దుహితా ప్రత్యదర్శి, జ్యోతిర్వసానా సమనా పురస్తాత్, 1.124.3, 4). సాటిలేని అందంలో ప్రకాశించే ఆమె తన కాంతిని చిన్నవాటినించి కాని పెద్దవాటినించి కాని దూరం చెయ్యదు (1.124.6). స్నానం చేసి నిలబడిన స్త్రీలా తన అంగాలు చూపుతూ ఆమె కాంతిలో చీకటిని పోగొడుతూ వస్తుంది (5.80.5, 6). ఆమె ప్రాచీనకాలానికి చెందినదే (పురాణీ) అయినా మళ్లీ మళ్లీ పుడుతుంది; ఒకేరంగుతో ప్రకాశిస్తుంది; బోయది (శ్వఘ్నీ) పక్షులని (విజః) హింసించినట్లు మనుష్యుడి ఆయుస్సును తగ్గిస్తుంది (1.92.10)[1]. ఆమె ఇంతకుముందు ప్రకాశించినట్లే ఇప్పుడు ప్రకాశిస్తోంది, ఈ తరవాత కూడా ప్రకాశిస్తుంది; ఆమె ముసలితనం లేనిది (అజరా), మృత్యువు లేనిది (అమరా) (1.113.13, 15). మళ్లీ పుట్టిన యువతి (యువతిః పునర్భూః) లోకమంతటికన్నా ముందులేస్తుంది (పూర్వా విశ్వస్మాద్భువనాదబోధి, 1.123.2). మనుష్యుల వయస్సు తగ్గిస్తూ ఆమె ప్రకాశిస్తుంది; గడచిన ఉషస్సులలో ఆఖరిది తరవాత వచ్చేవాటికి మొదటిది (1.124.2). ఆమె చక్రంలా తిరుగుతూ ఎప్పుడూ కొత్తగా ఉంటుంది (3.61.3). ఆమె పాదాలు ఉన్నవాటిని లేపుతుంది; పక్షులు

---

1. పునః పునర్జాయమానా పురాణీ సమానం వర్ణమభిశుంభమానా
శ్వఘ్నీవ కృత్నుర్విజ ఆమినానా మర్తస్య దేవీ జరయంత్యాయుః.

ఎగిరేటట్టుచేస్తుంది (1.48.5; 1.49.3); ఆమె విశ్వానికి ప్రాణమూ జీవమూ (విశ్వస్యహి ప్రాణనం జీవనం, (1.48.10). ఆమె ప్రాణులన్నిటినీ లేపి వాటికి చైతన్యం కలిగిస్తుంది (1.92.9; 7.77.1). ఉషస్సులు నిద్రపోయే వాటిని లేపుతాయి; రెండుకాళ్లు నాలుగు కాళ్లుగల జీవులకు చైతన్యం ఇస్తాయి (4.51.5). ఉషస్సు ప్రకాశించగానే పక్షులు గూళ్లనించి ఎగురుతాయి; మనుష్యులు అన్నంకోసం వెళ్తారు (1.124.12). ఆమె అయిదు జాతుల వారినీ లేపుతూ మనుష్యుల మార్గాలని స్పష్టం చేస్తుంది (7.79.1). ఆమె అన్ని భువనాలూ స్పష్టం చేస్తుంది; కొత్త జీవితం ఇస్తుంది (7.80.1, 2). ఆమె చెడ్డ కలలని త్రిత ఆప్త్యుడి దగ్గరకి పారదోలుతుంది (8.47.14). ఆమె రాత్రియొక్క నల్లటి రూపాన్ని తీసివేస్తుంది (1.113.14). ఆమె చీకటిని పారదోలుతుంది (6.64.3; 6.65.2). ఆమె చీకటిలో దాగిన ధనాన్ని బయటికి తెచ్చి పంచుతుంది (1.123.4, 6). ఆమె ఆకాశం చివరలని ప్రకాశించేటట్టు చేస్తూ ఉదయిస్తుంది (1.92.11). ఆమె స్వర్గద్వారాలని తెరుస్తుంది (1.48.15; 1.113.4). ఆమె ఆవులు తమ పాకని తెరిచినట్లు చీకటిని తెరుస్తుంది (గావో నవ్రజం వ్యుషా ఆవర్తమః, 1.92.4). ఆమె రశ్మిలు ఆవులమందలా కనపడతాయి (ప్రతిభద్రా అదృక్షతగవాం సర్గా న రశ్మయః, 4.52.5). ఆమె పశువులని (= కిరణాలని) వ్యాపించేటట్టు చేస్తూ దూరానికి కనపడుతుంది (1.92.12). ఉషస్సు ఎర్రని కిరణాలు పైకి ఎగిరేయి; తమంతట తామే రథాన్ని కట్టుకొనే పశువులు (= కిరణాలు) రథాన్ని కట్టుకొన్నాయి (ఉదపప్తన్నరుణా భానవో వృథా స్వాయుజో అరుషీర్గా అయుక్షత, 1.92.2); ఇంతకుముందులాగే ఎర్రని ఉషస్సులు తమ కాంతి అనే గూడు అల్లేయి. ఇలా ఉషస్సు గోవులమాత (మాతాగవాం, 4.52.2, 3; 7.77.2) అయింది.

20.2 ప్రతిరోజూ ఒకేచోట ఉదయించే ఉషస్సు దైవసంబంధమైన వ్రతాలని హింసించదు (1.92.12; 1.123.9; 1.124.2; 7.76.5). ఆమె క్రమమార్గంలో పోతుంది; మార్గం తెలిసినది కాబట్టి ఆమె దిక్కు తప్పదు (ఋతస్య పంథా మన్వేతి సాధు ప్రజానతీవ న దిశో మినాతి, 5.80.4). దేవతలందరిలోనూ ఈమే అగ్ని మండేటట్టు చేసి, యాగంచేసేవారిని లేపి మేలుచేస్తుంది (1.113.9). ఈమె భక్తిగల వారినీ దానంచేసే వారినీ లేపమనీ భక్తిలేనివారినీ పిసినిగొట్టు వారినీ లేపకుండా నిద్రపోనిమ్మనీ ప్రార్థించబడింది (1.124.10; 4.51.3). కొన్నిసార్లు ఉషస్సు భక్తులని లేపినట్లుగా కాక భక్తులే ఉషస్సుని లేపినట్లు కూడా చెప్పబడింది (4.52.4, మొ.); వసిష్ఠులు తామే స్తోత్రాలలో మొట్టమొదటగా ఉషస్సుని లేపినట్లు

చెప్పుకొన్నారు (ప్రతిస్తోమేభి రుషసం వసిష్ఠా గీర్భి ర్విప్రాసః ప్రథమా అబుధ్రన్, 7.80.1). ఒకచోట (5.79.9) ఆమె ఆలస్యం చేస్తే సూర్యుడు తన తేజస్సుతో దొంగనీ శత్రువునీ మాడ్చినట్లు మాడుస్తాడు కాబట్టి ఆలస్యం చేయవద్దని ప్రార్థించబడింది. ఆమె సోమపానానికి దేవతలని తీసుకురమ్మని ప్రార్థించబడింది (1.48.12). బహుశా అందువల్లే దేవతలు తరచుగా ఉషర్బుధః ''ఉషస్సుతో లేచేవారు'' 91.14.9, మొ.) అని చెప్పబడ్డారు.

20.3 ఉషస్సు ప్రకాశించే (1.23,7; 7.78.1; 3.61.2) అందమైన (1.49.2) పెద్ద (1.48.10) రథం మీద వస్తుంది. ఆమె వందరథాల మీద (శతం రథేభిః, 1.48.7) వస్తుందని కూడా చెప్పబడింది. ఆమె రథానికి కట్టేగుర్రాలు ఎర్రనివి (7.75.6, మొ.), చెప్పినట్లు వినేవి (3.61.2). గుర్రాలకు బదులు గోవులని కూడా కొన్నిచోట్ల (1.92.2; 1.124.11; 5.80.3). ఈ గుర్రాలూ గోవులూ ఉషఃకాలపు ఎర్రని కిరణాలే అని చెప్పవచ్చు; కాని సాధారణంగా ప్రాతఃకాలపు ఎర్రని మేఘాలే గోవులుగా చెప్పబడ్డాయని అంటారు. ఉషస్సులు ఒకరోజులో ప్రయాణించే దూరం 30 యోజనాలు (1.123.8).

20.4 ఉషస్సుకీ సూర్యుడికీ సంబంధం సహజంగానే చెప్పబడింది. సూర్యుడు ప్రయాణించడానికి ఆమె మార్గాలు తెరుస్తుంది (1.113.16). ఆమె దేవతల కన్ను (= సూర్యుణ్ణి) తెచ్చి ఆ తెల్లని అశ్వానికి దారి చూపుతుంది (7.77.3). ఆమె సూర్యుడి కాంతితో ప్రకాశిస్తుంది (1.113.9); తన ప్రియుడి కాంతితో ప్రకాశిస్తుంది (1.92.11). సవిత ఉషస్సు ప్రయాణంతోపాటు ప్రకాశిస్తాడు (5.81.2). సూర్యుడు ఆమె వెనుక మనుష్యుడు స్త్రీ వెనకాల నడిచినట్లు నడుస్తాడు (మర్యో న యోషా మభ్యేతి పశ్చాత్, 1.115.2). ఆమెను కోరిన దేవుణ్ణే ఆమె కలుసుకొంటుంది (1.123.10). ఆమె సూర్యుడి భార్య (సూర్యస్యయోషా, 7.75.5; 4.5.13). ఆమె తరవాత సూర్యుడు వస్తాడు కాబట్టి ఇలా ఆమె ఆయన భార్య లేక ప్రేయసిగా ఊహించబడింది. కాని ఉషస్సు సూర్యుడికి ముందు వస్తుంది కాబట్టి కొన్నిచోట్ల ఆమె ఆయన తల్లిగా భావించబడింది (చూ. 16.2). ఉషస్సులు సూర్యుణ్ణీ, యజ్ఞాన్నీ, అగ్నినీ పుట్టించాయి (అజీజనన్త్సూర్యం యజ్ఞమగ్నిం, 7.78.3). ఆమె సవితని కనడానికి పుట్టించబడింది (ప్రసూతా సవితుః సవాయ, 1.113.1); ఆమె ప్రకాశించేపిల్లవాడితో ప్రకాశిస్తూ వస్తుంది (1.113.2). ఆమె ఆదిత్యుడైన భగుడికి సోదరి (1.123.5); వరుణుడికి చుట్టం (జామిః, 1.123.5, భగస్య స్వసావరుణస్య జామిః, జామి = సోదరి అని సాయణుడు), ఆమె రాత్రికి అక్క (1.124.8)

లేక సోదరి (1.113.2, 3; 10.127.3). ఉషాసానక్తా లేక నక్తోషాసా (1.113.3) అనే దేవతాద్వంద్వంలో ఈ రెండు పేర్లూ కలిసివస్తాయి. ఉషస్సు ఆకాశంలో పుట్టింది (7.75.1); ఆమె పుట్టినచోటు వల్ల ఋగ్వేదంలో ఆమె తరచుగా స్వర్గానికి కూతురు ( దివోదుహితా, 1.30.22, మొ.) అని చెప్పబడింది. ఆమె ఒకచోట (1.46.1) స్వర్గానికి ప్రియ (ప్రియాదివః) అని కూడా చెప్పబడింది.

20.5 యాగంలో అగ్ని ఉషఃకాలంలో పుట్టించబడుతుంది కాబట్టి అగ్నికీ ఉషస్సుకీ ఈవిధమైన సంబంధం ఉంది; ఇటువంటి సందర్భాలలో యాగాగ్నితోపాటే పుట్టే అగ్ని రూపాంతరమైన సూర్యుడి స్మరణ కూడా ఉంది (1.124.1, 11, మొ.). అగ్ని ఉషస్సుతో లేక ఉషస్సుకి ముందు పుడతాడు. ఉషస్సా! నువ్వు అగ్ని ప్రజ్వలించడం చేశావు (ఉషోయదగ్నిం సమిధే చకర్థ, 1.113.9). అందువల్ల అగ్నికూడా సూర్యుడిలా ఆమె ప్రియుడని చెప్పబడ్డాడు (1.69.1; 7.10.1; చూ. 10.3.3). అగ్ని ప్రకాశిస్తూ వచ్చే ఉషస్సుని ధనం అడుగుతూ ( ద్రవిణం భిక్షమాణః) సమీపిస్తాడు (3.61.6). ఉషస్సుకీ ప్రాతఃకాలంలో వచ్చే జంటదేవతలైన అశ్వినులకీ సహజంగానే సంబంధం ఆపాదించబడింది (1.44.2, మొ.). వారు ఆమెతో వస్తారు (1.183.2); ఆమె వారి సఖి (సఖాభూ దశ్వినో రుషః, 4.52.2, 3). ఆమె వారిని లేపాలని ప్రార్థించబడింది (8.9.17); ఆమె స్తుతి వారిని లేపుతుంది (3.58.1). అశ్వినుల రథం ప్రయాణానికి కట్టబడగానే స్వర్గపుత్రిక పుడుతుంది (10.39.12). ఒకచోట ఉషస్సుకీ చంద్రుడికీ సంబంధం చెప్పబడింది: కొత్తకొత్తగా పుట్టే చంద్రుడు రోజులకి చిహ్నం; ఉషస్సులకి ముందు వెడతాడు ( నవో నవో భవతి జాయమానో౽హ్నాం కేతు రుషసామేత్యగ్రం, 10.85.19).

20.6 వివిధ దేవతలు ఉషస్సులని పుట్టించినట్లు లేక కనుగొన్నట్లు వర్ణించబడింది. కాంతిని సంపాదించే ఇంద్రుడు ఉషస్సుని పుట్టించాడు (2.12.7, మొ.). కాని కొన్నిచోట్ల ఇంద్రుడు ఆమెపై శత్రుత్వం వహించినట్లూ ఆమె రథాన్ని విరగగొట్టినట్లూ చెప్పబడింది (చూ. అధ్యాయం 22). సోముడు ఉషస్సులు పుట్టినప్పుడు వాటిని ప్రకాశించేటట్టు చేశాడు (6.39.3); ఆయన ఉషస్సులని సుపత్నులు ''మంచిపతి (= సూర్యుడు) కలవారు''గా చేశాడు (అయమకృణో దుషసః సుపత్నీః, 6.44.23); అగ్ని కూడా ఇలా చేసినట్లు చెప్పబడింది (7.6.5). బృహస్పతి చీకట్లని కాంతితో పారదోలి ఉషస్సునీ, ఆకాశాన్నీ (స్వర్-), అగ్నినీ బయటికి తీసుకువచ్చాడు (10.68.9). దేవతల మిత్రులైన

పితృదేవతలు తమ ఫలవంతమైన మంత్రాలతో దాగినకాంతిని బయటకు తెచ్చి ఉషస్సుని పుట్టించారు (గూళ్హం జ్యోతిః పితరో అన్వవిందన్ త్సత్య మంత్రా అజనయ న్నుషాసం, 7.76.4).

20.7 ఈ దేవత భక్తులకి ధనం, సంతానం, రక్షణ, దీర్ఘాయుస్సు ఇవ్వాలని ప్రార్థించ బడింది (1.30.22, 1.48.1, మొ.). ఆమె కవికి దానం చేసేవారికి గొప్ప యశస్సూ, ధనమూ ఇవ్వాలని ప్రార్థించబడింది (5.79.6, 7; చూ. 1.48.4). ఆమెని పూజించే వారికిఆమెసంపదఇవ్వాలనీ ''మేము నీకు తల్లికిపిల్లలులా ఉండాలి'' అనీ ప్రార్థించబడింది (వయం స్యామ మాతుర్న సూనవః, 7.81.4). మృతుడి ఆత్మ సూర్యుడి దగ్గిరకీ ఉషస్సు దగ్గిరకీవెళ్తుంది (10.58.8). పితృదేవతలు ఎర్రనివాటి ఒడిలో కూచుంటారు (ఆసీనాసో అరుణీనా ముపస్థే, 10.15.7) అని చెప్పినచోట ఉద్దిష్టమైనవి నిస్సందేహంగా ఉషస్సులే.

20.8 నిరుక్తంలోని నిఘంటువు (1.8) లో ఉషస్సుకి ఇచ్చినపదహారుపేర్లే (విభావరీ, సూనరీ, మొ.) కాక ఆమెకి విశేషణాలు చాలా ఉన్నాయి. ఆమె ప్రకాశవంతమైనది, తెల్లనిది, ఎర్రనిది, బంగారురంగు కలది, ధర్మంలో పుట్టినది, ఇంద్ర సదృశ, దివ్య, అమర్త్య. ఆమె దానగుణం ఒక విశిష్టలక్షణం కాబట్టి ఆమె 'మఘోనీ' అనబడుతుంది (5.79.7 మొ.).

20.9 ఉషస్ అనేశబ్దం వస్- 'ప్రకాశించు' అనేధాతువు నించి పుట్టింది; ధాతురూపంలో దీనికీ లాటిన్ అరోరా (Aurora), గ్రీక్. హోస్ అనే పదాలకీ సాజాత్యం ఉంది.

## 21. అశ్వినులు

21.1 ఋగ్వేదంలో అశ్వినుల (ప్రాతిపదిక అశ్విన్-, ప్రథమా బహువచనరూపం: అశ్వినా/ అశ్వినౌ) స్తుతుల ప్రాచుర్యాన్నిబట్టి చూస్తే ఇంద్రుడు, అగ్ని, సోముడు - వీరి తరవాత ఈ జంట దేవతలకే ఎక్కువ ప్రాముఖ్యం ఉందని తెలుస్తుంది. వీరు ఏభైకన్న ఎక్కువపూర్తిసూక్తాలలోనూ మరికొన్నిసూక్తభాగాలలోనూ స్తుతించబడ్డారు; ఈ పేరు 400 కన్న ఎక్కువసార్లు వచ్చింది. కాంతికిసంబంధించినదేవతలలో వీరికి ప్రత్యేకస్థానం ఉన్నా, ఈపేరు వేదభాషలో ఏర్పడినదే అయినా, వీరికీ కాంతిమంతమైన ఏ ప్రకృతి పదార్థానికీ స్పష్టమైన సంబంధం లేకపోవడం వల్ల అతిప్రాచీనకాలంనించి వేదవ్యాఖ్యాతలకి

వీరి ప్రాథమిక స్వభావం అంతుపట్టలేదు. ఈ అస్పష్టత వీరి ఉత్పత్తి వేదకాలానికి ముందుకాలంలోనే సంభవించి ఉండాలనే ఊహకి అవకాశం కల్పిస్తుంది. వీరు కవలలు (యమా, మిథునా, 3.39.3; 10.17.2); విడదీయనివారు. ఒక సూక్తం (2.39) ఏకైకోద్దేశం వీరిని కళ్లు, చేతులు, కాళ్లు, రెక్కలు వంటి జంటలతోనూ, జంటగా వెళ్లే కుక్కలూ, మేకలూ, హంసలూ, గద్దలూ వంటి జంతువులతోనూ పక్షులతోనూ పోల్చడమే (చూ. 5.78.1-3; 8.35.7-9; 10.106.2-10). కాని చాలాకొద్ది మంత్రాలు వీరు మొదట్లో వేరుగా ఉండేవారే అని సూచినట్లు కనపడుతుంది. వారు విడిగా పుట్టినవారు (నానా జాతౌ, 5.73.4); వారు వేరువేరు చోట్ల పుట్టినవారు (ఇహేహ జాతా), వారిలో ఒకరు జయశీలుడు (జిష్ణుః), మరొకరు స్వర్గానికి పుత్రుడు (దివ అన్యః సుభగః పుత్రః, 1,181.4). యాస్కుడు (నిరుక్తం 12.2) వీరిలో ఒకరు వాసాత్యుడు అనీ (దీనికి 'రాత్రి పుత్రుడు' అనే అర్థం అస్పష్టం) మరొకరు ఉషస్సు పుత్రుడు అనీ చెప్పేరు. ఋగ్వేదం మరొకమంత్రం (4.3.6) లో ఎప్పుడూ ద్వివచనంలో ఉండే నాసత్య- అనే అశ్వినుల విశేషణం ఏకవచనంలో వాడబడింది (పరిజ్మనేనాసత్యాయ 'అన్నిచోట్లకివెళ్లేనాసత్యుడికి').

21.2 అశ్వినులు యువకులు (యువానా, 7.67.10); తై.సం. (7.2.7.2) లో వారు దేవతలందరిలోకీ చిన్నవారని చెప్పబడింది (అశ్వినౌవై దేవానా మానుజావరౌ). అయినా వారు ప్రాచీనులు (ప్రత్నా, 6.62.5). వారు తెల్లనివారు (శుభ్రా, 7.68.1), కాంతికి పతులు (శుభస్పతీ, 8.22.14; 10.93.6), బంగారు రంగుకలవారు (హిరణ్యపేశసా, 8.8.2), తేనెరంగు కలవారు (మధువర్ణా, 8.26.6). వారు చాలారూపాలు కలవారు (పురూ వర్పాం స్యశ్వినా దధానా, 1.117.9). వారు అందమైనవారు (వల్గూ, 6.62.5); తామర పువ్వుల దండలు వేసుకొంటారు (పుష్కరస్రజా, 10.184.2; అ.వే. 3.22.4; శ.బ్రా. 4.1.5.16). వారు వేగవంతులు (6.6.3.5); మనోవేగం కలవారు (మనోజవసా, 8.22.16); గద్దలావేగం కలవారు (5.78.4). వారు బలవంతులు (6.62.5; 10.24.4). వారు చాలాచోట్ల ఎర్రనివారు అని చెప్పబడ్డారు (రుద్రా, 5.75.3, మొ.). వారు గొప్ప జ్ఞానం కలవారు (గంభీరచేతసా, 8.8.2); మాయాశక్తి కలవారు (మాయినా, 6.63.5; 10.93.7). వారికి మాత్రమే తరచుగా ఉపయోగించబడిన రెండు విశేషణాలు దస్ర- 'ఆశ్చర్యకరమైనవారు', నాసత్య-; నాసత్య పదానికి (న- అసత్య-) 'అసత్యం లేనివారు' అనే అర్థం సాధారణంగా ఇవ్వబడింది; కాని 'రక్షకులు' (నస్- అనే ధాతువు నించి) మొదలైన

45243

కొన్ని ఇతర వ్యుత్పత్తులు (పాశ్చాత్యపండితుల చేత) ప్రతిపాదించబడ్డాయి. ఈపదం ఒక రాక్షసుడికి పేరుగా అవెస్తాలో ఉంది కాని అందులో ఇంకే వివరాలూ లేవు. ఈరెండు విశేషణాలూ అశ్వినుల విడివిడి పేర్లుగా తరవాతకాలంలో మారేయి. రుద్రవర్తని- 'ఎర్రనిమార్గం కలవారు' అనేవిశేషణం వారికి ప్రత్యేకమైనది; దేవతలలో వీరేహిరణ్యవర్తని- 'బంగారు మార్గం కలవారు' అని చెప్పబడ్డారు; ఇది వీరికి విశేషణంగా ఉపయోగించబడని రెండుచోట్లా ఇది నదులకు విశేషణంగా వాడబడింది.

21.3 దేవతలందరిలోనూ అశ్వినులేతేనె(మధు-)తో ఎక్కువసంబంధం కలవారుగా చాలా మంత్రాలలో చెప్పబడింది. వారి చర్మం మధువుతో నిండినది (దృతిం వహేథే మధుమంతమశ్వినా, 4.45.3); వారికి వాహనాలైనహంసలు మధువు కలవి (హంసాసో యేవాం మధుమంతః, 4.45.4). వారు (తమని) పూజించిన మనుష్యుడికి 100 కుంభాలలో తేనె నింపి ఇచ్చారు (జనాయ శతం కుంభాన్ అసించతం మధూనాం, 1.117.6). వారిగుర్రాలనితోలే కర్ర మధువుతో నిండినది (మధుమత్యానః కశయా, 1.157.4); దానితోవారు యజ్ఞానికీ యాగకర్తకీ మధువు వెదజల్లుతారు; ఇది వారి ప్రత్యేకత. అశ్వినుల రథం మాత్రమే మధువర్ణం కలదిఅనీ మధువాహనం అనీ వర్ణించబడింది. వారు మాత్రమే మధువంటే ఇష్టపడేవారు (మధూయు-, మాధ్వీ-) గానూ మధువు తాగేవారు (మధుపా-) గానూ వర్ణించబడ్డారు. వారిని ఆహ్వానించే అధ్వర్యుడు కూడా మధుపాణి 'తేనెచేతిలో కలవాడు' (10.41.3) అని చెప్పబడ్డాడు. వారు తేనెటీగకు తేనె ఇస్తారు(1.112.21; చూ. 10.40.6); వారు తేనెటీగలతో పోల్చబడ్డారు(10.106.10). కాని వారు ఇతర దేవతలలా సోమం అంటే ఇష్టపడతారు (3.58.7, 9, మొ.); వారు ఉషస్సు, సూర్యులతో పాటు సోమపానానికి ఆహ్వానించబడ్డారు (8.35.1). కాని హిలెబ్రాంట్(అనే పాశ్చాత్య పండితుడు) సోమాన్ని ఆహుతి చేసే దేవతల బృందంలో మొదట్లో అశ్వినులు లేరు అనడానికి సూచనలు ఉన్నాయని కనుగొన్నారు.

21.4 అశ్వినులరథం సూర్యుడిలా ప్రకాశించేది (సూర్యత్వచా, 8.8.2), బంగారంతో చేసినది (4.44.4, 5); దాని భాగాలైనచక్రాలూ, వాటిగుండ్రని భాగం, ఇరుసు, పగ్గాలూ మొదలైనవి బంగారంతో చేసినవి (1.180.1; 8.5.29; 8.22.5). దానికివెయ్యికిరణాలు (1.119.1) లేకఆభరణాలు రూపాలు (సహస్రనిర్ణిజా, 8.8.11, 14) ఉన్నాయి. ఈ

రథానికి మూడు చక్రాలూ, మూడు సారథి కూర్చునే చోట్లూ (త్రివంధురేణ), కొన్ని ఇతర భాగాలు కూడా మూడుమూడుగా ఉండడం వల్ల దీని నిర్మాణం ప్రత్యేకమైనది (త్రివంధురేణ త్రివృతా రథేన త్రిచక్రేణ, 1.118.2, మొ.) అదివేగంగా ప్రయాణిస్తుంది (8.9.8), మనస్సుకన్న వేగవంతమైనది (మనసోజవీయాన్, 1.117.2, మొ.), కనురెప్పపాటుకన్న వేగవంతమైనది (?8.62.2). దాన్ని ఋభువులు చేశారు (రథం యంవా మృభవశ్చక్రు రశ్వినా, 10.39.12). అశ్వినుల రథం మాత్రమే మూడు చక్రాలు కలది. వారు సూర్య (సవితపుత్రిక) వివాహానికివెళ్లినప్పుడు వారి రథానికి ఒకచక్రం లేదని 10.85.15 (క్వైకం చక్రం వామాసీత్) లో చెప్పబడింది (చూ. అధ్యాయం 37).

21.5 అశ్వినుల పేరు మాత్రమే వారికిగుర్రాలు ఉన్నాయి అని సూచిస్తుంది కాని వారు గుర్రాల మీద ప్రయాణిస్తారనడానికి ఆధారం లేదు. వారి రథాన్నిగుర్రాలూ (1.117.2, మొ.), ఇంకా సాధారణంగా పక్షులూ (వి-, 6.63.6, మొ; పతత్రిన్-, 10.143.5), హంసలూ (4.45.4), గద్దలూ (1.118.4), పక్షులూగుర్రాలూ (లేకగుర్రాల వంటి (వేగంకల) పక్షులూ, వయోఽ శ్వాసః, 6.63.7), గద్దలూ గుర్రాలూ (లేక గుర్రాల వంటి (వేగంకల) గద్దలూ, శ్యేనేభి రశ్వైభిః, 8.5.7) లాగుతాయనిచెప్పబడింది. కొన్నిచోట్ల దాన్నిలాగేవి ఒక దున్నపోతు (కకుహ-) లేకదున్నపోతులు (5.73.7; 1.184.3, మొ.) లేక ఒకగాడిద (రాసభ-, 1.34.9; 1.116.2; ?8.74.7) అని చెప్పబడింది. ఐ.బ్రా. (4.7-9) లో సోముడికీ సూర్యకీ వివాహం జరిగినప్పుడు అశ్వినులు గాడిదలు లాగిన రథంతో పందెంగెలిచినట్లుచెప్పబడింది (చూ. ఋగ్వేదం 1.116.2, దానిపైసాయణుడి వ్యాఖ్య). వారి రథం స్వర్గం చివరలనిస్పృశిస్తుంది, ఐదు దేశాలకీవ్యాపిస్తుంది (?7.63.2, 3). అది స్వర్గం చుట్టూ తిరుగుతుంది (91.180.10). అది సూర్యుడి రథంలా (1.115.3), ఉషస్సు రథంలా (4.51.5) స్వర్గాన్నీ భూమినీ ఒకేరోజులో చుట్టివస్తుంది (3.58.8). అది దూరప్రదేశంలో సూర్యుడి చుట్టూ తిరుగుతుంది (1.112.13). అశ్వినులగమనమార్గం (వర్తిస్-) తరచు చెప్పబడింది; ఈ వర్తిస్- అనే పదం ఒకచోట తప్ప మిగిలిన అన్నిచోట్ల అశ్వినుల విషయంలోనే వాడబడింది. పరిజ్మన్- 'చుట్టూ తిరిగేది / తిరిగేవాడు' అనే పదంకూడా చాలాచోట్ల అశ్వినుల లేక వారి రథవిషయంలో ఉపయోగించబడింది; ఇది వాతుడు, అగ్ని, సూర్యుడు - వీరి విషయంలో కూడా ఉపయోగించబడింది.

21.6 అశ్వినులస్థానం రకరకాలుగా చెప్పబడింది. వారు దూరంనించి వస్తారు (8.5.30), స్వర్గాన్నించి వస్తారు (8.8.7), స్వర్గాన్నించీ భూమినించీ వస్తారు (1.44.5), స్వర్గాన్నించీ అంతరిక్షాన్నించీ వస్తారు (8.8.4; 8.9.2), అంతరిక్షాన్నించి వస్తారు (8.8.3), భూమీ, స్వర్గమూ, సముద్రాలనించీ వస్తారు (8.10.1), అంతరిక్షాన్నించీ, దూరంనించీ దగ్గరనించీ వస్తారు (5.73.1). వారు స్వర్గంలోని సముద్రంలో (8.26.17), స్వర్గంలోని వరదలో, మొక్కలలో, ఇళ్లలో, పర్వత శిఖరం మీద ఉంటారు (7.70.3). వారు వెనకనించీ, ముందునించీ, కిందనించి, పైనించీ వస్తారు (7.72.5). కొన్నిచోట్ల వారిస్థానం తెలియనట్లుగా అది ఎక్కడ ఉంది? అని ప్రశ్నించబడింది (5.74.2, 3; 6.63.1; ?8.62.4). ఒకచోట (8.8.23) వారికి మూడు స్థానాలు (పదాని) ఉన్నట్లు చెప్పబడింది; ఇలా చెప్పడానికి వారు రోజుకి మూడుసార్లు ఆహ్వానించబడడం కారణం కావచ్చు.

21.7 వారు కనపడేకాలం ''ఇంకా చీకటి ఎర్రని గోవుల మధ్య నిలిచి ఉన్న'' (కృష్ణే యద్గోష్వరుణీషు సీదత్) తెల్లవారగట్ల అని తరచు చెప్పబడింది (10.61.4). వారు ప్రాతఃకాలంలో రథాన్ని కట్టుకొని యజ్ఞంచేసేవారు ఇచ్చే ఆహుతులని స్వీకరించడానికి భూమికి దిగుతారు (1.22.2, మొ.). ఉషస్సు వారిని లేపుతుంది (8.9.17). వారు తమ రథంలో ఉషస్సుని అనుసరిస్తారు (8.5.2). వారు రథాన్ని కట్టినప్పుడు ఉషస్సు పుడుతుంది (యస్య యోగే దుహితా జాయతే దివః, 10.39.12). అందువల్ల వారు ఉదయించేకాలం ఉషస్సుకీ సూర్యోదయానికీ మధ్యకాలం అనుకోవచ్చు. కాని ఒకచోట (1.34.10) వారి రథాన్ని సవిత ఉషఃకాలానికి ముందే ప్రేరిస్తాడని చెప్పబడింది (యువోర్హి పూర్వం సవితో షసో రథమృతాయ చిత్రం ఘృతవంత మిష్యతి). అశ్వినులు రావడమూ, యాగాన్ని ప్రజ్వరిల్లడమూ, తెల్లవారడమూ, సూర్యోదయమూ - ఇవన్నీ ఒకేకాలంలో జరుగుతాయని అరుదుగా చెప్పబడింది (1.157.1; 7.72.4). అశ్వినులని యాగానికి ఆహ్వానించడం వారికి విధించబడిన కాలంలోనే కాక సాయంత్రమూ (లేక రాత్రి, దోషా, 8.22.14), ప్రాతఃకాలంలోనూ, మధ్యాహ్నమూ, సూర్యాస్తమయ కాలంలోనూ ( ఉతాయాతం సంగవే ప్రాతరహ్నో మధ్యందిన ఉదితా సూర్యస్య, 5.76.3; సంగవే = గోవులు పిలికే చోటుకి కలిసి వచ్చే కాలంలో) కూడా ఉంది. మూడుపూట్లా జరిగే యాగాలకి అశ్వినులు రావడం కారణంగా వారిని స్తుతించే ఒక సూక్తం (1.34) అంతటా త్రిశబ్దం విరివిగా వాడబడింది (త్రయః పవయః 'మూడు చక్రాలు', త్రయః స్కంభాసః 'మూడు స్తంభాలు'

(రథానివి), మొ). ప్రాతఃకాల దేవతలు అవడం వల్ల అశ్వినులు చీకటిని పారదోల్తారు (3.39.3); వారు చెడ్డ భూతాలని కూడా తరిమివేస్తారని కొన్నిచోట్ల చెప్పబడింది (7.73.4; 8.35.16). ఐ.బ్రా. (2.15) లో అశ్వినులూ, ఉషస్సూ, అగ్నీ తెల్లవారుజాము దేవతలని చెప్పబడింది; యాగకర్మలో వారికి సూర్యోదయంతో సంబంధం ఆపాదించబడింది. శ.బ్రా. (5.5.4.1) లో అశ్వినులు ఎరుపూ తెలుపూ కలిసిన రంగుకల మేకని ఆహుతి ఇవ్వాలనీ చెప్పబడింది.

21.8 వారు స్వర్గం యొక్క పుత్రులు (దివోనపాతా, 1.182.1; 1.184.1; 10.61.4); వారిలో ఒకరు మాత్రం స్వర్గం యొక్క పుత్రుడని ఒక చోట (1.182.4) చెప్పబడింది (దివోఅన్యః సుభగః పుత్రః) వారికి సముద్రం తల్లి అని ఒకచోట (సింధుమాతరా, 1.46.2) చెప్పబడింది. మరొకచోట (10.17.2) వారు వివస్వత్తుకీ త్వష్ట కూతురైన సరణ్యుకీ కవలపిల్లలని చెప్పబడింది; వివస్వత్తూ సరణ్యూ క్రమంగా ఉదయించే సూర్యుడికీ తెల్లవారుజాముకీ ప్రతీకలైనట్లు కనపడుతుంది (చూ. అధ్యాయం 18.1). ఇంకొకవైపు సూర్యసంబంధి దేవత అయిన పూషుడు అశ్వినులని తనకి తండ్రులుగా (ఉండాలని) కోరుకొన్నట్లు చెప్పబడింది (పితరా వివృణీత పూషా, 10.85.14). వారి సోదరి (1.180.2) అని చెప్పబడింది ఉషస్సే కావచ్చు (చూ. అధ్యాయం 20.5). ప్రాతఃకాలపు కాంతికి సంబంధించిన పురుషదేవతలైన వారికీ సూర్యుణ్ణే స్త్రీగా భావించి కల్పించబడిన 'సూర్యా' కీ లేక (ఇంతకన్న తరచుగా) సూర్యుడి కూతురికీ సంబంధం కల్పించబడింది. వీరు సూర్యకి భర్తలు (పతీ భవథః సూర్యాయాః, 4.43.6; చూ. 1.119.5); ఆమె వీరిని వరించింది (7.69.4). సూర్య (5.73.5) లేక కన్య (8.8.10) వీరి రథం ఎక్కింది (ఆయద్వాం సూర్యా రథం తిష్ఠత్). సూర్యుడి కూతురు వీరి రథం ఎక్కింది (వాం సూరే దుహితా రుహద్రథం, 1.34.5; 1.116.17; 1.118.5; 6.63.5) లేక వరించింది (1.1171.3; 4.43.2). సూర్య వారికి స్వంతం (సూర్యావసూ (= సూర్యతో రథం మీద వసించేవారు అని సాయణుడు, 7.68.3); సూర్య వారితో కలిసి రథం మీద రావడం ఒక ప్రత్యేకత (8.29.8). 5.46.8 లో ఇతర దేవపత్నులతోపాటు ప్రస్తావించబడిన 'అశ్వినీ' అనే దేవత సూర్యే కావచ్చు. ఒక అర్వాచీన సూక్తం (10.85.9) లో సవిత సూర్యని భర్తకి ఇచ్చినప్పుడు సోముడు వధువుని కోరేవాడు (వధూయుః) అయ్యాడనీ అశ్వినులు వరులు అయ్యారనీ చెప్పబడింది (సోమో వధూయు రభవ దశ్వినాస్తాముభావరా). మరొక

మంత్రం (6.58.4) లో దేవతలు పూషణ్ణి సూర్యకి ఇచ్చారు అని చెప్పబడింది. సూర్యతో అశ్వినులకి ఉన్న సంబంధం వల్ల వారు వధువుని తమ రథంమీద భర్త ఇంటికి చేర్చాలని ప్రార్థించబడ్డారు (అశ్వినా త్వాప్ర వహతాం రథేన, 10.85.26). మరికొందరు ఇతర దేవతలతోపాటు అశ్వినులు కూడా వధువుకి సంతానప్రాప్తి కలిగించాలని ప్రార్థించబడ్డారు (10.184.2).[1] వారు నపుంసకుడి భార్యకి సంతానం ఇస్తారు; గొడ్డుపోయిన ఆవుపాలు ఇచ్చేటట్టు చేస్తారు (1.112.3). వారు తండ్రి ఇంట్లోనే ఉండిపోయిన ఘోష అనే వృద్ధకన్యకు పతిని ఇచ్చారు (1.117.7, 10.39.3); ఇతరవరులతో పోరాడలేని విమదుడనే అసమర్థుడి భార్యని తమ రథంమీద అతని ఇంటికి చేర్చారు (1.116.1, మొ.)[2] అథర్వవేదం (2.30.2, మొ.) లో వారు ప్రేమికులని కలుపుతారని చెప్పబడింది.

21.9 అశ్వినులు మరుగుపడిన సూర్యకాంతిని బయటకు తెచ్చేవారుగా మొదట్లో భావించబడి ఉండవచ్చు. ఋగ్వేదంలో వారు ఆపదలో ఆదుకునే దేవతలుగా ప్రసిద్ధి పొందేరు. వారు అతివేగంగా సాయంచేసి ఆపదలనించి తప్పించేవారు (1.112.2, 1.118.3). అటువంటి కృత్యాలకి వారు తరచుగా పొగడబడ్డారు. ముఖ్యంగా వారు సముద్రంలో చిక్కుకొన్న వారిని ఓడల(ల)లో కాపాడతారు. వారు సముద్రం నించీ స్వర్గాన్నించీ సంపదలు తెచ్చి ఇమ్మని ప్రార్థించబడ్డారు (1.47.6); వారి రథం సముద్రాన్నించి వస్తుంది (ఇక్కడసముద్రం అంటే అంతరిక్షంలో నీరు కావచ్చు, 4.43.5). అన్నిరకాల ఆపదలనించీ వారు ఇచ్చే రక్షణ శాంతియుతమైన దైవానుగ్రహానికి ప్రత్యక్షనిదర్శనమే కాని అది ఇంద్రుడి విషయంలోలా యుద్ధంలో శత్రుజయం కలిగించడం కాదు (కాని వారు ఒకసారి ఇంద్రుడితో కలిసి యుద్ధంలో పాల్గొని 'వృత్రఘ్నులు' అనే బిరుదు కూడా పొందినట్లు చెప్పబడింది). అందువల్ల దేవతలైన వైద్యులు (దైవ్యాభిషజా) గా ఉండడం వారి ప్రత్యేకత (8.18.8, మొ.); వారు మందులతో రోగాలు తగ్గిస్తారు (8.22.10, మొ); పోయిన దృష్టి మళ్లీ కలిగిస్తారు (1.116.16), గుడ్డివారికీ, రోగులకీ, అంగవైకల్యం వచ్చినవారికీ వైద్యం చేసి నయం చేస్తారు (10.39.3). వారు దేవతలకి వైద్యులు, అమర్త్యత్వానికి రక్షకులు; భక్తుల నించి మృత్యువుని పారదోల్తారు (అ.వే. 7.53.1; తై.బ్రా. 3.1.3.11). సాయంచేసేవారుగా,

1. గర్భం ధేహి సినీవాలి గర్భం ధేహి సరస్వతి
గర్భంతే అశ్వినా దేవా వాధత్తాం పుష్కరస్రజా.

2. యా వర్భగాయ విమదాయ జాయాం సేనాజువా న్యూహతూ రథేన.

వైద్యులుగా, ఆశ్చర్యకరమైన పనులు చేసేవారుగా వారికి ఉన్న ప్రత్యేకతే కాక వారి సాధారణ దానగుణం కూడా తరచు స్తుతించబడింది. వారు వారి భక్తుడికి కనుచూపుతోపాటు ముసలితనం వరకూ ఆయుస్సూ, సంపదలూ, అధికసంతానమూ ఇస్తారు (1.116.25; 8.8.13, మొ.).

21.10 ఆపదలనించి రక్షించే అశ్వినుల శక్తికి ఉదాహరణలైన ఇతివృత్తాలు అనేకం ఋగ్వేదంలో స్మరించబడ్డాయి. బంధువులు వదలివేసిన చ్యవానుడు అనే వృద్ధఋషి జీర్ణశరీరాన్ని మార్చి అశ్వినులు ఆయనకి యౌవనమూ దీర్ఘాయుస్సూ ఇచ్చి ఆయన భార్య ఇష్టపడేటట్లు చేసి ఆయన్ని ఇతర కన్యలకు కూడా భర్తగా చేశారు (1.116.10, మొ.). అశ్వినులు చ్యవానుణ్ణి యువకుడుగా మార్చిన కథ వివరంగా శ. బ్రా. (4.1.5) లో ఉంది. వారు కలి అనే వృద్ధఋషికి కూడా యౌవనం ఇచ్చి (10.39.8) ఆయనకు భార్య లభించిన తరవాత వారిని కాపాడేరు (1.112.15). వారు విమదుడు అనే యువకుడికి భార్యలని (1.112.19) / కమద్యూ (10.65.12) అనే పేరుగల భార్యని (1.116.1) రథంమీద తీసుకొని వచ్చి ఇచ్చారు; ఇలా వారు తీసుకువచ్చిన స్త్రీ పురుమిత్రుడి పుత్రిక (పురుమిత్రస్యయోషాం, 1.117.20; శుంధ్యువం న్యూహథుః పురుమిత్రస్య యోషణాం, 10.39.7).[3] వారు కృష్ణుకి పుత్రుడైన విశ్వకుడికి (ఆయన కొడుకైన) విష్ణాపుణ్ణి (విష్ణాపు-) తప్పిపోయిన జంతువుని వెతికి తీసుకువచ్చినట్లు తీసుకువచ్చి చూపెట్టి ఇచ్చారు (1.116.23; 1.117.7; 10.65.12). చాలా తరచుగా చెప్పబడినది తుగ్రుడి కొడుకైన భుజ్యుడి (భుజ్యు-) కథ (1.116.3-5). అశ్వినుల భక్తుడైన తుగ్రుడు అనే రాజర్షి ద్వీపాంతరంలో ఉన్న తన శత్రువులని జయించడానికి తన కొడుకైన భుజ్యుణ్ని సేనతో నావలో పంపేడు. ఆ నావ సముద్ర మధ్యంలో పగిలిపోయింది. అప్పుడు భుజ్యుడు అశ్వినులని స్తుతించగా నిలవడానికి స్థానమూ పట్టుకొనేందుకు ఏమీలేని సముద్రంలో (అనాస్థానే అగ్రభణే సముద్రే) ఉన్న అతణ్ని వందతెడ్లుగల నావ (శతారిత్రాం నావం) ఎక్కించి అశ్వినులు కాపాడేరు. వారు అతణ్ని ప్రాణంగల (ఆత్మన్వతీభిః), నీరు ఎక్కని (అపోదకాభిః) అంతరిక్షంలో వెళ్లే నావలలో కాపాడి తీసుకువచ్చారు (5). వారు

---

3. ఇక్కడ పురుమిత్రస్య యోషా / యోషణా అంటే పురుమిత్రుడి పుత్రిక అని సాయణుడు చెప్పినట్లే అర్థం చెప్పడం సముచితం. మేక్డొనెల్ పురుమిత్రుడి భార్య (Spouse) అని అర్థం చెప్పడం సముచితం కాదు. ఆమె పేరు కమద్యూ- / శుంధ్యూ- అని రెండు విధాలుగా ఉండడం గమనించదగినది.

వందచక్రాలూ, ఆరుగుర్రాలూ గల మూడు ఎగిరే రథాలపై మూడు రాత్రులూ, మూడు పగళ్లూ ప్రయాణించి అతణ్ని సముద్రం ఒడ్డుకి చేర్చేరు (4). మరొక మంత్రంలో భుజ్యుడు కెరటాలమధ్య ఒక కొయ్యపట్టుకొని వేళ్లాడినట్లు వర్ణించబడింది. రాక్షసులు రేభుడు అనే ఋషిని హింసించి తాళ్లతో కట్టి నూతిలో పడవేస్తే ఆయన అశ్వినులని పదిరాత్రులూ తొమ్మిది పగళ్లూ స్తుతించగా వారు వచ్చి సోమరసాన్ని తెడ్డుతో గిన్నెలోంచి బయటికి తీసినట్లు (ఉన్నిన్యథుః సోమ మివ స్రువేణ) ఆయన్ని నీటిలోంచి బయటికి తీశారు (1.116.24). వారు నందనుడు అనే ఋషిని నూతిలోనించి తీసి వెలుగు చూసేటట్లు చేశారు (1.112.5; 1.116.11; 1.117.5; 1.118.6; 10.39.8); ఆయనకు వృద్ధత్వం తొలగించి దీర్ఘాయుస్సు ఇచ్చారు (1.119.6, 7). వారు అత్రి సప్తవధ్రి అనే ఋషి రాక్షసుల మాయవల్ల తన స్నేహితులతో నిప్పుగుండంలో పడినప్పుడు ఆయన్ని కాపాడేరు. ఆయనకి చల్లని పానీయం ఇచ్చి మంటలనించి రక్షించి చివరికి యువకుడుగా చేసే శక్తినిచ్చారు. ఆయన్ని చీకటినించి తప్పించారు. అగ్ని అత్రిని మంటలనించి తప్పించాడు (10.39.7) అని చెప్పినప్పుడు అగ్ని అశ్వినుల సహాయంతో ఆయన్ని కాపాడేడు అనే భావం ఉద్దిష్టమై ఉండవచ్చు. అశ్వినులు తమని ప్రార్థించిన చిన్న పక్షిని కూడా తోడేలు నోటినించి తప్పించారు (1.112.8).

21.11 వృషాగిరుడి పుత్రుడైన ఋజ్రాశ్వుడు ప్రజలకు చెందిన వందమేకల్ని కోసి ఆడతోడేలు రూపంలో ఉన్న అశ్వినుల వాహనమైన గాడిదకు పెట్టినప్పుడు తండ్రి ఆయన్ని గుడ్డివాడు అవ్వాలని శపించాడు; అశ్వినులు అతని ప్రార్థన విని ఆయనకి మళ్లీ కళ్లు ఇచ్చారు (1.116.16; 1.117.17, 18). వారు పరావృజుడు అనే ఆయన గుడ్డితనమూ, కుంటితనమూ పోగొట్టేరు (1.112.8). 'విశ్పలా' అనే ఆమె కాలు యుద్ధంలో తెగిపోయినప్పుడు వారు ఆమెకి ఇనపకాలు పెట్టేరు (1.112.10; 1.116.15). ఘోష అనే స్త్రీ తండ్రి ఇంట్లో ముసలిది ఐపోతున్నప్పుడు వారు ఆమెకి భర్తని ప్రసాదించి అనుగ్రహించారు (1.117.7; 10.39.3, 6; 10.40.5). నపుంసకుడి భార్యకు వారు హిరణ్యహస్తుడు (1.1116.13; 1.117.24; 6.62.7; 10.39.7) లేక శ్యావుడు (10.65.12) అనే పిల్లవాణ్ణి ప్రసాదించారు. వారు శయుడి గొడ్డుపోయిన ఆవు పాలు ఇచ్చేటట్లు చేశారు (1.116.22, మొ.). 'పేదు' అనే ఆయనకి వారు రాక్షసులని చంపే బలిష్ఠమైన తెల్లని గుర్రాన్ని ఇచ్చారు; అది ఇంద్రుడు ఇచ్చిన శక్తితో ఆయనకి అపరిమితమైన

సంపదసంపాదించి ఇచ్చింది (1.116.6, మొ.). పజ్రుడి వంశానికిచెందినకక్షీవంతుడికి వారు జ్ఞానం ఇచ్చి తమగుర్రం డెక్కనించి జల్లెడనించి కారినట్లు కారినకల్లు (1.116.7) / తేనె (1.117.6) వందకుండలలో నింపి ఇచ్చారు. వారు చేసిన మరొక ఆశ్చర్యకరమైన కృత్యం తేనెకు సంబంధించినది: అధర్వుడి కొడుకైన దధ్యంచుడి మీద వారు ఒకగుర్రం తలపెట్టగా ఆయన త్వష్టకి సంబంధించిన మధువు ఎక్కడ ఉందో వారికి చెప్పాడు (అధ్యాయం 53). పైనచెప్పిన వ్యక్తులకే కాక, చాలామంది ఇతరులకు కూడా అశ్వినులు సహాయం చేసినట్లు ఋగ్వేదం 1.112, 1.116-119లలో చెప్పబడింది. వీరిలో చాలామంది ఊహించనివిధంగా ఆపదలనించి తప్పించుకొన్నవారు లేక జబ్బులు నయమైనవారు అయిన నిజమైన వ్యక్తులే అయి ఉంటారు. అశ్వినులకు రక్షకులూ వైద్యులూ అయినదేవతలు అనే ప్రసిద్ధి వచ్చి ఉండడం వల్ల ఊహించని విధంగా గండంతప్పిన పరిస్థితులన్నీ అశ్వినుల దివ్యశక్తివల్లసంభవించాయని భావించబడిఉంటుంది. అశ్వినులకు ఆపాదించిన ఇటువంటి అనూహ్యసంఘటనలు సూర్యుడికిసంబంధించినవిషయాలని మానవులకు అన్వయించి కల్పించిన కథలు (ఉదాహరణకి, గుడ్డితనం పోగొట్టడం అనే దానిభావం సూర్యుణ్ణి చీకటిలోంచి బయటికితేవడం) అనే బెర్గెయిన్(Bergaigne) వంటి కొందరు పండితుల అభిప్రాయంలో సామంజస్యం ఉన్నట్లు కనపడదు. అయినా అత్రికథ (చూ. అధ్యాయం 56) మరుగుపడినసూర్యుణ్ణి బయటకి తేవడం అనేదాని ప్రతీకకావచ్చు.

21.12 అశ్వినుల ప్రకృత్యాధారం విషయంలో ఋషులు చెప్పిన మాటలే అస్పష్టంగా ఉండడం వల్ల దీన్నిగురించి వారికేస్పష్టమైనఅభిప్రాయం లేదని అనుకోవాలి. ప్రాతఃకాలానికి సంబంధించిన ఇతరదేవతలైనరాత్రినిపోగొట్టేఅగ్ని, మనుష్యుల్ని లేపేఉషస్సు, ఉదయించే సూర్యుడు - వీరినిగురించినస్తుతులు అశ్వినులస్తుతులకన్న చాలా విపులంగా ఉన్నాయి. శబ్దవ్యుత్పత్తి రీత్యా అశ్వినులు అంటే ''గుర్రాలు కలవారు'' అని చెప్పుకోవచ్చు; ఇక్కడ గుర్రాలు కాంతి కిరణాలకి, ముఖ్యంగా సూర్యకిరణాలకి ప్రతీకలు.[4] కాని అశ్వినులు అసలు వేటికి ప్రతీకలు అనే విషయం యాస్కుడు స్మరించిన ప్రాచీనవ్యాఖ్యాతలకే అంతుపట్టలేదు. ఆయన (నిరుక్తం 12.1) అశ్వినులంటే స్వర్గమూ భూమీ అని కొందరూ (శ.బ్రా.

---

4. ఈ సందర్భంలో సాయణుడు అశ్విన్- శబ్దానికి అశ్వవంతా ''గుర్రాలు కలవారు'' సర్వం వ్యాప్నువంతౌవా '' లేక అంతటా వ్యాపించేవారు'' అని రెండు వ్యుత్పత్తులు ఇచ్చారు (10.65.12 వ్యాఖ్య) అని గమనించాలి. రెండో వ్యుత్పత్తి ప్రకారం ఇది అశ్- 'వ్యాపించు' అనే ధాతువు నించి ఏర్పడినది; ఇది శ.బ్రా. (4.1.5.16)లోనే ఇవ్వబడింది (అశ్వినా విమేహీదం సర్వమశ్నువాతాం).

4.1.5.16లో కూడా ఇలాగేచెప్పబడింది), పగలూ, రాత్రీ అని మరికొందరూ, సూర్యుడూ చంద్రుడూ అని ఇంకా కొందరూ, పుణ్యకార్యాలు చేసిన ఇద్దరు రాజులు (రాజానౌ పుణ్యకృతౌ) అని ఐతిహాసికులూ చెప్పేరు అని చెప్పేరు.

21.13 ఈ విషయంలో యాస్కుడి స్వంత అభిప్రాయం అస్పష్టం.[5] ఆయన అభిప్రాయంలో అశ్వినులు అంటే ఇంద్రుడూ సూర్యుడూ అని రోథ్(Roth) అన్నారు (చూ. రసేనాన్యః; జ్యోతిషాన్యః, అథస్సూచిక 5), గోల్డ్‌స్టుకర్(Goldstucker) అశ్వినులలా అవినాభావ సంబంధంగల చీకటి పోయి వెలుగు రావడం (యాస్కుడి అభిప్రాయం) అని ఈ ఊహతో ఏకీభవించారు. మిరియాన్‌థేస్(Myriantheus), హాప్కిన్స్(Hopkins) కూడా ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు; వీరిలో రెండో ఆయన ఈ ఎడబాటులేని కవలలు తెల్లవారేముందు సగం చీకటీ, సగం వెలుగూ కలిసిన కనుచీకటికి ప్రతీకలు కావచ్చుననీ అందువల్లనే వారిలో ఒకరు మాత్రమే ద్యౌస్ 'ప్రకాశించే ఆకాశం' పుత్రుడని చెప్పబడ్డాడనీ (చూ. 21.8) అన్నారు. ఇతర పండితులు (లుద్విక్ (Ludwig) మొదలైనవారు) అశ్వినులంటే సూర్యచంద్రులనే అభిప్రాయాన్ని అంగీకరించారు. మన్‌హార్ట్ (Mannhardt), బోలెన్‌సెన్(Bollensen) లను అనుసరించి ఓల్డెన్‌బెర్గ్ (Oldenberg) ప్రాతఃకాలంలో అగ్నీ, ఉషస్సూ, సూర్యుడూ కాక కాంతినిచ్చేది వేగుచుక్క (శుక్రుడు) కాబట్టి అదే అశ్వినుల ప్రకృత్యాధారం అన్నారు. ఈ ప్రతిపాదనకి అశ్వినుల కాలమూ, ప్రకాశగుణమూ, ఆకాశం చుట్టూ తిరగడమూ సరిపోతాయి; కాని వారు ఇద్దరు అవడం దీనికి బాధకం.

21.14 ప్రాతఃకాలంలో కనపడే వేగుచుక్కకి తోడుగా సాయంకాలం కనపడే నక్షత్రం ఉందికాని వాటి రెండిటికీ కాలంలో శాశ్వతమైన భేదం ఉంది; అశ్వినులు ఎప్పుడూ కలిసే ఉంటారు. కాని వారు ఒకటి రెండు ఋగ్వేదమంత్రాలలో (1.182.4) విడివిడిగా చెప్పబడ్డారు. యజ్ఞకర్మకి ప్రాతఃకాలం చాలాముఖ్యమూ సాయంకాలం అముఖ్యమూ (5.77.2) అయినా, అశ్వినులు కొన్నిచోట్ల (88.22.14; 10.39.1; 10.40.4) ఈ రెండు కాలాలలోనూ ఆహ్వానించబడ్డారు. ద్యౌస్ పుత్రులూ, ఆకాశంలో గుర్రాలమీద

5. యాస్కుడు శ.బ్రా.లో ఇచ్చిన వ్యుత్పత్తినే అంగీకరించినట్లు కనపడుతుంది (చూ. అథస్సూచిక 4). ఎందువల్లనంటే, ఆయన యదుశ్నువాతే సర్వం ''అంతటా వ్యాపించేవారు కాబట్టి'' అని చెప్పి రసేనాన్యః, జ్యోతిషాన్యః ''రసంతో (నీటితో) ఒకరూ, కాంతితో ఇంకొకరూ (వ్యాపిస్తారు)'' అని వివరించారు. ''గుర్రాలు కలవారు'' అనే వ్యుత్పత్తి ఔర్ణవాభుడు చెప్పినది అని కూడా ఆయన చెప్పేరు (నిరుక్తం 12.1).

ప్రయాణించేవారూ, ఒకసోదరి కలవారూ అయిన అశ్వినులకీ, గ్రీక్ ఇతిహాసదర్శనంలో ప్రసిద్ధులైన దియొస్ ఖొయురొయి (Dias Khouroi) అనే వారికీ ( వీరిద్దరూ గుర్రాలమీద ప్రయాణించేవారు, జెయుస్ (= ద్యౌస్) పుత్రులు, హెలెనా అనే స్త్రీ సోదరులు), సోవియట్‌యూనియన్‌కు చెందినలాట్వియా దేశపు భాషఅయినలెట్టిష్‌భాష ఇతిహాసంలో తమకోసం లేక చంద్రుడికోసం సూర్యుడి పుత్రికని వరించడానికి గుర్రాలమీద వచ్చే ఇద్దరు దేవపుత్రులకీ మధ్య సాదృశ్యం ఉంది. లెట్టిష్ భాషలోని గాథలో వేగుచుక్క సూర్యుడి కూతురుని చూసుకోవడానికి వచ్చిందని ఉంది. ఇద్దరు అశ్వినులు (ఒక) సూర్యని పెళ్ళిచేసుకొన్నట్లుగానే లెట్టిష్ ఇతిహాసంలో దేవపుత్రులు ఇద్దరూ సూర్యుడి కూతురుని పెళ్ళిచేసుకొన్నారు. వీరూ పైనచెప్పిన గ్రీకు దేవతలూ కూడా ( అశ్వినులలా) సముద్రంనించి కాపాడేవారూ, సూర్యుడి కూతురిని లేకసూర్యుణ్ణే ( చీకటినించి) బయటకు తెచ్చేవారూ. ఈ ప్రతిపాదన అంగీకార్యం అయితే, అశ్వినుల రక్షించే స్వభావం చీకటి అనే బాధనించి తప్పించుకోవడానికి వేగుచుక్క మార్గదర్శి అనే భావం నించి వృద్ధిపొంది ఉండవచ్చు. అశ్వినులు మిథునరాశిలోని రెండు నక్షత్రాలకి ప్రతీకలని వెబర్ (Weber) అభిప్రాయం. ఇక, గెల్డ్‌నర్ (Geldner) అశ్వినులు ఏ ప్రకృతి పదార్థానికీ ప్రతీకలు కారనీ, వారు భారత దేశపు గాథలలో అవతారమెత్తిన ఆపదలలో ఆదుకొనే ఋషులు మాత్రమే అనీ అన్నారు.

21.15 కనుచీకటి, వేగుచుక్క సిద్ధాంతమే అన్నింటికన్నా అంగీకార్యమైనట్లు కనబడుతుంది. ఏది ఏమయినా, పేరులో కాకపోయినా స్వభావంలో అశ్వినులు మూల ఇండో-యూరోపియన్‌కాలానికే చెందినవారు అనడంలో విప్రతిపత్తి లేదని చెప్పవచ్చు.

# ఆ. అంతరిక్ష దేవతలు

## 22. ఇంద్రుడు

22.1 ఇంద్రుడు వేదకాలపు భారతీయులకి అత్యంత ప్రియమైన జాతీయ దేవత. ఈయనగొప్పతనాన్ని స్తుతించేసూక్తాలు సుమారు 250 ఉండడం ఈయన ప్రాముఖ్యాన్ని చాటుతుంది; ఇవి ఋగ్వేదంలోని మొత్తం సూక్తాలలో నాలుగోవంతు; మరి ఏ దేవతకీ ఇన్ని సూక్తాలు ఉద్దిష్టమవలేదు. ఈయన్ని స్తుతించిన ఇతర సూక్త భాగాలూ, ఈయన్ని ఇతర దేవతలతో కలిపి స్తుతించిన సూక్తాలు కూడా లెక్కలోకి తీసుకొంటే, మొత్తం సూక్తాల సంఖ్య అధమపక్షం మూడువందలపై అవుతుంది. ఇండో- ఇరానియన్‌కాలంనించీ

ఉండి అస్పష్టమైన వ్యుత్పత్తి కల ఈ పేరు ఏ ప్రకృతి పదార్థాన్నీ సూచించకపోవడం వల్ల ఏ ఇతర వేద దేవతల విషయంలోనూ లేనంతగా ఇంద్రుడి రూపం పురుషతారోపణ పొంది అనేకగాథలకి ఆలవాలమైంది. కాని ఈయన స్వభావంలో ప్రధానాంశం చాలావరకు స్పష్టంగానే ఉంది. ముఖ్యంగా ఈయన ఉరుము, పిడుగుకి సంబంధించిన దేవత; అనావృష్టి, చీకటీ అనే రాక్షసులని జయించడమూ దాని ద్వారా నీటిని విడుదల చేయడమూ వెలుగు సంపాదించడమూ ఈయనకి సంబంధించిన గాథల సారాంశం. ఈయన స్వభావంలో ద్వితీయ శ్రేణికి చెందిన లక్షణం ఈయన యుద్ధరంగ దేవత అవడం; పురాతనకాలంనించీ భారతదేశంలో ఉన్న జాతులవారిని జయించడంలో ఆర్యులకి ఈయన సహాయం చేశారు.

22.2 ఈయన అంతరిక్షస్థానదేవతలలో ప్రధానుడు. ఈయన అంతరిక్షం అంతటా వ్యాపించి ఉన్నారు (1.51.2). నిరుక్తంలోని నిఘంటువు (5.4)లో ఈయనపేరు అంతరిక్షస్థానదేవతలలో మాత్రమే ఉంది; అగ్ని, ఇంద్రుడు (లేక వాయువు), సూర్యుడు అనే దేవతాత్రయంలో ఈయన అంతరిక్షానికి ప్రతినిధి.

22.3 ఇంద్రుడి శరీర లక్షణాలు తరచు చెప్పబడ్డాయి. ఆయనకి శరీరమూ, తలా, చేతులూ, ముంజేతులూ ఉన్నాయి (2.16.2; 8.85.3) ఆయన సోమపానశక్తిని సూచించేటప్పుడు ఆయన కడుపు తరచుగా చెప్పబడింది (2.16.2, మొ.). సోమంతో నిండిన ఆయన కడుపులు చెరువులతో పోల్చబడ్డాయి (హ్రదా ఇవ కుక్షయః సోమధానాః, 3.36.8). ఆయన పెదవులు (శిప్రా అనే పదానికి ఇదే అర్థం కావచ్చు) తరచు చెప్పబడ్డాయి; సుశిప్ర- / శిప్రిన్- '(మంచి) పెదవులు కలవాడు' అనే విశేషణాలు ఈయనకే ప్రత్యేకంగా ఉపయోగించబడ్డాయి. సోమంతాగిన తరవాత ఆయన తన దవడలని కదుపుతారు (8.65.10). ఆయన సోమపానంతో సంతోషించినప్పుడూ, ప్రయాణించేటప్పుడూ ఆయనగడ్డం (జుట్టు) ఎక్కువగా కంపిస్తుంది (ప్రదోధువచ్ఛ్మశ్రుషు ప్రీణానః, 2.11.17; 10.23.1). ఆయన జుట్టూ గడ్డమూ గోధుమ పసుపు రంగులు కల్గిన రంగులో ఉంటాయి (హరిత-, 10.23.4; 10.96.5, 8). ఆయన శరీరమంతా హరితవర్ణం కలది; ఒక సూక్తం (10.96) అన్ని మంత్రాలలోనూ ఇంద్రుడికి సంబంధించిన వస్తువులన్నీ ఈ రంగులో ఉంటాయని చెప్పబడింది. కొన్నిచోట్ల ఆయన బంగారు రంగులో ఉంటాడని చెప్పబడింది (హిరణ్యయః, 1.7.2; ?8.55.3) (ఇలా సవిత విషయంలో చెప్పడం సాధారణం (అధ్యాయం 15)); ఆయన బంగారు చేతులు కలవాడు (హిరణ్యబాహుః,

7.34.4); ఇనుమువంటివాడు (ఆయసః, 1.56.3; 10.96.4, 8). వజ్రాన్ని పట్టుకొనే ఆయనచేతులు ముఖ్యంగా చెప్పబడ్డాయి. అవి పెద్దవి (పృథూ), విశాలమైనవి (బహులా, 6.19.3: 8.32.10; 8.70.1); దృఢమైనవీ, మంచి ఆకారం కలవీ (సా.వే. 2.1219). సూర్యుడి ఎర్రని కాంతితో ఇంద్రుడు శ్రేష్ఠమైన రూపాలు ధరిస్తాడు (10.112.3); ఆయన తన మాయతో బహురూపాలు ధరించి వస్తాడు (ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే, 6.47.18: 3.48.4; 3.53.8).

22.4 ఇంద్రుడికి ప్రత్యేకమైన ఆయుధం వజ్రం; పిడుగే గాథలలో వజ్రమని వ్యవహరించబడింది. ఆయనకోసం దీన్ని త్వష్ట చేశారు అని తరచు చెప్పబడింది (త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష, 1.32.2 మొ.); కాని కావ్యుడైన ఉశనుడు (ఉశనస్-) దీన్ని చేసినట్లు కొన్నిచోట్ల (1.121.12; 5.34.2) ఉంది. ఐ.బ్రా. (4.1) లో దీన్ని దేవతలు ఇంద్రుడికి ఇచ్చినట్లు ఉంది. అది నీటితో నిండిన సముద్రంలో తేలుతూ ఉంటుంది (?8.89.9). అది ఉండేచోటు సూర్యుడికన్న కిందభాగం (= అంతరిక్షం, 10.27.21). అది ఆయసం 'ఇనుముతో చేసినది' అని చెప్పడం సాధారణం (1.52.8, మొ.), కాని కొన్నిచోట్ల ఇది బంగారపుది (1.57.2 మొ.); హరితవర్ణం కలది (3.44.4; 1.96.3), ప్రకాశించేది (3.44.5) అని కూడా చెప్పబడింది. అది నాలుగు అంచులు కలది (చతురశ్రి-, 4.22.2), వందకోణాలు కలది (?4.17.10; వంద కణుపులు కలది (శతపర్వణా, 8.6.6 మొ.), వెయ్యి మొనలు కలది (సహస్ర భృష్టిః, 1.80.12 మొ.); వాడియైనది (తిగ్మం, 7.18.18 మొ.) ఇంద్రుడు దాన్ని ఎద్దు కొమ్ములని వాడిచేసుకొన్నట్లు పదును చేస్తాడు (శిశీతే వజ్రం తేజసేన వసంగః 1.55.1; 1.130.4; శిశీతే = పదును పెడతాడు, వసంగః = ఎద్దు). అది రాయి (అశ్మన్-), బండరాయి (పర్వత-) అని చెప్పబడింది (7.104.19). ఇంద్రుడి చేతిలో వజ్రం ఆకాశంలో సూర్యుడితో పోల్చబడింది (?8.59.2). వజ్రశబ్దం కల విశేషణాలు ఇంచుమించు అన్ని ఇంద్రపరంగానే వాడబడ్డాయి; వాటిలో కొన్ని ప్రచురాలు. వజ్రభృత్- 'వజ్రాన్ని ధరించినవాడు', వజ్రివత్- 'వజ్రం కలవాడు' (8.66.11), వజ్రదక్షిణ- 'కుడిచేతిలో వజ్రంకలవాడు' అనేవి ఆయనకి మాత్రమే వాడబడ్డాయి; వజ్రబాహు- / వజ్రహస్త- 'వజ్రం చేతిలో కలవాడు', అన్నిటిలోకీ ప్రచురమైన వజ్రిన్- 'వజ్రంకలవాడు' అనేవి ఆయనకే కాక రుద్రుడికీ, మరుత్తులకీ, మన్యువుకీ ఒక్కొక్కసారి మాత్రం విశేషణాలుగా వాడబడ్డాయి.

22.5 కొన్నిచోట్ల ఇంద్రుడికి విల్లూ, బాణమూ ఉన్నట్లు చెప్పబడింది (ఆ బుందం వృత్రహాదదే (బుందం = బాణాన్ని, ఆదదే = తీసుకొన్నాడు), 8.45.4; 8.77.6, 7, 11; ఇషుహస్తేన, 10.103.2, 3). ఆ బాణం బంగారపుది, వంద మొనలు కలది. వంద ఈకలు కట్టినది (శతబ్రధ్న ఇషుస్తవ సహస్రపర్ణ ఏక ఇత్, 8.77.7, ధనుః సాధుః బుందో హిరణ్యయః, 8.77.11). ఆయనకి అంకుశం కూడా ఉంది; దానితో ధనం ఇస్తారు (8.17.10; అ.వే. 6.82.3); దాన్ని ఆయుధంగా కూడా ఉపయోగిస్తారు (10.44.9). ఆయన అంతరిక్షమనే వలతో శత్రువులందరినీ చంపుతాడని అథర్వవేదం (8.8.5-8) లో చెప్పబడింది (అంతరిక్షం జాలమాసీత్).

22.6 ఇంద్రుడి రథం బంగారపుది (6.29.2, మొ.); అది మనస్సుకన్న వేగం కలది (యస్తే రథో మనసో జవీయాన్, 10.112.2). రథేష్ఠ- / రథేష్ఠా- 'రథంలో ఉండేవాడు' అనే విశేషణం ఇంద్రుడికి మాత్రమే ఉపయోగించబడింది. ఆయన రథాన్ని గోధుమ రంగూ, పసుపురంగూ కలిసిన రంగుకలరెండు గుర్రాలు (హరీ) లాగుతాయి; చాలా తరచుగా వాడబడిన ఈ 'హరీ' అనే శబ్దం ఎక్కువచోట్ల ఇంద్రుడిగుర్రాలనే సూచిస్తుంది. కొన్ని మంత్రాలలో ఈ గుర్రాలు రెండుకన్న ఎక్కువ, వంద, వెయ్యి, పదకొండు వందలు అని కూడా చెప్పబడింది (2.18.4-7; 4.46.3; 6.47.18; 8.1.9, 24). ఈ గుర్రాలు సూర్యుడి వంటి ప్రకాశంగలవి (సూరచక్షసః 1.16.1; ఈ పదానికి 'సూర్యుడే కన్నులుగా కలవి' అని మూలకర్త ఇచ్చిన అర్థం). అవి సకిలిస్తాయి (ప్రోథద్భిః/ నానదద్భిః), ఎక్కువగా శ్వాస విడుస్తాయి (శ్వాససద్భిః, 1.30.16); జూలు కలవి (కేశినా, 1.10.3 మొ.), బంగారు జూలు కలవి (హిరణ్యకేశ్యా, 8.32.29). వాటి జూలు నెమలిపింఛంలా ఉంటుంది (మయూరరోమభిః, 3.45.1; 8.1.25). అవి అతివేగంగా దూరప్రదేశాలకి వెళ్తాయి (2.16.3); అవి ఇంద్రుణ్ణి రెక్కలుగద్దని తీసుకువెళ్లినట్లు తీసుకువెళ్తాయి (హరీశ్యేనం పక్షేన వక్షతః, 8.34.9; పక్షా ఇవ = రెక్కలలా). అవి ప్రార్థించే సూక్తం వల్ల రథాన్ని లాగడానికి సిద్ధమౌతాయి (2.18.3 మొ) - దీని అర్థం ప్రార్థనలు ఇంద్రుణ్ణి యజ్ఞం దగ్గిరకి తీసుకువస్తాయి అని అనడంలో సందేహం లేదు. కొన్నిచోట్ల ఇంద్రుడు సూర్యుడిగుర్రాలమీద (10.49.7), వాతుడు గుర్రాలమీద (10.22,4-6) ప్రయాణిస్తాడని చెప్పబడింది. వాయువు 'ఇంద్రసారథిః' అని చెప్పబడ్డాడు (4.46.2, 4.48.2) ఇంద్రవాయువులని ఇద్దరినీ ఒకే రథం మీద రమ్మని వేరు మంత్రాలలో (4.46.3-7; 7.91.6) ప్రార్థనలు

ఉండడం వల్ల ఈ పదానికి 'ఇంద్రుడితో కలిసి ప్రయాణం చేసేవాడు' అని అర్థం చెప్పడం సమంజసం). ఇంద్రుడి రథాన్నీ గుర్రాలనీ ఋభువులు సృష్టించారు (1.111.1; 5.31.4). ఇంద్రుడూ, ఆయన పగ్గాలూ, బంగారపు (గుర్రాలనితోలే, కర్రా (కశా), రథమూ, గుర్రాలూ (అనుగ్రహాన్ని వర్షించేవి (వృషన్-)[1].

22.7 దేవతలంతా సోమపానప్రియులే అయినా (8.2.18; 8.58.11), ఇంద్రుడికి సోమమంటే చాలా ఇష్టం (1.104.9 మొ.). ఆయన త్వష్ట అనే రాక్షసుణ్ణి జయించి పాత్రలలోని సోమందొంగిలించి (ఆముష్య) తాగేరు.[2] దేవతలలోనూ మనుష్యులలోనూ ఇంద్రుడొక్కడే సోమంతాగేవారు;[3] ఈ విషయంలో ఆయనసహాయుడైనవాయువు ఒక్కడు మాత్రమే ఆయనకు కొంతసాటి. అది ఆయనకు తగిన ఆహారం (ఇదంతే అన్నం యుజ్యం, 8.4.12). సోమపా-, సోమపావన్- 'సోమంతాగేవాడు' అనేవిశేషణాలు ఇంద్రుడికే సర్వసాధారణం; కొన్నిచోట్ల ఇంద్రుడితో కలిసిన అగ్నికీ బృహస్పతికీ, ఒకచోట వాయువుకి మాత్రం ఇవి వాడబడ్డాయి.

22.8 సోమంతాగినమదంతో ఇంద్రుడు ఆకాశాన్నీ భూమినీ నిలపడమూ, భూమిని విశాలం చెయ్యడమూ వంటి విశ్వానికి సంబంధించిన కార్యాలు చేశాడని కొన్నిచోట్ల చెప్పబడింది (సోమస్యతా మద ఇంద్రశ్చకార, 2.15.2). కాని సోమపానం ఆయన్ని ప్రత్యేకంగా రాక్షసుడైన వృత్రుణ్ణి చంపడమూ (2.15.1; 2.19.2; 6.47.1, 2), శత్రువులని జయించడమూ (6.27; 7.22.2; 8.81.6) వంటి వీరకార్యాలు చేయడానికి పురికొల్పుతుంది. సోమం ఆయనకి ఎంత అవసరం అంటే ఆయన పుట్టిన రోజునే ఆయనతల్లి ఆయనకిదాన్ని ఇచ్చింది. ఆయన తాగేడు (యజ్జాయథాస్తదహరస్య, 3.48.2, 3; 3.32.9, 10; 6.40.2; 7.98.3). వృత్రుణ్ణి చంపడానికి ఆయన మూడు చెరువుల సోమం తాగేడు (త్రీసాకమింద్రో మనుషః సరాంసి సుతం పిబ ద్వృత్రహత్యా సోమం,

---

1. వృషణస్తే అభీశవో వృషా కశా హిరణ్యయీ
వృషా రథో మఘవన్‌వృషణా హరీ వృషాత్వం శతక్రతో.
(8.33.11; అభీశవః = పగ్గాలు).

2. త్వష్టారమింద్రో జనుషాభిభూయాముష్యా సోమమపిబచ్చమూషు (3.48.4; 8.4,4.)

3. ఇంద్ర ఇత్సోమపా ఏక ఇంద్రః సుతపా విశ్వాయుః
అంతర్దేవాన్ మర్త్యాన్శ్చ (8.2.4).

5.29.7; చూ. 6.17.11); ముప్పైచెరువుల సోమాన్ని ఒక్కసారిగా తాగేడు (8.77.4). ఇంద్రుడు సోమంతాగిన తరవాత తన మనోభావాలని తనలోతాను చెప్పుకొన్నట్లు ఒక పూర్తి సూక్తం (10.119)లో వర్ణించబడింది. కాని అధికసోమపానం వల్ల మనుష్యులకి జబ్బు వచ్చినట్లే ఇంద్రుడికి కూడా జబ్బు చేసిందనీ దాన్ని దేవతలు సౌత్రామణీ యాగంతో నయంచేశారనీ చెప్పబడింది (శ.బ్రా. 5.5.4.9; తై.సం. 2.3.2). ఇంద్రుడు తేనెకలిపిన పాలు కూడా తాగుతాడు (8.4.8).

22.9 ఇంద్రుడు ఎడ్లమాంసం (పచంతితే వృషభాన్ అత్సి, 10.28.3), ఒక ఎద్దు మాంసం (10.27.2), ముప్పైఅయిదు ఎడ్లమాంసం (10.86.14), వందదున్నపోతుల మాంసం (6.17.11; 8.77.10; అగ్ని కాల్చిన 300 దున్నపోతులని (5.29.7) కూడా తింటాడు. యజ్ఞంలో ఆహుతి చేసిన అప్పం (అపూప మద్ధి, 3.52.7; పురోడాశం, 3.52.8), ధాన్యాలూ (ప్రతి ధానా భరత, 3.52.8; 3.35.3; 3.43.4; 1.16.2) కూడా ఆయన తింటాడు; ధాన్యాలు ఆయనగుర్రాలు కూడా తింటాయి (గ్రసేతా మశ్వా..... ధానాః, 3.35.3; 3.35.7; 3.52.7).

22.10 ఇంద్రుడు (శాశ్వతుడు కాక) పుట్టినట్లు తరచు చెప్పబడింది. ఆయన పుట్టుక రెండు పూర్తి సూక్తాలలో (3.48; 4.18) వర్ణించబడింది. ఒకచోట (4.18.1,2) ఆయన అసహజమైనపద్ధతిలో తల్లికడుపు పక్కనించి పుట్టాలని అనుకొన్నట్లు చెప్పబడింది (పార్శ్వాన్నిర్గమాణి). మెరుపు మేఘం చివరనించి వస్తుంది అనే సత్యానికి ఇది ప్రతీక కావచ్చు. పుట్టగానే ఆయన లోకాన్ని ప్రకాశవంతం చేశాడు (3.44.4). ఆయన పుట్టగానే సూర్యుడి చక్రాన్ని ఎత్తి (రాక్షసులపై) వేశాడు (1.130.9). ఆయన పుట్టినప్పటినించీ యోద్ధ (3.51.8; 5.30.5; 8.45.4; 8.77.1; 10.113.4), అజయ్యుడు (1.102.8; 10.133.2). ఆయన పుట్టగానే భయంవల్ల స్థిరమైన పర్వతాలూ, ఆకాశమూ, భూమీ కంపించాయి (అస్యేదు భియా గిరయశ్చ దృళ్హా ద్యావా చ భూమా జనుష స్తుజేతే, 1.61.14; తుజేతే = కంపించాయి). ఆయన పుట్టినప్పుడు ఆయనకోపానికి ఆకాశమూ భూమీ కంపించాయి (4.17.2), దేవతలందరూ భయపడ్డారు (అతశ్చి దింద్రా దభయంత దేవాః, 5.30.5). ఆయన తల్లిని గురించిన ప్రసక్తి తరచు ఉంది (3.48.2, 3 మొ.). ఒకచోట (4.18.10) ఆమె గృష్టి 'ఆవు' అనీ ఆయన వత్స 'దూడ' అనీ చెప్పబడ్డారు; ఆయన వృషభం అనీ గార్ష్టేయ- (ఒకసారి ఈనిన ఆవు 'గృష్టి'- దాని దూడ) అనీ

చెప్పబడ్డాడు (10.111.2). ఒకచోట (10.101.12) ఆయన నిష్టిగ్రీ- అనే ఆమె పుత్రుడని (నిష్టిగ్ర్యః పుత్రం) చెప్పబడ్డాడు; సాయణుడు నిష్టిగ్రీ అంటే అదితే అని చెప్పాడు (చూ. అధ్యాయం 41).[4] అథర్వవేదం (3.10.12, 13) ప్రకారం ఇంద్రుడికీ అగ్నికీ తల్లి ప్రజాపతి కూతురైన ఏకాష్టకా.[5] ఇంద్రుడికీ అగ్నికీ తండ్రీ తల్లీ ఒక్కరే; వారు కవలలు (యమౌ) (సమానోవాం జనితా భ్రాతరా యువం యమా విహేహ మాతరా, 6.59.2); అగ్ని ద్యౌస్‌కీ పృథివికీ కొడుకు అని వేరుచోట ఉంది (అధ్యాయం 35). ఒక మంత్రం (4.17.4) లో ద్యౌస్ ఇంద్రుడి తండ్రి అని అర్థం చెప్పదగిన మాటలు ఉన్నాయి (సువీరస్తే జనితా మన్యత ద్యౌరింద్రస్య కర్త ''ఇంద్రుడికి కర్తా తండ్రీ అయిన ద్యౌస్ తాను 'మంచిపుత్రుడు కలవాణ్ణి' అనుకొన్నాడు'; ★కాని సాయణుడు ద్యౌస్ పదానికి 'ప్రకాశించేవాడు' అని అర్థం ఇచ్చి ఇది ప్రజాపతిని సూచిస్తుందని వ్యాఖ్యానించారు). ''భువనాలలో ఈ భయంకరుడైన దేవుడు పుట్టినది మొదటిది'' (తదిదాస భువనేషు జ్యేష్ఠం యతో జజ్ఞ ఉగ్రస్త్వేష నృమ్ణః, 10.120.1, త్వేషనృమ్ణః = 'ప్రకాశించే బలం కలవాడు') అని ఉన్న ఇంద్రసూక్తంలోని ఒక మంత్రంలోనూ, మరికొన్నిచోట్లా (చూ. 6.30.5.; 10.54.3తో 8.36.4; 1.164.11తో 10.138.6) ఇటువంటి అర్థమే ఉద్దిష్టమయిందని చెప్పవచ్చు. ఆయన వజ్రం ఆయన తండ్రి చేసినట్లు ఒకచోట (2.17.6; ★కాని సాయణుడు ఇలా అర్థం చెప్పలేదు) కాని అది సాధారణంగా త్వష్ట (అధ్యాయం 38) చేసినట్లు చెప్పబడింది. ఇంద్రుడు పుట్టినరోజే ఆయన తల్లి (ఆమె) తండ్రి ఇంట్లో ఆయనకి సోమం ఇచ్చింది (3.48.2). ఆయన త్వష్ట ఇంట్లో సోమం తాగేడు (4.18.3); ఇంద్రుడు పుట్టగానే త్వష్టని జయించి పాత్రలలో ఉన్న ఆయన సోమం దొంగిలించి తాగేడు (3.48.4). ఇంద్రుడు తన తండ్రిని కాళ్లు పట్టుకొని చంపేడు (ప్రాక్షిణాః పితరం పాదగృహ్య, 4.18.12); అదే మంత్రంలో ఋషి ఆయన్ని ''నీ తల్లిని ఎవరు విధవని చేశారు?'' (కస్తే మాతరం విధవా మచక్రత్) అని అడిగేరు. ఈ మంత్రాలవల్ల సోమం కోసం ఇంద్రుడిచేత చంపబడిన త్వష్టే ఆయన తండ్రి అని స్పష్టంగానే ఊహించవచ్చు (చూ. 1.80.14;) ★ త్వష్ట నీకోపానికి భయంలో వణుకుతాడు అని ఇందులో ఉంది).

---

4. నిష్టం దితిం స్వసపత్నీం (తనసవతి యైన దితిని') గిరతి (జయిస్తుంది) ఇతి నిష్టిగ్రీ రదితిః - సాయణ వ్యాఖ్య.

5. ఏకాష్టకా తపసాతప్యమానా జజానగర్భం మహిమానమింద్రం (12) ఇంద్రపుత్రే సోమపుత్రే దుహితాసి ప్రజాపతేః913) - ఈమె సోముడికి కూడా తల్లి. ఏకాష్టక అంటే మాఘకృష్ణాష్టమి అని సాయణుడు. ఏకాష్టక భర్త సంవత్సరం అని అ.వే. 3.10.8లో ఉంది. పైన మూలకర్త సోముడికి బదులు అగ్ని అని పొరపాటున వ్రాశారేమో.

దేవతలంతా ఇంద్రుడితో యుద్ధం చేశారని ఒకచోట (త్వా దేవాస ఇంద్ర యుయుధుః, 4.30.3) ఉంది; ఈయనకి సోమాన్ని బలవంతంగా తీసుకొనే స్వభావం ఉండడంవల్ల దేవతలకి ఈయనతో విరోధం ఏర్పడి ఉండవచ్చు (★ కాని సాయణుడు పై మంత్రానికి- త్వా= నిన్ను (సహాయుడుగా పొంది) దేవతలు (రాక్షసులతో) యుద్ధం చేశారు, అని అర్థం చెప్పేరు).

22.11 ఇంద్రుడి ఉత్పత్తి విషయంలో మరికొన్ని వేరు అభిప్రాయాలు కూడా వ్యక్తం చేయబడ్డాయి. ఆయన్ని రాక్షసులని చంపడానికిదేవతలు పుట్టించారని ఒకచోట (యం..... ఘనం వృత్రాణాం జనయంత వేదాః, 3.49.1; ఘనం = చంపేవాణ్ణి) ఉంది; కాని ఇక్కడ జన్‌ధాతువు '' ఏర్పాటు చెయ్యడం'' అనే లక్షణార్థంలో మాత్రమే వాడబడిందనడంలో సందేహం లేదు (చూ. 2.13.5; 3.51.8). ఒకచోట (9.65.5) ఇంద్రుడికీ మరికొందరు దేవతలకీ సోముడు ఉత్పాదకుడు అని చెప్పబడింది. పురుషసూక్తంలో ఇంద్రుడూ, అగ్నీ పురుషుడినోట్లోంచి పుట్టేరని ఉంది (ముఖాదింద్రశ్చాగ్నిశ్చ, 10.90.13). శ.బ్రా. (11.1.6.14) ప్రకారం ఇంద్రుడూ, అగ్నీ, సోముడూ, పరమేష్ఠీ ప్రజాపతి పుట్టించినవారు. తై.బ్రా. (2.2.10.1)లో దేవతలలో చివరివాడుగా ఇంద్రుణ్ణి ప్రజాపతి సృష్టించినట్లు ఉంది.

22.12 అగ్నీ ఇంద్రుడూ కవలలు (6.59.2); పూషుడు కూడా ఆయనకి సోదరుడే (6.55.5). ఇంద్రుడి సోదరుడి కొడుకులని గురించి ప్రసక్తి ఒకచోట (10.55.1; భ్రాతుః పుత్రాన్= ★ పర్జన్యుడికి కొడుకులవంటి నీళ్లని - అని సాయణుడు) ఉంది; కాని వారు ఎవరనేది అస్పష్టం.

22.13 ఇంద్రుడి భార్యని గురించిన ప్రసక్తి కొన్నిచోట్ల ఉంది (1.82.5., 6; 3.53.4, 6; 10.86.9, 10). ఇంద్రుడితో ఆమె మాట్లాడుతున్నట్లు ఉన్న ఒకసూక్తం (10.86.11, 12)లో ఆమె ఇంద్రాణి (ఇంద్రాణీ-) అని ఉంది; దేవపత్నుల పేర్లు ఉన్న మరికొన్ని సూక్తాల (1.22.12; 2.32.8; 5.46.8)లో కూడా ఆమెపేరు ఇంద్రాణి అని ఉంది. శ.బ్రా. (14.2.1.8)లో ఇంద్రాణి ఇంద్రుడి భార్య అని స్పష్టంగా చెప్పబడింది. కాని ఐ.బ్రా. (3.22.7) ప్రాసహా-, సేనా - అనేవారు ఇంద్రుడి భార్యలని చెప్తుంది. వీరిద్దరూ ఇంద్రాణి ఒక్కరే అని తై.బ్రా. (2.4.2.7, 8), మై.సం. (3.8.4; 4.12.1). ఋగ్వేదం

లోనూ వేదకాలం తరవాత సాహిత్యంలోనూ ఇంద్రుడి భార్య అసలు పేరు శచి (శచీ-) అని పిషెల్ (Pishchel) అభిప్రాయం. అథర్వవేదం (7.38.2) లో ఒక అసుర స్త్రీ ఇంద్రుణ్ణి దేవతలనించి వేరుచేసి కిందకు తీసుకువచ్చింది (స్వాధీనం చేసుకొంది) అని ఉంది. (యేనా నిచక్ర ఆసురీంద్రం దేవేభ్యస్పరి). ఇంద్రుడు విలిస్తేంగా- అనే దానవిని ప్రేమించి అసురులతో వెళ్ళి కలిసి, ఆడవాళ్లలో ఆడరూపంలోనూ, మగవాళ్లలో మగరూపంలోనూ, ఉండిపోయాడని కాఠకం చెప్తుంది.

22.14 ఇంద్రుడికి ఇతర దేవతలు అనేకులతో సాహచర్యం ఉంది. మరుత్తులు ఆయనకి ముఖ్య స్నేహితులూ, యుద్ధంలో సహాయులూ; వారు ఆయనకి యుద్ధాలలో సహాయపడినట్లు అసంఖ్యాకమైన మంత్రాలలో వర్ణించబడింది (అధ్యాయం 29). ఆయనకి ఈ దేవతలతో ఎంత సాన్నిహిత్యం ఉందంటే, మరుత్వత్- 'మరుత్తులు కలవాడు' అనే విశేషణం కొన్నిచోట్ల ఇతర దేవతలకి కూడా వాడబడినా అది ఇంద్రుడికే సర్వసాధారణం; ఇదీ, మరుద్గణ- 'మరుద్గణాలు కలవాడు' అనే విశేషణమూ ఇంద్రుడికే సర్వసాధారణంగా చెందుతాయి (5.42.6; 9.65.10). ఇంద్రుడు మిగిలిన ఏ ప్రత్యేక దేవతతో కన్న అగ్నితో టే ఎక్కువగా దేవతాద్వంద్వం (ఇంద్రాగ్నీ-)గా కలుస్తాడు (అధ్యాయం 44). మెరుపు అగ్ని యొక్క ఒకరూపం కాబట్టి ఇది సహజమే. ఇంద్రుడు అగ్నిని రెండురాళ్ళ మధ్య పుట్టించాలనీ (2.12.3), నీటిలో దాగిన అగ్నిని కనుగొన్నాడనీ (10.32.6) కూడా చెప్పబడింది. అగ్నితోనే కాక ఇంద్రుడు వరుణుడితోనూ (ఇంద్రావరణా-), వాయువుతోనూ (ఇంద్రవాయూ-) తరచుగానూ, సోముడితోనూ, బృహస్పతితోనూ, పూషుడితోనూ, విష్ణువుతోనూ అరుదుగానూ కలుస్తాడు (అధ్యాయం 44). విష్ణువు ఆయనకి సన్నిహిత స్నేహితుడవడం వల్ల రాక్షసులతో యుద్ధంలో ఆయనకి సహాయం చేస్తాడు (అధ్యాయం 17.6).

22.15 నాల్గైదు మంత్రాలలో ఇంచుమించు స్పష్టంగానే ఇంద్రుడికీ సూర్యుడికీ ఐక్యం చెప్పబడింది. ఇంద్రుడే మాట్లాడుతున్నట్లు ఉన్న ఒక మంత్రం (4.26.1) లో ఇంద్రుడు తనే ఒకప్పుడు మనువూ, సూర్యుడూ అని చెప్పేడు (అహం మను రభవం సూర్యశ్చాహం). ఆయన ఒకచోట (10.89.2) సూర్యుడనే సంబోధించబడ్డాడు; మరొక మంత్రం (8.92.19)లో ఇంద్రుడూ సూర్యుడూ ఒకరే అయినట్లుగా ఆహ్వానించబడ్డారు. ఒకమంత్రం (2.30.1) లో ఇంద్రుడికి సవిత అనే విశేషణం వాడబడింది. శ. బ్రా. కూడా

ఒకచోట (1.6.4.18) ఇంద్రుడంటే సూర్యుడనీ వృత్రుడంటే చంద్రుడనీ చెప్తుంది.

22.16 ఇంద్రుడి పెద్ద ఆకారాన్ని గురించి చాలా మంత్రాలలో చెప్పబడింది. ఇంద్రుడు అపారమైన భూమ్యాకాశాలని పట్టుకొన్నప్పుడు అవి ఆయన పిడికిలిలో ఇమిడిపోయాయి (3.30.5). ఆయన గొప్పతనంలో భూమ్యాకాశాలనీ అంతరిక్షాన్నీ అతిక్రమిస్తాడు (3.46.3). భూమ్యాకాశాలు ఆయనలో సగం (6.30.1; 10.119.7). భూమ్యాకాశాలు ఆయన మొలతాడుకి (కక్ష్యే) చాలవు (అరం రోదసీ కక్ష్యే నాస్మై, 1.173.6). భూమి ఇప్పుడు ఉన్నదానికన్న పదిరెట్లు ఉంటే ఇంద్రుడికి అది సమానమవుతుంది (1.52.11). ఇంద్రుడికి వంద స్వర్గాలూ, వంద భూములూ ఉంటే, వెయ్యిమంది సూర్యులు కాని రెండు లోకాలు కాని ఆయనకి సమానం కావు (?8.59.5).

22.17 ఆయనగొప్పతనమూ, శక్తీ ధారాళంగా పొగడబడ్డాయి. ఆయనకి పుట్టినవారిలోనూ, పుట్టబోయేవారిలోనూ సాటి ఎవరూ లేరు (4.18.4). ఆయనవంటివాడు స్వర్గంలోనూ భూమిమీదా పుట్టలేదు, పుట్టడు (7.32.23). దేవుడు కాని మనుష్యుడు కాని ఆయనకన్న ఎక్కువవాడూ, ఆయనతో సమానుడూ లేడు (6.30.4). ఆయనకున్నంత శక్తి ముందువారికీ, తరవాత వారికీ, ఇప్పటివారికీ లేదు (5.42.6). ఆయన శక్తికున్న అవధి దేవతలకీ, మనుష్యులకీ, నీటికీ లేదు (1.100.15). దేవతలలో ఆయనవంటి వాడు లేడు; ఇంతకుముందు పుట్టినవారూ, ఇప్పటివారూ ఆయనకి సాటిరారు (1.165.9). ఆయన దేవతలకంటె గొప్పవాడు (3.46.3). శక్తిలోనూ బలంలోనూ దేవతలంతా ఆయనకన్న తక్కువ (?8.51.7). వైభవంలోనూ (అసుర్యాయ), రాజరీవి (క్షత్రియ) లోనూ పూర్వదేవతలు కూడా ఆయనకన్న తక్కువ (7.21.7). దేవతలెవ్వరూ ఆయన పనులు ఆపలేరు (?2.32.4). ఆయన ఆజ్ఞని వరుణుడూ సూర్యుడూ కూడా పాటిస్తారు (యస్య వ్రతే వరుణో యస్య సూర్యః, 1.101.3; చూ. 2.38.9). ఆయన మిత్రుడి, అర్యముడి, వరుణుడి శత్రువులని నాశనం చెయ్యమని ప్రార్థించబడ్డాడు (10.89.8, 9). ఆయన యుద్ధంచేసి దేవతలకు విశాలమైన చోటు సంపాదించాడు (7.98.3). ఇంద్రుడే ప్రపంచానికంతకీ రాజు (ఏకో విశ్వస్య భువనస్య రాజా, 3.46.2). కదిలేవాటికీ ఊపిరి పీల్చేవాటికీ అన్నిటికీ ఆయన ప్రభువు (1.101.5). కదిలేవాటికీ మనుష్యులకీ ఆయన రాజు (5.40.5). ఆయన జగత్తంతకీ, కన్నులు కలవారికీ కన్ను (త్వం విశ్వస్య జగతశ్చక్షు

రింద్రాసి చక్షుషః, 10.102.12). ఆయన మనుష్య జాతులకీ, దేవజాతులకీనాయకుడు (3.34.2). ఆయన కొన్నిచోట్ల (4.19.2, మొ.) 'అంతటికీ రాజు' అని అర్థమిచ్చే సమ్రాట్- అనీ, ఇంకా తరచుగా 'స్వతంత్రుడైన రాజు' అని అర్థమిచ్చే స్వరాట్- అనీ వ్యవహరించబడ్డాడు (3.46.1, మొ.). ఆయన తన శక్తితో ఏకైకుడుగా పరిపాలించే పూర్వజుడైనఋషి (ఋషిర్హి పూర్వజా అస్యేక ఈశాన ఓజసా, 8.6.41). కొన్నిచోట్ల (1.174.1; 8.90.6) ఈయనకి అసుర- 'బలవంతుడు' అనే విశేషణం వాడబడింది. శక్తిని సూచించే కొన్ని విశేషణాలు ఇంద్రుడికి ప్రత్యేకంగా వాడబడ్డాయి. శక్ర- 'బలవంతుడు' అనేది ఇంద్రుడికి సుమారు 40 సార్లూ, ఇతర దేవతలకి సుమారు అయిదుసార్లూ మాత్రమే వాడబడింది. శచీవత్- 'శక్తికలవాడు' అనేది ఇంద్రుడికిసుమారు పదిహేనుసార్లూ, ఇతరదేవతలకిరెండుచోట్లూ మాత్రమే వర్తిస్తుంది. శచీపతి- 'శక్తికి పతి' అనేది ఋగ్వేదంలో ఉన్న పదకొండు చోట్లలో పదిచోట్ల ఇంద్రుడికే అన్వయిస్తుంది; మిగిలిన ఒకచోట (7.67.5) మాత్రం అది అశ్వినులకి విశేషణంగా వాడబడింది (తానః శక్తం శచీపతీ శచీభిః 'ఆ శచీపతులు మాకు శక్తులు ఇవ్వాలి). ఈ మంత్రాలలో ఒకదాంట్లో ఇంద్రుడు 'శక్తులకు పతి అయిన శచీపతి' (శచీపతే శచీనాం, 10.24.2) అని పునరుక్తితో సంబోధించబడ్డాడు. వేదకాలపు తరవాతసాహిత్యంలో ఈ పదం ఇంద్రుడికినామాంతరంగా 'శచికి భర్త' అనే అర్థంలో మిగిలింది (దీనికి ఈ అర్థం ఋగ్వేదంలోనే ఉందని పిషెల్ అభిప్రాయం). ఋగ్వేదంలో చాలా తరచుగా (సుమారు 60 సార్లు) వచ్చిన శతక్రతు- 'వంద (రకాల) శక్తులు కలవాడు' అనే విశేషణం[6] రెండుచోట్ల తప్ప మిగిలిన అన్నిచోట్లా ఇంద్రుడికే పరిమితం. సత్పతి- 'మంచి ప్రభువు' అనేది చాలా చోట్ల ఇంద్రుడికే అన్వయిస్తుంది. ఇంద్రుడి బలాన్నీ పరాక్రమాన్నీ వర్ణించే ఇతర విశేషణాలు కూడా చాలా ఉన్నాయి. ఆయనబలమైనవాడు (తవస్-), చురుకైనవాడు (నృతు-), జయశీలి (తుర-), శూరుడు, అమితపరాక్రమం కలవాడు (అమితౌజాః 1.11.4; 1.102.6), ఎదురులేని బలం కలవాడు (అప్రతిధృష్టశవస్-, 1.84.2). ఆయన ఏనుగులా (ఇతరుల) బలాన్ని దూస్తాడు (మృగోనహస్తీతవిషీముషాణః), ఆయుధాలని ధరించి సింహంలా భయంకరంగా ఉంటాడు (సింహోనభీమ ఆయుధాని బిభ్రత్, 4.16.4). ఆయనయువకుడు (యువా, 1.11.4, మొ.). ముసలితనం లేనివాడు (అజర- ), పురాతనుడు (పూర్వ్య-, ).

6. సాయణుడు శతక్రతో (సంబోధన) అనేశబ్దానికి బహుకర్మన్ 'చాలా పనులు కలవాడా', బహుప్రజ్ఞ 'చాలాప్రజ్ఞ కలవాడా' అనే అర్థాలు ఇచ్చారు (1.10.1) వ్యాఖ్య).

22.18 ఇంద్రుడి ప్రత్యేక లక్షణాలూ, వ్యక్తిత్వమూ పైన వివరించబడ్డాయి కాబట్టి, మనం ఇప్పుడు ఆయన స్వభావానికి ఆధారమైన గొప్ప గాథకి వద్దాం. సోమపానంతో ఉత్సాహం పొంది, మరుత్తుల సాయంతో, ఆయన, సర్వసాధారణంగా వృత్రుడు 'అడ్డగించేవాడు' (అధ్యాయం68), చాలా తరచుగా అహి- 'పాము' (అధ్యాయం64) అని కూడా వ్యవహరించబడిన అనావృష్టికి సంబంధించిన పెద్ద రాక్షసుడితో యుద్ధానికి పూనుకొంటాడు. ఆ యుద్ధం భయకంరమైనది. ఇంద్రుడు వృత్రుణ్ణి వజ్రంతో కొట్టినప్పుడు ఆకాశమూ, భూమీ భయంతో వణుకుతాయి (1.80.11; 2.11.9, 10; 6.17.9); వజ్రాన్ని చేసిన త్వష్ట కూడా ఇంద్రుడి కోపానికి వణుకుతాడు (1.80.14). ఇంద్రుడు వృత్రుణ్ణి తన వజ్రంతో చంపేడు (1.32.5; 1.61.10; 10.89.7). కాళ్లూ చేతులూ తెగిన వృత్రుడు ఇంకా యుద్ధానికి వస్తే ఇంద్రుడు వజ్రంతో వాడి బుజంమీద కొట్టేడు (1.32.7; 1.80.5).[7] ఇంద్రుడు మొనగల ఆయుధంతో వృత్రుడి ముఖంమీద కొట్టేడు (1.52.15). ఆయన తన మర్మస్థానాలు ఎవరికీ తెలియవు అనుకొన్న వృత్రుడి మర్మస్థానం తెలుసుకొన్నాడు (వృత్రస్య..... వివేదామర్మణో మన్యమానస్య మర్మ, 3.32.4; 5.32.5). ఆయన నీటిని చుట్టుకొని ఉన్న వృత్రుడనేపాముని (అహిం యద్వృత్ర మపోవవ్రివాంసం హన్, 6.20.2 మొ.), నీటిచుట్టూ పడుకొన్న పాముని (అహన్నహిం పరిశయాన మర్ణః, 4.19.2) చంపేడు. ఆయన నీటిలో పడుకొన్న పాముని చంపేడు (5.30.6). ఆయన నీటిలో దాగుకొని నీటినీ ఆకాశాన్నీ అడ్డుకొన్న పాముని చంపేడు (2.11.5); నీటిని చుట్టుకొని ఉన్న వృత్రుణ్ణి పిడుగుతో చెట్టుని (చంపినట్లు) చంపేడు (అశన్యేవ వృక్షం, 2.14.2). అందువల్ల అప్సుజిత్- 'నీటిలో జయించేవాడు' అనేది ఆయనకి ప్రత్యేకమైన విశేషణం. ఇంద్రుడు వృత్రుణ్ణి భవిష్యత్తులో కూడా చంపాలనే ప్రార్థనకూడా ఉండడం వల్ల ఈ యుద్ధం ప్రకృతిలో ఎప్పుడూ జరిగే పరిణామానికి గాథారూపం అని అనుకోవచ్చు. చాలా ఉషస్సులలోనూ శరత్తులలోనూ ఇంద్రుడు వృత్రుణ్ణి చంపి ప్రవాహాలు సృష్టించాడు (4.19.8); ఇంద్రుడు వృత్రుణ్ణి చంపడం వల్ల నీరు ప్రవహించాలి (అర్షం త్వాపః, 8.89.4) అనే ప్రార్థన కూడా ఉంది. ఆయన పర్వతాన్ని ఛేదించి ప్రవాహం బయటకు వచ్చేటట్లు చేస్తాడు; ఆవులని తీసుకువస్తాడు (1.57.6; 10.89.7); ఈ పనులు ఆయన

---

7. అపాదహస్తో అపృతన్యదింద్ర మాస్య వజ్రమధి సానౌ జఘాన (1.32.7; అపృతన్యత్ = యుద్ధం కోరేడు). ఇక్కడ అధిసానౌ అంటే స్కంధే 'బుజంమీద' అని సాయణుడు. మూలకర్త 'on the back' (వీపుమీద) అని చెప్పడానికంటె ఇది సముచితం. ఇక్కడ మంత్రభాగం ప్రకారం మూలంలో వాక్యం కూడా అమర్చబడింది.

వజ్రం చేసే ధ్వనివల్లనే కూడా జరుగుతాయి (6.27.4). ఆయన పర్వతాన్ని చీల్చేడు; ధారలు సృష్టించాడు; దానవుణ్ణి చంపేడు (పర్వతం వియద్వః సృజో విధారా అవదానవం హన్, 5.32.1; ★ ఇక్కడ పర్వతం అంటే మేఘం); బంధించబడిన నీటిని విడుదల చేశాడు; మేఘం యొక్క పొదుగు (ఊధః పర్వతస్య) తెరిచాడు (5.32.2). కట్టివేసిన ఆవులలా ఉన్న నీటిని విడిపించాడు (1.61.10); ఆయన వృత్రుణ్ణి చంపేక నీరు అరిచే ధేనువులలా సముద్రానికి వెళ్లింది (వాశ్రా ఇవధేనవః స్యంద మానా అంజః సముద్ర మవజగ్మ రాపః, 1.32.2, వాశ్రాః = అరిచేవి, అంజః = బాగా). ఆయన గోవులనీ సోమాన్నీగెలిచి ఏడునదులని ప్రవహించేటట్లు చేశాడు (1.32.12; 2.12.12). ఆయన బంధించబడిన నీటిని విడుదల చేశాడు (1.57.6; 1.103.2), పాము అడ్డగించిన ప్రవాహాలని విడుదల చేశాడు (2.11.2), నదులకు తన వజ్రంతో తోవలు తవ్వేడు (వజ్రేణ ఖాన్యతృణ న్నదీనాం, 2.15.3), నీటి ప్రవాహాలు సముద్రంలోకి వదిలేడు (2.19.3); వృత్రుడు అడ్డగించిన నీటిని ప్రవహించేటట్టు చేశాడు (3.26.6; 4.17.1). వృత్రుణ్ని చంపి మూసి ఉన్న నీటి ద్వారం తెరిచేడు (అపాం బిలం యదపిహితం యదాసీ ద్వృత్రం జఘన్వాన్ అప తద్వవార, 1.32.11). ఆయన వజ్రాలు తొంభై నదుల దగ్గర ఉన్నాయి (వితే వజ్రాసో అస్థిర న్నవితం నావ్యా అను, 1.80.8). వృత్రుడితో ఇంద్రుడు చేసిన ఈ యుద్ధమూ, నీటిని విడుదల చేయడమూ ఋగ్వేదంలో చాలా తరచుగా సూచించబడ్డాయి. ఈ గాథలో మార్పులన్నీ ఒక పూర్తి సూక్తం (1.80) అంతటా సూచనాప్రాయంగా ప్రవేశపెట్టబడ్డాయి. మరొకసూక్తం (1.32) వృత్రయుద్ధంలో వివరాలు ఇస్తుంది. ఈ సాధన ఇంద్రుడి వ్యక్తిత్వంలో ముఖ్య లక్షణం అని 1.32. మొదటి రెండు మంత్రాలలోనూ కవి సారాంశరూపంగా ఈగాథని చెప్పిన విధానం వల్ల తెలుస్తుంది: ''వజ్రి అయిన ఇంద్రుడు మొదట చేసిన వీరకృత్యాలని చెప్తాను; పామును చంపేడు; తరవాత నీటిని విడుదల చేశాడు; పర్వతాల ప్రవాహాలని భేదించాడు (1). పర్వతం మీద ఉన్న పామును చంపేడు; త్వష్ట ఆయనకి బాగా వేయదగిన (/శబ్దంచేసే) వజ్రాన్ని పదునుచేశాడు; నీళ్లు అరిచే ఆవులలా ప్రవహిస్తూ సముద్రానికి వెళ్లాయి (2).''[8] సర్వసాధారణంగా

8. ఇంద్రస్యను వీర్యాణి ప్రవోచం, యాని చకార ప్రథమాని వజ్రీ
అహన్నహి మన్వపస్తతర్ద, ప్రవక్షణా అభిన త్పర్వతానాం (1)
అహన్నహిం పర్వతే శిశ్రియాణం, త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష
వాశ్రా ఇవ ధేనవః స్యందమానా, అంజః సముద్రమవజగ్మ రాపః (2).

ప్రకృతి పదార్థాలు 'వజ్రం', 'పర్వతం', 'నీళ్ల (ఆపః) లేకనదులు' వంటి లాక్షణికార్థాలు ఇచ్చే ఒకేవిధమైనపదజాలంతో సూచించబడ్డాయి కాని 'మెరుపు', 'ఉరుము', 'మేఘం', వాన (వృష్టి, వర్షం, లేక వృష్- 'వర్షించు' ధాతువు) వంటి పదాలు వాచ్యంగా అరుదుగా వాడబడ్డాయి (1.52.5, 6, 14 మొ.). ప్రవహించేటట్టు చేయబడిననదులు సాధారణంగా భూమిమీదవేకాని ఋగ్వేదంలో చాలా తరచుగా నీళ్లూనదులూ అంతరిక్షానికీదేవలోకానికీ సంబంధించినవిగా ఊహించబడ్డాయి అనడంలో సందేహం లేదు (1.10.8; 2.20.8; 2.22.4). ఇంద్రుడు విడుదల చేసే నీటిని 'వాన' అనకుండా 'ప్రవాహాలు' అనడానికి ఆ నీటి పరిమాణం చాలా పెద్దది అవడమే (చూ. అర్ణస్- 'వరద') కాక వృత్రగాథని విశిష్టమైనపదజాలంతో వర్ణించాలనే ఇచ్ఛకూడా ఒకకారణమై ఉంటుంది. నీరు కొన్నిచోట్ల అరిచేగోవులతో పోల్చబడింది (చూ. అథస్సూచిక 8) కాబట్టి ఇంద్రుడు విడుదల చేసిన 'గోవులు' అంటేచాలాచోట్ల 'నీరు' అనే అర్థం. ఇంద్రుడు పాముని చంపి మనుష్యుడికోసం గోవులని (= అవి ఉన్నచోట) తెలుసుకొన్నాడు (మనుషే గా అవిందన్నహ న్నహిం, 5.29.3; చూ. 1.52.8). వజ్రం సహాయంతో ఇంద్రుడు చీకటినించి జ్యోతిస్సుతో గోవులని పిలికేడు (యుజం వజ్రం వృషభశ్చక్ర ఇంద్ర నిర్ జ్యోతిషా తమసోగా అదుక్షత్, 1.33.10) అన్నప్పుడు సందర్భం వల్ల 'గోవులు' అంటే 'నీళ్లు' అని తెలుస్తుంది. కాని, చీకటిలోంచి ఉషఃకాలంలో బయటికి వచ్చే ఎర్రని కిరణాలు దొడ్డినించి బయటకు వచ్చే ఆవులతో పోల్చబడడం వల్ల (అధ్యాయం 20.1), మరికొన్నిచోట్లగోవులు అన్నప్పుడు ఇంద్రుడు విడుదల చేసినకాంతికిరణాలు ఉద్దిష్టమై ఉండవచ్చు. ఇంతేకాక, ఋగ్వేదంలో మేఘాలు వాచ్యంగా అభ్ర- మొదలైన పదాలతో నిర్దేశించబడకపోయినా, నీరుగలగోవులు (అధ్యాయం 61) అన్నప్పుడు లాక్షణికంగా మేఘాలే ఉద్దిష్టమయ్యాయి అని చెప్పడం ఎవరూ నిరాకరించలేనిది. అలాగే, ఊధర్- 'పొదుగు', ఉత్స- 'ఊట', కవంధ- 'పాత్ర', కోశ- 'పాత్ర' వంటి పదాలు కూడా మేఘాన్నే సూచిస్తాయనేది స్పష్టం. అందువల్ల, ఇంద్రుడు పుట్టినప్పుడు ధేనువులు స్తుతించాయి (అనోనవుః) (సంధేనవో జాయమానే అనోనవుః, 8.70.4) అన్నప్పుడు 'ధేనువులు' అంటే 'వానమేఘాలు' అని అనుకోవచ్చు.

22.19 కాని ఇంద్రగాథలో మేఘాలని పర్వతాలు, గిరులు అనేశబ్దాలతో సూచించడం సాధారణం (అధ్యాయం 7.11). అవి రాక్షసుడు ఉండే పర్వతాలు (1.32.2; 2.12.11); వాటమీద నించి రాక్షసుడిని ఇంద్రుడు కిందకి పడగొడతాడు (1.130.7; 4.30.14;

6.26.5). ఆయన తన గురిపెట్టిన బాణాన్ని వేసి కొండలమీదనించి నీటిని విడుదల చేస్తాడు (8.77.6). ఆవులని విడిపించడానికి ఆయన కొండని బద్దలు కొట్టేడు (కృంతత్.... గిరింపృథుం, 8.45.30). కొన్నిచోట్ల మేఘం ఆవులను అడ్డుకొన్న పెద్దరాయి (అద్రి-) గా భావించబడింది; ఇంద్రుడు ఆ రాతిని బద్దలు కొడతాడు (6.17.5). ఆయన రాతిని కదిపి గోవులు దొరకడానికి మార్గం చేశాడు (10.112.8); రాయిలో ఉండిపోయిన గోవులని (గా అంతరశ్మనః) విడిపించాడు (6.43.3; చూ. 5.30.4). రాళ్లనీ పర్వతాలనీ చెప్పబడినవి అనావృష్టికాలంలో వానకురవకుండా కదలకుండా ఉండే మేఘాలూ, ఆవులని చెప్పబడినవి కదులుతూ ఉరుముతూ వానకురిసే మేఘాలూ అనుకోవచ్చు. ఓల్డెన్‌బెర్గ్ వృత్రగాథలోని కొండలూ, నదులూ ఋగ్వేదకవుల దృష్టిలో భూమికి సంబంధించినవే అని అభిప్రాయపడ్డారు; కాని ఋగ్వేదానికి ముందూ వెనక కాలాలలో అవి అంతరిక్షానికి సంబంధించినవిగానే భావించబడ్డాయని ఆయన అంగీకరించారు.

22.20 తుఫానుకి సంబంధించిన గాథలలోని ఊహలలో మేఘాలు చాలా తరచుగా అంతరిక్షంలోని రాక్షసుల కోటలు (పురః)గా కూడా భావించబడ్డాయి. వాటిసంఖ్య 90 (1.130.7), 99 (నవతించ నవేంద్రఃపురో వ్యైరచ్ఛంబరస్య, 2.19.6), 100 (శతం శంబరస్య పురో బిభేద, 2.14.6); కొన్నిచోట్ల సంఖ్య చెప్పకుండా చాలా (శశ్వతీనాం) అని చెప్పబడింది (8.17.14; 8.98.6). అవి కదిలేవి (చరిష్ణ్వం, 8.1.2.8), శరత్కాలానికి సంబంధించినవి (శారదీః, 1.131.4; 1.174.2; 6.20.10), ఇనుముతో చేసినవి (ఆయసీః, 2.20.8), రాతివి (అశ్మన్మయీనాం, 4.30.20). ఇంద్రుడు వాటిని భేదిస్తాడు (1.51.5, మొ.); అందువల్ల పూర్భిత్ అనే విశేషణం ఆయనకి ప్రత్యేకం. ఒక మంత్రం (10.111.10) ఆయన పూర్భిత్ అనీ, నీటికి ఇష్టుడైన స్వామి అనీ చెప్పబడింది (జార ఆరితః పూర్భిదాసాం; ఆరితః = ప్రేరకుడు). మరొకమంత్రం (10.89.7)లో ఈ గాథలోని అంశాలన్నీ కలిపి చెప్పబడ్డాయి: గొడ్డలి వనాలని చంపినట్లు వృత్రుణ్ణి చంపేడు (జఘానవృత్రం స్వధితి ర్వనేవ), కోటలని నాశనం చేశాడు (రురోజపురః), నదులకి తోవలు తవ్వేడు (అరదన్నసింధూన్), కొత్తకుండని పగలగొట్టినట్టు కొండని పగలగొట్టేడు (బిభేద గిరిం నవమిన్న కుంభం), తనవారితో గోవులని చేశాడు (ఆగా ఇంద్రో అకృణుత స్వయుగ్భిః).

22.21 వృత్రగాథకున్న ప్రాముఖ్యం వల్ల ఇంద్రుడికి ముఖ్యమైనదీ విశిష్టమైనదీ అయిన విశేషణం వృత్రహన్- 'వృత్రుణ్ణి చంపేవాడు'. ఋగ్వేదంలో ఇది ఆయనకి సుమారు 70చోట్ల వర్తిస్తుంది. ఈ విశేషణం కొంత తరచుగా అన్వయించే ఒకే ఒక ఇతర దేవత అగ్ని; కాని అగ్ని తరచుగా ఇంద్రుడితో దేవతాద్వంద్వంగా కలవడమే దీనికి కారణం. కొన్నిచోట్ల సోముడికి కూడా ఇది వర్తించడం ఇటువంటి కారణం వల్లనే అనేది స్పష్టం (అధ్యాయం 37). ఇంద్రుడు తన శక్తితోనే వృత్రుణ్ణి చంపినట్లు కొన్నిచోట్ల స్పష్టంగానే చెప్పబడినా (1.165.8; 7.21.6; 10.138.6), ఈ యుద్ధంలో ఇతర దేవతలు కూడా ఇంద్రుడితో కలిసినట్లు కొన్నిచోట్ల ఉంది. దేవతలు ఆయన్ని వృత్రుణ్ణి చంపే యుద్ధంలో ముందు పెట్టేరు (1.55.3; 6.17.8; 8.12.22). దేవతలంతా వృత్రుడితో యుద్ధం కోసం ఆయన శక్తిని వర్ధిల్లజేశారు (విశ్వే దేవాసో అధ వృష్ణ్యాని తే౽ వర్ధయన్, 10.113.8 (వృష్ణ్యాని = బలాలు); 1.80.15; 6.20.2; 10.48.3; 10.120.3); దేవతలు ఆయన చేతిలో వజ్రం పెట్టేరు (2.20.8). కాని, మరుత్తులు ఆయన శక్తిని వర్ధిల్లజేసి యుద్ధానికి ప్రేరించారని చాలాతరచుగా చెప్పబడింది (యేతే శుష్మం యే తవిషీమవర్ధన్నర్చంత ఇంద్ర మరుతస్త ఓజః, 3.32.3 (శుష్మం, తవిషీం, ఓజః = బలాన్ని); 3.32.4, 10.73.1, 2. మొ; అధ్యాయం 29). వృత్రుడి శ్వాసకి భయపడి మిగిలిన దేవతలంతా పారిపోయినప్పుడు కూడా మరుత్తులు ఇంద్రుడికి సహాయం చేశారు (వృత్రస్యత్వా శ్వసథా దీషమానా విశ్వేదేవా అజహుర్యే సఖాయః, మరుద్భి రింద్రసఖ్యంతే అస్తు, 8.96.7; చూ. 4.18.11; ఐ. బ్రా. 3.20 ఈషమాణాః = పరిగెత్తేవారు); కవి మరుత్తులని ''మీరు ఇంద్రుణ్ణి ఎప్పుడు వదిలిపెట్టేరు? (= ఎప్పుడూ వదిలిపెట్టలేదు)'' అని ఒకచోట అడిగేరు (కద్ధనూనం కధప్రియో యదింద్ర మజహాతన, 8.7.3.1 (కత్ = ఎప్పుడు)).[9] అగ్నీ, సోముడూ, విష్ణువూ కూడా వృత్రయుద్ధంలో ఇంద్రుడికి సహాయం చేసినట్లు తరచు చెప్పబడింది. భూమిమీద ఋత్విజులు కూడా ఇంద్రుడు చేసే యుద్ధాలలో తమకు భాగం ఉన్నట్లు చెప్పుకొన్నారు (5.30.8; 8.62.11; 10.44.9). స్తుతించేవాడు (జరితా) ఇంద్రుడి చేతులలో వజ్రం పెట్టినట్లు చెప్పబడింది (తే వజ్రం జరితా బాహ్వో ర్ధాత్, 163.2), ''యజ్ఞం పాముని చంపడంలో నీ వజ్రాన్ని రక్షించుగాక (ఆవత్)'' అని కూడా చెప్పబడింది (యజ్ఞ స్తేవజ్ర మహిహత్య ఆవత్, 3.32.12). సూక్తాలూ, ప్రార్థనలూ, యజ్ఞమూ,

9. ఇక్కడ మూలకర్త మరుత్తులు ఇంద్రుణ్ణి వదిలిపెట్టినట్లు ఉంది అనిచెప్పడం సరికాదు. కధప్రియః = కథాప్రియులు అన్నచోటు వేదంలో థకి బదులు ధ వాడబడింది

సోమమూ కూడా ఇంద్రుడి శక్తిని ఎక్కువ చేస్తాయని తరచు చెప్పబడింది.

22.22 ఇంద్రుడు వృత్రుడితోనే కాక మరికొందరు అప్రధానులైన రాక్షసులతో కూడా యుద్ధం చేస్తాడు (అధ్యాయం 69). వీరిలో ఒకడైన ఉరణుడికి 99 చేతులు ఉన్నాయి (ఈ రాక్షసుడి పేరు 2.14.4లో మాత్రమే ఉంది); విశ్వరూపుడనే మరొకడికి మూడు తలలూ, ఆరుకళ్ళూ ఉన్నాయి (10.99.6). ఆయన రాక్షసులని ఎప్పుడూ వజ్రంతోనే చంపడు. అర్బుదుడు అనేవాణ్ణి పాదంతో (నలిపి) చంపేడు (అర్బుదం నిక్రమీః పదా, 1.51.6); మంచుతో చంపేడు (హిమేనావిధ్యదర్బుదం, 8.3.2.26). కొన్నిచోట్ల పేర్లు చెప్పకుండా రాక్షసులని ఇంద్రుడు చంపేడు అని ఉంది: ''అసురులని చక్రంతో చంపు'' (అసురా అదేవా శ్చక్రేణతాన్ అపవప, 8.96.9); ''ఎండిన వనాన్ని అగ్ని (కాల్చినట్లు) వజ్రం రాక్షసులని (కాలుస్తుంది)'' (అగ్నిర్న శుష్కంవనమింద్ర హేతీ రక్షః, 6.18.10); ''ద్రోహంచేసే రాక్షసిని చంపడానికి ఇంద్రుడు తనపదునైన ఆయుధాలకి పదును పెడతాడు'' (4.23.7; 4.28.2).

22.23 నీటిని విడుదల చెయ్యడానికీ వెలుగునీ, సూర్యుణ్ణీ, ఉషస్సునీ సంపాదించడానికి సంబంధం ఉంది. ఇంద్రుడు వెలుగునీ దివ్యమైన జలాలనీ సంపాదించాడు (స్వరపశ్చ దేవీః, 3.34.8). ఆయన వృత్రుణ్ణి చంపి కాంతిని సంపాదించాలని ప్రార్థించబడ్డాడు (8.89.4). ఆయన వృత్రుడనే పాముని చంపి నీటిని విడుదలచేసి సూర్యుణ్ణి ఆకాశానికి ఎక్కించాడు (త్వమపా మపిధానావృణోః..... సూర్యం దివ్యారోహ యో౽దృశే, 1.51.4; 1.52.8). పాముని చంపిన ఇంద్రుడు నీటిని సముద్రంలోకి వెళ్లేటట్లు ప్రేరించాడు (అర్ణో అపాం ప్రైరయ దహిహాచ్ఛా సముద్రం), సూర్యుణ్ణి పుట్టించాడు (అజనయత్సూర్యం), గోవులని సంపాదించాడు (విదద్గాః, 2.19.3; 1.32.4; 6.30.5). ఇంద్రుడు అంతరిక్షంలో పాముని చంపేక సూర్యుడు ప్రకాశించాడు (8.3.20). సాధారణంగా సూర్యుడు యుద్ధంలో గెలుచుకొన్న బహుమతిగా చెప్పబడినా, సూర్యుడు ఇంద్రుడి ఆయుధం అని కూడా చెప్పబడింది: ఇంద్రుడు సూర్యుడి రశ్మిలతో బాధించేవాడిని కాలుస్తాడు (ఇంద్రః సూర్యస్య రశ్మిభిర్న్యర్శసానమోషతి, 8.12.9). వృత్రయుద్ధాన్ని గురించి చెప్పకుండానే ఇంద్రుడు చీకటిలో (1.108.8; 4.16.4) వెలుగుని కనుగొన్నాడని చెప్పబడింది (3.34.4; 8.15.5; 10.43.4). ఇంద్రుడు సూర్యుణ్ణి పుట్టించినవాడు (జనితా సూర్యస్య, 3.49.4).

ఆయన ప్రకాశించే కాంతి అయిన సూర్యుణ్ణి ఆకాశంలో పెట్టేడు (8.12.30). ఆయన సూర్యుడు ప్రకాశించేటట్టు చేశాడు (8.3..6; 8.98.2); సూర్యుణ్ణి ఆకాశానికి ఎక్కించాడు (1.7.3). ఆయన సూర్యుణ్ణి సంపాదించాడు (1.100.6, 18; 3.34.9), చీకటిలో ఉన్న సూర్యుణ్ణి కనుగొన్నాడు (3.39.5), ఆయన సూర్యుడికి తోవ చేసినవాడు (స హిజిష్ణుః పథికృత్సూర్యాయ, 10.11.3).

22.24 ఇంద్రుడు ఉషస్సునీ సూర్యుణ్ణీ కూడా పుట్టించేడు (యః సూర్యం య ఉషసం జజాన, 2.12.7; 2.21.4; 3.31.15; 3.32.8; 3.49.4). ఆయన ఉషస్సునీ, సూర్యుణ్ణీ ప్రకాశించేటట్టు చేశాడు (3.44.2). ఆయన ఉషస్సుతోనూ సూర్యుడితోనూ అంధకారాన్ని పోగొట్టేడు (వి వరుషసా సూర్యేణగోభిరంధః, 1.62.5). ఆయన సూర్యుడివల్ల ఉషస్సుని దొంగిలించాడు (= పోగొట్టేడు; ముష్ణన్నుషసః సూర్యేణ, 2.20.5). సూర్యుడూ, ఉషస్సులతో పాటు ఇంద్రుడు కనుగొన్నవి / విడుదల చేసినవి / గెలుచుకొన్నవి అని చెప్పబడిన గోవులు (1.62.5; 2.12.7; 6.17.5; సూర్యుడితో మాత్రమే, 1.7.3.; 2.19.3; 3.34.9; 6.17.3; 6.32.2; 10.138.2), నీటికో వాన మేఘాలకో కాక, ప్రాతఃకాలపు కిరణాలకో (అధ్యాయం 61) లేక, బెర్గెయిన్(Bergaigne), మరికొందరూ చెప్పినట్లు, ఉషఃకాలంలోని ఎర్రమేఘాలకో ప్రతీకలని చెప్పడం సముచితం. ఎర్రని నీరుగల గోవులు (ఉస్రియా అప్యాః.....గాః, 9.108.6) అని చెప్పినచోట నీళ్లు ఉద్దిష్టమై ఉండవచ్చు; కాని కింద ఇచ్చిన సందర్భాలలో ప్రాతఃకాలపు కిరణాలో మేఘాలో ఉద్దిష్టాలు. ఇంద్రుడు గోవులకి పతి అయ్యాడు, ఉషస్సులు ఆయన్ని చూసి దగ్గరకు వెళ్లాయి (తం జానతీః ప్రత్యుదాయన్నుషాసః, పతిర్గవామభవదేక ఇంద్రః, 3.31.4). ఆయన వృత్రుణ్ణి జయించి రాత్రుల ఆవులు (ధేనాః) కనపడేటట్టు చేశాడు (3.34.3). కొన్ని మంత్రాలలో ఉషస్సే గోవులని సంపాదించినట్లు ఉంది. ఆవులు వాటి దొడ్డి (తలుపు) ని తెరిచినట్లు ఉషస్సు చీకటిని తెరిచింది (గావోనవ్రజం వ్యుషా ఆవర్తమః, 1.92.4). ఉషస్సు గట్టిరాయి ద్వారాలు తెరిచింది (7.79.4). గోవులు ఉషస్సువైపుకి అరిచాయి (7.75.7). అంగిరసులు ఆవుల మందలని విడిచిపెట్టేరు (గోత్రాగవా మంగిరసో గృణంతి, 6.65.3). ఇంద్రుడు నీటిని సంపాదించినట్లు చెప్పిన మంత్రాలలోనే ఆయన ఉషస్సునీ సూర్యుణ్ణీ పుట్టించినట్లు చెప్పబడింది (1.32.1, 2, 4; 6.30.5; 10.138.1, 2). అందువల్ల తుఫానువల్ల వచ్చిన చీకటి తరవాత సూర్యుణ్ణి తిరిగి సంపాదించడం అనే భావమూ, ఉషఃకాలంలో రాత్రి

చీకటినించి సూర్యుణ్ణి బయటికి తీసుకురావడం అనే భావమూ కలిసిపోయినట్లు తోస్తుంది. ఇంద్రగాథలో పైనచెప్పిన రెండో అంశం మొదటి అంశానికి అనుబంధంగా ప్రవేశించి ఉండవచ్చు.

22.25 తుపానులో ఇంద్రుడి కృత్యంకొన్నిచోట్ల వాచ్యంగానే చెప్పబడింది: ''నువ్వు ఆకాశం యొక్క సాటిలేని కాంతులని పుట్టించావు'' (యశ్చాసమా అజనో దిద్యుతో దివః, 2.13.7); ఆయన నీటిని కిందకు వెళ్లేటట్టు చేశాడు'' (అధరాచీన మకృణోదపామపః, 2.17.5).

22.26 వృత్రయుద్ధం, గోవులనీ సూర్యుణ్ణీ విడిపించడం - వీటితోపాటు సోమం సంపాదించడం కూడా కలిపి చెప్పబడింది. ఇంద్రుడు పాముని అంతరిక్షాన్నించి తొలగించినప్పుడు అగ్నులూ, సూర్యుడూ, సోమరసమూ ప్రకాశించాయి (8.3.20). వృత్రుణ్ణి చంపిన ఇంద్రుడు సోమాన్ని తనపానంగా అంగీకరించాడు (వృత్రం జఘన్వాన్ అవృణీత సోమం, 3.36.8). రాక్షస మాయలని జయించాక సోమం ఆయన సొత్తు అయింది (7.98.3); ఆయన సోమానికి సంబంధించిన తేనెకు రాజు అయ్యాడు (రాజాబభవన్మధునః సోమ్యస్య, 6.20.3). ఇంద్రుడు రాళ్లలో పిండిన సోమాన్ని ప్రకాశం చేశాడు; గోవులని బయటకి తెచ్చేడు (3.44.3). ''గోవులని జయించావు; సోమాన్ని జయించావు'' (అజయోగా అజయః శూర సోమం, 1.32.12). ఆయన స్వర్గంలో దాచబడి ఉన్న అమృతాన్ని కనుగొన్నాడు (దివి..... విందదమృతం నిగూళ్హం, 6.44.23) ఆయన ఎర్రని గోవులో (ఉస్రియా యాం) నిండి ఉన్న తేనె కనుగొన్నాడు (3.39.6) అప్పుడే ఈనిన ఆవు పక్వమైనపాలు ధరించి తిరుగుతుంది (ఆమా పక్వంచరతి బిభ్రతీగాః) ఎర్రని ఆవలో తీపి పాలు అంతా నిండి ఉంటుంది (విశ్వం స్వాద్మ సంభృతము[స్రి] యాయాం); దాన్ని ఇంద్రుడు భోజనం కోసం (అక్కడ) పెట్టేడు (యత్సీమింద్ర అదధాద్ భోజనాయ, 3.30.14). ఇంద్రుడు కొత్తగా ఈనిన ఆవులలో పక్వమైన పా[లు] పెడతాడు (8.32.25; 8.89.7); ఆ ఆవులు ఎర్రనివి లేక నల్లనివి (1.62.9); వాటి తలుపులు తెరుస్తాడు (6.17.6). ఈ ఉక్తులు ఇంద్రుడి ఆకాశానికి సంబంధించిన గొ[ప్ప] కృత్యాలని వర్ణించే సందర్భాలలోనివి కాబట్టి వీటిలో వానమేఘాలు గాథారూపంలో సూచించబడినట్లు కనపడుతుంది.

22.27 ఇంద్రుడు కదిలేపర్వతాలనీ భూమినీస్థిరమైనవిగా చేశాడు (2.12.2; 10.44.8). ఒక అర్వాచీన గ్రంథంలో ఇంద్రుడు వాటి ఇష్టం వచ్చినచోటుకి ఎగిరివెళ్లి దిగుతూ భూమిని అస్థిరం చేసిన కొండల రెక్కలని తెగగొట్టేడని చెప్పబడింది. ఆ రెక్కలు ఉరిమే మేఘాలు అయ్యాయి (మై.సం. 1.10.13). ఇది వేదకాలానికి తరవాత సాహిత్యంలో చాలా ప్రసిద్ధమైనగాథ. దీనికి మూలం ఋగ్వేదంలో 4.54.5 మంత్రంలో ఉందని పిషెల్ చెప్పేరు. ఇంద్రుడు ఆకాశంలో ప్రకాశించే ప్రదేశాలని దృఢంచేశాడు (8.14.9). ఇంద్రుడు భూమిని ధరించాడు, ఆకాశాన్ని మాయవల్ల పడకుండా నిలబెట్టేడు (అధారయ త్పృథివీం ..... అస్తభ్నాన్మాయయా ద్యామవస్రసః, 2.17.5, మొ.) ఆయన ఆకాశాన్నీ భూమినీ ఇరుసు చక్రాలని వేరుచేసినట్లు వేరుచేశాడు (యో అక్షేణేవ చక్రియా శచీభి ర్విష్వక్ తస్తంభ పృథివీ ముతద్యాం, 10.89.4). ఆయన భూమ్యాకాశాలని చర్మం పరిచినట్లు పరిచాడు (ఇంద్రశ్చర్మేవ రోదసీ, 8.6.5; 8.3.6). ఆయనస్వర్గానికీ భూమికీ ఉత్పాదకుడు (జనితా దివో జనితా పృథివ్యాః, 8.36.4; చూ. 6.47.4). ఉన్నదాన్నీ ఇక మీద ఉండేదాన్నీ ఆయన తనగొప్ప రహస్యమైన పేరుతో సృష్టించాడు (మహత్తన్నామ గుహ్యం, 10.55.2; లేని దానిని ఉన్నదానిగా చాలసార్లు చేశాడు (అసచ్చసన్మహు రా చక్రి రింద్రః, 6.24.5). కొన్నిచోట్ల ఇంద్రుడు ఆకాశాన్నీ భూమినీ విడదీసి నిలబెట్టడం రాక్షసవధతోపాటు జరిగినట్లు చెప్పబడింది (5.29.4); రాక్షసుడు వాటిని ఆవరించినట్లు 8.6.17 (య ఇమే రోదసీ ..... సమజగ్రభీత్) లో ఉంది. ''నువ్వు వృత్ర హత్యకోసం పుట్టినప్పుడే పృథివిని విస్తారం చేశావు; ఆకాశాన్ని నిలబెట్టేవు (యజ్జాయథా ..... వృత్రహత్యాయ, తత్పృథివీ మప్రథమ దస్తభ్నా ఉత ద్యాః, 8.89.5). అహిహంత అయిన ఇంద్రుడు భూమి ఆకాశానికి కనపడేటట్లు చేశాడు; నదులకి మార్గాలు చేశాడు (2.13.5). అలాగే ''నువ్వు దాగి ఉన్న భూమ్యాకాశాలని సంపాదించావు'' (గూళ్హే ద్యావాపృథివీ అన్వవిందః, 8.96.16) అనీ వాటిని కాంతీ, నీళ్లతోపాటు సంపాదించాడు (3.34.8) అనీ చెప్పబడింది. ఇటువంటి భావాలకు చీకటిలో భూమ్యాకాశాలు కలిసిపోయినట్లు ఉండడమూ, వెలుగు దృష్టిని విస్తారంచేసే వాటిని విడదీసినట్లు ఉండడమూ మూలం కావచ్చు.

22.28 వజ్రాయుధుడై అంతరిక్షంలోని రాక్షసులని యుద్ధంలో చంపే ఇంద్రుణ్ణే యుద్ధాలు చేసేవారు తరచు ప్రార్థించారు (4.24.3 మొ). ఆర్యులు తమ శత్రువులతో యుద్ధాలలో

యుద్ధనేత్ర అయిన ఇంద్రుణ్ణే మిగిలిన దేవతలకన్నా ఎక్కువ తరచుగా సహాయం కోసం అర్థించారు. ఆయన ఆర్యుల్నే (ఇంద్రః..... ఆర్యం ప్రావత్, 1.130.8); ఆర్యుల రంగుని రక్షిస్తాడు (ప్రార్యం వర్ణమావత్, 3.34.9); నల్లని చర్మాన్ని నాశనం చేస్తాడు (త్వచం కృష్ణా మరంధయత్, 1.130.8). "నువ్వు ఏభైవేలమంది నల్లనివారిని చంపేవు; వారి పురాలని నాశనం చేశాడు" (పంచాశ త్కృష్ణా ని వపః సహస్రా ...... పురో ..... వి దర్దః, 4.16.13). "నువ్వు దస్యులను జయించావు; వారిని దాసులుగా ఆర్యులకు ఇచ్చావు" (త్వం హనుత్య దదమాయో దస్యూ రేకః కృష్టీరవనో రార్యాయ, 6.18.3); "నేను ఆర్యుడికి భూమిని ఇచ్చాను" (అహంభూమి మదదా మార్యాయ, 4.26.2; ★ ఇది ఇంద్రుడు చెప్పిన మాట). ఆయన సప్తనదులు గల దేశంలోని దస్యుల ఆయుధాలని ఆర్యులకి (తగలకుండా తప్పించి) విఫలం చేశాడు (ఆర్యాత్సప్తసింధుషు, వధర్దాసస్య..... నీనమః, 8.24.27; వధః = ఆయుధం). ఇతర దేవతలు (అశ్వినులు (1.117.21), అగ్ని (9.103.1), అందరు దేవతయా (6.21.11)) ఆర్యులకి రక్షకులని చెప్పడం చాలా అరుదు.

22.29 ఇంతకంటె సాధారణంగా ఇంద్రుడు కరుణామయుడైన సహాయకుడుగా చెప్పబడ్డాడు (1.84.19; 8.66.13; 8.80.1); ఆయన స్తుతించే వారికి విముక్తి కలిగించేవాడు, వారిపై ప్రమాణ్ణాడేవాడు (అధివక్తా, 8.96.20), వారికి బలం (7.31.5), వారికి కోట (వంటివాడు, పూః 8.80.7). ఆయనని నమ్మిన వారు చంపబడరు, ఓడరు (10.152.1). ఇంద్రుడు ఆరాధించే వారికి స్నేహితుడు, సోదరుడు (3.53.3), తండ్రి (1.17.17; 10.48.1), తండ్రి తల్లి కూడా (8.98.11). ఆయన పూర్వకాలంలో కూడా పితరులకు బంధువు (6.21.8; చూ. 7.33.4). ఆయన ఒకపోటు (1.10.11) కౌశికుడని చెప్పబడడం వల్ల ఆయనకి కుశికుడి వంశం వారిపై ప్రత్యేకాభిమానం ఉందని ఊహించవచ్చు. ఇంద్రుడు తనకి ఆహుతులు ఇవ్వనివారి స్నేహం చేయడు (10.42.4); కాని భక్తులకు సమృద్ధిగా ధనం ఇస్తాడు (2.19.4); 2.22.3; 7.27.3). ఆయన్ని ఇటువంటి యాగాల వల్ల తమవద్దకు రావలసిందని బాధలు ప్రార్థించారు (2.18.3, మొ). మనుష్యులందరికీ ఆయన ఇచ్చే దానిలో భాగం ఉంది (8.65.7). ఆయన రెండు చేతులూ ధనంతో నిండి ఉన్నాయి (7.37.3). ఆయన ధనంతో నిండిన పెట్టెవంటివాడు (కోశం వస్వా పూర్ణం, 10.42.2). "కర్రగలవాడు (అంకీ) పండిన పళ్ళుగల చెట్టుని

దులిపినట్లు తృప్తి కలిగించే ధనం దులుపు (= ఇయ్యి)'' (వృక్షం పక్వం ఫలమంకీ వ ధూనుహీంద్ర సంపారణం వసు, 3.45.4) అని ఆయనని ప్రార్థించారు. భయంకరమైన ఎద్దుని ఎవరూ ఆపలేనట్లు దానమిచ్చే ఇంద్రుణ్ణి దేవతలూ, మనుష్యులూ ఆపలేరు (వహిత్వా శూర దేవా నమర్తాసో దిత్సంతం, భీమంనగాం వారయంతే, 8.81.3). ఆయన సంపదల సముద్రం (వస్వో అర్ణవం, 1.51.1); నదులన్నీ సముద్రంలో కలిసినట్లు సంపదలతో వలన్నీ ఆయనలో కలుస్తాయి (6.19.5). ఇంద్రుడు ఇచ్చే రకరకాల సంపదలు ప్రత్యేకించి ఒక పూర్తి సూక్తం (10.47) లో చెప్పబడ్డాయి. ఇతర దేవతల విషయంలోలాగే ఈయన్ని కూడా ఆవులూ గుర్రాలూ ఇమ్మని తరచు ప్రార్థించారు (1.16.9; 1.101.4, మొ.). గోపతి - అనే విశేషణం ముఖ్యంగా వాడబడినది ఈయనకే. ఆయన యుద్ధాలు తరచుగా గవిష్టి - అని చెప్పబడ్డాయి; ఈపదం వాచ్యార్థం 'గోవులు కావాలనే కోరిక' (8.24.5; మొ.); యుద్ధంలో జయం వల్లనే ఆయన ఇచ్చే దానాలు లభిస్తాయి (4.17.10, 11, మొ.). ఇంద్రుడు భార్యలనీ పిల్లలనీ కూడా ఇస్తాడు (1.54.11). ఈయన దానగుణం విశిష్టమవడం వల్ల మఘువన్- 'దానం ఇచ్చేవాడు' అనే చాలా తరచుగా వాడబడిన విశేషణం ఇంచుమించు ఋగ్వేదం అంతటా ఈయనకే అన్వయిస్తుది (కాని చూ. అధ్యాయం 20.8); వేదకాలం తరవాత సాహిత్యంలో ఇది ఈయనకే రూఢి అయింది. వసుపతి 'సంపదకి పతి' అనే విశేషణం కూడా ముఖ్యంగా ఇంద్రుడికే చెందుతుంది.

22.30 ఇంద్రుడికి సంబంధించిన ముఖ్యగాథ వృత్రయుద్ధమే అయినా అనేకమైన ఇతర గాథలు కూడా ఈయన వీరకృత్యాలని తెలుపుతాయి. కొన్ని మంత్రాలు ఇంద్రుడికీ ఉషస్సుకీ పోట్లాట వచ్చినట్లు వర్ణిస్తాయి. ఆయన ఉషస్సు వాహనాన్ని (అనస్-) ధ్వంసం చేశాడు ('10.73.6). వేగంలేని ఉషస్సు (గుర్రాలని/సేనలని) వేగవంతమైన తన (గుర్రాలతో/సేనలతో) చంపి, ఇంద్రుడు ఉషస్సు బండిని వజ్రంతో నలిపివేశాడు (వజ్రేణాన ఉషసః సంపిపేష, 2.15.6). ఇంద్రుడి వజ్రానికి భయపడి ఉషస్సు తనబండిని వదిలివేసింది (అజహా దుషా అనః, 10.138.5). చెడు చెయ్యాలని ఆలోచించే (దుర్హణాయువం) స్వర్గానికి కూతురైన (దుహితరం దివః) ఉషస్సు అనే స్త్రీని వధించడమనే వీరకృత్యం (పౌంస్యం) ఇంద్రుడు చేశాడు (4.30.8, 9); నలిగిపోయిన తనబండిని వదిలి భయపడిన ఉషస్సు దూరంగా వెళ్ళింది (అపోషా అనసః సరత్సంపిష్టా దహ బిభ్యుషీ (4.30.10); బాగా నలిగిపోయిన ఆమె బండి విపాశ్ - అనే నదిలో పడి ఉంది (ఏత దస్యా అనః శయే

సుసంపిష్టం విపాశ్యా); ఆమె దూరంగా వెళ్లిపోయింది (ససార సీం పరావతః, 4.30.11). తుపానువల్ల ఉషస్సు కనపడకపోవడం ఈ గాథకి ఆధారం అని సాధారణంగా అంటారు. ఇటువంటి వివరణకి వ్యతిరేకంగా బెర్గెయిన్ ఆకాశాన్ని మరుగుపరిచేవాడు ఇంద్రుడు కాడు, ఒక రాక్షసుడు అనీ, ఇంద్రుడి ఆయుధమైన వజ్రం ప్రయోగం వృత్ర యుద్ధానికి మాత్రమే పరిమితం కాదనీ అన్నారు. కాలాతిక్రమణం చేసే ఉషస్సుని సూర్యోదయం ఆక్రమించడమే (చూ. 2.15.6; 5.79.9) ఇక్కడ ఇంద్రుడు సూర్యుణ్ణి తెచ్చి విజయం సాధించడంగా భావించబడిందనీ ఆయన నిర్ణయించారు.

22.31 రథంలాగే ఏతశ- అనే వేగవంతమైన గుర్రానికీ పసుపుపచ్చని గుర్రాల మీద వచ్చే సూర్యుడికీ మధ్య జరిగిన పోటీకి సంబంధించిన అస్పష్టమైన ఒక గాథలో ఇంద్రుడికి సూర్యుడితో ఘర్షణ వస్తుంది. ముందువెళ్లే సూర్యుణ్ణి ఇంద్రుడు ఆపుతాడు. ఆయన రథానికి ఉన్న చక్రాలలో ఒకటి ఊడుతుంది; ఇలా జరగడానికి ఒకవిధంగా ఇంద్రుడు కారణమైనట్లు కనపడుతుంది (అధ్యాయం 60 (iv)). సూర్యుడి గోధుమ, పసుపు రంగుల గుర్రాలని ఇంద్రుడు ఆపేడు (10.92.8) అనే ఉక్తి బహుశా ఈ గాథకి సంబంధించినది కావచ్చు. సోమాన్ని బలాత్కారంగా తీసుకోవడం అనే గాథతో కూడా ఇంద్రుడికి సంబంధం ఉంది; అమర్త్యత్వాన్ని కలిగించే ఆ పానాన్ని గద్ద తీసుకువచ్చేది ఆయనకోసమే (అధ్యాయం 37). తరచుగా చెప్పబడని మరొక గాథ ఇంద్రుడు పణులు (పణి-) అనేవారి ఆవులని పట్టుకోవడం (అధ్యాయం 67); దీని వివరాలు ముఖ్యంగా ఒకే ఒక సూక్తం (10.108) లో ఉన్నాయి. యజ్ఞాలు చేసే భక్తులకి ఆవులు ఇవ్వని పిసినిగొట్టు వారికి గాథా ప్రతీకలైన పణులనే ఈ రాక్షసులకి ఆవుల మందలు ఉన్నాయి; వాటిని వారు రస (రసా-) అనే (గాథలో) నదికి అవతలవైపున దూరంగా ఉన్న ఒక గుహలో దాచి ఉంచుతారు. ఇంద్రుడి దూత అయిన సరమ (సరమా-) వాటిని కనిపెట్టి వాటిని ఇమ్మని పణులని ఇంద్రుడి తరఫున అడుగుతుంది. వారు ఆమెని అపహాస్యం చేస్తారు.[10] మరొక మంత్రం (6.39.2) లో కొండకు అవతలవైపున ఉన్న గోవులని కోరిన ఇంద్రుడు వలుడిగట్టి కోటను ఛేదించి పణులని జయించినట్లు చెప్పబడింది. ఇతర మంత్రాలలో పణులనిగురించి చెప్పకుండా వలుడు అనే రాక్షసుడు ఆవులని దాచినట్లూ, ఇంద్రుడు వాటిని బయటకు తీసుకొని

10. వారు ఆమెను తమకు సోదరిగా (స్వసారం త్వాకృణవై "నిన్ను సోదరిగా చేసుకొంటాం, 9), గోవులకు స్వామినిగా (గోపతిర్నో భవాతి "మనగోవులకి పతి అవుతుంది", 3) ఉండిపొమ్మంటారు.

వచ్చినట్లూ చెప్పబడింది (2.12.3; 3.30.10). ఇంద్రుడు వలుడి కోటలని ధ్వంసం చేసి, వలుణ్ణి చంపి, ఆవులని బయటకు తీసుకురావడంలో అంగిరసులు ఆయనకిసహాయం చేసినట్లు చాలా మంత్రాలలో ఉంది (అధ్యాయం 54).

22.32 ఇంద్రుడు దాసులని లేక దస్యులని జయించినట్లు అసమగ్రమైన సూచనలు చాలా చోట్ల ఉన్నాయి; ఇవి తరచు పేర్ల జాబితాల రూపంలో ఉన్నాయి. వీరు నల్లని చర్మంగల మనుష్య శత్రువులు (1.130.8; చూ. 2.20.7), వీరు ముక్కు లేనివారు (అనాసః, 5.29.10; ★దీనికిసాయణుడు ''నోరులేని మూగవారు'' అని అర్థం ఇచ్చారు), దేవుడు లేడనేవారు, యజ్ఞాలు చెయ్యనివ్వరు, ఇంద్రుడు దాసులలో ప్రత్యేక వ్యక్తులని జయించినట్లు ఉన్న వర్ణనలలో చాలావరకు ఊహాజనితమైన కథాంశాలు కలిసిపోయా యనడంలో సందేహం లేకపోయినా ఈ కథలకి ఆధారం భూమిమీద మానవులే అయినట్లు కనపడుతుంది. ఎందువల్లనంటే, వృత్రవధ మానవులందరి మంచి కోసం జరిగింది. కాని ఇంద్రుడు ఒక దాసుణ్ణి లేక దాసులని జయించడం ప్రత్యేకమైన మానవులతో లేక వారికోసం జరిగినట్లు చెప్పబడింది. ఇలా ఇంద్రుడు సహాయం చేసిన వ్యక్తులు సాధారణంగా ఋషుల పూర్వులు కాక నిజంగా పూర్వకాలంలో ఉండి ఉన్న రాజులు లేక వీరులు. ఉదాహరణకి, అతిథిగ్వ దివోదాసుడు సుదాసుడు (సుదాస్-) అనే ప్రసిద్ధుడైన రాజుకి తండ్రి; ఆయన శత్రువు కువితరుడి కొడుకైన శంబరుడు అనే దాసుడు (అధ్యాయం 69 (ii)). కాని దాసుడు అనే పదం నీటిని విడుదల చెయ్యడానికి ఇంద్రుడు చంపిన పాము (అపా)కీ (2.11.2), త్రితుడు జయించిన మూడు తలలూ, ఆరుకన్నులూ గల రాక్షసుడికీ (తే మఘవన్ వ్యంసో నివివిధ్వాన్ అపహనూ జఘాన, 4.18.9) ఉపయోగించబడినప్పుడు అది అసలు రాక్షసులనే సూచిస్తుంది. రాక్షసులని గురించిన విభాగంలో ఇంద్రుడు జయించిన నముచి మొదలైన దాసులని గురించిన వివరాలు చూడవచ్చు (అధ్యాయాలు 67-70).

22.33 ఇంద్రుడికీ వృషాకపికీ సంబంధించిన గాథ వివరాలు కొంత అస్పష్టంగా ఋగ్వేదం 10.86 సూక్తంలో ఉన్నాయి; ఈ గాథకి సర్వవ్యాపి ప్రాముఖ్యం లేకపోవడం వల్ల దీన్ని ఒక అర్వాచీన కవి సృష్టించినట్లు కనపడుతుంది. వృషాకపి అనే కోతిని గురించి ఇంద్రుడికీ ఆయన భార్య ఇంద్రాణికీ మధ్య ఏర్పడిన ఘర్షణ ఈ సూక్తంలో వర్ణించబడింది; ఇంద్రుడికి ప్రీతిపాత్రమైన ఆ కోతి ఇంద్రాణి వస్తువులు పాడుచేసింది. వృషాకపి బాగా దెబ్బలు తిని,

తప్పించుకొని పారిపోయి, కొంతకాలానికి తిరిగివచ్చాక వారికి సంధి కుదురుతుంది.[11] వి. బ్రాడ్కే (Bradke) ఇది అపహేళనాత్మకమైన కథ అనీ, ఇందులో ఇంద్రుడు, ఇంద్రాణి అనే పేర్లతో ఒక నిజమైన రాజా, ఆయన భార్యా ఉద్దేశించబడ్డారనీ భావించారు.

22.34 ఇంద్రుడు తుర్వశుడు (తుర్వశ-), యదువు (యదు-) అనే వారిని నదులు దాటించి క్షేమంగా తీసుకువచ్చిన కథ (1.174.9, మొ.) చారిత్రకాంశాలు మిగుల్చుకొని ఉన్న కథల్లో ఒకటి. వీరిద్దరూ వీరి పేర్లమీద వెలసిన పరస్పర సాన్నిహిత్యంగల రెండు ఆర్యసముదాయాలలోని వీరులు; ఈ రెండు సముదాయాలకీ పరస్పర విరోధం కూడా ఉన్నట్లు కవులు కొన్నిచోట్ల చెప్పారు. ఇలా సంబంధాలలోని మార్పులు ఈ కథలో చారిత్రక సత్యం ఉండడానికి తగినంత సూచన. ఇక్కడ ఈ జాతీయయుద్ధ దేవత (ఇంద్రుడు) ఆర్యుల వంశ వెల్లడానికి అధినాయకుడుగా దర్శనం ఇస్తాడు. మరొక సందర్భంలో ఇంద్రుడు సుశ్రవసుడి (సుశ్రవస్-)తో కలిసి ఇరవైమంది సేనాధిపతులనీ వారి 60,099 యోధులనీ తీవ్రమైన రథచక్రంతో చంపివేసినట్లు చెప్పబడింది. సుదాసుడు (సుదాస్-) అనే రాజు చేసిన యుద్ధాల వివరాలు నిజంగా జరిగిన చారిత్రక సంఘటనల వర్ణనలాగే కనబడతాయి: సుదాసుడి పురోహితబ్రాతృత్వం (వీరిలో వసిష్ఠుడు ముఖ్యుడు) ప్రార్థనలు విని ఇంద్రుడు ఆయనకి పదిరాజులతో జరిగిన యుద్ధంలో సాయపడినట్లూ (7.33.3), ఆయన శత్రువులని పరుష్ణీనదిలో పడవేసి చంపినట్లూ (7.18.9, 13) చెప్పబడింది.

22.35 వీటిలో విచిత్రమైనది 8.91 సూక్తంలో చెప్పబడిన కథ: అపాల (అపాలా-) అనే కన్య ఒకనది ఒడ్డున ఉన్న సోమలతని వెతికి కనిపెట్టి ఆమె పళ్లతో సోమరసం పిండి ఆమె దగ్గరకి వచ్చిన ఇంద్రుడికి సమర్పిస్తుంది. ఇంద్రుడు ప్రతిఫలంగా ఆమెకు కొన్ని కోరికలు తీరుస్తాడు.

22.36 మొత్తంమీద పరిశీలించి చూస్తే, ఇంద్రుడి గుణాలూ కృత్యాలూ ముఖ్యంగా శారీరక శక్తికీ ప్రకృతి ప్రపంచాధిపత్యానికీ సంబంధించినవి. శారీరక బలంతో పనులు సాధించడం ఇంద్రుడి ప్రత్యేకత; పరోక్షశక్తితో పరిపాలించడం వరుణుడి ప్రత్యేకత.

---

11. ఈ కోతి ఇంద్రాణికోసం ఉద్దేశించబడిన ఆహుతులని పాడుచేసింది; అందువల్ల దానితల కోసేస్తానని ఇంద్రాణి అంది (10.86.5) ఈ సూక్తం ఇంద్రుడు, ఇంద్రాణి, వృషాకపుల మధ్య సంభాషణ రూపంలో ఉంది. వృషాకపి ఇంద్రుడి పుత్రుడని సాయణుడు. ఇది హరిత వర్ణంగల మృగం (హరితో మృగః, 3), కోతి (కపి, 5) అని మంత్రాలలోనే చెప్పబడింది.

ఇంద్రుడు విశ్వానికంతకీ ఏకచ్ఛత్రాధిపతి; ఈయన విశ్వంలోని శాశ్వత సూత్రాలని పరిరక్షించేవాడూ, నీతినియమాలను నిలబెట్టేవాడూ కాడు కాని తన దృఢమైన చేతితో విజయాన్ని సాధించేఎదురులేని యోధుడు. ఈయన అంతులేని దాతృత్వం మానవులకి అమూల్యమైన వస్తువులు ప్రసాదిస్తుంది; ఈయనగొప్ప సోమయాగాలలో పరవశత్వం పొందిన ఆనందంలో ఆయాగాలు చేయించే యాజకబృందాలకి వెలలేని ప్రతిఫలాలు ఇస్తాడు. ఆయన్నిస్తుతించేఅసంఖ్యాకమైనసూక్తాలు ఇంచుమించు ఒకేవిధమైనపదజాలంతో పైన చెప్పిన లక్షణాలని వర్ణిస్తాయి; వీటిలో సోమరసాన్ని అర్పించడం గురించిన ప్రసక్తి లేకపోవడం చాలా అరుదు. వరుణుడికి ఉన్న నీతి విషయకమైన ఔన్నత్యమూ, వైభవమూ ఇంద్రుడికి ఉన్నట్లు చెప్పిన వర్ణనలు అంత ఎక్కువగా లేవు. కాని వరుణుడికి ప్రత్యేకమైన కృత్యాలు ఇంద్రుడికి ఆపాదించి చెప్పిన మంత్రాలు కొన్ని ఉన్నాయి. ముఖ్యంగా అర్వాచీన మండలాలలోని చాలాకొద్ది మంత్రాలలో ఇంద్రుడి నీతియుత ప్రవర్తనగురించిన ప్రస్తావనా, ఇంద్రుణ్ణే తాము ఆరాధిస్తున్నట్లు అంగీకరించడమూ, ఆయన్ని అందరూ ఆరాధించాలనే అభ్యర్థనా ఉన్నాయి (1.55.5, మొ.).

నాస్తికుల అపనమ్మకాన్ని నిరాకరిస్తూ ఇంద్రుడు ఉన్నాడు అనే సత్యాన్ని తాము నమ్ముతున్నట్లు ఋషులు కొన్నిచోట్ల (2.12.5, మొ.) చెప్పేరు.[12] ఒక అర్వాచీనమంత్రం (10.67.1) లో ఆయన తపస్సుచేసి స్వర్గాన్ని జయించినట్లు చెప్పబడింది (త్వం తపః పరితప్యాజయః స్వః; చూ. 10.159.4).

22.37 వేదదేవతల స్వభావానికి అవశ్యమూ, ఇంద్రుడికి కూడా ఉన్నట్లూ చెప్పబడిన నీతివిషయకపరిపూర్ణతకి విరుద్ధమైన ఇంద్రియలోలత్వమూ, కొన్ని నీతిబాహ్య లక్షణాలూ ఇంద్రుడికి ఉన్నట్లు కొన్నిచోట్ల చెప్పబడడానికి కారణం ఇంద్రుడి విషయంలో పురుషతారోపణ ఎక్కువ స్థాయిలో ఉండడమే అనడంలో సందేహం లేదు. ఒకే ఋషి మాటలలో, కొన్నిచోట్ల ఒకే మంత్రంలో కూడా, ఇటువంటి పరస్పర విరుద్ధోక్తులు ఉండడం వల్ల ఈ వైరుధ్యం భిన్న కాలాలలో కూర్చబడిన మంత్రాలవల్ల వచ్చిందనడానికి

12. యంస్మా పృచ్ఛంతి కుహసేతి ఘోర, ముతేమాహుర్నైషో అస్తీత్యేనం
సో అర్యః పుష్టీ ర్విజ ఇవా మినాతి, శ్రదస్మై ధత్త సజనాస ఇంద్రః (2.12.5)
" ఆయన ఎక్కడ ఉన్నాడు? అని (కొందరు నాస్తికులు) అడుగులారు; ఆయన లేడు అని కూడా అంటారు; ఇంద్రుడు అటువంటివారి సంపదలు నాశనం చేస్తాడు; (అందువల్ల) ఆయనపై విశ్వాసం ఉంచండి; జనులారా! ఆయనే ఇంద్రుడు."

వీలులేదు. ముఖ్యంగా ఈ చెడు లక్షణం ఆయనకి సోమంపై ఉన్న అమితమైన ప్రీతికి సంబంధించినది. ఒకసందర్భం (8.78.5, 6) లో ఆయన అన్నీ వింటాడు, చూస్తాడు, మనుష్యుల అభిప్రాయాలు కూడా తెలుసుకొంటాడు అని చెప్పి, దాని తరవాత మంత్రంలో ఆయన కడుపు ఆశక్తినిచ్చే పానంతో నిండి ఉంది అని ఋషిచెప్పేరు. ఒకపూర్తి సూక్తం (10.119) లో ఇంద్రుడు సోమంతాగిన మత్తుతో తన గొప్పతనాన్నీ, ఇష్టంవచ్చినట్లు చెయ్యగల శక్తినీ పొగడుకుంటూ తనలోతానే మాట్లాడుకొన్నట్లు ఉంది. ఒకసారి ఆయన అధికసోమపానం వల్ల బాధలు పడినట్లు కూడా సూచించబడింది (అధ్యాయం 69). అధికసోమపాన ప్రీతి ఆయన తన తండ్రిని చంపడానికి కారణమైంది అని కూడా ఉంది (4.18.12). ఇంద్రుడు అధికంగా సోమం తాగడాన్ని నీతివిషయంగా పరిశీలించి నిర్ణయించేటప్పుడు వేదఋషుల దృష్టిలో సోమం వల్ల మత్తు పొందడం మతానికి సంబంధించినది అనీ, సోమానికున్న మత్తెక్కించేగుణం వల్లనే దాన్ని వారు అమర్త్యత్వాన్ని ఇచ్చేపానంగా భావించారనీ మనం గమనించాలి. సోమపాన ప్రభావం వల్లనే ఇంద్రుడు భూమ్యాకాశాలని విడదీసి నిలబెట్టడం (2.15.2) వంటిగొప్పపనులుచేశాడని ఊహించడం పైన చెప్పిన రెండో అంశానికి అనుగుణంగానే ఉంది. ఈ దేవుడిపై సోమపాన ప్రభావం విషయంలో వేదఋషులకు స్పష్టంగా ఆమోదం ఉండడం ఆ కాలపు నీతినియమాలను ప్రతిఫలిస్తుంది. కాని, ఇంద్రుడికి పరస్త్రీలోలత ఉన్నట్లు ఋగ్వేదంలో ఎక్కడా చెప్పబడలేదు; ఈయనగౌతముడి భార్య అయిన అహల్యకు జారుడు అని చెప్పినచోట తప్ప బ్రాహ్మణాలలో కూడా మరెక్కడా దీన్ని గురించిన సూచన లేదు. సోమ యాగానికి సంబంధించిన సాహిత్యం ఆయన సోమపాన ప్రియతని విశేషంగా వర్ణించడం సహజమే.

22.38 రోథ్, (Roth), ఆయన్ని అనుసరించి విట్నీ (Whitney), ప్రాచీనకాలపు దేవతలలో ఒకడైన వరుణికి ఉన్న ప్రాముఖ్యం ఋగ్వేదకాలంలో తగ్గి ఇంద్రుడు ప్రముఖుడయ్యాడని అభిప్రాయపడ్డారు. పదోమండలంలో వరుణుణ్ణే స్తుతించే పూర్తి సూక్తం ఒకటికూడా లేకపోవడమూ ఇంద్రుణ్ణే స్తుతించేవి నలభై ఐదు ఉండడమూ ఈ అభిప్రాయానికి ఒక ఆధారం. కాని ఆ మండలంలో వరుణుణ్ణే మరి ఇద్దరు ఆదిత్యులతో కలిపి స్తుతించిన సూక్తాలు రెండు (126, 185) ఉన్నాయి; ఇంకా అదే మండలంలోని చాలా విడి మంత్రాలలో ఇతరదేవతలతోపాటు వరుణుణ్ణే స్తుతించడమో ఆయన ప్రసక్తి ఉండడమో కనపడుతుంది. దానికి ముందు ఉన్న మండలాలలో వరుణుణ్ణే స్తుతించే

సూక్తాలకన్న ఇంద్రుణ్ణి స్తుతించే సూక్తాలే చాలా ఎక్కువగా ఉండడం వల్ల, సూక్తాల సంఖ్యపై ఆధారపడిన వాదం సమంజసం కాదు. మూడో మండలంలో వరుణుడికి ఉద్దేశించినసూక్తం ఒకటి కూడా లేకపోగా ఇంద్రుణ్ణి ఉద్దేశించినవి ఇరవైరెండు ఉన్నాయి; రెండో మండలంలో వరుణుడికి ఉద్దేశించినసూక్తం ఒకటి ఉండగా, ఇంద్రుడికి ఉద్దేశించినవి ఇరవై మూడు ఉన్నాయి. పైగా, ఈ రెండు మండలాల మొత్తం ప్రమాణం పదో మండలం ఒకదాని ప్రమాణం కన్న చాలా తక్కువే అవుతుంది. కాని, చివరి ( = పదో) మండలంలో వరుణుడి ప్రసక్తి దానిముందు మండలాలలో కన్న చాలా తక్కువే అనేది సత్యం. ఋగ్వేదాన్ని కూర్చినకాలంలో వరుణుడి ప్రాధాన్యం తగ్గి ఇంద్రుడి ప్రాధాన్యం హెచ్చింది అనడానికి ఇది తప్ప మరే ప్రత్యక్షమూ, నిర్ణాయకమూ అయిన ఆధారం ఉన్నట్లు కనపడదు. ఇంద్రుడికీ వరుణుడికీ మధ్య ఉన్న పోటీని సంభాషణ రూపంలో వర్ణించే ముందుభాగంలోని ఒక సూక్తం (4.42) ఈ ఇద్దరు దేవతల ప్రాధాన్యంలో కాలక్రమేణ మార్పు వచ్చిందనడానికి ముఖ్యాధారంగా భావించబడింది. కాని ఈ నిర్ణయం సరికాదని చివరి మండలంలోని ఒక సూక్తం (10.124) లో చెప్పబడినవిషయాలవల్ల తెలుస్తుంది. అయినా, ఇండో- ఇరానియన్ కాలంలో ఇంద్రుడికన్న వరుణుడికి ఎక్కువ ప్రాధాన్యం ఉండేదనీ, బ్రాహ్మణాలలోనూ (ఐ.బ్రా. 8.12) పురాణాలలోనూ ఇంద్రుడు స్వర్గలోకానికి అధిపతి అయ్యాడనీ మనం జ్ఞాపకం పెట్టుకోవాలి; పురాణాలలో బ్రహ్మ విష్ణు శివులు అనే త్రిమూర్తుల ప్రాధాన్యం ఎక్కువ అవడం వల్ల ఇంద్రుడు వారికి అధీనుడే అయినా ఆయనస్వర్గాధిపత్యం మాత్రం చెక్కుచెదరలేదు. అథర్వవేదకాలానికి వరుణుడి సర్వాధిపత్యం తగ్గిపోయింది (అధ్యాయం 12.12). అందువల్ల ఋగ్వేదకాలంలోనే ఇంద్రుడి ప్రాధాన్యం క్రమక్రమంగానైనా ఎక్కువ అయింది అనుకోవచ్చు. వేదాలలో ఇంద్రుడు ప్రాచీనుడైన ద్యౌస్ స్థానాన్ని ప్రాధాన్యంలో ఆక్రమించుకొన్నాడని బెన్ఫే (Benfey), బ్రెయల్ (Breal) అభిప్రాయపడ్డారు. ఇండో- ఇరానియన్ కాలానికిచెందిన త్రిత ఆప్త్యుడి విషయంలో ఇలా జరిగిందని చెప్పడానికి ఎక్కువ అవకాశం ఉంది. ఎందువల్లనంటే, త్రితుడి ప్రసక్తి ఋగ్వేదంలో చాలా అరుదుగానే ఉన్నా, ఉన్నచోట్ల ఇంద్రుడు చేసిన వీరకృత్యాలే త్రితుడు చేసినట్లు చెప్పబడింది; కొన్నిచోట్ల గాథలలో ఇంద్రుడికన్న త్రితుడు ముఖ్యుడుగా కనపడతాడు (అధ్యాయం 23).

22.39 అవెస్తాలో ఇంద్రుడి పేరు రెండుసార్లు మాత్రమే వచ్చింది. అందులో ఆయన దేవుడు కాదు రాక్షసుడు మాత్రమే అనే అంశం తప్ప ఆయన స్వభావాన్నిగురించి మరి

ఏ విషయమూ స్పష్టంగా లేదు. వేదాలలో ఇంద్రుడికి ప్రత్యేకమైన విశేషణంగా వాడబడిన వృత్రహన్- అనేపదానికిసంబంధించినవెరెథ్రఘ్న అనే పదం అవెస్తాలో కూడా ఉంది; కాని దీనికి ఇంద్రుడితోగాని ఉరుములతోకూడినవానకిసంబంధించినగాథతోగాని సంబంధం లేదు. ఇది విజయాన్నిచ్చే ఒక దేవుడి పేరు మాత్రమే. అందువల్ల, ఇండో- ఇరానియన్ కాలంలో వేదాలలోని వృత్రుణ్ణి చంపే ఇంద్రుడి స్వభావానికి కొంచెం ఇంచుమించుగా సరిపోయే స్వభావంగల దేవుణ్ణి గురించిన భావన ఉండేదనే చెప్పవచ్చు. ఇండో-యూరోపియన్ మూలభాషకాలంలో, ఆకాశంలో ఉరిమే దేవుడేకాక, పెద్ద ఆకారం కలవాడూ, ఎక్కువగా తిని తాగేవాడూ, తునెమెరుపు అనే ఆయుధంతో పాముని చంపేవాడూ అయిన ఉరుముకి సంబంధించిన మరొక దేవుడు కూడా ఉన్నట్లు భావన ఉండేదని చెప్పబడడానికి అవకాశం ఉంది. ఇంద్రపదం వ్యుత్పత్తి స్పష్టంగా తెలియదు; కాని దీనిలోని ధాతువు ఇందు- 'చుక్క' అనే పదంలోని ధాతువుతో సంబంధించినది అని చెప్పడానికి అవకాశం ఉంది.[13]

## 23. త్రితుడు ( ఆప్త్యుడు)

23.1 ఆప్త్యుడు ( ఆప్త్య- ) అనే విశేషణం కల త్రితుడు ( త్రిత- ) ఋగ్వేదంలో ఏపూర్తి సూక్తంలోనూ స్తుతించబడలేదు కాని ఇరవైతొమ్మిది సూక్తాలలో నలభైవిడివిడి మంత్రాలలో ప్రసంగవశాత్తూ ఆయన పేరు వచ్చింది. ఆప్త్య- అనే పదం త్రితుడుకి విశేషణంగానో లేక దానికి పర్యాయంగానో ఏడుసార్లు నాలుగు సూక్తాలలో వచ్చింది ( 1.105; 5.41; 8.47; 10.8 ). ఈయన ఇంద్రుడితో కలిసి పనిచేసినట్లు చెప్పడం చాలా తరచు; ఈయన అగ్నితో

13. ఇంద్రశబ్దానికి యాస్కుడు నిరుక్తం ( 10.8 ) లో చాలా వ్యుత్పత్తులు ఇచ్చారు. వాటిని సాయణుడు ఋగ్వేదం 1.3.4 మంత్రం కింద వ్యాఖ్యానించారు. అది 1. ఇరాం దృణాతి ''అన్నం ( కోసం మేఘాన్ని) చీలుస్తాడు'', 2. ఇరాం దదాతి ''అన్నాన్ని ఇస్తాడు'', 3. ఇరాం దధాతి ( ''అన్నాన్ని ( = పంటని) పుష్టిచేస్తాడు'', 4. ఇరాం దారయతి ''అన్నం (కోసం భూమిని) చీలుస్తాడు'', 5. ఇరాం ధారయతి ''అన్నాన్ని స్థాపిస్తాడు'', 6. ఇందవే ద్రవతి ''సోమరసం ( ఇందు- ) కోసం పరిగెత్తుతాడు'', 7. ఇందౌ రమతే ''సోమరసంలో ఆనందిస్తాడు'', 8. ఇంధే భూతాని ''ప్రాణిదేహాలను జీవచైతన్యరూపంతో ప్రకాశించేటట్టు చేస్తాడు'' 9. ఇదం కరణాదిత్యాగ్రాయణః ''దీన్ని ( = ఈ జగత్తుని, ఇదం), చేయడం వల్ల ( కరణాత్)'' అని ఆగ్రాయణుడు అనే ముని'' ( ఇది యాస్కుడే చెప్పిన మాట). 10 ఇదం దర్శనా దిత్యౌపమన్యవః ''దీన్ని ( = కనపడని పరమాత్మని) చూడడం వల్ల'' అని ఔపమన్యవుడు, 11. ఇంద్- ''పరమైశ్వర్యం కలిగి ఉండడం'' అనే ధాతువు నించి వచ్చింది, 12. ఇందన్- ''శత్రువులని చీల్చేవాడు'' (దృ- ధాతువు) / ''పరిగెత్తించేవాడు'' (ద్రు- ధాతువు) ''యజ్ఞంచేసేవారిని ఆదరించేవాడు'' ( ఆ-దృ- ధాతువు). ( దారయితా ద్రావయితా/ ఆదరయితా)

కలిసి పనిచేసినట్లు చెప్పడమో లేక వీరిద్దరూ ఒకరే అని చెప్పడమో ఏడుచోట్ల ఉంది; ఈయన్ని మరుత్తులతో కలిపి చెప్పడం కొన్నిచోట్ల ఉంది; ఈయన్ని సోమంతో లేక సోముడు అనే దేవతతో కలిపి చెప్పినచోట్లు పది ఉన్నాయి. సోమపానశక్తితో త్రితుడే వృత్రుణ్ణి చీల్చినట్లు 1.187.1లో చెప్పబడింది.

23.2 మరుత్తులు త్రితుడికీ ఇంద్రుడికీ వృత్రజయంలో సహాయం చేశారు (8.7.24). త్రితుడి వైరివిజయం ఉపమానంగా చెప్పబడడం వల్ల అది ఆయన ప్రత్యేకతగా భావించబడి ఉండవచ్చు. ఇంద్రుడు నీటిని ఆపిన వృత్రుడితో యుద్ధంచేసి వాణ్ణి త్రితుడు వలుడు పెట్టిన అడ్డులని చీల్చినట్లు చీల్చాడు (భినద్వలస్య పరధీ రివత్రితః, 1.52.5). ఇటువంటిది మరొకటి - ఇంద్రాగ్నులు సహాయం చేసిన మనుష్యుడు త్రితుడిలాగే దృఢమైన స్థానాలని భేదిస్తాడు (5.86.1). ఆప్త్యుడైన త్రితుడు తనతండ్రి ఆయుధాలని తెలుసుకొని ఇంద్రప్రేరితుడై త్వష్టమూడుతలలుగల కొడుకుని చంపిగోవులని విడిపించాడు (10.8.8). దీని తరవాత మంత్రంలో ఇదే పని ఇంద్రుడు చేసినట్లు చెప్పబడింది; ఇంద్రుడు త్వష్ట కొడుకైన విశ్వరూపుడి మూడుతలలూ పగలగొట్టిగోవలుని తీసుకొన్నాడు (10.8.9). ఇంద్రుడు (లేక బహుశా అగ్ని) పెద్దగా అరిచే మూడుతలల ఆరుకన్నుల రాక్షసుణ్ణి చంపాలనుకొన్నాడు; ఆయన బలం వల్ల వృద్ధి పొందిన త్రితుడు ఆ వరాహాన్ని (అంటే, రాక్షసుడిని, చూ. 1.121.11) ఇనపమొనగల ఆయుధంతో చంపేడు (10.99.6) ఇక్కడకూడా ఈ ఇద్దరు దేవతలూ చేసిన కృత్యం సమానంగా ఉంది. ఇంద్రుడు త్రితుడికోసం పాము దగ్గరనించి తెచ్చిగోవులు ఇచ్చాడు (10.48.2).[1] ఇంద్రుడు త్వష్ట కొడుకైనవిశ్వరూపుణ్ణి త్రితుడికి వశం చేశాడు (2.11.19). త్రితుడు ఇచ్చిన సోమంతో బలం పొందిన ఇంద్రుడు అర్బుదుణ్ణి చంపేడు; అంగిరసులతో కలిసి వలుణ్ణి చంపేడు (2.11.20). బలవంతులైన మరుత్తులు బయల్దేరి విద్యుత్తుతో (= మెరుపులతో) కలుస్తారు; త్రితుడు శబ్దం చేస్తాడు; నీళ్లు శబ్దం చేస్తాయి (5.54.2). మరుత్తులకు

---

1. ఈమంత్రం ఇంద్రుడే తనలో తాను మాట్లాడుకొన్నట్లు ఉంది: త్రితాయగా అజనయ మహేరధి "త్రితుడికోసం పాముదగ్గర గోవులని పుట్టించాను" అని దీని ప్రతిపదార్థం. దీనికి సాయణుడు గాః "నీళ్లు", అహేరధి "మేఘంపైన" అని అర్థం చెప్పి నూతిలోపడిన త్రితుడు పైకి తియ్యమని ఇంద్రుణ్ణి ప్రార్థించగా ఇంద్రుడు మేఘంలో నీళ్లు పుట్టించాడు అని వివరించారు. త్రితుడు చేసిన ప్రార్థన 1.105.8లో ఉన్నట్లు కూడా ఆయన చెప్పేరు. (సం మా తపన్త్యభితః....తో మొదలయ్యే మంత్రాలు రెండు ఉన్నాయి: 1.105.8, 10.33.2; వీటిలో సాయణుడు ఇక్కడ ఉద్దేశించినది మొదటిదే; సంపాదకులు పొరపాటుగా రెండోదాని సంఖ్య ఇచ్చారు.)

సంబంధించిన ఒక సూక్తం (2.34) లోని విషయస్పష్టతలేని రెండు మంత్రాలలో త్రితుడు వచ్చినప్పుడు మరుత్తుల మార్గం ప్రకాశిస్తుందనీ (10), త్రితుడు మరుత్తులని తన రథంమీద తీసుకు వెళ్తాడనీ (14), చెప్పినట్లు కనపబడుతుంది. ఒక అగ్నిసూక్తంలో వాయువులు త్రితుణ్ణి కనిపెట్టి ఆయన్ని తమకు సహాయం చెయ్యమని ఆజ్ఞాపించినట్లు ఉంది (10.115.4). కమ్మరివాడు కొలిమిలోకి గాలి ఊదినట్లు ఆకాశంలోని త్రితుడు గాలి ఊదినపుడు (యదీ మహ త్రితో దివ్యుప ధ్మాతేవ ధమతి), అగ్నిజ్వాలలు అంతటా వ్యాపిస్తాయి (5.9.5). త్రితుడు అగ్నికోసం వెతికి ఆవుతలమీద ఉన్న ఆయన్ని చూశాడు; ఆయన ఇళ్ళలో పుట్టి యువకుడై కాంతికి కేంద్రమై ఇళ్ళలో స్థావరం ఏర్పరచుకొంటాడు (10.46.3); ★ ఇక్కడ ''ఆవుతలమీద''కి బదులు ''భూమి తలమీద'' అని సాయణుడు). (జ్వాలలు) చుట్టుముట్టిన త్రితుడు తనస్థానంలో ఉంటాడు (10.46.6). త్రితుడు ఆకాశంలో ఉంటాడు (5.9.5). ఆయనస్థావరం రహస్యమైనది (9.102.2); ఆదిత్యులూ ఉషస్సూ చెడ్డపనులనీ చెడ్డకలలనీ త్రితుడి దగ్గరకు చేర్చమని ప్రార్థించబడడం వల్ల (8.47.13-17) అది చాలా దూరంలో ఉందని తెలుస్తుంది. అది సూర్యుడి ప్రాంతంలో ఉందనుకోవడానికి ఈ మంత్రంలో కవివాక్కు ఆధారం: ''ఆ ఏడు రశ్ములూ ఎక్కడ ఉన్నాయో అక్కడకి నా పుట్టుక వ్యాపిస్తుంది; త్రితుడికి అది తెలుసు; ఆయన బంధుత్వం కోసం మాట్లాడతాడు'' (1.105.9); ఈ చివరి వాక్యం అర్థం ''త్రితుడు దానితో తనకు సంబంధం ఉన్నట్లు చెప్పుకొంటాడు'' అని కావచ్చు. ఇదే సూక్తం (1.105) 17వ మంత్రంలో త్రితుడు నూతిలో చిక్కుకుపోయి దేవతలని రక్షించమని ప్రార్థించడానీ (త్రితః కూపేఽవహితో దేవాన్ హవత ఊతయే), ఆయన ప్రార్థన బృహస్పతి విని కాపాడేడనీ ఉంది. మరొకమంత్రం (10.8.7) లో గోతిలోని త్రితుడు తండ్రిని ప్రార్థించి తండ్రి ఆయుధాలు అడిగేడని ఉంది; దీని తరవాత మంత్రం (10.8.8) లో త్రితుడు తండ్రి ఆయుధాలు పొంది త్వష్ట కొడుకైన విశ్వరూపుడి (= త్రిశీర్షుడి) తో యుద్ధం చేశాడని ఉంది. ఇంద్రుడు సోమాన్ని విష్ణువుతోనూ, త్రితుడితోనూ, మరుత్తులతోనూ కలిసి తాగుతాడనీ (8.12.16), త్రితుడితో కలిసి స్తుతులు (★లేక త్రితుడిస్తుతి) విని ఆనందిస్తాడనీ (వాలఖిల్యం 4.1 (= 8.52.1)) ఉంది. తొమ్మిదో మండలానికి ఉన్న ప్రత్యేకత వల్ల (★అంటే ఈ మండలం అంతా సోముణ్ణే ఉద్దేశించినది అవడం వల్ల), అందులో త్రితుడు సోమం తయారుచెయ్యడంలో ప్రత్యేకనైపుణ్యం ఉన్నవాడుగా కనిపిస్తాడు;

ఋగ్వేదం ఇతర మండలాలలో ఈ విషయం ఒక్కచోట మాత్రమే చెప్పబడింది (2.11.20). సోమాన్ని త్రితుడు శుద్ధి చేస్తాడు (9.34.4). ఇంద్రుడు తాగడానికి త్రితుడి స్త్రీలు (= వేళ్లు, త్రితస్య యోషణః) రాళ్లలో రసాన్ని ప్రేరిస్తారు (9.32.2; 9.38.2). త్రితుడు పిండడానికి ఉపయోగించే రాళ్ల దగ్గర రహస్యస్థానంలో సోమం ఉంటుంది (9.102.2); త్రితుడి పృష్ఠాల దగ్గరకు ధారగా ధనం తెమ్మని సోమం ప్రార్థించబడింది (9.102.3). త్రితుడి ఎత్తైన ప్రదేశం (సానవి) లో సూర్యుడు తన చెల్లెళ్లతో (జామిభిః) ప్రకాశించేటట్లు సోమం చేసింది (9.37.4). కొండమీద ఉండే ఎద్దువంటి సోమంతీగెలను దున్నపోతుని శుభ్రంచేసినట్లు ఎత్తైన ప్రదేశం మీద పిండుతారు; అరిచే ఆ సోమాన్ని మంత్రాలు స్తుతిస్తాయి; త్రితుడు సముద్రంలో వరుణుడు (వంటి ఆ సోమాన్ని) ఇష్టపడతాడు (9.95.4). సోముడు త్రితుడిపేరు పుట్టిస్తూ మధువు కారుస్తాడు (9.86.20).

23.3 త్రితుడి అసలు స్వభావం గురించి అత్యల్పంగా చెప్పేవీ, అసలు ఏమీ చెప్పనివీ కొన్ని మంత్రాలు ఉన్నాయి. త్రితుడిపేరు మాత్రమే జాబితాలో ఉండి మరే విషయమూ లేని మంత్రాలు కొన్ని ఉన్నాయి (2.31.6; 5.41.4; 10.64.3). గ్రంథం దోషభూయిష్ఠంగా ఉన్నట్లు కనపడుతున్న మరి రెండు మంత్రాల (5.41.9, 10) అర్థం అస్పష్టం. ఒక వరుణ సూక్తం మధ్యలోని ఒక మంత్రం (8.41.6) లో త్రితుడిలో జ్ఞానం చక్రం మధ్యలో కల్లులా ఇమిడి ఉందని చెప్పబడింది (చక్రేనాభిరివ). ఒక సందర్భంలో వసువులు సూర్యుణ్ణించి ఒక గుర్రాన్ని సంపాదించారనీ, దాన్ని యముడు ఇవ్వగా, త్రితుడు రథానికి కట్టేడనీ, ఇంద్రుడు దాన్ని మొదటిసారిగా ఎక్కేడనీ ఉంది (1.163.2); దీని తరవాత మంత్రంలో ఈ గుర్రమే యముడూ, ఆదిత్యుడూ, సోముడూ, రహస్యమైన వ్రతంవల్ల (గుహ్యేన వ్రతేన) త్రితుడూ అని చెప్పబడింది. అథర్వవేదంలో త్రితుడి ప్రసక్తి ఉన్న ఆరు మంత్రాలలోనూ కొత్తగా చేర్చబడిన విషయమేమీ లేదు. ఈయన పాపాన్నీ కలలనీ తన దగ్గరకు చేర్చుకొనే దూర ప్రదేశంలో దేవుడు అనే భావాన్ని మాత్రమే అవి సూచిస్తాయి (1.113.1, 3; 19.56.4). తై.సం. (1.8.10.2) ఈయన దీర్ఘాయుస్సు ఇచ్చేవాడు అని చెప్తుంది. అమర్త్యత్వాన్ని ఇచ్చే పానమైన సోమాన్ని తయారుచేసేవాడుగా భావించబడిన త్రితుడికి ద్వితీయ శ్రేణి లక్షణంగా ఇది సంక్రమించింది అనడంలో సందేహం లేదు. బ్రాహ్మణాలు ఏకతుడూ, ద్వితుడూ, త్రితుడూ- ఈ ముగ్గురు దేవతలూ అగ్ని

కొడుకులు; నీటినించి పుట్టినవారు అని చెప్తాయి (శ.బ్రా. 1.2.3.1, 2; తై.బ్రా. 3.2.8.10, 11). సాయణుడు 1.105 సూక్తం ఉపోద్ఘాతంలో శాట్యాయనులు చెప్పిన కథ ఉద్ధరించారు: ''పూర్వకాలంలో ఏకతుడు, ద్వితుడు, త్రితుడు అనే ముగ్గురు ఋషులు ఉండేవారు; వారు ఒకప్పుడు ఎడారిలో తిరుగుతూ నీళ్ల దొరకక బాధపడుతూ చివరికి ఒక నుయ్యి చూశారు; త్రితుడు నూతిలో దిగి నీళ్ల తాగి మిగిలిన ఇద్దరికీ కూడా నీళ్ల ఇచ్చాడు; ఆ ఇద్దరూ నీళ్లతాగి త్రితుణ్ణి నూతిలోకి తోసేసి నూతిని రథచక్రంతో మూసేసి ఆయన ధనం అపహరించుకొని పోయారు; అప్పుడు త్రితుడు తనని బయటకి తీసి కాపాడమని దేవతలని స్తుతిస్తూ ఈ సూక్తాన్ని దర్శించాడు.'' ఈ మూడు పేర్లకీ అంకెలతో సంబంధం ఉందనేది స్పష్టం. ద్వితుడిపేరు ఋగ్వేదంలోనే రెండుచోట్ల వచ్చింది: ఒకచోట (8.47.16) అది త్రితుడి పేరుతోపాటు వచ్చింది; ఒక అగ్నిసూక్తం (5.18.2) లో ద్వితుడిపేరు మాత్రమే వచ్చింది కాని అందులో ద్వితుడూ అగ్నీ ఒక్కరేఅని భావించినట్లు కనపడుతుంది. నిరుక్తంలోని నిఘంటువులోని దేవతల జాబితాలో త్రితుడిపేరు లేదు. యాస్కుడు (నిరుక్తం 4.6) త్రితుడు అంటే తీర్ణతమః ''అజ్ఞానాన్ని దాటినవాడు'' (తౄ- 'తరించు' అనే ధాతువులో నించి వచ్చింది) లేక ఇది అంకెపేరు (ముగ్గురిలో మిగిలిన ఇద్దరి పేరు, ఏకత-, ద్విత- కూడా ఇటువంటివే) అని రెండు వ్యుత్పత్తులు ఇచ్చారు; మరొకచోట (నిరుక్తం 9.25) ''మూడు స్థానాల (ఆకాశం, భూమి, అంతరిక్షం) లో ఉండే ఇంద్రుడు'' త్రితుడు అని వివరించారు.

23.4 ఋగ్వేదంలోని సాక్ష్యాధారాలు పరిశీలిస్తూ, మూడు నాలుగు మంత్రాలలో రాక్షసుల్ణి చంపడమనే సమానమైన కృత్యం ఇంద్రుడూ త్రితుడూ చేసినట్లు కనపడుతుంది. ఒకదాంట్లో ఇంద్రుడు త్రితుణ్ణి ప్రేరించాడు; మరొకదాంట్లో త్రితుడు ఇంద్రుడికి ఉత్సాహం ఇచ్చాడు; మరి రెండుచోట్ల త్రితుడికోసం ఇంద్రుడు ఈపని చేసినట్లు ఉంది. పైగా, తుఫానులో త్రితుడు మరుత్తులతో కలుస్తాడు. ఇంకా, ఆయన అగ్ని ఉన్నచోట్ల కనుక్కొంటాడు; స్వర్గంలో అగ్నిని పుట్టిస్తాడు; అగ్నిరూపంలో మనుష్యుల గృహాలలో స్థానం ఏర్పరచుకొంటాడు. ఆయనస్థానం దూరప్రదేశంలో రహస్యమైనచోటు; అక్కడ సోమం ఉంది. తొమ్మిదో మండలంలో సోమాన్ని తయారుచేసేవాడైన త్రితుడికీ సోమాన్ని తాగేవాడు మాత్రమే అయిన ఇంద్రుడికీ మధ్య భేదం ఎక్కువగా చెప్పబడింది. త్రితుడికి తుల్యంగా అవెస్తాలో థ్రిత- ఉన్నాడు; అందులో ఆయన మనుష్యుడు

(భారతదేశంలోని ఇతిహాసాలలో కూడా త్రితుడు మనుష్యుడు) గానే పరిగణించబడ్డాడు). ఒకచోట (యస్న 9.10) ఆయన ప్రకృతి ప్రపంచం కోసం హ ఓమ (= సోమం) తయారుచేసిన వారిలో మూడవవాడని చెప్పబడ్డాడు (రెండోవాడు ఆథ్వ్య = ఆప్త్య-); మరొకచోట (వెంద్ 20.2) ఆయన అమర్త్యత్వాన్ని ఇచ్చే హ ఓమ అనే తెల్లనిచెట్టు చుట్టూ పెరిగే పదివేల ఓషధులని అహురమజ్ద వల్ల పొందిన మొదటి వైద్యుడని చెప్పబడ్డాడు. రెండు సందర్భాలలో (యష్త్ 5.72; 13.113) థ్రితశాయుజ్‌థ్రి కొడుకని చెప్పబడింది; వీటిలో ఒక్కచోట ఆయన అపాం నపాత్ అనే భూమిమీద ఒక స్థానంలో ఉండేవాడని కూడా చెప్పబడింది. దీనివల్ల త్రితుడికీ సోమానికీ ఇండో-ఇరానియన్‌కాలంనించే సంబంధం ఉందని స్పష్టమవుతుంది. మూడుతలల ఆరుకన్నుల రాక్షసుణ్ణి/ పాముని చంపడం అనే త్రితుడి మరొకకృత్యం అవెస్తాలో (త్రితుడికి సంబంధం ఉందని చెప్పదగిన) థ్రఏత ఓన అనే వ్యక్తి చేసినట్లు చెప్పబడింది; ఈయన అజి దహాక అనే మూడుతలలు ఆరుకన్నుల రాక్షసిపాముని చంపేడు. థ్రఏత ఓన దహాకని చంపడానికి వెళ్లేటప్పుడు ఆయనతోపాటు ఇద్దరు సోదరులు వెళ్లారనీ వాళ్లు ఆయన్ని తోవలో చంపడానికి ప్రయత్నం చేశారనీ ఉండడం గమనించదగినది. త్రిత- అనేపదం ధ్వన్యనుసారంగా గ్రీక్ త్రితోస్ 'మూడోవాడు' అనే పదానికి సమానం. దీనికి 'మూడోవాడు' అనే అర్థం ఉందని భావించబడింది అనడానికి ఋగ్వేదంలో దీనితోపాటు ద్విత- శబ్దం ఉండడమూ, బ్రాహ్మణాలలో ఈ రెండింటికీ సన్నిహితంగా ఏకత- శబ్దం సృష్టించబడడమూ ఆధారాలు. త్రితశబ్దంతో త్రీణి 'మూడు (నపుం.)' అనే పదం కొన్నిచోట్ల (ఋగ్వేదం 9.102.3; అ.వే. 5.1.1) కలిసి రావడం కూడా పై అభిప్రాయాన్నే సూచిస్తుంది. చివరగా, ఋగ్వేదంలో ఒక మంత్రం (6.44.23) లో బహువచనంలో ఉన్న త్రితశబ్దానికి 'మూడో' అని అర్థం అని చెప్పడానికి చాలా అవకాశం ఉంది (★రోచనేషు త్రితేషు ''ప్రకాశించే మూడోవాటిలో'').

23.5 త్రితుడికి సర్వసాధారణంగా వాడబడిన ఆప్త్య- అనే విశేషణం అప్- 'నీరు' అనే ప్రాతిపదికనించి వచ్చిందని చెప్పవచ్చు; అందువల్ల అర్థంలో ఇది అపాం నపాత్ అనే దానితో ఇంచుమించు సమానం. సాయణుడు (8.47.15 వ్యాఖ్య) దీనికి ''నీళ్లకి (అపాం) కొడుకు (పుత్ర-)'' అని అర్థం ఇచ్చారు. త్రితుడికి ఉన్న మరొక విశేషణం వైభూవస- అనేది; ఇది ఒకచోటనే (10.46.3) వచ్చింది. ఇది అపత్య ప్రత్యయాంతమైన తద్ధితరూపం వంటిది; ఇది సోమానికి సంబంధించింది అని చెప్పవచ్చు (★సాయణుడు దీనికి విభూవసః

పుత్రః 'విభూవస్- కొడుకు' అనే అర్థం ఇచ్చారు).

23.6 త్రితుడు మొదట్లో మెరుపుకి సంబంధించిన దేవత అనీ, అగ్నికి మూడో లేక అంతరిక్షసంబంధిరూపం అనీ, అగ్ని, వాయువు/ ఇంద్రుడు, సూర్యుడు అనే త్రితయంలో మధ్యవాడుగా మొదట్లో ఉండేవాడనీ నిర్ణయించడానికి పై సాక్ష్యాధారాలు సరిపోతాయని అనుకోవచ్చు. సహజమైన ప్రాధాన్యనిర్ణయ పద్ధతివల్ల, స్వభావంలో తనతో ఇంచుమించు తుల్యుడైన ఈ దేవత స్థానాన్ని ఇంద్రుడు ఆక్రమించుకొన్నట్లు కనపడుతుంది; దీని ఫలితంగా ఋగ్వేదంలోనే త్రితుడు అప్రధానుడైపోయాడు. ఈ వివరణ సరియైనది అయితే, త్రితుడికి సోమం మొదట్లో ఉన్న సంబంధం మెరుపు స్వర్గాన్నించి సోమాన్ని తీసుకురావడాన్ని (సోమం - గద్దకథలోలాగా, అధ్యాయం 37) సూచిస్తుంది. సాక్ష్యాధారం తక్కువగా ఉండడం భిన్నాభిప్రాయానికి దారితీసింది. వీటిలో కొన్నిమాత్రం ఇక్కడ ప్రస్తావిస్తే చాలు. రోథ్(Roth) త్రితుడు నీటికీ వాయువుకీ సంబంధించిన దేవత అన్నారు. హిలెబ్రాంట్ (Hillebrandt) ఆయన ప్రకాశించే ఆకాశానికి అధిదేవత అన్నారు. పెరీ (perry) ఆయన తుపాను దేవత అనీ ఇంద్రుడికన్న ప్రాచీనుడనీ అభిప్రాయ పడ్డారు. త్రితుడు ''సముద్రానికీ నీళ్లకీ అధిదేవత'' అని తన పూర్వరచనలో చెప్పిన పిషెల్ (Pischel) ఇటీవల రచనలో త్రితుడు మొదట్లో మనుష్యుడైన వైద్యుడనీ, ఆయన తరవాతకాలంలో దేవుడుగా భావించబడ్డాడనీ అభిప్రాయం వ్యక్తం చేశారు. హార్డీ (Hardy) అభిప్రాయంలో త్రితుడు చంద్రుడికి సంబంధించిన దేవత.

## 24. అపాం నపాత్

24.1 అపాం నపాత్ అనే దేవత ఒక పూర్తి సూక్తం (2.35) లోనూ జలాలని ఉద్దేశించిన మరొక సూక్తం (10.30) లోని రెండు మంత్రాలలోనూ (3. 4) స్తుతించబడ్డాడు; ఋగ్వేదంలో ఈ పేరు సుమారు ముప్పైసార్లు వచ్చింది.[1] ''ప్రకాశించే అపాం నపాత్

---

1. అపాంనపాత్‌కి ప్రతిపదార్థం ''నీటికి (అపాం), మనుమడు (నపాత్)'' అని సాయణుడు (2.35.1 వ్యాఖ్య) దీనికి వివరణగా ఆయన ''నీటినించి ఓషధులూ ''మందుకు పనికివచ్చే మొక్కలు'', వనస్పతులూ ''చెట్లు లేః పువ్వులు పుయ్యకుండా కాయలు కాసే పనసవంటి చెట్లు'' పుడలాయి; వాటినించి అగ్నిరూపమైన ఈయః పుడలాడు కాబట్టి ఈయన నీటికి పౌత్రుడు'' అని చెప్పారు. మేక్డొనెల్ ఈ పదాన్ని Son of Waters ''నీటికొడుకు'' అని అనువదించారు. (పైన మంత్రసంఖ్య మాత్రమే ఇచ్చినవన్నీ 2.35 లోవి). సాయణుడు కూడా కొన్నిచోట్ల నపాత్/నప్తృ- శబ్దాలకి పుత్రుడని అర్థం ఇచ్చారు (2.35.13; 6.13.3).

చుట్టూ నీళ్లు ఉన్నాయి (2.35.3); యువతులైన నీళ్లు యువకుడైన ఆయనచుట్టూ ప్రవహిస్తాయి (4); ముగ్గురు దేవులు ఆ దేవుడికి అన్నం పెట్టాలని కోరుకొంటాయి (తిస్రః .... దేవీర్ధి ధిషంత్యన్నం); ఆయన మొదటపుట్టిన ఆ దేవుల అమృతాన్ని తాగుతాడు'' (5). ''ఎద్దు (వృషా) అయిన ఆయన నీటిలో గర్భం పుట్టించాడు; ఆయనే శిశువై (ఆ నీటిని) తాగుతాడు; ఆనీళ్లు ఆయన్ని ముద్దాడతాయి'' (స ఈం వృషా జనయత్తాసు గర్భం; స ఈం శిశుర్ధయతి తం రిహంతి, 13). '' ఆయన నీటిలో బలంపొందుతూ ప్రకాశిస్తాడు'' (7). '' ఆయన నీటిలో కట్టెలు లేకుండానే (అనిధ్మః) ప్రకాశిస్తాడు (4; 0.30.4). ''మెరుపుని ధరించిన (విద్యుతం వసానః) అపాం నపాత్ కిందకు వచ్చే నీటి డిలోకి ఎక్కాడు; బంగారురంగు గల నీళ్లు ఆయనచుట్టూ ప్రవహిస్తాయి'' (9; చూ. .95.4, 5లో అగ్ని విషయంలో చెప్పినది). ''అపాం నపాత్ రూపం బంగారం (హిరణ్యరూపః), అవయవాలూ, రంగూ బంగారం; ఆయన బంగారుమయమైనగర్భం (= స్థానం) లో కూర్చొని పూజించేవాడికి అన్నం ఇస్తాడు'' (10) ''పరమపదంలో కూర్చొని ఆయనఎప్పుడూ నాశంలేని (తేజస్సులతో) ప్రకాశిస్తూ ఉంటాడు; ప్రవహించే నీళ్లు తమ కొడుకుకి (/ మనమడికి, నప్త్రే) నెయ్యి అనే అన్నాన్ని తీసుకువెళ్తూ ఆయన చుట్టూ తమ దుస్తులతో తిరుగుతాయి'' (14). ''యువతులు వెలిగించే బంగారురంగు గల ఆయన ముఖం (/ శరీరం, అనీకం) రహస్యస్థానంలో వర్ధిల్లుతుంది; ఆయన అన్నం ఘృతం'' (11). ''ఆయన ఇంట్లోనే బాగా పాలు ఇచ్చే ఆవు ఉంది'' (స్వ ఆ దమే సుదుఘాయస్య ధేనుః, 7) ''ఆయన్ని మనోవేగం గల గుర్రాలు (వృషణః) తీసుకువెళ్తాయి'' (1.186.5). అపాం నపాత్తుకీ నదులకీ సంబంధం ఉంది (నానద్యః ''నదులకి సంబంధించినవాడు'', 1) ''అపాం నపాత్ అందరినీ పుట్టించాడు'' (2); '' ఇతరులందరూ ఈయనకి (చెట్టుకి) కొమ్మలవంటి వారే'' (8). అపాం నపాత్ సూక్తంలోని చివరి మంత్రంలో ఈయన 'అగ్నే' అని సంబోధించబడ్డాడు కాబట్టి ఈయనా అగ్నీ ఒకరే అనుకోవాలి. దీనికి ప్రతిగా కొన్ని అగ్ని సూక్తాలలో అగ్ని అపాం నపాత్ అని వ్యవహరించబడ్డాడు (3.9.1; చూ.వా.సం. 8.24). నీటికి కొడుకూ (అపం నపాత్), ప్రియుడైన హోత అయిన అగ్నీ భూమిమీద కూర్చొని ఉన్నాడు (1.143.1). కాని కొన్నిచోట్ల వారి ఇద్దరికీ భేదం చెప్పబడింది. అగ్ని నీటికి కొడుకుతో కలిసి (సజోషా నప్త్రాపాం) వృత్ర విజయానికి ప్రేరిస్తాడు (6.13.3). (వృష్టితో పాటు భూమికి వచ్చి) అపాం నపాత్ వేరొక శరీరంతో (ఉన్నట్లుగా) ఇక్కడ వ్యాప్తి

చెందేడు (అన్యస్యేవ్యేహతన్వా వివేష, 2.35.13). ఆశుహేమన్- 'వేగంగా వెళ్లేవాడు' అనే విశేషణం వచ్చిన నాలుగు చోటుల్లో అది అపాం నపాత్‌కి మూడు చోట్లా అగ్నికి ఒకచోటా వర్తిస్తుంది.

24.2 దేవతలపేర్లు ఇవ్వబడిన కొన్నిచోటుల్లో అపాం నపాత్ పేరు ముఖ్యంగా అజ ఏకపాత్‌తోనూ (2.31.6; 7.35.13), అహి బుధ్న్యతోనూ (1.186.5; 2.31.6; 7.35.13), సవితతోనూ (2.31.6; 6.50.13) వచ్చింది. అధమపక్షం ఒకచోట (అధ్యాయం 15.4) ఇది సవితకే విశేషణంగా వాడబడింది; సంతానోత్పాదకుడుగా సవిత అగ్నికి రూపాంతరం కావడం దీనికి కారణం కావచ్చు.

24.3 బంగారురంగు కలవాడూ, మెరుపుని వస్త్రంగా ధరించినవాడూ, పరమపదంలో నివసించేవాడూ, రహస్యస్థానంలో వృద్ధిపొందేవాడూ, ప్రకాశించేవాడూ, నీటికికొడుకూ, భూమికి దిగివచ్చేవాడూ, అగ్నితో అభిన్నుడని చెప్పబడినవాడూ అయిన అపాం నపాత్ మేఘంలో దాగి ఉండే అగ్నికి రూపాంతరమైన మెరుపుకి ప్రతీకఅయినట్లు కనపడుతుంది. అగ్ని అపాం నపాత్ అని ప్రత్యక్షంగా చెప్పబడడమే కాక ఆయన నీళ్లకి గర్భః అని చెప్పబడడం కూడా ఈ అభిప్రాయానికి బలం ఇస్తుంది (7.9.3; 1.70.3). ఆయన మనుష్యుల గృహాలలో నివసిస్తాడు (3.5.3), ఆయన స్థానం నీళ్లలో ఉంది (8.43.9), మొక్కలకీ నీటికీగర్భమైన అగ్నిని రెండు అరణులు ( = యజ్ఞంలో నిప్పుపుట్టించేకర్రలు) పుట్టిస్తాయి (3.1.13). అగ్నికొండకికొడుకు (అద్రేఃసూను-) అని కూడాచెప్పబడ్డాడు (10.20.7; చూ. 6.48.5); ఇది మేఘం అనే పర్వతం మీద పుట్టే మెరుపునే తప్ప మరి దేన్నీ సూచించదు. అగ్నికిస్వర్గంలోనూ భూమిమీదా ఉన్న రూపాలకి భిన్నమైన మూడోరూపం నీళ్లలో, సముద్రంలో, స్వర్గం పాదుగులో, నీళ్ల ఒడిలో పుడుతుందని వర్ణించబడింది (10.45.1-3). నిజానికి, స్వర్గంలోని అగ్ని నివాసస్థానం నీళ్లలో ఉంది అనేది వైదికేతిహాస సంచయంలో బాగా ధ్రువపడిన అంశాలలో ఒకటి. త్రితుడికి విశేషణమైన ఆప్త్య శబ్దానికి కూడా ఇటువంటి అర్థమే చెప్పవచ్చు (అధ్యాయం 23.5).

24 4 అపాం నపాత్ భారతదేశపు ఇతిహాస సంచయంలో పుట్టినవాడు కాదు; ఆయన ఇండో- ఇరానియన్ మూలకాలానికి చెందినవాడు. అవెస్తాలో అపాం నపాత్ నీటికి చెందిన అదృశ్యశక్తి. ఆయన లోతు నీళ్లలో నివసిస్తాడు; ఆయన చుట్టూ స్త్రీలు ఉంటారు; ఆ

స్త్రీంతో కలిపే ఆయన తరచుగా ప్రార్థించబడ్డాడు. ఆయన వేగంగల గుర్రాల మీద ప్రయాణిస్తాడు; ఆయనసముద్రంలోతులోనికాంతిని స్వంతం చేసుకొన్నట్లు చెప్పబడింది. ఈ దేవతకి మండే స్వభావం ఉందనడానికి అవెస్తాలో సూచనలు ఉన్నాయని స్పీగెల్ (Spiegel) అన్నారు. ఈయనమెరుపుమెరిసేటప్పుడుమేఘంలోంచిపుట్టేఅగ్నిదేవత అని డార్మెస్టెటెర్ (Darmesteter) అభిప్రాయం; ఎల్.వి. ష్రోడెర్ (Shroeder) ఈ అభిప్రాయంతో ఏకీభవించారు. కానికొందరుపండితులు దీన్ని అంగీకరించలేదు. ఓల్డెన్‌బెర్గ్ (Oldlenberg) అపాం నపాత్ మొదట్లో నీటికి మాత్రమే సంబంధించిన దేవత అనీ, నీటిలో పుట్టే మరో దేవత అయిన అగ్నీ ఈయనా ఒకటే అనే భ్రమ తరవాత కాలంలో ఏర్పడిందనీ చెప్పారు. దీనికి ఆయన చూపిన ఆధారాలు: ఈయన్ని స్తుతించే రెండు సూక్తాలలో ఒకటి (10.30) యజ్ఞంలో నీటికి మాత్రమే సంబంధమున్న తతంగాలలో ఉపయోగించేది; 2.35 సూక్తంలో కూడా ఆయనకు నీటితో గల సంబంధమే ప్రాముఖ్యం వహిస్తుంది. అపాం నపాత్ అంటే చంద్రుడే అని హిలెబ్రాంట్ (Hillebrandt), హార్డీ (Hardy) అభిప్రాయపడ్డారు. అపాం నపాత్ అంటే సూర్యుడో మెరుపో అయి ఉంటుందని మాక్స్‌ముల్లర్ (Max Muller) భావించారు.

## 25. మాతరిశ్వుడు

25.1 మాతరిశ్వుణ్ణే (మాతరిశ్వన్-) ఉద్దేశించిన పూర్తి సూక్తమేదీ ఋగ్వేదంలో లేదు; ఈ పేరు ఇరవై ఏడుచోట్ల మాత్రమే వచ్చింది. ఇది అర్వాచీన మండలాలలో ఇరవై - యొక్క-సార్లు వచ్చింది; మిగిలినచోట్ల అయిదుసార్లు మూడోమండలంలోనూ ఒకసారి ఆరోమండలంలోనూ ఇది వచ్చింది. ఈ ఆరు ప్రాచీనతరభాగాలలో మాతరిశ్వుడూ అగ్నీ ఒకరుగానే వ్యవహరించబడడమో లేక మాతరిశ్వుడు అగ్నిని పుట్టించేవాడు అని చెప్పబడడమో జరిగింద. అగ్నికీ దాన్ని పుట్టించే పురుషుడికీ భేదం ఉందనే అంశం మీదనే మాతరిశ్వుడిగాథ ఆధారపడి ఉన్నా, దీన్ని విశ్లేషించి చూస్తే ఈ ఇద్దరూ ఒకరే అని తేలుతుంది. మిగిలినవేదాలలోనూ వేదాల తరవాత కాలంలోనూ మాతరిశ్వుణ్ణి గురించిన భావనకి ఋగ్వేదంలోనే బీజాలు ఉన్నాయనుకోవడానికి దాని అర్వాచీన మండలాలలో కూడా స్పష్టమైన ఆధారమేమీ లేదు.

25.2 మూడు మంత్రాలలో (3.5.9; 3.26.2; 1.96.4) మాతరిశ్వ శబ్దం అగ్నికి

నామాంతరం; ఒకఅగ్ని సూక్తం (9.88.19) చివర ఈ శబ్దం సంబోధనగా వచ్చినచోట కూడా బహుశా ఇంతే. దీనికి వ్యుత్పత్తి ఇవ్వబడిన మరొకమంత్రం (3.29.11)లో మాతరిశ్వుడు అగ్నికి రూపాంతరం అని చెప్పబడింది: ''గర్భంగా ఉన్నప్పుడు ఆయన తనూనపాత్ అనబడతాడు; పుట్టిన తరవాత నరాశంసుడు అవుతాడు; తల్లిలో నిర్మించ బడడం వల్ల మాతరిశ్వుడు (మాతరిశ్వాయ దమిమీత మాంతరి, చూ. 1.141.5); గమనంలో వాయువు సృష్టి అయ్యాడు''. మరొకచోట (1.164.46) ఇంకా ఇలా చెప్పబడింది: ''పండితులు ఒకరినేఅనేకులు అని చెప్తారు (ఏకం సద్విప్రా బహుధావదంతి); వారు అగ్ని, యముడు, మాతరిశ్వుడు అని (ఒకరినే) అంటారు (అగ్నిం యమం మాతరిశ్వానమాహుః)''. ఒకచోట (1.190.2) మాతరిశ్వుడు బృహస్పతి రూపాంతరమే అన్నట్లు చెప్పబడింది: '' ఆ బృహస్పతి యజ్ఞంలో మాతరిశ్వుడుగా సంభవించాడు (సం అభవత్)''; బృహస్పతీ అగ్నీ ఒకరేనని కొన్నిచోట్ల ఉంది (అధ్యాయం 36).

25.3 మరికొన్నచోట్ల మాతరిశ్వుడికీ అగ్నికీ భేదం చెప్పబడింది. '' ఎత్తైన ఆకాశంలో పుట్టిన అగ్ని మాతరిశ్వుడికి ప్రత్యక్షమయ్యాడు'' (1.14.32). ''నువ్వు (= అగ్ని) మొదట మాతరిశ్వుడికీ వివస్వతుడికీ ప్రత్యక్షమయ్యావు; పురోహితుణ్ణి ఎంచుకొన్నప్పుడు రెండులోకాలూ కంపించాయి'' (1.31.3). ''ప్రకాశించే వారిలో ఉత్తముడైన అగ్ని మాతరిశ్వుడు గుహలో దాగి ఉన్న తనని ప్రజ్వలించేటట్టు చేసినప్పుడు తన తేజస్సుతో స్వర్గాన్ని నిలబెట్టేడు'' (3.5.10). అగ్నీ మాతరిశ్వుడూ ఒకరే అని చెప్పిన మంత్రం తరవాత ఈ మంత్రం ఉంది. ఒకే సూక్తంలో పక్కపక్కన ఉన్న మంత్రాలలో ఈ వైరుధ్యాన్ని తొలగించడానికి ఈ కింది వివరణ ఒకటే మార్గం: తరవాత మంత్రంలో అగ్ని రూపాంతరానికి ఉన్న పేరు ముందుమంత్రంలో అగ్నికి విశేషణంగా వాడబడింది. ''యశస్వీ, యజ్ఞానికి కేతువూ (= జెండా), దూతా, రెండుజన్మలు కలవాడూ అయిన వహ్నిని మాతరిశ్వుడు భృగువుకి బహుమతిగా తెచ్చాడు'' (1.60.1). ''మాతరిశ్వుడు ఒకరిని (= అగ్నిని) ఆకాశంనించి తెచ్చాడు; గర్ద్ధ ఘరొకరిని (=సోముణ్ణి) కొండమీదనించి లాగుకొని వచ్చింది'' (1.93.6). ''మంచి పురోహితుడూ, స్వర్గంలో ఉండేవాడూ అయిన అగ్నిని మాతరిశ్వుడు తెచ్చాడు'' (3.2.13). ''భృగువులు పొందిన అగ్నిని మనువుకి పురోహితుడుగా మాతరిశ్వుడూ దేవతలూ తయారుచేశారు'' (10.46.9) '' ఆ దేవుణ్ణి మాతరిశ్వుడు మనువుకోసం దూరాన్నించి తెచ్చాడు'' (1.128.2)

''వివస్వతుడి దూత అయిన మాతరిశ్వుడు వైశ్వానరుడైన అగ్నిని దూరాన్నించి తెచ్చాడు; ఆయన్ని బలవంతులైన (మరుత్తులు) నీటిమధ్య ఉంచారు.'' (6.8.4). ''మాతరిశ్వుడు దాగి ఉన్న అగ్నిని దూరదేశంనించి దేవతల కోసం తెచ్చాడు.'' (3.9.5; ★దేవతలనించి అని మూలకర్త). ''గుహలో ఉన్న అగ్నిని మాతరిశ్వుడు మథించాడు'' (1.141.3). ''మాతరిశ్వుడు అగ్నిని మథించి ఇళ్లలో పెట్టేడు'' (1.71.4; 14.8.1). ఇంద్రుడు త్రితుడికోసం పాము దగ్గరనించి గోవులని తెచ్చాడు; గోశాలలని (★ = మేఘాలని, అని సాయణుడు) దధీచుడికీ మాతరిశ్వుడికీ (★మాతరిశ్వుడి కొడుకైన దధీచుడికి అని సాయణుడు) ఇచ్చాడు (10.48.2).

25.4 అర్వాచీనసూక్తాలలో కొన్ని అస్పష్టార్థం కల మంత్రాలలో మాతరిశ్వుణ్ణిగురించి కొత్తగా చెప్పబడిన విశేషమేమీ లేదు. వీటిలో రెండింటిలో ఈయన సోమాన్ని శుద్ధిచేస్తాడనీ ఆస్వాదిస్తాడనీ ఉంది (9.67.31; 10.114.1); మరొకదాంట్లో (వాలఖిల్యం 4.2 = 8.52.2) ఇంద్రుడు కొందరు పితృదేవతలతోనూ మాతరిశ్వుడితోనూ కలిసి సోమం తాగినట్లు ఉంది. ఒకచోట (10.105.6) ఇంద్రుడు నైపుణ్యంగల మాతరిశ్వుడితో పోల్చబడ్డాడు; మాతరిశ్వుడికి అగ్నిని మథించడంలో ఉన్న నేర్పు ఇక్కడ ఉద్దిష్టమై ఉండవచ్చు (చూ. 10.46.9; ఈ రెండు మంత్రాలలోనూ తక్ష- 'తయారు చేయు' అనే ధాతువు సమానంగా ఉపయోగించబడింది). మాతరిశ్వుడికి ఉన్న ఈ నైపుణ్యం వివాహసూక్తంలోని ఒక మంత్రం (10.85.47) లో కూడా స్మరించబడింది; అందులో ఇతర దేవతలతోపాటు మాతరిశ్వుడు కూడా వధూవరుల హృదయాలని కలపాలి (హృదయానినౌ, సం మాతరిశ్వా సంధాతా) అనే ప్రార్థన ఉంది (చూ. త్వష్ట, అధ్యాయం 38). చివరగా గమనించవలసినది, చాలా అస్పష్టార్థం కల ఒక మంత్రం (10.109.1) లో మాతరిశ్వుడు 'హద్దులులేనివాడు' (అకూపారః), 'సంచరించేవాడు' (సలిలః) అని చెప్పబడ్డాడు (సలిల- అనే విశేషణం అథర్వవేదంలో వాతుడికి కొన్నిసార్లు ఉపయోగించ బడింది); మాతరిశ్వుడి విషయంలో తరవాత కాలంలో ఉన్న భావనలని ఋగ్వేదంలోని ఈ విశేషణాలు ప్రతిబింబిస్తాయి అనుకోవచ్చు.[1]

25.5 పై ఆధారాల వల్ల మాతరిశ్వుడు ఒకవైపు స్వర్గంలోని అగ్నికి రూపాంతరంగానూ,

1. అకూపారః అంటే ఆదిత్యుడనీ, సలిలః అంటే జలదేవత అయిన వరుణుడు అనీ సాయణుడు ఇక్కడ అర్థాలు ఇచ్చారు.

మరొకవైపు ప్రమేథియుస్ (Prometheus, ★ గ్రీకు ఇతిహాసాలలో ఒకదేవత) లా దాగి ఉన్న అగ్నిని స్వర్గాన్నించి భూమికి తెచ్చిన పురుషుడుగానూ భావించబడినట్లు కనపడుతుంది. ఈయనకు ప్రకృత్యాధారం మెరుపే తప్ప మరేదీ అవడానికి అవకాశం లేదు. అగ్నిరెండులోకాల మధ్య వివస్వత్తుకి దూతఅయినట్లు (అధ్యాయం 35), మాతరిశ్వుడు కూడా వివస్వత్తుకి దూతగా స్వర్గాన్నించి భూమికి వచ్చాడనే విషయాన్ని (6.8.4) ఆయనమెరుపే అనేఅంశం సమర్థిస్తుంది. అథర్వవేదంలో కూడా మాతరిశ్వశబ్దం అగ్నికి రహస్యనామంగా మిగిలి ఉంది (అ.వే. 10.8.39, 40); కానిసాధారణంగా అందులోనూ (అ.వే. 12.1.51, మొ.), ఇతర సంహితలలోనూ, బ్రాహ్మణాలలోనూ, తరవాత సాహిత్యం అంతటా, అది వాయువుకిపేరు. ఈ భావనలో మార్పుకిబీజం పైనఉద్ధరించబడిన ఋగ్వేదమంత్రం (3.29.11; చూ. అధ్యాయం 25.2) లో ఉంది: ''(అగ్ని) తల్లిలో నిర్మించబడడం వల్ల మాతరిశ్వుడు; గమనంలో వాయువు సృష్టిఅయ్యాడు''; మరొకచోట (1.79.1) అంతరిక్షంలో బుసలుకొట్టే పాము (అహిర్ధునిః) అయిన అగ్ని వేగం కల గాలితో పోల్చబడ్డాడు (వాత ఇవ ధ్రజీమాన్). మాతరిశ్వుడు అంటే గాలి అని తరవాత కాలంలో అర్థం చెప్పడానికి ఇటువంటి ఉక్తిదోహదం చేసి ఉండవచ్చు.

25.6 ఏ ఇండో-యూరోపియన్ భాషలోనూ సజాతి శబ్దంలేని మాతరిశ్వ శబ్దం సంస్కృతంలో మాత్రమే ఏర్పడిన సమాసంలా అన్నివిధాలా కనపడుతుంది ( ఇది మాతరిభ్వరీ- (10.120.9) 'తల్లిలో ఉండేది (నది'), ఋజిశ్వన్-(1.51.5) ' ఒక వ్యక్తిపేరు', దుర్గృభిశ్వన్- (1.52.6) 'పట్టలేనంత వృద్ధికలవాడు' వంటిది). ఈ పదం ఋగ్వేదకాలపు భాషలోనే ఏర్పడింది అనడానికి చాలా అవకాశం ఉంది కాబట్టి దీనికి ''తల్లిలో నిర్మించబడినవాడు'' అని ఋగ్వేదకవి ఇచ్చిన వ్యుత్పత్తి (అధ్యాయం 25.2) కేవలం ఊహామూలకమే అని నిరాకరించకూడదు. ''తల్లిలో పెరిగేవాడు'' అని దీని అర్థం కావచ్చు (ఇందులో- శ్వన్‌శూ- 'పెరుగు, వాచు' అనే ధాతువుకి సంబంధించినది; శిశు- మొదలైనపదాలు దీని నించి వచ్చినవే); అగ్ని కూడా తల్లులతో వృద్ధిపొందుతాడు (వృధ్- 'వర్ధిల్లు' అనే ధాతువు) అని చెప్పబడింది (1.141.5). - వన్ ప్రత్యయంతో కూడిన ప్రాతరిత్వన్- ''ప్రాతఃకాలంలో వచ్చినవాడు'', 1.125.1) అనేకపదాలతో సామ్యంవల్ల ఇందులో రెండో అచ్చుకి బదులు మూడో అచ్చు ఉదాత్తమయింది అనిచెప్పవచ్చు. కింద ఉండే అరణి కాని మెరుపు ఉన్న మేఘంకాని 'తల్లి' అనేపదంతో సూచించబడి ఉండవచ్చు;

మాతరిశ్వుడు స్వర్గాన్నించి వస్తాడు కాబట్టి వీటిలో రెండోదే ఉద్దిష్టమనడం ఎక్కువ సమంజసం. మాతరిశ్వ శబ్దం వాయువుకి నామాంతరం అని భావించిన యాస్కుడు (నిరుక్తం 7.26) ఈ సమాసాన్ని మాతరి (= అంతరిక్షంలో) + శ్వన్ (< శ్వస్- 'ఊపిరిపీల్చు' / ఆశు అన్- 'తొందరగా ఊపిరిపీల్చు') అని విడదీసి దీనికి ''అంతరిక్షంలో ఊపిరిపీల్చే వాయువు'' అని అర్థం చెప్పేరు.

## 26. అహి బుధ్న్యుడు

26.1 లోతునీళ్లలో ఉండేపాము (అహి) అయిన అహిబుధ్న్యుడి (అహి- బుధ్న్య-; ★ ఇవి రెండు వేరువేరు పదాలు) పేరు విశ్వేదేవతలకు ఉద్దేశించిన సూక్తాలలో మాత్రమే వస్తుంది; ఇది ఋగ్వేదంలో పన్నెండుచోట్ల మాత్రమే ఉంది. ఇతర దేవతల పేర్లు లేకుండా ఈ పేరు మాత్రమే ఉన్న మంత్రాలు చాలా తక్కువ. ఇది అజ ఏకపాత్‌తో అయిదుచోట్లా, అపాం నపాత్‌తో మూడుచోట్లా, సముద్రంతో మూడుచోట్లా, సవితతో రెండుచోట్లా కలిసి వచ్చింది. ఈయన్ని విడిగా స్తుతించిన మంత్రాలు మూడు మాత్రమే ఉన్నాయి (5.41.16; 7.34.16, 17). ఈయనతో పాటు ఒకదేవతే చెప్పబడినప్పుడు ఆ రెండో దేవత అపాం నపాత్ (1.186.5) లేక అజ ఏకపాత్ (10.64.4). అహి బుధ్న్యుడూ అజ ఏకపాత్తూ కలిసివచ్చినచోటుల్లో ఆరెండు పేర్లే పక్కపక్కనే ఉంటాయి (దీనికి 10.66.11 మాత్రమే అపవాదం). ఈపేరు ఇతర దేవతలపేర్లతో కలిసి ఉన్న సముదాయాలలో ప్రత్యేకంగా చెప్పుకోదగినవి: అజ ఏకపాత్, అహి బుధ్న్యుడు, సముద్రం, అపాం నపాత్, పృశ్ని (7.35.13); అహి బుధ్న్యుడు, అజ ఏకపాత్, త్రితుడు, ఋభుక్షుడు, సవిత, అపాంనపాత్ (2.31.6); సముద్రం, సింధువు (నది), ఆకాశానికీ భూమికీ మధ్య ఉన్న ప్రదేశం (రజస్), అంతరిక్షం, అజ ఏకపాత్, ఉరిమే సముద్రం (= మేఘం, తనయిత్నురర్ణవః), అహిబుధ్న్యుడు, విశ్వేదేవతలు (10.66.11). అహిబుధ్న్యుడు అంతరిక్షదేవతఅని ఈయనతో కలిపి చెప్పబడిన వాటి (/వారి) వల్ల ఊహించవచ్చు; నిరుక్తంలోని నిఘంటువు (5.4) లో ఈయన పేరు అంతరిక్షదేవతల పేర్ల జాబితాలోనే ఉంది. కాని ఈయనపేరు ప్రత్యేకంగా వచ్చినచోట్లు పరిశీలించడం వల్లనే ఈయన్నిగురించి మరికొంత స్పష్టమైన సమాచారం తెలుస్తుంది. ఈయన్నిగురించి అన్నింటిలోకీ ఎక్కువ సమాచారం ఉన్న మంత్రంలో కవివాక్కు: ''నీటిలో పుట్టినపాముని మంత్రాలలో స్తుతిస్తాను (అబ్జాముక్థైరహింగృణీషే), అంతరిక్షప్రదేశంలో నదుల అడుగున (బుధ్నే) కూర్చున్నవాణ్ణి

(స్తుతిస్తాను)'' (బుధ్నే నదీనాం రజఃసు షీదన్, 7.34.16; చూ. 10.93.5). ఇది ఆయన అంతరిక్షంలోని సముద్రంలో నివసిస్తాడని సూచిస్తుంది; యాస్కుడు బుధ్న- అంటే అంతరిక్షమని అర్థం ఇచ్చారు (నిరుక్తం 10.44). దీనితరవాత మంత్రంలో ''హింసించేవారికి మమ్మల్ని ఇవ్వకు'' (మానో.....రిషేధాత్) అని ఆయన ప్రార్థించబడ్డాడు; మరొకమంత్రం (5.41.16)లో కూడా ఈ మాటలే ఉన్నాయి. దీనివల్ల ఆయన స్వభావంలో హాని చెయ్యడం అనే లక్షణం ఉందని తెలుస్తుంది. 'అహి' అనే పదం సాధారణంగా వృత్రుడికి వాడబడింది (అధ్యాయం 68); నీళ్లని చుట్టి ఉండే వృత్రుణ్ణే నీళ్లు ఆవరించాయనీ, వృత్రుడు నీళ్లలో లేక అంతరిక్షం అడుగున (బుధ్న-) పడుకొన్నాడనీ వర్ణించబడింది (1.52.6). అగ్ని అంతరిక్ష ప్రదేశంలో బుసలుకొట్టే అహి (1.79.1) అనీ, ఆయన అంతరిక్షప్రదేశం లోతులో (బుధ్న-) పుట్టేడు (4.11.1) అనీ చెప్పబడింది. అందువల్ల అపాం నపాత్‌ని పోలిన అహిబుధ్న్యుడు దేవతగా భావించబడినా, మొదట్లో ఈయనకీ అహి అయిన వృత్రుడికీ భేదం లేదని ఊహించవచ్చు; ఈయన హానికరస్వభావం సూచితమవడం కూడా గమనించదగినది. తరవాత కాలపు వైదిక గ్రంథాలలో అహిబుధ్న్యుడికీ గార్హపత్యాగ్నికీ సూచనాప్రాయంగా సంబంధం ఆపాదించబడింది (వా.సం. 5.33; ఐ.బ్రా. 3.36; తై.బ్రా. 1.1.10.3). వేదాల తరవాత కాలపు సాహిత్యంలో అహిబుధ్న్యుడు అనే పదం రుద్రులలో ఒకరికి పేరూ, శివుడికి విశేషణమూ.

## 27. అజుడు (ఏకపాత్)

27.1 ఈ దేవతకీ అహిబుధ్న్యుడికీ చాలా సన్నిహిత సంబంధం ఉంది; ఈ పేరు అహిబుధ్న్యుడి పేరుతో కలిసి అయిదుచోట్లా, విడిగా ఒకచోట (10.65.13) మాత్రం వచ్చింది. పై మంత్రంలో చెప్పబడిన దేవతలూ (ఉరిమే పావీరవి (= మెరుపు కూతరు; ★ ''ఆయుధాలు కలది'' అని సాయణుడు), ఆకాశాన్ని నిలబెట్టిన ఏకపాత్ అజుడు, సింధువు, సముద్రపు నీరు, విశ్వేదేవతలు, సరస్వతి), 10.66.11లో చెప్పబడిన దేవతలూ (సముద్రం, సింధువు, ఆకాశానికీ భూమికీ మధ్యప్రదేశం, అంతరిక్షం, అజ ఏకపాత్, ఉరిమే సముద్రం, అహిబుధ్న్యుడు, విశ్వేదేవతలు; చూ. అధ్యాయం 26) ఇంచుమించు సమానంగానే ఉన్నారు. అందువల్ల ఏకపాత్ అజుడు అంతరిక్షదేవత అని చెప్పవచ్చు. కాని నిరుక్తంలోని నిఘంటువు (5.6)లో ఈ పేరు స్వర్గంలోని దేవతల జాబితాలో ఉంది. అథర్వవేదం (13.1.6)లో ఏకపాదుడైన అజుడు రెండులోకాలనీ నిలబెట్టినట్లు చెప్పబడింది.

తై.బ్రా. (3.1.2.8) లో అజుడు (ఏకపాత్, ప్రాతిపదిక ఏకపాద్-) తూర్పున ఉదయించినట్లు చెప్పబడింది; ఇక్కడ వ్యాఖ్యాత ఈయన అగ్నికి రూపాంతరం అని చెప్పేరు; దుర్గుడు తన నిరుక్త వ్యాఖ్య (12.29) లో ఈయన సూర్యుడే అని చెప్పేరు. యాస్కుడు ఈయన దేనికి ప్రతినిధి అనే విషయంలో తన అభిప్రాయం చెప్పకుండా, అజ- అంటే 'ప్రేరించేవాడు', ఏకపాద్- అంటే 'ఒకపాదం కలవాడు' లేక 'ఒకపాదంతో కాపాడేవాడు / తాగేవాడు' అని మాత్రం చెప్పేరు. తరవాత కాలంలో సాధారణంగా ఈయన ప్రత్యేక దేవతగా భావించబడకపోయినా, ఈయనకీ అహిబుధ్న్యుడికీ గృహ్యకర్మ (= ఇళ్లలో చేసుకొనే పూజ) లో ఆహుతులు ఇవ్వబడతాయి (పారస్కరగృహ్యసూత్రం 2.15.2). పురాణాలలో అజైకపాత్ పదకొండు రుద్రులలో ఒకరికి పేరూ, శివుడికి విశేషణమూ.

27.2 రోథ్ (Roth) ఈ పేరుని '' ఒకకాలు గల ప్రేరకుడు / కల్లోలం కలిగించేవాడు'' అని అనువదించి ఈయన తుపానుకి అధిదేవత అన్నారు; గ్రాస్మన్ (Grassmann) దీన్ని అంగీకరించారు. బ్లూమ్‌ఫీల్డ్ (Bloomfield), విక్టర్ హెన్రీ (Victor Henry) ఈయన సూర్యసంబంధి దేవత అన్నారు. హార్డీ (Hardy) ఈ ''ఒంటరిగా వెళ్లే మేక'' చంద్రుడు అని అభిప్రాయపడ్డారు. బెర్గెయిన్ (Bergaingne) ఈ పేరుకి '' ఒకకాలుగల పుట్టనివాడు (అ-జ-)'' అని అర్థం చెప్పి తదనుగుణంగా ఈయన ''ప్రత్యేకంగా ఉన్న గూఢమైన లోకంలో ఉండేవాడు'' అని అభిప్రాయపడ్డారు. వీటన్నిటికీ మరొక ఊహ కూడా కలపవచ్చు అనుకొంటే (★ ఇలా కూడా చెప్పవచ్చు): '' ఒకకాలుగల మేక'' అని అర్థం ఇచ్చే ఈ పేరు లాక్షణికంగా మెరుపుని సూచిస్తుంది; ''మేక'' మేఘపర్వతాలలో మెరుపు శీఘ్రగమనాన్నీ, ''ఒకకాలు'' భూమిమీదకి వచ్చే కాంతిరేఖ (= పిడుగు) నీ ప్రతిబింబిస్తాయి.

## 28. రుద్రుడు

28.1 ఋగ్వేదంలో ఈ దేవతకి అప్రధానస్థానమే ఉంది; అందులో ఈయన మూడే మూడు పూర్తి సూక్తాలలోనూ, మరొక సూక్తభాగంలోనూ, మరొకదాంట్లో సోముడితో కలిపీ స్తుతించబడ్డాడు. ఈ పేరు సుమారు 75 సార్లు వచ్చింది.

28.2 ఋగ్వేదంలో చెప్పబడిన ఆయన శరీర లక్షణాలు కింద ఇవ్వబడ్డాయి. ఆయన ముంజేయీ (హస్తః, 2.33.7. మొ.), చేతులూ (వజ్రబాహో, 2.33.3; వా.సం. 16.1), స్థిరమైన అవయవాలూ (స్థిరేభి రంగైః, 2.33.9) చెప్పబడ్డాయి. ఆయన పెదవులు

అందమైనవి (సుశిప్రః, 2.33.5); (పూషుడిలా) ఆయన జటలు ధరిస్తాడు (కపర్దిన్-, 1.114.1, 5). ఆయన గోధుమరంగు కలవాడు (బభ్రు-, 2.33.5, మొ.); ఆయన రూపం తేజస్సుతో ప్రకాశిస్తుంది (అరుష-, త్వేష-, 1.114.5); ఆయన బహురూపుడు (పురురూప-, 2.33.9). ఆయనసూర్యుడిలా తేజస్సు కలవాడు; బంగారంలా ప్రకాశిస్తాడు (యః శుక్ర ఇవ సూర్యో హిరణ్యమివ రోచతే, 1.43.5). ఆయన బంగారు ఆభరణాలతో (హిరణ్యైః) ప్రకాశిస్తాడు (2.33.9); చాలా రూపాలుగల హారం ధరిస్తాడు (నిష్కం..... విశ్వరూపం, 2.33.10). ఆయన రథం మీద కూర్చుంటాడు (గర్తసద-, 2.33.11). అర్వాచీన సంహితలలో (ముఖ్యంగా వా.సం. 16) చాలా ఇతర లక్షణాలు కూడా చెప్పబడ్డాయి. ఆయనకు వెయ్యి కన్నులు ఉన్నాయి (అ.వే. 11.2.2, 7; వా.సం. 16.7). ఆయన పొట్టా, నోరూ, నాలుకా, పళ్లూ, (అ.వే. 11.2.6) - వీటిగురించిన ప్రస్తక్తి ఉంది. ఆయన పొట్ట నలుపు, వీపు ఎరుపు (అ.వే. 15.1.7, 8). ఆయన మెడా (వా.సం. 16.7), జటలూ (అ.వే. 2.27.6) నీలం రంగువి. ఆయన రాగిరంగుకలవాడు; ఎర్రనివాడు (వా.సం. 16.7). ఆయన చర్మం ధరిస్తాడు (వా.సం. 3.61; 16.51); కొండలమీద నివసిస్తాడు (వా.సం. 16.2-4).

28.3 ఋగ్వేదంలో రుద్రుడి హింసించే ఆయుధాలు తరచు చెప్పబడ్డాయి. ఒకచోట (2.33.3) ఆయనచేతిలో వజ్రం ఉందని చెప్పబడింది (వజ్రబాహో). ఆయన ఆకాశం నించి వదిలిన పిడుగు అనే ఆయుధం (దిద్యు దవసృష్టా దివస్పరి) భూమిలో చరిస్తుంది (7.46.3). సాధారణంగా ఆయన ఆయుధాలూ, విల్లూ, బాణాలూ (అర్హన్ బిభర్షి సాయకాని ధన్వా, 2.33.10; 5.42.11; 10.125.6) అని చెప్పబడింది; ఆ ధనుస్సు గట్టిది (స్థిరధన్వనే). బాణాలు వేగం కలవి (క్షిప్రేషవే, 7.46.1). ఆయన కృశానువుతోనూ (అధ్యాయం 48), బాణాలు వేసే కృశానువు అనుచరులతోనూ కలిపి యజ్ఞానికి ఆహ్వానించబడ్డాడు (10.64.8); రథం ఆసనం మీద కూచొని బాణాలు వేసే వ్యక్తితో (అస్తేవగర్తే) ఇంద్రుడు పోల్చబడినచోట (6.20.9; చూ. 2.33.11) రుద్రుడే ఉద్దిష్టుడై ఉంటాడు. అథర్వవేదంలో ఈయన బాణాలు వేసేవాడు (అస్తా, 6.93.1; 15.5.1-7) అని చెప్పబడింది. అందులోనూ మిగిలిన అర్వాచీన వైదిక గ్రంథాలలోనూ ఆయన విల్లూ, బాణమూ, ఆయుధమూ, వజ్రమూ, గదా తరచుగా చెప్పబడ్డాయి (అ.వే. ? 1.28.5, మొ; శ.బ్రా. 9.1.1.6).

28.4 రుద్రుణ్ణి గురించి చాలా తరచుగా చెప్పబడిన విషయాలలో ఒకటి ఆయనకి మరుత్తులతో ఉన్న సంబంధం. ఆయన వారి తండ్రి (1.114.6,9; 2.33.1); వారు ఆయన కొడుకులని చెప్పడం ఇంతకన్న తరచు; వారు రుద్రులు, రుద్రియులు అని కొన్నిచోట్ల ఉంది. ఆయనవారిని పృశ్ని ప్రకాశించే పొదుగునించి పుట్టించాడు (2.34.2). రుద్రుడు రాక్షసులతో యుద్ధంచేసినట్లు (ఋగ్వేదంలో) లేదు కాబట్టి మరుత్తులు చేసే యుద్ధం వంటి సాహసకృత్యాలలో ఇంద్రుడిలా రుద్రుడు వారితో కలిసినట్లు ఎక్కడా చెప్పబడలేదు. వేదాల తరవాత సాహిత్యంలో శివుడికి సర్వసాధారణ విశేషణమైన త్ర్యంబక శబ్దం వైదిక గ్రంథాలలోనే రుద్రపరంగా వాడబడింది (వా.సం. 3.58; శ.బ్రా. 2.6.2.9); ఋగ్వేదంలోనే ఒకచోట (7.59.12) ఇది రుద్రపరంగా వాడబడినట్లు కనపడుతుంది. దీని అర్థం ''ముగ్గురు తల్లులు కలవాడు'' అని చెప్పడానికి అవకాశం ఉంది;[1] ఇది విశ్వం మూడు భాగాలుగా విభజించబడి ఉండడాన్ని స్మరింపజేస్తుంది. వేదాల తరవాత సాహిత్యంలో శివుడి భార్యకి ఉన్న 'అంబికా' అనేపేరు వా.సం. 3.5 లో మొట్టమొదటిసారిగా కనిపిస్తుంది; కాని అందులో ఆమె రుద్రుడి భార్య అనికాక సోదరి అని చెప్పబడింది. శివుడి భార్య పేర్లైన ' ఉమా', 'పార్వతీ' అనే పదాలు మొట్టమొదటిసారిగా తైత్తిరీయ ఆరణ్యకంలోనూ కేనోపనిషత్తులోనూ వచ్చాయి.

28.5 ఋగ్వేదం ఒక మంత్రం (2.1.6)లో రుద్రుడూ మరికొందరు దేవతలూ అగ్నికి రూపాంతరాలు అని చెప్పబడింది. అ.వే. (7.87.1), తై.సం. (5.4.3.1; 5.5.7.4), శ.బ్రా. (6.1.3.10; చూ. 9.1.1.1)లలో కూడా అగ్నికీ ఈయనకీ అభేదం చెప్పబడింది. రుద్రశబ్దం తరచు విశేషణంగా వాడబడింది; ఇది కొన్నిచోట్ల అగ్నికీ, ఇంతకన్న ఎక్కువచోట్ల అశ్వినులకీ (అధ్యాయం 21.2) విశేషణంగా ఉంది. వా.సం. (16.18,28) లో శర్వ, భవ శబ్దాలు మరికొన్నిటితోపాటు కొత్తగా రుద్రుడికి పర్యాయాలుగా వాడబడ్డాయి. ఈ రెండు శబ్దాలూ అ.వే. (2.27.6; 6.93.1; 10.1.23; 11.2.1, 12)లో కూడా ఉన్నాయి; ఇందులో వీరి నాశం కలిగించే బాణాలూ, పిడుగులూ చెప్పబడ్డాయి. ఇక్కడ వీరు వేరువేరు దేవతలుగానూ, రుద్రుడికన్న భిన్నులుగానూ పరిగణించబడినట్లు కనపడుతుంది. శాంఖాయన శ్రౌతసూత్రం (4.20.1)లో భవుడూ,

---

1. త్ర్యంబక శబ్దానికి సాయణుడు (7.59.12 వ్యాఖ్యలో) ఇచ్చిన అర్థం: ''బ్రహ్మ విష్ణు రుద్రులనే ముగ్గురికీ తండ్రి'' (త్రయాణాం బ్రహ్మ విష్ణు రుద్రాణాం అంబకం పితరం).

శర్వుడూ రుద్రుడి కొడుకులని చెప్పబడింది; అందులో వీరు జంతువులను వేటాడే దేవుళ్లతో పోల్చబడ్డారు. వా.సం. (39.8) లో అగ్ని, అశని, పశుపతి, భవుడు, శర్వుడు, ఈశానుడు, మహాదేవుడు, ఉగ్రదేవుడు. మరికొందరు దేవతలూ ఒకేదేవత రూపాంతరాలని చెప్పబడింది. రుద్రుడు, శర్వుడు, పశుపతి, ఉగ్రుడు, అశని, భవుడు, మహాదేవుడు (మహాన్‌దేవః) అగ్ని ఎనిమిది రూపాలని శ.బ్రా. (6.1.3.7) లో చెప్పబడింది (చూ. శాంఖాయన బ్రాహ్మణం 6.1, మొ.); శ.బ్రా.లో మరొకచోట (1.7.3.8) శర్వుడు, భవుడు, పశుపతి, రుద్రుడు - ఇవన్నీ అగ్ని పేర్లని చెప్పబడింది. శ.బ్రా. (6.1.3.10) లో అగ్ని కుమారుడి పేర్లలో ఒకటైన 'అశని'కి 'మెరుపు' (విద్యుత్) అని అక్కడ అర్థం ఇవ్వబడింది; కాని శాంఖాయన బ్రాహ్మణంలో దీనికి 'ఇంద్రుడు' అని అర్థం చెప్పబడింది. వా.సం., అ.వే.లలోనే తరవాత గ్రంథాలలోనూ రుద్రుడికి పశుపతి 'పశువులకు పతి' అని విశేషణం తరచుగా వాడబడింది; ముఖ్యంగా ఇంటికి బయట ఉన్న పశువులకి ఆయనవల్ల ప్రమాదం ఉండడం వల్ల వాటి రక్షణ ఆయనకి అప్పజెప్పడం దీనికి కారణం అనడంలో సందేహం లేదు.

28.6 ఋగ్వేదంలో రుద్రుడు భయంకరుడు (ఉగ్ర-, 2.33.9, 11; 10.126.5) అనీ, భయకంరమైన మృగంలా హింసించేవాడు (మృగంన భీమ ముపహత్నుం, 2.33.11) అనీ వర్ణించబడ్డాడు. ఆయన స్వర్గానికి సంబంధించిన ఎర్రని వరాహం (దివో వరాహ మరుషం, 1.114.5). ఆయన వృషభుడు (2.33.7, 8, 15; ★ ఎద్దులా బలం కలవాడు కామాలని వర్షించేవాడు (< వృష్- 'వర్షించు' అనే ధాతువునించి వచ్చింది)); గొప్పవాడు (బృహంతం, 7.10.4); బలశాలి (తవ్యసే, 1.43.1; 1.114.1), బలశాలులలో బలశాలి (తవస్తమ స్తవసాం, 2.33.3), ఓడించడానికి శక్యం కానివాడు (అసాళ్హాయ, 7.46.11), బలంలో తనకన్న అధికుడు లేనివాడు (నవా ఓజీయో రుద్ర త్వదస్తి, 2.33.10), వేగం కలవాడు (యయినా, 10.92.5; 1.114.4). ఆయన యువకుడు (యువానం, 2.33.11; 5.60.5); ముసలితనం లేనివాడు (అజరం, 5.49.10). ఆయన అసురుడు (5.42.11), స్వర్గానికి సంబంధించిన గొప్ప అసురుడు (అసురో మహో దివః, 2.1.6); స్వకీయమైన యశస్సు కలవాడు (స్వయశసే, 1.129.3; 10.92.9); వీరులని నాశనం చేసేవాడు/పాలించేవాడు (క్షయద్వీరాయ, 1.114.1, 2, మొ.); ఈ పెద్ద విశ్వానికి ప్రభువు (ఈశానాదస్య భువనస్య భూరేః, 2.33.9);

భువనానికితండ్రి (భువనస్యపితరం, 6.49.10). ఆయనపరిపాలకుడు (వేధసే, 7.46.1); తనపరిపాలన వల్లా, సర్వాధికారం వల్లా మనుష్యుల, దేవతల పనులు తెలుసుకొంటాడు (7.46.2). ఆయనభూమిమీదనదులు ప్రవహించేటట్టు చేస్తాడు; అరుస్తూ అన్నిటినీ తడుపుతాడు (రోరువజ్జత, రేవిశ్వముక్షతే, 10.92.5). ఆయనతెలివైనవాడు (ప్రచేతసే, 1.43.1); కవి (1.114.4); సుఖం కలిగించేవాడు (మృళయాకుః, 2.33.7; సుషుమ్నం, 6.49.10). ఆయన మీఢ్వస్- 'కోరికలు తీర్చేవాడు' (1.114.3, మొ.) అనికొన్నిచోట్ల చెప్పబడ్డాడు; ఋగ్వేదంకాక మిగిలినవేదాలలో దీనికి అతిశయాన్ని సూచించే తర, తమ ప్రత్యయాలు చేర్చినరూపాలు (మీఢుష్టర-, మీఢుష్టమ-) రుద్రుడికిమాత్రమే వాడబడ్డాయి. ఆయన సులభంగా ఆహ్వానించదగినవాడు (సుహవః, 2.33.5); సుఖం కలిగించేవాడు (శివః, 10.92.9); శివశబ్దం అథర్వవేదం వరకూ కూడా అందరు దేవతలకీ విశేషణంగా వాడబడింది.

28.7 ఋగ్వేదంలో రుద్రుడికి హానికర స్వభావం ఉన్నట్లు తరచు చెప్పబడింది; ఆయన్ని స్తుతించేసూక్తాలలో ఆయనబాణాలు భయంకరమైనవని చెప్పడమూ, ఆయన్ని తమమీదకోపించవద్దని ప్రార్థించడమూ కనపడతాయి. ''మాలో పెద్దవారినీ, పిల్లలనీ, యువకులనీ, గర్భంలో ఉన్నవారినీ, మా తండ్రినీ, తల్లినీ చంపుకు; ఓ రుద్రుడా! మా ప్రియమైనశరీరాలని హింసించకు'' (1.114.7).[2] ''మాపుత్రుడినీ (తోకే), మనమడినీ (తనయే), మా మనుష్యుల్నీ (ఆయౌ), గోవులనీ, గుర్రాలనీ హింసించకు; మా వీరులని హింసించకు; రుద్రుడా! నిన్నుఎప్పుడూ హవిస్సులతో ఆహ్వానిస్తాము'' (1.114.8).[3] ''గుర్రంపై ఉన్న మా వీరుడు (శత్రువిజయానికి) సమర్థుడు అవుగాక (అభి నో వీరో అర్వతి క్షమేత, 2.33.1). ''నీ సేనలు అన్యుల్ని నాశనం చేయుగాక'' (అన్యంతే అస్మన్ని వపంతు సేనాః, 2.33.11). ''రుద్రుడి ఆయుధం మమ్మల్ని వర్జించుగాక; ఆయనగొప్ప కోపం (దుర్మతిః) వేరుచోటుకిపోవుగాక'' (పరిణో హేతీ రుద్రస్య వృజ్యాః, పరి త్వేషస్య దుర్మతి ర్మహీ గాత్, 2.33.14). ఆయన హానికలిగించే బుద్ధీ కోపమూ తమమీద చూపవద్దని ప్రార్థించబడ్డాడు (2.33.4-6, 15). కాళ్లు ఉన్న (పద్వతే) ఆహారంపై

2. మానో మహాంతముత మానో అర్భకం
మాన ఉక్షంత ముత మాన ఉక్షితం
మానో వధీః పితరంమోత మాతరం
మానః ప్రియాస్తన్వో రుద్ర రీరిషః

3. మానస్తోకే తనయే మాన ఆయౌ
మానో గోషు మానో అశ్వేషు రీరిషః
వీరాన్మానో రుద్రభామితో వధీర్
హవిష్మంతః సదమిత్త్వా హవామహే.

(అవసాయ) దయచూపమని కూడా ప్రార్థన ఉంది (10.16.1). ఆరాధకులు తమకు హాని కలగకూడదనీ, రుద్రుడి అనుగ్రహం కలగాలనీ ప్రార్థించారు (2.33.1, 6). ఆయనకి ఒకచోట నృఘ్న- 'నరులని చంపేవాడు' అనే విశేషణం వాడబడింది (4.3.6); ఆశ్వలాయన గృహ్యసూత్రం (4.83.2) లో ఈ దేవుడు మనుష్యులని చంపుతాడు అని చెప్పబడింది. రుద్రుడి హానికర స్వభావం అర్వాచీనవైదిక గ్రంథాలలో ఇంకా ఎక్కువగా చెప్పడింది. ఆయన కోపాన్ని తమమీద చూపవద్దు అనే ప్రార్థనలు వీటిలో తరుచుగా ఉన్నాయి (వా.సం. 3.61, మొ; అ.వే. 1.28.5, మొ.). దివ్యమైన అగ్నితో భక్తులని నాశనం చెయ్యవద్దనీ, పిడుగు వేరొకచోట పడేటట్టు చెయ్యమనీ ప్రార్థనలు ఉన్నాయి (అ.వే. 11.2.26; 10.1.23). జ్వరం, దగ్గు, విషం- వీటితో ఆయన హాని చేస్తాడని కూడా చెప్పబడింది (అ.వే. 11.2.22, 26; 6.90; చూ. 93). రుద్రుడి పెద్దనోరుగల అరిచే కుక్కలు జంతువులని నమలకుండానే మింగేస్తాయని కూడా చెప్పబడింది (అ.వే. 10.1.30; చూ. వా.సం. 16.28). ఆయన గట్టి విల్లూ, బాణాలూ అంటే దేవతలకి కూడా భయం; రుద్రుడు వారిని కూడా నాశనం చెయ్యగలడు (శ.బ్రా. 9.1.1.1-6). మహాదేవుడు అనే పేరుతో ఆయన పశువులని చంపుతాడు (తాండ్య మహాబ్రాహ్మణం 6.9.7). మరొక బ్రాహ్మణం (ఐ.బ్రా. 3.33.1) లో మహాభయంకరమైన పదార్థాలు అన్నీ కలియడం వల్ల ఆయన ఉద్భవించాడని బ్రాహ్మణాలలోనూ సూత్రాలలోనూ చెప్పబడడానికి కారణం ఆయన భయంకర స్వభావమే కావచ్చు. దేవతలు స్వర్గాన్ని సాధించినప్పుడు రుద్రుడు వెనకాల మిగిలిపోయాడు (శ.బ్రా. 1.7.3.1). యజ్ఞకర్మలో ఇతర దేవతలకి ఆహుతులిచ్చాక, మిగిలినదాంట్లో ఒక భాగం రుద్రుడికి ప్రత్యేకించబడడం అసాధారణం కాదు (గోభిలగృహ్యసూత్రం 1.8.28; ఆపస్తంబ ధర్మసూత్రం 2.4.23). మనుష్యులకీ జంతువులకీ రోగమూ చావూ కలిగించే ఆయన గణాలకు బలిపశువు రక్తంతో కూడిన పేగులు అర్పించబడతాయి (శాంఖాయన శ్రౌతసూత్రం 4.19.8); యజ్ఞంలో రాక్షసులకు ఇవ్వవలసిన భాగంగా బలిపశువు రక్తం పోస్తారు (ఐ.బ్రా. 2.7.1). ఈ అర్వాచీన వైదికగ్రంథాలలో రుద్రుడి స్థానం ఉత్తరదిక్కున ఉన్నట్లూ ఇతర దేవతల స్థానం తూర్పుదిక్కున ఉన్నట్లూ సాధారణంగా చెప్పబడింది. బహుశా రుద్రుడి భయంకర స్వభావం కారణంగానే ఆయన ఋగ్వేదంలో ఒకచోట మాత్రమే నాలుగు మంత్రాలుగల ఒక చిన్న సూక్తంలో మరొక దేవత (సోముడు, అధ్యాయం 44) తో కలిపి దేవతా ద్వంద్వంగా స్తుతించబడ్డాడు.

28.8 వా.సం.లో ఇక్కడ ఇవ్వడానికి వీలులేనంత పెద్దసంఖ్యలో ఉన్న విశేషణాలతోపాటు కొన్ని అవమానకరమైన విశేషణాలు కూడా రుద్రుడికి చెప్పబడ్డాయి. ఆయన ''దొంగ, వంచకుడు, దొంగలకు పతి'' అని చెప్పబడ్డాడు (16.20-21). నిజానికి, ఇందులో ఉన్న విశేషణాల వల్ల చెప్పబడిన ఆయన స్వభావం వేదాల తరవాత కాలంలో భయంకరమూ, అపరిశుద్ధమూ, హేయమూ అయిన శివుడి స్వభావానికి దగ్గరగా ఉంటుంది.

28.9 కాని రుద్రుడు రాక్షసులలా పూర్తిగా హానికరమైన స్వభావం మాత్రమే కలవాడు కాదు. ఋగ్వేదంలో ఆయన ఇతర దేవతల కోపాన్నీ, వారివల్ల కలిగే చెడునీ తప్పించమని ప్రార్థించబడ్డాడు (1.114.4; 2.33.7). ఆయన నాశం నించి తప్పించమని ప్రార్థించబడడమే కాకుండా (5.51.3), అనుగ్రహం చూపమనీ (1.114.1, 2; 2.33.6), మనుష్యులకీ జంతువులకీ సుఖం కలిగించమనీ (1.43.6) ప్రార్థించబడ్డాడు. బాధలని తగ్గించే ఆయన శక్తులు ఎక్కువ తరచుగా చెప్పబడ్డాయి. ''స్తుతించబడిన నువ్వు మాకు మందులు ఇస్తావు'' (స్తుతస్త్వం భేషజా రాస్యస్మే, 2.33.12); ''అన్ని మందులూ ఆయన దగ్గర ఉంటాయి'' (యో విశ్వస్య క్షయతి భేషజస్య, 5.42.11); ''నీ దగ్గర వెయ్యి మందులు ఉన్నాయి'' (సహస్రం తే........ భేషజా, 7.46.3). ''ఆయన చేతిలో మంచి మందులు ఉంటాయి'' (హస్తే బిభ్రద్భేషజా వార్యాణి, 1.114.5); ''సుఖం కలిగించే మందైన నీ చెయ్యి ఎక్కడ ఉంది?'' (క్వ స్యతే రుద్ర మృళయాకుర్హస్తో యో అస్తి భేషజో జలాషః, 2.33.7). ''మా వీరులని మందులతో గొప్పవారిని చెయ్యి'' (ఉన్నో వీరాన్ అర్పయ భేషజేభిః), ''నువ్వు వైద్యులకు వైద్యుడవు అని అన్నాను'' (భిషక్తమం త్వా భిషజాం శృణోమి, 2.33.4). ''నువ్వు ఇచ్చే సుఖం కలిగించే మందులవల్ల వంద హిమ ఋతువులు నేను జీవిస్తాను'' (త్వా దత్తేభీ రుద్ర శంతమేభిః శతం హిమా అశీయ భేషజేభిః, 2.33.2). ''మా పిల్లలకు రోగాలు లేకుండా చెయ్యి'' (అనమీవో రుద్ర జాసునో భవ, 7.46.2). ''రెండుకాళ్లు గల వాటికీ (/వారికీ), నాలుగు కాళ్లుగల వాటికీ శుభం కలగాలి; ఈ గ్రామంలో అంతా పుష్టిగానూ రోగం లేకుండానూ ఉండాలి'' (యథాశమస ద్విపదే చతుష్పదే, విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ననాతురం, 1.114.1). ఈ సందర్భంలో రుద్రుడికి ప్రత్యేకంగా ఉన్న రెండు విశేషణాలు గమనించాలి: అవి జలాష- 'రోగం తగ్గించేవాడు', జలాషభేషజ- 'రోగం తగ్గించే మందులు కలవాడు' (1.43.4; అ.వే. 2.27.6) అనేవి. ఈ జబ్బులు తగ్గించే మందులు బహుశా వానలే కావచ్చు (చూ. 5.53.14; 10.59.9).

ఈ విశేషణం రుద్రుడి స్వభావానికి ముఖ్యమైనదని పేర్లు చెప్పకుండా విశేష లక్షణాలు మాత్రం చెప్పి ఒక్కొక్క దేవతని ఒక్కొక్క మంత్రంలో స్తుతించిన 8.29 సూక్తంలోని అయిదో మంత్రం వల్ల తెలుస్తుంది ''శుచి, ఉగ్రుడూ, జలాష భేషజుడూ (రోగాలు తగ్గించే మందులు కలవాడూ) అయిన ఒకడు వాడియైన ఆయుధాన్ని చేతులో పట్టుకొని ఉంటాడు'' (తిగ్మ మేకో బిభర్తి హస్త ఆయుధం, శుచిరుగ్రో జలాషభేషజః). మరొక మంత్రం (7.46.3)లో కూడా రుద్రుడి పిడుగూ, మందులూ కలిపి చెప్పబడ్డాయి. రోగాలు తగ్గించే రుద్రుడు రుద్రులతోపాటు మాకు శాంతి కలిగించాలి (శం నో రుద్రో రుద్రేభి ర్జలాషః, 7.35.6) అనే ప్రార్థన కూడా ఉంది. రుద్రుడితోపాటు మరుత్తుల దగ్గరకూడా శుచియైన మందులు ఉన్నట్లు మరొక మంత్రం (2.33.13)లో చెప్పబడింది. ఇతర సంహితలలో కూడా (వా.సం. 3.59; 16.5.49; అ.వే. 2.27.6) రుద్రుడి జబ్బులు తగ్గించే శక్తి కొన్నిచోట్ల చెప్పబడింది; కాని ఈ ప్రసక్తి ఆయన హానికరస్వభావ ప్రసక్తికన్న చాలా తక్కువే. సూత్రగ్రంథాలలో పశువులకు రోగాలు పోగొట్టడానికీ రాకుండా చెయ్యడానికీ ఆయన యాగాలు చెయ్యాలని విధించబడింది (ఆశ్వలాయనగృహ్యసూత్రం 4.8.40; కౌశిక సూత్రం 51.7 మొ.).

28.10 ఋగ్వేదంలో చెప్పబడిన విషయాల వల్ల రుద్రుడికి ఏ ప్రకృతి పదార్థం ఆధారం అనేది స్పష్టంగా తెలియదు. ఆయన తుపానుకి సంబంధించిన ఒక దేవత అని సాధారణంగా అంటారు. ఇంద్రుడి భక్తుల శత్రువులను మాత్రమే హాని కలిగించే ఇంద్రుడి ఆయుధంలా కాక ఈయన ఆయుధం (అందరికీ) చెడు కలిగించేది. అందువల్ల మొదట్లో రుద్రుడు తుపాను అన్ని లక్షణాలకీ ప్రతీక కాక పిడుగు ద్వారా హానికలిగించడమనే దాని ఒక లక్షణానికి ప్రతీక అయినట్లు కనపడుతుంది. ఇలా చెప్పడం ఆయనకి భయంకరమైన ఆయుధాలు ఉండడానికీ, ఆయన తుపాను దేవతలయిన మరుత్తులకు తండ్రి లేక ముఖ్యుడు అవడానికీ అన్వయిస్తుంది; మరుత్తులకి మెరుపు ఆయుధమనీ వారు ''మెరుపు నవ్వునించి'' పుట్టేరనీ చెప్పబడింది (హస్కారా ద్విద్యుత స్పర్యతో జాతాః, 1.23.12). ఆయన శుభం కలిగించే శక్తీ, రోగనివారణశక్తీ, తుపానువల్ల వచ్చే సస్యసమృద్ధీ, పరిశుభ్రతల మీదా, ఆయన చంపకుండా వదిలిపెట్టడమనే పరోక్షక్రియ మీదా ఆధారపడినవి కావచ్చు. ఆయనని కోపం చూపెట్టవద్దని చేసే ప్రార్థనలవల్ల ఆయనకి న్యూనతని తొలగించే శివ- 'శుభం కలిగించేవాడు' అనే విశేషణం ఏర్పడింది; ఇది వేదాల తరవాత కాలపు ఇతిహాసాలలో

రుద్రుడికి ప్రచురమైన పేరు అయింది. ఋగ్వేదంలో రుద్రుడికి అగ్నితో సన్నిహిత సంబంధం ఉందనే విషయానికి కూడా పై వివరణ అనుకూలంగానే ఉంటుంది.

28.11 వెబర్(Weber) అభిప్రాయం ప్రకారం ఈ దేవత మొదట్లో తుపాను చేసే ధ్వనికి ప్రతీక (అందువల్లనే దీని బహువచన రూపం (= రుద్రాః) ''మరుత్తులు'' అనే అర్థం ఇస్తుంది); కాని నిప్పు చేసే ధ్వని కూడా ఇటువంటిదే కాబట్టి కోపమూ నాశనం చేసే స్వభావమూ కల ఈ దేవతకి తుపానూ, నిప్పూ రెండూ ఆధారాలే; శతరుద్రియం (= నమకం) లో చెప్పబడిన విశేషణాలు కొన్ని తుపానే రుద్రుడనే భావంవల్లా, మరికొన్ని అగ్నే రుద్రుడు అనే భావంవల్లా ఏర్పడినవి. హెచ్.హెచ్. విల్సన్(Wilson) రుద్రుడు ''స్పష్టంగా అగ్నియొక్క లేక ఇంద్రుడి యొక్క రూపాంతరం'' అన్నారు. ఎల్.వి. ష్రోడర్ (Schroeder) తుపాను సమయంలో గాలితోపాటు వచ్చేటట్టు భావించబడిన మృతుల ఆత్మలలో ముఖ్యుడే రుద్రుడు అన్నారు (చూ. అధ్యాయం 29.13). మనుష్యులని వేధించే రోగాలు అనే బాణాలకి ఉత్పత్తి స్థానాలైన కొండలకీ అడవులకీ మొదట్లో అధిదేవతగా ఉన్నవాడే రుద్రుడు అని ఓల్డెన్‌బెర్గ్ (Oldenberg) అభిప్రాయం.

28.12 రుద్రశబ్దం వ్యుత్పత్తికి అర్థం విషయంలో కొంత అస్పష్టత ఉంది. అన్ని ప్రాచీన భారతీయ గ్రంథాలలోనూ ఇది రుద్- 'అరుచు, ఏడ్చు' అనే ధాతువునించి ఏర్పడినట్లు చెప్పబడింది.[4] గ్రాస్మన్(Grassmann) ఇది 'ప్రకాశించు' అనే అర్థంగల రుద్- ధాతువు నించి వచ్చిందని ఊహించారు (ఈ ధాతువుకి ఈ అర్థం కేవలం ఊహాత్మకమే); పిషెల్ (Pischel) దీనికి 'ఎర్రగా ఉండు' అనే అర్థం ఇచ్చారు. వీరి అభిప్రాయాల ప్రకారం రుద్రశబ్దానికి అర్థం 'ప్రకాశించేవాడు' / 'ఎర్రనివాడు'.

---

4. ఈ వ్యుత్పత్తి మొట్టమొదటసారిగా తైత్తిరీయసంహిత (1.51.1) లోనే ఇవ్వబడింది; సోఽరోదీత్యదరోదీత్ తద్రుద్రస్య రుద్రత్వం'' ఆయన ఏడ్చాడు; ఏడ్చాడు కాబట్టి రుద్రుడికి రుద్రత్వం (వచ్చింది).'' (చూ. శ.బ్రా. 6.1.3.10). యాస్కుడూ (నిరుక్తం 10.5), సాయణుడూ (1.114.1 వ్యాఖ్య) దీన్ని ఉట్టంకించి ఇటువంటివే మరికొన్ని అర్థాలు చెప్పేరు. యాస్కుడు కొత్తగా చెప్పినవి: రౌతీతి సతః (రు- 'అరుచు' అనే ధాతువు), రోరూయమాణో ద్రవతీతి వా 'అరుస్తూ పరిగెడతాడు', రోదయతేర్వా 'ఏడిపిస్తాడు'. సాయణుడు చెప్పినవి: రుత్ ''సంసారమనే దుఃఖం/ చీకటి మొ.'', దాన్ని ద్రావయతి/ దృణాతి 'పోగొడతాడు'; రుత్ '' ఉపనిషత్తులు/ విద్య''; వాటివల్ల తెలుసుకోబడతాడు (దూయతే) / వాటిని ఇస్తాడు (రాతి)''.

# 29. మరుత్తులు

29.1 మరుత్తులు (ప్రాతిపదక మరుత్-; ప్రథమా/ ద్వితీయా బహువచనం మరుతః) ఋగ్వేదంలో ప్రాముఖ్యంగల దేవతలు. అందులో వీరికి మాత్రమే ముప్పైమూడు సూక్తాలు ప్రత్యేకించబడి ఉన్నాయి; ఇవికాక అథమపక్షం ఏడు ఇంద్రుడికీ వీరికీ కలిపి ఉద్దేశించబడినవి; వీరిని అగ్నితో కలిపి స్తుతించినది మరొకసూక్తమూ, పూషుడితో కలిపి స్తుతించినది ఇంకొకసూక్తమూ ఉన్నాయి. ఈపదం ఎప్పుడూ బహువచనంలోనే వస్తుంది; వీరు ఒకసముదాయం అని సూచించడానికిగణ- (ఇది సాధారణంగా వీరికే ఉపయుక్తం), శర్ధస్- (1.37.1, 5, మొ.) శబ్దాలు వాడబడ్డాయి. వీరి సంఖ్య మూడు అరవైలు (8.96.8) లేక మూడు ఏళ్లు (1.133.6; అ.వే. 13.1.13). వీరి పుట్టుక తరచు చెప్పబడింది (5.57.3, మొ.). వీరు రుద్రుడి కొడుకులు (అధ్యాయం 28.4); అందువల్ల వీరికి రుద్రాః రుద్రులు' (1.39.4, 7, మొ.), రుద్రియాః (1.38.7; 2.34.10; మొ.) అనే పదాలు కూడా వాడబడ్డాయి. వీరి తల్లి పృశ్ని (2.34.2; 5.52.16; 5.60.5; 6.66.3) అవడం వల్ల వీరికి పృశ్నిమాతరః 'పృశ్ని తల్లిగా కలవారు' (1.23.10. మొ.; అ.వే. 5.21.11). వీరి తల్లి పృశ్ని అనే గోవు (5.52.16) లేక సంగ్రహంగా గోవు (8.94.1); అందువల్ల గోమాతరః 'గోవు తల్లిగా కలవారు' అనే విశేషణం కూడా వీరికి వాడబడింది (1.85.3; చూ. 8.20.8). ఈ గోవు రంగురంగు మచ్చలుగల తుఫాను మేఘమే అయి ఉంటుంది (అధ్యాయాలు 43, 61 (ii)). పెద్ద పొదుగులు గల (రప్శదూధభిః) వెలిగే ఆవులతో (ఇంధన్వభి ర్ధేనుభిః, 2.34.5) వీరు వస్తారు అన్నప్పుడు ఉద్దిష్టమైనవి వాన నీరూ మెరుపులతో కూడిన మేఘాలేకాని వేరు కాదు. పృశ్నినించి పుట్టినప్పుడు మరుత్తులు నిప్పులతో పోల్చబడ్డారు (6.61.1-3). వారు మెరుపు యొక్క నవ్వునించి పుట్టినట్లు కూడా చెప్పబడింది (1.23.12; చూ. 1.38.8). అగ్ని వారిని తయారు చేసినట్లు/ పుట్టించినట్లు చెప్పబడింది (6.3.8; 1.71.8). ఒకచోట (1.134.4) వాయువు వారిని స్వర్గం యొక్క గర్భాలలో పుట్టించాడని ఉంది; వారు స్వర్గం పుత్రులనీ (10.77.2), స్వర్గంలోని వీరులనీ (1.64.4; 1.122.1; 5.54.10), స్వర్గంలోని మగవారు (మర్యాః, 3.54.13; 5.59.6) అనీ ఉంది. ఒకచోట (10.78.6; చూ. అధ్యాయం 21.8) వారు సింధుమాతరః 'నది/ సముద్రం తల్లిగా కలవారు' అని చెప్పబడ్డారు. ఇతరత్రా (1.168.2; 5.87.2) వారు స్వయంగా పుట్టినవారు (జాతాః..... స్వయం) అని ఉంది.

29.2 వారు సోదరులు, సమాన వయస్కులు (సవయసః, 1.165.1) అవడం వల్ల వారిలో పెద్ద చిన్నా భేదం లేదు (5.59.6; 5.60.5). వారు కలిసి పెరిగేరు (5.56.5; 7.58.1); సమాన మనస్కులు (సమన్యవః, 8.20.1, 21). వారి జన్మస్థానము ఒకటే (5.53.1); నివాసమూ (1.165.1; 7.56.1) ఒకటే. వారు భూమి మీదా, అంతరిక్షంలోనూ, స్వర్గంలోనూ పెరిగినట్లూ (5.55.7), మూడు స్వర్గాలలో నివసించినట్లూ (5.60.6) ఉంది. ఒకచోట (8.94.12) వారు కొండలమీద నివసిస్తారని ఉంది (మారుతంగణంగరిష్ఠాం).

29.3 వారికి దేవతాస్త్రీలైన ఇంద్రాణి (ఈమె వారి సఖి, ఇంద్రపత్నీ మరుత్సఖా, 10.86.9). సరస్వతులతో (7.96.2; చూ. 7.39.5) సాహచర్యం ఉంది. కాని వారికి రోదసి (రోదసీ-) అనే దేవతాస్త్రీతో ఉన్న సంబంధం చాలా సన్నిహితమైనది; ఆమె వారి రథం మీద ఆనందాలని (సురణాని = ★ జలాలలని అని సాయణుడు) పట్టుకొని ఉంటుంది (5.56.8); ఆమె వారి దగ్గర ఉంటుంది (6.66.6). ఆమె పేరు వచ్చిన అయిదు మంత్రాలలోనూ, ఆమె వారితోపాటు కలిపి చెప్పబడింది (చూ. 1.167.4, 5). అందువల్ల ఆమె వారి భార్య అయినట్లు (అశ్వినులకు సూర్యలా) తోస్తుంది. ఈ సంబంధం వల్లనే వారికి భద్రజానయః 'అందమైన భార్య కలవారు' (5.61.4) అనే విశేషణం వచ్చి ఉండవచ్చు (★ దీనికి 'స్తుతించదగిన జన్మకలవారు' అని సాయణుడి అర్థం); వీరిని వరులతో పోల్చడానికీ (వరా ఇవ, 5.60.4), యువకులైన పెండ్లికొడుకులతో పోల్చడానికీ (శిశూలా నక్రీళయః, 10.78.6, ★ శిశువులలా క్రీడించేవారు అని మాత్రమే దీని అర్థం) ఇదే కారణం కావచ్చు.

29.4 మరుత్తుల ప్రకారం తరచు చెప్పబడింది. వారు బంగారురంగు కలవారు, సూర్యుడి వంటి ప్రకాశం కలవారు, మండేమంటలవంటివారు, ఎర్రని రంగు కలవారు (6.66.2; 7.59.11; 8.7.7). వారు అగ్నిజిహ్వలలా ప్రకాశిస్తారు (అగ్నీనాం నజిహ్వా విరోకిణః, (10.78.3). వారు అగ్ని రూపం/ప్రకాశం కలవారు (10.84.1; 3.26.5); కాంతిలో వారు అగ్నితో పోల్చబడ్డారు (10.78.2). వారు అగ్నులవంటివారు (2.34.1), మండే అగ్నులవంటివారు (6.66.2); అగ్నులు అనే చెప్పబడ్డారు (3.26.4). వారు పాముల కాంతివంటి కాంతికలవారు (అహిభానవః 1.172.1; ★ దీనికి 'క్షీణించని కాంతి కలవారు' అని సాయణుడు). వారు పర్వతాలలో ప్రకాశిస్తూ ఉంటారు (వి పర్వతేషు రాజథ,

8.7.1). వారు స్వయం ప్రకాశశక్తి కలవారు (స్వభానవః, 1.37.2, మొ.); ఈ విశేషణం ఇంచుమించు వారికే ప్రత్యేకంగా వాడబడింది. ఇంతకన్న సాధారణంగా వారు ప్రకాశంతో ఉంటారని తరచు చెప్పబడింది (1.165.12, మొ.)

29.5 వారికి ముఖ్యంగా విద్యుత్తు 'మెరుపు/పిడుగు'తో సంబంధం ఉంది (5.54.2, 3, 11; 1.64.5). మరుత్తులు భూమిలో ఘృతాన్ని (= నీళ్లని) పోసినప్పుడు విద్యుత్తులు కిందకి (చూసి) నవ్వుతాయి (అవ స్మయంత విద్యుతః పృథివ్యాం యదీ ఘృతం మరుతః ప్రుష్ణువంతి, 1.168.8; చూ. 5.52.6). వీరివల్ల వర్షం వచ్చినప్పుడు దూడని పిలిచే తల్లిలా విద్యుత్తు శబ్దం చేస్తుంది (1.38.8). వారు వర్షాలతో కూడిన విద్యుత్తులలా ప్రకాశిస్తారు (7.56.13). ఋగ్వేదంలో 'విద్యుత్' అనే పదం ఉన్న అయిదు సమాసాలూ మరుత్తులకే సంబంధించినవి అవడం వల్ల మెరుపుకీ వారికీ ప్రత్యేక సంబంధం ఉందని తెలుస్తుంది; ఇటువంటి సమాసం ఒక్కచోట మాత్రం మరుత్తులతో పాటు ఇతర దేవతలకి కూడా సంబంధిస్తుంది. వారు మెరుపు చేతిలో కలవారు (విద్యుద్ధస్తాః, 8.7.25; 5.54.11); విద్యుత్తేజస్సు కలవారు (విద్యున్మహసః), రాయి ఆయుధంగా కలవారు (అశ్మదిద్యవః, 5.54.3; ★రాయి = పిడుగు). వారి ఈటెలని (ఋష్టి-) లని గురించి ప్రసక్తి తరచుగా ఉంది; ఈ ఈటెలు మెరుపులే అని వారికి వాడబడిన 'ఋష్టి విద్యుత్' 'మెరుపు అనే ఈటె కలవారు' అనే విశేషణం వల్ల తెలుస్తుంది (1.168.5; 5.52.13). ఇంతకన్న కొంచెం తక్కువ తరచుగా వీరి ఆయుధం గొడ్డలి (స్వధితి-) అని చెప్పబడింది (1.88.2; 5.33.4; 5.57.2; 8.20.4); అది బంగారపుది (హిరణ్యవాశీభిః, 8.7.32). ఒకచోట (8.7.32) వారు వజ్రహస్తులని కూడా చెప్పబడింది; వజ్రం ఇంద్రుడి ప్రత్యేకాయుధం (★వజ్రహస్త- అనేదానికి 'వజ్రం వంటి (గట్టి) చేతులు కలవారు' అని అర్థం చెప్తే ఈ వైరుధ్యం తొలగుతుంది). కొన్నిచోట్ల (5.53.4; 5.57.2; 8.20.4, 12) వారికి విల్లూ, బాణాలూ ఉన్నట్లు చెప్పబడింది (సుధన్వాన ఇషుమంతః); ఒకచోట వారు బాణాలు వేసే విలుకాండ్రు అని కూడా చెప్పబడ్డారు. కాని ఈ లక్షణం వారిని ఉద్దేశించిన అనేక సూక్తాలలో చాలా అరుదుగానే చెప్పబడింది కాబట్టి ఇది వారికి వారి తండ్రి అయిన రుద్రుడినించి సంక్రమించినది కావచ్చు. వారికి దండలూ, ఇతరమైన ఆభరణాలూ ఉన్నాయి (5.53.4). వారు బంగారు కవచాలు తొడుక్కొంటారు (5.55.6). ధనికులైన పెళ్లికొడుకులలా (వరా ఇవేద్రైవతాసః) వారు బంగారు ఆభరణాలతో తమ శరీరాలని

అలంకరించుకొంటారు (5.60.4). చేతి కడియాలూ, కాలి అందెలూ (ఖాదీ-) వారికి ప్రత్యేకమైన ఆభరణాలు (5.53.4; ★ఖాది శబ్దానికి పై రెండు అర్థాలూ ఉన్నాయి). వీటితో వారు నక్షత్రాలు ఉన్న ఆకాశంలా మేఘాలలో నీరులా ప్రకాశిస్తూ ఉంటారు (2.34.2). ఒక మంత్రంలో వారి ఆకారం సాధారణంగా చెప్పే దానికన్న వివరంగా వర్ణించబడింది: వారికి బుజాలమీద ఈటెలూ, కాళ్లకి అందెలూ, వక్షఃస్థలాల మీద బంగారు హారాలూ, రథంమీద నీరూ, చేతులలో అగ్నికాంతిగల విద్యుత్తులూ, తలలమీద పెద్ద బంగారు తలపాగాలూ ఉంటాయి.[1]

29.6 మరుత్తులు మెరుపులతో మెరిసే రథాలమీద వస్తారు (1.88.1; 3.54.13); అవి బంగారపువి (5.57.1); వాటి చక్రాలు బంగారపువి (1.64.11; 1.88.5); వాటిలో ఆయుధాలు ఉంటాయి (5.57.6); వాటిలోని పాత్రలలోంచి నీళ్లు కారుతూ ఉంటాయి (శ్చోతంతి కోశా ఉప వో రథేషు, 1.87.2). ఆ రథాలని లాగే గుర్రాలు ఎర్రనివి/గోధుమ రంగువి (1.88.2; 5.57.4); బంగారు గిట్టలు గలవి (8.7.27), మనోవేగం కలవి (1.85.4). వీరికి మాత్రమే కొంతతరచుగా వాడబడిన పృషదశ్వ- 'మచ్చలుగల గుర్రాలు కలవారు' అనే విశేషణం వల్ల వీరి గుర్రాలకు మచ్చలు ఉంటాయని తెలుస్తుంది. ఇంతకన్న తరచుగా వీరి గుర్రాలు ఆడవి (పృషతీః, 1.39.6, మొ.) అని చెప్పబడింది; కాని రెండు మంత్రాలలో (5.55.6; 5.58.6) ఇవి మగవి (అశ్వాః) అని ఉంది.[2] వీరి రథం కాడికి గాలులు అనే అశ్వాలని కట్టినట్లు కూడా ఉంది (5.58.7; వాతాన్...అశ్వాన్).

29.7 మరుత్తులు ఆకాశంలా గొప్పవారు (5.57.4); వారు భూమ్యాకాశాలకన్న అధికులు (10.77.3); వారిగొప్పతనం కొలవలేనిది (5.58.2); వారికున్నంత శక్తి మరి

---

1. అంసేషు వ ఋష్టయః పత్సు ఖాదయో
వక్షఃసు రుక్మా మరుతో రథే శుభః
అగ్నిభ్రాజసో విద్యుతో గభస్త్యోః
శిప్రాః శీర్షసు వితతా హిరణ్యయీః (5.54.11)

2. పై రెండు మంత్రాలలోనూ పుంలింగమైన అశ్వశబ్దమూ, స్త్రీలింగమైన పృషతీ శబ్దమూ రెండూ కలిసే వచ్చాయి (అశ్వాన్.....పృషతీః; పృషతీభి రశ్వైః). అందువల్ల ఇక్కడ నిజంగా వైరుధ్యం ఉండడానికి అవకాశం లేదు. దీనికి సాయణుడు (5.58.6 వ్యాఖ్య) సరియైన వివరణ ఇచ్చారు: ఇక్కడ అశ్వశబ్దం 'వాహనం' అనే సామాన్యార్థంలో వాడబడింది; అందువల్ల అది పుంలింగంలో ఉంది (అశ్వశబ్దో ఽత్ర వాహనసామాన్య వచనః; అతః పుంలింగతా).

ఎవ్వరికీ లేదు (1.167.9). వారు యువకులు (1.64.2; 1.165.2; 5.42.15), ముసలితనం లేనివారు (1.64.3). వారు దివ్యులు (అసుర-) వేగంకలవారు, మట్టీ (1.64.2, 12), దుమ్మూ (6.66.2) లేనివారు. వారు భయంకరమైనవారు (1.19.4), కోపంకలవారు (7.56.8), భయకంరమైన స్వభావమూ (5.56.2, 3; 7.58.2), రూపమూ (1.19.5; 1.64.2) కలవారు. వారు అడవి జంతువులలా భయంకరమైనవారు (2.34.1; చూ. అధ్యాయం 28.6). వారు పిల్లలు, దూడలలా క్రీడించే స్వభావం కలవారు (1.166.2; 7.56.16; 10.78.6). వారు నీలిరంగు వీపులుగల హంసలు (హంసాసో నీల పృష్ఠాః, 7.59.7); ఇనపకోరలు గల పందులు (అయో దంష్ట్రాన్.... వరాహూన్, 1.88.5); వారు సింహాలలా అరుస్తారు (సింహా ఇవ నానదతి, 1.64.8).

29.8 వారుచేసే చప్పుడు తరచు చెప్పబడింది (1.169.7, మొ.); అది ఉరుము (తన్యతుః) అని వాచ్యంగానే చెప్పబడింది (1.23.11); కాని అది గాలులు చేసే శబ్దం కూడా (వాతస్వనసః, 7.56.3). వారు వచ్చినప్పుడు ఆకాశం భయంతో అరుస్తుంది (8.7.26). వారి వల్ల కొండలు కదులుతాయనీ, భూమి/రెండు లోకాలూ కంపిస్తాయనీ తరచు వర్ణించబడింది. వారి రథచక్రాలతో వారు కొండలని/పెద్దరాయిని బద్దలు కొడతారు (1.64.11; 5.52 9). గాలులతో వారు వచ్చినప్పుడు కొండలు కదులుతాయి (8.7.4). వారు చెట్లని చీలుస్తారు (1.39.5); అడవి ఏనుగులలా అడవులని తినేస్తారు (మృగా ఇవహస్తినః ఖాదథావనా, 1.64.7). వారంటే భయంవల్ల అడవులు వంగుతాయి (5.60.2). పర్వతాలలా ఎదురులేని వారైవారు భూమిమీదా స్వర్గంలోనూ ఉన్న ప్రాణులని అథఃకరిస్తారు (1.64.3). అన్ని ప్రాణులకీ వారంటే భయం (1.85.8). చప్పుడు చేసేగాలులలా వారు వేగంగా ప్రయాణిస్తారు (10.78.3); దుమ్మురేపుతారు (1.64.12). వారుగాలులని/గాలుల ధ్వనిని సృష్టిస్తారు (7.56.3); గాలులతో వస్తారు (8.7.3, 4, 17); గాలులని గుర్రాలుగా ఉపయోగిస్తారు (5.58.7).

29.9 మరుత్తుల ముఖ్య కృత్యాలలో వానకురిపించడం ఒకటి. వారికి వానే బట్ట (/రూపం, వర్షనిర్ణిజః, 5.57.4). వారు సముద్రంలోంచి పుట్టిన వాన కురిపిస్తారు (1.38.9). ఎండిపోని బావిలోంచి పితుకుతూ రెండు లోకాలనీ నీటితో తడుపుతారు (1.64.6; 8.7.16). వానవారిని అనుసరిస్తుంది (5.53.10). నీటిని ధరించినమరుత్తులు వానకురిపిస్తారు (5.58.3). వారి కాంతిని వానతో తగ్గించుకొంటారు (5.59.1). వారు

సూర్యుడికన్ను వానలతో కప్పుతారు (సూర్యస్య చక్షుః ప్రమినంతి వృష్టిభిః, 5.59.3). వారు వానకురిపించేటప్పుడు మేఘంతో పగటినే చీకటిగా చేస్తారు (దివాచిత్తమః, కృణ్వంతి, 1.38.9). వారు వాయువులతో వెళ్లేటప్పుడు మంచు కురిపిస్తారు (8.7.4). వారు ఆకాశంలోని పాత్రనీ (దివః కోశం, 5.53.6; 5.59.8), పర్వతాలలోని ప్రవాహాలనీ (5.59.7) నీరు వదిలేటట్లు చేస్తారు. వారు వేగంగా వెళ్తూంటే నీళ్లు ప్రవహిస్తాయి (5.58.6). వీరి ఈ పనివల్లనే భూమిమీదఉన్న మరుద్వృధా 'మరుత్తులవల్ల వృద్ధిపొందినది' అనే నదికి ఆ పేరు వచ్చింది (10.75.3). రుద్రుడి కొడుకులు (= మరుత్తులు) తమ చెమటనే వర్షంగా చేశారు (వర్షం స్వేదం చక్రిరే రుద్రియాసః, 5.58.7). మరుత్తులు కురిపించే వాన లాక్షణికంగా పాలు (పయస్-, 1.166.3) అనీ, నెయ్యి (ఘృత-, 1.85.3; 10.78.4) అనీ, పాలూ, నెయ్యీ (1.64.6) అనీ చెప్పబడింది; వారు నీటి ఊటని (అవత-, 1.85.11) కిందకిపోస్తారు; నేలని తేనె (మధు-) తో తడుపుతారు (5.54.8). వారు నీటిని సముద్రంనించి ఆకాశానికి ఎత్తి ఆకాశం మీదనించి భూమిమీదకి పోస్తారు (అపః సముద్రాద్దివ ముద్వహంతి, దివస్పృథివీ మభి యే సృజంతి, అ.వే. 4.27.4). వారు కురిపించే వాన తరచుగా తుపానుకి సంబంధించినది అనేది స్పష్టం. నీళ్లు ఇవ్వాలి అనుకొని వారు వడగళ్లు కురిపిస్తూ భీకరంగా వేగంగా విద్యుత్తులతో వస్తారు (5.54.3). వారు వారి శక్తివల్లగాలులూ మెరుపులూ పుట్టించి, పాదుగునించి దివ్యమైనబహుమతులు పితికి, నేలని పాలతో నింపుతారు (1.64.5). వారు పితికే నీటి ఊట ఉరుముతుంది (ఉత్సందుహంతి స్తనయంత మక్షితం, 1.64.6). వారు వానకురిపించేటప్పుడు ఆకాశం అనే ఎర్రని ఎద్దు అరుస్తుంది (5.58.6). వారు గుర్రాన్ని నీళ్లు వదిలేటట్లు చేస్తారు (1.64.6). స్వర్గపు వృష్టిని అనుగ్రహిస్తూ వారు గుర్రానికి సంబంధించిన ప్రవాహాలని ధారాళంగా కురిపిస్తారు (5.83.6). వారుగుర్రంతోపాటు వానకురిపించేటప్పుడు బంగారు రంగులో ఉంటారు (2.34.13). వారుమేఘశబ్దాన్ని పుట్టించినప్పుడు ప్రవాహాలు మరుత్తుల చక్రాలతో ప్రతిధ్వనిస్తాయి (1.168.8). ఇంద్రుడు కురిపించే నీళ్లు మరుత్వతీః 'మరుత్తులు కలవి' అని చెప్పబడ్డాయి (1.80.4). వారికున్న నీటిని కురిపించే లక్షణం వల్ల వారికి పురుద్రప్సః (5.57.5) / ద్రప్సినః (1.64.2) '(చాలా నీటి) బిందువులు కలవారు', సుదానవః 'బాగా వర్షించేవారు (ఈ చివరిది చాలా తరచు) అనే విశేషణాలు ఉన్నాయి. వారు వేడి తగ్గిస్తారు (5.54.1); చీకటి పోగొడతారు (7.56.20), కాంతి పుట్టిస్తారు

(1.86.10); సూర్యుడికి మార్గం ఏర్పరుస్తారు (సృజంతి.....పథాం సూర్యాయ, 8.7.8). వారు అంతరిక్షాన్ని కొలిచారు (5.55.2); భూప్రదేశాలనీ ప్రకాశించే స్వర్గప్రదేశాలనీ విశాలం చేశారు; రెండు భువనాలనీ విడదీసి ఉంచారు (8.94.9, 11).

29.10 కొన్నిచోట్ల మరుత్తులు గాయకులు అని చెప్పడం గాలిచేసే శబ్దానికి స్మారకం అనడంలో సందేహం లేదు (5.52.1; 5.60.8; 7.35.9). వారు స్వర్గంలోని గాయకులు (దివో అర్కాః, 5.57.5). వారు పాట పాడేరు (అర్క మానృచుః, 1.19.4; 1.166.7).[3] వారు పాడుతూ సూర్యుణ్ణి ప్రకాశించేటట్లు చేశారు (8.29.10; ★అర్చంతః = పూజిస్తూ, అని సాయణుడు). వారు 'వాణం' అనే వీణవంటి వాద్యాన్ని వాయిస్తూ (ధమంతో వాణం), ధ్వనులు చేశారు (రణ్యాని చక్రిరే); పర్వతాన్ని చీల్చారు (బిభిదుర్వి పర్వతం, 1.85.10). ఇంద్రుడు పాముని చంపినప్పుడు వారు ఆయన కోసం సోమం పిండి స్తుతించారు (అర్చన్, 5.29.2; 5.30.6). వారు పాట పాడుతూ (★పూజించదగిన ఇంద్రుణ్ణి పూజిస్తూ- సాయణుడు) ఇంద్రుడి శక్తి పుట్టించారు (అర్చంతో అర్కం జనయంత ఇంద్రియం, 1.85.2). గాలుల శబ్దమే పాట అని చెప్పబడినా (చూ. నోనువంత వాతాః 'గాలులు ఎక్కువగా శబ్దం చేశాయి', 4.22.4); అది స్తుతించే మంత్రంగా కూడా ఊహించబడింది (విశ్వే మరుతః సుమ్న మర్చన్ 'మరుత్తులంతా స్తోత్రం(తో) అర్చించారు', 3.14.4). అందువల్ల వారు ఇంద్రుడితో కూడి ఉన్నప్పుడు 'పురోహితులైన మరుత్తులారా!' (బ్రహ్మాణో మరుతః, 5.29.3) అని సంబోధించబడ్డారు; పురోహితులతో పోల్చబడ్డారు (విప్రాసోన 'విప్రులలాగా', 10.78.1). దశగ్వులు అనబడే అంగిరసుల రూపంలో వారే మొట్టమొదట యజ్ఞం చేశారు (తే దశగ్వాః ప్రథమా యజ్ఞ మూహిరే, 2.34.12). భృగువులు స్తుతులతో అగ్నిని ప్రజ్వరిల్లజేస్తూ ఉండగా యజమాని గృహంలో మరుత్తులు అగ్నిని శుద్ధిచేశారు (త్వాం మర్జయన్ మరుతో దాశుషో గృహే, 10.122.5). వారు కూడా మిగిలిన దేవతలలాగే సోమం తాగుతారని కొన్నిచోట్ల చెప్పబడింది (2.36.2; 8.94.9-12), మొ.)

29.11 మరుత్తులకి తుపానుతో సంబంధం ఉండడం వల్ల సహజంగానే వారు ఇంద్రుడికి

3. సాయణుడు పైవాటిలో మొదటి మంత్రంలో అర్కం = ఉదకం అని అర్థం ఇచ్చి ఉదకాన్ని పూజించారు (= సంపాదించారు) అని వివరించారు. రెండో మంత్రంలో అర్కం = అర్చించదగినవాడైన ఇంద్రుణ్ణి, అర్చంతి = పూజిస్తారు అని అర్థం ఇచ్చారు.

సహచరులై ఆయనకి మిత్రులనీ యుద్ధంలో సహాయం చేసేవారనీ అనేక మంత్రాలలో చెప్పబడ్డారు. వారు ఆయన బలాన్నీ సామర్థ్యాన్నీ వారి ప్రార్థనలతోనూ, సూక్తాలతోనూ, పాటలతోనూ (1.165.11, మొ.) ఎక్కువ చేస్తారు (3.35.9; 6.17.11). వారు సాధారణంగా ఇంద్రుడికి వృత్రయుద్ధంలో సహాయం చేస్తారు (8.76.2, 3; 10.113.3). వారు త్రితుడికీ ఇంద్రుడికీ వృత్రుణ్ణి చంపడంలో సహాయం చేస్తారు (8.27.24). వారు ఇంద్రుడికోసం వృత్రుణ్ణి చంపే బృహత్సామం పాడమని ప్రార్థించబడ్డారు (బృహ దింద్రాయ గాయత మరుతో వృత్రహంతమం, 8.89.1-3). వారు ఇంద్రుడికి పాముతోనూ శంబరుడితోనూ వచ్చిన యుద్ధంలో సహాయం చేశారు (3.47.3, 4). వారి సహాయంతో ఇంద్రుడు కాంతిని సాధించాడు (8.76.4), గోవులని వెతికి పట్టుకొన్నాడు (1.6.5), ఆకాశాన్ని నిలబెట్టేడు (7.47.5). నిజానికి ఇంద్రుడు వారి సహాయంతోనే స్వర్గంలోని సాహసకృత్యాలన్నీ చేశాడు (1.100; 1.101; 1.165; 10.65 సూక్తాలు). కొన్నిచోట్ల ఈ కృత్యాలు మరుత్తులే ప్రధానంగా చేసినట్లు చెప్పబడింది: వారు ఇంద్రుడి సహాయంతో వృత్రుణ్ణి కొట్టేరు (1.23.9). వారే (ఇంద్రుడి సహాయం లేకుండా) వృత్రుడి శరీ సంధులు చీల్చినట్లూ (వి వృత్రం పర్వశో యయుః, 8.7.23), గోవులని వెతికి పట్టుకొన్నట్లూ (2.34.1) చెప్పబడింది. (దేవతలందరికిలాగే) వారికీ ఇంద్రుడు ముఖ్యుడు (ఇంద్రజ్యేష్ఠా మరుద్గణాః, 1.23.8, మొ.), వారితో కలిసి ఇంద్రుడు కూడా వస్తాడు (ఇంద్రవంతో మరుతః, 10.128.2). వారు ఇంద్రుడికి పుత్రులవంటివారు (1.100.5); ఇంద్రుడికి సోదరులు (1.170.2). కాని మరుత్తులు ఇంద్రుణ్ణి వదలివేసినట్లు రెండుమూడుచోట్ల చెప్పబడింది: వారు ఇంద్రుణ్ణి ఒక్కణ్ణే వృత్రవధకి నియోగించారు (1.165.6); వారు ఆయన్ని వదలివేశారు (★వారు ఆయన్ని ఎప్పుడూ వదలలేదు అనే అర్థమే ఇక్కడ సముచితం- కద్ధ నూనం కధప్రియో యదింద్ర మజహాతన, 8.7.31; చూ. అధ్యాయం 22.) ఒక మంత్రంలో ఇంద్రుడికీ మరుత్తులకీ విరోధం వచ్చినట్లు స్పష్టంగానే చెప్పబడింది (1.170.2); ఇందులో మరుత్తులు ఆయనతో ఇలా అంటారు: ''నీ భ్రాతలమైన మమ్మల్ని ఎందుకు చంపాలని అనుకొంటున్నావు? (కింన ఇంద్ర జిఘాంససి భ్రాతరో మరుతస్తవ); మమ్మల్ని యుద్ధంలో చంపకు (మా నః సమరణే వధీః).'' (చూ. 1.171.6). తై. బ్రా. లో కూడా ఒకచోట (2.7.11.1) మరుత్తులకీ ఇంద్రుడికీ వచ్చిన విరోధం ప్రసక్తి ఉంది.

29.12 ఇంద్రుడితో కలిపి చెప్పబడనిచోట్ల మరుత్తులకు హానికర లక్షణాలు ఉన్నట్లు అరుదుగా చెప్పబడింది. అటువంటి సందర్భాలలో వారి తండ్రి అయిన రుద్రుడికిలా వీరికీ హానికరస్వభావం ఉన్నట్లు చెప్పబడింది. పిడుగుని వారి భక్తుల మీదపడకుండా తప్పించాలనీ వారికోపం భక్తులను బాధించకూడదనీ వారు ప్రార్థించబడ్డారు (7.56.9). వారి బాణమూ, వారు వేసే రాయీ (1.172.2), వారి పిడుగూ (7.57.4), గోవులనీ మనుష్యులనీ చంపే వారి పిడుగూ (7.56.17) తప్పించమని వారు ప్రార్థించబడ్డారు. వారివల్ల చెడు జరగడానికి అవకాశం ఉంది (1.39.8); వారు కోపం చూపెట్టవద్దని ప్రార్థించబడ్డారు (1.171.1; 7.58.5). వారు పాముకి ఉండే కోపం వంటి కోపం కలవారు (అహిమన్యవః, 1.64.8, 9). కాని వారి తండ్రి అయిన రుద్రుణ్ణి ప్రార్థించినట్లు వారిని కూడా మందులు తెమ్మని ఋషులు ప్రార్థించారు (8.20.23-6); ఆ మందులు సింధునదిలోనూ, అసిక్నీనదిలోనూ, సముద్రాలలోనూ, పర్వతాల మీదా ఉంటాయి (యత్సింధౌ యదసిక్న్యాం యత్సముద్రేషు మరుతః సుబర్హిషః, యత్పర్వతేషు భేషజం, 8.20.25). ఒకచోట (2.33.13) వారికీ రుద్రుడికీ శుచియైనవీ (శుచీని), రోగాలు తగ్గించేవీ (శంతమా), సుఖం కలిగించేవీ (మయోభు) అయిన మందులు ఉన్నాయని చెప్పబడింది. మరుత్తులు నీరు అనే మందు వర్షిస్తారని ఉండడం వల్ల (ఆప ఉస్రిభేషజం, 5.53.14), ఈ మందులు నీరు అనుకోవడానికి అవకాశం ఉంది. అగ్నిలా వీరు కూడా పవిత్రులు, పవిత్రం చేసేవారు (పావకాః) అని కొన్నిచోట్ల చెప్పబడింది (7.56.12, మొ.).

29.13 మరుత్తులకి మెరుపు/పిడుగు, ఉరుము, గాలి, వానలతో ఉన్న నిత్యసంబంధం వల్లా, పైనచెప్పబడిన ఇతర లక్షణాల వల్లా వారు ఋగ్వేదంలో తుపానుకి సంబంధించిన దేవతలు అనేది స్పష్టం. ప్రాచీన వ్యాఖ్యాతల మతంలా మరుత్తులు గాలులకి ప్రతీకలు; వేదాల తరవాత సాహిత్యంలో ఈ పదానికి అర్థం 'గాలి' అని మాత్రమే. కాని ఋగ్వేదంలో వీరికి చెప్పబడిన లక్షణాలలో కొన్ని మేఘాలకీ మెరుపులకీ సంబంధించినవి కావడం వల్ల అందులో వీరు ఒక్క గాలులకి మాత్రమే ప్రతీకలు కాదు. ఎ. కూన్ (Kuhn), బెన్ఫే (Benfey) మరుత్తులు మృతుల ఆత్మలకి పురుషతారోపాలు అని అభిప్రాయ పడ్డారు (చూ. అధ్యాయం 28.11); ఈ అభిప్రాయం సారాంశాన్ని మెయెర్ (Meyer), వి. ష్రోడర్ (Schroeder) అంగీకరించారు. ఈ పరిణామం చారిత్రకంగా (★ అంటే బహుశా ఇతర ఇండో-యూరోపియన్ భాషలలో గాథల ఆధారంవల్ల అని అర్థం కావచ్చు) సాధ్యమే కాని

దీన్ని బలపరిచే ఆధారాలేవీ ఋగ్వేదంలో లేవు. 'మరుత్' శబ్దం వ్యుత్పత్తి అస్పష్టమవడం వల్ల మరుత్తుల గురించిన భావనల ప్రారంభదశని తెలుసుకోవడానికి అది ఉపకరించదు. ఇందులో ధాతువు మర్- అనేది కావచ్చు కాని దీని అర్థం 'చచ్చు', 'చితకగొట్టు', 'ప్రకాశించు' అనే వాటిల్లో ఏది అనేది నిర్ణయించడం అసాధ్యం. కాని పైవాటిలో చివర ఇచ్చిన అర్థం ఋగ్వేదంలో మరుత్తులని గురించి ఉన్న వర్ణనలకు మిగిలిన అర్థాల కన్న బాగా సరిపోతుంది.

## 30. వాయువు - వాతుడు

30.1 వాయువు (వాయు-), వాతుడు (వాత-) అని గాలికి వాడబడిన రెండు పేర్లూ ప్రకృతి పదార్థాన్నీ దేవతాత్మకమైన పురుషతారోపాన్నీ కూడా సూచిస్తాయి. కాని వాయువు ముఖ్యంగా దేవత; వాతుడు ప్రకృతి పదార్థం. వాయువు ప్రత్యేకంగా ఒక పూర్తి సూక్తంలోనూ మరికొన్ని సూక్తభాగాలలోనూ స్తుతించబడ్డాడు; ఆయన ఇంద్రుడితో కలిపి సుమారు ఆరువేరు సూక్తాలలో స్తుతించబడ్డాడు. ఋగ్వేదం పదో మండలం చివర రెండు (168, 186) చిన్న సూక్తాలలో మాత్రమే వాతుడు స్తుతించబడ్డాడు. కొన్నిచోట్ల (6.50.12; 10.92.13) ఈ రెండు పేర్లూ ఒకే మంత్రంలో వచ్చాయి. ఈ ఇద్దరిలో వాయువు ఒక్కడు మాత్రమే దేవతగా ఇంద్రుడితో కలుస్తాడు అనేది వీరిద్దరికీ భేదం ఉందనడానికి ఒక ఉదాహరణ; ఇంద్రుణ్ణీ వాయువునీ కలిపి సూచించే 'ఇంద్రవాయూ' అనే దేవతాద్వంద్వం తరచు వాడబడింది. ప్రాచీన వ్యాఖ్యాతలు వేదాలలోని దేవతాత్రయం (అగ్ని, వాయువు/ఇంద్రుడు, సూర్యుడు) లో అంతరిక్షస్థానదేవతలందరికీ మూలరూపం వాయువు లేక ఇంద్రుడు అని చెప్పడం వల్ల వారి దృష్టిలో వీరిద్దరికీ ఎంత సాన్నిహిత్యం ఉందో తెలుస్తుంది (★ నిరుక్తకారుల మతంలో దేవతలు ముగ్గురే; తిస్ర ఏవ దేవా ఇతి నైరుక్తాః; అగ్నిః పృథివీస్థానః; వాయుర్వేంద్రో వాంతరిక్షస్థానః; సూర్యో ద్యుస్థానః- నిరుక్తం 7.5). వాతుడికి పురుషతారోపం తక్కువగా ఉండడం వల్ల ఆయన పర్జన్యుడితో (అధ్యాయం 31) మాత్రమే కలిపి చెప్పబడ్డాడు; తుపానుతో ఇంద్రుడికంటె పర్జన్యుడికి ఎక్కువ సంబంధం ఉంది. గాలికి సంబంధించిన ఈ ఇద్దరు దేవతలకీ వేరువేరు విశేషణాలు వాడబడ్డాయి; వాతుడికి ఉపయుక్తమైన విశేషణాలు ప్రకృతి లక్షణాలైన వేగాన్నీ, వినాశచర్యనీ సూచిస్తాయి.

0.2 వాయువు ఉత్పత్తిని గురించిన సూచనలు చాలా స్వల్పంగా ఉన్నాయి. రెండు

లోకాలూ ధనంకోసం ఆయన్ని పుట్టించాయి (రాయే ను యం జజ్ఞతూ రోదసీమే, 7.90.3). ఒకచోట ఈయన త్వష్టృ అల్లుడు (త్వష్టుర్జామాత రద్భుత, 8.26.21, 22) అని చెప్పబడింది కాని ఈయన భార్యపేరు లేదు (చూ. అధ్యాయం 38). పురుషసూక్తంలో ఈయన పురుషుడి ఊపిరి (ప్రాణం) (నించి పుట్టినట్లు చెప్పబడింది (ప్రాణా ద్వాయు రజాయత, 10.90.13). వాయువుకీ మరుత్తులకీ సంబంధం అరుదుగానే చెప్పబడింది. కాని ఆయన వారిని స్వర్గం గర్భాలలోంచి పుట్టించినట్లు ఒకచోట (1.134.4) చెప్పబడింది; ఆయన వారితోనూ, పూషుడితోనూ, విశ్వేదేవతలతోనూ కలిసివస్తాడు (1.142.12). ఆయన శరీరలక్షణాలు అస్పష్టంగా చెప్పబడ్డాయి. ఆయన అందమైనవాడు (దర్శత ''దర్శనీయుడా!'', 1.2.1); ఆయనా ఇంద్రుడూ ఆకాశాన్ని అంటేవారు (దివిస్పృశా), మనోవేగంకలవారు (మనోజువా), సహస్రాక్షులు (సహస్రాక్షా) (1.23.2-3). ఒకచోట (10.100.2.) ఆయన చప్పుడు చేసే వేగం కలవాడు (క్రందదిష్టయే) అని చెప్పబడ్డాడు. ఆయనకు ప్రకాశించే రథం ఉంది; దాన్ని ఎర్రని (రోహిత- / అరుణ-) గుర్రాల సముదాయం/ జంట లాగుతుంది. ఆ గుర్రాల సంఖ్య 99 (4.48.4), 100 లేక 1000 కూడా (4.48.5); అవి ఆయన ఇష్టానుసారంగా రథాన్ని లాగుతాయి. నియుత్వత్- '(గుర్రాల) సముదాయం కలవాడు' అనే విశేషణం వాయువుకీ, ఆయన రథానికీ తరచు వాడబడింది; ఇది ఇంద్రుడికీ, అగ్నికీ, పూషుడికీ, మరుత్తులకీ విడివిడిగా ఒకటి రెండు చోట్ల మాత్రమే వాడబడింది. ఇంద్రుడితోపాటు (4.46.2; 4.48.2; 7.91.5) వాయువు ప్రయాణించే రథంలో బంగారు ఆసనం (హిరణ్యవంధురం) ఉంది; అది ఆకాశాన్ని అంటుతుంది (దివిస్పృశం, 4.46.4). ఇతర దేవతలలాగే, వాయువుకి కూడా సోమం అంటే ఇష్టం; ఆయన సోమపానానికి తన సముదాయాలతో రమ్మని తరచు ప్రార్థించబడ్డాడు. అందులో ఆయనకి భాగం (ఇంద్రుడితోపాటు కూడా, 1.135.4) ముందుగా అర్పించబడుతుంది (త్వం హి పూర్వపా అసి, 4.46.1). ఇందుకు కారణం ఆయన దేవతలందరికంటె వేగంకలవాడు (శ.బ్రా. 13.1.2.7, మొ.) అవడం. సోమాన్ని మొట్టమొదటుగా తాగడానికి దేవతల మధ్య జరిగిన పందెంలో వాయువు మొదటివాడుగా ఇంద్రుడు రెండోవాడుగానూ సోమం ఉన్న గమ్యస్థానానికి చేరేరని ఐ.బ్రా. (2.25) లో ఒక కథ ఉంది. ఋగ్వేదంలో వాయువు సోమాన్ని రక్షిస్తాడని కూడా ఉంది (వాయుః సోమస్య రక్షితా, 10.85.5); ఆయనకు శుచిప- 'శుభ్రమైన (సోమాన్ని) తాగేవాడు' అనే ప్రత్యేకమైన విశేషణం ఉంది;

ఇది ఆయనతోపాటు ఇంద్రుడికి కూడా ఒకచోట వాడబడింది. ఆయనకు అమృతం ఇచ్చే ఆవు (సబర్దుఘా) తో సంబంధం ఉందని ఒకచోట (1.134.4) ఉంది. వాయువు కీర్తినీ, సంతానాన్నీ, గుర్రాలనీ, గోవులనీ, బంగారాన్నీ ఇస్తాడు (7.90.2, 6). ఆయన శత్రువులని పారదోల్తాడు (4.48.2); బలహీనులు ఆయన్ని రక్షించమని ప్రార్థిస్తారు (1.134.5).

30.3 గాలికి సాధారణ నామమైన వాతుడు వాయువుకన్న ఎక్కువ స్పష్టమైన పదజాలంతో స్తుతించబడ్డాడు. ఈ పేరు దీనికి ఆధారమైన వా- 'వీచు' ధాతువుతో కలిసి తరచుగా వాక్యాలలో వచ్చింది. ఈయన స్తుతి ఉన్న సూక్తాలలో ఒకటి (10.168) ఈయన్ని ఇలా స్తుతించింది. ఆయన చేసే శబ్దం అన్నిటినీ విరగ్గొడుతూ ఉరుముతూ పురోగమిస్తుంది; భూమిమీద దుమ్ము రేపుతూ ఆయన ప్రయాణిస్తాడు; ఆయన అంతరిక్షంలో తనతోవలలో తిరుగుతాడు; ఆయన ఒకరోజు కూడా విశ్రాంతి తీసుకోడు. మొదట పుట్టినవాడైన ఆయన నీళ్లకి మిత్రుడు; కాని ఆయన పుట్టినచోటు తెలియదు. ఈ దేవుడు వంగినచోట తిరుగుతాడు; ఆయన అరుపు వినపడుతుంది కాని ఆకారం కనపడదు (చూ. 1.164.44). ఆయన దేవతల ప్రాణం, ఆత్మ (చూ. 7.87.2; 10.92.13); ఆయన్ని హవిర్భాగంతో పూజిస్తారు.

30.4 రుద్రుడిలాగే వాతుడు మందులు ప్రసారం చేస్తాడు (వాత ఆ వాతు భేషజం, 10.186.1), జీవితాన్ని ఎక్కువ చేస్తాడు. ఆయన ఇంట్లో అమృతనిధి ఉంది (తేగృహేఽమృతస్యనిధిర్హితః, 10.186.3). గాలికి ఉన్న ఈ రోగ నివారణశక్తి దాని పరిశుద్ధిచేసే స్వభావమే అనేది స్పష్టం (చూ. అధ్యాయం 28.10). గాలి చురుకుదనం ముఖ్యంగా తుపానుకు సంబంధించినదిగా వర్ణించబడింది (4.17.12; 5.83.4; 10.168.1, 2). గాలి విసుర్లు మెరుపులు మెరిసేటప్పుడూ, సూర్యుడు మళ్లీ కనపడడానికి ముందూ ఉంటాయి కాబట్టి వాతుడు ఎర్రని కాంతులు పుట్టిస్తాడనీ (10.168.1), ఉషస్సులు ప్రకాశించేటట్లు చేస్తాడనీ (1.134.3) చెప్పబడింది. గాలివేగం దేవతల వేగానికీ (4.17.12; 5.41.3; 9.97.52), గాథలలోని గుర్రాల వేగానికీ (1.163.11; 4.38.3) ఉపమానంగా తరచు ఉపయోగించింది. ధాని ధ్వని కూడా తరచుగా చెప్పబడింది (4.22.4; 8.102.3; 10.168.1, 4). వాత శబ్దానికీ జర్మన్ సాహిత్యంలో తుపానుకీ యుద్ధానికీ సంబంధించిన ఒధిన్ (Odhin) లేక వొదన్ (Wodan) అనే దేవతల పేరుకీ సంబంధం ఉందనీ ఈ జర్మన్ శబ్దం పై రెండు శబ్దాలకీ మూలమైన ఒకే ప్రాతిపదికకి

నిష్పాదక ప్రత్యయం చేర్చడం వల్ల ఏర్పడిందనీ కొందరు అభిప్రాయపడ్డారు. కాని ఈ సంబంధం చాలా సందేహాస్పదమైనట్లు కనపడుతుంది.

## 31. పర్జన్యుడు

31.1 ఋగ్వేదదేవతలలో ఈయన చాలా అప్రధానుడు. ఈయన మూడు సూక్తాలలోనే స్తుతించబడ్డాడు; ఈ పేరు (పర్జన్య-) ముప్పైకన్న తక్కువసార్లే వచ్చింది. అథర్వవేదంలో ఒకసూక్తం (4.15) లో కూడా ఈయన స్తుతించబడ్డాడు; కాని అందులో మంత్రాలలో చాలాభాగం ఋగ్వేదంలోనివే. ఈకింది మంత్రాలలో పర్జన్య శబ్దానికి 'నీటిమేఘం' అనే సామాన్యార్థం మాత్రమే ఉన్నట్లు కనపడుతుంది. '' ఒకటేఅయిన ఈ ఉదకం రోజులలో పైకీకిందకీ వెళ్తుంది (సమానమేతదుదకముచ్చైత్యవచాహభిః); పర్జన్యులు ( = మేఘాలు) భూమికి జీవం కలిగిస్తాయి; అగ్నులు స్వర్గానికి ( = స్వర్గంలో వారికి) జీవం కలిగిస్తాయి (భూమిం పర్జన్యా జిన్వంతి దివం జిన్వంత్యగ్నయః; 1.164.51; ★ ఉచ్చైతి = ఉత్ చ ఏతి; సాయణుడి ప్రకారం జిన్వంతి = ప్రీణయంతి 'ప్రీతిని కలిగిస్తాయి'). మరుత్తులు ''భూమిని తడిపేటప్పుడు నీటినిమోసుకుపోయే మేఘంవల్ల (పర్జన్యేనోద వాహేన) పగలు కూడా చీకటిచేస్తారు'' (1.38.9); ''వారు స్వర్గం యొక్క / స్వర్గాన్నించి పాత్రని (దివఃకోశం) వదిలేరు; రెండు లోకాలలోనూ మేఘాన్ని (పర్జన్యం) వదులుతారు; వానలు పొడినేలకు వెళ్తాయి'' (5.53.6). బృహస్పతి మేఘాన్ని (పర్జన్యం) వర్షించేటట్టు చెయ్యమనీ (10.98.1), వృష్టిగల మేఘాన్ని ప్రేరించమనీ (ప్ర పర్జన్యమీరయా వృష్టిమంతం, 10.98.8) ప్రార్థించబడ్డాడు. సోమం మేఘం యొక్క వృష్టులలా ప్రవహిస్తుంది (పర్జన్యస్యేవ వృష్టయః, 9.22.2); అథర్వవేదంలో వానకురిసే గోవైన 'వశా' ఈవిధంగా సంబోధించబడింది: '' ఓవశా! గొప్పదేవతా! మేఘం నీ పొదుగు; విద్యుత్తులు నీస్తనాలు'' (ఊధస్తే భద్రే పర్జన్యో విద్యుతస్తే స్తనా వశే; 10.10.7; ★ దీనిపై మంత్రం (6) లో 'వశా పర్జన్యపత్నీ' అని చెప్పబడింది). ఇటువంటిసందర్భాలలో ప్రాచీనవ్యాఖ్యాతలు పర్జన్యశబ్దానికి 'మేఘం' అని అర్థం ఇచ్చారు. మరొకవైపు వా.సం. (12.6) లో ద్యౌస్-నీ, శ.బ్రా. (14.5.5.10) లో స్తనయిత్ను- 'ఉరుము' నీ వివరించడానికి పర్జన్యశబ్దం వాడబడింది. కొన్ని సందర్భాలలో పర్జన్యశబ్దం వల్ల ఉద్దిష్టమైనది మేఘమా? లేక పురుషతారోపమా? అనేది నిర్ణయించడం కష్టం. ఉదాహరణకి: అగ్ని పర్జన్యక్రంద్య- 'పర్జన్యుడి మేఘం అరుపు

వంటి అరుపుగలవాడు' అని చెప్పబడ్డాడు (8.102.5); కప్పలు పర్జన్యుడి/మేఘం చేత ప్రేరించబడిన ధ్వనులు చేశాయి (వాచం పర్జన్యజిన్వితాం ప్ర మండూకా అవాదిషుః, 7.103.1). కాని చాలా మంత్రాలలో ఈపదం మేఘానికి అధిదేవత అయిన పురుషుణ్ణే స్పష్టంగా సూచిస్తుంది; అటువంటి చోట్లకూడా దాని విశేషణాలు ప్రకృతి పదార్థానికి (మేఘానికి) సంబంధించినవే అయి ఉంటాయి. అప్పుడు మేఘం పొదుగు (ఊధః)/ పాత్ర (కోశ-)/నీటినిపోసే తోలుసంచీ (దృతి-, 5.83.8, 9; 7.101.4) అని చెప్పబడుతుంది. చాలాచోట్ల పర్జన్యుడికి జంతుత్వారోపం కూడా ఉండి ఆయన వృషభం అని చెప్పబడింది; ఇటువంటి చోట్ల (బహుశా మేఘాలుగోవులు అని తరచు చెప్పబడడం వల్ల) లింగవ్యత్యయం కూడా కనపడుతుంది. పర్జన్యుడు జీవమిచ్చే అరిచే వృషభం (కనిక్రదద్ వృషభః); ఆయన తన రేతస్సుని గర్భరూపంలో ఓషధులలో ఉంచుతాడు (5.83.1; చూ. 5.83.7, 9; అ.వే. 4.15.1). వాయువుచేత ప్రేరించబడిన మేఘాలు (అభ్రాణి) కలిసివచ్చుగాక; వాయుప్రేరితుడైన (నభస్వతః) మహా వృషభం యొక్క నీరు పృథివికి తృప్తి కలిగించుగాక (అ.వే. 4.15.1). ఒక్కొక్కప్పుడు పర్జన్యుడు గొడ్డుమోతు ఆవు (స్తరీః) వంటివాడు; ఒక్కొక్కప్పుడు ఆయన (నీటిని) ప్రసవిస్తాడు; ఈయన తన ఇష్టప్రకారం శరీరాన్ని ధరిస్తాడు (యథావశం తన్వం చక్ర ఏషః, 7.101.3).

31.2 ఆయన ముఖ్యస్వభావం వాన కురిపించడం "(నువ్వు) నీరు గల రథంతో అంతటా తిరుగు (ఉదన్వతా పరిదీయా రథేన); విప్పిన తోలు సంచీని కిందకి లాగు" (దృతిం సు కర్ష విషితం న్యంచం, 5.83.7). గుర్రాలను తోలేరథికుడిలా ఆయన తన వర్షం కురిపించే దూతలు కనపడేటట్టు చేస్తాడు; ఆయన వానకురిపించేటప్పుడు దూరాన్నించి సింహగర్జనలు వినిపిస్తాయి (5.83.3); అసురుడైన మన తండ్రి (అసురః పితానః) ఉరుములతో వాన కురిపిస్తూ వస్తాడు (5.83.6). ఆయన వానలకోసం ప్రార్థించబడ్డాడు (7.101.5); వానకురిసినతరవాత దాన్ని ఆపమని కూడా ప్రార్థించబడ్డాడు (5.83.10). కాని వానకురిపించడంలో పర్జన్యుడూ మరుత్తులూ మిత్రావరుణుల అధీనంలో ఉన్నారని సూచించబడింది (5.63.3-6). పర్జన్యుడు ఉరుములాడని కొన్నిచోట్ల (5.83) చెప్పబడింది. ఆయన ఉరుముతూ చెట్లనీ, రాక్షసులనీ, చెడ్డపనులు చేసేవారినీ పడగొడతాడు; ఆయన గొప్ప ఆయుధానికి లోకమంతా భయపడుతుంది (5.83.2). వాతుడూ పర్జన్యుడూ గొప్ప ఉరుము ఆయుధంగా కలవారు (10.66.10). పర్జన్యుడికి

మెరుపుతో కూడా సంబంధం ఉంది; కాని ఇది ఆయనకి ఉరుముతో ఉన్న సంబంధంలా ప్రముఖంగా చెప్పబడలేదు. పర్జన్యుడు పృథివిని రేతస్సుతో రక్షించినప్పుడు గాలులు వీస్తాయి; విద్యుత్తులు పడతాయి (పతయంతి విద్యుతః; 5.83.4). పర్జన్యుడు (అంతరిక్ష) సముద్రంలో మెరుపులతో ఉరుముతాడు (అ.వే. 19.30.4). విశ్వేదేవతలకి ఉద్దేశించిన ఒక ఋగ్వేద సూక్తం (5.42)లోని ఒక మంత్రం (14) పర్జన్యుణ్ణే స్తుతించేదిగా కనపడుతుంది: ''స్తుతించేవాడా! నీ స్తుతి ఉరిమే (స్తనయంతం), అరిచే (రువంతం), అన్నమిచ్చే (ఇళస్పతిం) దేవుడికి వ్యాపించుగాక! మేఘాలూ నీరే కల ఆయన విద్యుత్తులో (విద్యుతా) రెండు లోకాలనీ తడుపుతూ వెళ్తాడు.''

31.3 పర్జన్యుడు వాన కురిపించే వాడవడం వల్ల ఆయన మొక్కలని పుట్టించి పోషించేవాడుగా ప్రత్యేకంగా చెప్పబడడం సహజమే. ఆయన తన రేతస్సుతో భూమికి జీవమిచ్చినప్పుడు మొక్కలు మొలుస్తాయి; ఆయన పనివల్ల అన్నిరకాల మొక్కలూ (మొలుస్తాయి; యస్యవ్రత ఓషధీ ర్విశ్వరూపాః, 5); ఆయన మొక్కలని భోజనం కోసం పుట్టించాడు (5.83.4, 5, 10; చూ. 6.52.6; అ.వే. 4.15.2, 3, 15; 8.7.21). ఆయన మొక్కలకు గర్భం చేస్తాడు (కృణ్వన్‌గర్భ మోషధీనాం, 1); మొక్కలకి వర్ధకుడు (వర్ధన ఓషధీనాం, 2); దేవుడిచే రక్షించబడే మొక్కలు మాకు మంచి ఫలాలు ఇచ్చుగాక (అస్మే సుపిప్పలా ఓషధీర్దేవగోపాః, 7.101.1-5). ఆయన పనివల్ల గడ్డి మొలుస్తుంది (7.102.1; చూ. 5.75.15; అ.వే. 1.2.1; 1.3.1; 19.30.5). పర్జన్యుడు మొక్కలకే కాక గోవులకీ, గుర్రాలకీ, స్త్రీలకీ కూడా గర్భం కలిగిస్తాడు (యోగర్భ మోషధీనాం గవాం కృణోత్యర్వతాం, పర్జన్యః పురుషీణాం, 7.102.2); ఆయన సంతాన వృద్ధికోసం ప్రార్థించబడ్డాడు (5.83.7; చూ. 6.52.16). ఆయన అన్నిటికీ రేతస్సునిచ్చే వృషభం (సరేతోధా వృషభః శశ్వతీనాం), ఆయనలో చరాచరాల ఆత్మ ఉంది (తస్మి న్నాత్మా జగతస్తస్థుషశ్చ, 7.101.6; చూ. 1.115.1). ఆయన స్వయంశక్తిగల ప్రభువని కూడా వర్ణించబడ్డాడు; ఆయన లోకాన్ని అంతటినీ పరిపాలిస్తాడు; ఆయనలో అన్ని జీవులూ, మూడు స్వర్గాలూ ఉన్నాయి; ఆయనలో మూడు రకాల నీరు ప్రవహిస్తుంది (7.101.2, 4, 5). ఆయనకి ఉన్న ఉత్పాదక శక్తి వల్ల ఆయనకి పితా 'తండ్రి' అనే విశేషణం కొన్నిచోట్ల (7.101.3; 9.82.3; అ.వే. 4.15.12; 12.1.12) వాడబడింది. ఆయన ఒకచోట (5.83.6) 'స్వర్గలోకంలోని మన తండ్రి' (అసురః పితానః) అని చెప్పబడ్డాడు;

మరొకమంత్రం (5.63.3) లో 'అసురుడిమాయవల్ల' (అసుర్యమాయయా) అన్నప్పుడు పర్జన్యుడే ఉద్దిష్టమై ఉండవచ్చు.

31.4 ఆయన భార్య భూమి అని ఊహించవచ్చు (5.83.4; 7.101.3; చూ. 1.160.3). అథర్వవేదం (12.1.12)లో భూమి తల్లి అనీ, పర్జన్యుడు తండ్రి అనీ చెప్పబడింది; కాని మరొకచోట (10.10.6) ఆయన భార్య 'వశా' అని స్పష్టంగా చెప్పబడింది. ఈ విషయాలలోనూ, వృషభంగా జంతుత్వారోపంలోనూ, ఈయనకీ ఉరుమూ, మెరుపూ, వానా- వీటికీ ఉన్న సంబంధంలోనూ ఈయన స్వభావం ద్యౌస్ స్వభావానికి దగ్గరగా ఉంటుంది (చూ. 10.45.4; 2.4.6; 2.27.15); ఈయన ద్యౌస్ కొడుకని ఒకచోట చెప్పబడింది (దివస్పుత్రాయ, 7.102.1). పర్జన్యుడే మొక్కల గర్భం (= బీజం) అయిన దూడని పుట్టించినట్లు చెప్పబడింది (వత్సం కుర్వన్‌గర్భమోషధీనాం, 7.101.1; చూ. 7.101.5; 5.83.1); ఈ దూడ మెరుపుకి ప్రతీక కావచ్చు. కాని, పర్జన్యుడు సోముడి తండ్రి అని ఒకచోట చెప్పబడడం వల్లా (9.82.3), సోముడు పర్జన్యుడివల్ల వృద్ధిపొందిన వాడని ఉండడం వల్లా (పర్జన్యవృద్ధం, 9.113.3), దూడ అన్నప్పుడు సోముడు/ సోమం ఉద్దిష్టమై ఉండవచ్చు.

31.5 పర్జన్యుడు కొందరు ఇతరదేవతలో కలిపిచెప్పబడ్డాడు. ఆయనకి మిగిలినవారితో కన్న వాతుడితో ఎక్కువ సంబంధం ఉంది; దేవతా ద్వంద్వంలో పర్జన్య శబ్దం వాత శబ్దంతోనేకలుస్తుంది (వాతా పర్జన్యా, 10.66.10);[1] దీనికిఅపవాదంగా ఒకేఒకమంత్రంలో పర్జన్యశబ్దంతో అగ్ని శబ్దం కలుస్తుంది (అగ్నీ పర్జన్యౌ, 6.52.16) (చూ. అధ్యాయం 44). మరుత్తులు కూడా పర్జన్యుడితోపాటు ఆహ్వానించబడ్డారు (5.63.6; 5.83.5); వారు ఈయన్ని పొగడుతూ పాడమని ప్రార్థించబడ్డారు (అ.వే. 4.15.4). ఒక సూక్తంలోని రెండు మంత్రాలలో అగ్ని ఈయనతోపాటు స్తుతించబడ్డాడు (6.52.6, 16). ఇంద్రుడికీ వృష్టికారకుడైనపర్జన్యుడికీ చాలా సమానత్వం ఉంది; ఈ విషయంలో ఇంద్రుడు ఈయనతో పోల్చబడ్డాడు (ఇంద్రః..... పర్జన్యో వృష్టిమాన్ ఇవ, 8.6.1). నిజానికి ఈ ఇద్దరు దేవతలకీ ప్రకృత్యాధారం ఒకటే; కాని పర్జన్యుడికీ ప్రకృత్యాధారానికీ ఉన్న సంబంధం ఇంద్రుడి విషయంలో కన్న చాలా స్పష్టంగా కనపడుతుంది.

---

1. పర్జన్యవాతా (6.49.6), పర్జన్యావాతా (6.50.12; 10.65.9) అనే సమాసాలు కూడా ఉన్నాయి.

31.6 పర్జన్యశబ్దం వ్యుత్పత్తి అస్పష్టం. కాని, స్వభావంలో ఉన్న సాదృశ్యం వల్ల ఇది సాధారణంగా లిథువానియన్ సాహిత్యంలో ఉరుముకి అధిదేవత అయిన పెర్కూనస్ (Perkunas) పేరుతో జన్మ సంబంధం కలదిగా భావించబడుతోంది; కాని ఈ రెండు పదాలలో ధ్వనులలో తేడాలు సూత్రానుగుణంగా వివరించడం కష్టం. ఈ రెండు శబ్దాలూ నిజంగా పరస్పర సంబంధం కలవే అయితే వాటి మూల ఇండో- యూరోపియన్ రూపం 'దేవుడు' అనే సామాన్యార్థం ఇచ్చేవి మాత్రమే (★ ఒక ప్రత్యేక దేవత పేరు కాదు) అనడానికి ఋగ్వేదంలోని భావనలోని నవ సౌకుమార్యం అవకాశం కల్పిస్తుంది. ఋగ్వేదంలో ఈ శబ్దం ఉరిమే వాన మేఘానికీ, వాన కురిపించే దేవత పురుషతారోపానికీ కూడా వాచకమే అనేది స్పష్టం. 'వానమేఘం' అనే సామాన్యార్థమూ 'వానకి అధిదేవత' అనే ప్రత్యేకార్థమూ- ఈ రెండూ బ్రాహ్మణాలలోనూ వాటి తరవాత సాహిత్యంలోనూ మిగిలి ఉన్నాయి. పై సామాన్యార్థాన్ని ప్రాచీన నిఘంటువులు గర్జన్మేఘ- వంటి శబ్దాలతో వివరించాయి; మహాభారతంలో కొన్నిచోట్ల ఈ దేవతకీ ఇంద్రుడికీ అభేదం చెప్పబడింది.

## 32. ఆపః ( నీళ్లు )

32.1 ఆపః ( నీళ్లు )[1] ఋగ్వేదంలో నాలుగు సూక్తాలలోనూ (7.47; 7.49; 10.9; 10.30) మరికొన్ని విడి మంత్రాలలోనూ స్తుతించబడ్డాయి. ఇవి ఇతర దేవతలతోపాటు చాలా విడిమంత్రాలలో కూడా ప్రశంసించబడ్డాయి. ఇక్కడ వ్యక్తిత్వారోపం ప్రాథమికదశలోనే ఉంది; వీరు తల్లులు, పడుచు భార్యలు, యజ్ఞానికి వచ్చి వరాలు ఇచ్చే స్త్రీ దేవతలు - వ్యక్తిత్వారోపం ఇంతకన్న దాటి పోలేదు. వారు దేవతల మార్గాన్ని అనుసరించే స్త్రీ దేవతలు (దేవీర్దేవానా మపియంతి పాథః, 7.47.3). వారికి వజ్రాయుధుడైన ఇంద్రుడు మార్గం తవ్వేడు (7.47.4; 7.49.1); వారు ఇంద్రుడి ఆజ్ఞలు ధిక్కరించరు (తా ఇంద్రస్యన మినంతి వ్రతాని, 7.47.3). వారు సవిత ఆజ్ఞలని కూడా పాటిస్తారని చెప్పబడింది (అధ్యాయం 15.3). వారు స్వర్గలోకంలో ఉండేవారు ( దివ్యాః ); తవ్విన మార్గాలలో ప్రవహించేవారు ( స్రవంతి ఖనిత్రిమాః ); వారిగమ్యం సముద్రం ( సముద్రార్థాః; 7.47.3). వారు దేవతలు ఉండేచోటా, మిత్రావరుణుల స్థానంలోనూ ఉంటారని సూచించబడింది (10.30.1). వారు సూర్యుడి దగ్గర ఉంటారు; లేక సూర్యుడు వారితో ఉంటాడు

1. దీని ప్రాతిపదిక అప్-; ఇది ఎప్పుడూ బహువచనంలోనే ఉంటుంది. దీని ప్రథమా బహువచనరూపం ఆపః, ద్వితీయా బహువచన రూపం అపః.

(అమూర్యా ఉప సూర్యే యాభిర్వా సూర్యః సహ, 1.23.17). రాజైన వరుణుడు జనుల సత్యమూ, అబద్ధమూ చూస్తూ వారిమధ్య చరిస్తాడు (యాసాం రాజా వరుణోయాతి మధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానాం, 7.49.3). అధమపక్షం ఇటువంటి చోట్ల (అంతరిక్షంలోని) వాననీరు ఉద్దిష్టమై ఉంటుంది. కాని నిరుక్తంలోని నిఘంటువు (5.3)లో 'ఆపః' పృథివీస్థాన దేవతల జాబితాలోనే ఇవ్వబడింది (చూ. నిరుక్తం 9.26).

32.2 అగ్ని నీళ్లలో ఉంటాడని తరచు వర్ణించబడింది (అధ్యాయం 35.17). ఆయన వాటిలో ప్రవేశించాడు (యాస్వగ్నిః ప్రవిష్టః, 7.49.4). తల్లులైన నీళ్లు అగ్నిని పుట్టించాయి (ఆపో అగ్నిం జనయంత మాతరః, 10.91.6; చూ. 10.2.7; అ.వే. 1.33.1); అగ్ని ఒకరూపం 'నీళ్లకి కొడుకు' (అపాంనపాత్) అని చెప్పబడింది (అధ్యాయం 24.3). నీళ్లు తల్లులు (10.17.10; 1.23.16); వారు భువనానికి తల్లులు, భార్యలు (జనిత్రీ ర్భువనస్యపత్నీః, 10.30.10; ★పత్నీః = పాలించేవారు అని సాయణుడు); వారు ఒకే వయస్సూ, ఒకే ఉత్పత్తి స్థానమూ కలవారు (సవృధః సయోనీః, 10.30.10). ప్రేమించే తల్లులలా (ఉశతీరివ మాతరః) వారు తమ సుఖతమమైన రసాన్ని ఇమ్మని ప్రార్థించబడ్డారు (10.9.2). వారు మాతృత్వ లక్షణం ఎక్కువగా కలవారు (మాతృతమాః); చరాచరాలు అన్నిటికీ తల్లులు (విశ్వస్యస్థాతుర్జగతో జనిత్రీః, 6.50.7).

32.3 నీళ్లు మాలిన్యాన్ని పోగొట్టి శుద్ధిచేస్తాయి; పవిత్రం చేస్తాయి; ఈ దేవతలు పాపాన్ని కొట్టుకుపోయేటట్లు చేస్తారు (రిప్రం ప్రవహంతి దేవీః; రిప్రం = పాపం); భక్తుడు వాటినించి శుచీ, పవిత్రుడూ అయి బయటకు వస్తాడు (10.17.10). వారు ''నాలో ఏదైనా పాపం ఉంటే దాన్నీ, ద్రోహాన్నీ, తిట్టడం, అబద్ధమాడడం వంటి దుష్కర్మలనీ ప్రవాహంతో తీసుకుపొండి'' అని కూడా ప్రార్థించబడ్డారు (1.23.22 = 10.9.8).[2] నీళ్లు మందులు (భిషజః, 6.50.7); వాటిలో అన్ని మందులూ, అమర్త్యత్వం, రోగనివారణశక్తీ ఉండడం వల్ల అవి రోగాన్ని నివారించి దీర్ఘాయుస్సు ఇస్తాయి (10.9.5-7; 1.23.19-21). జలాధి దేవతల ఇంట్లో మనుష్యుడి ఆరోగ్యాన్ని కనిపెట్టి కాపాడతారు (హిరణ్యకేశి గృహసూత్రం 2.4.5). వారు వరాలూ, ధనమూ, మంచి శక్తీ, అమర్త్యత్వమూ ప్రసాదిస్తారు (10.9.5; 10.30.12). వారి ఆశీస్సులూ, సహాయమూ తరచు కోరబడ్డాయి (7.47.4; 7.49.1-4;

---

2. ఇదమాపః ప్రవహత యత్కించ దురితం మయి
యద్వాహ మభిదుద్రోహ యద్వాశేప ఉతానృతం.

10.30.11). వారు అపాం నపాత్తుతోపాటు సోమయాగంతో దర్భాసనం మీదకూర్చోమని ప్రార్థించబడ్డారు (10.34.14-15).

32.4 జలాధిదేవతలకి తేనెతో సంబంధం ఉన్నట్లు కొన్నిచోట్ల చెప్పబడింది. తల్లులైనవారు (అంబయః) తమ పయస్సుని (= పాలు/ నీరు) తేనెతో కలుపుతారు (పృంచతీ ర్మధునా పయః, 1.23.16). నీటి ప్రవాహం మధువుతో నిండినది; నెయ్యికారే ఆ ప్రవాహం ఇంద్రుడి పానం అయింది; ఇంద్రుడు వసువులతో దానివల్ల ఆనందిస్తాడు (యస్మిన్నింద్రో వసుభిర్మాదయాతే, 7.47.1, 2). ఇంద్రుడికి బలాన్ని ఇచ్చిన మధువుతో నిండిన నీళ్లని ఇమ్మని అపాం నపాత్తు ప్రార్థించబడ్డాడు (10.30.4). తేనెతో నిండి ఉండి దేవతలకు ఆనందం కలిగించే తమ ప్రవాహాన్ని తమని బంధనాన్నించి విడిపించిన ఇంద్రుడికి పంపమని జలాధి దేవతలు ప్రార్థించబడ్డారు; ఆ ప్రవాహం మత్తు కలిగించేది (మదచ్యుతం); ఇంద్రపానం; ఆకాశంలో పుట్టినది (నభోజాం, 10.30.7-9). అధమపక్షం కొన్ని సందర్భాలలోనైనా ఇంద్రుడి పానమైన స్వర్గంలోని సోమం స్వర్గంలోని నీళ్లే అని కాని అది స్వర్గంలోని నీళ్లలో ఉంది అని కాని భావించబడింది అని ఈ మంత్రాలు సూచిస్తున్నట్లు కనపడుతుంది. మరికొన్ని మంత్రాలలో భూమిమీద సోమాన్ని తయారు చెయ్యడానికి ఉపయోగించే నీళ్లు ఉద్దిష్టమైనట్లు కనపడుతుంది. నీళ్లు (లేక జలాధిదేవతలు) నేతితో, పాలతో, తేనెతో నిండికనపడినప్పుడు వారు అధ్వర్యుల మనస్సులతో ఏకీభవించి (అధ్వర్యుభి ర్మనసా సంవిదానాః) బాగా పిండబడినసోమాన్ని ఇంద్రుడికోసం ధరిస్తాయి/ రు (ఇంద్రాయ సోమం సుషుతం భరంతీః, 10.30.13). మనుష్యుడు అందమైన యువతులతో ఆనందించినట్లు సోముడు జలాధిదేవతలతో ఆనందిస్తాడు (యాభిః సోమో మోదతే హర్షతేచ కల్యాణీభిర్యువతిభి ర్న మర్యః, 10.30.5); ఆయన కోరికతో కోరికగల వారిదగ్గరకు వెళ్తాడు (ఈ ముశన్నుశతీ రేత్యచ్ఛ; ఈం = వీరిని); వారు యువకుడికి లొంగే యువతుల వంటివారు (ఏవే ద్యూనే యువతయో నమంత, 10.30.6; ఏవ = ఇలా).

# ఇ. పృథివీస్థాన దేవతలు

## 33. నదులు, సరస్వతి

33.1 ఋగ్వేదంలో దైవాంశగల జలాలతోపాటు దివ్యత్వం ఆపాదించబడిన నదులకి కూడా అప్రధానం కాని స్థానమే ఉంది. ఒకపూర్తి సూక్తం (10.75) లో అయిదోది తప్ప

మిగిలిన అన్ని మంత్రాలలోనూ సింధునది స్తుతించబడింది. అయిదో మంత్రంలో దాని ఉపనదులూ, మరికొన్ని చిన్ననదులూ ప్రార్థించబడ్డాయి; ఆరోదాంట్లో చాలా నదులు సింధునదికి ఉపనదులుగా చెప్పబడ్డాయి. మరొక పూర్తి సూక్తం (3.33) సోదరుల వంటి విపాశ్, శుతుద్రి (శుతుద్రీ-) నదుల పొగడ్తకీ ప్రార్థనకీ వినియోగించబడింది.

33.2 కాని సరస్వతీనది మిగిలిననదులకన్న చాలా ఎక్కువగా స్తుతించబడింది. ఈనది విషయంలో వ్యక్తిత్వారోపం మిగిలిన నదుల విషయంలో కన్నా ఎక్కువ మేరకే ఉన్నా, ఈనదికీ దాని అధిదేవతకీ ఉన్న సంబంధం ఋగ్వేద కవుల మనస్సులలో స్థిరంగా నిలిచి ఉంది. సరస్వతి ఋగ్వేదంలో మూడు సూక్తాలలోనూ అనేకమైన విడి మంత్రాలలోనూ స్తుతించబడింది. సరస్వతి, సరయు, సింధునదులు గొప్పనదులుగా ప్రార్థించబడ్డాయి (10.64.9); మరొకచోట (10.75.5-7) గంగ, యమున, సరస్వతి, శుతుద్రి, పరుష్ణి, మరికొన్ని (మనకు) తెలిసినవీ, తెలియనివీ, మొత్తం ఇరవై యొక్క నదులు సంబోధించబడ్డాయి. సరస్వతీ తీరంలో ఉన్న రాజులనిగురించీ ప్రజలనిగురించీ ప్రస్తావన ఉంది (7.96.2; 8.21.18). ఇనపకోట (ఆయసీ పూః) (వంటిది) అయిన సరస్వతి సస్యాలను పండించే నీటితో ప్రవహిస్తుంది; గొప్పతనంలో ఆనది (సింధుః) ఇతరనదులని అతిక్రమిస్తుంది; నదులన్నిటిలోకీ శుచి అయిన ఆమె కొండలమీదనించి సముద్రానికి ప్రవహిస్తుంది (7.95.1-2; చూ. 5.43.11). ఆమె తన గొప్ప ప్రవాహాలతోపర్వత శిఖరాలని చీలుస్తుంది; అనంతమైన శక్తిగల ఆమె ప్రవాహం శబ్దం చేస్తూ ప్రవహిస్తుంది (అమశ్చరతి రోరువత్, 6.61.2, 8, అమః= బలం). ఆమె గొప్పతనం వల్ల గొప్ప నదులలో గొప్పదిగా గుర్తించబడింది; ఆమె చురుకుతనంలో మిగిలినవారికంటె గొప్పది (6.61.13); ఆమె తనపయస్సుతో (★= వరదలతో) బాధించవద్దనీ (పయసా మాన ఆధక్, 6.61.14; ★మా ధక్= దహించవద్దు), వృద్ధి తొలగించవద్దనీ ప్రార్థించబడింది. ''నీ దగ్గరనించి మేము చెడు ప్రదేశాలకు పోకుండా ఉండాలి'' (మా త్వత్ క్షేత్రాణ్యరణాణి గన్మ, 6.61.14) అని కవి ప్రార్థించారు. ఆమెకు ఏడుగురు అక్కచెల్లెళ్ళు ఉన్నారు (సప్తస్వసా, 6.61.10); ఏడు అవయవాలు ఉన్నాయి (సప్తధాతుః, 12). నదులకి తల్లి (సింధు మాతా) అయిన ఆమె ఏడవది (సప్తథీ, 7.36.6). ఆమె తల్లులలోనూ, నదులలోనూ, స్త్రీ దేవతలలోనూ శ్రేష్ఠమైనది (అంబితమే నదీతమే దేవితమే సరస్వతి, 2.41.16; ★ ఇవి సంబోధనలు). ఆమెకు 'పావీరవీ' అనే విశేషణం వాడబడింది

(6.49.7); దీని అర్థం బహుశా 'మెరుపుకి కూతురు' అనికావచ్చు (★ శోధయిత్రి 'శుద్ధిచేసేది' అని సాయణుడి అర్థం) (ఈ విశేషణం తన్యతు- 'ఉరుము'కి కూడా 10.65.13లో వాడబడింది); ఈమె వీరపత్నీ 'వీరుడి భార్య' అని కూడా ఇందులో చెప్పబడింది( ఈ వీరుడుసరస్వత్ కావచ్చు). ఆమె భూప్రదేశాలనీ విశాలమైనఅంతరిక్షాన్నీ నింపుతుంది(6.61.11); ఆమె మూడు నివాసస్థానాలు కలది (త్రిషధస్థా, 12). ఆమె ఆకాశాన్నించి, పెద్దపర్వతాన్నించి దిగి యజ్ఞానికి రమ్మని ప్రార్థించబడింది (5.43.11). పైన చివరగా ఇచ్చిన మూడు మంత్రాలూ (చూ. 7.95.2. కూడా) ఈమె ఉత్పత్తిస్థానం వేదాల తరవాత కాలపు గాథలలో గంగ ఉత్పత్తి స్థానంలా స్వర్గంలో ఉన్నట్లు సూచిస్తాయని అనుకోవచ్చు. ఒకచోట (7.96.1) ఈమె అసుర్యా 'దేవసంబంధం కలది' అని చెప్పబడింది. ఈమె పితృదేవతలతో కలిసి ఒకే రథం మీద యజ్ఞానికి వచ్చి దర్భాసనం మీద కూర్చుంటుంది (10.17.8, 9). వీటి తరవాత ఉన్న రెండు మంత్రాలలో నీళ్లు శుద్ధిచేయాలి అని ప్రార్థన ఉండడంవల్ల వీటిలో కూడా నదే దేవతగా భావించబడి ఉంటుంది.

33.3 ఆమెకే శుద్ధిచేసే శక్తి ఉంది (1.3.10). ఆమె ప్రవాహాలతో పొంగుతూ (సింధుభిః పిన్వమానా) రమ్మని ప్రార్థించబడింది (6.52.6); ఆమె సంపదా, సంతానమూ, అమర్త్యత్వమూ, ఇచ్చే నీళ్లతోపాటు దీర్ఘాయుస్సు ఇమ్మని ప్రార్థించబడింది (10.30.12). ఆమె ఆయుస్సూ సంతానమూ ఇస్తుంది (2.41.17). వంశోత్పత్తి కలిగించే దేవతలలో ఈమె కూడా ఉంది (గర్భం ధేహి సరస్వతి, 10.184.2). ఆమె వధ్ర్యశ్వుడికి దివోదాసుడు అనే పుత్రుణ్ణి ఇచ్చింది (6.61.1). ఆగని దానంగల (సుదత్రః) ఆమె స్తనం అన్ని రకాల సంపదలూ ఇస్తుంది (1.164.49; చూ. ఐ. బ్రా. 4.1). ఆమె సంపదా, సమృద్ధీ, పుష్టీ ఇస్తుందని తరచు చెప్పబడింది (7.95.2; 8.21.17; 9.67.32; 10.17.8, 9); ఆమెకు సుభగా 'మంచిదానం కలది' అనే విశేషణం కొన్నిచోట్ల (1.89.3; 7.95.4,6; 8.21.17) వాడబడింది. తల్లి అయిన ఆమె కీర్తిలేనివారికి కీర్తి ఇస్తుంది (అప్రశస్తా ఇవ స్మసి ప్రశస్తి మంబ నస్కృధి, 2.41.16). ఆమె తన భక్తుల ప్రార్థనలని దేవతలకు అందించే దేవతలతోపాటు ఈమె పేరుకూడా చెప్పబడింది (7.39.5; 10.65.13). ఆమె దేవతలని నిందించే వారిని నాశనం చేస్తుంది (సరస్వతి దేవనిదో నిబర్హయ); భయంకరమైనది (ఘోరా), వృత్రుణ్ణే చంపేది (వృత్రఘ్నీ, 6.61.3, 7). కాని ఆమె తన భక్తులకి రక్షణ ఇచ్చి వారి శత్రువులని చంపుతుంది (7.95.4,5; 2.30.8; 6.49.7).

33.4 సరస్వతి తరచు ఇతర దేవతలతోపాటు ప్రార్థించబడింది. పూషుడితోనూ, ఇంద్రుడితోనూ, ముఖ్యంగా మరుత్తులతోనూ ఈమెకలిపి చెప్పబడింది (3.54.13; 7.9.5;7.39.5; 7.40.3); ఈమెతో మరుత్తులు ఉంటారు (2.30.8), వారు ఆమె స్నేహితులు (మరుత్సఖా, 7.96.2). ఋగ్వేదంలో ఒకచోట ఈమెకూ అశ్వినులకూ సంబంధం చెప్పబడింది. అశ్వినులు ఇంద్రుడికిసహాయం చేసినప్పుడు సరస్వతి ఆయనకు పరిచర్య చేసి సేదదీర్చింది (10.131.5). వా.సం. (19.12)లో ఇదేగాథని సూచిస్తూ దేవతలు రోగనివారకమైన యజ్ఞం చేసినప్పుడు వైద్యులైన అశ్వినులూ, సరస్వతి వాక్కు ద్వారానూ (వాచా), ఇంద్రుడికి శక్తి నిచ్చారని చెప్పబడింది. వా.సం. (19.94)లో సరస్వతి అశ్వినుల భార్య అని కూడా చెప్పబడింది (సరస్వతీ యోన్యాం గర్భ మంత రశ్విభ్యాం పత్నీసుకృతం బిభర్త)., ఆప్రీసూక్తాలలోనూ ఆప్రసూక్తాలలోనూ ఎనిమిది, తొమ్మిదో మంత్రాలలో సరస్వతి యజ్ఞానికిసంబంధించినస్త్రీదేవతలైన 'ఇడా' 'భారతీ' - వీరితోనూ (ఈ ముగ్గురూ ఒకసముదాయం) మరికొన్నిచోట్ల 'మహీ', 'హోత్రా' అనే వారితోనూ కూడా కలిపి చెప్పబడింది.[1] ఈ నది పవిత్రమైనది కావడమే ఇలా చెప్పడానికి కారణం కావచ్చు. సరస్వతీ దృషద్వతీ నదీ తీరాలలో యజ్ఞం కోసం అగ్ని పుట్టించబడినట్లు చెప్పబడింది (3.23.4); సరస్వతీ తీరంలో ఋషులు చేసిన యజ్ఞాన్నిగురించిన ప్రస్తావన ఐ.బ్రా. (1.29)లో ఉంది. అందువల్ల సరస్వతీతీరంలో భరతవంశస్థుల పూజాస్థానాలు ఉండి ఉండవచ్చు. ఇందువల్లనేసరస్వతితోపాటు భరతుల ఆహుతులకి వ్యక్తిత్వారోపమైన 'భారతీ'కికూడా పశుయాగంలో ఉపయుక్తమయ్యే ఆప్రీ మంత్రాలలో స్థిరస్థానం సహజంగానే లభించింది.

33.5 ఋగ్వేదంలో సరస్వతి ఒకనదీ దేవత మాత్రమే; అంతకన్న ఎక్కువ లక్షణాలు ఆమెకు ఉన్నాయనడానికి అందులో ప్రత్యక్షాధారం ఏమీ లేదు (చూ. 7.35.11). అయినా బ్రాహ్మణాలలో (శ.బ్రా. 3.9.1.7; ఐ.బ్రా. 3.1.10) ఆమెవాక్కు (వాచ్-)తో ఏకీకరించబడింది; వేదాల తరవాత కాలంలో ఆమె కవితాశక్తికీ పాండిత్యానికీ అధిదేవతగా ఆరాధించబడుతోంది; ఆమె బ్రహ్మ భార్య అనే భావంకూడా ఈ కాలంలోనే ఏర్పడింది.

---

1. ఆప్రీసూక్తాలలో ఒక్కొక్క మంత్రం ఒక్కొక్క దేవతకి ఆహుతి అగ్నిలో వేసే ముందు చెప్పబడుతుంది. ఉదాహరణకి ఋగ్వేదం 1.13. (12 మంత్రాలు కలది) ఒకఆప్రీసూక్తం; ఇందులో తొమ్మిదో మంత్రంలో ఇళా, సరస్వతీ, మహీ ఆహ్వానించబడ్డారు. ఆప్రమంత్రాలు ఆప్రీసూక్తాలలోని మంత్రాలు. వేరువేరు శాఖలవారు, వేరు వేరు సూక్తాలను ఆప్రీసూక్తాలుగా ఉపయోగిస్తారు.

ఈ భావనలోని పరిణామానికి మొదటి సూచనలు పైన ఉద్ధరించబడిన వా.సం. (19.12) లోని వాక్యం వంటి వాటిలో కనపడతాయి.[2]

33.6 సరస్వతీదేవి వ్యక్తిత్వారోపానికి ఆధారమైనది ఏమిటి లనే విషయంలో చాలా భిన్నాభిప్రాయాలు వ్యక్తం చెయ్యబడ్డాయి. ఆఫ్ఘనిస్తాన్‌లో ఉన్న హరక్వైతి (Haraquaiti) అనే నది పేరుకీ ఈ పేరుకీ ధ్వనులలో చాలా పోలిక ఉండడం వల్ల వేదాలలో మొదట్లో సరస్వతి అని స్తుతించబడినది ఆ నదే కావచ్చు; దాని ప్రసక్తి అవెస్తాలో కూడా ఉంది. కాని రోథ్(Roth), గ్రాస్మన్ (Grassmann), లుడ్విక్ (Ludwig), సిమ్మర్(Zimmer)ల అభిప్రాయం ఇలా ఉంది: ఋగ్వేదంలో మొదటికాలంలో సాధారణంగా సరస్వతి అనే పేరు ఒక పెద్దనదికి వర్తిస్తుంది; ఆ నది సింధునదే కావచ్చు (దానికి 'సరస్వతి' అనే పేరు దివ్యత్వాన్ని సూచించేది; 'సింధు' అనేది వ్యావహారిక నామం); కాని ఇది కొన్నిచోట్ల మధ్యదేశంలోని ఒక చిన్ననదికి వర్తించడంవల్ల ఈ చిన్న నదికే ఈపేరూ దివ్యత్వమూ తరవాత కాలంలో ఆపాదించబడ్డాయి. మాక్స్ ముల్లర్ (Max Muller) వేదాలలోని సరస్వతి ఈ చిన్న నదే అనీ, ఇదీ 'దృషద్వతీ' అనేనదీ బ్రహ్మావర్తం అనే పవిత్ర ప్రదేశానికి ఎల్లలుఅనీ, ఇది ఇప్పుడు ఎడారి ఇసకలో అదృశ్యమైపోయినా వేదకాలంలో సముద్రం వరకూ ప్రవహించేది అనీ అన్నారు. ఓల్డ్‌హామ్ (Oldham) ప్రాచీనకాలంలో ఉన్న నదులతీరాలలో పరిశోధనలవల్ల సరస్వతి మొదట్లో శుతుద్రీనది (దీని ఇప్పటిపేరు సట్లెజ్) కి ఉపనది అనిచెప్పడానికి ఆధారాలు లభిస్తున్నాయనీ, శుతుద్రీనది దాని మార్గం మార్చుకొని విపాశ్‌నదితో కలిసిపోయాకసరస్వతి శుతుద్రీనదిపాతమార్గంలో ప్రవహిస్తూ ఉండేదనీ చెప్పేరు.

33.7 సరస్వతికి సంబంధించిన పురుషుడు సరస్వత్తు (సరస్వత్-); ఒక సూక్తం (7.96) లో మొదటి మూడుమంత్రాలలో ఈనదీ దేవత స్తుతించబడ్డాకమరి మూడు మంత్రాలలో ఆయనస్తుతించబడ్డాడు; వీటిలో ఆయన భార్యలనీ, సంతానాన్నీ, రక్షణనీ, సమృద్ధినీ కోరుతూ ప్రార్థించబడ్డాడు. ఇక్కడ ఆయన ఇచ్చే నీళ్లూ, సంతానమూ,

2. వా.సం. (19.12): దేవాయజ్ఞ మతన్వత భేషజం భిషజాశ్వినా; వాచా సరస్వతీ భిషగింద్రా యేంద్రియాణి దధతః "దేవతలు (ఇంద్రుడికి శక్తి నివ్వడానికివైద్యరూపమైన (సౌత్రామణి అనే) యజ్ఞంచేశారు; (అందులో) అశ్వినులువైద్యులు; సరస్వతి (వేదలక్షణమైన) వాక్కుతో వైద్యురాలు అయింది; వారు ఇంద్రుడికి శక్తులు ఇచ్చారు."

అన్నమూ, ఇంకా ఆయన పెద్ద స్తనమూ (పీపివాంసం సరస్వతః స్తనం, 6) కూడా చెప్పబడ్డాయి (★ ఇక్కడ స్తనం = మేఘం అని సాయణుడు). మరొకమంత్రం (1.164.52)లో సరస్వత్తువృష్టులతో తృప్తికలిగిస్తాడు (వృష్టిభిస్తర్పయంతం) అని చెప్పబడింది; ఇక్కడ ఇది పక్షిరూపి అయిన అగ్నికి పేరైనట్లు కనపడుతుంది. రోథ్ (Roth) ఈయన అంతరిక్ష జలాలకి రక్షకుడనీ, ఉత్పాదకశక్తి కలిగించేవాడనీ అభిప్రాయపడ్డారు. హిలెబ్రాంట్(Hillebrandt) సరస్వత్తూ అపాంనపాత్తూ (=సోముడు, చంద్రుడు) ఒకరే అని అన్నారు; హార్డీ(Hardy) కూడా ఇటువంటి అభిప్రాయమే వ్యక్తం చేశారు.

## 34. పృథివి

34.1 ఇంతకుముందె (అధ్యాయం 11.1) చెప్పినట్లు పృథివి (పృథివీ-) 'భూమి' సాధారణంగా ద్యౌస్‌తోపాటేస్తుతించబడుతుంది; అందువల్ల ఈమెను ప్రత్యేకంగా స్తుతించిన ఒకేఒక చిన్న సూక్తం (5.84)లో మూడు మంత్రాలు మాత్రమే ఉన్నాయి. కాని అ.వే.లో ఒకరమణీయ కవిత్వంగల ఒకపెద్దసూక్తం (12.1) ఈమెకుకేటాయించబడింది. ఈమె విషయంలో వ్యక్తిత్వారోపం చాలా తక్కువ; ఈమెకు ఉపయోగించబడిన విశేషణాలు ప్రకృతి పదార్థమైన భూమికి అన్వయించేవే. ఋగ్వేదంలో ఆమెతో ఎత్తైన ప్రదేశాలు చాలా ఉన్నాయనీ, ఆమె పర్వతాల భారం భరిస్తుందనీ, అడివిలో చెట్లని భూమిలో (క్ష్మయా) భరిస్తుందనీ చెప్పబడింది. ఆమె వాన కురిపించడం వల్ల నేలకు జీవం కలిగిస్తుంది; స్వర్గాన్నించీ మెరుపులతో కూడిన ఆమె మేఘాన్నించీ వృష్టులు కురుస్తాయి (యత్తే అభ్రస్య విద్యుతో దివో వర్షంతి వృష్టయః, 3). ఆమె విస్తారమైనది (మహీ,) దృఢమైనది (దృళ్హా), ప్రకాశించేది (అర్జునీ).

34.2 పృథివీ శబ్దానికి వ్యుత్పత్త్యర్థం 'విశాలమైనది' అని; ఋ.వే. (2.15.2)లో కః ఈ వ్యుత్పత్తిని సూచిస్తూ 'స దారయత్ ప్రథివీం పప్రథచ్చ' (ఆయన (ఇంద్రుడు) భూమిని ధరించాడు; విశాలం చేశాడు) అని చెప్పేరు. భూమి పుట్టుకని వర్ణిస్తూ తై.సం (7.1.5; సాఽప్రథత సా పృథివ్యభవత్ తత్ పృథివ్యై పృథివిత్వం), తై.బ్రా. (1.1.3.5) ఈ ప్రథ్- 'విశాలం అవు' అనే ధాతువునించి వచ్చిందని వాచ్యంగానే చెప్పేయి : ఆమె విశాలమైంది; ఆమె పృథివి అయింది; అదే పృథివికి ఉన్న పృథివిత్వం.

34.3 ఒకపితృమేధసూక్తంలోని ఒకమంత్రం (10.18.10)లో మృతుణ్ణి ఉద్దేశించి ''మంచి సుఖంగల తల్లియైన ఈ భూమిని చేరు'' ( ఉప సర్ప మాతరం భూమి మేతా మురుచ్యసం పృథివీం సుశేవాం) అనిచెప్పబడింది. ద్యౌస్‌తో పాటు కలిపి చెప్పబడినప్పుడు పృథివికి తరచుగా 'తల్లి' (మాతృ-) అనే విశేషణం వాడబడింది (చూ. అధ్యాయాలు 11, 44).

## 35. అగ్ని

35.1 పృథివీ స్థానదేవతలలో ముఖ్యుడు అగ్ని; వేదాలలో యజ్ఞకర్మకి సంబంధించిన కవిత్వంలో కేంద్రస్థానమైన నిప్పుకి ఈయన పురుషతారోపం అవడం వల్ల ఈ ప్రాముఖ్యం ఈయనకి సహజంగానే లభించింది. వేదాలలో దేవతలలో ఇంద్రుడి తరవాత ఈయనకే ఎక్కువ ప్రాముఖ్యం ఉంది. ఈయన ఋగ్వేదంలో అధమపక్షం 200 సూక్తాలలో స్తుతించబడ్డాడు; మరికొన్నిటిలో ఈయన ఇతరదేవతలతోపాటు ప్రార్థించబడ్డాడు.

35.2 ఈయన పేరు నిప్పుకి కూడా సాధారణ నామం కాబట్టి ఈయన విషయంలో పురుషతారోపం ప్రాథమికదశలో మాత్రమే ఉంది; ఈయనకు చెప్పబడిన శరీరావయవాలు ముఖ్యంగా యజ్ఞంలో ఉపయోగించే భూమిమీద నిప్పు ప్రకృతినే స్పష్టంగా సూచిస్తాయి. ఆయన వీపు నెయ్యి (ఘృతపృష్ఠం, 5.4.3. మొ), ముఖ్యం నెయ్యి (ఘృతప్రతీకః, 3.1.18, మొ.; ★ప్రతీక = అవయవం అని సాయణుడు); ఆయన మంచి నాలుక కలవాడు (సుజిహ్వ, 1.14.7). ఆయన జుట్టు నెయ్యి (ఘృతకేశం, 8.60.2); ప్రకాశించే జట్టుకలవాడు (శోచిష్కేశం, 1.45.6, మొ.); ఎర్రని జుట్టూ (హరికేశం, 3.2.13), ఎర్రని గడ్డమూ (హిరిశ్మశ్రుః, 5.7.7) కలవాడు. ఆయన జ్వాలలే నోరుగా కలవాడు (తపుర్జంభః, 1.58.5, మొ.); వాడి అయిన దవడలు కలవాడు ( తిగ్మా అస్యహనవః, 8.60.13); ఆయన బంగారు లేక తెల్లని దంతాలు కలవాడు (హిరణ్యదంతం, 5.2.3, శుచిదన్, 5.7.7); పదునైన బాణం కలవాడు (శర్వా శిశానః, 10.87.6). ఆయనకి కాళ్ళూ తలాలేవని ఒకచోట చెప్పబడింది (అపాత్, అశీర్షా, 4.1.11) కాని ఇతరత్రా ఆయన మండేతల కలవాడు (తపుర్మూర్ధా, 7.3.1) అనీ, మూడుతలలూ ఏడు రశ్మిలూ కలవాడు (త్రిమూర్ధానం సప్తరశ్మిం, 1.146.1; 2.5.2) అనీ ఉంది. ఆయన అన్ని భువనాలకీ అభిముఖంగా ఉంటాడు (ప్రత్యఙ్ విశ్వాని భువనా న్యస్థాత్, 2.3.1, మొ.).

ఆయన నాలుక (జిహ్వా) తరచు చెప్పబడింది (8.72.18 మొ.). ఆయనకి మూడు (త్రిస్తేజిహ్వః, 3.20.2) / ఏడు (సప్త జిహ్వః, వా.సం. 17.709) నాలుకలు ఉన్నాయి; ఆయనగుర్రాలకు కూడా ఏడు నాలుకలు ఉన్నాయి (తే వహ్నాయః సప్తజిహ్వః 3.6.2; ★ వహ్నయః = అగ్నికి అంశాలైన ఆహవనీయాదులు అని సాయణుడు). ముండకోపనిషత్తు (1.34) లో ఈ ఏడు నాలుకలకీ పేర్లు చెప్పబడ్డాయి.[1] అగ్ని కన్ను నెయ్యి (ఘృతం మే చక్షుః, 3.26.7); ఆయనకి నాలుగు (చతురక్షః, 1.31.13) / వెయ్యి (సహస్రాక్షః, 1.79.12) కన్నులూ, వెయ్యి కొమ్ములూ (సహస్రశృంగః, 5.1-8) ఉన్నాయి. ఆయన ఇనపకోరలు కలవాడు (అయోదంష్ట్రః, 10.87.2). ఆయన చేతిలో మనుష్యుల కోసం చాలా వస్తువులు ధరిస్తాడు (హస్తే దధానో నర్యాపురూణి, 1.72.1). ఇంద్రుడికిలా ఈయనకీ సహస్రముష్క- (★ 'వెయ్యి తేజస్సులు కలవాడు' అని సాయణుడు) అనే విశేషణం ఉంది. ఈయన అస్తా 'బాణాలు వేసేవాడు' అని చెప్పబడ్డాడు (4.4.1); ఈయన ధానుష్కుడితో పోల్చబడ్డాడు (అస్తేవ శూరః, 1.70.11); తన తేజస్సుకి ఇనప (కత్తి) అంచుకి పదును పెట్టినట్లు పదును పెడతాడు (శిశీత తేజో౽యసోనధారాం, 6.3.5).

35.3 ఆయన తరచు అనేక జంతువులతో పోల్చబడ్డాడు; చాలా సందర్భాలలో ఇలా పోల్చడం, నిస్సందేహంగా, ఆయన కృత్యాలని సూచించడానికే కాని ఆయన ఆకారాన్ని సూచించడానికి కాదు. ఆయన తరచు ఎద్దు (వసంగః, 1.58.5, మొ.) అని చెప్పబడ్డాడు. ఆయన పెద్ద మెడగల వర్ధిల్లే వృషభం (తువిగ్రీవో వృషభో వావృధానః, 5.2.12). ఆయన వృషభం అవడం వల్ల అరుస్తాడు (వృషభో రోరవీతి, 10.8.1); చాలా రేతస్సు కలవాడు (సహస్రరేతాః, 4.5.3); కొమ్ములు కలవాడు (5.1.8; 6.16.39); ఆయన ఎద్దులా వాటిని పదును పెట్టడానికి (తల) ఊపుతాడు (శిశానో వృషభో యథాగ్నిః శృంగే దవిధ్వత్, 8.60.13); ఎవరికీ పట్టుకోవడం సాధ్యం కాని ఆయన కొమ్ములు ఊపుతాడు (శృంగా దవిధావ దుర్గృభిః, 1.140.6). ఆయన పుట్టినప్పుడు దూడ (వత్స-) అని చెప్పబడ్డాడు.

---

[1] 'కాలీ' 'కరాలీ' చ 'మనోజవా' చ
'సులోహితా' యాచ 'సుధూమ్రవర్ణా'
'స్ఫులింగినీ' 'విశ్వరుచీ' చ దేవీ
లేలాయమానా ఇతి సప్తజిహ్వాః.

ఆయన్ని తరచుగుర్రంతో పోల్చడమో (అత్యో న, 1.58.2, మొ.). గుర్రం అని చెప్పడమో (సత్వంనో అర్వన్, 6.12.6) జరిగింది. ఆయన తననాలుక (= జ్వాల) నిగుర్రం తోక ఊపినట్లు ఊపుతాడు (జిహ్వా మత్యో న రథ్యో దోధవీతి వారాన్, 2.5.5; ★ ఇక్కడ మూలకర్త ''గుర్రం ఊపినట్లు ఆయన ఊపేతోక జ్వాలే' అని వ్రాయడం భ్రమ మూలకం). యాజకులు ఆయన్ని శుద్ధిచేసినప్పుడు ఆయన శుభ్రం చేసిన గుర్రంలా ఉంటాడు అని చెప్పబడింది (1.60.5, మొ.). యాజకులు ఆయన్నిగుర్రాన్నిలా తీసుకువస్తారు (3.2.7), ఉత్సాహం కలిగించి (దేవతల దగ్గరకి) పంపుతారు (7.7.1, మొ.). దేవతలకి వాహనమైన గుర్రం వంటి ఆయన్ని ప్రజ్వరిల్లజేస్తారు (అగ్నిః సమిధ్యతేఽ శ్వోన దేవవాహనః, 3.27.14). ఆయన యజ్ఞాలలో కర్రకి కట్టబడతాడు (వృజనేషు ధూర్షదం, 2.2.1; 1.143.7). ఆయన మంచి మనస్సుతో దేవతలకి హవిర్భాగం తీసుకువెళ్తాడు (వహాసి సుమనస్య మానో భాగం దేవేభ్యో హవిషః, 10.51.7). ఆయన్ని సకిలించే గుర్రంతో పోల్చడమూ (అశ్వోన క్రందన్, 3.26.3) సకిలించే గుర్రం అని చెప్పడమూ (క్రంద దశ్వః, 1.36.8) జరిగింది. ఈయనగెలిచేగుర్రంవంటివాడు (అర్వంతం న సానసిం, 8.102.12); ఆయనగుర్రంలా (అశ్వోన) యజమానిని ప్రమాదాలనించి తప్పిస్తాడు (4.2.8). అగ్ని పక్షితో కూడా పోల్చబడ్డాడు. ఆయన స్వర్గంలోని డేగ దివఃశ్యేనాయ, 7.15.4); స్వర్గంలోని కాకి (దివ్యం సుపర్ణం వాయసం, (1.164.52). నీళ్లలో ఉండే ఆయన నీటిలోని హంసలా ఊపిరి పీలుస్తాడు (శ్వసిత్యప్సు హంసోన, 1.65.9). ఆయన పక్షిలా చెట్లమీద ఉంటాడు (వేర్న ద్రుషద్వా, 6.3.5; 1.66.2; 10.91.2). ఆయనకి రెక్కలు ఉన్నాయి (పతత్రిన్-, 1.58.5; 2.2.4); ఆయనగమనం ఎగరడం (పత్మనా, 6.3.7; 6.4.6, మొ.); ఆయన దేవతల దగ్గరకి వేగంగా ఎగురుతూ వెళ్తాడు (దేవాన్ అచ్ఛా రఘుపత్వా జిగాతి, 10.6.4). ఒకచోట (1.79.1) ఆయన (కోపంతో) ఊగే పాము (అహిర్ధునిః) అని వర్ణించబడ్డాడు.

35.4 ఇంతేకాక అగ్ని తరచుగా అచేతన పదార్థాలతో కూడా పోల్చబడ్డాడు. ఆయన బంగారంలా/సూర్యుడిలా (రుక్మోన) ప్రకాశిస్తాడు (7.3.6). ఆయననాలుకని చాచినప్పుడు గొడ్డలిలా (పరశుర్న) ఉంటాడు; మరికొన్నిచోట్ల కూడా ఆయనకి ఈ ఉపమానం వాడబడింది (1.127.3, మొ.). ఆయన్ని రథంతో పోల్చడమూ (రథోన, 1.141.8, మొ.), సంపదలు తెచ్చే రథం అనీ (1.58.3; 3.11.5; 3.15.5), యుద్ధాలలో ఎవరూ

జయించలేని రథంలా ప్రకాశిస్తాడు (రథోన రుక్మీ త్వేషః సమత్సు, 1.66.6) అనీ చెప్పబడింది. ఆయన వస్తువులతో నిండిన రథంలా యజ్ఞప్రదేశానికి తీసుకురాబడతాడు (యజ్ఞాయ నీయతే రథోన యోః, 10.176.3) అని చెప్పబడడం వల్ల ఆయన ఇతరులు తోలే రథంలా ఊహించబడినట్లు కనపడుతుంది. ఆయన ధనంతోనూ (రయిం న చారుం, 1.58.6; 1.60.1), పితరులనించి వచ్చిన ధనంతోనూ (రయి ర్న యః పితృవిత్తః, 1.73.1) కూడా పోల్చబడ్డాడు.

35.5 ఆయన అన్నం చెట్లు/సమిధలు (ద్రున్నః, 2.7.6), నెయ్యి (ఘృతాన్నః, 7.3.1); ఆయన పానం నెయ్యి (సర్పిరాసుతిః, 2.7.6; 10.69.2). ఆయన నోట్లో పోసిన నెయ్యి వల్ల వృద్ధిపొందుతాడు (ఘృతేన త్వా వర్ధయన్, 5.11.3, మొ.); ఆయన నూనె తాగుతాడు (అ.వే. 1.7.2; ★కాని ఇక్కడ తౌలస్యప్రాశాన (తైలస్య అని కాదు) అని ఉంది; దీనికి తెడ్డులతో (తులా) కొలవబడేది (= నెయ్యి) అని సాయణుడి అర్థం). ఆయన అడవులని తన పదునైన దంతాలతో తింటాడు; నములుతాడు (అగ్నిర్జంభైస్తిగితై రత్తి భర్వతి, 1.143.5); వాటిని తన నాలుకతో నల్లనివిగా చేస్తాడు (కృష్ణా కృణోతి జిహ్వయా, 6.60.10; 10.79.2). ఆయన అన్నిటినీ తినేవాడు (విశ్వాదం, 8.44.26). ఆయనకు ప్రతిరోజూ మూడుసార్లు (యాజకుడు) అన్నం పెడతాడు (త్రిస్తే అన్నం కృణవ త్సస్మి న్నహన్, 4.12.1; చూ. 1.140.2; 7.11.3). కొన్నిచోట్ల ఆయన దేవతలు యజ్ఞంలోని హవిస్సుని తినడానికి సాధనమైన (వారి) నోరూ, నాలుకా అని చెప్పబడ్డాడు (త్వా మగ్న ఆదిత్యాసం ఆస్యం త్వాం జిహ్వాం శుచయ శ్చక్రిరే, 2.1.13, 14); ఆయన తన జ్వాలలనే తెడ్డులతో దేవతలని అర్చించే హోత (హోతా స జుహ్వా యజిష్ఠః, 10.6.4, 1.76.5; జుహ్వా = తెడ్డుతో). కాని చాలా తరచుగా ఆయనే హవ్యాలని భక్షించమని ప్రార్థించబడ్డాడు (ఇమా హవ్యా జాతవేదో జుషస్వ, 3.21.1-4; 3.28.1-6). ఆయన ఊర్ధ్వమైన, దేవతలకి అభిముఖమైన రూపంతో తనకు అర్పించబడిన నేతిని ఇష్టంతో స్వీకరిస్తాడు (1.127.1). ఆయనకు సాధారణంగా అర్పించేవి సమిధలూ, నెయ్యీ అయినా, కొన్నిచోట్ల, ముఖ్యంగా ఇతరదేవతలతోపాటు ఆహ్వానించబడినప్పుడు, సోమరసం కూడా అర్పిస్తారు (సోమ్యం మధ్వగ్న ఇంద్రేణ వాయునా పిబా, 1.14.10; 1.19.9; 1.21.1, 3; 2.36.4). ఒక సూక్తంలో ఆయన సోమగోపాః 'సోమాన్ని రక్షించేవాడు' అని చెప్పబడ్డాడు (10.45.5, 12). ఆయన యజ్ఞానికి రావాలని

ప్రార్థించబడ్డాడు (ఆనో యజ్ఞం రోహిదశ్వోపయాహి, 10.98.9); ఇతరదేవతలతోపాటు ఆయన దర్భాసనం మీద కూచుంటాడని తరచు చెప్పబడింది (3.14.2; 5.11.2; 5.26.5; 7.11.2; చూ. 7.43.4).

35.6 అగ్ని ప్రకాశాన్ని గురించి సహజంగానే ఎక్కువగా చెప్పబడింది. ఆయన గొప్ప కాంతి కలవాడు (చిత్రభానుః, 2.10.2, మొ.), గొప్పజ్వాలలు కలవాడు (చిత్రశోచిః, 6.10.3), స్వచ్ఛమైన జ్వాలలు కలవాడు (పావక- శోచిషం, 8.43.31), స్వచ్ఛమైన రంగుకలవాడు (శుచివర్ణం, 1.140.1; 5.2.3). ఆయన బంగారురూపం కలవాడు (హిరణ్యరూపం, 4.3.1; 10.20.9). ఆయన సూర్యుడిలా ప్రకాశిస్తాడు (సూరో న రురుక్వాన్, 1.149.3; 7.3.6); ఆయన కాంతి ఉషస్సు కిరణాలలాగా, సూర్యుడి లాగా, వర్షించే మేఘంలోని మెరుపులలాగా ఉంటుంది (10.91.4, 5). ఆయన రాత్రిలో కూడా ప్రకాశిస్తాడు (సస్మా కృణోతి కేతుమా నక్తం చిత్, 5.7.4). ఆయన సూర్యుడిలా చీకట్లని తన కిరణాలతో నాశనం చేస్తాడు (సూర్యో న రశ్మిభిః శర్ధన్ తమాంసి జిఘ్నసే, 8.43.32). ఆయన చీకటిని నాశనం చేస్తాడు; చీకటిలో కూడా చూస్తాడు (1.94.5; 7.9.2). మంచి ప్రకాశం గల ఆయన చీకటి ద్వారాలని తెరుస్తాడు (సమిద్ధో ఉప ద్వారా తమసో వహ్ని రావః, 3.5.1). అగ్ని పుట్టగానే చీకటితో కప్పబడిన భూమీ, ఆకాశామూ కనపడతాయి (భువనం తమసాప గూళ్హ మావిః స్వరభం జ్జాతే అగ్నౌ, 10.88.2). అగ్నిని ఉషఃకాలంలో (యాజకులు) పుట్టిస్తారు కాబట్టి ప్రత్యేకంగా ఈయనకే ఉషర్బుధ్- 'ఉషఃకాలంలో లేచేవాడు' అనే విశేషణం వాడబడింది (కొన్నిచోట్ల ఇది దేవతా సముదాయం అంతటికీ వాడబడింది కాని మరి ఏ ప్రత్యేక దేవతకీ వాడబడలేదు).

35.7 మరొకవైపు ఆయన మార్గమూ (కృష్ణాధ్వా, 2.4.6, 7; 1.141.7; 6.6.1; 8.23.19), చక్రం అంచూ (కృష్ణపవిః, 7.8.2) నల్లనివి. ఆయన గుర్రాలు భూమిలో నల్లని జాడలు ఏర్పరుస్తాయి (కృష్ణసీతాల ఊ జువః, 1.'40.4). గాలిచేత ప్రేరించబడి ఆయన అడవిలో వ్యాపిస్తాడు (1.58.4, 5); అడవులని ఆక్రమించి భూమి జుట్టు కోస్తాడు (వనా వ్యస్థా దగ్నిర్ల దాతి రోమా పృథివ్యాః, 1.65.8); మంగలి (వప్తా) జుట్టు గొరిగినట్లు భూమిని గొరుగుతాడు (వప్తేవ శ్మశ్రు వపసి ప్రభూమ, 10.142.4).

35.8 అగ్నిజ్వాలలు శబ్దం చేసే సముద్రం కెరటాల వంటివి (సింధోరివ ప్రస్వనితనాస

ఊర్మయః, 1.44.12). ఆయనచేసే ధ్వని ఆకాశంలోని ఉరుము వంటిది (తన్యతు ర్యథా స్వానః, 5.25.8; 7.3.6). ఆయన ఉరిమే ఆకాశంలా అరుస్తాడు (అక్రంద దగ్నిః స్తనయన్నివ ద్యౌః, 10.45.4); గాలిలా పర్జన్యుడిలా శబ్దం చేస్తాడు (వాతస్వనం, పర్జన్యక్రంద్యం, 8.102.5); సింహంలా అరుస్తాడు (నానద న్నసింహః, 3.2.11). ఆయన అడవులని ఆక్రమించినప్పుడు ఎద్దులా అరుస్తాడు; గడ్డి తినే మంటలు లేచినప్పుడు ఆ చప్పుడుకి పక్షులు భయపడతాయి (1.94.10, 11). మరుత్తుల శబ్దంలా, విడిచిపెట్టబడిన సేనలా, ఆకాశం (నించి వచ్చే) పిడుగులా ఆయన ఎవరికీ పట్టుబడడు (నయో వరాయ మరుతా మవస్వనః, సేనేవ సృష్టా దివ్యా యథాశనిః, 1.143.5).

35.9 అగ్ని పైకి వెళ్లే జ్వాలలు కలవాడు (ఊర్ధ్వశోచిషం, 6.15.2). అగ్నులు వాయువు చేత ప్రేరించబడి ఆకాశంలోకి వెళ్తాయి (వాతజూతా ఉప ద్యవి, యతంతే, 8.43.4). ఆయన పొగ అంతటా వ్యాపిస్తుంది (చరిష్ణు ధూమం), ఆయన మంట పట్టుకోవడానికి శక్యం కానిది (అగృభీతశోచిషం, 8.23.1). ఆయన ఎర్రని పొగ ఆకాశం దాకా వెళ్తుంది (అచ్ఛా ద్యా మరుషోధూమ ఏతి, 7.3.3; 7.16.3); తెల్లని పొగ ఆకాశంలో వ్యాపిస్తుంది (తే ధూమ ఋణ్వతి దివిషన్‌శుక్ర ఆతతః, 6.2.6). ఆయన పొగ ఆకాశాన్ని స్తంభంలా నిలబెడుతుంది (మేతేవ ధూమం స్తభాయ దుపద్యాం, 4.6.2; మేతా = స్తంభం). ఆయన తన జ్వాలల శిఖలతో ఆకారశిఖరాన్ని అంటుతాడు ( ఉపస్పృశదివ్యం సానుస్తూపైః); ఆయన సూర్యుడి కాంతులతో కలిసిపోతాడు (సం రశ్మిభి స్తతనః సూర్యస్య, 7.2.1). ఆయన తన నాలుకతో ఆకాశాన్ని అంటుతాడు (పరి ద్యాం జిహ్వయాతనత్, 8.72.18); స్వర్గంలోని సముద్రానికీ (దివో అర్ణమచ్ఛా జిగాసి), సూర్యుడికి పైనా కిందా ఉన్న ప్రకాశించే ప్రదేశంలోని నీళ్లకీ వెళ్తాడు (3.22.3). దివోదాసుడి అగ్ని (★ = ఆయన పూజించిన అగ్ని) తల్లి అయిన భూమిమీదా, దేవతల వైపుకీ వ్యాపించి స్వర్గం శిఖరం మీద నిలబడింది.[2] అగ్నికి మాత్రమే ప్రత్యేకమైన ధూమకేతు- 'పొగ జండాగా కలవాడు' అనే విశేషణం తరచుగా వాడబడింది.

35.10 అగ్ని రథం మెరుపు (విద్యుద్రథః, 3.14.1); అది ప్రకాశించేది (భానుమంతం, 5.1.11; 1.140.1; 1.141.12; 10.1.5), బంగారపుది (హిరణ్యరథః, 4.1.8);

---

2. ప్ర దైవోదాసో అగ్నిర్దేవాన్ అచ్ఛా న మజ్మనా
అను మాతరం పృథివీం వివావృతే తస్థౌ నాకస్య సానవి (8.103.2).

అందమైనది (సురథః, 4.2.4). దాన్ని లాగేగుఱ్ఱాలు రెండు లేక అంతకన్న ఎక్కువ;[3] అవి నెయ్యి వీపుగా కలవి (ఘృతపృష్ఠాః, 1.14.6), ఎఱ్ఱనివి (రోహితాః, అరుషాః), పచ్చనివి (హరితః, 7.42.2); తెల్లనివి (శుక్రాన్, 4.2.2); మనస్సు కన్న వేగం కలవి (మనసా జవిష్ఠా, 4.2.3); వాయువు చేత ప్రేరించబడేవి (వాతజూతా, 1.94.10), (అగ్ని) మనస్సుని అనుసరించి రథాన్ని కట్టుకొనేవి (మనోయుజః, 1.14.6), చాలా రూపాలు కలవి (విశ్వరూపే భిరశ్వైః, 10.70.2). ఆయన రథికుడూ (రథీః, 1.25.3, మొ), యజ్ఞాన్ని తీసుకువచ్చేవాడూ (యజ్ఞస్య రథ్యం, 10.92.1, మొ.) అవడం వల్ల ఆయన దేవతలని తీసుకురావడానికిగుఱ్ఱాలని రథానికి కడతాడు (యుక్ష్వాహ్యరుషీ..... తాభిర్దేవాన్ ఇహా వహ, 1.14.12 (★ ఇందులో గుఱ్ఱాలు ఆడవి అని చెప్పబడింది); 3.6.6; 8.64.1). గుఱ్ఱాలు కట్టిన తన రథం మీద భార్యలతో కూడిన ముప్పై ముగ్గురు దేవతలని ఆయన యజ్ఞానికి తీసుకువస్తాడు (పత్నీవతస్త్రింశతం త్రీన్శ్చ దేవా ననుష్వధమా వహ, 3.6.9). ఆయన దేవతలతో కలిసి ఒకే రథంమీద వస్తాడు (దేవైః సరథం, 3.4.11; 7.11.1); ఆయన దేవతలకి ముందు వస్తాడు (దేవానా మగ్రయావా, 10.70.2).[4] ఆయన వరుణుణ్ణీ ఇంద్రుణ్ణీ స్వర్గాన్నించీ, మరుత్తులని అంతరిక్షాన్నించీ యజ్ఞానికి తీసుకువస్తాడు (వరుణం... ఇంద్రం దివో మరుతో అంతరిక్షాత్, 10.70.11).

35.11 వేదఋషుల సాధారణమైన అభిప్రాయంలో అగ్ని తండ్రి ద్యౌస్; ద్యౌస్ అగ్నిని పుట్టించాడు ( ఏనం ద్యౌర్జనయ త్సురేతాః, 10.45.8). ఆయన ద్యౌస్ శిశువు (దివః శిశుం, 4.15.6; 6.49.2); అసురుడి గర్భం (లోంచి పుట్టినవాడు, గర్భ అసురః, 3.29.11). ఆయన ద్యావా పృథువుల (= ద్యౌస్, భూమి) కొడుకు అని తరచుగా చెప్పబడింది (అగ్నే దివః సూనురసి.... తనా పృథివ్యాః, 3.25.1 (తనా = తనయుడు); 3.2.2; 3.3.11; 10.1.2; 10.2.7; 10.140.2). ఆయన ద్యావా పృథువులకే కాక త్వష్టకీ నీళ్లకీ పుట్టిన వాడని కూడా ఉంది (యం త్వా ద్యావాపృథివీ యం త్వాప స్త్వష్టా యంత్వాసుజనిమా జజాన, 10.2.7; 10.46.9; 1.95.2; 10.91.6; అ.వే. 1.33.1).

---

3. గుఱ్ఱాల విశేషణాలు 4.2.2లో బహువచనంలోనూ (శుక్రాన్, మొ.), 1.94.10 (వాతజూతా, మొ.), 4.2.3 (జవిష్ఠా, మొ.) లలో ద్వివచనంలోనూ ఉన్నాయి (1.14.6లో కూడా బహువచనమే వాడబడింది).

4. 3.6.9లో సరథం యాహ్యర్వాజ్ నానారథం వా ''(దేవతలతో) ఒకే రథంమీద కాని వేరు వేరు రథాలమీద కాని'' రమ్మని ప్రార్థన ఉంది.

ఇతరత్రా ప్రసంగవశాత్తూ ఉషస్సులు అగ్నినీ సూర్యుణ్ణీ యజ్ఞాన్నీ పుట్టించాయి (7.78.3) అనీ, ఇంద్రుడూ విష్ణువూ అగ్నినీ సూర్యుణ్ణీ ఉషస్సునీ పుట్టించారు (7.99.4) అనీ, ఇంద్రుడు అగ్నిని రెండురాళ్ల మధ్య పుట్టించాడు ( యో అశ్మనో రంత రగ్నిం జజాన, 2.12.3; చూ. 2.1.1; ★ ఇక్కడ అశ్మన్ = మేఘం అని సాయణుడు) అనీ చెప్పబడింది. అగ్ని 'ఇళా' పుత్రుడు ( ఇళాయా స్పుత్రః, 3.29.3) అనీ, యజ్ఞం/ ఉదకం యొక్క గర్భం (గర్భ మృతస్య, 6.48.5) అనీ కూడా వర్ణించబడ్డాడు. అగ్నిని దేవతలు ఆర్యులకి జ్యోతిగా పుట్టించారు (దేవాసోఽ జనయంత దేవం వైశ్వానర జ్యోతి రి దార్యాయ, 1.59.2; 6.7.1; 8.102.17); మనుష్యుడికోసం ఉత్పత్తి చేశారు (దేవాసో మనవే దధుః, 1.36.10; 10.46.9), మనుష్యులలో పెట్టేరు (అగ్నిం దేవాసో మానుషీషు విక్షుప్రియం ధుః, 2.4.3 (విక్షు = ప్రజలలో); 6.16.1; 8.84.2) అని కూడా ఉంది. ఆయన దేవతలకి తండ్రీ, పుత్రుడూ కూడా (దేవానాం పితా పుత్రఃసన్, 1.69.1; చూ. అధ్యాయం 8.3) అని కూడా చెప్పబడింది. పైకి పరస్పర విరుద్ధంగా కనపడే ఈ ఉక్తులకి కారణమైన వివిధ దృక్కోణాలు బాగా స్పష్టంగానే తెలుస్తున్నాయి.

35.12 అగ్ని విషయంలో పురుషతారోపం కొంచెంగానే వృద్ధిపొందడం వల్ల యజ్ఞాగ్నిగా ఆయన ముఖ్యకృత్యాన్ని గురించీ, ఆయన పుట్టుకలూ, రూపాలూ, స్థానాలూ - వీటిని గురించే ఆయనకి సంబంధించినగాథలు ముఖ్యంగా చెప్తాయిగాని ఇతరకృత్యాలనిగురించి అంతగా చెప్పవు.

35.13 అగ్ని పుట్టుకలనిగురించి వేరువేరుగా చెప్పే వర్ణనలు ఆయనవేరువేరు జన్మస్థానాలని సూచిస్తాయి కాబట్టి అవి పరస్పర విరుద్ధాలు కావు. అరణుల రాపిడివల్ల ఆయన రోజూ భూమిమీద పుట్టడం తరచు సూచించబడింది (అరణ్యో ర్నిహితో జాతవేదా గర్భ ఇవ సుధితో గర్భిణీషు, 3.29.2; 3.23.2, 3; 7.1.1; 10.7.9). ఈ అరణులు (= అగ్ని పుట్టడంకోసం మథించేకర్రలు) ఆయనతల్లిదండ్రులు; వీటిలో పైది తండ్రీ, కిందది తల్లీ (3.29.3). లేక ఆయన ద్విమాతా ' ఇద్దరు తల్లులు కలవాడు' (1.31.2) అని చెప్పబడడం వల్ల ఆ రెండు తల్లులే కావచ్చు (10.79.4). రెండు అరణులూ అప్పుడే పుట్టిన పిల్లవాడి వంటి ఆయన్ని పుట్టిస్తాయి ( ఉత స్మయం శిశుం యథానవం జనిష్టారణీ, 5.9.3); ఆయన్ని పట్టుకోవడం కష్టం ( దుర్గృభీయసే, 4). ఎండిన కర్రనించి జీవంగల

ఈయన పుడతాడు (శుష్కా ద్యద్దేవ జీవో జనిష్ఠాః, 1.68.3). ఈ పిల్లవాడు పుట్టగానే తల్లులని భక్షిస్తాడు (జాయమానో మాతరాగర్భో అత్తి, 10.79.4). ఈ శిశువు తల్లుల దగ్గరికి పాలుతాగడానికి వెళ్లడు (న యో మాతరా వప్యేతి ధాతవే, 10.115.1); ఆ తల్లి పొదుగు లేనిది (అనూధాః). అరణులనించి అగ్నిని పుట్టించడాన్ని సూచిస్తూ మనుష్యులైన ఋత్విక్కులు ఆయన్ని పుట్టించారు (య మృత్విజో ..... మానుషాసః .... జీజనంత 1.60.3; 4.1.1; 7.1.1) అని చెప్పబడింది; ఈయన్ని పుట్టించే పదిమంది యువతులు (దశ..... యువతయః, 1.95.2) అంటే ఋత్విక్కుపై అరణిని తిప్పడానికి ఉపయోగించే పదివేళ్లు (దశక్షిపః... అజీజనన్.... అగ్నిం 'పది వేళ్లు అగ్నిని పుట్టించాయి', 3.23.3). ఈ తిప్పబడే పై అరణికి ప్రమంథ- అనేపేరు అర్వాచీన కాలానికి చెందిన కర్మప్రదీపం (1.75) అనే శ్లోకరూపమైన స్మృతిగ్రంథంలో మొట్టమొదటసారిగా వాడబడింది; బాహ్యదృష్టికి కనపడే పోలికవల్ల కొందరు దీనికీ గ్రీకుభాషలోని ప్రామేథెయుస్ అనేపదానికీ సాజాత్యం ఉందని భావించారు. కాని ఈ గ్రీకుపదం గ్రీకుభాషలో మాత్రమే ఏర్పడినట్లు అన్నివిధాలా కనపడుతుంది; వేదంలో నిప్పుని పుట్టించడం అనే అర్థంలో వాడబడిన మథ్- 'మథించు' అనే ధాతువు నిస్- అనే ఉపసర్గతోనే కలిసివస్తుంది కాని ప్ర- అనే ఉపసర్గతో కలిసి ఎక్కడారాదు.

35.14 అగ్ని తరచుగా సహసః సూను- / పుత్ర- / (ఒకచోట యువన్-) 'బలానికి కొడుకు' అని చెప్పబడడానికి కారణం బహుశా అరణులని మథించడానికి ఎక్కువ బలం అవసరం కావడమే కావచ్చు. ఋగ్వేదంలోని ఒక మంత్రం (6.48.5) ఈ వివరణని సమర్థిస్తుంది: ''భూమిమీద ఎత్తైన ప్రదేశంలో మనుష్యులచేత బలంతో మథించబడిన అగ్ని పుడతాడు'' (సహసా యో మథితో జాయతే నృభిః పృథివ్యా అధిసానవి). ఒక అర్వాచీన గ్రంథం ప్రకారం (మై.సం. 1.6.10) అగ్ని మథనం సూర్యోదయానికి ముందు జరగకూడదు. ప్రతి ఉదయమూ యజ్ఞం కోసం అగ్ని పుట్టించబడతాడు కాబట్టి ఆయనకి మాత్రమే ప్రత్యేకమైన యవిష్ఠ- / యవిష్ఠ్య- 'అందరిలోకీ చిన్నవాడు' అనే సముచిత విశేషణం తరచుగా వాడబడింది. ఆయనకి పురాతనమైన జన్మలూ నూతన జన్మలూ ఉన్నాయి (3.1.20). ఆయన ముసలివాడై మళ్లీ మళ్లీ యువకుడు అవుతాడు (జుజుర్వాన్‌యో ముహురా యువా భూత్, 2.4.5; జుజుర్వాన్ = ముసలివాడు). అందువల్ల ఆయన ముసలివాడు అవడు (1.128.2); ఆయన కొత్తకాంతి పాతకాంతిలాగే

ఉంటుంది (6.16.11). మరికొందరు దేవతలలాగే ఈయన కూడా యువా 'యువకుడు' అని చెప్పబడ్డాడు; అదే సమయంలో ఈయన వృద్ధుడు కూడా. అగ్నికన్న పూర్వుడైన హోత లేడు (న త్వ ద్ధోతా పూర్వః, 5.3.5); ఆయన మొట్టమొదటి యజ్ఞానికి కర్త అవడమే దీనికి కారణం (యజ్ఞస్యనేతా ప్రథమస్య, 3.15.4). పూర్వకాలంలో ఉషస్సుల తరవాత ఆయన ప్రకాశించాడు (1.44.10); పూర్వుల యజ్ఞాలలో అగ్ని వహించిన పాత్ర తరచు చెప్పబడింది (8.43.13, మొ.). అందువల్ల ఒకే సందర్భంలో ఆయన వృద్ధుడనీ అందరిలోకీ చిన్నవాడనీ విరోధాభాసంతో కొన్నిచోట్ల చెప్పబడింది (చూ. పైన 2.4.5; నవ్యః 'యువకుడు', పలితః 'తలనెరిసినవాడు', 10.5.5).

35.15 అగ్ని కొయ్యలో పుడతాడని చాలా తరచుగా చెప్పబడింది (వనేజాః 'అడవిలో పుట్టినవాడు', 6.3.3; పర్వభిర్వావృధానః 'పుల్లలవల్ల వృద్ధిపొందేవాడు', 10.79.7); ఆయన లతాదుల గర్భం (లో ఉండేవాడు, గర్భో వీరుధాం, 2.1.14; 3.1.13); మొక్కలలో ఉండేవాడు (విభృత ఓషధీషు, 10.1.2). ఆయన మొక్కలలో ఉండేవాడు; వాటి గర్భంలో మళ్లీ పుడతాడు ( ఓషధీ రనురుధ్యసే, గర్భే సన్ జాయసే పునః, 8.43.9). ఆయన అడవులకి గర్భం (గర్భో వనానాం, 1.70.4), అడవులనించీ మొక్కలనించీ పుడతాడు (త్వం వనేభ్య స్త్వ మోషధీభ్యః .... జాయసే, 2.1.1) అని చెప్పినచోట్ల అడవులలో చెట్లకొమ్మల రాపిడివల్ల అగ్ని పుట్టడం ధ్వనితమై ఉండవచ్చు.

35.16 'అగ్ని భూమికి బొడ్డు' (నాభి రగ్నిః పృథివ్యాః, 1.59.2) అని చెప్పడంవల్ల కూడా అగ్ని భూమిమీద ఉంటాడని సూచించబడుతోంది. చాలాచోట్ల వచ్చిన ఈ ఉక్తి యజ్ఞంలో వేదిమీద అగ్నిని ఉంచేస్థానాన్ని సూచిస్తుందనుకోవచ్చు. యజ్ఞకర్మలో 'నాభి' అనేపదం ఉత్తరవేదిలో అగ్నిని పెట్టేగొయ్యికి సంకేతం. ఈ అర్థం ఈ పదానికి మొదట్లోనించీ ఉండడం వల్లనే ''నిన్ను (= అగ్నిని) దేవతలు అమర్త్యత్వానికి నాభిని చేశారు'' (త్వాం... దేవా అకృణ్వ న్నమృతస్య నాభిం, 3.17.4) అనే అలంకార యుక్త ప్రయోగం పుట్టి ఉండవచ్చు. ఋ.వే. లో వేదిసద్- 'వేదిమీద కూర్చునేవాడు' అనే విశేషణం వాడబడిన రెండుచోట్లా అది అగ్నికే వర్తిస్తుంది.

35.17 అంతరిక్షజలాలలో అగ్ని ఉత్పత్తి తరచుగా చెప్పబడింది. 24వ అధ్యాయంలో చెప్పినట్లు 'అపాం నపాత్' ప్రత్యేక దేవత అయ్యాడు. అగ్ని నీళ్లకి కూడా గర్భం (అపాం

గర్భం; 3.1.12, 13); ఆయన నీళ్లలో కూడా పుడతాడు (★ నీళ్లు ఆయన మూడో స్థానం, తృతీయ మప్సు (జజే), 10.45.1; అ.వే. 13.1.50); ఆ ఎద్దు నీళ్ల ఒడిలో పెరిగింది (అపా ముపస్థే మహిషో వవర్ధ, 10.8.1); ఆయన సముద్రంలో ఉంటాడు (సముద్రవాససం, 8.102.5). ఆయన మేఘాలు అనే ద్వీపం (ధను-) నించి దిగుతాడు (1.44.5; 10.4.5); ప్రకాశించే (అంతరిక్ష) స్థానంలో ప్రకాశించే మెరుపు (స శ్వితాన స్తన్యతూ రోచనస్థాః, 6.6.2; శ్వితానః = ప్రకాశించేవాడు). ఇటువంటి మంత్రాలలో ఉద్దిష్టమైనది అగ్ని రూపాంతరమైన మెరుపు అనవచ్చు. ఋగ్వేదంలో కొన్ని అర్వాచీన సూక్తాలలో (10.51.3; 10.124) నీళ్లలోనూ మొక్కలలోనూ దాగిన అగ్నిని దేవతలు వెతికి పట్టుకొన్నారు అని ఒక కథ ఉంది. ఈ కథ బ్రాహ్మణాలలో కూడా తరచుగా ఉంది. అథర్వవేదంలో నీళ్లలోని అగ్నులకీ మెరుపు మార్గంలో పోయే అగ్నులకీ / మెరుపులోని దివ్యాగ్నికీ (అ.వే. 3.21.1, 7; 8.1.11) భేదం చెప్పబడింది; అగ్నులు భూమిమీద ఉంటాయని కూడా చెప్పబడింది (అ.వే. 12.1.37). ఋ.వే.లో కూడా ఒక మంత్రం (8.39.8; చూ. ఆ.శ్రౌ.సూ. 5.2.1) లో అగ్ని అన్ని నదులలోనూ ఉంటాడు (శ్రితో విశ్వేషు సింధుషు) అని ఉంది; యజ్ఞకర్మకి సంబంధించిన తరవాత కాలపు గ్రంథాలలో చెరువులూ, నీటిపాత్రల విషయంలో నీళ్లలోని అగ్ని ప్రార్థించబడతాడు. అందువల్ల వేదకాలంలోని ప్రాచీనావస్థలోనే, అగ్నిపుట్టే (అంతరిక్ష) జలాలు కాకపోయినా, అగ్ని అంతర్లీనమై ఉన్న నీళ్లు అని చెప్పినప్పుడు భూమిలోని నీళ్లే ఉద్దిష్టమై ఉంటాయని చెప్పవచ్చు. ఓల్డెన్‌బెర్క్ (Oldenberg) భూమిలోని నీళ్లే ముఖ్యంగా ఉద్దిష్టమై ఉంటాయని చెప్పి, మూడో మండలంలోని ప్రథమసూక్తంలో కూడా అగ్ని రూపాంతరమైన మెరుపు ఉద్దిష్టమైంది అనే విషయంలో సందేహం వ్యక్తం చేశారు. ఈ విషయం ఎలా ఉన్నా, నీళ్లలో అగ్ని ఉంటాడు అనే భావన వేదాలలో అంతటా ప్రచురంగా ఉంది. సూర్యుడికి ఆకాశంలా అగ్నికి నీళ్లు నివాసస్థానం (అప్స్వగ్నిం దివి సూర్యం, 5.85.2; చూ. అ.వే. 13.1.50; 19.33.1). అడవులూ మొక్కలతోపాటు నీళ్లు కూడా ఆయన నివాసస్థానం అని తరచు చెప్పబడింది (2.1.1, మొ॥).

35.18 స్వర్గంలో అగ్ని ఉత్పత్తి కూడా తరచుగా చెప్పబడింది. ఆయన ఎత్తైన స్వర్గం (పరమే వ్యోమని) లో పుట్టేడు (1.143.2; 6.8.2); ఎత్తైన స్వర్గంలో ఉన్నాడు, లేడు (అసచ్చ సచ్చ పరమే వ్యోమన్, 10.5.7); స్వర్గాన్నించి / దూరాన్నించి మాతరిశ్వుడిచేత

తీసుకురాబడ్డాడు (అధ్యాయం 25). మెరుపు స్వర్గాన్నించీ నీళ్లనించీ వస్తుందని భావించబడడం వల్ల (అ.వే. 3.21.1, 7; 8.1.11) ఇటువంటి సందర్భాలలో అగ్ని మెరుపుకి ప్రతీక అనడంలో సందేహం లేదు; ఐ.బ్రా. (7.7.2) లో మెరుపు స్వర్గంలోది (దివ్య-) అనీ నీటిలోది (అప్సుమత్-) అనీ కూడా చెప్పబడింది. అగ్నితోపాటు మెరుపు విద్యుత్- అనే దాని అసలు పేరుతో సూచించబడినప్పుడు (ఈ పదం ఋ.వే.లో 30 సార్లకన్న తక్కువగానే వచ్చింది). ఈరెండింటికీ సాధారణంగా పోలికచెప్పబడడం వల్ల ఈ రెండిటికీ భేదం సూచితమయింది; దీనికి కారణం అగ్ని దేవతలా కాక మెరుపు ప్రకృతి పదార్థం అవడం అనడంలో సందేహం లేదు. నిప్పు స్వర్గాన్నించి భూమికి దిగి వచ్చింది అనే గాథ కూడా స్వర్గంలోని అగ్నీ మెరుపూ ఒకటే అనే భావాన్ని సూచిస్తుంది; ఈ గాథకి మూలం పిడుగుపాటువల్ల మంటలు పుట్టడాన్నిగమనించడం అనడంలో సందేహం లేదు. మానవుడుకి అగ్ని దొరకడం దేవతలు ఇచ్చిన వరం అనీ, అగ్నిని మాతరిశ్వుడు పుట్టించాడు అనీ ఉన్న భావనలలో కూడా అగ్నికి ఉత్పత్తి స్థానం స్వర్గం అనేది సూచితమవుతుంది; అగ్నిని మానవులకి అతిథి అని తరచు చెప్పడంలో కూడా ఇదే అభిప్రాయం ధ్వనిస్తుంది (అతిథి ర్మానుషీణాం, 5.1.9, మొ.)

35.19 పైగా, మరికొన్ని సందర్భాలలో అగ్నికీ సూర్యుడికీ అభేదం సూచితమయింది; సూర్యుడు అగ్ని రూపాంతరం అనే భావన వేదకాలంలో ఉన్నదే. ఉదాహరణలు : అగ్ని స్వర్గానికి జండా (కేతుందివః), ప్రకాశించే స్థానంలోనివాడు (రోచనస్థాం), ఉషఃకాలంలో లేచేవాడు (ఉషర్బుధం), స్వర్గానికి తల (అగ్నిం మూర్ధానం దివః, 3.2.14). ఆయన అన్ని లోకాలనీ చూస్తాడు (యో విశ్వా భి పశ్యతి భువనా, 10.187.4); ఈ అంతరిక్షానికి అవతలవైపు పుట్టేడు (యో అస్యపారే రజసః శుక్రో అగ్ని రజాయత, 5). ఆయన ప్రాతఃకాలంలో ఉదయించే సూర్యుడుగా పుడతాడు (సూర్యో జాయతే ప్రాతరుద్యన్, 10.88.6). సూర్యుడు అస్తమించి అగ్నిలో ప్రవేశిస్తాడనీ మళ్లీ అగ్నిలోంచి పుడతాడనీ ఐ.బ్రా. (8.28.9, 13) చెప్తుంది. అగ్ని సూర్యుడి కిరణాలతో / కాంతితో కలుస్తాడని చెప్పిన ఋ.వే. మంత్రాలలో కూడా ఈ అభిప్రాయమే సూచితమైంది (సంభానునాయతతే సూర్యస్య.... ఘృతపృష్ఠః, 5.37.1; సం రశ్మిభి స్తతనః సూర్యస్య, 7.2.1; సంతతనః = సంగమించు). మనుష్యులు యజ్ఞంలో అగ్నిని పుట్టించినప్పుడు, స్వర్గంలోనివారు ఆయన్ని పుట్టిస్తారు (6.2.3); అగ్ని స్వర్గంలో ప్రకాశిస్తాడు (అగ్నే దీదీయసి ద్యవి, 8.44.29;

3.27.12) - ఈ వాక్యాలు కూడా అగ్నికీ సూర్యుడికీ ఏకత్వాన్ని ప్రతిబింబిస్తాయి. కాని కొన్నిచోట్ల ఉద్దిష్టమైనది మెరుపా సూర్యుడా అనేది నిర్ణయించడం కష్టం. సూర్యుడికి ప్రకృతి పదార్థంగానూ దేవతగానూ ప్రత్యేకస్థానం ఉండడం వల్ల ఆయన అగ్ని రూపాంతరం అని స్పష్టంగా చెప్పినచోట్లు చాలా తక్కువ. అగ్ని సాధారణంగా భూమిలోని ఆకృతిగానే భావించబడడం వల్ల అగ్నికీ సూర్యుడికీ అభేదంకన్న పోలికే ఎక్కువగా చెప్పబడింది. ఉదాహరణకి ఋగ్వేదఋషి ఇలా అంటారు: కళ్లు సూర్యుడివైపుకి వెళ్లినట్లు దేవతలని కోరేవారి మనస్సులు అగ్నివైపుకి వెళ్తాయి (అగ్ని మచ్ఛా దేవయతాం మనాంసి, చక్షూంషీవ సూర్యే సం చరంతి, 5.1.4). అదే సమయంలో అగ్ని ఇతర రూపాలని ధ్వనించే ప్రస్తావనలు కూడా తరచుగా ఉన్నాయి; అందువల్ల చాలా సందర్భాలలో ఏ రూపం ఉద్దిష్టమైంది అనేది సందేహాస్పదంగా ఉంటుంది.

35.20 పైనచెప్పినట్లు అగ్నికివేరు వేరు జన్మలు ఉండడం వల్ల, ఆయనకి మూడు రకాల స్వభావం ఉన్నట్లు తరచు భావించబడింది; ఇది చాలా మంత్రాలలో త్రి 'మూడు' అనే అంకె రూపాలతో వాచ్యంగానే చెప్పబడింది. వేదకాలంలో వేదాంతపరమైన చాలా భావనలకి ప్రాచీనమైన ఈ త్రిరూపత్వం ఆధారం కాబట్టి ఇది చాలా ముఖ్యమైనది అగ్ని జన్మలు మూడు (విధాలైనవి) (త్రీణి జానా పరిభూషం త్యస్య, 1.95.3; త్రిరస్య.... జనిమాని, 4.1.7). దేవతలు అగ్నిని మూడు (రకాలు)గా చేశారు (దేవాసః..... తమూ అకృణ్వన్ త్రేధా, 10.88.10). ఆయన మూడు ధాతువులు (= రూపాలు) కలవాడు (త్రిధాతుః, 3.26.7); మూడు తలలు కలవాడు (త్రిమూర్ధానం, 1.146.1), మూడు నాలుకలూ (తిస్రస్తే జిహ్వాః, 3.20.2), మూడు శరీరాలూ (తిస్ర ఉతే తన్వః), మూడు స్థానాలూ (త్రీ షధస్థా) కలవాడు. త్రిషధస్థ- 'మూడు స్థానాలు కలవాడు' అనే విశేషణం ముఖ్యంగా అగ్నికేచెందుతుంది; త్రిపస్త్య- 'మూడు నివాసాలు కలవాడు' అనేది వచ్చిన ఒకే ఒకచోటా (8.39.8) అది అగ్నికే విశేషణం. ఈ త్రిరూపత్వానికి వివరణ అన్నిచోట్లా ఒకేరకంగా లేదు; రూపాలని చెప్పిన క్రమం కూడా ఒకేవిధంగా లేదు. ఉదాహరణకి ఒక ఋషిచెప్పినది: ''మొదట్లో అగ్ని స్వర్గాన్నించి పుట్టేడు; రెండోసారి మననించి (= మనుష్యుల నించి), మూడోసారి నీళ్లలో ''(దివస్పరి ప్రథమం జజ్ఞే అగ్ని రస్మద్ద్వితీయం పరిజాతవేదాః, తృతీయ మప్సు, 10.45.1; చూ. 10.45.2, 3). ఇతర మంత్రాలలో అగ్ని స్థానాల క్రమం: స్వర్గం, భూమి, నీళ్లు (8.44.16; 10.2.7; 10.46.9); మరొక మంత్రంలో

(1.95.3) క్రమం ఇలా మారి ఉంది: సముద్రం, స్వర్గం, నీళ్లు (సముద్ర ఏకం దివ్యేక మప్సు). కొన్నిచోట్ల భూమిమీద అగ్ని ముందు వస్తాడు: ''మొదట్లో ఆయన ఇళ్లలో పుట్టేడు, గొప్ప అంతరిక్షమూలంలో, దాని యోనిలో (పుట్టేడు)'' (సజాయత ప్రథమః పస్త్యాసు, మహో బుధ్నే రజసో అస్యయోనౌ, 4.1.11); ''మృత్యువు లేనివారు (= దేవతలు) అగ్ని మూడు కాంతులని పుట్టించారు (తిస్రో .... సమిధః .... అగ్నే రపునస్ .... అమృత్యవః); వాటిలో ఒకదాన్ని మనుష్యుడి ఉపయోగానికి పెట్టేరు (తాసా మేకా మదధుర్మర్త్యే భుజం; భుజం = ఉపయోగించేదాన్ని); రెండు సోదరి అయిన లోకానికి వెళ్లాయి (లోక ముద్వే ఉప జామి మీయతుః, 3.2.9). ఆప.శ్రౌ.సూ. (5.16.4)లో జంతువులలో ఉండే భూమిమీద అగ్నికీ, నీళ్లలో ఉండే అంతరిక్షాగ్నికీ, సూర్యుడిలో ఉండే స్వర్గలోకాగ్నికీ భేదం చెప్పబడింది. అరుదుగా భూమిమీద ఉండే అగ్ని మూడోదిగా వస్తుంది: ఈయన ముగ్గురు సోదరులలో ఒకడు; వీరిలో ''మధ్యముడు మెరుపు (అశ్నః) (తస్యభ్రాతా మధ్యమో అస్త్యశ్నః); మూడో సోదరుడు నెయ్యి వీపుగా కలవాడు'' (తృతీయో భ్రాతా ఘృతపృష్ఠః, 1.164.1; చూ. 1.141.2). ''అగ్ని ఆకాశాన్నించి ప్రకాశిస్తాడు; విశాలమైన అంతరిక్షం అగ్ని దేవతకి చెందినది; ఆహుతులని తీసుకువెళ్లే ఘృతప్రియుడైన అగ్నిని మనుష్యులు పుట్టిస్తారు'' (అ.వే. 12.1.20; చూ. 13.3.21; 18.4.11).

35.21 అగ్ని మూడోరూపం అత్యున్నతస్థానంలోనిది అని ఒకచోట (10.1.3; చూ. 5.3.3; 1.72.2, 4) చెప్పబడింది. 10.88.10లో అగ్నికి చెప్పబడిన మూడు స్థానాలు (చూ. అధ్యాయం 35.20) భూమి, అంతరిక్షం, స్వర్గం అని శాకపూణి అనే ప్రాచీన మహర్షి చెప్పినట్లూ, స్వర్గంలోని అగ్ని మూడోరూపం సూర్యుడు అని ఒక బ్రాహ్మణంలో ఉన్నట్లూ (యదస్య దివి తృతీయం తదసావాదిత్యః ఇతి(హి) బ్రాహ్మణం) యాస్కుడు (నిరుక్తం 7.28) చెప్పేరు (చూ. నిరుక్తం 12.19). ఋ.వే.లో స్పష్టంగా గుర్తించబడిన అగ్ని త్రిరూపత్వం కొంచెం తరవాత కాలానికి చెందిన సూర్యుడు, వాయువు, అగ్ని అనే త్రితయానికే కాక ఋగ్వేదంలోది కాకపోయినా ప్రాచీనమే అయిన సూర్యుడు, ఇంద్రుడు, అగ్ని అనే త్రితయానికి కూడా మూలం; సూర్యుడు, వాయువు, అగ్ని అనే త్రితయం 8.18.9లో చెప్పబడింది; వీరిలో ఒక్కొక్కరు ఒక్కొక్క లోకంలో ఉన్నట్లు 10.158.1; అ.వే. 4.39.2లలో చెప్పబడింది; మరొకమంత్రం (1.164.44)లో

సూచించబడింది.[5] ఈరెండు త్రితయాలలోనూ వాతుడూ / వాయువూ, ఇంద్రుడూ బ్రాహ్మణాలూ, వ్యాఖ్యాతలూ వైద్యుతాగ్ని ( = మెరుపు రూపమైన అగ్ని) అని చెప్పిన అగ్ని రూపాంతరం స్థానంలో వచ్చారు. ఇటువంటి మార్పు జరగడానికి మెరుపుకి నిలకడలేకపోవడం ఒక కారణమూ, మెరుపు పురుషతారోపానికి 'అగ్ని' అనే పేరు తప్ప వేరొక పేరు లేకపోవడం మరొక కారణమూ అయి ఉండవచ్చు; మెరుపు పురుషతారోపానికి పేరు లేకపోవడం వల్ల ఇది విశేషణాల ద్వారానో సూచనల ద్వారానో మాత్రమే చెప్పడం సాధ్యమవుతుంది. అగ్ని త్రిరూపత్వం యజ్ఞంలో అగ్నిని మూడు అగ్నులుగా విభజించడానికి సూచనమై దానికి వివరణ ఇస్తుంది; ఇది బ్రాహ్మణాలలో చెప్పబడిన యజ్ఞకర్మకి ముఖ్యాంగం. యజ్ఞంలోని మూడు అగ్నులకీ ఇంట్లో నిత్యార్చనకి ఉపయోగించే గార్హపత్యాగ్నికీ భేదం ఉంది. అందువల్ల యజ్ఞకర్మ అగ్ని త్రిరూపత్వం ఆధారంగా ఏర్పరచబడిందన్నమాట. ఇది ఎలా ఉన్నా, అర్వాచీన సాహిత్యంలో యజ్ఞంలోని మూడు అగ్నులు ఋ.వే. చెప్పిన అగ్ని మూడు రూపాలకి ప్రతీకలుగా భావించబడ్డాయి. యజ్ఞంలో మూడు అగ్నులని అర్చించడం ఋ.వే. కాలం నించీ లేక ఇంకా అంతకన్న ప్రాచీనకాలంనించీ వచ్చిన ఆచారం అయి ఉండవచ్చు. ఉదాహరణకి, అగ్ని దేవతలని తీసుకువచ్చి మూడుస్థానాలలో ( యోనిషు) కూర్చోవాలి అని ప్రార్థన ఉంది ( ఆ వక్షి దేవాన్ ఇహ.... ని షదా యోనిషు త్రిషు, 2.36.4; చూ. 5.11.2; 10.105.9).

35.22 కొన్ని మంత్రాలలో అగ్నికి రెండు జన్మలు ఉన్నట్లు చెప్పబడింది; ద్విజన్మన్ అని చెప్పబడిన ప్రత్యేక దేవత ఈయన ఒక్కడే (1.60.1; 1.140.2; 1.149.2, 3). ప్రపంచాన్ని స్వర్గం, భూమి అని రెండు భాగాలుగా విభజించడమే దీనికి ఆధారం అనడంలో సందేహం లేదు. అగ్నికి ఉన్నతస్థానంలోనూ (పరమే జన్మన్), కిందస్థానంలోనూ ( అవరే

---

5. శమగ్నిరగ్నిభిః కరచ్ఛం నస్తపతు సూర్యః
శం వాతో వా త్వరపా అప స్రిధః (8.18.9)
''అగ్ని తనరూపాలతో సుఖం కలగజేయుగాక! సూర్యుడు మాకు సుఖం కలిగేటట్లు ప్రకాశించుగాక! పాపం పోగొట్టే వాయువు సుఖంగా వీచుగాక! ( వీరు) శత్రువులని పోగొట్టాలి.''
సూర్యో నో దివస్పాతు వాతో అంతరిక్షాత్
అగ్నిర్నః పార్థివేభ్యః (10.158.1)
''సూర్యుడు స్వర్గలోకంనించీ, వాయువు అంతరిక్షాన్నించి, అగ్ని పృథివి స్థానాలనించి మమ్మల్ని రక్షించుగాక!''

సధస్థే) జన్మలు ఉన్నట్లు చెప్పబడంది (2.9.3); ఆయన ఉన్నత ప్రదేశాలలోనూ, కింద ప్రదేశాలలోనూ నివాసం కల్పించుకొంటాడు (సదో దధాన ఉపరేషు సానుష్వగ్నిః పరేషు సానుషు, 1.128.3) సాధారణంగా భూమిమీద అగ్నికీ స్వర్గంలోని అగ్నికీ భిన్నత్వం చెప్పబడింది (3.54.2; 10.45.1) కాని అధమపక్షం ఒక మంత్రం (8.43.28)లో స్వర్గంలో పుట్టిన అగ్నికీ నీళ్లలో పుట్టిన అగ్నికీ భిన్నత్వం చెప్పబడింది (యదగ్నే దివిజా అస్యప్సుజా వా). అగ్ని ఆయన ఉన్నతస్థానం నించి రమ్మని ప్రార్థన ఉంది (పరమాచ్చిత్ సధస్థాత్, 8.11.7); ఆయన అక్కడనించి కింద స్థానాలకి వస్తాడు (8.75.15) అత్యున్నతమైన తండ్రి (= స్థానం) నించి ఆయన తేబడినప్పుడు ఆయన మొక్కలలో పెరుగుతాడు (ప్రయత్పితుః పరమాన్నీయతే.... వీరుధో దంసు రోహతి, 1.141.4) ఇందులో అగ్ని వానతోపాటు కిందకి వచ్చి మొక్కలలో ప్రవేశించి వాటినించి మళ్లీ పుడతాడు అనే భావన ఉంది. అగ్నులూ నీళ్లూ కిందకిదిగివచ్చి మళ్లీ పైకి వెళ్తాయి (1.164.51). అగ్నికి ఉన్న రెండు రూపాలు ఆధారంగా ''నిన్ను నువ్వే యాగరూపంలో అర్చించుకో'' (యజస్వతన్వం సుజాత, 10.7.6); ''అగ్నీ! మిత్రుణ్ణీ, వరుణుణ్ణీ ఇంద్రుణ్ణీ, అగ్నినీ తీసుకురా!'' (అగ్నే....మిత్రం వహ వరుణ మింద్రమగ్నిం, 7.39.5) ''దేవతలతోపాటు కలిసిరా!'' (3.6.9, మొ.) - ఇటువంటి ప్రార్థనలు ఏర్పడ్డాయి. అగ్నిని మనుష్యులు (యజ్ఞంలో) పుట్టించినట్లు దేవతలు కూడా పుట్టిస్తారు (6.2.3) అనే భావన కూడా ఈ భిన్నత్వం మీద ఆధారపడినదే. స్వర్గంలో కూడా ఎవరో ఒకరు అగ్నిని పుట్టించాలి అనీ, దేవతలు కూడా మనుష్యులలా యజ్ఞం చెయ్యాలి అనీ అనుకోవడం వల్లనే ఈ భావన ఎర్పడింది (చూ. ఐ. బ్రా. 2.34).

35.23 మరొక దృక్కోణంనించి చూడడం వల్ల అగ్ని 'భూరిజన్మా' ('చాలా జన్మలు కలవాడు') అనిచెప్పబడ్డాడు (10.5.1). ఇలా చెప్పడానికి కారణం అగ్ని చాలా యజ్ఞాలలో పుట్టించబడడమే అనడంలో సందేహం లేదు. అగ్ని ప్రతి కుటుంబంలోనూ, ప్రతి ఇంట్లోనూ ప్రతి స్థానంలోనూ ఉంటాడని తరచు చెప్పబడింది (విశ్వేషా మధ్వ రాణాం హస్కర్తారం దమేదమే 'ప్రతి ఇంట్లోనూ అన్ని యజ్ఞాలలోనూ ప్రకాశించేవాణ్ణి (చూస్తారు)', 4.7.3, 4.6.8; 4.7.1; 5.1.5· 5.6.8, మొ.); ఆయన చాలాచోటుల్లో పుట్టించబడతాడు (పురుధ ప్రసూతః 3.54.19)· ఆయనకి చాలా శరీరాలు ఉన్నాయి (తేభిర్వర్ధస్వ తన్వః శూరపూర్వీః, 10.98.10, పూర్వీః = చాలా తన్వః = శరీరాలు). చాలాచోటుల్లో

విభజించిపెట్టబడినా ఆయన ఒకేలాగ (బహుధా రాజా విభృతః పురుత్రా, 3.55.4). ఒకడే అయినఅగ్ని చాలాచోట్ల వెలుగుతాడు (ఏక ఏవాగ్ని ర్బహుధా సమిద్ధః, వాలఖిల్యం 10 2 = 8.58.2). ఇతరమైన అగ్నులు అగ్నికి చెట్టుకి కొమ్మలుగా ఉంటాయి (అన్యే అగ్నయ ఉపక్షితో వయా ఇవ 8 19 33). అందువల్ల ఆయన ఇతరమైన అగ్నులతోపాటు ప్రార్థించబడతాడు (అగ్నిం వోదేవ మగ్నిభిః సజోషాః, 7.3.1; 8.18.8; 8.49.1; 10.141.6); అన్ని అగ్నులతోపాటు రమ్మని ఆయన్ని ఆహ్వానించడం కూడా ఉంది (విశ్వేభిరగ్నే అగ్నిభి రిమం యజ్ఞం 1 26 10· 6.12.6).

35.24 అగ్ని స్థానాలని/జన్మస్థానాలని గురించి చెప్పేటప్పుడు పదార్థాలని ప్రత్యేకించి చెప్పడం కూడా కొన్నిచోట్ల ఉంది. ఉదాహరణకి ఆయనస్వర్గంలోనూ, భూమిమీదా, అంతరిక్షంలోనూ, నీళ్లలోనూ, మొక్కలలోనూ ప్రకాశిస్తాడని చెప్పబడింది (3.22.2); ఆయనస్వర్గాలనించీ, నీళ్లలోనించీ, రాళ్లలోనించీ, అడవులలోనించీ, మొక్కలలోనించీ పుడతాడు (2.1.2). ఇటువంటి జాబితాలు ఇంకా ఎక్కువసంఖ్యలో అరుదుగా కొన్నిచోట్ల ఉన్నాయి (అ.వే. 3.21; 12.1.19; ఆప. శ్రౌ.సూ. 5.16.4). అగ్ని రాత్రిలో (అద్రౌ) ఉంటాడని చెప్పినప్పుడు మేఘంలో అంతర్లీనమై ఉండే మెరుపు సూచితమై ఉండవచ్చు (చూ. అధ్యాయం 7.11). ఆయన రాతినించి (అశ్మనః) పుడతాడని చెప్పినప్పుడూ (2.1.1), రెండురాళ్లమధ్య ఇంద్రుడు ఆయన్ని పుట్టించాడని చెప్పినప్పుడూ (2.12.3) కూడా అదే అభిప్రాయమై ఉండవచ్చు; కాని ఇక్కడ చెకుముకి రాళ్లతో నిప్పు పుట్టించడం కూడా ధ్వనితమై ఉండవచ్చు. అగ్ని మనుష్యుడి హృదయంలోనూ (అస్మ ద్ధృదో భూరిజన్మావిచష్టే, 10.5.1), జంతువులలోనూ, గుర్రాలలోనూ, పక్షులలోనూ, రెండు కాళ్లు, నాలుగు కాళ్లు కలవాటిలోనూ (అ.వే. 3.21.2; 12.1.9; 12.2.33; తై.సం. 4.6.1.3) ఉంటాడని చెప్పినప్పుడు జంతువుల శరీరాలలోని ఉష్ణం ఉద్దిష్టమైంది అనేది స్పష్టం. చైతన్యానికి మూలమై ప్రకృతిలో అంతటా వ్యాపించిన అగ్ని సహజంగానే చరాచరమైన అన్ని ప్రాణులకీ గర్భం (= బీజం) అని వర్ణించబడ్డాడు (1.70.3; అ.వే. 5.25.7).

35.25 అగ్ని త్రిరూపత్వం వల్ల అగ్నులు ముగ్గురు సోదరులు (తృతీయో భ్రాతా, 1.164.1) అనే భావన ఏర్పడింది. అనేకులు చేసే యజ్ఞాలలో అగ్నుల బహుత్వం వల్ల అగ్నేః పూర్వేభ్రాతరః 'అగ్నికి (ఇద్దరికన్న ఎక్కువ) అన్నలు' (10.51.6) అని బహువచనంలో చెప్పడం భావ్యమైంది. ఈ అన్నలు ముగ్గురు అని ఋ.వే.కి అర్వాచీనమైన

తై.సం. (2.6.6.1) లో చెప్పబడింది (అగ్నే స్త్రయో జ్యాయాంసో భ్రాతర ఆసన్ తే దేవేభ్యో హవ్యం వహంతః ప్రామీయంత 'అగ్నికి ముగ్గురు అన్నలు ఉండేవారు వారు దేవతలకి హవ్యం తీసుకువెళ్తూ నశించారు). కాఠక సంహిత (25.7) లో ''దేవతలకి నలుగురు హోతలు; వారిలో మొదటి ముగ్గురూ మరణించారు'' అని ఉన్నవాక్యంలో చెప్పబడినవారు కూడా ఈ నలుగురు అన్నలే కావచ్చు. ఒకచోట (4.1.2) వరుణుడు అగ్ని సోదరుడు అని చెప్పబడింది. మరి ఒకచోట (6.59.2) ఇంద్రుడూ అగ్నీ కవలలు అని ఉంది (ఇంద్రాగ్నీ... భ్రాతరా యువం యమౌ). అగ్ని ఇతరదేవతలతో కన్న ఇంద్రుడితోనే తరచుగా కలిపి చెప్పబడ్డాడు; రెండుచోట్ల తప్ప, దేవతాద్వంద్వంలో అగ్నితో కలిపి చెప్పబడినదేవత ఇంద్రుడొక్కడే (అధ్యాయం 44). ఇటువంటి సాహచర్యం వల్లనే అగ్ని దేవతలపై నమ్మకంలేని పణులని (పణీన్ అశ్రద్ధాన్, 7.6.3) నీచులుగా చేశాడనీ, రాతిని వేడితో పగలగొట్టేడనీ (8.46.18; ★ ఇక్కడ అగ్నికాక మరుత్తులు ఈపని చేసినట్లు సందర్భాన్ని బట్టి తెలుస్తోంది) వర్ణించడం సముచితమైంది అనడంలో సందేహం లేదు. ఒకపూర్తిసూక్తం (1.93) లో అగ్ని సోముడితో కలిపి స్తుతించబడ్డాడు (అధ్యాయం 44).

35.26 కొన్నిచోట్ల అగ్నికి ఇతరదేవతలతో, ముఖ్యంగా వరుణుడితోనూ, మిత్రుడితోనూ, అభిన్నత్వం చెప్పబడింది (2.1.4; 3.5.4; 7.12.3). ఆయన యజ్ఞానికి వెళ్లేటప్పుడు వరుణుడు (వరుణో యదృతాయవేషి, 10.8.5; పుట్టినప్పుడు వరుణుడు, ప్రజ్వరిల్లినప్పుడు మిత్రుడు, త్వమగ్నే వరుణో జాయసే యత్త్వం మిత్రో భవసి య త్సమిద్ధః, 5.3.1). ఆయనసాయంకాలం వరుణుడూ, పొద్దున్న ఉదయిస్తూ మిత్రుడూ అవుతాడు, సవిత ఐ అంతరిక్షంలో ప్రయాణిస్తాడు, ఇంద్రుడై ఆకాశం మధ్యభాగాన్ని కాంతిమంతం చేస్తాడు (అ.వే. 13.3.13). ఋ.వే.లో ఒక మంత్ర సముదాయం (2.1.3-7) లో ఆయనకి వరసగా సుమారు పన్నెండుగురు దేవతలతోనూ ఐదుగురు స్త్రీదేవతలతోనూ ఏకత్వం చెప్పబడింది. ఆ యనకి అనేకదివ్యరూపాలు ఉన్నాయి (3.38.7; ★ ఇది ఇంద్రపరంగా ఉంది); చాలాపేర్లు న్నాయి (అగ్నే భూరీణి తవ.... నామ, 3.20.3). అందరు దేవతలూ ఆయనలో న్నారు (త్వే విశ్వే సహసస్పుత్ర దేవాః, 5.3.1); కమ్ములచుట్టూ చక్రం అంచు ఉన్నట్లు ఆయనదేవతలని చుట్టిఉంటాడు (అగ్నే నేమి రరాన్ ఇవ దేవాంస్త్వం పరిభూరసి, 5.13.6).

35.27 అతిపురాతనకాలంలో అగ్నిపూజలో ముఖ్యోద్దేశం అగ్ని దుష్టశక్తులనీ వాటిని ప్రోత్సహించే మంత్రశక్తినీ కార్చి నాశనం చేస్తాడనే నమ్మకం కావచ్చు; అది వేదంలో ఇంకా మిగిలి ఉంది. ప్రకాశించే అగ్ని తన తేజస్సుతో శత్రువులైన రక్షస్సులని బాధిస్తాడు (వి పాజసా పృథునా శోశుచానో బాధస్వ ద్విషో రక్షసః, 3.15.1, మొ.); ఆయనకి రక్షోహన్ 'దెయ్యాలని చంపేవాడు' అనే విశేషణం ఉంది (10.87.1). ఇనపకోరలు గల ఆయన ప్రజ్వరిల్లి తన మంటలతో దెయ్యాలని కాలుస్తాడు (అయోదంష్ట్రో అర్చిషా యాతుధానా నుప స్పృశ జాతవేదః సమిద్ధః); తన నాలుకతో దుష్టదేవతలని ఆరాధించే వారిని చంపి నోట్లో వేసుకొంటాడు (ఆ జిహ్వయా మూరదేవాన్ రభస్వ.... ధత్స్వాసన్, 10.87.2, 3, 14; ఆసన్= నోట్లో); యజ్ఞాన్ని తన తీక్ష్ణమైన కంటితో రక్షిస్తాడు (తీక్ష్ణేనాగ్నే చక్షుషా రక్షయజ్ఞం, 10.87.9). ఆయనకు దెయ్యాల జన్మలు తెలుసు; వాటిని ఆయన చంపుతాడు (అ.వే. 1.8.4). భూమిమీద ఉండే దెయ్యాలని చంపడంలో అగ్నితోపాటు ఇంద్రుడికీ (బృహస్పతికీ, అశ్వినులకీ, ముఖ్యంగా సోముడికీ కూడా) భాగం ఉన్నట్లు చెప్పబడినా, అది ముఖ్యంగా అగ్నికి సంబంధించిన కృత్యమే అనుకోవచ్చు; ఇలా చెప్పడం ఇంద్రుడికి ప్రత్యేకమైన అంతరిక్ష రాక్షసులని చంపడం అనే కృత్యం అగ్నికికూడా ఆపాదించడం (7.13.1) వంటిది. మంత్రాలలోనూ యజ్ఞకర్మలోనూ దెయ్యాలని చంపేవాడుగా అగ్నికి ఇంద్రుడికన్న నిస్సందేహంగా ఎక్కువ ప్రాముఖ్యం ఉండడం ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తుంది.

35.28 ఇతర దేవతలకన్న అగ్నికి మానవజీవితాలతో ఎక్కువ సన్నిహిత సంబంధం ఉంది. ఆయనకి మనుష్యుల గృహాలతో ఉన్న సాన్నిహిత్యం విశిష్టమైనది. 'గృహపతి' అనే విశేషణం ఈ దేవతకి మాత్రమే వాడబడింది! దీని ప్రయోగం చాలా తరచు. ఈయన అన్ని ఇళ్లలోనూ ఉంటాడు (యః...... నిషసాద దమే దమే, కవిర్గృహపతిర్యువా, 7.15.2); (యజమాన) గృహం విడవకుండా ఇంట్లో (వారితో) కలిసిపోతాడు (అప్రోషివాన్..... దురోణయుః, 8.60.19). దమూనస్- 'ఇంట్లోవాడు' అనే విశేషణం సాధారణంగా ఈయనకే అన్వయిస్తుంది (1.60.4 మొ.). అగ్నిని ఇలవేల్పుగా భావించడం చాలా పురాతన కాలాన్నించీ వచ్చి ఉంటుంది; ఎందువల్లనంటే, తరవాత కాలంలో మూడు అగ్నులతో కూడిన విస్తారమైన యజ్ఞ కర్మలో మూలమైన అగ్నికి గార్హపత్యం 'గృహపతికి సంబంధించినది' అని పేరు; దీంట్లో నిప్పులు తీసుకొనే మిగిలిన రెండగ్నులూ (తూర్పున

ఉండే ఆహవనీయం), దక్షిణంవైపున ఉండే 'దక్షిణాగ్ని) ఏర్పరుస్తారు. ఋగ్వేదకాలమంత ప్రాచీనదశలోనే యజ్ఞంలో ఇలా అగ్నిని ఒకచోటినుంచి మరొకచోటకి తీసుకువెళ్లేవారు అనడానికిసూచనలు ఉండడం ఆసక్తికరమైనవిషయం. ఉదాహరణలు: ఆయన యజ్ఞగృహం అంతటా తీసుకువెళ్లబడతాడు (ససద్మపరిణీయతే 4.9.3; 4.15.1); ఆహుతులచుట్టూ ఆక్రమిస్తాడు (పరి....హవ్యానక్రమీత్, 4.15.3) యజ్ఞం చుట్టూ మూడుసార్లు తిరుగుతాడు (పరిత్రిర్విష్ట్యధ్వరం యా త్యగ్నిః 4.15.2; 4.6.4, 4). ఆయన తల్లిదండ్రులని (= అరణులని) వదలగానేఆయన్నితూర్పుకీ పశ్చిమకీ తీసుకువెళ్తారు (యత్విత్రో ర్యుమ్చ్యసే పర్యాత్వా పూర్వమనయన్నాపరం పునః, 1.31.4).

35.29 ఇంతేకాక ఈయన మనుష్యుల ఇళ్లలో 'అతిథి' అని పదే పదే చెప్పబడ్డాడు. ఆయన ప్రతి ఇంట్లోనూ అతిథి (అతిథిర్గృహేగృహే, 10.91.2); పురాతనుడైన అతిథి (అతిథింపూర్వ్యం, 5.8.2). ఆయనమర్త్యుల మధ్య నివాసం ఏర్పరుచుకొన్న అమర్త్యుడు (ఇదిఅగ్నికిఎక్కువగా వాడబడింది, 8.60.1). ఆయన్ని మనుష్యులగృహాలలో (దేవతలు) పెట్టేరు (అధ్యాయ్యగ్నిర్మానుషీషు విక్షు, 3.5.3; 4.6.2). ఇలవేల్పు (దమునాః) అయిన అగ్ని మనుష్యులకి నివాసాలు ఏర్పరిచాడు (ప్రతి మర్తాన్అవాసయో దమూనాః, 3.1.17). ఆయన నివాసం ఏర్పరుచుకొన్నవారికి నాయకుడు (3.2.5), రక్షకుడు (విశాంగోపాః 1.96.4); విశ్పతి 'నివసించేవారికిపతి' అనే విశేషణం ముఖ్యంగా ఈయనకే అన్వయిస్తుంది.

35.30 అందువల్ల అగ్నిని చాలా దగ్గరవాడైన (నేదిష్ఠ-) చుట్టం (ఆపి-) (7.15.1; 8.60.10), చుట్టం (ఆపి-, 1.26.3, మొ.), స్నేహితుడు (సఖా, 1.26.3; 1.75.4, మొ.) అనడం పరిపాటి అయింది. కాని ఈయన భక్తులకి తండ్రి (పితా, 6.1.5 మొ.) అని చాలా తరచుగానూ, సోదరుడు (భ్రాతృ-, 8.43.16; 10.7.3. మొ.), కొడుకు (పుత్ర-, 2.1 9), తల్లి (మాతృ-, 6.1.5) అని కూడా కొన్నిచోట్లా చెప్పబడింది. అగ్నికీ మనుష్యులకీ ఇతర దేవతల విషయంలో లేని ఇంత సాన్నిహిత్యాన్ని సూచించే ఇటువంటి పదాలు యజ్ఞాలు చెయ్యడం ప్రారంభం కాకముందు గృహజీవితానికి అగ్నికేంద్రంగా ఉన్న పురాతన దశలోని స్థితిగతులని సూచిస్తాయి.

35.31 పురాతనకాలంనించీ అగ్ని ఎప్పుడూ ఇంట్లో ఉన్నవాడవడం వల్ల ఆయనకి ఇతర దేవతలకన్నపూర్వకాలంతో (★ = పూర్వులతో) ఎక్కువసన్నిహితసంబంధం సహజంగా

ఏర్పడింది. అందువల్ల అగ్నికీ భక్తులకీ మధ్యన ఉన్న స్నేహం తాతముత్తాతల కాలంనించీ వస్తోందని చెప్పడంలో ఔచిత్యం ఉంది (సఖ్యా పిత్ర్యాణి 1 71.10). తాతముత్తాతలు వెలిగించి పూజించిన దేవత ఆయన. ఉదాహరణకి, భరతుల అగ్ని (భారతాగ్నే, 2.7.1; 7.8.4, మొ.) వధ్ర్యశ్వుడి అగ్ని (అగ్ని ర్వాధ్ర్యశ్వస్య 10.69.1), దేవవాతుడి అగ్ని (అగ్నిం.... దైవవాతం, 3.23.3), దివోదాసుడి అగ్ని (దైవోదాసో అగ్నిః, 8.103.2), త్రసదస్యుడి అగ్ని (త్రాసదస్యవం, 8.19.32) - ఇలా అగ్నిని ఆరాధించిన పూర్వుల పేర్లు కొన్ని చెప్పబడ్డాయి. వీటిలో కొన్ని ఋగ్వేదసూక్తాలని దర్శించిన ఋషుల కుటుంబాల పేర్లు. వశిష్ఠుడు వంటి కొన్ని పేర్లు పూర్వకాలంలో నిజంగా ఉన్నవారివే అనిపిస్తుంది· అంగిరసుడు (అధ్యాయం 54), భృగువు (అధ్యాయం 51) వంటి మరికొన్ని గాథలలోనివే కావచ్చు (చూ. అధ్యాయం 58).

35.32 అగ్నికి యజ్ఞంచేసే మనుష్యులతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. ఆయన ఆహుతులని స్వీకరించేవాడు మాత్రమే కాక స్వర్గానికీ భూమికీ మధ్యవర్తి కూడా. ఆయన ఆహుతులని దేవతలకి తీసుకువెళ్తాడు; ఆయన లేకుండా వారు ఆనందం పొందరు (న ఋతే త్వ దమృతా మాదయంతే, 7.11.1). ఆయన దేవతలని యజ్ఞానికి ఆహుతులని భక్షించడానికి తీసుకువస్తాడు (అగ్నే వహ హవిరద్యాయ దేవాన్), యజ్ఞాన్ని దేవతల దగ్గరకి తీసుకువెళ్తాడు (ఇమం యజ్ఞం దివి దేవేషు ధేహి, 7.11.5). ఆయన వారిని దర్భాసనం మీద ఆహుతులని స్వీకరించడానికి కూర్చోబెడతాడు (దైవ్యం జన మా సాదయ బర్హిషి, 1.31.17; 8.44.3; హవిదర్యాయ, 5.2.11). ఆయన దేవతల దగ్గరికీ (10.98.11), భూమికీ (8.7.2) వెళ్లే మార్గాలలో ప్రయాణిస్తాడు; ఆ మార్గాలు ఆయనకి తెలుసు (అధ్వనః 'పెద్దమార్గాలు', పథశ్చ 'చిన్నమార్గాలు కూడా', 6.16.3), అందువల్ల ఆయన ప్రత్యేకించి దూత' అని పదే పదే చెప్పబడ్డాడు; 'తోవలు తెలిసిన ఆయన యజ్ఞాన్ని తీసుకువెళ్తాడు (1.72.7) అన్ని ఇళ్లకీ వస్తాడు (4.1.8); వేగంగా ఎగురుతాడు (10.6.4); భూమికీ స్వర్గానికీ మధ్య (4.7.8; 4.8.4; 10.4.2), దేవతలు, మనుష్యులు అనే జాతుల మధ్య (4.2.2, 3) ప్రయాణిస్తాడు. ఆయన్ని దేవతలూ (దేవా దూతం చక్రిరే హవ్యవాహనం 5 8.6, మొ.), మనుష్యులూ (త మాయవః.....హోతారం దధిరే, 10.46.8) ఆహుతులని తీసుకువెళ్లేవాడూ నియమించారు (హవ్యవహ-, హవ్యవాహన- అనే పదాలు ఎప్పుడూ అగ్నికే వర్తిస్తాయి). ఆయన భక్తుల కొత్త కొత్త స్తుతులని దేవతలకు

చెప్పాలి అనే ప్రార్థనకూడా ఉంది (గాయత్రం నవ్యాంసం అగ్నే దేవేషు ప్రవోచః, 1.27 4). ఆయన దేవతలకి దూత (6.15.9). వివస్వత్తుకి దూత (అధ్యాయం 18.2); కాని స్వర్గంలోపలి భాగాలు తెలిసినవాడూ, యజ్ఞాన్ని తీసుకువెళ్లేవాడూ, దేవతలని తీసుకువచ్చేవాడూ (4.7.8· 4.8.1) అయిన ఆయన ప్రధానంగా మనుష్యుల దూత అని అనుకోవచ్చు. అర్వాచీనమైన తై.సం. 2.5.8.5 2.5.11.8) దేవతల దూత అగ్ని, అసురుల దూత కావ్యుడైన ఉశనస్సు అని చెప్తుంది; తై. బ్రా. (2.4.1.6) అగ్ని దేవతల దూత అని కాక దేవతల దగ్గరకు తీసుకువెళ్లే మార్గం అనీ, దాని ద్వారా స్వర్గశిఖరం చేరుకోవచ్చుననీ చెప్తుంది.

35.33 యజ్ఞాన్ని నిర్వహించడం అగ్ని ముఖ్యకృత్యంగా వేదంలో వర్ణించబడింది కాబట్టి అగ్ని దేవత అయిన పురోహితుడుగా ప్రశంసించబడ్డాడు. అందువల్ల ఆయనకి తరచుగా ఋత్విక్కు (ఋత్విజ్-), విప్రుడు అనే సాధారణార్థం కుపదాలూ, 'ఇంటికి సంబంధించిన వాడు' అనే అర్థచ్ఛాయ గల పురోహితుడు అనే పదాలు వాడబడ్డాయి; అన్నిటికన్న ఎక్కువ తరచుగా వాడబడిన పదం హోత (హోతృ-; దీని వ్యుత్పత్త్యర్థం 'హోమంలో ఆహుతులు వేసేవాడు'); హోత యజ్ఞంలో ముఖ్యమైన పురోహితుడూ, కవీ, అందరితరఫున మాట్లాడేవాడూ ఆయన్ని మనుష్యులూ (8.49.1; 10.7.5), దేవతలూ (6.16.1) హోతగా నియమించారు. ఆయన హోతలలో పూజ్యుడు (10.2.1; 10.91.8). ఆయన అధ్వర్యుడు (3.5.4), (బృహస్పతి, సోముడు, ఇంద్రులలా) బ్రహ్మ 'ప్రార్థనలు చేసే పురోహితుడు' (4.9.4) అని కూడా చెప్పబడ్డాడు. పైన చెప్పిన పేర్లతోనూ, మరికొన్ని పేర్లతోనూ యజ్ఞం చేయించే మానవ యాజకులు వేరువేరుగా చేసే అన్ని కృత్యాలూ ఆయనే చేస్తాడని లక్షణార్థస్ఫోరకంగా చెప్పబడింది (1.94.6; 2.1.2, మొ.). ఆయన దేవతలకి హవిస్సు ఇచ్చి వారిని పూజించాలి అని పదే పదే కోరబడింది (3.25.1; 7.11.3, మొ.); దానికి ప్రతిగా వారు ఆయన్ని రోజూ మూడుపూటలూ పూజిస్తారు (యందేవాసస్త్రి రహ న్నాయజంతే, దివే దివే,3.4.2). ఆయన యజ్ఞానికి కారకుడు (విదథస్య సాధనం, 3.3.3; 3.27.2); తన మాయాశక్తి వల్ల యజ్ఞాన్ని ప్రేరిస్తాడు (3.27.7); హవ్యాలని సువాసన కలవిగా చేసి (హవ్యాని సురభీణి కృత్వీ, 10.15.12; కృత్వీ = చేసి), యజ్ఞాన్ని కాపాడి అది దేవతలకి చేరేటట్లు చేస్తాడు (అగ్నే యం యజ్ఞ మధ్వరం విశ్వతః పరిభూరసి, స ఇద్దేవేషు గచ్ఛతి, 1.1.4; స ఇత్ = అది మాత్రమే).

ఆయన యజ్ఞానికి తండ్రి (3.3.4), రాజు (4.3.1·10.6.3), అధ్యక్షుడు (8.43.24), జండా (కేతుం యజ్ఞానాం, 3.3.3; 3.10.4; 6.2.3; 10.1.5). ఒకసూక్తం (10.51) లో అగ్ని హవ్యాలని తీసుకువెళ్లడం వల్ల అలిసిపోయి ఆ పని చెయ్యడానికి నిరాకరించాడనీ, కాని ఆయన కోరిన కోరికలు దేవతలు తీర్చిన తరవాత ఆ పని చెయ్యడానికి అంగీకరించాడనీ చెప్పబడింది.[6] అగ్ని స్వభావంలో అతిముఖ్యమైన లక్షణం పురోహితత్వం. ఇంద్రుడు గొప్ప యోధుడైనట్లు అగ్ని గొప్ప పురోహితుడు. కాని అగ్ని స్వభావంలో ఈ లక్షణం ఋగ్వేదంలో మొదటినించి చివరిదాకా ప్రస్ఫుటంగా ఉన్నా, చారిత్రక దృష్టితో చూస్తే ఇది కొంత అర్వాచీన కాలానికి చెందినదే అనేది స్పష్టం. ఈ భావన పురోహితుల ఊహాత్మక సిద్ధాంతాల వల్ల పుట్టింది; యజ్ఞకర్మకి సంబంధించిన అర్వాచీన గ్రంధాలలో ఈ సిద్ధాంతాలు క్రమేణ అతి విస్తృతమై అంతులేని ప్రతీకాత్మక వివరణలకు దారితీశాయి. యజ్ఞంలో ఆహుతులని తీసుకువెళ్లే అగ్నికీ (హవ్యవహ- / హవ్యవాహన-) మృతదేహాలని భక్షించే అగ్నికీ (క్రవ్యాద్-, చూ. అధ్యాయం 71) భేదం చెప్పబడింది. వా.సం. (1.17; చూ. 1.18; 1.51) లో అగ్ని మూడు రకాలుగా విభజించబడింది: పచ్చిమాంసం తినేదీ (ఆమాద్-), మృతదేహాలని తినేదీ, యజ్ఞాగ్ని. తై.సం. (2.5.8.6) లో కూడా మూడు భేదాలు చెప్పబడ్డాయి: ఆహుతులని తీసుకువెళ్లేదీ (హవ్యవాహన-, ఇది దేవతలకి సంబంధించినది), అంత్యక్రియలలో ఆహుతులని తీసుకువెళ్లేదీ (కవ్యవాహన-; ఇది పితృదేవతలకి సంబంధించింది), దెయ్యాలతో సాహచర్యం కలదీ (సహరక్షస్-; ఇది అసురులకి సంబంధించినది).

35.34 అగ్ని ఋషీ పురోహితుడూ (9.66.20); ఆ శ్రేష్ఠుడైన ఋషిని ప్రజ్వరిల్లేటట్టు చేస్తారు (3.21.3); ఆయన చాలా దయకల (వేధస్తమః) ఋషి (6.14.2); అంగిరసులకు ప్రథముడైన అంగిరసుడు ఆయన (1.31.1). ఆయన పండితులలో దివ్యుడు (అసురో విపశ్చితాం, 3.3.4). అగ్నికి యజ్ఞం గురించి క్షుణ్ణంగా తెలుసు (వ్యుషితయజ్ఞం

6. ఈ గాథలోని కొన్ని వివరాలు : హవ్యాలని మొయ్యడం వల్ల అగ్ని శరీరం ఎక్కువ లావెక్కింది. ఆయన ముసలివాడైపోయి తన అన్నలలా తను కూడా మరణిస్తానని భయపడి నీళ్లలో దాగేడు; దేవతలంతా ఆయన్ని వెతికేరు· యముడు ఆయన్ని చూశాడు; దేవతలు ఆయన ముసలితనం పోగొట్టేరు. అగ్ని ప్రయాజలలోనూ అనుయాజలలోనూ హవ్యాలు తనకే కావాలి; దీర్ఘాయుస్సు కూడా కావాలి అని దేవతలని అడిగాడు. దేవతలు ఆయనకి ఆ వరాలు ఇచ్చి అన్ని దిక్కులలో వారూ నీకు నమస్కరిస్తారు అని చెప్పేరు ( ఇందులో ఏడు మంత్రాలు ఉన్నాయి)

10.110.11 ★- దీని ప్రతిపదార్థం 'యజ్ఞాన్ని విశేషంగా కొలిచాడు'); ఆయన అన్ని రకాల జ్ఞానాలూ తెలిసినవాడు (విశ్వాని విద్వాన్ వయునాని, 10.122.2). పండితులు కాకపోవడంవల్ల (అవిదుష్టరాసః) మనుష్యులకి తెలియని యజ్ఞవిధులు విద్వాంసుడైన అగ్నికి తెలుసు; అందువల్ల ఆయన సరియైన కాలంలో దేవతలని పూజిస్తాడు (క్రతువిద్విజానన్ యజిష్ఠో దేవాన్ ఋతుశో యజాతి, 10.2.5; 10.2.4). ఆయనకి స్వర్గంలోని ఎత్తైన ప్రదేశం తెలుసు (ఆరోధనం దివః, 4.8.2, 4). ఆయనకు తన బుద్ధివల్ల వరుణుడికి తెలిసినట్లు అన్నీ తెలుసు (విశ్వం సవేద వరుణో యథాధియా, 10.11.1; 10.91.3). చక్రం అంచు చక్రాన్ని చుట్టుకొని ఉన్నట్లు అన్ని జ్ఞానాలనీ ఆయన చుట్టుకొని ఉన్నాడు (పరి విశ్వాని కావ్యానేమి శ్చక్ర మివాభవత్, 2.5.3. కావ్యా = జ్ఞానాలు); పుట్టగానే జ్ఞానాలు పొందేడు (సహసా జాయమానః సద్యః కావ్యాని బ ళధత్త విశ్వా, 1.96.1; బళ్ = సత్యంగా). ఆయన విశ్వవిద్- 'అన్నీ తెలిసినవాడు'; విశ్వవేదస్- 'పూర్తి జ్ఞానం కలవాడు', కవి 'ఋషి', కవిక్రతు- 'ఋషులకు ఉన్న జ్ఞానం కలవాడు' అనే విశేషణాలు ముఖ్యంగా ఆయనకే వర్తిస్తాయి. ఋ.వే.లో 120 సార్లకి పైగానే వచ్చిన జాతవేదస్- అనే విశేషణం ఈయనకిమాత్రమే వాడబడింది; ఈ పదానికి 6.15.13 లో విశ్వావేదజనిమా (జాతవేదాః) 'అన్ని జన్మలూ (= జన్మలు కల భూత జాతాలూ) (ఆయనకి) తెలుసు' అని వివరణ ఇవ్వబడింది (★సాయణుడు ఇచ్చిన ఈ అర్థం సముచితం; మూలకర్త జనిమా = తరాలు అని అర్థం ఇచ్చారు). ఆయనకు దేవతలు విధించిన విధులూ (వ్రతా), మనుష్యుల జన్మలూ తెలుసు (ఆ దైవ్యాని వ్రతా చికిత్వా నా మానుషస్య జనస్య జన్మ, 1.70.2). ఆయనకి అందరూ తెలుసు; అందరినీ చూస్తాడు (3.55.10; 10.187.4); ఆయన్ని ఉద్దేశించిన ప్రార్థనలు వింటాడు (8.43.23). ఆయన కలిగించే జ్ఞానం వల్ల భక్తులు కీర్తి పొందుతారు (అస్య క్రత్వా యశస్వతః, 8.102.8). జ్ఞానమూ స్తుతులూ ఆయననించి [illegible] (4.11.3). ఆయన ప్రకాశించే వాక్కుని సృష్టించిన వాడు (శుక్రస్య వచసో [illegible], 2.9.4); ప్రార్థనని మొదటిగా సృష్టించినవాడు (ప్రథమో మనోతా, 6.1.1). [illegible] వంటి నాలుక కలవాడు (విజేహమానః పరశుర్న జిహ్వాం, 6.4.4; ★[illegible] కలవాడు' అని మూలకర్త ఇచ్చిన అర్థం); స్తుతించేవాడు (జరితృ-).

[illegible] బాగా సహాయం చేస్తాడు. ఆయన తన తేజస్సులతో వంద [illegible] కాపాడతాడు (మహోభిః శతం పూర్భి రాయసీభి ర్నిపాహి,

7.3.7; 7.16.10; చూ. 6.48.8; 1.189.2). నావికుడు నావతో నదిని దాటినట్లు ఆయన గొప్ప పాపాలని భక్తులు దాటేటట్లు చేస్తాడు (సింధుం న నావా దురితాతి పర్షి 5.4.9; 3.20.4; 7.12.2). ఆయన రక్షకుడు (8.49.5); అతిథ్యమిచ్చేవాడికి మిత్రుడు (4.4.10); ఆయన కోసం పుల్లలు మోస్తూ చెమటకార్చేవాడికి ధనం ఇస్తాడు (యస్త ఇధ్మం జభరత్సిష్విదానః..... భువస్తస్య స్వతవాన్ 4.2.6). ఆయనకోసం ఆహారం తెచ్చి ఆహుతులు ఇచ్చేవాళ్లే వెయ్యికళ్లతో చూసి కాపాడతాడు (10.79.3). ఆయన భక్తుల శత్రువులని ఎండినపొదలని కాల్చినట్లు కాలుస్తాడు (4.4.4); పిడుగు వల్ల చెట్లు నశించినట్లు దుష్టులు ఆయనవల్ల నశిస్తారు (6.8.5; చూ. అ.వే.3.1.1, మొ.). అందువల్ల ఆయన్ని యుద్ధంలో ప్రార్థిస్తారు (8.43.21); యుద్ధాలలో ఆయన అగ్రగామి (పురోయావాన మాజిషు, 8.84.8). యుద్ధంలో ఆయన ఉత్సాహం కలిగించి కాపాడినవాడికి సమృద్ధిగా ఆహారం లభిస్తుంది; పరాజయం ఉండదు (1.27.7). చెట్టులోంచి కొమ్మలు వచ్చినట్లు ఆయననించి ఆశీస్సులు వస్తాయి (6.13.1). తన దగ్గర సమృద్ధిగా ఉన్న సంపదలు ఆయన ఇస్తాడు (1.1.3; 1.31.10; 1.36.4). సంపదలన్నీ ఆయన దగ్గర పోగుపడి ఉన్నాయి (10.6.6); ఆయన సంపదల ద్వారం తెరుస్తాడు (1.68.10). సర్వంలోనూ భూమిమీదా(4.5.11) భూమిమీదా, స్వర్గంలోనూ సముద్రంలోనూ (7.6.7; 10.91.3) ఉన్న సంపదలకు ఆయన అధిపతి. ఆకాశం నించి ఆయన వాన కురిపిస్తాడు (2.6.5); ఆయన ఎడారిలో నీటితొట్టి వంటివాడు (ధన్వన్నివ ప్రపా అసి, 10.4.1). అందువల్ల ఆయన అన్నిరకాల వరాలూ (ఆహారం, సంపదలు ఇవ్వడం, బీదతనం, సంతానహీనత, శత్రువులు, రాక్షసులు - వీటిని పోగొట్టడం) ఇమ్మని పదే పదే ప్రార్థించబడ్డాడు. అగ్ని ఇచ్చే వరాలు కుటుంబక్షేమం, సంతానం, అభివృద్ధీ అయితే ఇంద్రుడు ఇచ్చేవి ముఖ్యంగా ఆధిపత్యం, జయం, కీర్తీ. పొరపాటువల్ల చేసిన పాపాన్ని క్షమించి అగ్ని భక్తులని అదితి సమక్షంలో పాపరహితుల్ని చేస్తాడు (4.12.4; 7.93.7· చూ. అధ్యాయం 41.5); వరుణుడి కోపాన్నించి వారిని తప్పిస్తాడు (4.1.4). ఒక వ్యక్తి తల్లిదండ్రులు చేసిన పాపాన్నించి కూడా ఆ వ్యక్తిని తప్పిస్తాడు (అ.వే. 5.30.4; తై. బ్రా. 3.7.12.3, 4).

35.36 అగ్ని దివ్యుడైన (అసుర-) సమ్రాట్టు (సమ్రాజ్-); ఇంద్రుడిలా శక్తిమంతుడు (7.6.2). ఈయన గొప్పతనం బలవంతమైన స్వర్గాన్ని మించినది (1.59.5). ఆయన

ద్యావాపృథువులకన్న (3.6.2; 10.88.14), అన్ని లోకాలకన్న (3.3.10) గొప్పవాడు; ఆయన పుట్టినప్పుడు అన్ని లోకాలనీ ఆక్రమించాడు. గొప్పతనంలో ఆయన దేవతలందరినీ మించినవాడు (1.68.2). ఆయన చీకటిలో ఉన్నప్పుడు దేవతలందరూ ఆయనకి భయపడి ఆయన్ని పూజిస్తారు (6.9.7). వరుణుడూ, మిత్రుడూ, మరుత్తులూ, అందరు దేవతలూ ఆయన్ని స్తుతించి పూజిస్తారు (3.9.8; 3.14.4; 10.69.9). పూర్వకాలంలో గొప్పపనులు చేసినవాడు అగ్ని (7.6.2). ఆయన గొప్పపనులకి మనుష్యులు వణుకుతారు (8.103.3). యుద్ధంలో దేవతలకి ఆయన స్థలం సంపాదించాడు (1.59.5); వారికి శాపవిముక్తి కలిగించాడు (7.13.2). ఆయన సహస్రజిత్ 'వెయ్యిమందిని జయించినవాడు' (ఇది తరచుగా సోముడికి విశేషణంగా వాడబడింది). ఆయన దస్యులని వారి స్థానాన్నించి పారదోలి ఆర్యుడికి పెద్ద జ్యోతి పుట్టించాడు (త్వం దస్యూన్ ఓకసో అగ్న ఆజ ఉరుజ్యోతి ర్జనయన్నార్యాయ, 7.5.6.). ఆయన ఆర్యుడికి వృద్ధి కలిగించేవాడు (ఆర్యస్య వర్ధనం, 8.103.1); దైవభక్తీ యజ్ఞాలూ లేని పణులని ఓడించాడు (7.6.3). ముఖ్యంగా ఇంద్రుడికి అన్వయించే వృత్రహన్- 'వృత్రుణ్ణి చంపేవాడు' అనే విశేషణం కొంత తరచుగానూ, పురందర- 'కోటలని నాశం చేసేవాడు' అనేది రెండు మూడుసార్లూ ఈయనకి వాడబడ్డాయి (చూ. అధ్యాయం 22.20, 21). యోధుడికి తగిన ఇటువంటి విశేషణాలు మెరుపు రూపంలోని అగ్నికి తగినవే అయినా, ఇంద్రుడితో ఈయనకి ఎక్కువ సాహచర్యం ఉండడం వల్లనే (అధ్యాయం 44.4) ఇవి ఈయనకి వాడబడ్డాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

35.37 అగ్ని స్వర్గానికీ భూమికీ కొడుకని చెప్పబడినా ఆయన లోకాలకీ తండ్రి అని కూడా చెప్పబడింది (1.96.4; చూ. 7.5.7); నాశంలేని (2.8.3) ఆయన ఆజ్ఞని స్వర్గమూ భూమీ పాటిస్తాయి (7.5.4). ఆయన వాటిని చర్మాలని పరిచినట్లు విశాలం చేశాడు (3.6.5; 7.5.4; 6.8.5). ఆయన మంటలతో / పొగతో స్వర్గాన్ని పైన నిలబెట్టేడు (3.5.10; 4.6.2); రెండు లోకాలనీ వేరు చేశాడు (6.8.3). సత్యమైన మంత్రాలతో (మంత్రేభిః సత్యైః) భూమినీ ఆకాశాన్నీ నిలబెట్టేడు (1.67.5). ఆయన భువనం శిరస్సు మీద ఉంటాడు (10.88.5); రాత్రి ఆయన భువనానికి శిరస్సు అవుతాడు (మూర్ధా భువో భవతి నక్తమగ్నిః, 6); ఆయన ఆకాశానికి శిరస్సూ, శిఖరమూ (కకుద్- 1.59.2; 6.7.1; 8.44.16). ఆయన తన గొప్పతనంతో అంతరిక్షాన్ని కొలిచి స్వర్గ శిఖరాన్ని అంటుకొన్నాడు (6.8.2); అంతరిక్ష ప్రదేశాలనీ స్వర్గంలో కాంతిమంతమైన

ప్రదేశాలని కొలిచాడు (6.7.7). ఆయన సూర్యుణ్ణి ఆకాశంలోకి ఎక్కించాడు (ఆ సూర్యం రోహయో దివి, 10.156 4). అగ్నిని (యజ్ఞంలో) వెలిగించడం సూర్యోదయాన్ని ప్రభావితం చేస్తుంది అనే అభిప్రాయం ఋ వే.లో అసలు లేదు అని చెప్పలేం. "నీ కాంతిని మేం ప్రజ్వరిల్ల జేస్తాము, దాని వల్ల నీ స్తుతించదగిన (పనీయసీ) ఆ కాంతి ఆకాశంలో వెలుగుతుంది' (అతే అగ్న ఇధీమహి.... యద్ధ స్యాతే పనీయసీ సమిద్దీదయతి ద్యవి, 5.6.4) అని వసు(శ్రుతుడు అనే) ఋషి చెప్పడంలో అభిప్రాయం ఇటువంటిదేనని అనుకోవచ్చు. ఒక బ్రాహ్మణంలో ఈ అభిప్రాయం స్పష్టంగా చెప్పబడింది: "(యజమాని) సూర్యుడు ఉదయించకుండానే హోమం చెయ్యడం వల్ల ఆయన్ని (= సూర్యుణ్ని) పుట్టిస్తాడు; ఆయన తేజస్సై ప్రకాశిస్తూ ఉదయిస్తాడు; ఆ సమయంలో ఆహుతులివ్వకపోతే ఉదయించడు" (యత్ప్రాతరనుదితే జుహోతి; ప్రజనయత్యేవైన మేతత్సోఽయం తేజో భూత్వా విభ్రాజమాన ఉదేతి శశ్వద్ధైనోదియాద్యదస్మిన్నేతా మాహుతిం నజుహుయాత్, శ.బ్రా. 2.3 1.5· చూ. తై.సం. 4.7.13.3). ఋ.వే.లో ఇతరత్రా అగ్నిని వెలిగించడమూ సూర్యోదయమూ సమకాలంలో జరిగేవిగానే చెప్పబడ్డాయి: "అగ్ని పుట్టగానే సూర్యుడు (స్వః) ఆవిర్భవించాడు" (ఆవిః స్వ రభవ జ్జాతే అగ్నౌ, 4.33.11). అగ్నిగాథలో ఈ అంశం ఇంద్రుడిగాథలో సూర్యుణ్ణి సంపాదించడాన్ని పోలి ఉంది; కాని ఈ రెండింటిలోనూ మౌలికాభిప్రాయాలు స్పష్టంగా వేరువేరుగా ఉన్నాయి. ఇంకా, అగ్ని ఆకాశాన్ని నక్షత్రాలతో అలంకరించాడని కూడా ఉంది (1.68.10). ఆయన ఎగిరేవాటినీ, నడిచేవాటినీ, స్థావరజంగమాలనీ సృష్టించాడు (10.88.4). ఈ జీవులలోనూ (3.2.10), మొక్కలలోనూ, అందరిలోనూ గర్భోత్పత్తి పెట్టేడు; భూమిలోనూ స్త్రీలలోనూ సంతానాన్ని పుట్టించాడు (10.183.3). అగ్ని ఈ మనుష్య సంతానాన్ని పుట్టించాడు (1.96.2) అని ఉంది; కాని ఇది అదే మంత్రంలో ఆయన స్వర్గాన్నీ, భూమినీ, నీళ్లనీ పుట్టించాడు అని చెప్పబడిన అభిప్రాయానికి అనుబంధం మాత్రమే అంతేకాని (కొందరు పండితులు అభిప్రాయ పడినట్లు) మానవజాతికి అగ్ని తండ్రి అనే నమ్మకాన్ని ఇది సూచిస్తుంది అనుకోకూడదు. చివరగా, అగ్ని అమర్త్యత్వానికి రక్షకుడు (7.7.4), ఈశ్వరుడు (7.4.6); ఆయన మర్త్యులకి దాన్ని ప్రసాదిస్తాడు (1.31.7).

35.38 'అగ్ని' మూల ఇండో-యూరోపియన్ భాషకి చెందిన పదమే అయినా (లాటిన్ ఇగ్ని-స్, స్లావోనిక్ ఒగ్ని), ఈ పేరుతో నిప్పుని పూజించడం భారతదేశంలో ఏర్పడిన

ఆచారమే. మూల ఇండో- ఇరానియన్‌కాలంలో వృద్ధిపొందిన యజ్ఞకర్మకికేంద్రం అగ్ని బహుశా అథర్వన్‌అనే పేరుగల పురోహితజాతి ఈ యజ్ఞకర్మని నిర్వహించేది. బలమూ శుద్ధ స్వభావమూ, జ్ఞానమూ కలవాడుగానూ, ఆహారం, సంతానం, బుద్ధిబలం, కీర్తి ఇచ్చేవాడుగానూ, ఇంటికిస్నేహితుడుగానూ, శత్రునాశకుడుగానూ అగ్ని పురుషతారోపం పొంది పూజించబడ్డాడు; ఆయనకి మెరుపూ, చెట్లలో పుట్టే నిప్పూవంటి వేరువేరు రూపాలు ఉన్నాయని బహుశా (ఆకాలంలోనే) భావన ఉండి ఉండవచ్చు. భారతీయులకి ఉన్నట్లే ఇటలీ దేశస్థులకీ, గ్రీకులకీ, ఇరాన్ దేశస్థులకీ దేవతలకి చేసే దానాలు అగ్నిలో వెయ్యడం అనే ఆచారం ఉండేది కాబట్టి అగ్నికి ఆహుతులు ఇవ్వడం మూల ఇండో- యూరోపియన్‌కాలం నించే వచ్చిన సంప్రదాయమైనట్లు కనపడుతుంది. కాని ఈ అగ్నికి పురుషతారోపం నిజంగా ఆకాలంలో ఉండి ఉంటే అది చాలా ఛాయామాత్రంగానే ఉండి ఉండాలి.

35.39 'అగ్-ని' అనే పదం సంస్కృతంలో అజ్- 'వ్యాపించు, నడుపు' అనే ధాతువు మూలరూపం నించి నిష్పన్నమైంది కావచ్చు (అజామి, లాటిన్ అగో, గ్రీక్ అగో ఉత్తమపురుషైక వచనం); దీని వ్యుత్పత్త్యర్థం 'చురుకైన కదలికగల (ది/వాడు)' అని, ఇక్కడ ప్రకృతి పదార్థమైన నిప్పుకిగల త్వరగా వ్యాపించే స్వభావం ఉద్దిష్టమైంది.

35.40 మొదట్లో స్వర్గంలో అగ్నికి విశేషణాలుగా ఉండి తరవాత ప్రత్యేకదేవతలపేర్లుగా మారిన 'అపాంనపాత్' వంటి వాటితోపాటు పాక్షికంగా స్వతంత్రస్వభావం పొందిన అగ్ని విశేషణాలు మరికొన్ని ఉన్నాయి. వైశ్వానర- అనే విశేషణం ఋ.వే.లో సుమారు అరవైసార్లు వచ్చింది; వీటిలో రెండుచోట్ల తప్ప ఇది అగ్నికే అన్వయిస్తుంది. ఐదు విడి మంత్రాలలోనే కాక పధ్నాలుగు సూక్తాలలో ఈపదం వాడబడింది; అనుక్రమణి ప్రకారం ఇంచుమించు వీటన్నిటిలోనూ స్తుతించబడిన దేవత అగ్నివైశ్వానరుడు. ఋ.వే.లో ఈ విశేషణం ఎప్పుడూ అగ్నితో కలిపే ప్రయుక్తమయింది. దీని అర్థం 'నరులందరికీ చెందిన(వాడు)' అని; ఇది 'విశ్వవ్యాపకుడైన అగ్ని'ని- స్వర్గంలోనూ భూమిమీదా అన్ని అంశాలతో ఉన్న నిప్పుని - సూచిస్తుందనుకోవచ్చు. అందువల్లనే ఈ అగ్ని రూపాన్ని ఉద్దేశించిన సూక్తాలలో కొన్నిచోట్ల మాతరిశ్వుడికీ భృగువులకీ సంబంధించిన గాథ ప్రస్తావించబడింది; ఈ గాథ స్వర్గంలోని అగ్ని భూమిమీదకి దిగి రావడాన్ని సూచించేది (3.2.4; 6.8.4). ఒకచోట (3.26.2) అగ్నివైశ్వానరుడు మాతరిశ్వుడే అని ప్రత్యక్షంగానే చెప్పబడింది (అగ్నిమవసే

హవామహే వైశ్వానరం మాతరిశ్వానం). నిరుక్తంలోని నిఘంటువు (5.1) ల వైశ్వానర శబ్దం అగ్నికి ఒక పేరుగా ఇవ్వబడింది. యాస్కుడు (నిరుక్తం 7.23) ఈ శబ్దాన్ని వ్యాఖ్యానిస్తూ పూర్వులైన యాజ్ఞికులు సూర్యుడే వైశ్వానరుడని అన్నారనీ (అసావాదిత్య ఇతి పూర్వేయాజ్ఞికాః), శాకపూణి అనే ఋషి ఈ అగ్నే వైశ్వానరుడు (అయమే వాగ్ని ర్వైశ్వానర ఇతి శాకపూణిః) అని చెప్పేరనీ చెప్పేరు. తరవాత మరొకచోట (నిరుక్తం 7.31) ఆయన తన అభిప్రాయంగా ఇలా అన్నారు: ''సూక్తాలతో స్తుతించబడి ఆహుతులని స్వీకరించే అగ్ని వైశ్వానరుడు ఈ (= భూమిమీద) అగ్నే; పైన ఉండే రెండు జ్యోతీరూపాలకీ (= అంతరిక్షంలో దానికీ, స్వర్గంలో దానికీ) ఈ పేరు వర్తించడం అరుదు.'' యజ్ఞకర్మకి సంబంధించిన గ్రంథాలలో వైశ్వానరుడు అగ్నికి ఒక ప్రత్యేకరూపంగా పరిగణించబడ్డాడు (ఆ.శ్రౌ.సూ. 1.3.23; కా.శ్రౌ.సూ. 23.3.1; పం.బ్రా. 21.10.11; శ.బ్రా. 1.5.1.10).

35.41 తనూనపాత్ అనే విశేషణం (ఇది సాధారణంగా అగ్ని శబ్దంతో కలిసి కాక విడిగా వస్తుంది) ఋ.వే.లో ఎనిమిదిసార్లు వచ్చింది. వీటిలో రెండు (3.29.11; 10.92.2) తప్ప మిగిలినవి ఆప్రీసూక్తాలలో రెండో మంత్రంలోవి; ఆప్రీసూక్తాలు జంతుయాగంలో మొదటి భాగంలో దేవతలని ఆహ్వానించడానికి ఉపయోగించేవి; వీటిలో అగ్ని ఒక్కొక్క రూపం ఒక్కొక్క పేరుతో స్తుతించబడుతుంది. నిరుక్తంలో నిఘంటువు (5.2) లో ఈ పదం ప్రత్యేకమైన దేవత పేరుగా ఇవ్వబడింది. దీనికి యాస్కుడు (నిరుక్తం 8.5) ఇచ్చిన వ్యుత్పత్తులు కృత్రిమమైనవీ, అసమంజసమైనవీ.[7] దీని అర్థం 'తనకు తనే కొడుకైనవాడు' అని కావచ్చు; ఇక్కడ అగ్ని అడవులలోనూ మేఘాలలోనూ అకస్మాత్తుగా పుట్టడం ఉద్దిష్టమై ఉండవచ్చు. దీనికి బెర్గెయిన్ (Bergaigne) ఇచ్చిన అర్థం 'దేవుడి శరీర రూపమైన కొడుకు'. మాతరిశ్వుడితోనూ నరాశంసుడితోనూ భేదం చూపుతూ తనూనపాత్ 'దేవుడికి సంబంధించిన గర్భం' (గర్భ ఆసురః) అని చెప్పబడ్డాడు (3.29.11). 'ఇంటి పురోహితుడూ, ఎర్రనివాడికి సంబంధించిన తనూనపాత్తూ' అయిన అగ్నిని ఉషస్సులు ముద్దుపెట్టుకొంటాయి అని చెప్పబడింది (10.92.2; చూ. 5.58.6). తనూనపాత్

7. నిరుక్తం 8 5 సారాంశం: తనూనపాత్ అంటే నెయ్యి అని కాత్థక్యుడు, నపాత్ అంటే మనమడు; తనూ- అంటే ఆవు. దాన్నించి పాలు వస్తాయి; పాలనించి నెయ్యి పుడుతుంది; అగ్ని అని శాకపూణి; ఇక్కడ తనూ- అంటే నీళ్లు; వాటివల్ల మొక్కలు పుడతాయి; వాటినించి ఈయన పుడతాడు.

అందమైననాలుకకలవాడు (10.110.2). యజ్ఞాన్ని దేవతలకి తీసుకువెళ్లమని ఆయన్ని ప్రార్థించారు (1.13.2; 10.110.2). నెయ్యితోనూ మధువుతోనూ నిండిన యజ్ఞాన్ని ఆయనపంచుతాడు (1.142.2; చూ. 1.188.2). ఆయన్ని దేవతలు రోజుకిమూడుసార్లు పూజిస్తారు; వరుణుడూ, మిత్రుడూ, అగ్నీ ప్రతిరోజూ (3.4.2). హిలెబ్రాంట్ (Hillebrandt) (9.5.2 ని కొంత ఆధారంగా తీసుకొని) తనూనపాత్ అంటే చంద్రుడికి సంబంధించినసోమగోపా- అనే అగ్నిరూపమే అన్నారు; సోమగోపా- అనేది అగ్నికిఉన్న ఒక ప్రత్యేకరూపం అని ఆయన అభిప్రాయం.

35.42 నరాశంస- అనే కొంత ప్రచురమైన విశేషణం (ఇది నిరుక్తంలోని నిఘంటువు (5.3) లో ప్రత్యేకమైన పేరుగా ఇవ్వబడింది) ఋ.వే. లో ఎక్కడా అగ్నితో కలిసి రాలేదు. ఇది అగ్నికి మాత్రమే పరిమితం కాక రెండుచోట్ల (1.106.4; 10.64.3) పూషుడికి వాడబడింది. ఇది ఆప్రీ సూక్తాలలో: మూడో మంత్రంలోనూ ఆప్రసూక్తాలు అని చెప్పబడేవాటిలో రెండో మంత్రంలోనూ వస్తుంది. నరాశంసుడు నాలుగు అవయవాలు కలవాడు (10.92.11), స్వర్గంలోని భార్యకు పతి (గ్నాస్పతి-, 2.38.10, నాలికమీదా చేతిలోనూ తేనెతో ఆయనయజ్ఞం నిర్వహిస్తాడు (1.13.3; 5.5.2). రోజుకు మూడుసార్లు ఆయన యజ్ఞంమీద తేనె చల్లుతాడు (1.142.3); మూడు స్వర్గాలకీ దేవతలకీ నెయ్యి రాస్తాడు (2.3.2). ఆయనదేవతలకి అగ్రగామిగా వచ్చి యజ్ఞాన్ని వారికిసంతోషకరమైనదిగా చేస్తాడు (10.70.2). ఆయన యజ్ఞాలద్వారా భక్తులు దేవతలగొప్పతనాన్ని పొగడతారు (7.2.2). సోముడు నరాశంసుడికీస్వర్గంలోనిదేవుడికీ (దైవ్య-) మధ్యవర్తి (9.86.42);, దీని అర్థం భూమిమీదఅగ్నికీస్వర్గంలోని అగ్నికీ మధ్యవర్తి అని కావచ్చు. అగ్ని పుట్టినప్పుడు నరాశంసుడు అని చెప్పబడతాడు; ఇక్కడ నరాశంసుడుకీ తనూనపాత్తుకీ మాతరిశ్వుడికీ భేదం చెప్పబడింది (3.29.11). బృహస్పతిని ఉద్దేశించిన ఒకసూక్తం (10.182.2) లో నరాశంసుడు రక్షణకోసం ప్రార్థించబడ్డాడు; మరొకదాంట్లో (1.18.9) స్వర్గస్థానాన్ని యజ్ఞంలో అర్పించేవాడుగా చెప్పబడ్డాడు. ఈరెండుచోట్లా ఈయన బృహస్పతిగా భావించబడ్డాడని అనుకోవచ్చు. నరా-శంస అనేది కొన్ని అపవాదాలతో కూడుకొని ఉన్న సమాసంలా కనపడుతుంది (ఇందులో షష్ఠీ బహువచన ప్రత్యయంలోని మకారం లోపించింది); ఇందులో రెండు ఉదాత్తాచ్చులు ఉన్నాయి. రెండు మంత్రాలలో ఇందులో పదాల మధ్య 'చ', 'వా' అనే నిపాతాలు వాడబడ్డాయి (నరాచశంసం, 9.86.42; నరావా

శంసం, 10.64.3. నరాం శంస(2.34.6), దేవానాం శంస(1.141.11) అనే ప్రయోగాలు ఉండడం వల్లా, ఒక ఋషి అగ్నిని శంసం ఆయోః (4.6.11) 'ఆయువు పొగడ్త (కి లక్ష్యమైనవాడు)' అని వర్ణించడం వల్లా, నరాశంస- అంటే 'నరుల పొగడ్త (కి లక్ష్యమైనవాడు)' అని అర్థమైనట్లు కనపడుతుంది. రెండో బృహస్పతిలా మానవుల ప్రార్థనకు అధిదేవతగా అగ్నికి ఉన్న ఒక విశిష్ట లక్షణానికి నరాశంసుడు ప్రతీక అని బెర్గెయిన్ (Bergaigne) అభిప్రాయపడ్డారు.[8]

## 36. బృహస్పతి

36.1 ఈ దేవతకి ఋగ్వేదంలో గణనీయమైన ప్రాముఖ్యం ఉంది; పదకొండు పూర్తి సూక్తాలలో ఈయన స్తుతి ఉంది. మరిరెండు సూక్తాలలో (4.49; 7.97) లో ఈయనా ఇంద్రుడూ దేవతాద్వంద్వంగా కలిపిస్తుతించబడ్డాడు. బృహస్పతి అనే పేరు 120 సార్లూ దీనికే నామాంతరమైన బ్రహ్మణ స్పతి అనే పేరు 50 సార్లూ వచ్చాయి. ఈ రెండు పేర్లూ ఒకేసూక్తంలోని వేరువేరు మంత్రాలలో నామాంతరాలుగా ప్రయోగించబడ్డాయి (ఉదాహరణకి, 2.23లో 1లో బ్రహ్మణ స్పతే అనీ 2లో బృహస్పతే అనీ ఉంది). బృహస్పతికి చెప్పబడిన ఆకార లక్షణాలు తక్కువ. ఆయన ఏడు నోళ్ళూ ఏడు రశ్మిలూ కలవాడు (సప్తాస్యః...... సప్తరశ్మిః, 4.50.4); మంచి నాలుక కలవాడు (మంద్రజిహ్వ, 4.50.1; 1.190.1); వాడి అయిన కొమ్ములు కలవాడు (తీక్ష్ణశృంగ, 10.155.2); నీలంరంగు కల వీపుకలవాడు (నీలపృష్ఠం, 5.43.12), వందరెక్కలు కలవాడు (శతపత్రః, 7.97.7; ★ 'చాలా వాహనాలు కలవాడు' అని సాయణుడు). ఆయన బంగారురంగు కలవాడు, ఎర్రనివాడు (హిరణ్యవర్ణ మరుషం, 5.43.12), ప్రకాశించేవాడు (ఆఘృణే, 3.62.7; 7.97.7), శుచి అయినవాడు (శుచిః, 7.97.7), స్పష్టమైన వాక్కు కలవాడు (శుచిక్రందం, 7.97.5). యజ్ఞకర్మే ఆయన వింటితాడు (ఋతజ్యేన .... ధన్వనా, 2.24.8); ఆయన బాణాలు మంచివి (తస్యసాధ్వీ రిషవః, చూ. అ.వే. 5.18.8, 9). ఆయనకు బంగారు గొడ్డలి ఉంది (హిరణ్యావాశీః, 7.97.7; దీనికి సాయణుడు ఇచ్చిన మరొక అర్థం 'బంగారువంటి వాక్కు కలవాడు'); మంచి ఇనుముతో చేసిన ఈయన గొడ్డలికి త్వష్ట పదును పెడతాడు (త్వష్టా ...... శిశీతే నూనం పరశుం స్వాయసం,

8. చూ. సాయణవ్యాఖ్య (10.64.3) : నరాశంసం = నరైః శంసనీయం 'నరులచేత ప్రశంసించదగినవాణ్ణి'.

10.53.9). ఈయనకి రథం ఉంది (10.103.4); రాక్షసులని చంపే (రక్షోహణం), గోవుల స్థానాలని భేదించే (గోత్రభిదం), కాంతిని సాధించే (స్వర్విదం) యజ్ఞానికి సంబంధించిన రథం మీద ఆయన ఉంటాడు (రథమృతస్య తిష్ఠసి, 2.23.3). ఆయన (రథాన్ని) లాగే గుర్రాలు ఎర్రనివి (అరుషాసో అశ్వా బృహస్పతిం సహవాహో వహంతి, 7.97.6).

36.2 బృహస్పతి మొదట ఉన్నతమైన స్వర్గంలోని గొప్ప జ్యోతినించి పుట్టి శబ్దంతో చీకట్లని పారదోలేడు (బృహస్పతిః ప్రథమం జాయమానో మహో జ్యోతిషః పరమేవ్యోమన్ .... రవేణ .... అధమ త్తమాంసి, 4.50.4; చూ. 10.68.12). ఆయనకు రెండు లోకాలూ తల్లులు (రోదసీ జనిత్రీ, 7.97.8); కాని త్వష్ట ఆయన్ని పుట్టించినట్లు కూడా చెప్పబడింది (త్వష్టా జనత్, 2.23.17). మరొకపక్క ఆయన దేవతలకి తండ్రి అని కూడా చెప్పబడ్డాడు (దేవానాం యః పితరం, 2.26.3); కమ్మరివాడు (అగ్నిని) ఊదినట్లు ఆయన దేవతల జన్మలని కలిగించాడు (బ్రహ్మణ స్పతిరేతా సం కర్మార ఇవాధమత్, 10.72.2).

36.3 బృహస్పతి పురోహితుడు (2.24.9; వా.సం. 20.11; తై.సం. 6.4.10; ఐ.బ్రా. 8.26.4); ఈ పదం ముఖ్యంగా అగ్నికే ప్రత్యేకం (అధ్యాయం 35.33). ప్రాచీన ఋషులు ఆయన్ని అగ్రభాగంలో పెట్టేరు (తం ప్రత్నాస ఋషయః .... పురో విప్రా దధిరే, 4.50.1). ఆయన బ్రహ్మ (2.1.3; 4.50.8); ఒకచోట (10.141.3) ఈ పదం యజ్ఞం చేయించే పురోహితులలో మంత్రాలు చదివే ఆయన అనే అర్థంలో వాడబడినట్లు కనపడుతుంది (బ్రహ్మాణం చ బృహస్పతిం). ఆయన సోముడికి పురోహితుడు (శ.బ్రా. 4.1.2.4). తరవాత కాలపు వైదిక గ్రంథాలలో బృహస్పతి దేవతలకు యాజకులలో ఒకడైన బ్రహ్మ. ఈయన దేవతల ప్రార్థన లేక భక్తి అని కూడా చెప్పబడ్డాడు (★ బ్రహ్మ శబ్దానికి వేదంలో ఈ అర్థాలు కూడా ఉన్నాయి; తై.సం. 2.2.9.1, మొ). బృహస్పతి భక్తిని కలిగిస్తాడు; ఆయన లేకుండా యజ్ఞం సిద్ధించదు (యస్మాదృతే న సిధ్యతి యజ్ఞః, 1.18.7). మార్గాలు చేసే ఆయన దేవతలకు భోజనం దొరికే యజ్ఞానికి (దేవవీతయే) తోవ సులభం చేస్తాడు (2.23.6, 7). ఆయనవల్ల దేవతలకి యజ్ఞంలో భాగం దొరుకుతుంది (2.23.1). ఆయన యజ్ఞంతో దేవతలని లేపుతాడు (అ.వే. 19.63.1). ఇంద్రుడూ,

వరుణుడూ, మిత్రుడూ, అర్యముడూ, దేవతలూ సంతోషించే మంత్రాన్ని ఆయనే ఉచ్చరిస్తాడు (ప్రనూనం బ్రహ్మణస్పతి ర్మంత్రం వదత్యుక్థ్యం, 1.40.5). బృహస్పతి సామాలతో అర్చిస్తాడు (బృహస్పతిః సామభి ర్ఋక్వో అర్చతు, 10.36.5). ఆయన శ్లోకం స్వర్గంలోకి వెళ్తుంది (అస్య శ్లోకో దివీయతే, 1.190.4); ఛందస్సు ఆయనకి సంబంధించినది (మై.సం. 1.9.2). ఆయనతోపాటు స్తుతులు పాడేవారు ఉంటారు (7.10.4; 10.14.3). ఆయన హంసలలా పాడే తన సఖులతో కలిసి (సామాలు) పాడతాడు (హంసైరివ సఖిభి ర్వావదద్భిః.... అగాయత్, 10.67.3); ఇక్కడ 'సఖులు' అంటే దీనిపై మంత్రం (10.67.2)లో చెప్పబడిన అంగిరసులు (అధ్యాయం 54) కావచ్చు. ఆయనపాడేవారిసముదాయంతో (ఋక్వతాగణేన) కలిసిఉంటాడు (4.50.5). అందువల్లనే ఆయన గణపతి అని చెప్పబడ్డాడు (2.23.1);[1] ఈ పదం ఒకచోట (10.112.9) ఇంద్రుడికి కూడా వాడబడింది.

36.4 బ్రహ్మణస్పతి అనే పేరు సూచిస్తున్నట్లు ఈ దేవత 'ప్రార్థనలకి పతి'. ఆయన ప్రార్థనలకి పెద్దరాజు (జ్యేష్ఠరాజం బ్రహ్మణాం), ఋషులలో (గొప్ప) ఋషి (కవిం కవీనాం, 2.23.1). యజ్ఞానికిసంబంధించినరథంమీదఎక్కి ఆయన ప్రార్థనలకి శత్రువులనీ (బ్రహ్మద్విషః), దేవతలని నిందించేవారినీ (దేవనిదః) నాశం చేస్తాడు (2.23.3, 4, 8). ఆయన ప్రార్థనలని పుట్టించాడు (1.190.2); మంత్రాలని ఉచ్చరిస్తాడు (1.40.5); మానవ పురోహితుల నోటికి వాక్కు ఇస్తాడు (అస్మే ధేహి ద్యుమతీం వాచమాసన్, 10.98.3; అస్మే = మాలో, ఆసన్ = నోట్లో). అందువల్ల తరవాత కాలంలో ఆయనకి వాచస్పతి 'వాక్కుకి పతి' అనే పేరు వచ్చింది; వేదాల తరవాత సాహిత్యంలో వక్తృత్వానికీ జ్ఞానానికీ అధిదేవతగా భావించబడిన బృహస్పతికి పై పేరు ముఖ్యంగా అన్వయిస్తుంది.

36.5 బృహస్పతికీ అగ్నికీ అభేదం చెప్పే మంత్రాలు కొన్ని ఉన్నాయి. ''మిత్రుడిలా అందమైనవాడూ బ్రహ్మణస్పతీ (= ప్రార్థనలకు పతి) అయిన అగ్నిని'' స్తుతించు (బ్రహ్మణస్పతిం అగ్నిం మిత్రం న దర్శతం, 1.38.13). మరొక సందర్భం (2.1.3, దాని తరవాతవి)లో అగ్నికీ బ్రహ్మణస్పతితో పాటు ఇతర దేవతలకీ కూడా అభేదం చెప్పబడినా, పై రెండు పదాలు మాత్రమే సంబోధన ప్రథమలో ఉండడం వల్ల ఈ ఇద్దరికీ ఎక్కువ సాన్నిహిత్యం సూచించబడింది అనుకోవచ్చు. ఒక మంత్రం (3.26.2)లో

1. గణానాం త్వాగణపతిం హవామహే ''గణాలకి పతి వయిన నిన్ను ఆహ్వానిస్తున్నాము''

మాతరిశ్వశబ్దమూ, విప్ర- 'మేధావి', అతిథి-, ఘృష్వద 'వేగంకలవాడు' అనే విశేషణాలతో కూడిన బృహస్పతి శబ్దమూ అగ్నికి విశేషణాలు అయినట్లు కనపడుతోంటే, మరొకదాంట్లో (1.190.2) మాతరిశ్వశబ్దం బృహస్పతికి విశేషణంగా కనపడుతోంది. పైగా, బృహస్పతి నీలంరంగు వీపు కలవాడు, ఇంట్లో స్థానం కలవాడు, ప్రకాశించేవాడు, బంగారురంగు కలవాడు, ఎర్రనివాడు (5.43.12) అని చెప్పినచోట ఉద్దిష్టుడైనది అగ్నే అయి ఉండాలి. మరి రెండు మంత్రాలలో (1.18.19; 10.182.2) బృహస్పతీ అగ్ని రూపాంతరమని స్పష్టంగా తెలిసిన నరాశంసుడూ (అధ్యాయం 35.42) ఒకరే అయినట్లు కనపడుతుంది. అగ్నిలాగే బృహస్పతి కూడా పురోహితుడు, సహసస్పుత్రుడు ('బలానికి కొడుకు', 1.40.2), అంగిరసుడు (2.23.18; ఆంగీరస- అనే విశేషణం ఈయనకి మాత్రమే వాడబడింది), దెయ్యాలని కాలుస్తాడు (2.23.14), చంపుతాడు (10.103.4). బృహస్పతి కూడా స్వర్గానికీ, ఉన్నత స్థానాలకీ ఎక్కుతాడని చెప్పబడింది (10.67.10). అగ్నిలా బృహస్పతికి కూడా మూడు స్థానాలు ఉన్నాయి (త్రిషధస్థః, 4.50.1); ఇళ్ళ(లో వారి)కి పూజ్యుడు (యజతం పస్త్యానాం, 7.97.5), సదసస్పతి 'ఇళ్లకి పతి' (1.18.6; ఈపదం ఇంద్రాగ్నులకి ఒకచోట (1.21.5) వాడబడింది). మరొకవంక, అగ్ని 'బ్రహ్మణస్ కవి- 'ప్రార్థనకి ఋషి' (6.16.30) అని చెప్పబడి, ప్రార్థనవల్ల (బ్రహ్మణా) స్వర్గాన్నీ, భూమినీ సుముఖం చెయ్యమని ప్రార్థించబడ్డాడు (2.2.7). కాని ఇంతకన్న చాలా తరుచుగా బృహస్పతికీ అగ్నికీ భేదం సూచితమయింది (2.25.3; 7.10.4; 10.68.9); ఈ భేదం ఈ ఇద్దరినీ విడివిడిగా ఆహ్వానించడం ద్వారానూ, ఇతరదేవతలపేర్లతోపాటు ఈ రెండు పేర్లూ చెప్పడం ద్వారానూ సూచించబడింది (3.20.5, మొ.)

36.6 అగ్నిలాగే బృహస్పతి ఆవులని విడిపించడం అనే ఇంద్రగాథలోకి చొచ్చుకొని అందులో స్థిరమైనస్థానం సంపాదించుకొన్నాడు. అంగిరసుడైన బృహస్పతి గోవుల స్థానాన్ని తెరచి ఇంద్రుడు తనకు సహాయుడుగా చీకటిలో ఉన్న నీటి ప్రవాహాన్ని విడిపించినప్పుడు ఆయన శక్తికి పర్వతం (= మేఘం) లొంగింది 92.23.18; చూ. 1.56.5; 1.89.9). పాడే తనగణాలతో కూడిన ఆయన అరుపుతో వలుణ్ణి చీల్చాడు; అరిచే గోవులని ఆయన అరుస్తూ బయటకి తోలేడు (4.50.5). ఆయన సంపదలనీ ఆవులతో నిండిన గొప్ప స్థానాలనీ సాధించాడు; నీళ్లూ, కాంతీ కావాలని కోరి మారులేని బృహస్పతి తన శత్రువుని మంటలతో (/ మంత్రాలతో) చంపుతాడు (బృహస్పతిర్హంత్యమిత్రమర్కైః, 6.73.3).

దృఢమైనవి శిథిలమయ్యాయి; గట్టివి లొంగిపోయాయి; ఆయన ఆవులని బయటకి తోలేడు; మంత్రంతో వలుణ్ణి చీల్చాడు; చీకటిని దాచివేసి స్వర్గం ప్రకాశించేటట్లు చేశాడు; మధువుతో నిండి రాతితో మూయబడిన బావిని బృహస్పతి తనశక్తితో ఛేదించినప్పుడు స్వర్గంలోనివారు దాన్ని తాగేరు; ఆ ప్రవాహాన్ని వారు బయటికి పోశారు (2.24.3, 4). బృహస్పతి తన అగ్నివంటి కాంతులతో / మంత్రాలతో (అగ్ని- తపోభిరర్కైః) వలుడి ఆయుధాలని చీల్చి గోధనాన్ని బయటకి తెచ్చాడు (6); పక్షిగుడ్లని బద్దలుకొట్టినట్లు (ఆండేవ భిత్వా శకునస్య, 7) కొండని బద్దలుకొట్టి ఆవులని బయటకి తోలేడు; రాయి కప్పి ఉన్న తేనెని చూశాడు; వలుణ్ణి తన అరుపుతో చీల్చి దాన్ని బయటకి తెచ్చాడు; వలుడి ఎముకలని చీల్చి మూలుగును తీసినట్లు గోవులని బయటకి తెచ్చాడు (వలస్య నిర్మజ్జానం నపర్వణో జభార, 9) (10.68.4-9). ఆయన ఆవులని బయటకి తోలి అవి ఆకాశంలో వ్యాపించేటట్లు చేశాడు (2.24.14). బృహస్పతి రాతిలోంచి ఆవులని బయటకి తెచ్చాడు; వలుడి ఆవులని పట్టుకొని వాటిని తన అధీనంలోకి తెచ్చుకొన్నాడు (10.68.5). ఆయన వలుణ్ణి జయించడం ఒక ప్రసిద్ధగాథ అయ్యేటంత ప్రత్యేకతని సంపాదించుకొంది (అ.వే. 9.3.2).[2] ఆయన మేఘాలకు సంబంధించినవాడు (అభ్రియ-) కాబట్టి ఆవులని అరుపులతో తోల్తాడు (10.68.12; చూ. 10.67.3), ఇక్కడ ఆవులంటే నీళ్లు కావచ్చు; నీళ్లు వాచ్యంగానే 2.23.18; 6.73.3లలో చెప్పబడ్డాయి; లేకపోతే ఇవి ఉషఃకాల కాంతి కిరణాలు కావచ్చు (చూ. 10.67.5; 10.68.9).

36.7 ఆవులని విడిపించేటప్పుడు బృహస్పతి చీకటిలో కాంతిని పుట్టించడానికి ప్రయత్నించి సాధించాడు; ఆయన ఉషస్సునీ, కాంతినీ, అగ్నినీ సాధించి చీకటిని పోగొట్టేడు (10.68.4, 9). కోటని భేదించి (విభిద్యాపురం), ఉషస్సునీ, సూర్యుణ్ణీ, గోవునీ చూసి తెలుసుకొన్నాడు (10.67.5); చీకటిని దాచి / పోగొట్టి కాంతిని కనపడేటట్టు చేశాడు (2.24.3; 4.50.4). ఈవిధంగా బృహస్పతికి యోధుడి సాధారణ లక్షణాలు ఆపాదించబడ్డాయి. ఆయన సంపదలతో నిండిన పర్వతాలలోకి ప్రవేశించాడు (వసుమంతం వి పర్వతం), శంబరుడి స్థానాలని భేదించాడు (2.24.2). ఆంగిరసుడైన బృహస్పతి మొట్టమొదట పుట్టిన పవిత్రుడు (ప్రథమజా ఋతావా), కొండలని భేదించినవాడు

2. బృహస్పతి రివాహం వలం వాచా విస్రంసయామి తత్ - ఇక్కడ ఈ గాథలో అంశాలు ఉపమానంగా వాడబడ్డాయి.

(అద్రిభిత్), వృషభుడైన ఆయన రెండు లోకాలలో అరుస్తాడు (ఆ రోదసీ వృషభో రోతవీతి; వృత్రాలని (వృత్రాణి = చుట్టి ఉండే చీకట్లని) చంపుతాడు; పురాళ్లని భేదిస్తాడు; శత్రువులని జయిస్తాడు (6.73.1, 2). ఆయన శత్రువులని పారదోలి జయం సాధిస్తాడు (10.103.4). చిన్న యుద్ధంలో కాని పెద్ద యుద్ధంలో కాని ఆయన్ని జయించినవాడు లేడు (1 40.8). యుద్ధంలో ఆయన శత్రువుని ఓడిస్తాడు (2.23.11). యుద్ధాలలో ఆయన ఆహ్వానించదగినవాడు (భరేషు హవ్యః, 2.23.13); ఆయన యుద్ధంలో స్తుతించదగిన పురోహితుడు (2.24.9).

36.8 ఇంద్రుడికి మిత్రుడూ యుద్ధాలలో సహచరుడూ అయిన ఆయన (2.23.18, 2.24.2; 8.96.15), ఇంద్రుడితో కలిపి తరచు స్తుతించబడ్డాడు (4.50.10, 11, మొ.). ఇంద్రుడితోపాటు ఆయన సోమపానం చేస్తాడు (ఇంద్రాబృహస్పతీ.....సోమపా, 4.49.3; 4.50.10); ఇంద్రుడిలా ఆయన కూడా మఘవన్- 'దానగుణం కలవాడు' అని చెప్పబడ్డాడు (2.24.12). ఇంద్రుడొక్కడితోనే ఈయన దేవతాద్వంద్వంలో కలుస్తాడు (ఇంద్రాబృహస్పతీ, 2.24.12; 4.49.1-6) అందువల్లనే ఈయన వజ్రిన్- 'వజ్రం కలవాడు' అని చెప్పబడడమూ (1.40.8), అసురులని చంపే ఆయుధమైన వజ్రాన్ని విసిరేవాడని వర్ణించబడడమూ (అ.వే. 11.10.13) సంభవించింది. ఇంద్రుడూ ఈయనా కూడా మరుత్తులతోపాటు ఆహ్వానించబడ్డారు (1.140.1); ఒకచోట ''బృహస్పతీ! నువ్వు మిత్రుడివైనా, వరుణుడవైనా, పూషుడవైనా నా దేవతగారా!'' (బృహస్పతే ప్రతిమే దేవతా మిహి మిత్రో వా యద్వరుణో వాసి పూషా, 10.98.1) అని ప్రార్థించబడ్డాడు. ఒక మంత్రం (1.105.17) లో ఆయన కూపంలో కూరుకుపోయిన త్రితుడి ప్రార్థన విని ఆయనకి శుభం కలిగించాడని ఉంది (త్రితః కూపే ఽవహితో దేవాన్ హవత ఊతయే, తచ్ఛుశ్రావ బృహస్పతిః).

36.9 బృహస్పతి ప్రార్థించేవారిని అనుగ్రహిస్తాడు (2.25.1); ప్రార్థనలని ద్వేషించేవారిని దహిస్తాడు (బ్రహ్మద్విషస్తపనః, 2.23.4). ఆయన భక్తి కలవాడిని అన్ని ప్రమాదాలనించీ, ఆపదలనించీ, శాపాన్నించీ, హానినించీ కాపాడి సంపదా, వృద్ధీ అనుగ్రహిస్తాడు (1.18.3; 2.23.4-10). కోరదగినవి అన్నీ కల (విశ్వవార-, 7.10.4; 7.97.4) ఆయన ధనవంతుడు (రేవాన్), ధనం సంపాదించేవాడు (వసువిత్), వృద్ధి కలిగించేవాడు (పుష్టివర్ధనః),

ఆయుర్వృద్ధి కలిగించేవాడు, రోగాలనిపోగొట్టేవాడు (అమీవహా, 1.18.2). ఇలా అనుగ్రహ శీలి అవడం వల్ల ఆయన తండ్రిగా భావించబడ్డాడు (4.50.6; 6.73.1).

36.10 ఆయన అసుర్య- 'దివ్యత్వం కలవాడు' (2.23.2; ★'అసురులని చంపేవాడు' అని సాయణుడు), విశ్వదేవ్య- 'అందరు దేవతలకీ సంబంధించినవాడు' (3.62.4; 4.50.6), దేవతలలో గొప్పదేవత (దేవానాం దేవతమాయ, 2.24.3). ఆ దేవుడు దేవతలలోకి వ్యాపించాడు (సదేవో దేవాన్ప్రతి పప్రథే), అన్నిటినీ చుట్టి ఉన్నాడు (2.24.11; చూ. 8.72.18). ఆయన తన శక్తితో, అరుపుతో భూమి అంచులని నిలబెట్టేడు (4.50.1). సూర్యుడూ చంద్రుడూ ఒకరి తరవాత ఒకరు ఉదయించేటట్టు చెయ్యడం అనే ఆయన పని ఎవరూ అనుకరించలేనిది, మళ్లీ చెయ్యలేనిది (అనాను కృత్యమపునశ్చకార యా త్సూర్యామాసా మిథ ఉచ్చరాతః, 10.68.10; యాత్ = యత్ ' ఏది ఉందో అది'). బృహస్పతి కాయలు కాసేవీ, కాయలు కాయనివీ, పువ్వులు పుయ్యనివీ, పూసేవీ అయిన చెట్ల వృద్ధికి కారకుడు అని కూడా చెప్పబడిది (యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః, బృహస్పతి ప్రసూతాః, 10.97.15, 19). తరవాత కాలంలో బృహస్పతికి కొన్ని నక్షత్రాలతో సంబంధం ఏర్పరచబడింది: తై.సం. (4.4.10.1) లో తిష్య నక్షత్రానికి బృహస్పతి దేవత (తిష్యో నక్షత్రం బృహస్పతిర్దేవతా) అని చెప్పబడింది. వేదాల తరవాత సాహిత్యంలో ఆయన గురుగ్రహానికి అధిదేవతగా భావించబడ్డాడు.

36.11 బృహస్పతి భారతీయ సాహిత్యంలో మాత్రమే కనపడే దేవత. ఋగ్వేదంలో ప్రాచీనమండలాలలోనూ అర్వాచీనమండలాలలోనూ కూడా పైన (36.1) చెప్పిన రెండు నామాంతరాలూ ఉన్నాయి. కాని, ఒక్కొక్క ప్రత్యేకాంశానికి అధిదేవతని సూచించడానికి పతి శబ్దంతో ఏర్పడిన సమాసాలు (వాచస్పతి, వాస్తోష్పతి, క్షేత్రస్యపతి వంటివి) పునరాలోచన, ఊహావిస్తరణల ఆధారంగా అర్వాచీనకాలంలో పుట్టినవి కాబట్టి ఈ గాథామూర్తి ఉత్పత్తి ఋగ్వేదకాలారంభం కన్న మరీ ఎక్కువ ప్రాచీనదశకు చెంది ఉండదు. బృహస్పతి శబ్దంలో రెండు అచ్చులు (మొదటిదీ, మూడోదీ) ఉదాత్తంగా ఉండడం వల్ల ఇది విలక్షణత కల సమాసం అని తెలుస్తుంది.[3] ఇందులో మొదటి పదం - అస్‌తో అంతమయ్యే

---

3. సాధారణంగా సమాసంలో ఒక అచ్చే ఉదాత్తంగా ఉంటుంది. కాని వనస్పత్యాదిగణానికి చెందిన బృహస్పతి వంటి సమాసాలలో రెండు అచ్చులు ఉదాత్తంగా ఉంటాయి (చూ. ఉభే వనస్పత్యాదిషు యుగపత్, అష్టాధ్యాయి 6.2.140).

నపుంసకం కావచ్చు; కాని దీనికి వివరణ ఇచ్చేదిగా ఉన్న సమకాలికమైన బ్రహ్మణస్పతి అనే శబ్దం వల్ల ఋగ్వేదకవులు బృహస్ అనేది బృహ్ అనేనామం ( దీనికీ బ్రహ్మన్‌శబ్దానికీ కూడా మూలమైన ధాతువు బృహ్) - యొక్క షష్ఠ్యేకవచన రూపంగా భావించారని తెలుస్తోంది.

36.12 దేవపురోహితుడుగా భక్తికి అధిదేవత అనే అగ్ని ఒక లక్షణానికి బృహస్పతి మొదట్లో రూపకల్పనఅనే అభిప్రాయానికిపైన ఇచ్చినఆధారాలు అవకాశం కల్పిస్తాయి అని చెప్పవచ్చు; (పతి శబ్దంతో ఏర్పడిన విశాం పతి, గృహపతి, సదసస్పతి వంటి అగ్నికి సంబంధించిన ఇతర విశేషణాలలా కాక) ఈ విశేషణం ఋగ్వేదకాలారంభం నాటికి, అగ్నితో సంబంధం పూర్తిగా తెగతెంపులు కాకపోయినా, ప్రత్యేకదేవతగా రూపొందింది. లాంగ్లొ (Langlosis), హెచ్.హెచ్. విల్సన్, మాక్స్ ముల్లర్ - వీరికి బృహస్పతి అగ్ని రూపాంతరం అనే అభిప్రాయంలో ఏకీభావం ఉంది. ఈ పురోహిత స్వభావంకల దేవత భక్తికి ఉన్న శక్తికి తిన్నవైనపురుషతారోపం అని రోథ్(Roth) అభిప్రాయపడ్డారు. అదేవిధంగా, కయెగీ(Kaegi), ఓల్డెన్‌బెర్గ్(Oldenberg) ఈయన పురోహితత్వానికి రూపకల్పన అనీ అంతకుముందు కాలంనించీ ఉన్న దేవతల కృత్యాలు ఈయనకి ఆరోపించబడ్డాయనీ విశ్వసించారు. బృహస్పతి ఇంద్రుడి పురోహితలక్షణానికి ప్రతినిధి అని వెబర్(Weber) అభిప్రాయం; ఈవిషయంలో హాప్కిన్స్(Hopkins) ఆయన్ని అనుసరించారు. చివరగా, హిలెబ్రాంట్(H llebrandt) ఆయనమొక్కలకి అధిపతి అనీ, చంద్రుడికిపురుషతారోపం అనీ, ముఖ్యంగా చంద్రుడి వేడి తత్త్వానికి ప్రతినిధి అనీ అభిప్రాయపడ్డారు.

36.13- బ్రహ్మన్- అని చెప్పబడే యాజకులలో ఒకరికి దేవతారూపుడైన బృహస్పతి హిందూమతంలోని దేవతాత్రయంలో ముఖ్యుడైన బ్రహ్మ ( బ్రహ్మ) కి ప్రాచీనరూపమైనట్లు కనపడుతుంది; దీని నపుంసక లింగరూపమైన బ్రహ్మ వేదాంతంలో అంతటికీ మూలమైన బ్రహ్మపదార్థంగా పరిణమించింది.

## 37. సోముడు

37.1 యజ్ఞంలో సోమయాగం ముఖ్యాంగం కాబట్టి ఋగ్వేదంలో సోముడు సహజంగానే అతి ముఖ్యదేవతలలో ఒకడయ్యాడు. తొమ్మిదో మండలంలో ఉన్న మొత్తం 114 సూక్తాలూ, ఇతర మండలాలలో మరి ఆరు సూక్తాలూ,ఆయన్ని స్తుతించడానికి ఉద్దిష్ట

మయ్యాయి. ఇంతేకాకమరి నాల్గైదు సూక్తభాగాలలోనూ, ఇంద్రుడు, అగ్ని, పూషుడు, రుద్రుడు - వీరిలో ఒక్కొక్కరితో కలిసి దేవతాద్వంద్వంగా సుమారు ఇంకొక ఆరు సూక్తాలలోనూ ఈయన స్తుతించబడ్డాడు. సోమశబ్దం సమాసాలలోనూ విడిగానూ ఋగ్వేదంలో కొన్ని వందలసార్లు వచ్చింది. ప్రాచుర్య ప్రమాణాన్ని బట్టి చూస్తే వేదదేవతల ప్రాముఖ్య విషయంలో సోముడికి మూడో స్థానం లభిస్తుంది. ప్రత్యక్షంగా కనపడే సోమలతా, సోమరసమూ కవుల ఊహలకి కట్టుబాటు కల్పించడం వల్ల సోముడి విషయంలో పురుషతారోపం ఇంద్రవరుణుల విషయంలో కన్న చాలా తక్కువగా ఉంది. అందువల్ల ఆయన ఆకారం గురించీ పనుల గురించీ ఉన్న ప్రసక్తి అత్యల్పం. ఆయనకి ఆపాదించబడిన అద్భుతవీరకృత్యాలు గొప్ప దేవతలందరికీ ఇంచుమించు తుల్యంగా ఉన్నవే కాబట్టి ప్రత్యేకతా రహితాలు; లేక ఇతర దేవతలతో సాహచర్యం వల్ల ఆయనకి సంక్రమించినవి. ఇతర దేవతలలాగే ఆయన కూడా ఇందు-, సోమ- అనే పేర్లతో యజ్ఞానికి వచ్చి దర్భలమీద పెట్టిన ఆహుతులని స్వీకరించమని ప్రార్థించబడ్డాడు. తొమ్మిదో మండలంలో మంత్రాలలో చాలాభాగం (ప్రత్యక్షంగా కనపడే) సోమలతని రాళ్లతో నలగ్గొట్టేటప్పుడూ, సోమరసం వడగొట్టే ఉన్నిగుడ్డలోంచి కొయ్యపాత్రలలోకి ప్రవహించేటప్పుడూ చదివేవి. దర్భలమీద పెట్టిన ఈ పాత్రలలోని సోమరసాన్ని దేవతలకి పానీయంగా అర్పించడమో అగ్నిలో ఆహుతి చెయ్యడమో (1.94.14; 5.5.1; 8.43.11, మొ.) జరిగిన తరవాత మిగిలినదాన్ని యాజకులు తాగుతారు. సోమరసాన్ని తయారుచేసే ప్రక్రియ చాలా వైవిధ్యంగల అస్పష్టమైన ఊహాచిత్రణతోనూ తరచుగా అర్థవివరణకి సాధ్యంకాని అతీంద్రియగోచరకల్పనలతోనూ మిశ్రితమై ఉంది.

37.2 సోముడికి సంబంధించిన గాథాతత్త్వానికి ఆధారాలు భూమిమీద ఉండే సోమలతా, దాన్నించి పిండే మత్తు కలిగించే సోమరసమూ; ఈ గాథాతత్త్వాన్ని విశదీకరించడానికి ఈ రెండింటిని గురించీ వాటి ఉపయోగవిధానం గురించీ సంగ్రహంగా వివరించాలి. సోమలతలో నలగ్గొట్టబడే భాగాన్ని అంశు- 'లేతకొమ్మ, కాడ' అంటారు (9.67.28).[1] ఉబ్బిన లేతకొమ్మలు ఆవులు పొదుగులతో ఇచ్చినట్లు పాలు ఇస్తాయి (ఆపీతాసో అంశవో గావోన

---

1. అంశు శబ్దానికి 'సోమరసం' అనే అర్థం కూడా ఉంది. పరిసువానో హరి రంశుః (9.92 1) 'పిండబడే హరితవర్ణం కల సోమరసం (పవిత్రంలోకి కారుతుంది); చూ. 7.98.1

దుగ్రా ఊధభిః, 8.9.19). అంధస్- అనేపదం కాదని మాత్రమేకాకమొత్తం సోమలతని అంతటినీ సూచిస్తుందని చెప్పవచ్చు (8.32.28; 10.94.8, మొ.); అది దివినుంచి భూమికివచ్చింది(9.61.10); దాన్నిదూరదేశాన్నించిగద్దతెచ్చింది (శ్యేనో య దంధో అభర త్పరావతః, 9.68.6; 5.45.9; 10.144.5). ఈ పదం 'రసం' అనే అర్థంలో కూడా వాడబడింది; దేవతావాచి అయిన ఇందు శబ్దానికీ దీనికీ భేదం పాటించబడింది: ''ఇందూ! నీ తియ్యని రసాన్ని ఈ దేవతలు పొందుతున్నారు'' (తవ త్య ఇందో అంధసోదేవా మధో ర్వ్యశ్నతే, 9.51.3; 10.115.3). రసాన్ని సోమ- అనే పదమూ (దీనికి 'మొక్క' అనే అర్థం కూడా ఉంది) సాధారణమైన రస- అనే పదమూ కూడా వాడబడ్డాయి. ఒకసూక్తం(1.187)లో రసానికి 'పితు-' 'పానీయం' అనేపదం వాడబడింది; ఇది తరచు మద- 'మత్తు కలిగించేపానీయం' అనిచెప్పబడింది. సోమం అరుదుగా అన్న- 'అన్నం' అని కూడా చెప్పబడింది (7.98.2; 8.4.12; శ.బ్రా. 1.6.4.5). అశ్వినుల విషయంలో 'తేనె' అనేఅర్థం ఇచ్చే మధు శబ్దం 'తియ్యనిపానీయం' అనేసాధారణార్థంలో పాలకీ (పయస్-), నేతికే (ఘృత-) కాక ముఖ్యంగా సోమరసానికి కూడా వాడబడింది (4.27.5; 8.80.6). సోమశబ్దం 'స్వర్గంలోని అమృతం' అనేఅర్థంలో వాడబడినప్పుడు గాథాపరంగా మధు- దానికిసమానార్థకం. దీనికివ్యతిరేకంగా, అమృతశబ్దం సాధారణమైన సోమానికి సమానార్థకంగా తరచు వాడబడింది (5.2.3; 6.37.3, మొ.; వా.సం. 6.34; శ.బ్రా. 9.5.1.8). పిండబడినసోమరాజు అమృతం (సోమో రాజా మృతం సుతః, వా.సం. 19.72). దీనికేమరొకపదబంధం సోమ్యం మధు 'సోమలత నించి వచ్చినతేనె' (4.26.5; 6.20.3). సోమరసానికే పీయూష- (3.48.2, మొ.), పయస్- 'పాలు' (9.107.12), అంశోరూర్మి- 'లేతకొమ్మకెరటం' (9.96.8), మధ్వోరస- 'తేనెరసం' (5.43.4) అనేపదాలు లాక్షణికార్థంలో వాడబడ్డాయి. ఇందు- 'ప్రకాశించే చుక్క' అనే పదం సోమరసానికి లాక్షణికంగా చాలా తరచుగా వాడబడింది; ద్రప్స- 'చుక్క' అనేపదం వాడుక చాలా తక్కువ.

37.3 సోమరసాన్నిపిండడం అనేఅర్థాన్నిసూచించడానికిసాధారణంగా సు- 'పిండు' (9.62.4, మొ.) అనేధాతువూ, కొంతతరచుగా దుహ్- 'పితుకు' (3.36.6, 7, మొ.) అనేధాతువూ వాడబడ్డాయి. సోమరసం మత్తుకలిగించేది (మదిర-, 1.125.3; 6.17.11; 6.20.6). తేనెతో కలిపినది (మధుమత్-, 9.97.14). మధుమత్- అనే శబ్దానికి

సాధారణార్థం 'తియ్యనిది' అనేఅయినా కొన్ని మంత్రాలలో సోమరసంలో తేనె కలుపుతారు అనే సూచన ఉండడం వల్ల [2] ఇది సోమరసపరంగా వాడబడి నప్పుడు దీనికి 'తేనె (కలియడం) వల్ల తియ్యనైనది' అనే అర్థం మొదట్లో ఉద్దిష్టమై ఉండవచ్చు. రాళ్ల మధ్యనించి ప్రవహించే సోమం నదీ ప్రవాహంతో పోల్చబడింది (సింధో రివోర్మిః, 9.80.5); అది ప్రవాహమే (కెరటమే, ఊర్మి-, 9.64.11, మొ.) అనీ, తెనే ప్రవాహం (మధ్వ ఊర్మిం, 3.47.1) అనీ కూడా చెప్పబడింది. పెద్దపాత్రలో సంగ్రహించిన సోమరసం అర్ణవం (10.115.3), సముద్రం (5.47.3; 9.64.8, మొ.) అని చెప్పబడింది. స్వర్గంలోని సోమం నుయ్యి (ఉత్స-) అనీ, గోవుల ఉన్నతస్థానంలో ఉన్న నుయ్యి (5.45.8)·అనీ, గోవుల మధ్య పెట్టబడిన దశయంత్రమైన నుయ్యి (దశయంత్ర ముత్సం, 6.44.24; ★దశయంత్రం = 'పది పగ్గాలతో (అంటే వేళ్లతో) దారి చూపబడినది' అని మూలకర్త; 'కన్ను, చెవి మొదలైన పది ఉపాయాలతో కూడినది' లేక ఇంద్రవాయవాది దశగ్రహాలతో కూడినది' అని సాయణుడు) అనీ, విష్ణువు ఉన్నతపాదంలో తేనెనుయ్యి (1.154.5) అనీ చెప్పబడింది.

37.4 సోమలతా, సోమరసం - ఈ రెండింటి రంగూ, దేవతరంగూ కూడా గోధుమరంగు (బభ్రు-), ఎరుపు (అరుణ-), చాలా తరచుగా గోధుమ, పసుపు రంగులు కలిసిన హరితవర్ణం (హరి-) అని చెప్పబడింది: సోమం ఎర్రని చెట్టుకొమ్మ (వృక్షస్య శాఖా మరుణస్య, 10.94.3); పితకబడిన సోమం ఎర్రనిది (అరుణం దుగ్ధమంశుం, 7.98.1); హరితవర్ణం కల అంశు- 'సోమరసం' పవిత్రంలోకి కారుతుంది (9.92.1).-సోమలత రంగూ, బ్రాహ్మణాలలో దానికి ప్రత్యామ్నాయంగా విధించబడిన దాని రంగూ కూడా ఎరుపే (శ.బ్రా. 4.5.10.1); యజ్ఞంలో సోమం కొనేటప్పుడు దానికి ప్రతిగా ఇచ్చే ఆవు కూడా గోధుమరంగుకలదిగా కాని ఎర్రనిదిగా కాని ఉండాలి; దీనికి కారణం సోమం/సోముడి రంగు అది కావడమే (తై.సం. 6.1.6.7; శ.బ్రా. 3.3.1.14).

37.5 సోమం చేతులతో (9.86.34), పదివేళ్లతో (మృజంతి త్వా దశక్షిపః, 9.8.4;

---

2. అంజంత్యేనం మధ్వో రసేనేంద్రాయ వృష్ణ ఇందుం మదాయ (9.109 20) ''వరాలను వర్షించే ఇంద్రుడికి సంతోషం కలిగించడం కోసం ఈ సోమరసాన్ని తేనెరసంతో (ఋత్విజులు) కలుపుతారు''; ఇదే భావాన్ని 9.17.8; 9.86.48; 9.97.11 మంత్రాలు కూడా సూచిస్తాయి.

9.15.8, మొ.) శుద్ధి చేయబడినది అనీ, రూపకాలంకారంతో, పదిమంది అక్కచెల్లెళ్లచేత (యోషణో దశస్వసారః, 9.1.7; 9.6.5), వివస్వత్తు కూతుళ్లచేత (నప్తీభిర్యో వివస్వతః 9.14.5) శుద్ధి చేయబడినది అనీ చెప్పబడింది. త్రితుడి స్త్రీలు (త్రితస్య యోషణః 9.32.2; 9.38.2) హరితవర్ణంకల సోమాన్ని ఇంద్రుడు తాగడానికి పంపుతారు అనేది కూడా ఇటువంటిది. సోమాన్ని సూర్యుడి కూతురు శుద్ధిచేస్తుంది/ తెస్తుంది అని కూడా ఉంది (పునాతి తే పరిస్రుతం సోమం సూర్యస్యదుహితా, 9.1.6; 9.72.3; 9.113.3). సోమం ప్రార్థనలవల్ల శుద్ధి అవుతుంది అని కొన్నిచోట్ల ఉంది (సోమో మతిభిః పునానః, 9.96.15; 9.113.5). సోమాన్ని పిండే యాజకులు అధ్వర్యులు (అధ్వర్యు-, 8.4.11).

37.6 సోమలతని రాతితో నలగ్గొడతాడరు (గ్రావ్ణాతున్నః, 9.67.19); రాళ్లతో పిండుతారు (సువానో అద్రిభిః, 9.107.10); సోమరసాన్ని తియ్యడానికి మొక్కని నలగ్గొడతారు (సంపింషంత్యోషధిం, 10.85.3). రాళ్లు దానితోలుని చీలుస్తాయి (తై.బ్రా. 3.7.13.1). ఈ రాళ్లని తోలుమీద పెడతారు అని అద్రయస్త్వా బప్సతి గోరధి త్వచి (9.79.4) 'గోవుతోలుమీద రాళ్లు నిన్ను తింటారు' అనే దానివల్ల తెలుస్తుంది. శబ్దంచేసే రాయి వేదిమీద పెడతారు (వదన్‌గ్రావావ వేదిం భ్రియాతే, 5.31.12); ఇది యజ్ఞంలో అనుసరించే సంప్రదాయం కన్న భిన్నంగా ఉంది. దాన్ని యాజకుడు చేతులతో గుర్రాన్ని పట్టుకొన్నట్టు పట్టుకొంటాడు (సోతుర్బాహుభ్యాం సుయతో నార్వా, 7.22.1; న అర్వా గుర్రంలా; 9.79.4; అ.వే. 11.1.10). ఆ రాతిని పదివేళ్లూ, రెండుచేతులూ పట్టుకొంటాయి (దశక్షిపో యుంజతే బాహూ అద్రిం, 5.43.4). అందువల్ల ఆ రాళ్లు (తే అద్రయః) దశయంత్రాసః 'పదింటిచేత నియమించబడినవి (= పట్టుకోబడినవి)' అని చెప్పబడింది (10.94.8). వాటిని పట్టుకోవడం వల్ల అవి (రథానికి) కట్టినగుర్రాలతో పోల్చబడ్డాయి (10.94.6; శ్రుణ్వ ఏషాం ప్రోథథో అర్వతామివ ''వీటి శబ్దం గుర్రాల శబ్దంలా వినపడుతుంది''). ఈరాళ్లకి సాధారణంగా వాడబడిన పదాలు అద్రి- (ఇది సాధారణంగా వద్- 'మాట్లాడు' అనే ధాతువుతోనో లేక ఇదే అర్థంగల ఇతర ధాతువులతోనో కలిసివస్తుంది; అందువల్ల అద్రి శబ్దం విషయంలోకన్న ఈ శబ్దం విషయంలో పురుషతారోపం ఎక్కువగా ఉంది). ఈరెండు పదాలూ కూడా ఏకవచన బహువచనాలు రెండింటిలోనూ వస్తాయి కాని ద్వివచనంలో రావు. ఈ రాళ్లకి మరి మూడుపేర్లు ఒక్కొక్కటి ఒక్కొక్క మంత్రంలో మాత్రం కనపడుతున్నాయి: అశ్న- (8.2.2); భరిత్ర- (3.36.7), పర్వత-

(3.35.8), పర్వతా అద్రయః (10.94.1).[3] ఋగ్వేదకాలంలో సోమలతను రాళ్లతో నలగ్గొట్టి రసం పిండడం సాధారణ పద్ధతి. కాని రోలూ, రోకలితో రసం తియ్యడమనే పద్ధతి కూడా శ్రౌతగ్రంథాలలో విధించబడింది; ఇది కూడా ఋగ్వేదకాలంలో ఉందని 1.28.1-4 వల్ల తెలుస్తుంది (ఉలూఖల సుతానా మవే ద్వింద్ర జల్గులః; ఉలూఖలసుతానాం = రోటితో పిండబడిన (సోమలతల), (రసాన్ని), అవ ఇత్ = తెలుసుకొనే, ఉ = వ్యర్థపదం, ఇంద్ర = ఇంద్రుడా!, జల్గులః = భక్షించు; ఉలూఖల = రోలు, మంధా- = రోకలి). ఈ పద్ధతి ఇప్పటికీ పార్సీజాతి వారిలో నిలిచింది కాబట్టి ఇది ఇండో- ఇరానియన్ మూలకాలంలో కూడా ఉండి ఉండవచ్చు.

37.7 పిండిన ద్రవాన్ని గొర్రెబొచ్చుతో చేసిన వడగొట్టే సాధనం (పవిత్రం) లోకి పోస్తారు (పరి ... సుతం.... అవ్యో వారేషు సించత 'పిండిన (రసాన్ని), (అవ్యః) గొర్రెకు సంబంధించిన (వారేషు) తోకలలో = వెంట్రుకలలో, పరిసించత = పొయ్యండి; 9.63.10; సుతాః పవిత్ర మతియంతి 'పిండిన రసాలు పవిత్రాన్ని దాటి వెళ్తాయి', 9.69.9; మొ.). పవిత్రం సోమంలోని తుక్కుని (రిప్రం) పట్టుకొంటుంది; శుద్ధి పొందిన సోమం దేవతల దగ్గరకి వెళ్తుంది (9.78.1). తరచుగా చెప్పబడిన ఈ వడగొట్టే సాధనానికి చాలా పేర్లు ఉన్నాయి: త్వచ్- 'చర్మం', రోమన్- 'వెంట్రుక', వార' ఉన్ని/ తోక', పవిత్ర- 'వడగొట్టేది (పూ- 'శుద్ధిచేయు' అనే ధాతువు నించి వచ్చినది), సాను- 'శిఖరం (వడగొట్టే గిన్నెపైన ఉండడంవల్ల). ఈ పదాలు అవి- 'గొర్రె' అనే పదంనించి వచ్చిన విశేషణంతో కలిసీ విడిగానూ కూడా వస్తాయి. అవి శబ్దం కూడా ఈ అర్థంలో లాక్షణికంగా వాడబడింది (గృభ్ణాతి రిప్రమవి రస్య తాన్వా "దీని తుక్కుని అవి (= పవిత్రం) తన శరీరంతో పట్టుకొంటుంది", 9.78.1). పవిత్రంలోంచి కారే సోమానికి పవమాన- / పునాన- 'శుద్ధి పొందేది' (పూ- 'శుద్ధిచేయు' అనేదాతువు నించి వచ్చినవి) అనే పదాలు సాధారణంగా వాడబడ్డాయి. మృజ్- 'శుద్ధిచేయు' అనే ధాతువు సోమాన్ని వడగొట్టడం అనే అర్థంలోనే

3. అశ్న శబ్దం అశ్మన్ శబ్దానికి రూపాంతరం కావచ్చు. భరిత్ర శబ్దానికి మౌలికార్థం 'భరించేది' అని; దీనికి సాయణుడు 'చెయ్యి' అని అర్థం చెప్పేరు. భరిత్రై ర్మధ్వః పునంతి ధారయా పవిత్రైః అనే 3.36.7 మంత్రదళానికి సాయణుడు ఇచ్చిన అర్థం "(అధ్వర్యులు తమ) సోమధారలో పవిత్రమైన చేతులతో మధువులని (= సోమాలని) శుద్ధిచేస్తారు" అని. కాని ఇక్కడ భరిత్రైః 'భరించే వాటితో' అనేదాన్ని పవిత్రైః 'వడగొట్టే సాధనాలతో' అనే దానికి విశేషణంగా తీసుకొని "ధారతో నిండిన పవిత్రాలతో మధువులని శుద్ధిచేస్తారు" అని అర్థం చెప్పడం సముచితం అనిపిస్తుంది.

కాక దానికి పాలూ, నీళ్ళూ కలపడం అనే అర్థంలో కూడా వాడబడింది (మర్మృజానో౽ విభిర్గోభి రద్భిః, 9.91.2; 9.86.11). మరి ఏ ద్రవమూ కలపని వడగొట్టిన సోమానికి కొన్నిచోట్ల శుద్ధ- అనే పదం వాడబడింది; శుక్ర-, శుచి- 'తెల్లనిది/ ప్రకాశించేది' అనే పదాలు దానికన్న తరచుగా వాడబడ్డాయి (8.2.10; 9.33.2; 1.5.5; 1.30.2). ఈ ఇతర ద్రవాలు కలియని సోమాన్ని వాయువుకీ ఇంద్రుడికీ మాత్రమే అర్పిస్తారు; శుచిపా- 'శుచి అయిన (సోమాన్ని) తాగేవాడు' అనే విశేషణం వాయువుకి మాత్రమే ప్రత్యేకమైనది (చూ. అధ్యాయం 30.2). తరవాత కాలపు యజ్ఞకర్మలో కూడా ఈవిధంగానే చేస్తారు; దేవతా ద్వంద్వాలకి అర్పించే గ్రహాలలో (= పానీయాలలో) స్వచ్ఛమైన సోమాన్ని వాయువుకీ ఇంద్రుడికీ, పాలు కలిపిన సోమాన్ని మిత్రావరుణులకీ, తేనె కలిపిన సోమాన్ని అశ్వినులకీ అర్పిస్తారు.

37.8 సోమం పవిత్రంలోంచి కలశాలలోకి (9.60.3, మొ.), లేక పెద్ద పాత్రలలోకి (ద్రోణ-) కారుతుంది. సోమరస ప్రవాహాలు పాత్రలలోకి గేదెలు అడవులలోకి వెళ్లినట్లు (వనాని మహిషా ఇవ) వెళ్తాయి (9.33.1; 9.92.6). ఈ (సోమ) దేవుడు పక్షిలా వేగంగా పెద్దపాత్రలలో ఉండడానికి వెళ్తాడు (పర్ణవీ రివదీయతి, అభిద్రోణాన్యాసదం, 9.3.1). హరితవర్ణం కలది, చెట్టుమీద కూర్చున్న పక్షిలా, గిన్నెలలో (చమ్వోః) స్థానం ఏర్పరచుకొంటుంది (9.72.5). పెద్ద పాత్రలలో ఉన్న సోమానికి నీళ్లు కలుపుతారు. (నీటి) ప్రవాహంతో కలిసిన సోమం అరుస్తుంది (అరావీ దంశుః సచమాన ఊర్మిణా, 9.74.5). మందలోని ఎద్దులా, సోమం అనే అరిచే ఎద్దు పెద్దపాత్రలోకి, నీళ్ల ఒడిలోకి దూకుతుంది; మంత్రాలు పాడే యాజకుల ప్రేరణవల్ల నీళ్లు అనే వస్త్రం ధరించిన ఇందు (= సోమం) పెద్దపాత్రలోపల చుట్టూ దూకుతుంది (9.76.5; 9.107.26). పండితులు తమ చేతులతో సోమాన్ని నీళ్లలోకి పితుకుతారు (9.79.4). పవిత్రాన్ని దాటి అడవిలో ఆడుకొనే సోమాన్ని (వనే క్రీళంత మత్యవిం) పదిమంది స్త్రీలు శుద్ధిచేస్తారు (మృజంతి యోషణో దశ, 9.6.5). మరికొన్ని మంత్రాలు సోమానికి నీళ్లు కలపడాన్ని సూచిస్తాయి (9.30.5; 9.53.4; 9.86.8, 25). సోమరసం నదులలో (= నీళ్లలో) తేజస్సు కలిగిస్తుంది (9.76.1). సోమానికి నీళ్లు కలపడం అనే అర్థంలో తరచుగా మృజ్- 'శుద్ధిచేయు' ధాతువు వాడబడింది (9.63.17, మొ.); ఇదే అర్థంలో ఆ- ధావ్- 'కడుగు' అనే ధాతువుకూడా వాడబడింది (8.1.17). సోమాన్ని తయారు చెయ్యడంలో రసం

పిండడం (సు- ధాతువు) మొదటిదశ, నీళ్లు కలపడం రెండోదశ (7.32.6; 8.1.17; 8.31.5; అ.వే. 6.2.1); ఇదేవిధంగా తరవాత కాలపు యజ్ఞకర్మలో సవనం 'పిండడం' ముందూ ఆధావనం 'కడగడం' తరవాతా జరుగుతాయి. కలశాలలో పోసిన సోమానికి పాలు కలుపుతారు (పునానః కలశేషు.... పరిగవ్యాన్యవ్యత, 9.8.6, మొ); పాలు కలపడం వల్ల సోమం తియ్యనిది అవుతుంది (తం..... గోభిః స్వాదు మకర్మ, 8.2.3). కొన్ని మంత్రాలలో పాలూ నీళ్లూ ఒకేసారి కలపడం సూచించబడింది: సోమం నీళ్లు అనే వస్త్రాలు ధరిస్తుంది; సోమం గోవులు (= పాలు, 9.2.3, 4) అనే వస్త్రాలు ధరించాలి అనుకొన్నప్పుడు నీటి ప్రవాహాలు సోమం దగ్గరికి వెళ్తాయి. సోమాన్ని రాళ్లలో పిండుతారు; నీళ్లలో కడుగుతారు; గోవస్త్రాలు తొడుగుతారు; మనుష్యులు సోమాన్ని కాడలలోంచి పితుకుతారు (8.1.17; చూ. 2.36.1; 6.40.2; 9.86.24-25; 9.96.19).

37.9 ఋగ్వేదంలో సోమం మూడురకాల మిశ్రణాలు కలదిగా గుర్తించబడింది (త్ర్యాశిర్-, 5.27.5): పాలతో కలిసినది (గవాశిర్-), పెరుగుతో కలిసినది (దధ్యాశిర్-), బార్లీ పిండితో కలిసినది (యవాశిర్-), మిశ్రిత పదార్థం వస్త్ర-/ వాసస్-/ అత్క- అనీ నిర్ణిజ్- 'ప్రకాశించే వస్త్రం' (9.14.5) అనీ లాక్షణికంగా చెప్పబడింది; చివరిపదం పవిత్రానికి కూడా వాడబడింది (9.70.7). అందువల్ల సోమం (అందమైన) రూపాలతో కూడినది (రూపై రజ్యతే, 9.34.4, మొ.) అనీ, సోమరసాలు మంచి రూపం కలవి (సుపేశసః, 9.81.1) అనీ చెప్పబడింది. సోమానికి నెయ్యి కలుపుతారని చాలా అరుదుగా (9.82.2) సూచించబడింది; కాని నెయ్యి కలిసిన ద్దానికీ, నీళ్లు కలిసినదానికీ ఆశిర్ అనే పదం వర్తించదు.

37.10 యజ్ఞకర్మలో ఆప్యాయనం అనేది ఒక అంగం; ఇందులో సగం నలగ్గొట్టిన సోమలత కాడలని నీళ్లతో తడిపి ఉబ్బేటట్లు చేస్తారు. దీని ప్రసక్తి మొట్టమొదటగా మై.సం. (4.5.5) లో కనపడుతుంది. ఋగ్వేదంలో సోమవిషయకంగా ఆ-ప్యా- 'ఉబ్బు' అనే ధాతువు ఉపయుక్తమయింది (1.91.16-18; 10.85.5); కాని అక్కడ ఇది చంద్రుడితో అభిన్నత్వం చెప్పబడిన సోముడికి వర్తిస్తున్నట్లు కనపడుతుంది. కాని మరొక మంత్రం (9.31.4) లో ఇది యజ్ఞంలో ప్రక్రియని సూచించేదే కావచ్చు (★దీని ముందు మంత్రంలో సోమాన్ని వాయువూ, నీళ్లూ వృద్ధి చేస్తాయి అని ఉంది). ఋగ్వేదంలో సోమం సముద్రం లేక నదిలా ఉబ్బుతుంది (ధాతువు పి-/ పిన్వ్-) అని చెప్పబడింది (9.64.8; 9.107.12).

37.11 ఋగ్వేదంలో సోమాభిషవం ( = సోమాన్ని పిండి అర్పించడం) మూడుపూటలా జరుగుతుంది అని చెప్పబడింది: ఋభువులు సాయంకాల సవనానికి ఆహ్వానించబడతారు (4.33.11, మొ.); మాధ్యందిన సవనం ఇంద్రుడికి మాత్రమే ఉద్దిష్టం ( ఇంద్ర సోమం సోమపతే పిబేమం, మాధ్యందినం సవనం చారు యత్తే, 3.32.1, 2; 8.37 1); ప్రాతః సవనంలో మొదటగా తాగేవాడు ఇంద్రుడే ( ప్రాతః సావస్తవహి పూర్వపీతిః, (10.112.1).

37.12 సోమం ఉండే స్థానాన్ని ( సధస్థ- ) గురించిన ప్రసక్తి తరచుగా ఉంది; ఒకచోట మాత్రం (9.103.2) శుద్ధిచేయబడినసోమానికిమూడుస్థానాలు ఉన్నాయి అని చెప్పబడింది ( త్రీ షధస్థా పునానః కృణుతే హరిః); త్రిషధస్థ- 'మూడు స్థానాలు కలది' అనే విశేషణం సోమానికి మరొకచోట (8.94.5) వాడబడింది. ఇక్కడ మూడు స్థానాలు అన్నప్పుడు సూచించబడినవి తరవాతకాలంలో సోమయాగంలో వాడబడే(★ ద్రోణకలశ, ఆధవనీయ, పూతభృత్ అనే) మూడు పాత్రలే అయి ఉండవచ్చు (తై.సం. 3.2.1.2; కా. శ్రౌ. సూ. 9.5.17; 9.7.4; చూ. ఋ.వే. 8.2.8); కాని బెర్గెయిన్ (Bergaigne) ఇవి ఊహాత్మకమైనవే అని అన్నారు. ఇంద్రుడు మూడు చెరువులసోమం తాగుతాడు అన్నదానికి కూడా ఇటువంటి అర్థమే చెప్పవచ్చు (5.29.7, 8; 6.17.11; 8.7.10). త్రిపృష్ఠ- 'మూడు వీపులు కల' అనే విశేషణం సోముడికి ప్రత్యేకమైనది. అథమపక్షం ఒకచోట (7.37.1) సోమరసానికి అన్వయించే ఈ విశేషణం (సాయణుడు అభిప్రాయపడినట్లు) సోమానికి కలిపే మూడు పదార్థాలని సూచిస్తుందనుకోవచ్చు; అగ్నికి విశేషణమైన ఘృతపృష్ఠ- అగ్నిలో నెయ్యిపొయ్యడాన్ని సూచిస్తుందనే విషయం ఇక్కడ స్మరించుకోదగ్గది.

37.12 సోమరసంలో నీళ్లు కలపడం ఆధారంగా సోమానికీ నీళ్లకీ ఉన్న సంబంధం అనేక విధాలుగా వర్ణించబడింది. సోమంకోసం నదులు ( = నీళ్లు) ప్రవహిస్తాయి (9.31.3). నీళ్లు సోమం ఆజ్ఞ ప్రకారం ప్రవహిస్తాయి ( తవ వ్రతమన్వాపః సచంతే, 9.82.5). సోమం నదుల అగ్రభాగంలో ప్రవహిస్తుంది (9.86.12). సోమం నదులకి పతి, రాజు (9.15.5; 9.86.33; 9.89.2); సోముడు స్త్రీలకి పతి (పతిర్జనీనాం, 9.86.32); సముద్రానికి సంబంధించిన రాజు, దేవత ( రాజా దేవః సముద్రియః, 9.107.16). నీళ్లు ఆయన అక్కచెల్లెళ్లు (9.82.3). ఆయన నీళ్లకి నాయకుడు (అపాంనేతా), వృష్టికి ఈశుడు (ఈశో యో వృష్టేః, 9.74.3). ఆయన నీళ్లని పుట్టించి ఆకాశమూ భూమీ వర్షించేటట్టు చేస్తాడు (9.96.3). ఆయన స్వర్గాన్నించి వాన ప్రవాహాలు కలిగిస్తాడు (9.8.8; 9.49.1;

9.97.17; 9.108.9, 10). సోమబిందువులు కూడా కొన్నిచోట్ల వానతో పోల్చబడ్డాయి (9.41.3; 9.89.1; 9.106.9); సోమం శుద్ధంగా తేనె ధారతో నీళ్లతో నిండిన మేఘంలా ప్రవహిస్తుందని చెప్పబడింది (9.2.9). అలాగే పవమాన బిందువులు (= పవిత్రంలోంచి కారే బిందువులు) స్వర్గాన్నించీ, అంతరిక్షాన్నించీ, భూమి శిఖరానికి ప్రవహిస్తాయని చెప్పబడింది (9.63.27). పిండబడే సోమానికీ వర్షానికీ అభేదం కొన్నిచోట్ల సూచించ బడింది (8.7.10; 9.74.4; చూ. 10.30.4). శ.బ్రా. (11.5.4.5) నీళ్లు అమృతం అని చెప్పబడింది. సోమాన్ని గద్ద మనుష్యుడికి తెచ్చి ఇచ్చింది అనే గాథకు నీళ్లే అమృతంగా భావించబడడం ఆధారం కావచ్చు (అధ్యాయం 37.29). కాని స్వర్గంలోని సోమం భూమికి దిగివస్తుందనడంలో అభిప్రాయం సోమం వాన (నీటి) తో కలుస్తుందనే కాని ఈ రెండూ ఒకటే అని కాదు.

37.14 ఇంద్రుడి పానీయమూ, స్వర్గంలోని నుయ్యీ అయిన ఆనందం కలిగించే సోమప్రవాహాన్ని గమనోన్ముఖం చెయ్యమని నీళ్లు ప్రార్థించబడ్డాయి (10.30.9). సోమం నీళ్లలో వృద్ధిపొందే బిందువు (9.85.10; 9.89.2). అందువల్ల సోమం నీళ్లకి గర్భం (9.97.41; శ.బ్రా. 4.4.5.21); శిశువు; ఏడుగురు అక్కచెల్లెళ్లు తల్లులుగా ఆ నవశిశువు చుట్టూ ఉంటారు; ఆ శిశువు నీళ్ల గంధర్వుడు (అపాం గంధర్వం, 9.86.36; చూ. 10.13.5). సోమం సింధుమాతర- 'నది (= నీళ్లు) తల్లిగా కలది' అని సూటిగానే చెప్పబడింది (9.61.7). సోముడు నీళ్ల మధ్య / గోవుల మధ్య యువకుడు అని కూడా ఉంది (5.45.9; 9.9.5).

37.15 సోమం వడగొట్టే పవిత్రంలోంచి పెద్దపాత్రలలోకి / కలశాలలోకి కారేటప్పుడు అయ్యే చప్పుడు గురించిన ప్రసక్తి కూడా తరచుగా ఉంది. అది వానచప్పుడుతో పోల్చబడింది (వృష్టేరివస్వనః, 9.41.3). కాని ఇటువంటిచోట్ల ఉపయుక్తమైన భాష అతిశయోక్తులతో నిండి ఉంది; ఉదాహరణ: ఆ తియ్యని బిందువు (మధుమాన్ద్రప్సః) పవిత్రంలోంచి పాత్రలలోకి యుద్ధం చేసే వారి ధ్వనిలా ధ్వనిచేస్తూ వస్తుంది (9.69.2). ఆ చప్పుళ్లే సూచించడానికి 'గర్జించడం', 'అరవడం' అనే అర్థాలుగల క్రంద్-, నద్-, మా-, రు-, వాశ్- అనే ధాతువులు వాడబడ్డాయి (9.91.3; 9.95.4, మొ.). పండితులు ఉరిమే అక్షీణమైన సోమాన్ని పితుకుతారు (అంశుం దుహంతి స్తనయంత మక్షితం కవిం కవయః, 9.72.6) అని వర్ణించిన చోట స్తన్- 'ఉరుము' అనే ధాతువు కూడా ప్రయుక్తమైంది.

సోమాన్ని శుద్ధి చెయ్యడానికీ మెరుపుకీ కూడా కొన్ని మంత్రాలలో సంబంధం చెప్పబడింది (9.41.3; 9.80.1; 9.84.3; 9.87.8); బహుశా ఇటువంటిచోట్ల స్వర్గంలోని సోమాన్ని శుద్ధిచెయ్యడమూ, తుపానూ ఉద్దిష్టమై ఉండవచ్చు.

37.16 సోమం అరుస్తుందని చెప్పినప్పుడు దాన్ని వృషభంతో పోల్చడమో, వృషభం అనే సూటిగా చెప్పడమో జరిగింది. 'ఆ ఎద్దు వనంలో అరుస్తోంది; (వృషా వ చక్రద ద్వనే, 9.7.3); 'హరితవర్ణం కల ఎద్దు అరుస్తోంది; సూర్యుడితోపాటు ప్రకాశిస్తోంది' (అచిక్రద ద్వృషా హరిః.... సం సూర్యేణ రోచతే, 9.2.6). పాలు కలిపిన నీళ్లకీ, కలపని నీళ్లకీ కూడా 'గోవులు' అనే లాక్షణిక వ్యవహారం ఉంది కాబట్టి సోమానికీ నీళ్లకీ ఎద్దుకీ గోవులకీ ఉన్న సంబంధం ఉంది. (ఉక్షా మిమాతి ప్రతి యంతి ధేనవః, 9.69.4 (మిమాతి = అరుస్తోంది); 9.16.6; 9.96.7); ఆయన ఆవులకి పతి (పతిర్గవాం, 9.72.4). ఆయన ఆవుల గుంపులోకి ఎద్దులా వెళ్తూ అరుస్తాడు (9.71.9; 9.71.7); ఆవులు కూడా ఆయన్ని చూసి అరుస్తాయి (9.80.2, మొ.). ఆయన ఆకాశంలో వృషభం, భూమిలో వృషభం, నదులలో వృషభం, ప్రాణులలో వృషభం (వృషాసి దివో వృషభః పృథివ్యా వృషా సింధూనాం వృషభః స్తియానాం, 6.44.21, మొ.). సోముడి సాహస స్వభావం కొన్నిచోట్ల గేదె (మహిష-)తో పోల్చి సూచితమయింది; అందువల్ల ఆయనకి పశు- శబ్దం కూడా వాడబడింది (9.86.43). గోజలాలకి వృషభమవడం వల్ల సోముడు నీళ్లకి ఉత్పాదకుడు (10.36.8; చూ. 9.19.5). ఆయన రేతోధా- 'రేతస్సు పెట్టేవాడు, గర్భోత్పాదకుడు' (9.86.39); ఈ విశేషణం యజుర్వేదంలో ముఖ్యంగా చంద్రుడికి వాడబడింది. (ఉదాహరణకి, మై.సం. 1.6.9). అందువల్ల ఆయన సంతానవృద్ధి కలిగించేవాడు (9.60.4; 9.74.5). సోముడు అంత తరచుగా ఎద్దు (ఉక్షన్-, వృషన్-, వృషభ-) అని చెప్పబడడం వల్ల ఆయన తిగ్మశృంగ- 'వాడి అయిన కొమ్ములు కలవాడు' అని కూడా చెప్పబడ్డాడు; ఈ విశేషణం ఋగ్వేదంలో వచ్చిన ఆరుచోటుల్లో అయిదు చోట్ల 'ఎద్దు' అనే అర్థంకల పదంతో కలిసి వచ్చింది, ఉదాహరణ : ఇంద్రుడి పానీయం (మంథ-) వాడి కొమ్ములుగల ఎద్దు వంటిది (వృషభో న తిగ్మశృంగః, 10.86.15). సోముడు కూడా (అగ్నిలా) తన కొమ్ములు పదును పెట్టుకొంటాడు అని చెప్పబడింది (ఏష శృంగాణి దోధువచ్ఛిశీతే యూథ్యో వృషా 'ఈ వృషభం కొమ్ములు కదుపుతూ పదును పెట్టుకొంటుంది', 9.15.4; 9.70.7; ఈ కొమ్ములు చంద్రుడివి అని హిలెబ్రాంట్ అభిప్రాయం).

37.17 సోమం వేగం కలదా (ఆశు-, 1.4.7); పిండే సోమం వేగాన్ని సూచించడానికి దాన్ని గుర్రంతో పోల్చడమో అది గుర్రం అని చెప్పడమో జరిగింది: పదిమంది స్త్రీలు దాన్ని వేగంగకలగుర్రాన్ని కడిగినట్లు కడుగుతారు (9.6.5). ఇంద్రుడికి మత్తు కలిగించే బిందువు హరితవర్ణం కలగుర్రం (హరిం నదీషు వాజినం, ఇందు మింద్రాయ మత్సరం, 9.63.17). పాత్రలలోకి కారే సోమం కొన్నిచోట్ల అడవిలోకి ఎగిరే పక్షితో పోల్చబడింది (9.72.5, మొ.).

37.18 సోమరసం పసుపుపచ్చగా ఉంటుంది కాబట్టి, కవులు ప్రధానంగా వర్ణించిన సోముడి శరీర లక్షణం ప్రకాశం. సోముడి కిరణాల ప్రసక్తి తరచుగా ఉంది; చాలాచోట్ల ఆయనకీసూర్యుడికీఅభేదం చెప్పబడింది. ఆయనసూర్యుడిలా/సూర్యుడితో ప్రకాశిస్తాడు; ఆయన వస్త్రాలు సూర్యకిరణాలు (స సూర్యస్య రశ్మిభిః పరివృత, 9.86.32; 9.76.4; చూ. 9.71.9). ఆయనసూర్యుడిరథం ఎక్కి సూర్యుడిలా జీవుల అందరిపైనా ఉంటాడు; సూర్యుడిలా ఆకాశాన్నీ భూమినీ తన కిరణాలతో నింపుతాడు (9.41.5). ప్రకాశించే పిల్లవాడుగా పుట్టి తల్లితండ్రులు ప్రకాశించేటట్టు చేశాడు (ససూను ర్మాతరా శుచి ర్జాతో జాతే అరోచయత్, 9.9.3). సూర్యుడి కూతురు ఆయన్ని శుద్ధిచేస్తుంది (9.1.6). అందువల్ల ఆయన చీకటితో యుద్ధం చేసి దాన్ని నాశనం చేస్తాడనీ (తమాంసి .... జంఘనః, 9.9.7; జంఘనః = నాశనం చెయ్యి), దాన్ని కాంతితో పోగొడతాడనీ (9.86.22), చీకటిని పోగొట్టి కాంతి పుట్టిస్తాడనీ (శుక్రం జ్యోతి రజీజనత్, కృష్ణా తమాంసి జంఘనత్, 9.66.24; 9.100.8; 9.108.12, మొ.).

37.19 సాధారణమైన ఆహారపానీయాలు కలిగించలేని మత్తూ ఉల్లాసమూ సోమం కలిగించి, ఒక వ్యక్తి సాధారణస్థితిలో చెయ్యలేని కృత్యాలు చెయ్యడానికి తగిన ప్రోత్సాహం ఇస్తుంది కాబట్టి అది అమర్త్యత్వాన్ని ప్రసాదించే దివ్యమైనపానీయంగా భావించబడింది. కాబట్టి గాథాపరంగా అది అమృతం అని చెప్పబడింది. అది అమర్త్యమైనదీ, మత్తు కలిగించేదీ (అమర్త్యం మదం, 1.84.4); దేవతలకి ప్రియమైనది (దేవానామసిహి ప్రియో మదః, 9.85.2); మనుష్యులు దాన్ని పిండిపాలలో కలిపినప్పుడు దేవతలంతా తాగుతారు (పిబంత్యస్య విశ్వే దేవాసో గోభిః శ్రీతస్య నృభిః సుతస్య, 9.109.15). దేవతలు మదం కలిగించే దానికోసం వెళ్తారు (8.2.18); దాన్ని తాగి మత్తు పొందుతారు (అమత్సత, 8.69.11). సోమం అమర్త్యమైనది (= చావులేనిది; 1.43.9; 8.48.12; 9.3.1,

ము.); దేవతలు అమర్త్యత్వం కోసం దాన్ని తాగేరు. (త్వాం దేవాసో అమృతాయ కం పపుః, 9.106.8). సోమం దేవతలకీ (1.91.6; 9.108.3), మనుష్యులకీ (1.91.1; 8.48.3) అమర్త్యత్వం ఇస్తుంది. సోమం భక్తుణ్ణి శాశ్వతమైనకాంతిగల శాశ్వతలోకంలో, వైవస్వతుడు అనేరాజు ఉండే లోకంలో మరణం లేకుండా ఉంచుతుంది (9.113.7, 8).

37.20 అందువల్ల సోమానికి ఔషధశక్తి కూడా సహజంగానే ఉంది. అది రోగికి మందు (తదాతురస్యభేషజం, 8.72.17). అందువల్ల సోమం రోగికి జబ్బు తగ్గిస్తుంది; గుడ్డివాడికి చూపు ఇస్తుంది; కుంటివాడి కుంటితనం పోగొడుతుంది (8.79.2; 10.25.11). సోముడు మనుష్యుల శరీరాలకి రక్షకుడై అన్ని అవయవాలలో ఉంటాడు (8.48.9); వారికి దీర్ఘాయుస్సు ఇస్తాడు (1.91.6; 8.48.4, 7; 9.4.6; 9.91.6). సోమరసం హృదయంలోంచి పాపాన్ని పోగొడుతుంది; అసత్యాన్ని నాశనం చేసి సత్యాన్ని వృద్ధి చేస్తుంది.

37.21 సోమం తాగినప్పుడు అది వాక్కుని ప్రేరిస్తుంది (హిన్వానో వాచం, 9.84.4; 6.47.3; 9.95.5; 9.97.32); నావికుడు నావని తోసినట్లు అది వాక్కుని ప్రేరిస్తుంది ( ఇయర్తి వాచ మరితేవ నావం, 9.95.2). ఈ కారణం వల్లనే సోముడు వాచస్పతి (9.26.4; 9.101.5) అనీ, వాచో అగ్రియ- (అగ్రే) 'వాక్కుకి అగ్రణి' (9.7.3; 9.62.15, 16; 9.86.12; 9.106.10) అనీ వర్ణించబడ్డాడు అనడంలో సందేహం లేదు. ఆయన వాక్కుని స్వర్గాన్నించి ప్రేరిస్తాడు (9.68.5). బ్రాహ్మణాలలో దేవతలు సోమాన్ని పొందడానికి వాక్కు మారుగా (= ఖరీదుగా) ఇచ్చారని ఉంది. సోమం బుద్ధికుశలత కలిగిస్తుంది (అయం మనీషా ముశతీ మజీగః, 6.47.3). అందువల్ల ఆయన భక్తులు ఇలా అంటారు: ''మేం సోమం తాగేం; అమర్త్యులమయ్యాం; జ్యోతిని చేరేం; దేవతలని తెలుసుకొన్నాం'' (అపామ సోమ మమృతా అభూమ మాగన్మ జ్యోతి రవిదామ దేవాన్, 8.48.3). అందువల్ల ఆయన బుద్ధికి అధిపతిగానూ, సూక్తాలకి తండ్రి, నాయకుడు, ఉత్పాదకుడుగానూ ప్రశంసించబడ్డాడు. ఆయన కవులలో నాయకుడు (పదవీం కవీనాం), విప్రులలో ఋషి (ఋషి ర్విప్రాణాం, 9.96.6). ఆయనకి ఋషుల మనశ్శక్తి ఉంది (ఋషి మనాః); ఆయన ఋషులని చేసేవాడు (ఋషికృత్, 9.96.18); ప్రార్థనలకి రక్షకుడు (బ్రహ్మణః సోమగోపాం, 6.52.3). ఆయన యజ్ఞానికి ఆత్మ (ఆత్మా యజ్ఞస్య, 9.2.10; 9.6.8); దేవతలలో బ్రహ్మ అనబడే పురోహితుడు (బ్రహ్మా దేవానాం, 9.96.6).

ఆయన దేవతలకి యజ్ఞంలో భాగాలు ఇస్తాడు ( భాగం దేవేభ్యో విదధాతి, 10.85.19). అందువల్ల సోముడి జ్ఞానం ప్రధానంగా వర్ణించబడింది. ఆయన మేధావి అయిన ఋషి ( ఋషిర్విప్రః, 8.79.1). ఆయన దేవతల జన్మలు తెలిసినవాడు ( దేవానా ముభయస్య జన్మనో విద్వాన్, 9.81.2; 9.95.2; 9.97.7; 9.108.3). ఆయన కవి, మనుష్యులను తెలుసుకొనే ప్రవాహం (నృచక్షా ఊర్మిః కవిః, 9.78.2); తన బుద్ధిబలంతో మనుష్యులని పరిశీలిస్తాడు (9.71.9). అందువల్ల ఆయన చాలా కన్నులు కలవాడు ( భూరిచక్షస-, 9.26.5), వెయ్యి కన్నులు కలవాడు (సహస్రచక్షస-, 9.60.1).

37.22 సోముడివల్ల పితృదేవతలు (గొప్ప) పనులు చేశారు ( త్వయా హినః పితరః సోమ పూర్వే కర్మాణి చక్రుః, 9.96.11); వారు ఆయన వల్ల జ్యోతినీ గోవులనీ పొందేరు (9.97.39). సోముడు పితృదేవతలతో కలిసి ఉంటాడు (8.48.13; అ.వే. 18.4.12; శ.బ్రా. 2.6.1.4, మొ.); దీనికి ప్రతిగా పితృదేవతలు సోమ్య- 'సోమప్రియులు' (10.14.6; అ.వే. 2.12.5) అని చెప్పబడ్డారు.

37.23 సోమం మనుష్యులకి ఉల్లాసం కలిగించినట్లుగానే దేవతలకి కూడా ఉల్లాసం కలిగిస్తుందని భావించబడింది. ఇంద్రుడు అంతరిక్షంలో శత్రువులతో చేసే యుద్ధంతో ఆయనకి ఉత్సాహం కలిగించడం దాని ముఖ్య ప్రయోజనం. సోమం ఇంద్రుడికి వృత్రయుద్ధంలో బలం చేకూరుస్తుందని ఋగ్వేదంలో లెక్కలేనన్ని మంత్రాలలో చెప్పబడింది (8.92.17, మొ.). సోమం కలిగించిన మత్తులో ఇంద్రుడు శత్రువులనందరినీ చంపుతాడు (9.1.10); దీన్ని తాగిన ఇంద్రుణ్ణి యుద్ధాలలో ఎవరూ జయించలేరు ( అస్య పపివాంస మింద్రం న కశ్చన సహత ఆహవేషు, 6.47.1). సోమం ఇంద్రుడి ఆత్మ (9.85.3), శుభం కలిగించే స్నేహితుడు ( శివః సఖా, 10.25.9); శక్తిని ప్రేరించేది (9.76.2), వృత్రుణ్ణి చంపడానికి సహాయకం (ఆవి థేంద్రం వృత్రాయ హంతవే, 9.61.22). సోముడి సహాయంతో ఇంద్రుడు మనుష్యుల కోసం నీళ్లు ప్రవహించేటట్లు చేశాడు; పాముని చంపేడు (4.28.1). అందువల్ల సోమం ఇంద్రుడి వజ్రం అని కూడా కొన్నిచోట్ల చెప్పబడింది (9.72,7; 9.77.1; 9.111.3). ఇంద్రుడి రసమైన సోమం వేలమందిని గెలిచే వజ్రం అయింది (సోమ ఇంద్రియో రసో వజ్రః సహస్రసా భువత్, 9.47.3). మదం కలిగించే సోమం వంద పురాలని నాశనం చేసేది ( మదం శతం పురో

రురుక్షణే, 9.48.2); వృత్రుణ్ణి చంపే కల్లు (వృత్రహణం మదిరమంశుం, 6.17.11). అందువల్ల సోముడు ''ఇంద్రుడిలా గొప్పపనులు చేసేవాడు, వృత్రులని చంపేవాడు, పురాలని భేదించేవాడు'' (ఇంద్రో నయో మహా కర్మాణి చక్రిర్హంతా వృత్రాణామసి సోమ పూర్భిత్, 9.88.4) అని చెప్పబడింది; ముఖ్యంగా ఇంద్రుడికి చెందిన వృత్రహన్- అనే విశేషణం సోముడికి ఆరుచోట్ల వాడడం జరిగింది.

37.24 ఇంద్రుడి కడుపులో ఉన్న సోమం సూర్యుణ్ణి ఆకాశంలోకి ఎక్కించింది (సీద న్నింద్రస్య జఠరే..... సూర్యమారోహయో దివి, (9.86.22). ఈ ఆకాశంలో జరిగిన పని సోముడు స్వయంగా చేసినట్లు ఆరోపించబడింది. ఈయన సూర్యుడు ప్రకాశించేటట్లు చేశాడు (ఏష సూర్య మరోచయత్, 9.28.5; 9.37.4); ఆకాశంలో జ్యోతులు ప్రకాశించేటట్లు చేశాడు (9.85.9); నీళ్లలో సూర్యుణ్ణి పుట్టించాడు (జనయ న్నప్సు సూర్యం, 9.42.1). ఆయన సూర్యుణ్ణి ఉదయించేటట్టు చేశాడు/ ప్రేరించాడు/ సంపాదించాడు/ ఇచ్చాడు; ఉషస్సులు ప్రకాశించేటట్టు చేశాడు. ఆయన భక్తులు సూర్యుణ్ణి పొందేటట్లు చేస్తాడు (9.4.5); కాంతినీ స్వర్గాన్నీ సాధిస్తాడు (9.3.2). యజ్ఞంలో ఆహుతి చేసే నెయ్యి లోకానికంతకీ మూలమైన 'అమర్త్యత్వానికి బొడ్డు' అని చెప్పినట్లే (4.58.1, 11) సోముడు సర్వవ్యాపి అనీ, సముద్రం, దిక్కులూ, భూమ్యాకాశాలూ, నక్షత్రాలూ, సూర్యుడూ సోముడే అని చెప్పబడింది (9.86.28, 29). ఆయన దిక్కులకి పతి (9.113.2); రెండు లోకాలూ పుట్టించడమనే మహాకార్యం చేస్తాడు (9.90.1); స్వర్గాన్నీ భూమినీ పుట్టించడమూ, నిలబెట్టడమూ సూర్యుడికి కాంతి ఇవ్వడమూ చేశాడు (6.44.23, 24; 6.47.3, 4).

37.25 సోముడు వృత్రయుద్ధంలో ఇంద్రుడితో చాలా సాహచర్యం కలవాడు కాబట్టి ఆయన స్వయంగా గొప్ప యోధుడు అని చెప్పబడ్డాడు. ఆయన విజయశీలి. యుద్ధాలలో ఓటమిలేనివాడు (అషాళ్హం యుత్సు), యుద్ధంకోసం పెట్టినవాడు (భరేషుజా-, 1.91.21). ఆయన శూరులలో శూరతరుడు (శూరేభ్యశ్చిచ్ఛూరతరః), వీరులలో శ్రేష్ఠుడు, ఎప్పుడూ జయించేవాడు (9.66.16-17). ఆయన భక్తులకోసం ఆవులనీ, రథాలనీ, గుర్రాలనీ, బంగారం, స్వర్గం, నీళ్లు, వెయ్యి వరాలూ జయించి ఇస్తాడు (9.78.4); అన్నీ జయించి ఇస్తాడు (8.79.1). ఆయన వీరస్వభావం ప్రసక్తి లేకుండా, ఆయన స్వర్గంలోనూ భూమిమీదా ఉన్న అన్ని సంపదలూ, ఆహారం, పశువులూ, గుర్రాలూ మొదలైనవి

ఇస్తాడనికూడా చెప్పబడింది (9.45.3; 9.49.4; 9.52.1, మొ.). సోముడే ధనం అనీ (రయి-, 9.48.3), దేవతల సంపద (శ.బ్రా. 1.6.4.5) అనీ చెప్పబడింది. సోముడు శత్రువులనించి కాపాడడం కూడా చేస్తాడు (10.25.7). ఆయన దెయ్యాలని పారదోల్తాడు (9.49.5); మరికొందరు దేవతలకి ఉన్నట్లే ఈయనకి రక్షోహన్- 'దెయ్యాలని చంపేవాడు' అనే విశేషణం ఉంది; ఈయనకి అది మిగిలినవారి విషయంలో కన్న ఎక్కువ తరచుగా వాడబడింది. దేవతలలో ఈయన ఒక్కడే అఘశంసహా 'క్రూరులని చంపేవాడు' అని చెప్పబడ్డాడు (9.28.6, మొ.). సోమంతాగే బ్రాహ్మణులు చూపుతో టే చంపగలరు అని అర్వాచీనవేదసాహిత్యంలో ఉంది (మై.సం. 4.8.3).

37.26 సోముడు యోధుడు అవడం వల్ల ఆయనకి ఆయుధాలు ఉన్నాయి (స్వాయుధః, 9.96.16); ఆయన శూరుడిలా వాటిని చేతులతో పట్టుకొంటాడు (9.76.2); అవి భయంకరమైనవీ, పదునైనవీ (9.61.30; 9.90.3). ఒక మంత్రం (6.44.22)లో ఆయన క్రూరుడైన తన తండ్రి దగ్గరనించి ఆయుధాలు అపహరించాడు అని ఉంది.[4] ఆయన ఆయుధం వెయ్యి మొనలు కలది (సహస్రభృష్టి-, 9.83.5; 9.86.40) ఆయన వేగం కల విల్లు కలవాడు (క్షిప్రధన్వా, 9.90.3).

37.27 సోముడు ఇంద్రుడు ప్రయాణించే రథం మీదే ప్రయాణిస్తాడు (9.87.9; 9.96.2; 9.103.5). ఇంద్రుడి రథానికి ఆయన సారథి (అ.వే. 8.8.2.3; ★ ఇందులో ''చంద్రమాః సారథిః'' అని ఉంది). ఆయన దివ్యమైన రథం మీద ప్రయాణిస్తాడు (9.3.5; 9.111.3); ఆయన రథం కాంతి (జ్యోతీరథః; 9.86.45) లేక పవిత్రం (పవిత్రరథః, 9.83.5). ఆయన రథికులలో గొప్పవాడు (రథీతమః, 9.66.26). ఆయనకి మంచి రెక్కలు గల గుర్రాలు (9.86.37), వాయువు గుర్రాల వంటి గుర్రాలు (9.88.3) ఉన్నాయి.

37.28 ఇంద్రుడికి సహచరులైన మరుత్తులతో సోముడికి సంబంధం ఉన్నట్లు సహజంగానే చెప్ప ్డింది. వారు స్వర్గంలో వృషభమైన సోమాన్ని పితుకుతారు (9.108.11; చూ. 9.54.1; ★ ఇక్కడ పితికేవారు మరుత్తులు అని స్పష్టంగా లేదు); పుట్టిన ఈ పిల్లవాణ్ణి

---

అయం స్వస్యపితు రాయుధానీందు రముష్ణా దశివస్య మాయాః

ఇక్కడ సాయణుడు స్వస్య = ధనానికి, పితుః = పాలకుడైన వలుడి దగ్గరనించి ( ఆయుధాలు అపహరించాడు) అని అర్థం చెప్పేరు.

మరుత్తులు అలంకరిస్తారు (9.96.17). ఇంద్రుడికి ఉన్నట్లే సోముడికీ మరుత్తుల (6.47.5), మరుద్గణాల (9.66.22) సహాయం ఉంది. వాయువులు కూడా సోముడికి ఆనందం కలిగిస్తాయి (9.31.3); వాయువు ఆయనకి రక్షకుడు (వాయుః సోమస్య రక్షితా, 10.85.5). సోముడు అగ్నితోనూ, పూషుడితోనూ, రుద్రుడితోనూ దేవతాద్వంద్వంలో కలుస్తాడు (అధ్యాయం 44.4-5). కొన్నిచోట్ల ఆయనకీ వరుణుడికీ మహత్త్వంలో అభిన్నత్వం చెప్పబడింది (9.77.5; 9.95.4; చూ. 9.73.2, 9; 8.41.8).

37.29 ఋగ్వేదంలో ఒకచోట (10.34.1) సోమలత మౌజవత - (సోమస్యేవ మౌజవతస్య భక్షః) అని చెప్పబడింది; తరవాత కాలంలో దీనికి 'మూజవత్/ ముజవత్ అనే పర్వతం మీద పుట్టినది' అని అర్థం చెప్పబడింది. కొన్నిచోట్ల సోమం గిరిష్ఠా- 'కొండ(ల) మీద ఉండేది', పర్వతావృధ్- (9.46.1) 'కొండ(ల) మీద పెరిగేది' అని చెప్పబడింది. అథర్వవేదం (3.21.10) లో పర్వతాలు సోమపృష్ఠాః 'సోమ లతలు పైభాగంలో కలవి' అని చెప్పబడ్డాయి; ఇదే పదం ఋగ్వేదం (8.63.2) లో సోమాన్ని పిండే రాళ్లకి వాడబడడం యజ్ఞానికి సంబంధించిన లాక్షణికార్థం వల్ల అయి ఉండవచ్చు (సోమపృష్ఠాసో అద్రయః). ఈ పదాలన్నీ సోమలత ఉండే స్థానం భూమిమీద పర్వతాలు అనే విషయాన్ని సూచిస్తాయి (ముఖ్యంగా చూ. 9.82.3; నాభాపృథివ్యా గిరిషు క్షయం దధే ''పృథివినాభిలో కొండలలో నివాసం ఏర్పరచుకొంది'') ''హఓమ కొండలమీద పెరుగుతుంది'' అనే అవెస్తా వాక్యం ఈ అభిప్రాయాన్ని ధ్రువపరుస్తుంది. సోమలత కొండలమీద పెరిగేది కాబట్టే కవి ''స్వర్గం పైభాగంలో మధుజిహ్వులైనవారు కొండ(ల) మీద ఉండే వృషభాన్ని పితుకుతారు'' (దివో నాకే మధుజిహ్వాః.... దుహంత్యుక్షణం గిరిష్ఠాం, 9.85.10; చూ. 9.95.4) అన్నప్పుడు కూడా ఈ విషయం ఆయన మనస్సులో ఉంది అని చెప్పవచ్చు. ''వరుణుడు అగ్నిని నీళ్లలోనూ, సూర్యుణ్ణి స్వర్గంలోనూ, సోముణ్ణి రాతిమీదా (అద్రౌ) పెట్టేడు'' (5.85.2) అనీ, ''మాతరిశ్వుడు ఒకరిని (అగ్నిని) స్వర్గాన్నించి తెచ్చాడు; గద్ద మరొకరిని (= సోముణ్ణి) రాతినించి (అద్రేః) ఎత్తుకుపోయింది'' (1.93.6) అనీ ఉన్నచోట్ల కూడా భూమిమీద పర్వతాలే ఉద్దిష్టమై ఉండవచ్చు; కాని 'పర్వతం', 'రాయి' అనే సామాన్యమైన అర్థాలు ఉన్న పదాలకి గాథాపరంగా 'మేఘం' అనే అర్థం తరచుగా ఉండడంవల్ల (అధ్యాయం 7.11) ఇక్కడ సందేహానికి ఎక్కువ అవకాశం ఉంది.

37.30 సోమలత భూమిమీదదే అయినా అది స్వర్గానికి సంబంధించినదిగా కూడా

చెప్పబడింది (దివ్యః సోమః, 10.1163.3); నిజానికి, దాని అసలు జన్మస్థానమూ, నివాసస్థానమూ కూడా స్వర్గంలో ఉన్నట్లు భావించబడ్డాయి. సోమరసం పుట్టుక ఉచ్చస్థానంలో ఉంది; స్వర్గంలో ఉన్నదాన్ని భూమి తీసుకొంది (ఉచ్చాతే జాత మంధసో దివిషద్భూమ్యా దదే, 9.61.10; ★ 'భూమిః'లో విసర్గలోపం). ఆ మదం కలిగించే రసం (మద్యో రసః), స్వర్గం యొక్క శిశువు (దివః శిశుః, 9.38.5); దివః శిశుః అనే విశేషణం సోమానికి తరుచుగా వాడబడింది. కాని ఒక మంత్రం (9.93.1)లో అది సూర్యుడికిపుట్టినది (జాః సూర్యస్య) అనీ మరొకదాంట్లో (9.82.3; చూ. 9.113.3) ఆ బలం కల పక్షికి పర్జన్యుడు తండ్రి (పర్జన్యః పితా మహిషస్య పర్ణినః) అనీ ఉంది. అథర్వవేదం (8.7.21)లో అమృతం పర్జన్యుడి రేతస్సు నించి వచ్చినది అని ఉంది. సోమం అగ్నిలా శిశువు, యువకుడు అని చెప్పబడడానికి కారణం ఈ రెండూ ఎప్పటికప్పుడు కొత్తగా పుట్టించబడడమే. సోమం స్వర్గానికి సంబంధించిన అమృతం (దివః పీయూషం, 9.5.1.2, మొ.); ఇది స్వర్గంలో శుద్ధిచేయబడుతుంది (9.83.2; 9.86.22, మొ.). ఇది స్వర్గంలో ప్రియమైన స్థలాలకి ప్రవహిస్తుంది (9.12.8); దాని ప్రవాహంతో స్వర్గంలో స్థలాలకి ప్రవహిస్తుంది (9.3.7). అది స్వర్గంలో ఉంటుంది (9.85.9; శ.బ్రా. 3.4.3.13); అది స్వర్గానికి పతి (పతిర్దివః, 9.86.11, 33). స్వర్గంలోని పక్షి అవడం వల్ల అది కిందకి చూస్తూ భూమిమీద అందరినీ పరిశీలిస్తుంది (9.71.9). అది సూర్యుడిలా అన్ని లోకాలకీ పైన ఉంటుంది (9.54.3). శుద్ధిచేయబడిన బిందువులు స్వర్గాన్నించీ, అంతరిక్షాన్నించీ, భూమి ఉపరితలం మీదకి పడతాయి (9.63.27); అది అంతరిక్షంలో ప్రయాణించేది (రజస్తుర్-, 9.48.4; 9.108.7). పాలు ఆవరించిన సోమాన్ని "మూడో శిఖరం మీద, ప్రకాశించే స్వర్గభాగంలో" (తృతీయే పృష్ఠే అధిరోచనే దివః, 9.86.27) వేళ్లు శుద్ధిచేస్తాయి (క్షిపో మృజంతి). ఆయన స్థానం అత్యున్నతమైన స్వర్గంలో ఉంది (పదం యదస్య పరమే వ్యోమన్, 9.86.15; 3.32.10; 4.26.6); మూడో స్వర్గంలో ఉంది (తై.సం. 3.5.7.1, మొ.). కాని 'స్వర్గం' అనే సామాన్యార్థం ఇచ్చే పదాలు గొర్రె వెంట్రుకలతో చేసిన పవిత్రానికి కూడా లాక్షణికంగా వాడబడ్డాయి. ఇటువంటి అర్థం ఉన్నచోట్ల: "స్వర్గం నాభిలో, గొర్రె తోక (వెంట్రుకల) లో" (దివో నాభా... అవ్యో వారే, 9.12.4) సోమం ఉంటుంది; "స్వర్గంలోని కాంతి ప్రదేశాలకి, గొర్రె తోకకి 'సోమం' వెళ్తుంది" (రోచనా దివః పవమానో వి ధావతి .... వార మవ్యయం, 9.37.3); "సూర్యుడితోపాటు ఆకాశంలో, పవిత్రంలో పరిగెడుతుంది" (సూర్యేణ హాసతే... అధి

ద్యవి, పవిత్రే, 9.27.5); ''వృషభం ఆకాశాన్ని అధిష్ఠించింది; (సోమ) రాజు అరుస్తూ పవిత్రాన్ని దాటేడు'' (అధి ద్యా మస్థా ద్వృషభః .... రాజా పవిత్ర మత్యేతి రోరువత్, 9.85.9; చూ. 9.86.8). పవిత్రం అనే లాక్షణికార్థంలో చాలా తరచుగా వాడబడినసాను- 'శిఖరం' అనే పదం దివః సాను- 'స్వర్గ శిఖరం' అనే దాన్ని తలపుకి తెస్తుంది. అమృతం అనబడే సోమానికి మూలస్థానం స్వర్గం (6.44.23) కాబట్టి ఇటువంటి పదాలు సహజంగానే భూమిమీద సోమానికి అన్వయించడం సంభవిస్తుంది.

37.31 సోమం స్వర్గాన్నించి తేబడింది (యస్యతే ద్యుమ్నవత్పయః పవమానాభృతం దివః, 9.66.30; 9.63.27). ఈ నమ్మకాన్ని వివరించే గాథ సోమానికీ గద్దకీ సంబంధించింది. దాన్ని గద్ద తీసుకువచ్చింది (సోమః శ్యేనాభృతః, 1.80.2). పక్షి అత్యున్నతమైన స్వర్గంలోంచి సోమం తెచ్చింది (4.26.6). గద్ద ఇంద్రుడికోసం సోమం/ తేనె తెచ్చింది (3.43.7; 4.18.13). వేగంకల గద్ద సోమంవైపుకి ఎగిరివెళ్ళింది (5.45.9); గద్ద ఇంద్రుడికోసం అంతరిక్షాన్నించి దాన్ని కాలితో తెచ్చింది (యంతేశ్యేనః పదాభరత్, 8.82.9). మనస్సులా వేగంగా ఎగురుతూ పక్షి ఇనపకోటని భేదించి (చూ. 4.27.1) స్వర్గానికి వెళ్ళి వజ్రికోసం సోమం తెచ్చింది (8.100.8). గద్ద దూరాన్నించి/ స్వర్గాన్నించి సోమం తెచ్చింది (9.68.6; 9.77.2; 9.86.24; 10.11.4; 10.99.8; 10.144.4). ఈ గాథ ఋగ్వేదం 4.26, 4.27 సూక్తాలలో చాలా విపులంగా చెప్పబడింది. బ్రాహ్మణాలలో అగ్ని రూపాంతరంగా భావించబడిన గాయత్రి సోమాన్ని తెచ్చినట్లు చెప్పబడింది. ఋగ్వేదంలో గద్ద ఇంద్రుడికోసం సోమం తెచ్చినట్లు ఉంది కాబట్టి అందులో అంతటా గద్దకీ ఇంద్రుడికీ భేదం చూపబడింది. (ఈ గాథతో సంబంధంలేని) ఒకే ఒక మంత్రం (10.99.8)లో సోమయాగంలో కూర్చున్న ఇంద్రుడు గద్ద అని చెప్పబడ్డాడు. 'స్వర్గంలోని గద్ద' (అగ్నయే దివః శ్యేనాయ, 7.15.4) అనే విశేషణం అగ్నికి ఉంది (ఇది మరి రెండుచోట్ల మరుత్తులకి వాడబడింది). శ్యేన- అనే పదం వైద్యుతాగ్నికి (= మెరుపుకి) వాడబడింది (తై.బ్రా. 3.10.5.1; చూ. 3.12.1.2); అగ్ని ఋగ్వేదంలో పక్షి అని తరచుగా చెప్పబడ్డాడు (అధ్యాయం 35.3). బ్లూమ్‌ఫీల్డ్(Bloomfield) ఋగ్వేదం 4.27 సూక్తానికి తనకు పూర్వులు ఇచ్చిన వివరణలని విమర్శించి పై ఆధారాల సహాయంతో గద్ద సోమాన్ని తేవడం అనే గాథ మెరుపు/ పిడుగు మేఘాన్నించి (= ఇనపకోటనించి) కిందకి దిగి రావడానికీ, తనతోపాటు సోమం (= మేఘంలో నీరు) అనే అమృతం కిందపడేటట్టు

చెయ్యడానికీ సూచకం అని వివరించారు; ఈ వివరణ యుక్తియుక్తంగానే ఉంది. అదే సందర్భంలో ఆయన అగ్నీ సోమమూ దిగి వచ్చినట్లు కలిపి చెప్పిన ఒక ఋగ్వేదమంత్రాన్ని (1.93.6) ఉద్ధరించారు: (★ ఆన్యం దివో మాతరిశ్వా జభారా మథ్నా దన్యం పరిశ్యేనో అద్రేః '' ఒకరిని (= అగ్నిని) స్వర్గాన్నించి మాతరిశ్వుడు తెచ్చాడు; ఇంకొకరిని (= సోముణ్ని) గద్దకొండమీదనించి లాక్కొని వచ్చింది''.) ఈ గాథలో ఒక చిన్న అంశం: గద్ద సోమాన్ని తీసుకుపోతూ ఉండగా కృశానువు బాణం వెయ్యడం వల్ల ఒక ఈక కిందపడింది అనేది (4.27.3, 4; చూ. ఐ.బ్రా. 3.25; ఇది ఒకే ఒక కవి (వామదేవుడు) కథకి అందంకోసం పెట్టిన మెరుగు కావచ్చు). బ్రాహ్మణాలలో ఈ అంశం ఇంకా ఎక్కువ వివరంగా చెప్పబడింది. పక్షి ఈక / పాదం బాణంతో తెగగొట్టబడిందని వీటిలో ఉంది. అది నేలమీద పడి పర్ణ/ పలాశ వృక్షం 'మోదుగుచెట్టు' / శల్యక వృక్షం 'గారచెట్టు'గా మారింది. అందువల్ల ఈ చెట్టుకి యజ్ఞకర్మలో పవిత్రత లభించింది.

37.32 చెట్లలో సోమలత ఉత్తమమైనది కాబట్టి అది చెట్లకి పతిగా పుట్టింది (జజ్ఞే వీరుధాం పతిః, 9.114.2) అని చెప్పబడింది; సోమలత చెట్లకు రాజు. వనస్పతి 'అడవికి రాజు' (1.91.6) అనే విశేషణం సోముడికి ఉంది; సోముడు అన్ని మొక్కలనీ పుట్టించాడు (1.91.22). బ్రాహ్మణాలలో చెట్లకి సౌమ్య- 'సోముడికి సంబంధించినది' (శ.బ్రా. 12.1.1.2) అని వ్యవహారం ఉంది. చెట్లకి రాజు అవడంవల్ల మాత్రమే కాక, సోముడు, ఇతర ప్రధానదేవతలలాగే, రాజు అని చెప్పబడ్డాడు. ఆయన నదులకి రాజు (రాజా సింధూనాం, 9.89.2), భూమికంతకీ రాజు (విశ్వస్య భువనస్య రాజా, 9.97.56), దేవతలకి తండ్రి/ రాజు (పితా దేవానాం, 9.86.10; 9.87.2; 9.109.4), దేవతలకీ మనుష్యులకీ రాజు (రాజా దేవానా ముతమర్త్యానాం, 9.97.24), బ్రాహ్మణులకి రాజు (సోమోఽస్మాకం బ్రాహ్మణానాం రాజా, వా.సం. 9.40; తై.సం. 1.8.10; మై.సం. 2.6.9). ఆయన దేవుడని తరచుగా చెప్పబడ్డాడని వేరుగా చెప్పక్కర్లేదు; కాని ఒకచోట (9.3.9) ఆయన ''దేవతలకోసం పిండబడిన దేవుడు'' (దేవో దేవేభ్యః సుతః) అని వర్ణించబడ్డాడు.

37.33 వేదాల తరవాత సాహిత్యంలో సోమ శబ్దం అన్నిచోట్లా 'చంద్రుడు' అనే అర్థమే ఇస్తుంది; దేవతలు భక్షించడం వల్ల చంద్రుడు మళ్లీ సూర్యుడు పూరించేదాకా క్షీణిస్తూ ఉంటాడని ఆకాలంలో నమ్మకం. ఛాందోగ్యోపనిషత్తు (5.10.4)లో ''చంద్రుడే సోమరాజు, అది దేవతల అన్నం, దాన్ని దేవతలు భక్షిస్తారు'' (చంద్రమ స మేషసోమా రాజా,

తద్దేవానాం మన్నం, తందేవా భక్షయంతి) అని ఉంది. బ్రాహ్మణాలలోనే సోముడికీ చంద్రుడికీ అభేదం తరచుగా చెప్పబడింది. ఉదాహరణకి, ఐ.బ్రా. (7.11) లో చంద్రుడు దేవతల సోమం అనీ, కౌషీతకి బ్రాహ్మణం (7.10; 4.4) లో యజ్ఞంలో ఉపయోగించే సోమలత/ సోమరసం చంద్రుడు అనేదేవతకి ప్రతీకఅనీ ఉంది. బ్రాహ్మణాలలో గాథాతత్త్వం దేవతలూ పితృదేవతలూ చంద్రుడిలో సారమైన అమృతాన్ని భక్షించడమే చంద్రుడిలో మార్పులకి కారణం అని వివరిస్తుంది. యజుర్వేదం చంద్రరూపుడైనసోముడికి ప్రజాపతి పుత్రికలైన నక్షత్రాలు భార్యలు అని చెప్తుంది. ఇంతేకాక, అథర్వవేదంలో కొన్నిచోట్ల (7.81.3, 4; 11.6.7, మొ.) సోమశబ్దానికి చంద్రుడు అనే అర్థం. ఋగ్వేదంలోనే అర్వాచీనకాలానికిచెందినకొన్ని సూక్తాలలో (ఒకటి, పది మండలాలలోవి) సోముడికీ చంద్రుడికీ అభిన్నత్వం భావించబడిందని చాలామంది పండితులు అంగీకరిస్తున్నారు. కాని వారిలో అధిక సంఖ్యాకులు సోమరసం అనే పానీయమే పురుషతారోపం పొంది సోముడనే దేవతగా ఆరాధించబడిందనీ, సోముడికీ చంద్రుడికీ అభిన్నత్వం ఏర్పడడం గాథాతత్త్వంలో ద్వితీయశ్రేణి పరిణామం అనీ భావిస్తున్నారు. వీరిద్దరికీ అభిన్నత్వం చెప్పినట్లు సాధారణంగా అంగీకరించబడినసందర్భాలలో చాలా ముఖ్యమైనది సోముడికీ సూర్యకీ జరిగిన వివాహాన్ని వర్ణించేది (10.85). ఇందులో సోముడు ''నక్షత్రాల ఒడిలో ఉన్నాడు'' (నక్షత్రాణా మేసా ముపస్థే సోమ ఆహితః, మంత్రం 2) అనీ, ''తాగేవాడు నలగ్గొట్టే మొక్కని సోమం అనుకొంటాడు (కాని అది సోమం కాదు); బ్రాహ్మణులకు తెలిసినదే సోమం; దాన్ని ఎవ్వరూ తాగరు'' (సోమం మన్యతే పపివాన్ యత్సంపింషం త్యోషధిం, సోమం యం బ్రహ్మణో విదు ర్నతస్యాశ్నాతి కశ్చన, మంత్రం 3) అనీ ఉంది (మూడో మంత్రంలో భూమిమీద సోమానికీ సోమదేవుడికీ భేదం చెప్పబడిందని గమనించాలి). చంద్రుడి సోమస్వభావం బ్రాహ్మణులకి మాత్రమే తెలిసిన రహస్యం అని ఇక్కడ ఉన్నందువల్ల వీరిద్దరూ అభిన్నులనే అభిప్రాయం అప్పటికింకా విశ్వవ్యాప్తం కాలేదని తెలుస్తుంది. దేవతగా భావించబడిన సోముడు క్రమక్రమంగా చంద్రుడితో ఎలా కలిసి పోయాడు అనేది ఊహించడానికి కష్టమైనది కాదు. సోముడు స్వర్గానికిసంబంధించినవాడనీ ప్రకాశించేవాడనీ తరచుగానూ, చీకట్లని పోగొడతాడనీ, నీళ్లలో వృద్ధిపొందుతాడనీ కొన్నిచోట్లా చెప్పబడింది; మరొకవంక, సోమం ఇందు- 'చుక్క' అని చెప్పబడింది (6.44.21) వీటివల్ల సోముడికి చంద్రుడితో పోలిక సులభంగానే మనస్సుకి తడుతుంది.

ఉదాహరణకి, ఒక మంత్రం (8.82.8) లో పాత్రలలోని సోమం నీళ్లలో చంద్రుడిలా కనపడుతోంది (అప్సు చంద్రమా ఇవ సోమ శ్చమూషు దదృశే) అని ఉంది (చూ. 1.105.1). మరొకచోట (10.123.8) సోమ బిందువు గద్దకంటితో చూస్తూ సముద్రానికి వెళ్తోంది (ద్రప్సః సముద్ర మభియజ్జిగాతి పశ్యన్ గృధ్రస్య చక్షసా) అన్నప్పుడు చంద్రుడే ఉద్దిష్టుడనేది అందరూ అంగీకరించదగినది.

37.34 కాని హిలెబ్రాంట్ (Hillebrandt) తమ Vedische Mythologie అనే గ్రంథంలో ఋగ్వేదంలో ఇతరత్రా కూడా అనేక సందర్భాలలో సోముడికీ చంద్రుడికీ అభిన్నత్వం సూచితమైందని చెప్పడమేకాక, తొమ్మిదో మండలంలో అంతటా సోమశబ్దానికి అర్థం చంద్రుడేకాని (పుట 309) సాధారణమైనమొక్క అని ఎక్కడా కాదు (పుట 326) అనీ, తొమ్మిదో మండలంలో సూక్తాలు అన్నీ చంద్రుడికి సంబంధించినవే అనీ దృఢంగా నమ్ముతున్నారు. ఋగ్వేదంలో ప్రాచీనార్వాచీన భాగాలన్నిటిలోనూ సోమశబ్దం ఒకపక్క లతనీ రసాన్నీ, మరొకపక్క దేవతాపరంగా చంద్రుణ్ణీ మాత్రమే సూచిస్తుందని ఆయన వాదం (పుటలు 274, 340, 450). ఆయన అభిప్రాయంలో సోమం అనే అమృతానికి చంద్రుడు ఆధారమైనపాత్ర; చంద్రుడిలోని అమృతం అంశ అయినసోమరసాన్ని యాజకులు పిండేటప్పుడు ఉద్దిష్టుడైనదేవత కూడా చంద్రుడే. ఇలా ఋగ్వేదంలో సోముడికీ చంద్రుడికీ పూర్తి ఏకత్వం ఉందని ప్రతిపాదించడమే కాక హిలెబ్రాంట్ మరొకమెట్టు పైకి వెళ్లారు. సోమశబ్దవాచ్యుడైన చంద్రుడే వేదాలలో నమ్మకానికీ పూజావిధానానికీ కేంద్రమనీ (పుట 277), సూర్యుడికన్న ఎక్కువగా ఆయనే సృష్టికర్తగానూ సృష్టికి అధిపతిగానూ భావించబడ్డాడనీ (పుట 313) వేదాలలో చంద్రుడి తరవాతనే ఇంద్రుడు అత్యధిక ప్రసిద్ధికల దేవత అనీ (పుట 315) ఆయన దృఢాభిప్రాయం.

37.35 ఈ ప్రతిపాదనకి వ్యతిరేకంగా ఎత్తిచూపబడిన ఉపపత్తులు ఇలా ఉన్నాయి: ఋగ్వేదంలో సోముడి ప్రసక్తి ఉన్నచోటులు చాలా వాటిలో ఆ దేవత సోమలతకీ సోమరసానికీ పురుషతారోపం అనేవిషయం సందేహానికిత్తావులేకుండా స్పష్టంగా తెలుస్తోంది. తరవాతకాలపు సాహిత్యంలో సోముడికీ చంద్రుడికీ ఏకత్వం చాలా స్పష్టంగా చెప్పబడినా, వీరిద్దరూ ఒకరే అని కాని చంద్రుడు దేవతల ఆహారం అని కాని ఋగ్వేదంలో స్పష్టంగానూ వాచ్యంగానూ చెప్పబడినచోటు ఒకటికూడా లేదు. సూర్యుడితో సంబంధం ఆపాదించబడిన సోముడి ప్రకాశస్వభావం అస్పష్టంగా చెప్పబడిన సందర్భాలలో మాత్రమే చంద్రుడి ప్రసక్తి

కనపడుతుంది. అయినప్పటికీ, సోమసూక్తాలలోని ఊహలలో గజిబిజిగా ఉన్న వివరాల మధ్య అమృతానికీ చంద్రుడికీ ఛాయామాత్రంగా ఏకత్వం చెప్పబడినచోట్లు ఒకటిరెండు దాగిఉండవచ్చు. సోముడి ప్రకాశస్వభావాన్నీ, సోమలత( నీటిలో) ఉబ్బడాన్నీ ( ఆప్యాయనం; దీనికీ చంద్రుడు వృద్ధిపొందడానికీ సాదృశ్యం సులభంగా మనస్సుకి తడుతుంది) వర్ణించే అక్కడక్కడ ఉన్న సందర్భాలు అటువంటి అభిప్రాయాన్ని సూచిస్తాయి అని చెప్పవచ్చు. కాని మొత్తంమీద, ఋగ్వేదకవుల దృష్టిలో సోమదేవుడు భూమిమీద మొక్కకీ రసానికీ పురుషతారోపం అనేది నిశ్చయమే అని చెప్పవచ్చు; దీనికి కొన్ని అర్వాచీన సూక్తాలు మాత్రమే సాధారణంగా అంగీకరించబడిన అపవాదాలు. ఇంతేకాక, సోముడూ చంద్రుడూ ఒకరే అనే అభిప్రాయం ప్రబలి ఉన్నకాలానికిచెందినవేదవ్యాఖ్యాతలకి ఋగ్వేదంలో కూడా సోముడంటే చంద్రుడే అనే విషయం తెలియదు అనుకోవడం అసందర్భంగా ఉంటుంది.

37.36 మూల ఇండో- ఇరానియన్‌కాలంలోనే సోమం ( - అవెస్తా హఓమ) తయారు చెయ్యడమూ, దాన్ని ఆరాధించడమూ ఉండేవి అనే విషయం సందేహానికి ఆస్కారంలేని సత్యం. ఋగ్వేదంలో సోమలత కొండలమీద/ ఒకానొక కొండమీద పెరుగుతుందని వర్ణించబడింది; అవెస్తాలో అది ఒకానొకకొండమీదపెరుగుతుందనిచెప్పబడింది. ఋగ్వేదం ప్రకారం వరుణుడు దాన్నిరాతి ( = కొండ) మీదపెట్టేడు; అవెస్తా ప్రకారం దాన్ని ఒకనేర్పరి అయిన దేవుడు హరైతి అనే గొప్ప కొండమీద పెట్టేడు. ఋగ్వేదంలో దాన్ని ఒక గద్ద తెచ్చినట్లు ఉంది; అవెస్తాలో దాని జన్మస్థానమైన కొండమీద నించి కొన్ని పవిత్రమైన పక్షులు దాన్ని తెచ్చిపంచిపెట్టాయి అని ఉంది. ఈరెండింటిలోనూ అదిమొక్కలకిరాజు; ఆరోగ్యమూ, దీర్ఘాయుస్సూ, అమర్త్యత్వమూ ప్రసాదించే మందు. సోమం నీళ్లలో వృద్ధిపొందినట్లు హఓమ అర్ద్వీ - శూర నీళ్లలో వృద్ధిపొందుతుంది. మూల ఇండో-ఇరానియన్‌కాలపు పూజావిధానంలో సోమాన్ని పిండడమూ, దాన్నిదేవతలకిఅర్పించడమూ ఒక ముఖ్యాంగం. కాని ఋగ్వేదంలో రోజుకి మూడుసార్లు సోమం పిండి అర్పిస్తారు అని ఉంటే అవెస్తా ( యస్న, 10.2 ) లో ఈపని రోజుకిరెండుసార్లు మాత్రమే చేస్తారని ఉంది. రెండింటిలోనూ కాడలు ( అంశు = ఆసు) నలగ్గొడతారనీ, రసం పసుపుపచ్చగా ఉంటుందనీ, దాన్ని పాలలో కలుపుతారనీ ఉంది ( యస్న, 10.13). రెండింటిలోనూ స్వర్గంలోని సోమానికీ, భూమిమీదసోమానికీ, పానీయానికీదేవుడికీ మధ్య భేదం పాటించబడింది. రెండింటిలోనూగాథాపరంగా సోమానికిజన్మస్థానం స్వర్గం; అది అక్కడనించి భూమిమీదకి

వస్తుంది. రెండింటిలోనూ సోమరసం (యాగాగ్నిలా) గొప్పదేవుడుగా భావించబడింది; రాజు అని చెప్పబడింది. సోముడు వృత్రహన్- అని చెప్పబడినట్లు హ ఓమ వెరెత్రజన్- అని చెప్పబడ్డాడు; ఆయన ఆయుధాలు (వధర్ = వదరె) ప్రయోగిస్తాడు. ఇద్దరూ కాంతిని సంపాదించినవారు (స్వర్షా = హ్వారెస), జ్ఞానవంతులు (సుక్రతు = హుఖ్రతు). ఇద్దరూ దుష్టుల మాయలు నాశనం చేస్తారు; శత్రుజయమూ, స్వర్గలోకనివాసమూ ప్రసాదిస్తారు. ఇద్దరూ గుర్రాలనీ, మంచి సంతానాన్నీ ప్రసాదిస్తారు. ప్రాచీనకాలంలో సోమయాగం చేసినవారి పేర్ల విషయంలో కూడా ఋగ్వేదానికీ అవెస్తాకీ అంగీకారం ఉంది: వారు వివస్వత్- (= వీవఙహ్వాంత్), త్రిత- ఆప్త్య- (= థ్రిత, ఆథ్వ్య). మత్తు కలిగించే పానీయం జన్మస్థానం స్వర్గంలో ఉందనీ, అది పవిత్రమైనదనీ భావించడం మూల ఇండో- యూరోపియన్ కాలానికి చెందినది అనడానికి అవకాశం ఉంది. ఇది నిజమయితే, ఆ పానీయం ఒకరకం పులిసిన తేనె మిశ్రమం (సంస్కృతం మధు-, గ్రీక్ మెదు-, సావోనిక్ మెదు-) అనీ, దాన్ని రక్షించే రాక్షసుడి దగ్గిరనించి దాన్ని ఒక గద్ద భూమిమీదకి తెచ్చిందనీ ఆ కాలంలో భావన ఉండి ఉండాలి (సోమాన్ని తెచ్చే ఇంద్రుడి గద్దకీ అమృతాన్ని తెచ్చే జెఉస్ (Zeus) గద్దతోనూ మధువుని తీసుకుపోయిన గద్ద (ఇది ఒధిన్(Odhin) రూపాంతరం) తోనూ సాదృశ్యం ఉంది). మూల ఇండో- యూరోపియన్ కాలంలోనే ఉంది అనుకోవడానికి అవకాశం ఉన్న ఈ మధువు స్థానంలో మూల ఇండో- ఇరానియన్ కాలంలో సోమం వచ్చింది; కాని మధువు సోమానికి మారుపేరుగా దానితో కలిసిపోయి వేదకాలంలో కూడా మిగిలి ఉంది అనుకోవచ్చు.

**37.37** సోమ- = హఓమ అనే శబ్దం సు- = హు- 'పిండు' అనే ధాతువుతు నించి వచ్చింది కాబట్టి 'పిండబడిన (రసం)' అని దీని వ్యుత్పత్త్యర్థం.

# ఈ. అమూర్తభావ దేవతలు

## 38. రెండు విభాగాలు

**38.1** ఋగ్వేదంలో అమూర్తభావాలు ఆధారంగా ఏర్పడిన దేవతలలో రెండు రకాలు ఉన్నాయి. 'కోరిక' వంటి అమూర్తభావాలు సూటిగా పురుషతారోపం పొందడం వల్ల ఏర్పడిన దేవతలు ఒకరకం; వీరి సంఖ్య స్వల్పం. ఇటువంటి వారు ఋగ్వేదంలోని చాలా

అర్వాచీనసూక్తాలలోనేఉన్నారు; వేదకాలంలోనేస్పష్టంగా కనపడుతున్న ఊహల పరిణామమే వీరి ఉత్పత్తికి దారితీసింది. రెండో రకానికిచెందిన దేవతలపేర్లు ధాతువుకి కర్తృవాచకమైన -తృ ప్రత్యయం చేర్చడం వల్ల ఏర్పడినవిగానో (ఉదా. ధా-తృ- 'సృష్టికర్త'), లేక ఒక విశేష లక్షణాన్ని మొదట్లో సూచించినవిగానో (ఉదా. ప్రజా-పతి- 'ప్రజలకిపతి') ఉంటాయి ఇటువంటి దేవతలసంఖ్య మొదటిరకం వారి సంఖ్యకన్న ఎక్కువ. వేదంలో గాథల మూలంగా జరిగిన వ్యక్తుల ఉత్పత్తి విధానాన్నిబట్టి చూస్తే, ఈ రెండో విభాగానికి చెందినవారిలో ఒక్కొక్కరు సూటిగా పురుషతారోపం వల్ల ఏర్పడినవారుగా కాక ఒకదేవత లేక కొందరు దేవతల ప్రత్యేకలక్షణాన్ని సూచించడానికి వారికి వాడబడిన విశేషణం నించి ఏర్పడినట్లు కనపడుతున్నారు. అటువంటి విశేషణాలు క్రమక్రమంగా ఆ మొదటి దేవతల నించి విడిపోయి చివరికి ప్రత్యేక దేవతలుగా మారిపోయాయి. ఉదాహరణకి, రోహిత- 'ఎర్రనివాడు', (దీని స్త్రీలింగరూపం రోహిణీ-) అనేది మొదట్లో సూర్యుడికి విశేషణం, కాని ఇది అథర్వవేదంలో సృష్టించడం అనే శక్తిగల ప్రత్యేక దేవతగా రూపొందింది.

38.2 **(i) కర్తృ (తృ) ప్రత్యయాంత దేవతలు :** కర్తృవాచకమైన -తృ ప్రత్యయంతో అంతమయ్యే పేర్లు కల దేవతలలో ముఖ్యుడు సవిత (సవితృ-); సూర్యుడికిసంబంధించిన దేవతలలో ఒకడుగా ఈయన్నిగురించి ఇంతకుముందే చెప్పబడింది (అధ్యాయం 15). మిగిలినవారిలో చాలామందినిగురించిన ప్రసక్తి ఋగ్వేదంలో తక్కువ. కొన్ని మంత్రాలలో యాగవిధులని 'అనుశాసించేవారు, నిర్వహించేవారు' అనే అర్థంలో పురోహితులకి విశేషణంగా ఉన్న ధాతృశబ్దం (ధా- 'పెట్టు, విధించు, నిర్వహించు' అనే ధాతువునించి వచ్చినది) ఒక దేవత పేరుగా సుమారు పన్నెండుసార్లు పదోమండలంలో మాత్రం వచ్చింది; చాలామంది ఇతర దేవతలపేర్లతోపాటు ఈ పేరు ఏడోమండలంలో ఒకచోట (7.35.3) ఉండడం ఒక్కటే దీనికి అపవాదం. ఒకమంత్రం (10.167.3) లో ఇంద్రుడికీ, మరొక మంత్రం (10.82.2) విశ్వకర్మకీ ఇది విశేషణంగా ఉంది. సృష్టిలో పదార్థాలని ఏర్పరిచినవాడుగా (ధా-) ప్రతి దేవతవిషయంలోనూ ప్రత్యేకంగా చెప్పడం క్రమేణ ఈ కృత్యాన్ని నిర్వహించడానికి ఒక ప్రత్యేక దేవత ఉండాలి అనే భావనకి దారితీసింది. అందువల్ల ధాత సూర్యుణ్ణీ, చంద్రుణ్ణీ, స్వర్గాన్నీ, భూమినీ, అంతరిక్షాన్నీ సృష్టించినవాడుగా చెప్పబడ్డాడు (10.190.3); ఆయన లోకానికి అధిపతి (10.128.7). సూర్యుణ్ణే ఉద్దేశించిన ఒక సూక్తంలో ధాత స్పష్టమైన కన్ను ఇవ్వాలని ప్రార్థించబడ్డాడు (10.158.3). విష్ణువు,

## (ii) త్వష్ట

త్వష్ట, ప్రజాపతులతోపాటు ఆయన సంతానంకోసం ప్రార్థించబడ్డాడు (10.184.1); ఆయన విడిగా దీర్ఘాయుస్సుకోసం ప్రార్థించబడ్డాడు (10.18,5). ఆయన విష్ణువూ, సవితలతోపాటూ (10.181.1-3), మాతరిశ్వుడూ, దేష్ట్రీ-, వీరితోపాటు కూడా (10.85.47) ప్రార్థించబడ్డాడు. నిరుక్తంలోని నిఘంటువు (5.5) లో ధాతపేరు అంతరిక్ష దేవతలలో ఉంది; యాస్కుడు (నిరుక్తం 11.10) దీనికి ''అంతటినీ విధించినవాడు'' (ధాతా సర్వస్య విధాతా) అని వివరణ ఇచ్చారు. వేదాల తరవాత కాలంలో ధాత ప్రజాపతికీ, బ్రహ్మకీ సమానుడుగా సృష్టికి కర్తగానూ రక్షకుడుగానూ భావించబడ్డాడు. అరుదుగా ఉన్న విధాత (విధాతృ- 'విధించే/ విధించినవాడు') అనే శబ్దం ధాతృశబ్దంతోపాటు రెండుచోట్ల, ఒకచోట ఇంద్రుడికీ (10.167.3), మరొకచోట విశ్వకర్మకీ 10.82.2) విశేషణంగా ఉంది. కాని ఇది మరిరెండుచోట్ల (6.50.12; 9.81.5) ఒక ప్రత్యేక దేవత పేరుగా ఇతర దేవతల పేర్లతోపాటు వచ్చింది. ధర్తృశబ్దం 'నిలబెట్టేవాడు, ధరించేవాడు' (ధృ- ధాతువు) ఇంద్రుడికీ ఇతర దేవతలకీ విశేషణంగా తరచుగా వాడబడింది (సర్వ సాధారణంగా ధరించబడినదాన్ని సూచించే శబ్దం షష్ఠీ విభక్తి రూపం దీనితోపాటు వస్తుంది); ఇది ఒక ప్రత్యేక దేవత పేరుగా ధాత మొదలైన కొందరు ఇతర దేవతల పేర్లతోపాటు ఒకచోట (7.35.5) వచ్చింది. ఇదేవిధంగా, ముఖ్యంగా ఇంద్రుడికీ, అగ్నికీ, బహువచనంలో ఆదిత్యులకీ విశేషణంగా వాడబడిన త్రాతృ శబ్దం (త్రా- 'రక్షించు') రక్షకుడైన ఒక ప్రత్యేకదేవత పేరుగా మరికొందరి పేర్లతోపాటు అయిదు మంత్రాలలో (1.106.7; 4.55.5, 7; 8.18.20; 10.128.7) వచ్చింది (దేవ స్త్రాతా త్రాయతాం). రోథ్(Roth) అభిప్రాయంలో ముఖ్యంగా సవితనీ, భగుణ్ణీ కూడా ఈ శబ్దం సూచిస్తుంది. నాయకుడైన దేవుడు (నేతృ-; ధాతువు - నీ- 'తీసుకువెళ్లు') జీవితంలో అభివృద్ధికి మార్గదర్శకుడుగా ఒకసూక్తం (5.50) లో రెండుమూడుచోట్ల స్తుతించబడ్డాడు (దేవనేతః - సంబోధన).

38.3 **(ii) త్వష్ట :** ఇటువంటిపేర్లుగల దేవతలలో సవిత తరవాత కొంత ప్రముఖంగా చెప్పబడినవాడు త్వష్ట (త్వష్టృ-) ఒక్కడే. ఈయన పేరు ఋగ్వేదంలో సుమారు 65 సార్లు వచ్చింది; ఇది ఒకటి, పది మండలాలలో ఎక్కువ తరచుగానూ, సగోత్రమండలాలలో సమానమైన ప్రాచుర్యంతోనూ వచ్చింది (కాని, ఏడు, ఎనిమిది మండలాలలో ఇది అరుదు). కాని ఈయన్ని ప్రత్యేకంగా స్తుతించే సూక్తం ఏదీ లేదు.

38.4 త్వష్ట చెయ్యీ, ముంజేయీ తప్ప మరే అవయవమూ సూచితం కాలేదు; ఈయన చేతిలో ఇనపగొడ్డలి ఉండడం ప్రత్యేకత (వాశీ మేకో బిభర్తి హస్త ఆయసీం, 8.29.3). ఒకచోట (6.47.19) ఈయన రెండుగుర్రాలని రథానికి కడుతూ గొప్పగా ప్రకాశిస్తున్నట్లు వర్ణించబడింది. త్వష్ట అందమైన చేతులూ (సుగభస్తి-, 6.49.9), అందమైన ముంజేతులూ (సుపాణి-) కలవాడు (ఈరెండో విశేషణం ఈయనకీ సవితకీ ఎక్కువగా వాడబడింది).

38.5 ఆయన వస్తువులు తయారు చెయ్యడంలో మంచి నేర్పరి (స్వపాః, సు = మంచి, అపస్ = పనికలవాడు; 1.85.9; 3.54.12); దేవశిల్పి. ఆయన శిల్పులలో గొప్పవాడు (అపసా మపస్తమః, 10.53.9); సాధనాలు తయారు చెయ్యడం తెలిసినవాడు. ఆయన ఇంద్రుడి వజ్రం తయారుచేసినట్లు (త- ధాతువు) కొన్నిచోట్ల (5.31.4, మొ.) చెప్పబడింది. ఆయన బ్రహ్మణస్పతి ఇనపగొడ్డలికి పదును పెడతాడు (10.53.9). ఆయన ఒక కొత్త పాత్రని (చమస = సోమంపోసే కొయ్యపాత్ర, 1.20.6) చేశాడు; అందులో అసురుడి భక్షణం (1.110.3), దేవతల పానీయం (1.161.5; 3.35.5) ఉంటుంది. దేవతలు సోమం తాగడానికి ఉపయోగించే పాత్రలు ఆయన దగ్గర ఉంటాయి (10.53.9). అథర్వవేదం (9.4.3, 6) ఆయన్ని ధనం ఉన్న గిన్నెని (వసోః కబంధం), సోమంతో నిండిన కలశాన్ని పట్టుకొన్న వృద్ధుడు అని వర్ణించింది. త్వష్టనించి వేగవంతమైన గుర్రం పుట్టింది (వా.సం. 29.9); ఆయన గుర్రం కాళ్లలో వేగం పెట్టేడు (ఆ తే త్వష్టా పత్సు జవం దధాతు, అ.వే. 6.92.1).

38.6 త్వష్ట అందరికీ అన్నిటికీ రూపాలు కల్పించాడని ఋగ్వేదం చెప్తుంది (రూపైః రపింశద్భువనానివిశ్వా, 10.110.9). ఆయన గర్భంలో చేరిన రేతస్సుకి రూపం కల్పించి మనుష్యులకీ, జంతువులకీ అన్ని రూపాలకీ కారకుడయ్యాడు (1.188.9; 8.102.8; 10.184.1). ఇతర వైదిక గ్రంథాలలో కూడా ఇటువంటి వాక్యాలు తరచుగా ఉన్నాయి (రేతసః సిక్తస్య త్వష్టా రూపాణి వి కరోతి, తై.సం. 1.5.9.1; అ.వే. 2.26.1, మొ.); వాటిలో రూపాలని సృష్టించడం ఈయన ప్రత్యేకత అని చెప్పబడింది (శ.బ్రా. 11.4.3.3; తై.బ్రా. 1.4.7.1). ఋగ్వేదంలో ఇతర దేవతలకన్న ఎక్కువ తరచుగా ఈయనే విశ్వరూప- 'అన్ని రూపాలూ కలవాడు' అని చెప్పబడ్డాడు. జీవులకి ఆకారాలు కల్పించే వాడవడం వల్ల

ఆయనసృష్టికి అధిదేవతగానూ సంతానం ప్రసాదించేవాడుగానూ వర్ణించబడ్డాడు (3.4.9, మొ.). ఆయన స్త్రీ పురుషులని ఒకరికొకరు భార్యాభర్తలుగా గర్భావస్థలోనే ఏర్పరిచాడని ఉంది (10.10.5; అ.వే. 6.78.3). ఆయన చాలారకాల ప్రాణులని పుట్టించి పోషిస్తాడు (3.55.19). జంతువులు త్వష్టకి చెందినవి (శ.బ్రా. 3.7.3.11; 8.3.11). ఆయన ప్రపంచాన్ని అంతటినీ పుట్టించినవాడవడం వల్ల ఆయన ప్రపంచానికంతటికీ తండ్రి (త్వష్టేదం విశ్వంభువనం జజాన, వా.సం. 29.9).

38.7 ఆయన కూతురైన సరణ్యువు (సరణ్యూ-) వివస్వత్తుకి భార్య; అనాదికాలపు కవలలైన యముడు, యమి (యమీ-) అనేవారికి తల్లి; అందువల్ల త్వష్ట మనుష్యజాతికి ఆదిపురుషుడు (10.17.1, 2; చూ. 5.42.13). వాయువు ఆయన అల్లుడని ఒకచోట (8.26.21) ఉంది. త్వష్ట బృహస్పతిని పుట్టించాడు (2.23.17). పదివేళ్లవల్ల పుట్టిన అగ్ని త్వష్టనించి పుట్టినవాడు (1.95.2); త్వష్ట, ద్యావా పృథువులూ, నీళ్లూ, భృగువులూ అగ్నిని పుట్టించారు (10.46.9). త్వష్ట ఇంద్రుడికి కూడా తండ్రి అని కొన్ని మంత్రాలవల్ల ఊహించడానికి అవకాశం ఉంది (అధ్యాయం 22.10). త్వష్ట ముఖ్యంగా సోమానికి రక్షకుడు; సోమం త్వాష్ట్రం మధు 'త్వష్టకి సంబంధించిన మధువు' అని చెప్పబడింది (1.117.22). ఇంద్రుడు సోమం (మొదట) తాగినది ఆయన ఇంట్లోనే; ఇంద్రుడు సోమంకోసం తండ్రిని కూడా చంపి దాన్ని తస్కరించాడు (అధ్యాయం 22.10). విశ్వరూపుడైన త్వష్టకి విశ్వరూపుడు అనే కొడుకు ఉన్నాడు; ఆయన గోవులకి రక్షకుడు. ఇంద్రుడికి సోమంకోసం త్వష్టతో వైరం సంభవించినట్లే త్వష్ట కొడుకుతో ఆ గోవులని సంపాదించడంకోసం వైరం సంభవించింది. ఇంద్రుడి కోపానికి త్వష్టకూడా వణుకుతాడు అని చెప్పబడింది (1.80.14); ఇంద్రుడు చేసిన సాహసకృత్యాన్ని త్వష్ట కూడా చెయ్యలేకపోయాడు (? 10.49.10) అని చెప్పడంలో త్వష్ట ఇంద్రుడికన్న తక్కువవాడు అనే విషయం సూచితమైంది. తై.సం. (2.4.12.1)లో ఇంద్రుడు త్వష్ట కొడుకుని చంపడం వల్ల, త్వష్ట తన సోమయాగానికి ఇంద్రుణ్ణి ఆహ్వానించలేదనీ, అయినా ఇంద్రుడు వచ్చి సోమాన్ని బలాత్కారంగా తీసుకుని తాగేశాడనీ ఒక కథ ఉంది. బ్రాహ్మణాలలో ఇటువంటిగాథ తరచుగా కనపడుతుంది (శ.బ్రా. 1.6.3.6, మొ.).

38.8 బహుశా త్వష్ట గర్భోత్పత్తికి కారకుడవడం వల్ల ఆయనకి స్వర్గలోకంలోని స్త్రీలతోనూ (గ్నాః, జనయః), దేవతల భార్యలతోనూ సాహచర్యం ఉంది; దేవపత్నులు

ఈయనకి సహచరులు అని తరచుగా చెప్పబడింది (1.22.9, మొ.). త్వష్ట చేసే కృత్యాల వంటివి చేసే పూషుడు, సవిత, ధాత, ప్రజాపతి అనే దేవతల పేర్లతో కలిసే త్వష్ట పేరు తరచుగా వస్తుంది. నిజానికి రెండు మంత్రాలలో (3.55.19; 10.10.5) సవితృశబ్దం త్వష్టకి విశేషణం; ఈ రెండింటిలోనూ దేవస్త్వష్టా సవితా విశ్వరూపః 'జీవం కలిగించేవాడూ, సర్వరూపాలూ కలవాడూ, దేవుడూ అయిన త్వష్ట' అనే పదసముదాయం సమానంగా ఉంది; రెండింటిలోనూ ఈ దేవుడి ఉత్పాదకశక్తి చెప్పబడింది. త్వష్టకి కౌశికసూత్రంలో సవితతోనూ, ప్రజాపతితోనూ, మార్కండేయ పురాణంలో విశ్వకర్మతోనూ ప్రజాపతి తోనూ అభిన్నత్వం చెప్పబడింది. తరవాత కాలపు గాథాతత్త్వంలో త్వష్ట పన్నెండుగురు ఆదిత్యులలో ఒకడు; మహాభారతంలోనూ భాగవత పురాణంలోనూ త్వష్ట సూర్యుడి రూపాంతరం అని ఒకటిరెండుచోట్ల చెప్పబడింది.

38.9 ఋగ్వేదంలో త్వష్టస్వభావాన్ని విశదీకరించడానికి చాలని మరికొన్ని సర్వసాధారణ లక్షణాలు కూడా చెప్పబడ్డాయి. ఆయన మొదటివాడు (అగ్రియ-, 1.13.10), మొదట పుట్టినవాడు (అగ్రజా-), ముందు వెళ్లేవాడు (పురోయావన్-, 9.5.9). అంగిరసుల సహచరుడైన ఆయనకి దేవతల ప్రదేశం తెలుసు (10.7.9); ఆయన దేవతల స్థానానికి వెళ్తాడు (2.1.5), స్వర్గం భూమీ మధ్య ప్రయాణిస్తాడు (మై.సం. 4.14.9). ఆయన ఆశీస్సులు ఇస్తాడు (ద్రవిణోదా-), గొప్ప సంపద కలవాడు (సురత్నః, 10.70.9; 10.92.11). ఆయన భక్తుల స్తోత్రాలు విని వారికి ధనం ఇస్తాడు (7.,34.21). త్వష్ట దీర్ఘాయుస్సు కూడా ఇస్తాడు (దీర్ఘ మాయుః కరతి, 10.18.6; అ.వే. 6.78.3).

38.10 ఈ పదం త్వక్ష్- అనే అరుదైన ధాతువునించి వచ్చింది; ఋగ్వేదంలో ఈ ధాతువునించి వచ్చిన ఒకే ఒక క్రియాపదమూ, కొన్ని కృదంత రూపాలూ ఉన్నాయి. అవెస్తాలో దీనికి సంబంధించిన థ్వ- అనే ధాతువు ఉంది. దీనికన్న విరివిగా వాడబడిన తక్ష్- ధాతువుకీ దీనికీ ఒకటే అర్థం అయినట్లు కనపడుతుంది; త్వష్ట ఇంద్రుడి వజ్రాన్ని తయారుచేశాడు అని చెప్పడంలో తక్ష్- ధాతువు వాడబడింది. అందువల్ల దీని వ్యుత్పత్త్యర్థం ''(వస్తువులు) తయారుచేసేవాడు/ శిల్పి'' అని అనుకోవచ్చు.

38.11 త్వష్ట వేదదేవతా సముదాయంలో చాలా అప్రసిద్ధులైనవారిలో ఒకడు. త్వష్ట త్రితుడు మొదలైనవారిలా అతిప్రాచీనకాలంలో దేవతలుగా ఉండి తరవాత కాలంలో

విస్మరించబడిన వారిలో ఒకడవడమే ఈ అప్రసిద్ధికి కారణం అని కయెగీ (Kaegi) వివరణ. త్వష్ట ఇతర జాతుల గాథా తత్త్వ చక్రంలోంచి వేదాలలోకి వచ్చాడని హిలెబ్రాంట్ (Hillebrandt) అభిప్రాయం. త్వష్ట అసలు స్వభావం విషయంలో వేరువేరు అభిప్రాయాలు వ్యక్తం చెయ్యబడ్డాయి. త్వష్టకీ సవితకీ అభిన్నత్వం చెప్పబడడం వల్ల ఈయన సూర్యుడే అయి ఉంటాడు అని ఎ. కూన్ (Kuhn) అభిప్రాయపడ్డారు; కాని ఈ అభిప్రాయాన్ని ఆయన తరవాత ఉపసంహరించుకొన్నట్లు కనపడుతోంది. లుడ్విక్ (Ludwig) ఈయన సంవత్సరానికి అధిదేవత అన్నారు; ఒక ప్రత్యేక కృత్యానికి ఈయన పురుషతారోపం అని ఓల్డెన్‌బెర్గ్ (Oldenberg) అభిప్రాయం. త్వష్ట సూర్యుడికి రూపాంతరం అని కూన్ మొదట్లో వ్యక్తపరిచిన అభిప్రాయం సమంజసమైనదే అని హిలెబ్రాంట్ అన్నారు. హార్డీ (Hardy) కూడా ఆయన సూర్యుడికి సంబంధించిన దేవత అని అభిప్రాయపడ్డారు. ఋగ్వేదానికి ముందు కాలంలో ఈ దేవత సూర్యుడి స్వభావంలో ఒక అంశమైన ఉత్పాదకతకి ప్రతీక అనేది సత్యదూరం కాకపోవచ్చు. ఇది నిజమే అయితే, ఋగ్వేద కవులకి కూడా ఈ విషయం లీలామాత్రంగానే తెలుసు అనుకోవాలి. దేవతా సముదాయానికి ఒక శిల్పిని కల్పించాలి అనే కోరిక సహజమైనదే కాబట్టి ఉత్పాదకతలో ప్రావీణ్యాన్ని సూచించే గాథల విస్తరణకి ఈ పేరే దోహదం చేసి ఉండవచ్చు. దేవతా సముదాయానికి బృహస్పతి అనే దేవపురోహితుణ్ణి కల్పించడం ఇంచుమించు ఇలాగే జరిగింది.

38.12 త్వష్ట కలశం అంటే 'సంవత్సర కలశం' అనీ, రాత్రివేళలో ఆకాశం అనీ వివరించబడింది. కాని ఈ రెండూ కూడా దేవతలు తాగే సోమంతో నిండిన పాత్రలుగా ఊహించబడడానికి అవకాశం అంతగా లేదు. అది చంద్రుడే అని హిలెబ్రాంట్ ఇచ్చిన వివరణ ఎక్కువ సమంజసంగా ఉంది (చూ. అధ్యాయం 46.10).

## 39. విశ్వకర్మ, ప్రజాపతి

39.1 ఋగ్వేదంలో విశేషణాలుగా వాడబడిన సమాసాలనించి ఏర్పడిన అమూర్తభావ దేవతలు మరికొందరు ఉన్నారు; ఋగ్వేదకాలం చివరిభాగంలో రూపొందుతున్న మహాదేవుడికి (అంటే, దేవతలందరిలోకీ గొప్పవాడు; శివుడని కాదు) వీరందరూ ప్రతీకలు. విశ్వకర్మ శబ్దం (విశ్వకర్మన్-) ఒక దేవత పేరుగా ఋగ్వేదంలో అయిదుసార్లు మాత్రమే, పదో మండలంలో మాత్రమే, వచ్చింది. రెండు పూర్తిసూక్తాలు (10.81, 10.82)

ఆయనస్తుతికి ఉద్దిష్టమయ్యాయి. ఈపదం ''అన్నిటినీచేసేవాడు (= సృష్టించేవాడు'' అనే అర్థంలో ఒకచోట (8.98.2) ఇంద్రుడికీ, ఇంకొకచోట (10.170.4) సూర్యుడికీ విశేషణంగా కూడా వాడబడింది. అర్వాచీనాలైన ఇతరవేదాలలో కూడా ఇది విశేషణంగా వాడబడిన ప్రయోగాలు అరుదు కాదు; వాటిలో ఇది ప్రజాపతికి కూడా విశేషణంగా కనపడుతుంది (వా.సం. 12.61). పైనచెప్పినరెండు ఋగ్వేదసూక్తాలూ విశ్వకర్మని ఇలా వర్ణిస్తాయి: ఆయనఅన్నిటినీ చూస్తాడు; ఆయనకు అన్నిపక్కలా కళ్లూ, ముఖం, చేతులూ, పాదాలూ ఉన్నాయి. (తరవాత కాలపు గాథాతత్వంలో నాలుగు ముఖాలూ, నాలుగు చేతులూ కల బ్రహ్మకీ ఈయనకీ ఈ విషయంలో పోలికఉంది.) ఆయనకిరెక్కలు కూడా ఉన్నాయి. ఆయన ఋషి, పురోహితుడు, మనతండ్రి. ఆయనవాచస్పతి 'వాక్కుకిపతి', మనోజవం కలవాడు, శ్రేయోదాయకుడు, అభివృద్ధి కంతకీ మూలకారణం. ఆయనకి అన్ని స్థలాలూ, అందరు వ్యక్తులూ తెలుసు; ఆయనే దేవతలకి పేర్లు పెడతాడు. ఆయన జ్ఞాని, శక్తిమంతుడు, గొప్పరూపం కలవాడు (పరమా సందృక్; ★ అందరినీ చూసేవాడు అని సాయణుడు). ఆయన ధాత 'స్థాపించేవాడు', విధాత 'ఆజ్ఞాపించేవాడు'; భూమిని పుట్టించాడు; ఆకాశాన్ని సృష్టం చేశాడు. ఈపదం మొదట్లో ముఖ్యంగా సూర్యదేవుడికి విశేషణంగా ఉండేదనీ, అది ఋగ్వేదకాలం చివరలో రూపు సంతరించుకొంటున్న ఏకైక దేవుడికి ఆయన నిర్మాణశక్తిని సూచించేపేరుగా మారిందని చెప్పవచ్చు. బ్రాహ్మణాలలో విశ్వకర్మకీ సృష్టికర్త అయిన ప్రజాపతికీ ఏకత్వం స్పష్టంగా చెప్పబడింది (శ.బ్రా. 8.2.1.10; 8.2.3.13; చూ. ఐ.బ్రా. 4.22). వేదాల తరవాత కాలంలో ఆయన దేవశిల్పిగా పరిగణించబడ్డాడు.

39.2 ప్రజాపతి శబ్దం ఋగ్వేదంలో ఒక మంత్రం (4.53.2) లో సవితకి విశేషణంగా ఉంది; ఇందులో సవిత స్వర్గాన్ని ధరించేవాడు, భువనానికి ప్రజాపతి 'ప్రజలకిపాలకుడు' అని చెప్పబడింది (దివో ధర్తా భువనస్య ప్రజాపతిః); మరొకదాంట్లో (9.5.9) ఇది త్వష్టతోనూ ఇంద్రుడితోనూ పోల్చబడిన సోముడికి విశేషణంగా ఉంది (పవమానః ప్రజాపతిః). ఇవి వదిలేస్తే, ఒక ప్రత్యేక దేవతపేరుగా ఈ శబ్దం నాలుగుచోట్ల మాత్రమే ఉంది; అవి అన్నీ పదోమండలంలోవే. ప్రజాపతిఅనే దేవతల సంతతిని పుట్టించాలనీ (ఆనః ప్రజాం జనయతు ప్రజాపతిః, 10.85.43), ఆయన విష్ణువూ, త్వష్టా, ధాతలతో కలిసి సంతానాన్ని ప్రసాదించాలనీ (10.184.1), ఆయనగోసంపదని వృద్ధి చెయ్యాలనీ

(10.169.4) ప్రార్థనలు ఉన్నాయి. అథర్వవేదంలో కూడా ప్రజాపతి ఉత్పత్తికీ ప్రాణులకి రక్షకుడుగా పూజించబడ్డాడు. ఆయన్ని ఉద్దేశించిన ఒకే ఒక సూక్తం (ఋ.వే. 10.121) లో ఆయన ఈ పేరుతో ఆయన స్తుతి ఇలా ఉంది: ఆయన స్వర్గాన్నీ, భూమినీ, నీళ్లనీ, ప్రాణంకల అన్నిటినీ పుట్టించినవాడు; అంతటికీ ఒకే పతిగా పుట్టినవాడు (భూతస్య జాతః పతిరేక ఆసీత్, 1), శ్వాసించే కనురెప్పలు వేసే జగత్తు కంతటికీ ఒకే ఒక రాజు (ఏక ఇద్రాజా జగతో బభూవ, 2) దేవతలలో ఒకే ఒక దేవుడు (యో దేవే ష్వధి దేవ ఏక ఆసీత్, 8); ఆయన ఆజ్ఞని దేవతలతోపాటు అందరూ పాటిస్తారు (యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః, 2); ఆయన స్వర్గాన్నీ భూమినీ నిలబెట్టేడు (5); ఆయన అంతరిక్షంలో ప్రదేశాలని నిర్మించాడు (యో అంతరిక్షే రజసో విమానః, 5); ఈ దిక్కులన్నీ ఆయన బాహువులు (యస్యేమాః ప్రదిశో యస్య బాహూ, 4). ఇక్కడ ప్రజాపతి అనేది దేవాధిదేవుడి పేరు అని స్పష్టం. ప్రజాపతి దేవాధిదేవుడు అని ఋగ్వేదంలో ఈ ఒక్కచోట మాత్రమే చెప్పబడినా, అ.వే., వా.సం.లలో తరచుగానూ, బ్రాహ్మణాలలో సర్వత్రా ఈ అభిప్రాయం వ్యక్తం చెయ్యబడింది. మొదట్లో తానొక్కడే ఉన్న (శ.బ్రా. 2.2.4.1) ఈయన దేవతలకి తండ్రి (శ.బ్రా. 11.1.6.14; తై.బ్రా. 8.1.3.4, మొ.). ఈయన అసురులని కూడా పుట్టించాడు (తై.బ్రా. 2.2.2.3). ఈయనే మొట్టమొదటగా యజ్ఞం చేసినవాడు అని కూడా చెప్పబడింది (ప్రజాపతిర్వా ఏతేనాగ్రే యజ్ఞేనేజే, శ.బ్రా. 2.4.4.1; 6.2.3.1). సూత్రాలలో ప్రజాపతికీ బ్రహ్మకీ ఏకత్వం చెప్పబడింది (ఆ.గృ.సూ. 3.4, మొ.). అర్వాచీన వైదిక గ్రంథాలలోని దేవతాతత్త్వంలో దేవతలలో ముఖ్యుడుగా పరిగణించబడిన ఈయన స్థానంలో ఉపనిషత్తులు ప్రతిపాదించిన వేదాంత రూపరహితుడూ సర్వాత్ముడూ అయిన బ్రహ్మని పెట్టింది.

39.3 మైత్రాయణీ సంహిత (4.2.12) లో ప్రజాపతి తన పుత్రిక అయిన ఉషస్సుని కామించినట్లుగా ఒక గాథ ఉంది. ఆమె ఆడలేడిగా మారితే ఆయన మగలేడిగా మారేడు. ఇది చూసి రుద్రుడు కోపించి తన బాణాన్ని ఆయన మీదకి గురిపెట్టేడు; అప్పుడు ప్రజాపతి రుద్రుడితో ''నువ్వు బాణం వెయ్యకుండా ఉంటే నిన్ను పశువులకి పతిగా చేస్తాను'' అని చెప్పేడు (చూ. ఋ.వే. 10.61.7). ఈ కథ బ్రాహ్మణాలలో కొన్నిచోట్ల స్మరించబడింది (ఐ.బ్రా. 3.33; శ.బ్రా. 1.74.1; పం.బ్రా. 8.2.10). ఈ గాథకి ఆధారం ఋగ్వేదంలో రెండు సందర్భాలలో (1.71.5; 10.61.5-7) ఉన్నట్లు కనపడుతుంది; వాటిలో ఒ

తండ్రికి ( ఆయన ద్యౌస్ అయినట్లు కనపడుతోంది) తన కూతురితో ( ఆమె భూమి అయినట్లు కనపడుతోంది) సంపర్కం ఏర్పడినట్లు చెప్పబడింది; ఒక బాణాలు వేసే ధానుష్కుడి ప్రసక్తి కూడా ఉంది.

39.4 ఋగ్వేదం 10.121 సూక్తం మొదటి తొమ్మిది మంత్రాలలో సమానంగా ఉన్న చివరి పాదం (కస్మై దేవాయ హవిషా విధేమ '' ఏ దేవుడికి హవిస్సు ఇచ్చి పూజిద్దాం?'') లో దేవుడు ఎవరికీ తెలియనివాడు అనే అర్థాన్ని సూచిస్తూ దేవుడికి క- ' ఎవరు' అనే ప్రశ్నార్థక సర్వనామం వాడబడింది (★కస్మై ' ఎవరికి' అనేది ఈ సర్వనామం చతుర్థ్యేకవచనరూపం). పదో మంత్రంలో దీనికి ''ప్రజాపతి ఒక్కడే అన్ని పదార్థాలలోనూ వ్యాపించి ఉన్నాడు'' అని సమాధానంగా చెప్పబడింది ( ప్రజాపతే న త్వదేతా॰ న్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ ''ప్రజాపతీ! నీకన్న ఇతరుడు ఎవ్వడూ ఈ అన్ని పదార్థాలలోనూ వ్యాపించిలేడు''). ఈ ప్రయోగం తరవాత కాలంలో ఈ క-సర్వనామం ప్రజాపతికి విశేషణంగా వాడబడడానికి మాత్రమే కాక (ఐ.బ్రా. 3.22.7), క- అనేది దేవాధిదేవుడికి ప్రత్యేకమైన పేరుగా వాడబడడానికి(మై.సం. 7.12.5) కూడా దారితీసింది. తై.సం. (1.7.6.6)లో ప్రజాపతే క- అని వాచ్యంగానే చెప్పబడింది ( ప్రజాపతిర్వై కః).

39.5 ఋ.వే. 10.121 సూక్తం మొదటి మంత్రంలో ఈ దేవాధిదేవుడు హిరణ్యగర్భుడు ''బంగారుమయమైన లోకానికి గర్భం వంటివాడు / బంగారుమయమైన లోకం గర్భంగా ఉదరంలో కలవాడు''. అన్నిటికీ ఏకైకపతి అని చెప్పబడింది ( హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్). ఋగ్వేదంలో ఈ శబ్దం ఈ ఒక్కచోటే ఉంది కాని అథర్వవేదంలోనూ బ్రాహ్మణాల కాలంలో సాహిత్యంలోనూ ఇది కొంచెం తరచుగా కనపడుతుంది( చూ. అధ్యాయం 8.6). అథర్వవేదం 4.2.8 మంత్రంలో నీళ్లు పిల్లవాణ్ణి పుట్టించడానికి మొదట్లో గర్భం కల్పించాయనీ అది పుట్టేటప్పుడే దానిచుట్టూ బంగారు తొడుగు ఉందనీ చెప్పబడింది ( ఆపో వత్సం జనయంతీ ర్గర్భమగ్రే సమైరయన్, తస్యోత జాయమానస్యోల్బ ఆసీ ద్ధిరణ్యయః కస్మై దేవాయ హవిషా విధేమ); ఇక్కడ హిరణ్యగర్భుణ్ణే గురించిన సూచన ఉంది ( ★ దీని ముందు మంత్రం ఋ.వే. 10.121.1తో ఇంచుమించు సమానం). తై.సం. (5.5.1.2) లో ప్రజాపతే హిరణ్యగర్భుడు అని స్పష్టంగా చెప్పబడింది. తరవాతకాలపు సాహిత్యంలో హిరణ్యగర్భ శబ్దం ముఖ్యంగా ఆకారంకుల బ్రహ్మకి నామాంతరం.

## 40. మన్యువు, శ్రద్ధ, మొదలైనవారు

40.1 అమూర్తభావాలని సూచించే నామవాచకాల దేవత్వారోపణని గురించి ఈపైన మనం చర్చించవలసి ఉంది. మన్యువు (మన్యు-) 'కోపం' ముఖ్యంగా ఇంద్రుడి భయంకరమైన కోపం ఆధారంగా ఏర్పడిన పురుషతారోపం; ఈయన ఋగ్వేదంలో రెండు సూక్తాల (10.83, 84)లో స్తుతించబడ్డాడు. ఈయన ఎదురులేని శక్తి కలవాడు, స్వయంగా ఉద్భవించినవాడు (స్వయంభూః); అగ్నిలా ప్రకాశిస్తాడు; ఇంద్రుడూ, వరుణుడూ, జాతవేదుడూ అయిన దేవుడు. ఈయన వృత్రుణ్ణి చంపుతాడు, మరుత్తులతో కూడి ఉంటాడు; ఇంద్రుడిలా విజయం ఇస్తాడు, సంపద ఇస్తాడు. తపస్సుతో కూడి ఈయన భక్తులని రక్షించి వారి శత్రువులని చంపుతాడు. ఋగ్వేదంలో ఒక చిన్నసూక్తం (10.151) శ్రద్ధని (శ్రద్ధా-) 'నమ్మకం' స్తుతించడానికి ఉద్దిష్టం. ఆమెని ప్రాతఃకాలంలోనూ మధ్యాహ్నమూ, రాత్రీ స్తుతిస్తారని చెప్పబడింది. శ్రద్ధవల్లనే అగ్ని పుట్టించబడుతుంది; శ్రద్ధవల్లనే హవిస్సు అర్పించబడుతుంది (శ్రద్ధయాగ్నిః సమిధ్యతే, శ్రద్ధయా హూయతే హవిః, 1). శ్రద్ధవల్ల ధనం లభిస్తుంది (శ్రద్ధయా విందతే వసు, 4). బ్రాహ్మణాలలో శ్రద్ధ సూర్యుడికి (శ. బ్రా. 12.7.3.11), లేక ప్రజాపతికి (తై. బ్రా. 2.3.10.1) పుత్రిక అని చెప్పబడింది. ఇతిహాస పురాణాలలో ఈవిడ బంధుత్వాలు ఇంకా విపులీకరించ బడ్డాయి (★ఈ ఋగ్వేదసూక్తాన్ని దర్శించిన వారు కూడా కామగోత్రానికి చెందిన శ్రద్ధ అనే స్త్రీ ఋషి.) అనుమతి '(దేవతల) అనుగ్రహం' వ్యక్తిత్వారోపంతో ఋగ్వేదంలో రెండుచోట్ల కనపడుతుంది. ఆమె దయ చూపాలనీ, ఆమె భక్తులు సూర్యుణ్ణి దీర్ఘకాలం చూడాలనీ (10.59.6) ప్రార్థించబడింది; ఆమె రక్షణ ఇస్తుందని కూడా సూచించబడింది (10.167.3). అథర్వవేదం, వాజసనేయీ సంహితలలో ఆమె అనురాగానికీ సంతానవ్యాప్తికీ అధిదేవత అయింది. తరవాత కాలపు యజ్ఞకర్మలో పౌర్ణమికి ముందు రోజుకి ఆమె ప్రతీక అని భావించబడి ఆమెకీ చంద్రుడికీ సంబంధం కల్పించబడింది. అరమతి 'భక్తి' ఋగ్వేదంలో అరుదుగా వ్యక్తిత్వారోపం పొందింది. ఈ పేరుకీ అవెస్తాలో భూమికీ జ్ఞానానికీ అధిదేవత అయిన ఆర్మైతి కీ సాదృశ్యం ఉంది; కాని ఇక్కడ వ్యక్తిత్వారోపం మూల ఇండో- ఇరానియన్ కాలంలోనే ఏర్పడింది అనడానికి అవకాశం తక్కువ. సూనృతా- 'ప్రియసత్య వాగ్రూప (అయినసరస్వతి)' (★దీనికి మూలకర్త bounty 'దాతృత్వం' అని అర్థం ఇచ్చారు; దీనికి కారణం మృగ్యం; పైన ఇచ్చిన అర్థం సాయణుడిది) దేవతగా ఋగ్వేదంలో రెండుమూడుచోట్ల

కనపడుతుంది(1.40.3; 10.141.2). అసునీతి- 'ప్రాణులకినాయకురాలు' ఋగ్వేదంలో వరసగా ఉన్నరెండు మంత్రాలలో (10.59.5, 6) దీర్ఘాయుస్సూ, మంచికన్నూ ఇవ్వాలని స్తుతించబడింది. నిర్రుతి- 'రోగం, (మృతి చెందేటప్పుడు) దేహావయవాల శైథిల్యం' మృత్యువుకి అధిదేవతగా ఋగ్వేదంలో సుమారు పన్నెండు చోట్ల కనపడుతుంది.

40.2 మరికొన్ని పురుషతారోపాలు అర్వాచీన వేదాలలోనే మొట్టమొదటిసారిగా కనపడతాయి. కామానికి (అంటేకోరికకి) పురుషతారోపంగా కామదేవుడు అథర్వవేదం (9.2; 19.52) లో రూపొందేడు. అందులో ఆయనకోరికలని తీర్చే దేవుడు మాత్రమే కానివేదాల తరవాత కాలపు సాహిత్యంలోలా ప్రేమకి అధిదేవత కాదు. హృదయాలని చీల్చే ఆయన బాణం ప్రసక్తి ఇందులోనే ఉంది (ఇషుః కామస్య యా భీమా తయా విధ్యామి త్వా హృది, అ.వే. 3.25.1). ఆయనమొట్టమొదట పుట్టినవాడు అని వర్ణించబడ్డాడు (కామో జజ్ఞే ప్రథమః, అ.వే. 9.2.19). ఈ అభిప్రాయానికి బీజం ప్రపంచోత్పత్తిని వర్ణించే ఒక ఋగ్వేద సూక్తంలోని ఒక మంత్రం (10.129.4; చూ. అధ్యాయం 8.8) లో ఉందని చెప్పవచ్చు; అందులో కామం 'కోరిక' మనస్సుకి మొదటి రేతస్సు అని చెప్పబడింది (కామ స్తదగ్రే సమవర్తతాధి మనసోరేతః ప్రథమం యదాసీత్). కాలం 'సమయం' అథర్వవేదం (19.53, 54) లో విశ్వాన్ని సృష్టించే ఒక శక్తి అయిన కాలుడుగా పురుషతారోపం పొందింది. స్కంభ- 'నిలబెట్టే ఆధారం' ప్రజాపతి సృష్టించిన విశ్వాన్ని నిలబెట్టే ఒక దేవతగా అథర్వవేదంలోని ఊహాలలో పురుషతారోపం పొంది విశ్వేదేవత (= అన్నింటిలోనూ ఉండే దేవత)గా ఆరాధించబడ్డాడు (అ.వే. 10.8.2). ప్రాణం 'ఊపిరి' కూడా దేవతగా మారి ఆ దేవత ప్రజాపతితో ఏకత్వం పొందేడు (అ.వే. 11.4.12, మొ.). అథర్వవేదంలో ఇటువంటి పురుషతారోపాలు మరికొన్ని కూడా కనపడతాయి. అందానికీ అదృష్టానికీ వ్యక్తిత్వారోపమైన శ్రీ మొట్టమొదటగా శ.బ్రా. (11.4.3.1) లో కనపడుతుంది.

## 41. అదితి

41.1 పై అధ్యాయంలో చెప్పబడిన దేవతలలా అదితి కూడా ఒక అమూర్త భావానికి వ్యక్తిత్వారోపం అనే వివరణ సరిఅయినదే అయితే ఋగ్వేదంలో ఒక అసాధారణ పరిస్థితి ఉందని చెప్పవలసి వస్తుంది. ఈపేరు అర్వాచీన భాగాలలో మాత్రమే కాక ఋగ్వేదమంతటా రావడమే ఈ అసాధారణ పరిస్థితి. కింద ఇవ్వబోయే వివరణ సరి అయినది అనుకొంటే

ఇక్కడ వ్యక్తిత్వారోపం ఒక విశిష్టమైన పద్ధతిలో జరిగి ఉండడమే దీనికి కారణం అని సమర్థించవచ్చు. లేకపోతే ఈ దేవతని విశేషణాలనించి వచ్చిన దేవతల జాబితాలో చేర్చాలి (అధ్యాయం 39).

41.2 ఋగ్వేదంలో స్త్రీ దేవత అయిన అదితికి ఉద్దిష్టమైన ప్రత్యేక సూక్తం ఏదీ లేకపోయినా, ఆమె ఆనుషంగికంగా తరచు స్తుతించబడింది; ఆమె పేరు ఎనభైసార్లు వచ్చింది. ఆమెపేరు ప్రత్యేకంగా రావడం అరుదు (8.19.14); ఆమె సర్వసాధారణంగా తనపుత్రులైన ఆదిత్యులతోపాటు స్తుతించబడింది.

41.3 ఆమె ఆకార లక్షణాల ప్రసక్తి ఎక్కడాలేదు. ఆమె తరచుగా దేవి (దేవీ-) అనీ, కొన్నిచోట్ల అనర్వా 'ప్రతికూలత లేనిది' (2.40.6; 7.40.4) అనీ చెప్పబడింది. ఆమె ఎక్కువ వ్యాప్తి కలది (ఉరువ్యచాః, 5.46.6); పెద్దగోష్ఠానాలు కలది (8.67.12). ఆమె ప్రాణులను భరించేది (1.136.3; ఇది ఇతరత్రా మిత్రావరుణులకే చెప్పబడింది); మనుష్యులందరికీ చెందినది (7.10.4; ఇలా ద్యావాపృథువుల విషయంలో కూడా చెప్పబడింది). ఆమె పొద్దున్నా, మధ్యాహ్నం, సూర్యాస్తమయ సమయంలోనూ ఆహ్వానించబడుతుంది (5.69.3).

41.4 అదితి మిత్రావరుణులకీ (8.25.3; 10.36.3; 10.132.6), అర్యముడికీ (8.47.9) తల్లి. అందువల్ల ఆమె రాజులకి తల్లి (రాజపుత్రా, 2.27.7), మంచి పుత్రులు కలది (సుపుత్రా 3.4.11). ఉగ్రులైన పుత్రులు కలది (ఉగ్రపుత్రే, 8.67.11), శూరులైన పుత్రులు కలది (శూరపుత్రాం, అ.వే. 3.8.2; 11.1.11), ఎనిమిది మంది పుత్రులు కలది (అష్టౌ పుత్రా సో అదితేర్యే జాతాః, 10.72.8; అ.వే. 8.9.21) అని చెప్పబడింది. ఒకచోట (8.101.5) ఆమె రుద్రులకి తల్లి, వసువులకి కూతురు, ఆదిత్యులకు సోదరి (ఈ చివరిది ఆశ్చర్యకరం) అని చెప్పబడింది (మాతా రుద్రాణాం దుహితా వసూనాం స్వసాదిత్యానాం). అథర్వవేదం 6.4.1లో (పేర్లు చెప్పకపోయినా) అదితికి పుత్రులూ సోదరులూ ఉన్నారని ఉంది (పుత్రై ర్భ్రాతృభి రదితిర్ను పాతునః). మరొక అథర్వవేద మంత్రం (7.6.2 = వా.సం. 21.5)లో ఆమె భక్తులకు గొప్పతల్లి (మహీ..... మాతరం సువ్రతానాం), ఋతానికి (= సత్యానికి / యజ్ఞానికి) పత్ని, గొప్పబలం కలది (తువిక్షత్రాం), ముసలితనం లేనిది (అజరంతీం), గొప్ప వ్యాప్తికలది (ఉరూచీం),

సుఖం కలిగించేది (సుశర్మాణం), మంచి నాయకత్వం ఇచ్చేది (సుప్రణీతిం) అనే వర్ణనలతో స్తుతించబడింది. ఇటువంటి సందర్భాలవల్లా, ఆమె తన కొడుకులైన ఆదిత్యులతోపాటు తరచుగా స్తుతించబడడంవల్లా ఆమె స్వభావంలో మాతృత్వం ఒక ముఖ్యలక్షణం అని తెలుస్తుంది. ఆమెకి ఉన్న పస్త్య‘ ఇల్లాలు’ (ప్ర పస్త్యమదితిం, 4.55.3; 8.27.5) అనే విశేషణం కూడా ఆమె మాతృత్వలక్షణానికిసూచకం అనుకోవచ్చు. ఇతిహాస పురాణాలలోని గాథాతత్త్వంలో అదితి దక్షుడికి కూతురు, దేవతలందరికీ తల్లి; ఈమె పుత్రులని వాచ్యంగా చెప్పబడినవారు వివస్వత్తూ, సూర్యుడూ, విష్ణువు అవతారమైన వామనుడూ. వా.సం. (29.60 = తై.సం. 7.5.14) లో ఆమె విష్ణువు భార్య అని ఉంది (అదిత్యై విష్ణపత్న్యై చరుః).

41.5 అదితి ఆపద (అంహస్) నించి కాపాడుతుందనీ, పూర్తి క్షేమాన్ని రక్షణనీ ఇస్తుందనీ (10.100; 1.94.15) కొన్నిచోట్ల చెప్పబడింది; కాని ఆమె పాపాన్నించి విముక్తి కలిగించాలని ఇంతకన్న తరచుగా ప్రార్థించబడింది. ఉదాహరణకి, వరుణుడూ (1.24.15), అగ్నీ (4.12.4), సవితా (5.82.6) అదితి విషయంలో భక్తులు చేసిన పాపాన్ని తొలగించమని ప్రార్థించబడ్డారు. అదితీ, మిత్రుడూ, వరుణుడూ పాపాన్ని క్షమించాలని ప్రార్థన ఉంది (2.27.14); అదితీ, అర్యముడూ పాపాన్ని (పాపబంధాలని) సడలించాలి అని కూడా ఉంది (తదర్యమాదితిః శిశ్రథంతు, 7.93.7). భక్తులు తమని పాపరహితులని చెయ్యమని వేడుకొంటారు (1.162.22); ఆమె ఆజ్ఞలు పాటించడం వల్ల వరుణుడి సమక్షంలో తాము పాపరహితులు అవ్వాలనీ (7.87.7), దుష్టులు అదితికోసం (అగ్నివల్ల) కోయబడాలనీ (ఆ వృశ్చ్యంతా మదితయే దురేవాః, 10.87.18) ప్రార్థనలు ఉన్నాయి. అందువల్ల, అగ్ని (3.54.10), సవిత (4.54.3), సూర్యుడు, ఉషస్సు, స్వర్గం, భూమి (10.35.2, 3) అనీ ఇతర దేవతలు కూడా పాపాన్ని క్షమించాలని ప్రార్థించబడినా, పాపాన్నించి విమోచనం కలిగించడం అనే భావన అదితికీ ఆమె పుత్రుడైన వరుణుడికీ సన్నిహితంగా ఉంటుంది; వరుణుడు పాపులని పాశాలతో బంధిస్తాడనేది ప్రసిద్ధం; ఆయన పాపాన్ని తాడు విప్పినట్లు విప్పి తీసేస్తాడు (అధ్యాయం 12.15).

41.6 ఈ భావనకీ అదితి పదం వ్యుత్పత్తికీ చాలా దగ్గర సంబంధం ఉంది. దా- ‘కట్టు, బంధించు’ అనే ధాతువు నించి వచ్చిన నామవాచకం ది-తి (= గ్రీక్ దె-సి-స్) ‘కట్టు,

బంధం'; దీని వ్యతిరేకరూపమైన అ-దితి 'కట్టు/ బంధం లేకపోవడం, స్వేచ్ఛ' అని మౌలికార్థం. ఈ ధాతువునించి వచ్చిన కర్మణ్యర్థ భూత కృదంత (నిష్ఠా) రూపమైన ది-త- 'కట్టబడిన (వాడు)' అనేది యూపానికి కట్టబడిన శునశ్శేపుడి విషయంలో వాడబడింది (శునశ్చిచ్ఛేపం ని-దితం, 5.2.7). అందువల్ల దేవత అయిన అదితి (తోడేళ్ల నోళ్లనించి) భక్తులని కట్టివెయ్యబడిన దొంగని విడిపించినట్లు విడిపించాలి అనే ప్రార్థనలో సహజత్వం ఉంది (తేన ఆస్నో వృకాణా మాదిత్యాసో ముమోచత, స్తేనం బద్ధ మివాదితే, 8.67.14; ఆస్నః = నోటినించి). 'స్వేచ్ఛ' అనేదీని మౌలికార్థం కొన్ని ఋగ్వేదమంత్రాలలో మిగిలి ఉన్నట్లు కనబడుతుంది. ఉదాహరణకి, ఒక భక్తుడు ఇలా ఆక్రోశిస్తాడు: ''నేను నా తండ్రినీ తల్లినీ చూడడానికి నన్ను ఎవరు ఆ గొప్ప అదితికి తిరిగి ఇస్తారు?'' (కో నో మహ్యా అదితయే పునర్దా త్పితరం చ దృశేయం మాతరం చ, 1.24.1). ''యజ్ఞాన్ని పాపరహితత్వంలోనూ (అనాగాస్త్వే), స్వేచ్ఛలోనూ (అదితిత్వే) పెట్టాలి'' అని ఆదిత్యులకి ప్రార్థన ఉంది (7.51.1). 'పాపరహితమూ అక్షీణమూ అయిన అదితి దానం' (అనేహో దాత్ర మదితే రనర్వం, 1.185.3; దాత్రం = దానం) కోసం కవి స్వర్గాన్నీ భూమినీ ప్రార్థించిన చోటకూడా అదితి శబ్దానికి 'స్వేచ్ఛ' అనే అర్థమే ఉద్దిష్టమై ఉండవచ్చు. అదితి శబ్దం 'హద్దులు లేని' అనే అర్థంలో విశేషణంగా కూడా కొన్నిచోట్ల వాడబడింది;; ఇలా ఇది రెండుచోట్ల ద్యౌస్‌కీ (5.59.8; 10.63.3), ఇంకా తరుచుగా అగ్నికీ (1.94.15; 4.1.20; 7.9.3; 8.19.14) విశేషణంగా వాడబడింది.

41.7 ఈ పేరుకీ (★ ఏ ప్రకృతి పదార్థంతోనూ సంబంధం లేకపోవడం వల్ల) ఉన్న అస్పష్టత ఊహాత్మకమైన ఏకత్వారోపణలకి సులభంగానే అవకాశం కల్పించింది; ఋగ్వేదంలోని అర్వాచీన భాగాలలో దేవతల ఉత్పత్తిని గురించీ విశ్వం ఉత్పత్తిని గురించీ ఉన్న ఊహలవల్ల ఈ భావన సహజంగానే ప్రభావితమైంది. ఉదాహరణకి, దేవతలు అదితినించీ, నీళ్లనించీ, భూమినించీ పుట్టేరని చెప్పబడింది (10.63.2; చూ. అధ్యాయం 9.1). దీని తరవాతనే ఉన్న మంత్రంలో దేవతల తల్లి అయిన హద్దులేని ఆకాశం వారికి మధువుకల పయస్సు (= పాలు/ నీరు) ఇస్తుంది అని ఉంది (యేభ్యో మాతా మధుమ త్పిన్వతే పయః పీయూషం ద్యౌరదితిః). అందువల్ల ఇక్కడ అదితికీ ఆకాశానికీ అభేదం చెప్పినట్లు కనపడుతోంది. మరొకచోట (1.72.9; అ.వు. 13.1.38) అదితికీ భూమికీ అభేదం చెప్పినట్లు కనపడుతోంది; తై.సం., శ.బ్రా. లలో ఈ అభేదం తరచుగా చెప్పబడింది.

నిరుక్తంలోని నిఘంటువులో ఈ పేరు భూమికి పర్యాయంగానూ, ద్వివచనంలో ఆకాశానికీ భూమికీ పర్యాయంగానూ ఇవ్వబడింది. కాని, ఋగ్వేదంలో చాలా మంత్రాలలో (10.63.10, మొ.) ఆకాశం, భూములతోపాటు అదితి కూడా విడిగా చెప్పబడడం వల్ల అదితి ఆరెండిటికన్నా వేరు అని అక్కడ ఉద్దిష్టం అని తెలుస్తోంది. మరొక మంత్రం (1.89.10)లో అదితి సర్వాత్మకమైన ప్రకృతికి వ్యక్తిత్వారోపణగా ఉంది: ''అదితి ఆకాశం; అదితి అంతరిక్షం; అదితి తల్లి, తండ్రి, కొడుకు; అదితి అందరు దేవతలూ, అయిదు జాతుల జనులూ; పుట్టినవారూ, పుట్టబోయేవారూ అదితి'' (అధ్యాయం 10.3; చూ. కఠోపనిషత్తు 4.7).

41.8 ఋగ్వేదంలో ప్రాచీనదశకి చెందిన గాథాతత్త్వం ప్రకారం అదితి ఆదిత్యులలో ఒకడైన దక్షుడికి తల్లే అయినా (2.27.1), ప్రపంచోత్పత్తిని వివరించే ఒక సూక్తం (10.72.4, 5)లో ఆమె ఆయనకి కూతురూ, తల్లీ అని కూడా చెప్పబడింది;[1] ఇలా దేవతలకి పరస్పరోత్పాదకత్వం ఉందనే భావన ఋగ్వేదానికి కొత్త కాదు (అధ్యాయం 8.3; చూ. 10.90.5). పదోమండలంలో మరి రెండు సూక్తాల (5.7; 64.5)లో వీరిద్దరికీ సంబంధం చెప్పబడిన తీరు చూస్తే అదితి దక్షుడి తల్లిగాకాక ఆయనకన్న తక్కువస్థాయిలో ఉన్నట్లు కనపడుతుంది.[2] అదితి కొందరు ప్రధాన దేవతలకి తల్లే అయినా, మరికొన్ని మంత్రాలలో కూడా ఆమెకు తక్కువస్థాయి ఆపాదించబడింది. ఉదాహరణకి, ఆమె తన కొడుకులైన వరుణుడూ, మిత్రుడూ, అర్యముడూ- వీరితోపాటు సవితని స్తుతించింది (యందే వ్యదితి ర్గృణాతి సవం దేవస్య సవితు ర్జుషాణా, 7.38,4; గృణాతి = స్తుతిస్తుంది); ఆమె ఇంద్రుణ్ణి స్తుతించే ఒక స్తోత్రం కూడా పుట్టించింది అని ఉంది (ఉత స్వరాజే అదితిః స్తోమ మింద్రాయ జీజనత్, 8.12.14; చూ. 5.31.5).

41.9 అదితికీ కాంతికీ సంబంధం ఉన్నట్లు కొన్నిచోట్ల చెప్పబడింది; ఆమె ప్రకాశ స్వభావం కల ఆదిత్యులకి తల్లి అవడం దీనికి కారణం కావచ్చు. ఆమెకాంతికోసం ప్రార్థించబడింది (4.25.3; చూ. 10.36.3); ఆమె అనంతమైనకాంతి స్తుతించబడింది

---

1. అదితేర్దక్షో అజాయత, దక్షా ద్వదితిః పరి (4).

2. ఇక్కడ కొంత వైరుధ్యం ఉంది; పైరెండు మంత్రాలలోనూ దక్షుడు అదితికి పుట్టినట్లే ఉంది (దక్షస్య జన్మ న్నదితే రుపస్థే, 5.7; దక్షస్య వాదితే జన్మని వ్రతే, 64.5). అయితే 64.5లో అదితి మిత్రావరుణులకి పరిచర్య చేసిందని ఉండడం ఇక్కడ మూలకర్త ఉద్దేశించి ఉంటారు.

(7.82.10); ఉషస్సు అదితి ముఖం అని చెప్పబడింది (అదితేరనీకం, 1.113.19) అందరు దేవతలకీ అన్వయించే సాధారణ విషయాలు కూడా అదితి విషయంలో అరుదుగా చెప్పబడ్డాయి. ఉదాహరణకి, ఆమె భక్తులనీ, వారి సంతానాన్నీ, గోవులనీ కాపాడాలనీ కరుణించాలనీ ప్రార్థన ఉంది (8.18.6, 7; 1.43.2). ఆమె సంపద కోసం (7.40.2), స్వచ్ఛమైన, దృఢమైన, దివ్యమైన, నాశరహితమైన ఆమె వరాల కోసం (1.185.3) ప్రార్థించబడింది; మరుత్తులిచ్చే గొప్ప వరాలు అదితి చేసే మేలుతో పోల్చబడ్డాయి (1.166.12).

41.10 కొన్ని ఋగ్వేద మంత్రాలలోనూ (1.153.3; 8.90 15; 10.11.1, మొ.), ఇతర వైదిక గ్రంథాలలోనూ (వా.సం. 13.43; 13.49), అదితి గోవు అని చెప్పబడింది; యజ్ఞకర్మలో ఒక గోవు ఆమెకి ఉద్దిష్టమైంది. భూమి మీద సోమం అదితి పాలతో పోల్చబడింది (పయో న దుగ్ధ మదితేః, 9.96.15); కలశంలోకి కారే సోమంతో కలిసే అదితి పుత్రికలు (నప్తీ రదితేః, 9.69.3) అని ఉన్నచోట "అదితి పుత్రికలు" అంటే పాలే అవాలి. పురోహితుడు పదివేళ్లతో అదితి ఒళ్లో సోమాన్ని శుద్ధి చేస్తారు (9.26.1; 9.71.5) అన్నప్పుడు కూడా ఈ అర్థమే ఉద్దిష్టమై ఉండవచ్చు.

41.11 పైన ఇచ్చిన ఆధారాల పరిశీలన వల్ల అదితికి రెండే రెండు ముఖ్యలక్షణాలు ఉన్నాయని తెలుస్తుంది. వాటిలో మొదటిది ఆమె మాతృత్వం. ఆమె ఆదిత్యులు అనే దేవతల సముదాయానికి తల్లి; ఆదిత్య శబ్దం అదితి అనే ఆమె పేరునించి ఏర్పడిన తద్ధితరూపం. ఆమె ముఖ్యలక్షణాలలో రెండోది- ఈ పేరు వ్యుత్పత్త్యర్థానికి తగినట్లు, శారీరక బాధలూ, పాపాలూ అనే బంధాలనించి విముక్తి కలిగించగల శక్తి. అనంతమైన సమృద్ధిని సూచించే విధంగా ఆమె గోవు అని చెప్పడానికీ, ఆమెకి హద్దులులేని భూమీ, స్వర్గం, విశ్వాలతో ఏకత్వం కల్పించడానికీ ఈ పేరు ఆధారంగా వృద్ధిచెందిన కాల్పనికమైన ఊహలే కారణం అయి ఉంటాయి. కాని ఇటువంటి అమూర్తభావానికి అంత ప్రాచీనకాలంలోనే వ్యక్తిత్వారోపం ఏర్పడడానికీ, ముఖ్యంగా, అదితి ఆదిత్యుల తల్లిగా భావించబడడానికి ఏం వివరణ ఇవ్వగలం? అదితి తల్లిగా పరిణమించడంలో మధ్యమదశ ద్యౌరదితిః 'హద్దులులేని ఆకాశం', హద్దులులేని ఆకాశం అనే తల్లి దేవతలకి పాలు ఇస్తుంది (యేభ్యో మాతా మధువ త్పిన్వతే పయః పీయూషం ద్యౌ రదితిః, 10.63.3) అనే వాక్యాంశాలలో కనపడుతుందని బెర్గెయిన్(Bergaigne) అభిప్రాయం. ఈ అభిప్రాయం

ప్రకారం, సాధారణంగా (విశ్వానికి) తండ్రిగా భావించబడిన ఆకాశానికి 'హద్దులులేని' అనే అరుదైన లాక్షణికమైన అర్థంలో విశేషణంగా వాడబడిన అదితి శబ్దం ప్రత్యేకమైన ఒక స్త్రీ దేవతని సూచించేదిగా పరిణమించింది అని అనుకోవాలి. ఇలా అసామంజస్యంతో ఉన్న ఈ వివరణ బంధాలనించి అదితి విముక్తి కలిగిస్తుంది అనే భావన ఎలా ఏర్పడింది అన్న ప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానం ఇవ్వదు. దీనికి మరొక వివరణ సాధ్యమే. ఋగ్వేదంలో ఆదిత్యులని సూచించడానికి కొన్నిచోట్ల వాడబడిన అదితేః పుత్రాః అనే పదబంధానికి వేదాలకి ముందుకాలంలో ''స్వేచ్ఛకి పుత్రులు'' అనే సామాన్యార్థం మాత్రమే ఉండి ఉండవచ్చు (ఇది సహసః పుత్రః 'బలానికి కొడుకు' వంటిది, చూ. అధ్యాయం 8.4); ఈవిధంగా ఇది మొదట్లో వరుణుడికీ ఆయన వంటి మరికొందరు దేవతలకీ ఉన్న ముఖ్యలక్షణాన్ని సూచించేదై ఉంటుంది. ఇటువంటి పదబంధం ఆధారంగా అదితికి తల్లి అనే వ్యక్తిత్వారోపం ఏర్పడడం తేలిక. ఇటువంటి పరిణామాలు మరికొన్ని ఉన్నాయి: ఇంద్రుడికి ఉన్న శవసః పుత్రః 'బలానికి కొడుకు' (అధ్యాయం 8.4) అనే విశేషణాన్నించి శవసీ అనే వ్యక్తి ఇంద్రుడి తల్లిగా ఋగ్వేదంలోనే ఏర్పడింది; ఇంద్రుడికి మరొక విశేషణమైన శచీపతి 'శక్తికిపతి' (★ అని దీని అసలు అర్థం) అనే సమాసానికి 'శచీ (అనే స్త్రీ) భర్త' అని అర్థం ఊహించడం వల్ల శచీ- వ్యక్తిగా మారి ఇంద్రుడి భార్య అయింది. ఆదిత్య- అనే తద్ధితరూపం ఏర్పడడం వల్ల ఆమె పుత్రుల సముదాయం పరిమితమయింది. వ్యక్తిత్వారోపం ఏర్పడిన తరవాత కూడా ఈ దేవతకి ''బంధాలు లేకుండా స్వేచ్ఛగా ఉండడం'' అనే మౌలికార్థంతో సంబంధం సహజంగానే మిగిలి ఉంది; ఆదిత్యుల నించి సంక్రమించిన ప్రకాశ స్వభావం వంటి అస్థిరమైన కొన్ని కొత్త విశేషణాలు తరవాత కాలంలో ఈమెకి ఏర్పడ్డాయి. కొందరు ముఖ్య దేవతల, లేక, అందరు దేవతల తల్లిగా ఈమెకి విశ్వానికంతటికీ తల్లిదండ్రులైన భూమితోనూ, ఆకాశం (స్వర్గం) తోనూ అభిన్నత్వం అక్కడక్కడ చెప్పబడిరది; ఈ పదం మౌలికార్థం ప్రపంచోత్పత్తి విషయంలో ఊహలకి ప్రోత్సాహం కల్పించి ఉంటుంది. ఇలా భారతదేశంలో మాత్రమే దేవతగా ఉన్న అదితి ఆమె పుత్రులలో అధమపక్షం కొందరికన్న చారిత్రకంగా చిన్నది.

41.12 అదితి ''బంధాల నించి స్వేచ్ఛ'' అనే భావనకి వ్యక్తిత్వారోపం అనే అభిప్రాయాన్ని వాలిస్ (Wallis), ఓల్డెన్‌బెర్గ్ (Oldenberg) అంగీకరించారు. అదితి అనే దేవుడు లేక స్త్రీ దేవత భూమికీ, మేఘాలకీ, ఆకాశానికీ పైన ఉన్న మన కళ్లకి కనపడే అనంతమైన

ప్రదేశాన్ని సూచించడానికి సృష్టించబడిన ప్రాచీనతమమైన పేరు అని మాక్స్ ముల్లర్(Max Muller) అభిప్రాయపడ్డారు. రోథ్ (Roth) అదితి శబ్దానికి 'అనుల్లంఘనీయత్వం, అవినాశత్వం' అని మొదట్లో అర్థం చెప్పి ఆమె శాశ్వతత్వానికి వ్యక్తిత్వారోపం అన్నారు. తరవాత ( మరొకచోట) ఆయన అదితి అంటే ఆదిత్యులకి ఆధారభూతమైన శాశ్వతత్వం అనీ, శాశ్వత దివ్యకాంతి అనీ వివరించారు. ఆయన ఉద్దేశంలో ఆమె ప్రారంభదశలోని వ్యక్తిత్వారోపమే కాని స్పష్టమైన వ్యక్తిత్వారోపం కాదు. కాని సెంట్‌పీటర్స్‌బర్గ్ నిఘంటువులో ఆయన మళ్లీ హద్దులు కల భూమికి వ్యతిరేకంగా ఉండే అనంతమైన స్వర్గానికి వ్యక్తిత్వారోపం అదితి అని వివరించారు. మరొకవైపు, పిషెల్(Pischel) అదితి భూమికి ప్రాతినిధ్యం వహిస్తుందని చెప్పేరు. హార్డీ(Hardy) అభిప్రాయం కూడా ఇదే. కోలినే(Colinet) అదితి ద్యౌస్‌కి జోడయిన స్త్రీ అన్నారు. నిరుక్తంలోని నిఘంటువులో అదితి పృథివికీ, వాక్కుకీ, గోవుకీ, ద్వివచనంలో ద్యావాపృథువులకీ పర్యాయంగా ఇవ్వబడింది. యాస్కుడు అదితికి ''గొప్పదైన దేవతల తల్లి'' అనే నిర్వచనం ఇచ్చి, నిఘంటువుని (5.5) అనుసరించి, ఆమెని అంతరిక్షస్థానదేవతగానూ, ఆదిత్యులని ద్యుస్థానదేవతలుగానూ, వరుణుణ్ణి ఈ రెండు స్థానాలకీ చెందినవాడుగానూ పరిగణించారు.

## 42. దితి

42.1 దితి పేరు ఋగ్వేదంలో మూడుసార్లు మాత్రమే వచ్చింది; వీటిలో రెండుచోట్ల ఇది అదితిపేరుతోపాటు వచ్చింది. మిత్రుడూ వరుణుడూ వారి రథంమీదినించి అదితినీ దితినీ చూస్తారు (5.62.8) అని చెప్పబడింది. ఇక్కడ సాయణుడు వీరిద్దరూ అవిభాజ్యమైన భూమీ, దానిమీద ఉండే విడివిడి ప్రాణులూ అని వివరించారు; రోథ్ (Roth) వీరికి 'శాశ్వతమూ, నశ్వరమూ' అని వివరణ ఇస్తే ముయిర్ (Muir) వీరు 'కనపడే సమస్త ప్రకృతి' అని చెప్పేరు. మరొక మంత్రం (4.2.11) లో దితిని ఇవ్వాలనీ అదితినించి కాపాడాలనీ అగ్ని ప్రార్థించబడ్డాడు. ఇక్కడ సాయణుడు దితి అంటే 'దాత' అనీ, అదితి అంటే 'దానం చెయ్యనివాడు' అనీ అర్థం చెప్పేరు; రోథ్ (Roth) వీటికి 'సంపద', దారిద్ర్యం' అని క్రమంగా అర్థాలు ఇచ్చారు. బెర్గెయిన్ (Bergaigne) ఈ పదాలు పై మంత్రంలోలాగే దేవతలని సూచిస్తాయని అన్నారు; కాని ఇక్కడ ఇవి దేవతలని సూచించేవిగా కాక వేరు పదాలే అయి ఉంటాయనడానికి ఎక్కువ అవకాశం ఉంది. ఇవి దా- 'ఇచ్చు' అనే ధాతువునించి వచ్చాయి కాబట్టి వీటి అర్థాలు 'ఇవ్వడం', 'ఇవ్వకపోవడం'. ఈ అభిప్రాయాన్ని

సందర్భమూ, ఈపదాల వరసక్రమమూ సమర్థిస్తాయి (దితిం చరా స్వాదితి మురుష్య; రాస్వ = ఇయ్యి, ఉరుష్య = (అదితినించి) కాపాడు). మూడోమంత్రం (7.15.2)లో అదితి లేకుండా దితి మాత్రమే అగ్ని, సవిత, భగులతోపాటు చెప్పబడింది; వీరు కోరదగినది (వార్యం) ఇస్తారు (దా-) అనిచెప్పబడింది. దితీ, అదితీ దేవతలుగా అర్వాచీనసంహితలలో కూడా చెప్పబడ్డారు (వా.సం. 18.22; అ.వే. 15.18.4; 16.6.7). అథర్వవేదం (7.73)లో దితి పుత్రుల ప్రసక్తి ఉంది (దితేః పుత్రాణాం; ★పేర్లు లేవు). వీరేదైత్యులు. వేదాల తరవాత కాలపు గాథాతత్త్వంలో వీరు దేవతలకి శత్రువులు. ఒకదేవతపేరుగా దితి అదితి శబ్దం నించి దాని వ్యతిరేక రూపంగా ఏర్పడినదే కావచ్చు; అవ్యతిరేకార్థాన్ని సూచించడానికి ఇలాగే తరవాత కాలంలో (భ్రమ మూలక వ్యుత్పత్తి ద్వారా) అసుర- 'రాక్షసుడు' అనే శబ్దాన్నించి సుర- 'దేవుడు' అనే శబ్దం ఏర్పడింది.

# ఉ. స్త్రీ దేవతలు

## 43. స్త్రీ దేవతలు

43.1 వేదాలలోని నమ్మకాలలోనూ ఆరాధనలోనూ స్త్రీ దేవతలకున్న స్థానం చాలా అప్రధానమైనదే. విశ్వం పరిపాలనలో వారికి ఏమీ పాత్ర లేనట్టే. వారిలో కొంత ప్రాముఖ్యం కలది ఉషస్సు; సంఖ్యా ప్రమాణాన్ని బట్టి ఆమె స్థానం మూడో తరగతి దేవతలలో ఉంటుంది (అధ్యాయం 10.14). కాని ఇంచుమించు మిగిలిన దేవతలందరికీ ఉన్నట్టు ఈమెకి సోమయాగంలో ఆహుతిలో భాగంలేదు. ప్రాధాన్యంలో ఈమెకి తరవాత సరస్వతి (అధ్యాయం 33) వస్తుంది; కాని ఈమెస్థానం ఆఖరు తరగతి దేవతలలోనే. మరికొందరు స్త్రీ దేవతలు ఒక్కొక్కరు ఒక్కొక్క సూక్తంలో మాత్రం ప్రశంసించబడ్డారు. ద్యౌస్‌తో విడదీయరాని సంబంధం కల పృథివి మూడు మంత్రాలు కల ఒక చిన్న సూక్తంలో స్తుతించబడింది (అధ్యాయం 34). రాత్రి (రాత్రీ-) కూడా ఒకసూక్తం (10.127)లో స్తుతించబడింది. ఆమె సోదరి అయిన ఉషస్సులాగే ఆమె స్వర్గానికి కూతురు అని చెప్పబడింది. ఆమె చీకటి నిండినదిగా కాక నక్షత్రాలతో ప్రకాశించేదిగా భావించబడింది. ఆమె తన కళ్లతో బహుధా ప్రకాశిస్తుంది. కాంతితో అలంకరించుకొని, చీకటిని పారదోలుతూ, ఆమె నిమ్న ప్రదేశాలనీ ఉన్నత ప్రదేశాలనీ నింపుతుంది. ఆమె రాగానే పక్షులు గూళ్ళకి చేరినట్లు మనుష్యులు ఇళ్లకి చేరతారు (వృక్షేన వసతిం వయః, 4).

అడవిలోదేలునీ, మొగలోదేలునీ, దొంగనీ దూరం చేసి ఆమె భక్తులకి క్షేమం కలిగించాలని ప్రార్థించబడింది (యావయా వృక్యం వృకం యవయస్తేనం, 6; యావయా / యవయ 'దూరం చెయ్యి'). ఉషస్సులో కలిపి కొన్ని మంత్రాలలో దేవతాద్వంద్వంగా చెప్పబడిన రాత్రి (అధ్యాయం 20.4; 44.6) బహుశా ఉషస్సుకి వ్యతిరేకమైన దేవతగా మారి ఉండవచ్చు). వ్యక్తిత్వారోపం పొందినమాట/భాషఅయినవాక్కు (వాచ్-) ఒకసూక్తం (10.125; చూ. 10.71)లో స్తుతించబడింది; ఇందులో ఆమె తనని తాను వర్ణించుకొంటుంది. ఆమె అందరు దేవతలతోనూ వస్తుంది; మిత్రావరుణులకీ, ఇంద్రాగ్నులకీ, అశ్వినులకీ సహాయం చేస్తుంది. బ్రహ్మద్వేషి అయిన నరుడు అనే (త్రిపురంలో ఉండే) రాక్షసుల్ని చంపడానికి రుద్రుడికి విల్లు సిద్ధం చేసింది (అహం రుద్రాయ ధను రాతనోమి బ్రహ్మద్విషే శరవే హంతవా ఉ, 6). ఆమె స్థానం నీళ్లలో, సముద్రంలో ఉంది. ఆమె అందరిలోనూ వ్యాపించి ఉంది. మరొకచోట (8.100.10, 11) ఆమె దేవతల రాణి (రాష్ట్రీ దేవానాం) అనీ దేవి (దేవీం వాచ మజనయంత దేవాః) అనీ చెప్పబడింది. నిరుక్తంలోని నిఘంటువు (5.5.)లో వాక్కు అంతరిక్షస్థాన దేవతలలో ఇవ్వబడింది; మాధ్యమికా వాక్ 'మధ్యమస్థానానికి చెందిన వాక్కు' అని వ్యాఖ్యాతలు (నిరుక్తం 11.27) వ్యవహరించిన ఉరుము వాక్కు విషయంలో వ్యక్తిత్వారోపానికి బీజదశ అయి ఉండవచ్చు. గంధర్వులనించి సోమాన్ని తెచ్చినప్పుడు స్త్రీగా మారిన వాక్కు ఖరీదుగా ఇవ్వబడింది అనేకథ బ్రాహ్మణాలలో తరచుగా చెప్పబడింది (ఐ.బ్రా. 1.27). ఋగ్వేదంలో సుమారు తొమ్మిదిసార్లు వచ్చిన పురంధి సమృద్ధికి అధిదేవత. ఆమె ఇంచుమించు అన్నిచోట్లా భగుడితోనూ, రెండుమూడుచోట్ల భగుడితోపాటు పూషుడు, సవితలతోనూ, ఒకచోట విష్ణువు, అగ్నులతోనూ కలిపి చెప్పబడింది. పురంధికి సంబంధించినదిగా సాధారణంగా భావించబడే అవెస్తాలోని పరెంది సంపదకీ సమృద్ధికీ అధిదేవతగా భావించబడుతోంది (చూ. యష్ట 8.38). కాని హిల్లెబ్రాంట్ (Hillebrandt) అభిప్రాయంలో పురంధి చైతన్యానికి అధిదేవత. సమృద్ధికి మరొక అధిదేవత ధిషణా; ఈమె ఋగ్వేదంలో సుమారు పన్నెండుసార్లు వచ్చింది. (ఋగ్వేదంలో పన్నెండుకన్న తక్కువచోట్ల వచ్చిన) <u>ఇళా</u> 'పుష్టి' ఆహుతులుగా ఇచ్చే పాలకీ నేతికీ వ్యక్తిత్వారోపం; అందువల్ల గోవుద్వారా లభించే సమృద్ధికి ఈమె ప్రతీక. బ్రాహ్మణాలలో 'ఇడా' గోవుకి పేరుకాకపోయినా గోవుతో సంబంధం కలదిగా తరచు చెప్పబడింది; నిరుక్తంలోని నిఘంటువు (2.11)లో ఇది

గోవుకిపర్యాయంగా ఇవ్వబడింది. ఆహుతి ఆధారంగా ఇళా ఘృతహస్తా 'నెయ్యిచేతులుగా కలది' (7.16.8); ఘృతపదీ 'నెయ్యిపాదాలుగా కలది' (10.70.8) అనిచెప్పబడింది. ఆప్రీసూక్తాలలో ఈమె 'సరస్వతీ', 'మహీ' లేక 'భారతీ'లతో ఒక త్రయంగా ఉంది. ఇళాయాస్పదే'పృష్టి(= యాగాగ్ని) స్థానంలో' అనేపదబంధంలో ఉద్దిష్టమైనది మౌలికార్థమా లేకవ్యక్తిత్వారోపమా అనేది సందేహాస్పదం. అగ్ని 'ఇళా' కొడుకు అని ఒకచోట (ఇళాయా స్పుత్రః, 3.29.3, 4) చెప్పబడింది; ఇది అగ్ని పుట్టేచోటుకి స్మారకం అనేది స్పష్టం (★సాయణుడు దీనికి 'ఉత్తరవేద్యాః ఉత్పన్నః' (ఉత్తరవేదినించి పుట్టినవాడు) అని అర్థం ఇచ్చారు). పురూరవుడు (పురూరవస్-) కూడా ఆమె కొడుకు అని చెప్పబడింది (10.95.18). ఒకచోట (5.41.19) ఆమెగుంపుకి తల్లి (యూథస్యమాతా; ★ ఆవుల గుంపు / మరుత్తుల గుంపు అని సాయణ వ్యాఖ్య) అనీ, ఉర్వశీ- అనీ చెప్పబడింది. ఒకచోట (7.44.2) దధిక్రావన్-కినమస్కరిస్తూ (హవిస్సు రూపం కల) దేవి అయిన ఇళని దర్భలమీద పెట్టి అశ్వినులని ప్రాతఃకాలయజ్ఞంలో ఆహ్వానిస్తాము అని ఉంది. శ.బ్రా.లో ఆమె మనువుకి (1.8.1.8; 11.5.3.5), మిత్రావరుణులకి (1.8.1.27; 14.9.4.27; ఆ.శ్రౌ.సూ. 1.7.7) పుత్రికఅని ఉంది. బృహద్దివా అనే స్త్రీదేవత పేరు విశ్వేదేవతలకి ఉద్దేశించినసూక్తాలలో నాలుగుసార్లు వచ్చింది. ఆమె తల్లి అనిచెప్పబడింది (10.64.10); ఇళతోపాటూ (2.31.4; 5.41.19), సరస్వతి, రాకలతోపాటూ (5.42.12) కలిపిచెప్పబడింది. రాకా- (బహుశా ఇది రా- 'ఇచ్చు' అనే ధాతువునించి వచ్చినదికావచ్చు) సంపదా, దానగుణమూ కల దేవతా ఇతరదేవతలతోపాటు ఋగ్వేదంలో రెండుచోట్ల (2.32.7; 5.42.12) మాత్రం స్తుతించబడింది. సినీవాలీ- రెండు ఋగ్వేదసూక్తాలలో (2.32; 10.184) స్తుతించబడింది. ఆమె దేవతల సోదరి, విశాలమైన పిరుదులు కలది, అందమైనచేతులూ, వేళ్లూ కలది; వృద్ధి పొందేది; కుటుంబానికి పెద్ద; సంతానం కోసం ప్రార్థించబడింది. ఆమె సరస్వతి, రాక, గుంగు (గుంగూ-; ఈమె ప్రసక్తి ఈ ఒక్కచోటే (2.32.8) ఉంది) లతోపాటు ప్రార్థించబడింది (★గుంగూ- అంటే కుహూ- అని సాయణుడు). అథర్వవేదం (8.46.3) లో సినీవాలి విష్ణువు భార్య అని చెప్పబడింది. అర్వాచీనసంహితలలోనూ బ్రాహ్మణాలలోనూ కుహూ- అనేదేవత ప్రసక్తి ఉంది; ఈమె వృద్ధిపొందే చంద్రుడికి వ్యక్తిత్వారోపం. అర్వాచీనవైదిక గ్రంథాలలో రాకకీ సినీవాలికీ చంద్రుడి పరిణామ దశలతో సంబంధం ఏర్పరచబడింది; రాక పౌర్ణమికీ,

సినీవాలి పాడ్యమికీ అధిదేవతలు. ఋగ్వేదంలో ఇటువంటి సంబంధం చెప్పబడిందనడానికి ఆధారం ఏమీలేదు.

43.2 ఋగ్వేదంలో అక్కడక్కడ చెప్పబడిన మరికొందరు స్త్రీ దేవతల ప్రసక్తి ఈ గ్రంథంలో ఇంతకుముందే సందర్భవశాత్తూ వచ్చింది. మరుత్తుల తల్లి అయిన పృశ్ని- (అధ్యాయం 29.1) రంగురంగుల తుపాను మేఘానికి ప్రతీక అయింది. ఈపదం 'రంగు మచ్చలుకల' అనేఅర్థంలో (చూ. 7.103.6, 10) విశేషణంగా కూడా వాడబడింది; ఇది ఏకవచనంలో ఎద్దుకీ, ఆవుకీ, బహువచనంలో ఇంద్రుడికిసోమాన్ని ఇచ్చే ఆవులకీ విశేషణంగా వచ్చింది(1.84.10, 11; 8.6.19; 8.7.10; 8.69.3). ఈవిధంగా దీనికి 'రంగుమచ్చలు కల ఆవు' అనీ చివరికి 'రంగుమచ్చలు కల మేఘం' అనీ అర్థాలు ఏర్పడ్డాయి. సరణ్యూ- త్వష్ట కూతురూ వివస్వత్తు భార్యా అయిన దేవతకి పేరుగా ఋగ్వేదంలో ఒకచోట (10.17.2) వచ్చింది. ఈమె సూర్యుడికి సంబంధించిన స్త్రీ అయిన సూర్య కాని ఉషస్సు కాని అయి ఉంటుందనే వివరణే అన్నింటికన్నా ఎక్కువ సమంజసమైనది. ఋగ్వేదంలో ఈపదం 'వేగవంతమైన' అనే అర్థంలో విశేషణంగా నాలుగుచోట్ల వచ్చింది. ఇది సరణ- 'వేగం' (< ధాతువు సృ- 'ప్రసరించు, పరిగెత్తు') అనే శబ్దానికి -యు ప్రత్యయం చేర్చడం వల్ల ఏర్పడింది; ఈ నిర్మాణం చరణ్- యు వంటి మరికొన్ని శబ్దాలలో కూడా భాషలో సాధారణంగా కనపడేదే.

43.3 గొప్ప పురుషదేవతలకి భార్యలయిన స్త్రీ దేవతలకి కూడా వేదాలలో ఏమీ ప్రాధాన్యం లేదు. వారు ఇంద్రాదుల భార్యలుగానే తప్ప ప్రత్యేక స్వభావం ఏదీ ఉన్నవారుగా చెప్పబడలేదు. వారిపేర్లు తప్ప వారినిగురించి విశేషాలు ఏవీ చెప్పబడలేదు; ఆ పేర్లు కూడా పురుషదేవతపేరుకి - ఆనీ అనే స్త్రీ ప్రత్యయం (★- ఆన్- (ఆనుక్) ఆగమం+ - ఈ స్త్రీ ప్రత్యయం) చేర్చడం వల్ల ఏర్పడ్డవే. ఉదాహరణకి, ఇంద్రాణీ ఇంద్రుడి భార్య. వరుణానీ, అగ్నాయీ కూడా ఋగ్వేదంలో వస్తారు కాని చాలా అరుదుగా వస్తారు. సూత్రగ్రంథాల కాలం వరకూ రుద్రాణీ శబ్దం కనపడదు; కాని యజ్ఞంలో - ఆనీ ప్రత్యయం కల ఇతర దేవతలకికన్న ఈమెకి చాలా ముఖ్యమైన పాత్రే ఉంది. అశ్వినుల భార్య ఋగ్వేదంలో ఒకచోట అశ్వినీ (= సూర్యా, అధ్యాయం 21.8) అని చెప్పబడింది. ఋగ్వేదంలో అరుదుగా చెప్పబడిన 'దేవతల పత్నుల'కి (దేవానాం పత్నీః) యజ్ఞంలో పురుష

దేవతలతోపాటు ముఖ్యమైన స్థానం ఉన్నట్లు బ్రాహ్మణాలలో చెప్పబడింది (శ.బ్రా. 1.9.2.11).

# ఊ. దేవతా ద్వంద్వాలు

## 44. దేవతా ద్వంద్వాలు

44.1 వేదాలలో గాథాతత్త్వంలో ఒక విశిష్టలక్షణం ఇద్దరు దేవతల పేర్లని జంటగా ఒక సమాసంలో కలిపి స్తుతించడం; ఇటువంటి సమాసాన్ని దేవతాద్వంద్వం అంటారు. దేవతాద్వంద్వలోని రెండుపేర్లూ ద్వివచనంలో ఉంటాయి; రెండు పేర్లలోనూ ఉదాత్తమైన అచ్చు ఉదాత్తంగానే మిగిలి ఉంటుంది (★సాధారణంగా ఒకసమాసంలో దాని అవయవ పదాల ఉదాత్తత పోయి సమాస మంతటికీ ఒకే ఒక అచ్చు (సాధారణంగా చివరిది) ఉదాత్తమవుతుంది కాబట్టి దేవతాద్వంద్వం దీనికి అపవాదం); దేవతాద్వంద్వంలో పదాల మధ్య వేరే పదం వచ్చి అది విడిగా ఉండడం కూడా అరుదుగా జరుగుతుంది (సాధారణ సమాసాలలో ఇది అసంభవం). ఋగ్వేదంలో అథమపక్షం అరవై సూక్తాలలో సుమారు పన్నెండుగురు దేవతలు ఇలా జంటలుగా స్తుతించబడ్డారు. ఇంద్రుడిపేరు ఏడుగురు ఇతర దేవతలపేర్లతో దేవతా ద్వంద్వంలో కలుస్తుంది; అంటే, మొత్తం ఉన్న జంటలలో సగంకన్న ఎక్కువ వాటిలో ఇంద్రుడిపేరు ఉందన్నమాట. కాని ఎక్కువ సూక్తాలు - ఇరవై మూడు పూర్తివీ, మరికొన్నింటిలో భాగాలూ- మిత్రావరుణులకి (మిత్రావరుణా) ఉద్దిష్ట మయ్యాయి. పదకొండు ఇంద్రాగ్నులకీ (ఇంద్రాగ్నీ), తొమ్మిది ఇంద్రావరుణులకీ (ఇంద్రావరుణా), సుమారు ఏడు ఇంద్రవాయువులకీ (ఇంద్రవాయూ), ఆరు ద్యావాపృథువులకీ (ద్యావాపృథివీ), రెండేసి ఇంద్రాసోములకీ (ఇంద్రాసోమా), ఇంద్రా బృహస్పతులకీ (ఇంద్రాబృహస్పతీ), ఒక్కొక్కటి ఇంద్రా విష్ణువులకీ (ఇంద్రావిష్ణూ), ఇంద్రాపూషులకీ (ఇంద్రాపూషణా), సోమాపూషులకీ (సోమాపూషణా), సోమారుద్రులకీ (సోమారుద్రా), అగ్నీషోములకీ (అగ్నీషోమా) ఉద్దిష్టమయ్యాయి.[1] మరికొందరు దేవతలు జంటలుగా విడి మంత్రాలలో స్తుతించబడ్డారు; ఇటువంటి జంటలలో పైన చెప్పబడిన వారిపేర్లు కాక మరి తొమ్మిది పదిమంది దేవతలపేర్లు కూడా ఉన్నాయి. అవి

1. వైదికభాషలో ప్రథమా ద్వితీయా విభక్తుల ద్వివచన రూపంలో ప్రత్యయమైన - ఔ బదులు - ఆ ప్రచురంగా ఉంటుంది; సోమశబ్దంలో సకారం ఇకారం తరవాత షకారంగా మారుతుంది.

ఇంద్రనాసత్యా, ఇంద్రాపర్వతా, ఇంద్రామరుతః, అగ్నీపర్జన్యా, పర్జన్యావాతా (ఒకచోట వాతాపర్జన్యా), ఉషాసానక్తా / (అరుదుగా నక్తోషసా 'రాత్రీ, ఉషస్సూ'), సూర్యామాసా / సూర్యాచంద్రమసా.

44.2 ప్రచురమైన ఈ దేవతా ద్వంద్వసమాస నిర్మాణానికి ద్యావాపృథివీ 'స్వర్గమూ, భూమీ' మూలాధారం అనడంలో సందేహం లేదు. ప్రాచీన మానవుడి భావనలలో ఈ రెండింటికీ ప్రకృతిలో చాలా అవినాభావ సంబంధం ఉన్నట్లు ఊహించడం వల్లనే ఈ రెండింటికీ వివాహం జరిగింది అనే కథ అనేక ప్రాచీన జాతుల వారి సాహిత్యాలలో కనిపిస్తుంది. అందువల్ల ఈ రెండూ భార్యాభర్తల జంట అనే భావన మూల ఇండో-యూరోపియన్ భాష శాఖలుగా చీలడానికి ముందు కాలంలోనే ఉండి ఉండి వేదాలలోకి అనుస్యూతంగా వచ్చి ఉంటుంది. ఋగ్వేదంలో కూడా ఈ రెండింటికీ ఎంత సన్నిహిత సంబంధం ఉందో ఈకింది విషయాలవల్ల తెలుస్తుంది: ఇవి జంటగా ఆరు సూక్తాలలో స్తుతించబడి ఉండగా ద్యౌస్‌ని (= స్వర్గాన్ని) విడిగా స్తుతించే సూక్తం ఒకటి కూడాలేదు; మూడు మంత్రాలుకల ఒకసూక్తం (5.84) మాత్రం పృథివిని స్తుతించేది. ఈ సూక్తంలో కూడా పృథివి తనమేఘంలోని జలాలని ఆకాశంనించి వర్షిస్తుంది అని స్తుతించబడిందంటే (య త్తే అభ్రస్య విద్యుతో దివో వర్షంతి వృష్టయః, 5.84.43) కవులకి ఈ రెండింటినీ విడదియ్యడం ఎంత కష్టమయిందో తెలుస్తుంది. పైగా, ఈ దేవతా ద్వంద్వ సమాసం దేవతాపేరుగా ద్యౌస్ అనేశబ్దం కన్న చాలా తరచుగా ప్రయుక్తమయింది. ఇదీ దీని సమానార్థకాలైన ద్యావాక్షామా, ద్యావాభూమీ (ఇవి అరుదుగా వచ్చేవి) అనేవీ కలిసి సుమారు వందసార్లు వచ్చాయి; మిగిలిన జంటల ప్రయోగాల సంఖ్యకన్న ఈ సంఖ్య చాలా ఎక్కువ. స్వర్గమూ, భూమీ కలిపి రోదసీ 'రెండు లోకాలు' అని కూడా చెప్పబడ్డాయి; ఇది ఋగ్వేదంలో అధమపక్షం వందసార్లు వచ్చింది (రోదసీ శబ్దం స్త్రీలింగమవడం వల్ల ద్యావాపృథువులు యువతీ 'యువతులు', స్వసారా 'అక్కచెల్లెళ్లు' అని చెప్పబడ్డాయి, 1.185.5). స్వర్గమూ భూమీ (అందరికీ) తల్లిదండ్రులు కాబట్టి అవి పితరా '(తల్లి)తండ్రులు', మాతరా 'తల్లులు', జనిత్రీ 'తల్లులు' అని చెప్పబడ్డాయి; ద్యౌస్‌ని తండ్రీ! (పితః) అనీ, భూమిని తల్లీ! (మాతః) అనీ విడిగా సంబోధించడం కూడా ఉంది (1.159.1-3; 1.160.2). వారు విశ్వానికంతటికీ పూర్వులైన తల్లితండ్రులు (పూర్వజే పితరా, 7.53.2; 10.65.8). ఐ.బ్రా.లో వారి వివాహం ప్రసక్తి ఉంది (4.27.5-6). వారు అన్ని ప్రాణులనీ సృష్టించి

పోషిస్తారు (1.159.2; 1.160.2; 1.185.1). వారు చలనంలేని వారూ, కాళ్లులేనివారూ అయినా కాళ్లు ఉండి చరించే పెద్దసమూహాన్నిగర్భంలో భరిస్తారు (భూరిం ద్వే అచరంతీ చరంతం పద్వంతంగర్భ మపదీ దధాతే, 1.185.2). వారు దేవతలకి కూడా తల్లితండ్రులే; దేవపుత్రే 'దేవతలు పుత్రులుగా కలవారు' (7.53.1) అనే విశేషణం వారికే చెందుతుంది. వారు బృహస్పతికి తల్లితండ్రులు అని విశేషించి చెప్పబడ్డారు (7.97.8); వారూ, నీళ్లూ, త్వష్టా కలిసి అగ్నిని పుట్టించారు (10.2.7). ఇది ఇలా ఉండగా మరికొన్ని సందర్భాలలో వీరిని ఇతర దేవతలు కొందరు పుట్టించినట్లు చెప్పబడింది. ఉదాహరణకి, ఒక కవి (దీర్ఘతముడు) ఇలా అన్నారు: ''రోదసిని ఏ దేవుడు పుట్టించాడో ఆయన దేవతలందరిలోకీ గొప్ప నేర్పరి'' (అయం దేవానా మపసా మపస్త మోయో జజాన రోదసీ, 1.160.4; 4.56.3). ఇంద్రుడు వారిని పుట్టించినట్లు చెప్పబడింది (6.30.5; 8.36.4; 10.29.6; 10.54.3). వారిని విశ్వకర్మ పుట్టించాడు (10.81.2; చూ. అ.వే. 12.1.60). వారికి త్వష్ట రూపాలు కల్పించాడు (10.110.9). పురుషసూక్తంలో చెప్పబడిన పురుషుడి తలనించి స్వర్గమూ/ ఆకాశమూ, పాదాలనించి భూమీ పుట్టింది (శీర్ష్ణో ద్యౌః సమవర్తత, పద్భ్యాం భూమిః, 10.90.14). కాని ఒక కవి (అగస్త్యుడు) ''వీటిలో ఏది ముందు పుట్టినది? ఏది తరవాత పుట్టినది? ఇవి ఎలా పుట్టేయి? కవులారా! (ఈ విషయం) ఎవరికి తెలుసు?'' (కతరా పూర్వా కతరా పరాయోః కథాజాతే కవయః కో వివేద, 1.185.1, అయోః = వీటిలో) అని ఆశ్చర్యం వెలిబుచ్చారు (చూ. అధ్యాయం 8.8). ద్యావాపృథువులకి వాడబడిన విశేషణాలలో అనేకం వాటి ప్రకృతి లక్షణాల వల్ల (కవుల మనస్సులకి) తట్టినవి. వీటిలో ఒకటి మంచిరేతస్సు కల వృషభం (వృషభం సురేతసం, 1.160.3), ఇంకొకటి రంగు మచ్చలుకల ఆవు (ధేనుంచ పృశ్నిం). రెండూ ఉత్పాదకశక్తి కలవి (1.159.2; 6.70.1, 2). అవి పాలూ, నెయ్యి, తేనే సమృద్ధిగా ఇస్తాయి (6.70.1-5), అమృతాన్ని పుట్టిస్తాయి (1.159.2; 1.185.6). వాటికి ముసలితనం లేదు (అజరే, 6.70.1). అవి గొప్పవి (1.159.1), విశాలమైనవి (1.160.2); విశాలమైన గొప్ప నివాసస్థానాలు (1.185.6). అవి అందమైన రూపం కలవి (సుప్రతీకే), విస్తీర్ణమైనవి, పెద్దవి, చివరలు దూరంలో ఉన్నవి (దరే అంతే, 1.185.6, 7). కాని కొన్నిచోట్ల వీటికి ప్రాణులకుండే లక్షణాలు ఆపాదించబడ్డాయి. వారు తెలివైనవారు; ధర్మాన్ని వృద్ధిచేస్తారు (1.159.1). తల్లితండ్రులుగా వారు ప్రాణులని కాపాడతారు (1.160.2); వారిని అవమానంనించీ

ఆపదనించీ తప్పిస్తారు (1.185.10). వారు ఆహారమూ, సంపదా (6.70.6; 1.159.5), గొప్పకీర్తి, అధికారమూ (1.160.5) ఇస్తారు. వీరి విషయంలో వ్యక్తిత్వారోపం వీరు యజ్ఞానికి నాయకులని చెప్పడానికీ, వీరు యజ్ఞశాల చుట్టూ కూచుంటారని ఊహించడానికీ (4.56.2,7), స్వర్గనివాసులతోపాటు భక్తుల దగ్గరకి వస్తారనీ (7.53.2), యజ్ఞాన్ని దేవతల దగ్గరకి తీసుకువెళ్తారనీ (2.41.20) చెప్పడానికీ మాత్రమే పరిమితం. అంతేకాని స్వర్గానికీ భూమికీ జీవంగల పూర్తి వ్యక్తిత్వం గాని యజ్ఞంలో ప్రాధాన్యం గాని లభించలేదు. ఈ ఇద్దరు దేవతలూ సమానస్థాయి కలవారు. కాని మిగిలిన జంటలు చాలావాటిలో ఒక దేవత ఎక్కువ ప్రాధాన్యం కలవాడుగా ఉండి ఆయన లక్షణాలు రెండో దేవతకి కూడా ఆపాదించబడతాయి. ఉదాహరణకి, ఇంద్రాగ్నులు జంటగా వజ్రం ఆయుధంగా కలవారనీ వృత్రుణ్ణి చంపినవారనీ చెప్పబడ్డారు. తక్కువస్థాయి దేవత లక్షణం ఆ జంటకి మొత్తంగా ఆపాదించబడడం కూడా అరుదుగా ఉంది. ఉదాహరణకి, ఇంద్రావిష్ణులిద్దరూ విశ్వమంతా వ్యాపించినట్లు చెప్పబడింది (ఇంద్రావిష్ణే.... ఉరు చక్రమాథే, 6.69.5). తరచు జంటగా ఉండడం వల్ల అందులో ఒకదేవతకి చెందిన లక్షణం రెండో దేవతకి విడిగా చెప్పబడినప్పుడు కూడా ఆపాదించబడడం కూడా ఉంది. ఉదాహరణకి, అగ్ని ఇంద్రుడితోపాటు కాక విడిగా స్తుతించబడినప్పుడు కూడా 'వృత్రహా' అని తరచు చెప్పబడ్డాడు. కాని కొన్ని సందర్భాలలో ఒక జంటలో దేవతలలో ఒక్కొక్కరి ప్రత్యేక లక్షణాలు విడిగా చెప్పబడ్డాయి (2.40.4, 5; 6.52.16; 6.57.2; 6.68.3; 7.36.2; 7.82.5, 6; 7.83.9; 7.84.2; 7.85.3).

44.3 ద్యావాపృథువుల తరవాత ప్రచురంగా కనపడే జంట మిత్రావరుణులు. వీరిని విడివిడిగా స్తుతించే సూక్తాలకన్న జంటగా స్తుతించే సూక్తాలే చాలా ఎక్కువ సంఖ్యలో ఉన్నాయి. మిత్రుడికి ఏమీ ప్రత్యేక లక్షణాలు లేకపోవడం వల్ల వరుణుడికి ప్రత్యేకమైన విశేషణాలూ, కృత్యాలే ఈ జంటకి కూడా ఆపాదించబడ్డాయి. అందువల్ల వరుణుడి విషయంలో ఇంతకుముందు చెప్పబడిన విశేషాలకి ఇక్కడ చేర్చవలసిందేమీ లేదు. ఈ జంట యువకులుగా భావించబడ్డారు (3.54.10; 7.62.5). చాలా ఇతర దేవతలలాగే, వీరూ ప్రకాశించేవారు (చంద్ర-), స్వచ్ఛమైనవారు (శుచి-), సూర్యుడివంటివారు (స్వర్దృశ్-), ఎర్రనివారు (రుద్ర-), భయంకరమైనవారు (ఘోర-) అని చెప్పబడ్డారు. సమాసంలో మిత్రుడిపేరు మొదట ఉండడం వల్ల మొదట్లో ఆయన ఎక్కువ ప్రాముఖ్యం కలవాడేమో అనుకోవడానికి అవకాశం ఉంది; కాని ఈ శబ్దం ముందు ఉండడడానికి

ద్వంద్వ సమాసంలో చిన్నమాట సాధారణంగా ముందు ఉండాలి అనే నియమమే కారణమై ఉండవచ్చు. అవెస్తాలో అహుర, మిత్ర అనే దేవతలిద్దరూ ఇలాగే కలిసి స్తుతించబడడం వల్ల ఈ దేవతాద్వంద్వం మూల ఇండో- ఇరానియన్ కాలానికి చెందినది.

44.4 విశ్వానికంతకీ సమ్రాట్టులైన (సమ్రాజో:, 1.17.1) ఇంద్రా వరుణులు నీటికి కాలవలు తవ్వేరు (అన్వపాం ఖాన్యతృంతం, 7.82.3), ఆకాశంలో సూర్యుణ్ణి ప్రేరించారు (సూర్యమైరయంత దివి). వారు వృత్రుణ్ణి చంపేరు (6.68.2). యుద్ధంలో సహాయం చేసి (4.41.11) విజయం ప్రసాదిస్తారు (1.17.7). వారు దుష్టుల మీద తను శక్తిమంతమైన వజ్రం వేస్తారు (4.41.4). వారు రక్షణా, సమృద్ధీ (1.17.7, 8), కీర్తీ, సంపదా, చాలా గుర్రాలూ ఇస్తారు (4.41.2, 10; 6.68.8). వారు సోమం తాగుతారు; వారి రథం యజ్ఞం దగ్గరకి వస్తుంది; వారు దర్భాసనం మీద కూర్చుని సోమం తాగి ఆనందించాలని ప్రార్థించబడ్డారు (6.68.10, 11). కొన్ని మంత్రాలలో ఈ జంటలో ఒక్కొక్కరి ప్రత్యేక లక్షణాలు వేరు వేరుగా చెప్పబడ్డాయి. ఉదాహరణకి, వరుణుడు తన కోపాన్ని భక్తుల మీద చూపకూడదనీ, ఇంద్రుడు వారికి విశాల ప్రదేశాలు ఇవ్వాలనీ (7.84.2) ప్రార్థన ఉంది. వృత్రుణ్ణి చంపే యుద్ధప్రియుడైన ఇంద్రుడికీ మనుష్యులకి శాంతినీ జ్ఞానాన్నీ ప్రసాదించే వరుణుడికీ భేదం చెప్పబడింది (6.68.3; 7.82.5, 6; 7.85.3). ఇంద్రాగ్నుల సాహచర్యం చాలా సన్నిహితమైనది; ఇంద్రుడు ఇతర దేవతలతో కన్న అగ్నితోనే ఎక్కువ సూక్తాలలో స్తుతించబడ్డాడు; అగ్ని ఇతరత్రా ఒక సూక్తంలోనూ రెండు విడి మంత్రాలతోనూ సోముడితోనూ, ఒక మంత్రంలో పర్జన్యుడితోనూ దేవతాద్వంద్వంలో కలిపి స్తుతించబడ్డాడు. సోమం తాగేవారిలో ఉత్తములైన (సోమపాతమా, 1.21.1) ఇంద్రాగ్నులు సోమం తాగడానికి రథం మీద వస్తారు (1.108.1); వారు సోమం తాగడానికి కలిసి రావాలనీ (7.93.6; 8.38.4,7-9), యజ్ఞంలో దర్భాసనం మీద కూర్చొని సోమం తాగి ఆనందించాలనీ (1.109.5) ప్రార్థన ఉంది. వారు వృత్రుణ్ణి చంపుతారు; వారికి వజ్రాయుధం ఉంది (6.59.3, మొ.); వారి మెరుపు తీక్ష్ణమైనది (తిగ్మా దిద్యు న్మఘోనో:, 5.86.3) పురాలని భేదించేవారు యుద్ధాలలో సహాయం చేస్తారు (1.109.7, 8). వారిద్దరూ కలిసి దాసుడి 90 పురాలు నాశనం చేశారు (ఇంద్రాగ్నీ నవతిం పురో దాసపత్నీ రధూనుతం, సాకమేకేన కర్మణా, 3.12.6; దాసపత్నీః = దాసుడు పతిగా కలవి); వారు యుద్ధంలో అజేయుడు (5.86.2). వారు నదులకి బంధాలు తొలగించారు (8.48.8), కలిసి

వీరకృత్యాలు చేశారు (1.108.5). వారు దానశీలం కలవారు (5.86.3). ఈ లక్షణాలన్నీ ఇంద్రుడికి ప్రత్యేకమైనవి. ఇంద్రాగ్నులు యజ్ఞానికి పురోహితులనీ (యజ్ఞస్యహిస్థ ఋత్విజా, 8.38.1), జ్ఞానవంతులనీ (కవీ, 8.40.3) చెప్పబడ్డారు. వారు గృహానికి పతులు (సదసస్పతి), దెయ్యాలని పారదోలేవారు (1.21.5). ఈ లక్షణాలు ముఖ్యంగా అగ్నికి చెందినవి. ఈ ఇద్దరు దేవతలకీ తండ్రి ఒకడే; వీరు కవలలు (సమానో వాం జనితా భ్రాతరా యువం యమౌ, 6.59.2; యమౌ = కవలలు). ఒకచోట వీరు అశ్వినులు అని చెప్పబడ్డారు (1.109.4); బహుశా వారి పరస్పర సాన్నిహిత్యాన్ని సూచించడానికి ఇలా చెప్పబడి ఉండవచ్చు. వారు ఆహారమూ, సంపదా, బలమూ, పశువులనీ, గుర్రాలనీ ఇస్తారు (4.60.13-14). వారు స్వర్గం, భూమీ, నదులూ, పర్వతాలకన్న గొప్పవారు (1.109.6). దస్యులని ఇంద్రుడు చంపేడనీ, అగ్ని కాల్చాడనీ (అహన్నింద్రో అదహదగ్నిరిందో పురా దస్యూన్, 4.28.3) వీరిద్దరికీ భేదం చెప్పబడింది; ఈ మంత్రంలో వీరు దేవతాద్వంద్వంగా లేరు. ఇంద్రాబృహస్పతులని స్తుతించే రెండు సూక్తాలలో (4.49; 7.97) ముఖ్యాంశం వారిని సోమం తాగడానికి రమ్మని ఆహ్వానించడమూ, చాలా గుర్రాలతోపాటు సంపదా, దైవచింతనా కలిగించమని ప్రార్థించడమూ. ఇంద్రవాయువులని సోమం తాగడానికి రమ్మని ఆహ్వానించడమే తప్ప (1.23.1-2, మొ.) వారిని గురించి మరేమీ చెప్పబడలేదు. వారు వారి గుర్రాల మీద యజ్ఞానికి వస్తారు (4.47.2-4), వారు బంగారు ఆసనం కల (హిరణ్యబంధురం) రథం మీద వస్తారు (4.46.4); దర్భాసనం మీద కూర్చుంటారు (7.91.4). వారు వెయ్యి కన్నులు కలవారు, భక్తికి పతులు (ధియస్పతీ), 1.23.3), శక్తికి పతులు (శవసస్పతీ, 4.47.3). వారు యుద్ధంలో సహాయం చేస్తారు (7.92.4); అశ్వసంపదా, పశుసంపదా, బంగారమూ ఇస్తారు (7.90.6). ఇంద్రాసోములు ఇద్దరూ కలిసి ఇంద్రుడు చేసినట్లు తరచుగా చెప్పబడిన వీరకృత్యాలూ, ప్రపంచానికి సంబంధించిన గొప్ప కృత్యాలూ చేసినట్లు చెప్పబడింది. వారు మానవుడికోసం నీళ్ల ప్రవహించేటట్టు చేశారు, ఏడు నదులకీ అడ్డులు తొలగించారు, పాముని చంపేరు. సూర్యుడి చక్రం తొలగించారు (త్వాయుజా నిఖిదత్సూర్యస్యేంద్రశ్చక్రం సహసా సద్య ఇందో, 4.28.2, 1; 6.72.3). దానశీలురైన ఈ దేవతలు నిజంగా చేసిన గొప్పపని శత్రువులని చంపి రాతి వెనకాల ఉన్నదాన్ని బయటికి తియ్యడం (4.28.4, 5). వారు ప్రపంచోత్పత్తిలో మొట్టమొదట జరిగిన అద్భుతకార్యాలు - సూర్యుణ్ణీ కాంతినీ బయట

తేవడం, చీకటిని పోగొట్టడం, సూర్యుడు ప్రకాశించేటట్టు చెయ్యడం, స్వర్గాన్ని నిలబెట్టడం, భూమిని విశాలం చెయ్యడం - చేశారు (6.72.1, 2). వారు అపక్వమైన ఆవుల పొదుగుల్లో పక్వమైన పాలు పెట్టేరు (6.72.4). వారు మనుష్యులకి జయం పొందే శక్తి ప్రసాదిస్తారు (6.72.5). సోమానికి ఆధారభూతులూ, ఆనందపారవశ్యానికి పతులూ (మదపతీ) అయిన ఇంద్రావిష్ణులు వారి గుర్రాలతో వచ్చి సోమం తాగి కడుపులు నింపుకోవాలని ప్రార్థించబడ్డారు. సోమంవల్ల వచ్చినపారవశ్యంతో వారు విశ్వమంతా వ్యాపించారు; అంతరిక్షాన్ని విశాలం చేశారు; మనుష్యుల నివాసం కోసం ప్రదేశాలని విశాలం చేశారు. విజయశీలురైన ఆ ఇద్దరూ సంపద ఇస్తారు; ఆపదలలోంచి తప్పించి బయటకి తీసుకువస్తారు. ప్రార్థనలకి ఉత్పాదకులైనవారు భక్తుల స్తుతులు వినాలని ప్రార్థించబడ్డారు (6.69). ఇంద్రాపూషులు దేవతాద్వంద్వంగా ఒకే ఒక చిన్న సూక్తంలో (6.57) స్తుతించబడ్డారు; ఈ దేవతా ద్వంద్వం రెండుసార్లు మాత్రమే ఉపయుక్తమైంది. ఇంద్రుడు నీళ్లు ప్రవహించేటట్టు చేసినప్పుడు పూషుడు ఆయన సహచరుడు. ఆయన తోడుతో ఇంద్రుడు వృత్రులని చంపుతాడు (6.56.2). వీరిలో ఒకరు సోమం తాగుతారు; రెండు గుర్రాలు లాగే రథంమీదవెళ్లి వృత్రులని చంపుతారు; మరొకరికి జావ (కరంభ- ★''నేతితో కలిపిన పిండి'' అని సాయణుడు) అంటే ప్రీతి; ఈయన వాహనాలు మేకలు (అజా అన్యస్య వహ్నాయః, 6.57.2, 3). ఇంద్రాపూషుల స్థానం (పాథస్-) గురించిన ప్రసక్తి ఒకచోట (1.162.2) ఉంది; అక్కడికి యజ్ఞాశ్వాన్ని ఒకమేక తీసుకువెళ్తుంది (ఏషభాగః పురో అశ్వేన వాజినా పూష్ణో భాగో నీయతే విశ్వదేవ్యః, 1.162.3). వీరి విషయంలో కూడా క్షేమమూ, సంపదా ఇవ్వాలని సర్వసాధారణమైన ప్రార్థన ఉంది.

44.5 **సోమాపూషులు** (2.40) చీకటిని పారదోలతారు; మనస్సువల్లనే సన్నద్ధం చెయ్యబడే (మనసాయుజ్యమానం) ఏడు చక్రాలూ ఐదు పగ్గాలూ (సప్తరశ్మిం) కల రథాన్ని వారు ప్రయాణోన్ముఖం చెయ్యాలని ప్రార్థించబడ్డారు; అది విశ్వాన్నంతటినీ కొలుస్తుంది. వారు సంపదనీ, స్వర్గాన్నీ, భూమినీ పుట్టించినవారు; లోకానికి రక్షకులు (చూ. 10.17.3); వారిని దేవతలు అమర్త్యత్వానికినాభి (= కేంద్ర)గా చేశారు. వారికోసం అపక్వమైనగోవులలో పక్వమైన పాలు ఉంచాలని ఇంద్రుడు ప్రార్థించబడ్డాడు. వారిద్దరూ కలిసి శత్రువిజయం కలిగిస్తారు; సంపదా, ఆహారమూ సమృద్ధిగా ఇస్తారు. వారిద్దరి మధ్యా ఉన్న భేదంకూడా చెప్పబడింది. వారిలో ఒకరు ఉన్నతమైనస్వర్గంలో స్థానం చేసుకొన్నారు;

మరొకరు భూమిమీదా, అంతరిక్షంలోనూ ఉంటారు (4); ఒకరు అందరినీ పుట్టించారు; మరొకరు అందరినీ చూస్తూ ప్రయాణిస్తారు (5). సోమారుద్రులు (6.74) రోగాన్నీ, క్షీణతని ఇంట్లోంచి పోగొట్టాలనీ, భక్తుల శరీరాలలో రోగనివారణ ఉంచాలనీ, పాపం పోగొట్టాలనీ, వరుణపాశాలనించి తప్పించాలనీ ప్రార్థించబడ్డారు. వాడి అయిన ఆయుధాలు కల ఆ ఇద్దరూ దయ చూపాలనీ మనుష్యుడికీ జంతువుకీ వృద్ధి కలిగించాలనీ ప్రార్థించబడ్డారు. అగ్నీషోములు నదులకి అడ్డులు తొలగించి వాటిని విడిపించినందుకూ, కాంతిని సాధించినందుకూ, ప్రకాశించే గ్రహాలనీ నక్షత్రాలనీ ఆకాశంలో స్థాపించినందుకూ స్తుతించబడ్డారు. వారి ఇద్దరి మధ్యా భేదం కూడా చెప్పబడింది; ఒకరిని మాతరిశ్వుడు స్వర్గాన్నించి తీసుకువస్తే మరొకరిని గద్ద రాతినించి తీసుకువచ్చింది (1.93.). వారు ఇద్దరూ కలిసి సహాయమూ రక్షణా ఇవ్వాలనీ, పశువులనీ, గుర్రాలనీ, సంతానాన్నీ, ఆరోగ్యాన్నీ, సుఖాన్నీ, సంపదనీ ప్రసాదించాలనీ ప్రార్థనలు ఉన్నాయి (10.19.1; 10.66.7). ఈ దేవతాద్వంద్వం అథర్వవేదంలో కొంతతరచుగా స్తుతించబడింది. మై.సం. (3.7.1) లో వీరిద్దరూ 'రెండుకళ్లు' అని చెప్పబడింది. శ.బ్రా. (11.16.19) వీరిద్దరూ సోదరులనీ సూర్యుడు అగ్నికీ, చంద్రుడు సోముడికీ చెందినవారనీ (1.6.3.24) చెప్తుంది. యజ్ఞంలో అగ్నీషోములకి సోమంలో భాగం ఉన్నట్లు కనపడదు; వీరికి పురోడాశమూ, జంతుబలీ మాత్రమే అర్పించబడుతుంది. యజ్ఞంలో చాలా ముఖ్యత్వం ఉన్న ఈ ఇద్దరు దేవతలూ (శ్రౌతగ్రంథాలలో ఈ దేవతా ద్వంద్వం చాలా ప్రచురంగా కనపడుతుంది) ఋగ్వేదంలో, వీరికి ఉద్దిష్టమైన ఒకసూక్తం (1.93) లో తప్ప, ద్వంద్వంగా మరి రెండుసార్లు మాత్రమే, అదీ చాలా అర్వాచీనభాగంలో మాత్రమే, స్తుతించబడడం కొంతగమనించదగిన అంశం.

44.6 మరికొన్ని జంటలు విడివిడి మంత్రాలలోనే స్తుతించబడ్డాయి. అగ్నీపర్జన్యులు ఒకమంత్రం (6.52.16) లో ఆహారమూ సంతానమూ ఇమ్మని ప్రార్థించబడ్డారు. వీరిద్దరి మధ్యా భేదం కూడా చెప్పబడింది; ఒకరు (పర్జన్యుడు) ఆహుతినీ (ఇళాం) మరొకరు సంతతినీ (గర్భం) పుట్టించినవారని చెప్పబడింది. (★ ఇళా = అన్నం అని సాయణుడు). పర్జన్యవాతుల ప్రార్థన నాలుగు మంత్రాలలో ఉంది. భూమికి సంబంధించిన వృషభాలైన ఈ ఇద్దరూ నీటిఆవిరులని (పురీషిణీ) ప్రేరించాలని ప్రార్థించబడ్డారు (6.49.6). వారు ఆవిరిరూపులైన వృషభాలూగా (వృషభా పురీషిణా) ఇంద్రవాయువులతోనూ మరికొందరి

తోనూ కలిపి ప్రార్థించబడ్డారు (10.65.9).[2] వారు ఆహారసమృద్ధి ఇవ్వాలని మరికొందరు దేవతలతోపాటు ప్రార్థించబడ్డారు (6.50.12). మరొకచోట (10.66.10, చూ. నిరుక్తం 7.10) వారు ఉరిమే మహిషానికిసంబంధించినవారు (వాతాపర్జన్యా మహిషస్య తన్యతోః) అని చెప్పబడ్డారు (ఈ ఉరిమే మహిషం ద్యౌస్ కావచ్చు). **ఉషాసానక్తా** 'ఉషస్సూ, రాత్రీ' అనేజంటకి ప్రార్థనలు కొంత ప్రచురంగానేఉన్నాయి. ఈజంట విశ్వేదేవ / ఆప్రీసూక్తాలలో మాత్రమే ప్రచురంగా వస్తుంది. ఈ దేవులు సుభగలు (సుభగే 'మంచిధనం కలవారు', 2.31.5; 10.70.6), స్వర్గంలోని యువతులు (యోషణే దివ్యే, 7.2.6; 10.110.6), స్వర్గం యొక్క కూతుళ్లు (దివో దుహితరా, 10.70.6; 5.41.7). వారు భర్తల పిలుపువిని వచ్చే భార్యలలా వచ్చి వృద్ధి కలిగిస్తారు (1.122.2).[3] వారు పాలుకలవారు (పయస్వతీ, 2.3.6). ఆ ఇద్దరూ రంగులు మార్చుకొంటూ ఒకే శిశువుకి (= అగ్నికి) పాలు ఇస్తారు (నక్తోషాసా వర్ణమా మేమ్యానే ధాతపయేతే శిశుమేకం); ఆ శిశువు స్వర్గానికీ భూమికీ మధ్య ప్రకాశిస్తూ ఉంటాడు (1.96.5). వారు వేరువేరు రూపాలలో ఉన్న ఒకే మనస్సుకల అక్కచెల్లెళ్లు; వారి ఇద్దరిలోవా ఒకటే; అది అనంతమైనది; దేవతల ఆజ్ఞని అనుసరించి వారు వేరువేరు సమయాలలో చరిస్తారు; కలహించుకోరు; చలనరహితంగా ఉండరు (1.113.3)[4]. వారు ధర్మానికి తల్లులు (ఋతస్య మాతరా, 1.142.7); ప్రకాశించే కిరణాలతో ప్రతి యజ్ఞాన్నీ మనుష్యుడికోసం తీసకువస్తారు (5.41.7); బట్టను నేసి తయారుచేసేవారిలా యజ్ఞరూపాన్ని తయారుచేస్తారు (వయ్యేవ .... తంతుం తతం సంవయంతీ సమీచీ యజ్ఞస్యపేశః, 2.3.6; పేశః = రూపం). వారు వరాలు ఇచ్చేవారు, అందరిచేతా ఎక్కువగా ప్రార్థించబడేవారు, దర్భాసనం మీద కూర్చుంటారు (7.2.6). వారుగొప్పవారు (బృహతీ), అలంకారాలు ధరించినవారు (సుపేశసా ''మంచిరూపం కలవారు'' అని సాయణుడు, 10.36.1; 10.110.6; 1 .13.7; 1.142.7). ఒకరి తరవాత ఒకరు వస్తూ ప్రాణులనందరినీ లేపులారు (2.31.5). సూర్యుడూ చంద్రుడూ కలిసి **సూర్యామాసా** అని అయిదుచోట్లా సూర్యాచంద్రమసా అని మూడుచోట్లా

---

2. పురీషం అంటే ఉదకం అనీ, పురీషిణా అంటే ఉదకం కలవారు అనీ సాయణ వ్యాఖ్య.

3 ''వారు ఇద్దరు భార్యలవంటివారు'' అని మాత్రమే మూలవాక్యం; పైన ఇచ్చిన వాక్యం మంత్రానుసరణం.

4. సమానో అధ్వా స్వస్రో రనంతస్త మాన్యాన్యా చరతో దేవశిష్టే
న మేథేతే న తస్థతుః సుమేకే నక్తోషాసా సమనసా విరూపే
(సుమేకే = మంచి సంతానోత్పాదన శక్తి కలవారు).

చెప్పబడ్డారు. సూర్యుడి పేరు ఉన్న ద్వంద్వ సమాసాలు ఇవే. మనకళ్లకు కనపడే గ్రహాలే చాలాసందర్భాలలో ఉద్దిష్టమయ్యాయి. ఉదాహరణకి, మనం (బాగా) చూడగలిగేటందుకు వారు ఒకరితరవాత ఒకరు సంచరిస్తారు (అస్మే సూర్యాచంద్రమసాభిచక్షే.... చరతో వితర్తురం, 1.102.2) అనిచెప్పబడింది. సూర్యుడూ చంద్రుడూ ఒకరి తరవాత ఒకరు ఉదయించడం బృహస్పతి వల్ల జరిగింది (10.68.10). సూర్యచంద్రులని స్పష్టికర్త (ధాత) కల్పించాడు (సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్, 10.190.3). ఒక కవి (స్వస్త్యాత్రేయుడు) ఇలా అంటారు: ''సూర్యచంద్రులలా (మన) తోవలో సంచరిద్దాం'' (స్వస్తి పంథామను చరేమ సూర్యాచంద్రమసావివ, 5.51.15). కాని, ఇతర దేవతలతోపాటు వీరిని ప్రార్థించినచోటుల్లో వీరికి ప్రాథమికదశలో ఉన్న పురుషతారోపం కనపడుతుంది (10.64.3; 10.92.12; 10.93.5). కొన్ని మంత్రాలలో, పేర్లు లేకపోయినా, సూర్యచంద్రుల దేవతా ద్వంద్వమే ఉద్దిష్టమైందని స్పష్టంగా తెలుస్తుంది: ''మాయవల్ల ఒకరి తరవాత ఒకరు సంచరిస్తూ ఉంటారు; ఆడుకొనే (ఇద్దరు) పిల్లలు యజ్ఞానికి వస్తారు; ఒకరు లోకాలన్నీ చూస్తారు; మరొకరు ఋతువులని ఏర్పరుస్తూ మళ్లీ మళ్లీ పుడతారు'' (10.85.18).[5] ''వరుణుడి ప్రకాశించే రెండు కళ్ళు'' (? 8.41.9) అన్నప్పుడూ, ''అమర్త్యులు చేసిన స్వర్గం యొక్క రెండు కళ్లు'' (1.72.10) అన్నప్పుడూ ఉద్దిష్టమైనది వీరే అనడంలో సందేహం లేదు.

# ఎ. దేవతాగణాలు

## 45. దేవతాగణాలు

45.1 వైదిక గాథాతత్త్వంలో కొన్ని దేవతాగణాలకి గుర్తింపు ఉంది; ఈ గణాలు ఒక్కొక్క ముఖ్యదేవతతో సాహచర్యం కలిగి ఉంటాయి. వీటిలో ఎక్కువమంది సభ్యులు కలదీ, చాలా ముఖ్యమైనదీ మరుత్తుల గణం; ఋగ్వేదంలో వీరి సంఖ్య 21 అని ఒకచోటా 180 అని మరొకచోటా ఉంది (అధ్యాయం 29.1). వీరు ఇంద్రుడు చేసే వీరకృత్యాలలో ఆయనకి తోడుగా ఉంటారని పదేపదే చెప్పబడిందని ఇంతకుముందు చూశాం (అధ్యాయం 22.4). ఈ గణమే రుద్రులు అనే పేరుతో వారి తండ్రి అయిన రుద్రుడితో కలిసి

5. పూర్వాపరం చరతో మాయయైతౌ శిశూ క్రీళంతౌ పరియాతో అధ్వరం,
విశ్వాన్యన్యో భువనాభిచష్ట ఋతూరన్యో విదధజ్జాయతే పునః.

ఉంటుందని అరుదుగా చెప్పబడింది (7.10.4; 7.35.6). బ్రాహ్మణాలలో రుద్రులు ఒక ప్రత్యేకగణంగా పరిగణించబడ్డారు; వీరి సంఖ్య పదకొండు అని ఐ. బ్రా., శ. బ్రా. లలోనూ (అధ్యాయం 10.12), ముప్పై మూడు అని తై.సం. (1.4.11.1) లోనూ ఉంది. ఆదిత్యులు అనే చిన్నగణం వారి తల్లి అయిన అదితికాని (7.10.4, మొ.), వారిలో ముఖ్యుడైన వరుణుడితోకాని (7.35.6, మొ.) ఎప్పుడూ కలిసి ఉంటుంది అని ఋగ్వేదంలో చెప్పబడింది; రెండు ఋగ్వేద మంత్రాల ప్రకారం వీరి సంఖ్య ఏడు లేక ఎనిమిది (అధ్యాయం 19.1); కాని బ్రాహ్మణాలలో ఇది పన్నెండు అయింది. ఈగణంలో వారికి ప్రత్యేకమైన పేర్లు ఉండడం వల్ల ఇది మరుద్గణం కన్న స్పష్టరూపం కలది. ఋగ్వేదంలో తరచు ప్రసక్తి ఉన్న మూడోగణం వసువులు (ప్రాతిపదిక వసు-; ప్రథమా బహువచనం వసవః); వీరి ప్రత్యేకతగాని సంఖ్యగాని చెప్పబడకపోవడం వల్ల ఈ గణం మిగిలిన రెండు గణాలకన్నా అస్పష్టమైనది. వీరికి ఇంద్రుడితో ప్రత్యేకసంబంధం ఉన్నట్లు భావించబడిందని రెండు మంత్రాల వల్ల తెలుస్తుంది (7.10.4; 7.35.6); వీటిలో వరుణుడు / అదితి ఆదిత్యులతోపాటూ, రుద్రుడు రుద్రులతోపాటూ, ఇంద్రుడు వసువులతోపాటూ స్తుతించబడ్డారు. కాని తరవాతకాలపు వైదిక గ్రంథాల ప్రకారం వసువులకి నాయకుడు అగ్ని. వీరి సంఖ్య ఐ. బ్రా., శ. బ్రా. ల ప్రకారం ఎనిమిది (అధ్యాయం 10.12); కాని తై.సం. (5.5.2.5) లో ఇది 333 అయింది. కొన్ని ఋగ్వేదమంత్రాలలో (2.31.1; 10.66.12; చూ. 7.10.4; 7.35.6) ఆదిత్యులూ, రుద్రులూ, వసువులూ అనే మూడు గణాలవారూ కలిపి స్తుతించబడ్డారు. బ్రాహ్మణాలు ఈ మూడు గణాలూ దేవతలలో విభేదాలు అనీ, వసువులు భూమికీ, రుద్రులు అంతరిక్షానికీ, ఆదిత్యులు స్వర్గానికీ చెందినవారని చెప్తాయి (శ. బ్రా. 1.3,4.12; 4.3.5.1). ఛాందోగ్యోపనిషత్తు (3.6-10) లో ఐదుగణాల ప్రసక్తి ఉంది: అగ్నికి చెందిన వసవులూ, ఇంద్రుడికి చెందిన రుద్రులూ, వరుణుడికి చెందిన ఆదిత్యులూ, సోముడికి చెందిన మరుత్తులూ, బ్రహ్మకి చెందిన సాధ్యులూ (చూ. ఋగ్వేదం 10.9.7, 16). ఇవికాక దేవకల్పులైన (అంటే పూర్తిగా దేవతలు కాక కొన్ని దేవతా లక్షణాలు కలవారు) అంగిరసులు, ఋభువులూ అనేవారి గణాలు కూడా ఉన్నాయి; అంగిరసులు ముఖ్యంగా బృహస్పతితో సంబంధం కలవారు (అధ్యాయాలు 36, 54). ఋభువులు ముగ్గురే సభ్యులు కల చిన్న సముదాయం; వీరు ఇంచుమించు సర్వదా ఇంద్రుడితో సాహచర్యం కలవారు (అధ్యాయం 46). చివరగా చెప్పవలసినది విశ్వేదేవతలు

(విశ్వేదేవాః ''అందరు దేవతలూ'' అని దీని అర్థం) అనే సమగ్రమైన గణం. వీరిని స్తుతించే పూర్తి సూక్తాలు ఋగ్వేదంలో అధమపక్షం నలభై ఉండడం వల్ల వీరికి యజ్ఞంలో ముఖ్యస్థానం ఉందని తెలుస్తుంది. యజ్ఞంలో స్తుతులు ఏ దేవతనీ వదలకుండా అందరు దేవతలకీ చెందాలనే ఉద్దేశంతో సృష్టించబడిన గణం ఇది. కాని కొన్నిచోట్ల (2.3.4) విశ్వేదేవతలు వసువులూ, ఆదిత్యులూ వంటి మరికొన్ని దేవతాగణాలతో పాటు స్తుతించబడడం వల్ల అటువంటిచోట్ల ఇది ఒక చిన్నగణంగా భావించబడింది అనుకోవాలి.

# ఏ. ద్వితీయశ్రేణి దేవతలు

## 46. ఋభువులు

46.1 వైదిక గాథా తత్త్వంలో ఉన్నతశ్రేణికి చెందిన దేవతలతో పాటు మొదటిసించీ పూర్తి దేవతా లక్షణం లేని వ్యక్తులు మరికొందరు ఉన్నారు. వీరిలో ఋభువులు (ఋభు-) చాలా ముఖ్యులు. ఋగ్వేదంలో వీరి స్తుతి పదకొండు సూక్తాలలో ఉంది; వీరి పేర్లు సుమారు వందసార్లు వచ్చాయి. వీరు ముగ్గురు. వీరి పేర్లు ఋభువు (ఋభు-) / (అరుదుగా) ఋభుక్షన్- 'ఋభువులలో ముఖ్యుడు', వాజుడు (వాజ-), విభ్వుడు (విభ్వన్-); ఈ పేర్ల ప్రసక్తి తరచుగా ఉంది. కొన్నిచోట్ల ఈ మూడు పేర్లూ కలిసి వస్తాయి; మరికొన్నిచోట్ల వీటిలో రెండే వస్తాయి; అరుదుగా ఋభువుపేరు మాత్రమే వస్తుంది. ఈ ముగ్గురికీ కలిపి ఋభవః అనే బహువచనరూపం సాధారణంగా వాడబడింది; కాని వీరిలో ఎవరో ఒకరిపేరు బహువచనరూపం కూడా ముగ్గురి సముదాయాన్ని సూచించేదిగా వాడబడిన సందర్భాలు కూడా ఉన్నాయి. కొన్నిచోట్ల ఈ సముదాయాన్ని సూచించడానికి ఈ ముగ్గురిపేర్ల బహువచనరూపాలూ (4.36.3; 8.48.1). లేక ఇద్దరిపేర్ల బహువచన రూపాలూ (వాజా ఋభుక్షణః / వాజాఋభవః), పునరుక్తి ఉన్నప్పటికీ, వాడబడినట్లు కనపడుతుంది. వాజో విభ్వాన్‌ఋభవః అనే పదబంధం ఒకచోట (4.36.6) వాడబడింది. అందరు ఋభువులూ (ఋభవశ్చ విశ్వే, 7.51.3) అనీ, ఋభువులతో కూడిన ఋభువూ, విభువులతో కూడిన విభ్వన్- (ఋభుర్ఋభుభిః.... విభ్వో విభుభిః, 7.48.2) అనీ ఉన్నకొద్ది చోటుల్లో ముగ్గురికన్న ఎక్కువ సభ్యులు ఉన్న సముదాయం ఉద్దిష్టమైనట్లు కనపడుతుంది. పైరెండో మంత్రంలో ఋభువూ, విభ్వన్- అనే పేర్లుగల సముదాయానికి ముఖ్యులుగా భావించబడ్డారనేది స్పష్టం. ఒకచోట (4.33.5) ముగ్గురు ఋభువులలో

పెద్దవాడు (ఋభువు), మధ్యముడు (విభ్వన్-), చివరివాడు (వాజుడు) అనే భేదం ఉన్నట్లు చెప్పబడింది.

46.2 సుమారు పన్నెండుచోట్ల ఋభువులకి సుధన్వన్- 'మంచివిల్లుకలవాడు' యొక్క పుత్రులు అనే అర్థమిచ్చే సౌధన్వన- అనే తద్ధితరూపం వాడబడింది. వీరి సముదాయానికి ఒకచోట (4.37.4) 'ఇంద్రుడికొడుకా!' (ఇంద్రస్యసూనో) అనేసంబోధన వాడబడింది ఇదే మంత్రంలో వీరు శవసో నపాతః ''బలానికి సంతానమా!'' అని కూడా సంబోధించబడ్డారు; నపాత్ అనే పదానికి 'మనమడు' అనే అర్థం కూడా ఉండడం వల్లా, ఇంద్రుడికి శవసః సూనుః ''బలానికి కొడుకు'' అనే విశేషణం ఉండడం వల్లా, వీరు ఇంద్రుడి కొడుకులు అనే అర్థం ధ్వనించేటట్లు ఇక్కడ నపాత్ శబ్దం సార్థకంగా వాడబడినట్లు కనపడుతుంది. శవసో నపాతః అనే విశేషణం వీరికి అయిదుచోట్ల వాడబడడం వల్ల ఇది ముఖ్యంగా వీరికి చెందినదే అనుకోవచ్చు; ఇతరత్రా ఒకే ఒకచోట మాత్రం ఇది మిత్రావరుణులకి వాడబడింది. ఒకమంత్రం (3.60.3) లో వీరు మనోర్నపాతః ''మనుష్య సంతానం'' అని చెప్పబడింది; వీరి తల్లితండ్రుల (పితరా) ప్రసక్తి కొన్నిచోట్ల ఉంది. ఒక సూక్తం (1.161.1, 3) లో వీరు అగ్నిని 'సోదరుడా!' (భ్రాతః) అని సంబోధించారు.

46.3 వారిని యజ్ఞానికి రమ్మనీ (4.34.1, 3; 4.37.1), సోమరసం తాగమనీ (4.34.4·4.36.2; 7.48.1) ప్రార్థనలు చాలా తరచుగా ఉన్నాయి. స్వర్గం అనే ఉన్నతస్థానం నించి సోమంకోసం కింది గృహాలకి వారు రావాలని ప్రార్థనలు ఉన్నాయి (4.37.3) ఇందులో వారికీ ఇంద్రుడికీ తరచు సాహచర్యం ఉంది (3.60.4-6; 4.33.3; 4.34.6· 4.35.7); కొన్నిచోట్ల మరుత్తులతోనూ (1.20.5; 1.111.4; 4.34.11), ఒకచోట (4.34.8) ఆదిత్యులూ, సవితా, పర్వతాలూ, నదులతోనూ వీరికి సాహచర్యం ఉన్నట్లు చెప్పబడింది. ఇతర విషయాలలో కూడా వీరికి ఇంద్రుడితో సన్నిహితసంబంధం ఉంది వీరు ఇంద్రుడివంటివారు (4.37.5); ఋభువు కొత్త ఇంద్రుడి వంటివాడు (ఋభుర్న ఇంద్రః శవసా నవీయాన్, 1.110.7). వీరు ఇంద్రుడితో కలిసి మానవులకి విజయం కలిగిస్తారు (4.37.6); వీరు ఇంద్రుడితో కలిసి శత్రువులని చంపాలని ప్రార్థన ఉంది (7.48.3). పనిలో తమకున్న నేర్పువల్ల వీరు ఇంద్రుడి సఖ్యం సంపాదించారని ఉంది (3.60.3; 4.35.7, 9); ఆయన గుర్రాలని చేసినవారు వీరు అవడమే ఇలా చెప్పడానికి కారణం. వీరిని స్తుతించే సూక్తాలలో ఇంద్రుడు తప్ప వేరు దేవతల ప్రసక్తి సాధారణం

ఉండదు; వీరితోపాటు ఇంద్రుడి ప్రసక్తి లేని మంత్రం ఒకేఒకటి (4.34.8) ఉంది. వీరిలో పెద్దవాడైన ఋభువులాగే ఇంద్రుడు కూడా ఋభుక్షన్- 'ఋభువుల నాయకుడు' అని చెప్పబడడం వల్ల వీరికీ ఇంద్రుడికీ ఉన్న సాన్నిహిత్యం విశిష్టమైనదని తెలుస్తుంది; ఈ పదం ఇంద్రుడికి వేరు సహచరులైన మరుత్తులకి కూడా రెండు మూడుచోట్ల వాడబడింది. విశ్వేదేవసూక్తాలు కొన్నింటిలో వీరికి మరికొందరు ఇతరదేవతలతో, ముఖ్యంగా త్వష్టతో, సంబంధం ఏర్పరచబడింది.

46.4 ఋభువుల ఆకారాలనిగురించీ, వారి సామగ్రిగురించీ ప్రసక్తి ఉన్నచోట్లు చాలా తక్కువ. వారు సూర్యుడి వంటి ప్రకాశం కలవారు (సూరచక్షసః, 1.110.4). వారికి గుర్రాలులాగే (7.48.1) రథం (1.161.7) ఉంది. వారి రథం ప్రకాశించేది; గుర్రాలు బలిసినవి; వారు ఇనప శిరస్త్రాణాలూ, అందమైన మాలలూ (సునిష్కాః) ధరిస్తారు (4.37.4). ఋభువుకి గుర్రాలు ఉన్నాయి (అశ్విన్-, 4.37.5). వారికి మంచి (= పనితనం కల) చేతులూ (సుహస్తాః), నేర్పూ (స్వపసః= సు- అపసః 'మంచిపని కలవారు') ఉండడం ప్రత్యేకత(4.33.1, 8, మొ.); నేర్పుతో వారుచేసే పనులు సాటిలేనివి (న వః ప్రతిమై సుకృతాని, 3.60.4). వారికి ఉన్న ఆశ్చర్యకరమైన నేర్పువల్ల వారు దేవత్వం సంపాదించారని తరచు చెప్పబడింది. వారి మాయాశక్తి వల్ల వారు దేవతలలా యజ్ఞంలో భాగం పొందేరు (3.60.1). తమ మంచిపనులవల్ల వారు దేవతలై, అమర్త్యులై గద్దలలా స్వర్గానికి చేరికూర్చున్నారు ( యే దేవాసో అభవతాసుకృత్యా శ్యేనా ఇవే దధి దివి నిషేద .... సౌధన్వనా అభవతా మృతాసః, 4.35.8). వారు తమ శక్తివల్ల స్వర్గాన్ని అధిరోహించిన అంతరిక్షంలోని మనుష్యులు (1.110.6). వారు తమనేర్పుగల సేవలవల్ల అమర్త్యత్వ మార్గంలో దేవతా సముదాయందగ్గరకి వెళ్లేరు (4.35.3); అమర్త్యత్వమూ దేవతలతో సఖ్యమూ సంపాదించారు (4.33.3, 4; 4.35.3; 4.36.4). కాని వారు మొదట్లో మర్త్యులు, మనువు పిల్లలు; వారికి అమర్త్యత్వం సుకృతాలవల్ల లభించింది (మనోర్నపాతః, 3.60.3; 1.110.4). వారు తపస్సులవల్ల దేవతలతోపాటు సోమంలాగే అర్హత సంపాదించారని ఐ.బ్రా.(3.30.2) చెప్తుంది. వారు ఎంతగా దేవతల మెప్పు సంపాదించారంటే, వాజుడు దేవతలకీ, ఋభుక్షుడు ఇంద్రుడికీ, విభ్వుడు వరుణుడికీ శిల్పులు అయ్యారు (4.33.9). తమ నేర్పుమూలంగా వారు దేవతల దగ్గరకి వెళ్లి యజ్ఞాన్ని / యజ్ఞంలో భాగాన్ని సంపాదించారు(1.20.1, 8; 1.121.6, 7). నేర్పుతో

కూడిన పనితనం వల్ల మూడోదిఅయిన సాయంకాలయాగం వారికి స్వంతమయింది (1.161.8; 4.33.11; 4.34.4; 4.35.9). అందువల్ల వారు కొన్నిచోట్ల స్పష్టంగా దేవతలుగానే ఆహ్వానించ బడ్డారు (4.36.5; 4.37.1).

46.5 వారుత్తమ దేవతలలాగే వృద్ధీ (4.33.8; 4.37.5), పశుసంపదా, అశ్వసంపదా, వీరులైనసంతానమూ (4.34.10), శక్తీ, ఆహారమూ, సంతానమూ, నేర్పూ (1.111.2) ప్రసాదించాలని ప్రార్థించబడ్డారు. సోమయాగం చేసేవారికివారు ఐశ్వర్యం ఇస్తారు (1.20.7; 4.35.6). వారి సహాయం ఉన్నవాడు యుద్ధంలో అజేయుడు (4.36.6); ఋభువూ వాజుడూ యుద్ధంలో సహాయమూ, ధనమూ ఇవ్వాలని ప్రార్థనలు ఉన్నాయి (1.115.5).

46.6 వస్తువుల తయారీలో ఋభువులకి ఉన్ననేర్పుని సూచించడానికిత్వష్టవిషయంలో వాడబడిన తక్ష్- 'తయారుచేయు' అనే ధాతువే సాధారణంగా వాడబడింది. వారు దేవతలవడానికి కారణమయిన అయిదు గొప్ప కృత్యాలూ చాలా తరచుగా చెప్పబడ్డాయి; ఇంచుమించు వారిని స్తుతించే ప్రతి సూక్తంలోనూ వాటన్నిటి ప్రసక్తీ లేక వాటిలో చాలా వాటి ప్రసక్తీ ఉంది. వారు ఒక రథం తయారుచేశారు (1.111.1; 1.161.3; 4.33.8; 4.36.2); దానికి గుర్రాలులేవు, పగ్గాలు లేవు; అది పొగడదగినదని, మూడు చక్రాలు కలది; అంతరిక్షంలో తిరుగుతుంది (అనశ్వోజాతో అనభీశు రుక్థ్యో రథస్త్రిచక్రః పరివర్తతే రజః, 4.36.1). అంతటా తిరిగే ఆ రథాన్ని వారు అశ్వినులకోసం తయారు చేశారు (1.20.3; 1.161.6; 10.39.12). వారు చేసిన గొప్ప కార్యాలలో ఒక్కొక్క దాన్ని ఒక్కొక్క మాటతో సంగ్రహంగా చెప్పిన మంత్రం (4.34.9)లో వారు అశ్వినులనే చేశారు అని ఉంది (యే అశ్వినా యే పితరా య ఊతీ ధేనుం తతక్షు రృభవో యే అశ్వా) కాని ఇక్కడ వారు అశ్వినుల కోసం రథాన్ని చేశారనే విషయమే అస్పష్టంగా చెప్పబడినట్లు కనపడుతుంది.

46.7 ఇంద్రుడికోసం వారు రెండు పచ్చని (హరీ) గుర్రాలని చేశారు; అవి ఆయనకి వాహనాలయ్యాయి (4.33.10, మొ.). ''ఋభువులు ఒకగుర్రాన్ని తయారు చేద్దాం అనుకొన్నారు'' అనీ ''వారుగుర్రాలని ఒకదాని తరవాత ఇంకొకటిచేశారు'' అనీ చెప్పినచోట్ల (1.161.3, 7) ఇదే కృత్యం భంగ్యంతరంగా సూచితమైనట్లు కనపడుతుంది.

46.8 వారు ఒక ఆవుని కూడా చేశారు (ధేనుం తతక్షుః, 4.34.9; 1.161.3); అది

అమృతాన్ని ఇచ్చేది (1.20.3), అందరినీ ప్రేరించేది, విశ్వరూపం కలది (విశ్వాజువం విశ్వరూపాం, 4.33.8). ఈ ఆవుని వారు (ఒక చచ్చిపోయిన ఆవు) చర్మాన్నించి తయారుచేశారు (నిశ్చర్మణఋభవో గా మపింశత, 1.110.8; నిశ్చర్మణో గా మరిణీత, 1.161.7, మొ; అరిణీత = బయటకు తీసుకువచ్చారు / పుట్టించారు). దానిని వారు రక్షించి దాని శరీరంలో మాంసం ఏర్పరిచారు (4.33.4). ఒక మంత్రం (1.161.6)లో ఇంద్రుడు (రెండు) పచ్చని గుర్రాలని (రథానికి) కట్టుకొన్నాడు, అశ్వినులు రథం (కట్టుకొన్నారు); బృహస్పతి విశ్వరూప (అయిన ఆవుని) తోలుకుపోయాడు (ఇంద్రో హరీ యుయుజే అశ్వినా రథం బృహస్పతి ర్విశ్వరూపా ముపాజత) అని ఉండడం వల్ల వారు ఈ ఆవుని బృహస్పతి కోసం చేశారు అని మనం ఊహించుకోవచ్చు. వీరు చేసిన ఒక చిన్న పని రెండుచోట్ల (1.110.8; 1.111.1) మాత్రమే చెప్పబడింది; అది తల్లి ఆవుని దాని దూడతో కలపడం (సం వత్సే నాసృజతా మాతరం పునః); ఇది బహుశా పై వృత్తాంతానికి సంబంధించినదే కావచ్చు (★ ఈ రెండు విషయాలూ ఒకే మంత్రంలో ఉన్నాయి).

46.9 ఋభువులు ముసలితనం వల్ల చిక్కిపోయి చీకిపోయిన స్తంభాల్లా పడి ఉన్న (యూపేవ జరణా శయానా) తమ తల్లితండ్రులకి యౌవనం కలిగించారు (పునర్యే చక్రుః పితరా యువానా సనా యూపేవ జరణా శయానా, 4.33.3; 4.33.2; 1.110.8; సనా = ఎప్పుడూ). వారు ఇద్దరు ముసలివారిని పడుచువాళ్లుగా చేశారు (యువశా కర్త్వా ద్వాతాని, 1.161.3, 7). ఇంతకుముందు చెప్పినట్లు, వారి అద్భుతకృత్యాలన్నిటినీ సంగ్రహంగా చెప్పే మంత్రం (4.34.9)లో వారు తమ తల్లితండ్రులని చేశారు అని సూక్ష్మంగా చెప్పడంలో పై కృత్యమే ఉద్దిష్టమై ఉంటుంది అనడంలో సందేహం లేదు. చాలా ముసలివారై జీర్ణించి ఉన్న తమ తల్లితండ్రులని యువకులుగా మార్చి నడిచేటట్లు చెయ్యడం వారికి దేవతలలో కీర్తి (సుప్రవాచనం) తెచ్చిపెట్టింది (4.36.3). ఇదే సూక్తం (4.36) మొదటి మంత్రంలో వారు స్వర్గాన్నీ భూమినీ పుష్టికలవిగా చెయ్యడం వారి దివ్యత్వాన్ని చాటిచెప్తుంది (మహత్తద్వో దేవ్యస్య ప్రవాచనం ద్యామృభవః పృథివీం యచ్చ పుష్యథ) అని ఉంది. అందువల్ల వారి తల్లితండ్రులు అంటే స్వర్గమూ, భూమే కావచ్చు.

46.10 ఋభువుల నేర్పుకి దృష్టాంతంగా తరచుగా చెప్పబడినదీ, వారి అన్ని పనులలోకీ

గొప్పదిగా భావించబడినదీ త్వష్ట చేసిన పాత్రని (చమసం) వారు నాలుగు పాత్రలుగా చెయ్యడం; ఈ కృత్యం వల్ల వారు త్వష్టకి సాటి అయిన ప్రతిద్వంద్వులయ్యారు (ఉత త్యం చమసం నవం త్వష్టుర్దేవస్య నిష్కృతం, అకర్త చతురః పునః, 1.20.6; 1.110.3; 4.35.2, 3; 4.36.4). ఈ పాత్ర దేవతలు (చమసం .... దేవపానం, 1.161.5; 4.35.5), అసురుడు (చమసమసురస్య భక్షణం, 1.110.3) సోమం తాగడానికి ఉపయోగించేది (★అసురస్య = త్వష్టకి సంబంధించిన, అంటే, త్వష్ట చేసిన, అని సాయణుడు). దేవతలు తమ దూత అయిన అగ్ని ద్వారా ఋభువులని కొయ్యతో చేసిన పాత్రని నాలుగు పాత్రలుగా చెయ్యమని అడిగేరు; అలా చేస్తే దానికి ప్రతిఫలంగా వారికి దేవతలతో పాటు యజ్ఞంలో పూజ లభిస్తుందని అగ్ని వారికి చెప్పేడు (1.161.2).[1] ఋభువులు ఆ పాత్రని రెండు / మూడు / నాలుగు పాత్రలుగా చేస్తామని చెప్పిన మాటలని త్వష్ట ప్రశంసించాడు (పనయత్, 4.33.5);[2] ప్రకాశించే నాలుగు పాత్రలనీ చూసిన త్వష్ట వాటిని మెచ్చుకొన్నాడు (విభ్రాజమానాంశ్చమసాఁ అహేవావేనత్త్వష్టా చతురో దదృశ్వాన్, 4.33.6; అహ ఇవ = పగళ్ళలా, వేనత్ = మెచ్చుకొన్నాడు). కాని త్వష్ట ఆ నాలుగు పాత్రలనీ చూసి ఆడవాళ్ళ మధ్య దాక్కొన్నాడనీ (త్వష్టాగ్నాస్వంతర్న్యానజే, 1.161.4), దేవతల పానపాత్రని నిందించిన (= పాడుచేసిన) ఋభువులని చంపుదాం అనుకొన్నాడనీ (హనామైనా ఇతి త్వష్టా యదబ్రవీచ్చమసం యే దేవపానమనిందిషుః, 1.161.5), మరొకచోట ఉంది. కాని అదే సూక్తం (1.161) మొదటి మంత్రంలో ఋభువులు తమకు ఆ పాత్రని పాడుచెయ్యాలనే ఉద్దేశం ఏ మాత్రమూ లేదని స్పష్టం చేశారు (న నిందిమ చమసం). వారు ఆ పెద్దపాత్రని (నాలుగూ చెయ్యడానికి) పొలాన్ని కొలిచినట్లు కొలిచారని వర్ణించబడింది; వారు దేవతలలో తమకి కీర్తి రావాలని పని చేశారు (అమర్త్యేషు శ్రవ ఇచ్ఛమానాః, 1.110.5). ఈ పనే వారు పాత్రలు తయారుచేశారు అని కొన్నిచోట్ల (1.161.9; 3.60.2; చూ. 4.35.5) సంగ్రహంగా చెప్పబడింది.

46.11 ఋభువులు ప్రార్థననీ / స్తోత్రాన్నీ (బ్రహ్మ, 10.80.7), యజ్ఞాన్నీ (3.54.12)

---

1 ఏకం చమసం చతురః కృణోతన తద్వో దేవా అబ్రువన్ తద్వ ఆగమం
సౌధన్వనా యద్యేవా కరిష్యథ సాకం దేవైర్యజ్ఞియాసో భవిష్యథ
(ఇది అగ్ని చెప్పిన వాక్యం; కృణోతన = చెయ్యండి)

2 వారిలో పెద్దవాడు ఆ పాత్రని రెండుపాత్రలుగానూ, మధ్యవాడు మూడుగానూ, చిన్నవాడు నాలుగూ చేస్తాం అన్నారు

రెండు లోకాలనీ (4.34.9) చేశారనీ, వారు ఆకాశాన్ని నింబెట్టేరనీ (10.66.10) చెప్పిన వాక్యాలు వారినేర్పుకే ఉదాహరణలు.

46.12 మరో కథ ఋభువులకీ సవితకీ సంబంధించినది. వారు ఆకాశం చుట్టూ వాయువేగంతో తిరిగేరు (4.33.1; చూ. 1.161.12). అలా ఎక్కువగా తిరిగి వారు సవిత ఇంటికి వచ్చి సోమపానం కావాలని ఆయన్ని అడిగేరు; అగోహ్యుడైన ( = దాచడానికి శక్యం కానివాడైన) సవిత వారికి అమర్త్యత్వం ఇచ్చాడు (1.110.2, 3). పన్నెండు రోజులు అగోహ్యుడి ఆతిథ్యంలో నిద్రపోయి ( = విశ్రాంతి తీసుకొని) సుఖించి వారు ఎడారి ప్రదేశాలని సుక్షేత్రాలు చేశారు; నదులకి తోవలుచేశారు; అప్పుడు ఎడారి ప్రదేశాలని మొక్కలూ, పల్లపు ప్రదేశాలని నీళ్లూ ఆక్రమించుకొన్నాయి (4.33.7). అగోహ్యుడి ఇంట్లో విశ్రాంతి తీసుకొనేటప్పుడు, వారు తమ నేర్పువల్ల ఎత్తు ప్రదేశాలలో గడ్డీ, పల్లపు ప్రదేశాలలో నీళ్లూ పుట్టించారు (1.161.11). వారు నిద్రపోయి లేచి, ''మమ్మల్ని ఎవరు లేపేరు?'' అని అగోహ్యుణ్ణి అడిగేరు; ఆయన ''గాలి మిమ్మల్ని లేపింది'' అని చెప్పేడు; సంవత్సరం తరవాత ఇప్పుడు వారు చూశారు (1.161.13; ★సాయణుడి ప్రకారం దీని భావం: కాంతిరూపులైన ఋభువులు గాలి సహాయంతో వర్షాకాలంలో సూర్యచంద్రులు కనపడకుండా వర్షం కురిపించి ఆతరవాత జగత్తుకి వెలుగు కలిగిస్తారు).

46.13 ఋభు శబ్దం రభ్- 'పట్టుకొను' (చూ. 2.3.8) అనే ధాతువునించి వచ్చినట్లు కనపడుతుంది; కాబట్టి దీని అర్థం ''(చేతి) నైపుణ్యం కల (వాడు)'' అని, ఋగ్వేదంలో ఇది విశేషణంగా తరచుగా వచ్చింది; ఇది ఇంద్రుడికీ, అగ్నికీ, ఆదిత్యులకీ విశేషణంగా కొంత ప్రచురంగా వాడబడింది. ఇది జర్మన్ elbe, ఇంగ్లీషు elf 'అతిమానుష శక్తి కల భూతం' అనే పదాలకి సంబంధించినది అని చెప్పవచ్చు. (వజ్- అనే ధాతువు నించి వచ్చిన) వాజ- అంటే 'చురుకుతనం కలవాడు' అని అర్థం; (వి- అనే ఉపసర్గ + భూ- ధాతువు నించి వచ్చిన) విభ్వన్- అంటే 'వైభవం ( = గొప్పతనం) కల (శిల్పి)' అని అర్థం. అందువల్ల ఋభువుల పేర్లూ, ఋగ్వేదంలో వారినిగురించి చెప్పబడిన విషయాలూ వారు నైపుణ్యం కల శిల్పులు అని స్పష్టం చేస్తాయి.

46.14 వారు జన్మకాలంనించీ దేవతలుగా ఉన్నవారు కాదు అనే విషయం స్పష్టంగా తెలుస్తోంది. వారి అసలు స్వభావానికీ వారికి ఇంద్రుడితో సన్నిహితసంబంధం ఉండడానికీ

ఏమన్నా సంబంధం ఉందా అనే విషయం సందేహాస్పదం. వారికి విశేషణమైన సౌధన్వన- అనే తద్ధితరూపానికి ఆధారమైన సుధన్వన్- ఎవరు అనేది కూడా అస్పష్టమే; ఈ పదం రుద్రుడికీ మరుత్తులకీ విశేషణంగా ఋగ్వేదంలో మొత్తం రెండుచోట్ల మాత్రమే వచ్చింది. కాని వారి తల్లితండ్రులు అంటే స్వర్గమూ, భూమీ అని చెప్పడానికి అవకాశం ఎక్కువగా ఉంది; వారి తల్లితండ్రుల ప్రసక్తి చాలా తరచుగా ఉంది. వారు ఉత్పత్తి కలిగిస్తారు అనే భావానికీ వారు పన్నెండురోజులపాటు సవిత ఇంట్లో / అగోహ్యుడి (= దాచడానికి శక్యంకాని సూర్యుడి) ఇంట్లో ఉండడానికీ సంబంధం ఉంది. అందువల్ల ఋభువులు మూడు ఋతువులకి అధిదేవతలు అని చాలామంది పండితుల అభిప్రాయం; చలికాలం మధ్యలో సూర్యుడు భూమధ్యరేఖకి పక్కగా అత్యధికదూరంలో ఉండే పన్నెండు రోజులలో ఋతువులో మార్పు ఉండదు.[3] త్వష్ట పాత్ర బహుశా చంద్రుడే కావచ్చు; దాన్నించి ఋభువులు చేసిన నాలుగు పాత్రలు చంద్రుడి నాలుగు దశలు కావచ్చు. మొత్తంమీద ఋభువులు మొదట్లో భూమిమీద లేక అంతరిక్షంలో ఉన్న అతిమానుషశక్తులనీ, వారికి నేర్పు ఉండడంవల్ల అద్భుతమైననైపుణ్యానికి ఉదాహరణలైన గాథలు కాలక్రమేణ వారికి ఆపాదించబడ్డాయనీ చెప్పబడానికి అవకాశం ఉంది. కాని ఋగ్వేదంలో ఉన్న సాక్ష్యాధారం ఇదమిత్థమైన నిర్ణయం చెయ్యడానికి చాలదు.

## 47. అప్సరసలు

47.1 అప్సరస (ప్రాతిపదిక అప్సరస్-, ప్రథమాబహువచనం అప్సరాః) అంటే దేవజాతికి చెందిన యువతి, అప్సరసలకీ ఈ భావనకి మూలం అనుకోదగిన ఏ ప్రకృత్యాధారానికీ ఋగ్వేదంలోనే ఏమీ సంబంధం లేదు. ఈ పేరు అయిదుచోట్ల మాత్రమే ఉండడం వల్ల అప్సరసలనిగురించిన వివరాలు అత్యల్పం. ఉన్నతస్వర్గంలో అప్సరస తన ప్రియుణ్ణి చూసి చిరునవ్వు నవ్వుతుంది (అప్సరా జారముపసిష్మియాణా, 10.123.5); ఈ ప్రియుడు ఒకగంధర్వుడని దీనిముందు మంత్రం చెప్తుంది. వసిష్ఠుడు అప్సరసకి పుట్టేడు (అప్సరసః పరి జజ్ఞే వసిష్ఠః, 7.33.12); వసిష్ఠులు అప్సరల దగ్గర కూచుంటారు (అప్సరస ఉపసేదు

3. ఉత్పాదనశక్తి కల కాలానికి విభాగాలైన భూత, వర్తమాన, భవిష్యత్తులకివారు అధిదేవతలని వెబర్(Weber) అభిప్రాయం. ప్రాచీనకాలంలో యజ్ఞం చేసి అమర్త్యత్వం సంపాదించిన నేర్పరులే ఋభువులనీ, వీరి సంఖ్య మూడు అవడానికి యాగాగ్నులు మూడు అవడమే కారణమనీ బెర్గెయిన్(Bergaigne) అన్నారు. (పై వాక్యంలో చెప్పబడిన కాలం ఉత్తరాయణ ప్రవేశకాలం). -

ర్వసిష్ఠాః, 7.33.9) అనిచెప్పబడింది. సముద్రంలోని అప్సరసలు సోమం దగ్గరకి ప్రవహిస్తారు (9.78.3) అని వర్ణించబడింది; ఇక్కడ సోమరసానికి నీళ్లు కలుపుతారనేది సూచితం. కొంత దివ్యశక్తి కలిగి కేశాలు ఉన్నఋషి అప్సరసలూ గంధర్వులూ వెళ్లే తోవలో తిరగగలుగుతాడు అని ఉంది (10.136.6). నీళ్లలో ఉండే గంధర్వుడి భార్య అయిన నీటికి సంబంధించిన యువతి (అప్యా యోషా) అన్నప్పుడు ఉద్దిష్టమైనది అప్సరసే (10.10.4) అనడంలో సందేహం లేదు.

47.2 అథర్వవేదంలో అప్సరసలని గురించి మరికొన్ని వివరాలు ఉన్నాయి. వారి నివాసస్థానం నీళ్లలో ఉంటుంది; అక్కడనించి వారు మనోవేగంతో వచ్చివెళ్తూ ఉంటారు (అ.వే. 2.2.3). వారు మనుష్యులు ఉండే ప్రాంతాల నించి నది దగ్గరకీ నీటి ఒడ్డుల దగ్గరకీ వెళ్లమని ప్రార్థన ఉంది (అ.వే. 4.37.3). విశ్వావసువు అనే గంధర్వుడితో ఉండే స్త్రీ దేవతలు మేఘాలకీ, మెరుపుకీ, నక్షత్రాలకీ సంబంధించినవారు (అ.వే. 2.2.4). వారు గంధర్వుల భార్యలు అని స్పష్టంగానే చెప్పబడింది; అర్వాచీన సంహితలలో (వా.సం. 30.8; అ.వే. 8.9.9., మొ.) గంధర్వులకీ అప్సరసలకీ అవినాభావసంబంధం ఏర్పడింది. శ.బ్రా. (11.5.1.4) అప్సరసలు ఒకరకం నీటిపక్షులు (ఆతయః, చూ. ఋ.వే. 9.5.9)గా మారతారని వర్ణించబడింది. వేదాల తరవాత సాహిత్యంలో వారు అడవులలో చెరువులదగ్గరకీ, నదుల దగ్గరకీ, ముఖ్యంగా గంగానది దగ్గరకీ తరచుగా వస్తారనీ, సముద్రంలోని వరుణుడి భవనంలో ఉంటారనీ తరచుగా చెప్పబడింది. అప్సరస్- శబ్దానికి వ్యుత్పత్తి ''నీటిలో (అప్-) సంచరించేది (సరస్ < సృ- 'సంచరించు' అనే ధాతువు'' (అప్సరా అప్సారిణీ అని యాస్కుడు, నిరుక్తం 5.13).

47.3 అప్సరసలు స్వర్గలోకంలో నీళ్లలో ఉండే స్త్రీలు అనేది ప్రాచీనతమమైన భావన అని పై ఆధారాలవల్ల తెలుస్తుంది; ఋగ్వేదంలోనే అప్సరస గంధర్వుడి ప్రేయసి అనే భావన ఉంది. అర్వాచీన సంహితలలో అప్సరసలు భూమిమీదకూడా, ముఖ్యంగా చెట్లమీద, ఉంటారని భావించబడింది. వారు మర్రిచెట్ల మీదా (న్యగ్రోథ-), రావిచెట్లమీదా (అశ్వత్థ-) ఉంటారనీ, అక్కడవారి వాద్యాలు మోగుతూ ఉంటాయనీ చెప్పబడింది (అ.వే. 4.37.4).[1] తై.సం. (3.4.8.4)లో గంధర్వులకీ అప్సరసలకీ పైన చెప్పిన చెట్లే కాక మేడిచెట్లూ

1. అ.వే. 4.37.5లో ఈ వాద్యాల పేర్లు ''ఆఘాటాః'', ''కర్కర్యః'' అని ఉంది; మూలకర్త వీటిని and lutes ''పళ్లెం ఆకారంలోని చిడతలూ, వీణలూ'' అన్నారు.

(ఉదుంబర-), జువ్విచెట్లూ (ప్లక్ష-) కూడా నివాసస్థానాలని చెప్పబడింది. అటువంటి చెట్లమీద ఉన్న గంధర్వులూ, అప్సరసలూ అటువైపుగావెళ్లే పెళ్లి ఊరేగింపులకి శుభం కలిగించాలి అని ప్రార్థన ఉంది (అ.వే. 14.2.9). శ.బ్రా. (11.6.1)లో అప్సరసలు నృత్తగానాలలోనూ ఆటలలోనూ నిమగ్నులై ఉంటారని వర్ణించబడింది. వేదాల తరవాత గ్రంథాలలో ఈ రెండు జాతులవారికీ పర్వతాలు (నిజమైనవీ, గాథలలోవీ) కూడా ప్రియమైన నివాసస్థానాలు అని చెప్పబడింది. అథర్వవేదం అప్సరసలని గురించి చెప్పిన మరికొన్ని విశేషాలు : వారికి జూదం ఆడ్డం అంటే ఇష్టం; వారు ఆటలో అదృష్టం కలిగిస్తారు; ముఖ్యంగా ఈ కారణం వల్ల వారంటే మనుష్యులకి భయం; వారు ఇలా చెయ్యకుండా నిరోధించడానికి తంత్రశక్తి ఉపయోగించాలి (అ.వే. 2.3.5, మొ.).

47.4 గొప్ప సౌందర్యవతులైన (శ.బ్రా. 13.4.3.7, 8) అప్సరసల ప్రేమకిగంధర్వులే కాకఅరుదుగా మనుష్యులు కూడా పాత్రులవులారు (చూ. 10.95.9); ఇతిహాసపురాణాల కాలానికిఅప్సరసలు దేవతల కొలువులో విలాస స్త్రీలుగా మారిపోయారు. వేదసాహిత్యంలో ఒకఅప్సరస ఒకమానవుడికి ప్రేయసి అయినట్లుగాథ ఉంది. వేదసాహిత్యంలో మరికొందరు అప్సరసల పేర్లు మాత్రమే ఉన్నాయి (వేరు వివరాలు లేవు) అథర్వవేదం (16.118.1, 2)లో ఉగ్రజిత్, ఉగ్రంపశ్యా, రాష్ట్రభృత్ అనే ముగ్గురు అప్సరసల పేర్లు ఉన్నాయి. వాజసనేయీ సంహిత (15.15-19)లో మరికొందరు అప్సరసల పేర్లతోపాటు ఉర్వశి (ఉర్వశీ-), మేనక (మేనకా-) ల పేర్లు ఉన్నాయి.[2] శతపథ బ్రాహ్మణం (3.4.1.22)లో కూడా భరతుడి తల్లిగా భరతవంశానికి మూలమైన శకుంతల (శకుంతలా-) ప్రసక్తి (శ.బ్రా. 13.5.4.13), ఉర్వశి ప్రసక్తి (శ.బ్రా. 11.5.1.1) ఉన్నాయి.

47.5 ఈ పేర్లన్నిటిలోనూ ఉర్వశి పేరు మాత్రమే ఋగ్వేదంలో ఉంది. అందులో ఒక మంత్రంలో వసిష్ఠుడు ఉర్వశికి పుట్టేడనీ, దాని తరవాత మంత్రంలో ఆయన అప్సరసకి పుట్టేడనీ (7.33.11, 12) ఉండడం వల్ల ఉర్వశి అప్సరసగా భావించబడిందని తెలుస్తుంది. ఆమె ఒకచోట (5.41.19) నదులతోపాటు ప్రార్థించబడింది. ఇవికాక ఆమెపేరు మరిరెండుచోట్ల (10.95.10, 17) మాత్రమే ఉంది. ఇవి ఉన్న సూక్తం అర్వాచీనమైనదీ

2 వా.సం.లో చెప్పబడిన ఇతరాప్సరసల పేర్లు: పుంజికస్థలా-, క్రతుస్థలా- (15), మేనకా-, సహజన్యా- (16) ప్రమ్లోచంతీ-, అనుమ్లోచంతీ- (17), విశ్వాచీ-, ఘృతాచీ- (18), ఉర్వశీ-, పూర్వచిత్తి- (19).

అస్పష్టార్థం కలదీ; ఇందులో ఉర్వశికీ, ఆమె ప్రియుడూ, ఇళా కొడుకూ అయినపురూరవుడికీ (పురూరవస్-) మధ్య జరిగిన సంభాషణ ఉంది. ఇందులో ఆమె నీటిలో పుట్టినదనీ (అప్యా-), అంతరిక్షమంతటా నిండినదనీ, అంతరిక్షంలో సంచరిస్తుందనీ వర్ణించబడింది (గంధర్వుడు కూడా ఇలాగే అంతరిక్షంలో సంచరిస్తాడని 10.139.5లో ఉంది). ఆమె నాలుగు శరత్కాలాలపాటు మనుష్యుల మధ్య నివసించింది (16); ఆమెని తిరిగి రమ్మని (పురూరవుడు) ప్రార్థించాడు (17). ఈ ప్రార్థన తిరస్కరించబడినట్లు కనపడుతుంది; కాని పురూరవుడి సంతతి దేవతలకి హవిస్సులు ఇచ్చి పూజిస్తారనీ పురూరవుడు స్వర్గలోకానికి వెళ్లి ఆనందంతో ఉంటాడనీ (స్వర్గ ఉ త్వమపి మాదయాసే, 18) దేవతలు ఆయనకి వరాలు ఇచ్చారు. ఈ కథ శ. బ్రా. (1.5.1) లో విపులంగా చెప్పబడింది; అందులో ఈ సూక్తంలో కొన్ని మంత్రాల అర్థం సందర్భోచితంగా నిక్షిప్తమయింది. కాని అందులో కొన్ని వివరాలు ఋగ్వేదగ్రంథాన్ని సరిగా అర్థంచేసుకోకుండా కల్పించినవి. అందులో కథ సారాంశం: అప్సరస అయిన ఉర్వశి ఇళ కొడుకైన పురూరవుడితో కలిసి ఉండడానికి అంగీకరించి ఈ సంబంధం శాశ్వతంగా ఉండాలంటే ఆయనఎప్పుడూ తనకి దిగంబరుడుగా కనపడకూడదని షరతు పెట్టింది. కాని ఒక రాత్రి గంధర్వులు యుక్తిపన్ని శబ్దం పుట్టించారు. దిగంబరుడుగా ఉన్న పురూరవుడు లేచిపోయాడు; అప్పుడు మెరుపు మెరియడం వల్ల ఆయన ఉర్వశికి కనపడ్డాడు. ఉర్వశి వెంటనే మాయమైపోయింది. పురూరవుడు ఆమెనివెతుకుతూ తిరిగితిరిగి చివరికిపక్షిరూపంలో ఇతరాప్సరసలతోపాటు ఒక తామరకొలనులో ఈదుతూ ఉన్న ఆమెని చూశాడు. ఉర్వశి ఆయనకి తన అసలురూపంతో కనపడి, ఆయన ప్రార్థనలు అంగీకరించి, ఒకసంవత్సరం తరవాత ఒక రాత్రికి ఆయన్ని స్వీకరించడానికి ఒప్పుకుంది (వీరికి ఆయువు (ఆయు-) అనే కొడుకు ఉన్నాడు). ఆమె చెప్పిన సమయానికి ఆయన వచ్చాడు. ఆ తరవాత రోజు గంధర్వులు ఆయన ఒక ప్రత్యేక పద్ధతిలో అగ్నిని పుట్టిస్తే ఆయన తమలో ఒకడు అవుతాడు అని వరం ఇచ్చారు. ''గట్టిగా పిలవడం'' అనే మౌలికార్థం కల పురూరవస్- శబ్దం 10.95 సూక్తం కాక మరొక మంత్రం (1.31.4) లో మాత్రమే ఉంది; అందులో ''అగ్ని మనుష్యుడూ (మనవే), మంచిపనులు చేసేవాడూ (సుకృతే) అయిన పురూరవుడికోసం ఆకాశాన్ని శబ్దించేటట్లు చేశాడు'' అని ఉంది (మనవే ద్యావవాశయః పురూరవసే సుకృతే). ఇక్కడ పురూరవసే అనేది మనవే ''మనుష్యుడికి'' అనే దానికి విశేషణం అని చెప్పడానికి కూడా

అవకాశం ఉంది (★ అప్పుడు దాని అర్థం ''పెద్ద ధ్వని చేసే'' అని చెప్పాలి). మాక్స్ ముల్లర్, వెబర్ మొదలైన కొందరు పండితులు పురూరవుడూ ఉర్వశీ సూర్యుడికీ ఉషస్సుకీ ప్రతీకలని అభిప్రాయపడ్డారు.

## 48. గంధర్వులు

48.1 పైఅధ్యాయంలో చెప్పినట్లు అప్సరస/ అప్సరసలతో సాహచర్యం ఉన్న గంధర్వుడు/ గంధర్వులు అనే పురుషుడి/పురుషుల ప్రసక్తి ఋగ్వేదంలోనే ఉంది. ఈ శబ్దానికి ఋగ్వేదంలో ఉన్న ఇరవై ప్రయోగాలలో మూడు మాత్రమే బహువచనంలో ఉన్నాయి; అథర్వవేదంలో ఉన్న ముప్పైరెండు ప్రయోగాలలో సగం బహువచనంలో ఉన్నాయి. దీనికి తుల్యంగా అవెస్తాలో గందరెవ అనే శబ్దం ఏకవచనంలో మాత్రమే కొన్నిచోట్ల ఉంది; అందులో ఇది పామురూపంకల ఒక రాక్షసుడి పేరు. దీనివల్ల మొదట్లో గంధర్వుడు ఒక్కడే అనీ గంధర్వజాతి క్రమక్రమంగా వృద్ధిపొందిందనీ తెలుస్తుంది. అర్వాచీన సంహితలలో గంధర్వులు దేవతలూ, పితరులూ, అసురులతోపాటు ఒక ప్రత్యేక వర్గంగా పరిగణించబడ్డారు (అ.వే. 11.5.2; తై.సం. 7.8.25.2). కొన్ని యజుర్వేదసంహితలలో వీరి సంఖ్య 27 అని నిర్ణయించబడింది; అథర్వవేదం (11.5.2) ప్రకారం వీరి సంఖ్య 6333. గంధర్వులనిగురించిన భావన మూల ఇండో-ఇరానియన్‌కాలమంత ప్రాచీనం కావడం ఇటువంటి అస్పష్టతకి కొంతవరకూ కారణం. పైగా ఋగ్వేదంలో సాక్ష్యం చాలా స్వల్పంగానూ అస్పష్టంగానూ ఉండడం వల్ల గంధర్వుల మూలస్వరూప స్వభావాలు తెలుసుకోవడానికి అవకాశం లేదు. గంధర్వ శబ్దం 2-7 మండలాలలో ఒకచోట మాత్రమే రావడమూ, ఎనిమిదో మండలంలో రెండుచోట్ల మాత్రమే ఉండడమూ, అక్కడ అది ఇంద్రుడి విరోధిని సూచించేదిగా ఉండడమూ గమనించదగిన విషయాలు. కొన్ని చోట్ల ఇది విశేషణంగా మాత్రమే వాడబడినట్లు కనపడుతుంది. ఇది కొన్నిచోట్ల విశ్వావసు- 'అన్ని ధనాలూ కల(వాడు)' (9.86.36; 10.139.4, 5; అ.వే. 2.2.4; వా.సం. 2.3) అనే విశేషణంతో కలిసి వచ్చింది. ఇది గంధర్వుడనే అర్థంలో స్వతంత్రంగానే ఒక సూక్తం (10.85.21, 22; చూ. 40. 41)లో వాడబడింది. అర్వాచీన సంహితలలోనూ, బ్రాహ్మణాలలోనూ, వేదాల తరవాతసాహిత్యంలోనూ ఇది ఒకగంధర్వుడిపేరుగా ఉంది.

48.2 ఋగ్వేదంలో గంధర్వుడు అంతరిక్షం ఉన్నత ప్రదేశంలోనూ ఆకాశంలోనూ

ఉంటాడని భావించబడింది. ఆయన అంతరిక్ష ప్రదేశాన్ని కొలుస్తాడు (= నిర్మిస్తాడు, రజసో విమానః, 10.139.5). ఆయన అగాథమైన అంతరిక్ష ప్రదేశంలో ఉంటాడు (8.77.5). ఆయన దివ్యుడు; ఆయ స్వర్గం ఉన్నత ప్రదేశంలో నిలబడి ఉంటాడు (ఊర్ధ్వో గంధర్వో అధినాకే అస్థాత్, 10.123.7). ఆయన అప్సరస చిరునవ్వుకి పాత్రమైన ప్రియుడు (10.123.5). గంధర్వుడి నివాసస్థానం స్వర్గంలో ఉంది (దివితే సధస్థం, అ.వే. 2.2.1, 2); యజ్ఞంచేసి స్వర్గార్హులైన వారు గంధర్వులతో ఆనందిస్తూ ఉంటారు (అ.వే. 4.34.3). కొన్ని మంత్రాలలో గంధర్వుడికి దివ్యకాంతితో సాహచర్యం ఉన్నట్లు చెప్పబడింది. ఉదాహరణకి, గంధర్వుడికి బంగారు రెక్కలుగల, వరుణుడి దూత అయిన పక్షి (= సూర్యుడు, హిరణ్యపక్షం వరుణస్యదూతం ... శకునం, 10.123.6)కీసంబంధం చెప్పబడింది; అలాగేసూర్యుడనేపక్షికీ (10.177.2), సూర్యుడి గుర్రానికీ (1.163.2), సూర్యుడితో పోల్చబడిన సోమానికీ (9.85.12) గంధర్వుడికీ సాహచర్యం చెప్పబడింది. ఇంకా, ఆయనకి నక్షత్రాలతో, ముఖ్యంగా రోహిణితో (అ.వే. 13.1.23), సంబంధం ఆపాదించబడింది (వా.సం. 9.7). ఋగ్వేదంలో 10.123 సూక్తంలో ఆయనకీ ఇంద్రధనుస్సుకీ సంబంధం ఆపాదించబడినట్లు కనపడుతుంది. వా.సం. (18.38, దాని తరవాతవి)లో గంధర్వులు అగ్ని, సూర్యుడు, చంద్రుడు, వాయువులతోపాటు కలిపి చెప్పబడ్డారు. వేదాల తరవాత సాహిత్యంలో ఎండమావికి ఉన్నపేర్లలో 'గంధర్వనగరం / పురం' అనేది ఒకపేరు.

48.3 ఋగ్వేదంలో (ముఖ్యంగా తొమ్మిదో మండలంలో) గంధర్వుడికి సోమంతో సాహచర్యం చెప్పబడింది. ఆయన సోమం ఉండే స్థానాన్నీ, దేవజాతులనీ కాపాడతాడు (9.83.4; చూ. 1.22.14). సోముడి అన్ని రూపాలు చూస్తూ ఆయన స్వర్గం ఉన్నతస్థానంలో నిలబడి ఉంటాడు (9.85.12). పర్జన్యుడు వృద్ధిచేసిన సోమాన్ని సూర్యుడి కూతురు తెచ్చింది; దాన్ని గంధర్వులు తీసుకొని దాంట్లో రసం (= సారం) పెట్టేరు (9.113.3). గంధర్వుడినోటితో దేవతలు తమ పానీయం తాగుతారు (గంధర్వస్య ప్రత్యాస్నా రిహంతి, అ.వే. 7.73.3). గంధర్వులు సోమాన్ని దేవతలకోసం ఉంచారనీ, కాని వారి అశ్రద్ధవల్ల అది దొంగిలించబడిందనీ, దీనికి శిక్షగా గంధర్వులకి సోమపానం నిషేధించబడిందనీ మై.సం. (3.8.10)లో ఉంది. గంధర్వుడికి సోమంతో ఇలా సంబంధం ఉండడం వల్లనే ఆయన మొక్కలని గురించి తెలిసినవాడు అని ఉంది (అ.వే.

4.4.1).[1] ఋగ్వేదంలో గంధర్వుడు ఇంద్రుడికి విరోధిగా ఉండడం ఆయన సోమాన్ని పట్టుదలతో కాపాడేవాడవడం వల్లనే కావచ్చు; ఆయన్ని ఇంద్రుడు అంతరిక్షంలో హింసించాడు (8.77.5); ఇంద్రుడు ఆయన్ని జయించాలని ప్రార్థన ఉంది (9.1.11). ఒక అర్వాచీన సంహిత (తై.సం. 1.2.9.1) లో సోమం గర్దరూపంలో విశ్వావసుడనే గంధర్వుణ్ణి తప్పించుకుపోవాలని ప్రార్థన ఉండడం కూడా దీనికి సూచకం. ఇంతేకాక, సోమం గంధర్వుల మధ్య ఉండేదనీ, విశ్వావసుడనే గంధర్వుడు దాన్ని దొంగిలించాడనీ, కాని గంధర్వులు స్త్రీలోలురు అవడం వల్ల, వారికి వాగ్దేవతని సోమానికి ఖరీదుగా ఇచ్చి (దేవతలు) దాన్ని తెచ్చారనీ ఉంది (ఐ.బ్రా. 1.27; తై.సం. 6.1.6.5; మై.సం. 3.7.3). అవెస్తా (యస్త్. 5.38) లో కెరెసాస్ప అనే ఆయన తెల్లని హఓమకి స్థానమైన వొఉరుకష అనే సముద్రంలో ఉండే గందరెవ అనే శత్రువుతో పోరాడి జయించినట్లు కథ ఉండడం వల్ల ఈ శత్రుత్వం ప్రాచీనమైనదిగా కనపడుతుంది. పైగా, సోమాన్ని ఎత్తుకుపోయే గద్దమీద బాణం వేసిన కృశానువు అనే విలుకాడు (ఋ.వే. 4.27.3) గంధర్వుడైనట్లు కనపడుతుంది, ఆయన గంధర్వుడే అని తైత్తిరీయారణ్యకం (1.9.3) లో స్పష్టంగా ఉంది.

48.4 గంధర్వుడికి నీటితో సంబంధం ఉన్నట్లు కొన్నిచోట్ల ఉంది. ''నీళ్లలో (ఉండే) గంధర్వుడూ'' (గంధర్వో అప్సు), ''నీటిలో యువతీ'' (అప్యాచ యోషా) యముడికీ, యమికీ (యమీ-) తల్లితండ్రులని చెప్పబడింది (10.10.4). నీళ్లలో పోసే సోమం ''నీళ్లలో గంధర్వుడు'' అని చెప్పబడింది (9.86.36). అప్సరసలతో సాహచర్యం కల గంధర్వుడు కూడా నీటిలో ఉంటాడని అథర్వవేదం (2.2.3; 4.37.12) లో చెప్పబడింది. అవెస్తా (యస్త్ 15.28) లో గందరెవ నీళ్లలో ఉంటాడు; అగాధ జలాలకి అధిపతి.

48.5 గంధర్వుడికీ అప్సరసకీ జరిగిన వివాహం విశిష్టమైనది. అందువల్ల వివాహవిధితో గంధర్వుడికి సంబంధం ఉంది; వివాహానికి ముందు కన్య గంధర్వుడికీ, సోముడికీ, అగ్నికీ చెందుతుంది (సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః, తృతీయో అగ్నిష్టే పతిః 10.85.40, 41; వివిదే = పొందేడు). పెళ్లయిన కొత్తలో విశ్వావసు అనే గంధర్వుడు భర్తకి పోటీగా ఉంటాడని భావించబడింది (10.85.21, 22); అర్వాచీన గ్రంథాలలో గంధర్వు

1. యాం త్వా గంధర్వో అఖనద్వరుణాయ మృతభ్రజే

''పుంస్త్వం పోయిన వరుణుడికి దాన్ని మళ్లీ తెప్పించడంకోసం ఏ మొక్కని గంధర్వుడు తవ్వేడో ( ఆ మొక్క అయిన నిన్ను మేం తవ్వుతాం)''

స్త్రీలోలత తరచుగా చెప్పబడింది (చూ. మై.సం. 3.7.3). అందువల్ల గంధర్వులూ, అప్సరసలూ సంతానవృద్ధికి అధిదేవతలు; సంతానం కోరేవారు వారిని పూజిస్తారు (పం. బ్రా. 19.3.2).

48.6 పురాణేతిహాసాలలోనూ, తరవాత గ్రంథాలలోనూ గంధర్వులు స్వర్గలోకంలోని గాయకులు అనే భావన ఉంది; కాని ఋగ్వేదంలో దీనికి సంబంధించిన స్పష్టమైన సూచన ఏమీ లేదు (చూ. 10.177.2; 10.11.2).

48.7 ఋగ్వేదంలో వీరి ఆకారాన్ని గురించి రెండుమూడు చోట్ల మాత్రమే ప్రసక్తి ఉంది. గంధర్వులు వాయుకేశులు "వాయువు జుట్టుగా కలవారు" (3.38.6); వారికి తళతళలాడే ఆయుధాలు ఉన్నాయి (10.123.7). అథర్వవేదంలో (ముఖ్యంగా 4.37; 8.6.1, దాని తరవాతవి) మరికొంత స్పష్టత ఉంది. ఇందులో గంధర్వులు ఒంటినిండా వెంట్రుకలతో సగం జంతురూపంతో ఉండి మనుష్యులకి చాలా విధాలుగా హాని కలిగిస్తారని ఉంది.[3] కాని ఇతర గ్రంథాలలో వారు అందంగా ఉంటారని ఉంది (శ. బ్రా. 13.4.3.7, 8; ★ ఈ విషయంపైన ఇచ్చిన అథర్వవేదం మంత్రంలో కూడా ఉంది). గంధర్వుడు సువాసనగల వస్త్రం ధరిస్తాడు (వసానో అత్కం సురభిం, 10.123.7) అనే కొత్త అంశం ఋగ్వేదంలో ఉంది; అథర్వవేదం (12.1.23) లో భూమి వాసన (గంధ-) గంధర్వుల దగ్గరదాకా పైకివెళ్తుంది అని ఉంది.

48.8 గంధర్వశబ్దం గంధః "(సు)వాసన" నించి వచ్చిందనడానికి పై వాక్యాలు కొంతవరకు ఆధారం కల్పిస్తాయి. ఈ వ్యుత్పత్తి సరి అయినదయినప్పటికీ గంధర్వులని గురించి ప్రాచీనకాలంలో ఉన్న భావనని గురించి ఇది కొత్త విషయమేమీ చెప్పదు. ఇది గ్రీక్ పదమైన కెంత ఉరోస్‌తో జన్మసంబంధం కలది అని కొందరి అభిప్రాయం; కాని ఈ రెండూ ఒకటే అనడానికి లోకనిరుక్తి (= లోకులు చెప్పే అశాస్త్రీయమైన వ్యుత్పత్తి)

---

3. శ్వైకః కపిరివైకః కుమారః సర్వకేశకః
ప్రియో దృశ ఇవ భూత్వా గంధర్వః సచతే స్త్రియ
స్తమితో నాశయామసి బ్రహ్మణా వీర్యావతా (అ.వే. 4.37.11)
"ఒకడు కుక్కలాగా, మరొకడు కోతిలాగా, మరొకడు చిన్నవాడుగా, ఇంకొకడు ఒంటినిండా వెంట్రుకలతో ఉండి చూడ్డానికి అందంగా ఉన్న గంధర్వులు స్త్రీలని చేరతారు; వీర్యవంతమైన మంత్రాలతో వారిని ఇక్కడనించి (పంపేసి) నాశనం చేద్దాం."

సహాయం అవసరమవడమే కాక గ్రీకు పదంలో ఉ కారం అకారణంగా చేరింది అనుకోవాలి. పైగా ఈ రెండు భావనలకీ ఏమీ సాదృశ్యం ఉన్నట్లు కనపబడదు. లభ్యమైనసాక్ష్యాధారాలని పరిశీలించి చూస్తే గంధర్వుడి అసలు స్వభావం గురించి మనం చెప్పగలిగింది - ఆయన ప్రకాశించే దివ్యుడు; ఆయన తన భార్య అయిన అప్సరసతో నీళ్లలో ఉంటాడని కొన్నిచోట్ల భావించబడింది - అది మాత్రమే. కాని పండితులు చాలా రకాల ఊహలు చేశారు. కొందరి ఉద్దేశంలో గంధర్వులు వాయుశక్తులు; మరికొందరు గంధర్వుడు ఇంద్రధనుస్సుకి ప్రతీక అనీ, చంద్రుడికి అధిదేవత అనీ, సోమం అనీ, ఉదయించే సూర్యుడు అనీ, మేఘశక్తి అనీ వేరువేరు అభిప్రాయాలు వ్యక్తం చేశారు.[4]

## 49. స్థానరక్షక దేవతలు

49.1 వాస్తోష్పతి అనే పేరు ఋగ్వేదంలో ఏడుసార్లు మాత్రమే వచ్చింది; మూడు మంత్రాలు కల ఒక సూక్తం (7.54) ఆయన్ని స్తుతించడానికి ఉద్దిష్టమైంది. అందులో ఆయన శుభమైన ప్రవేశం కలిగించమనీ, రోగం పోగొట్టమనీ, మనుష్యులనీ జంతువులనీ ఆశీర్వదించమనీ, పశువృద్ధీ అశ్వవృద్ధీ కలిగించమనీ, ఎప్పుడూ కాపాడమనీ ప్రార్థించబడ్డాడు. దాని తరవాత సూక్తం మొదటి మంత్రం (7.55.1) లో అయన రోగాన్ని పోగొట్టేవాడుగానూ, అన్ని రూపాలు కలవాడుగానూ వర్ణించబడ్డాడు. ఆయన ఒకచోట ఇందు- అనే పదంతో సంబోధించబడడం వల్ల ఆయనకీ సోముడికీ అక్కడ అభిన్నత్వం చెప్పినట్లయింది (7.54.2). విశ్వేదేవతలకి ఉద్దిష్టమైన ఒక మంత్రం (5.41.8) లో ఆయన త్వష్టతో కలిపి స్తుతించబడ్డాడు; ఇక్కడ ఆయన గొప్ప శిల్పిగా త్వష్టకి అభిన్నుడని చెప్పినట్లు కనపడుతుంది. మరొక మంత్రం (8.17.14) లో ఆయన గట్టి స్తంభం అనీ, సోమయాగం చేసేవారికి కవచమనీ ఉండడంవల్ల ఆయనకీ ఇంద్రుడికీ అభిన్నత్వం చెప్పినట్లుంది. పదో మండలంలో ఈయన ప్రసక్తి ఉన్న ఒకే ఒకమంత్రం (10.61.7) లో ఈయన ఆజ్ఞని పాటిస్తాడనీ, దేవతలు ఈయన్ని ప్రార్థన (బ్రహ్మ) తోపాటు సృష్టించారనీ ఉంది. ఇక్కడ రుద్రుడు ఉద్దిష్టుడని గెల్డ్నర్ (Geldner) అభిప్రాయం; దీనికి ఆధారం వాస్తోష్పతి శబ్దం రుద్రుడికి

---

4. సాయణుడు (ఋ.వే. 10.123.7; అ.వే. 4.37.7 వ్యాఖ్య) ఉణాదికోశం (గువిగన్‌వృషోవః, 5.84) ప్రకారం గంధర్వ శబ్దానికి గీతిరూపా వాచోగాః ధారయతీతి గంధర్వః "గీతిరూపమైన వాక్కులని ధరించినవాడు" అని వ్యుత్పత్తి ఇచ్చారు (ఇందులో గో- కిగన్- ఆదేశం; -వ ప్రత్యయం). ఇది కూడా లోకనిరుక్తే కాని శాస్త్రీయం అనుకోడానికి వీల్లేదు.

విశేషణంగా తై.సం. 3.40.10.3లో ఉండడమే. పై మంత్రాలలో ఈయనకి అనేక దేవతలతో అభిన్నత్వం చెప్పబడినా, ఈ శబ్దం (గృహపతి శబ్దం అగ్నికి విశేషణమైనట్లు) మొదట్లో ఏ పెద్దదేవతకీ విశేషణం అనుకోడానికి తగినంత ఆధారంలేదు. గృహ్యసూత్రాలు (ఆ.గృ.సూ. 2.9.9; శాం.గృ.సూ. 3.4; పా.గృ.సూ. 3.4.7) కొత్త ఇంట్లోకి ప్రవేశించేటప్పుడు వాస్తోష్పతిని పూజించాలని చెప్తాయి. ఇదీ, ఈయనకి ఉద్దిష్టమైనసూక్తంలో ఉన్న విషయాలూ, వాస్తోష్పతి ''ఇంటికిపతి'' అనేపేరులాగే, ఈయన ఇంటికి రక్షకుడైన దేవత అనే విషయాన్ని సూచిస్తాయి. అందువల్ల ఈయన ఆదిమానవుల నమ్మకాలలో చెట్లూ, పర్వతాలవంటి ప్రకృతి పదార్థాలలో ఉండి వాటి జీవాంశగా వాటికి ఆధిపత్యం వహించే తక్కువ స్థాయి దేవతలలో ఒకడు అని చెప్పవచ్చు.

49.2 పొలానికి రక్షక దేవత అయిన ''క్షేత్రస్యపతి'' కూడా ఇటువంటివాడే. 4.57 సూక్తంలో మొదటి మూడు మంత్రాలలో ఆయన పశువులనీ గుర్రాలనీ ఇవ్వాలనీ, స్వర్గాన్నీ, భూమినీ, మొక్కలనీ, నీళ్లనీ మధువుతో నింపాలనీ ప్రార్థించబడ్డాడు; ఇక్కడ పూషుడు ఉద్దిష్టుడై ఉండవచ్చునని పెరీ(Perry) అభిప్రాయం. విశ్వేదేవతలకి ఉద్దిష్టమైన ఒకమంత్రం (7.35.10)లో సవితా, ఉషస్సులూ, పర్జన్యుడూ- వీరితోపాటు ఆయన కూడా అభివృద్ధికోసం ప్రార్థించబడ్డాడు. ఇటువంటిదే అయిన మరొక మంత్రం (10.66.13)లో భక్తులు ఆయన తమ పొరుగున ఉండాలి అనే కోరిక వ్యక్తం చేశారు. పొలం దున్నేటప్పుడు ఆయనకి బలి ఇచ్చి పూజించాలి అని చెప్తాయి (ఆ.గృ.సూ. 2.10.4; శాం.గృ.సూ. 4.13.5). పంటలకిసంబంధించినదేవతలనిస్తుతించేసూక్తంలో ఒక మంత్రం (4.57.6)లో నాగటిచాలు (సీతా-) మంచి ఆశీస్సులూ, పంటలూ ఇవ్వాలని ప్రార్థించబడింది. తరవాతకాలపు గ్రంథమైనపా.గృ.సూ. (2.17.9)లో సీతా- ఇంద్రుడి భార్య అని ఉంది (బహుశా దీనికికారణం ఋగ్వేదంలో ఒకచోట (8.21.3; చూ. 4.57.7) ఇంద్రుడు ఉర్వరాపతి- ''పొలానికిపతి'' అని చెప్పబడడం కావచ్చు); సీతా-కి సావిత్రీ- ''సవితపుత్రిక'' అనే తద్ధితరూపం కూడా విశేషణంగా ఉంది (తై.బ్రా. 2.3.10.1). పైనచెప్పినసూత్రగ్రంథ వాక్యంలో ''కళ్లాలు (= ధాన్యంనూర్చే స్థలాలు) దండాగాకల'' ఉర్వరా- ''పంటపొలం'' ఆశీస్సులు ఇవ్వాలని ప్రార్థించబడింది.

# IV. గాథలలో పురోహితులు, వీరులు

## 50. మనువు

50.1 మనువు (మను-, మనుష్- అని రెండు ప్రాతిపదికలు) అనే పదం ఋగ్వేదంలో 'మనుష్యుడు' అనే అర్థంలో కూడా తరచుగా వాడబడడం వల్ల ఇది వ్యక్తిపేరుగా ఎక్కడెక్కడ వాడబడింది అనే విషయంలో కొంత సందిగ్ధత ఉంది. వ్యక్తిపరంగా మను- అనే రూపం సుమారు ఇరవైచోట్లా, మనుష్- అనేరూపం కూడా ఇంచుమించు ఇరవైచోట్లా వాడబడ్డాయి. ఐదుచోట్ల మనువు తండ్రి అని చెప్పబడ్డాడు; వీటిలో రెండుచోట్ల ఇంకా స్పష్టంగా ''మన తండ్రి'' (పితానః, 2.33.13, మొ.; చూ. అధ్యాయం 9). యజ్ఞాలు చేసే వారు మనువు ప్రజలు (విశః, 4.37.1, మొ.) అనీ, అగ్ని మనువు సంతానం మధ్య ఉంటాడనీ (1.68.4) చెప్పబడింది. మనువు ఏడుగురు పురోహితులతో కలిసి యాగాగ్నిని వెలిగించినప్పుడు మొదటి ఆహుతిని దేవతలకి ఇచ్చాడు (10.63.7); అందువల్ల మనువు యజ్ఞాన్ని ప్రారంభించినవాడు. ఈ కాలపు యజ్ఞం మనువు దేవతలకోసం చేసిన యజ్ఞంతో పోల్చబడింది (1.76.5); అందువల్ల మనువు చేసిన యజ్ఞం ఇప్పటి యజ్ఞాలకుమూలం. మనుష్వత్ 'మనువులా' అనే క్రియావిశేషణంతో ఇలా పోలికలు తరచు చెప్పబడ్డాయి. మనువులా మనుష్యులు అగ్నిని యజ్ఞం చేసినవాడుగా చేస్తారు (1.44.11). వారు మనువులా అగ్నిని వెలిగిస్తారు (మనుష్వత్త్వా ని ధీమహి, 5.21.1, మొ.). మనువు మనుష్యులలా వెలిగించిన అగ్నిని వారు ప్రార్థిస్తారు (మనుష్వ దగ్నిం మనునా సమిద్ధం, 7.2.3) మనువులా (మనుష్వత్) వారు సోమం ఆహుతి చేస్తారు (4.37.3). మనువుకోసం ప్రవహించినట్లు సోమం ప్రవహించాలని ప్రార్థన ఉంది (9.96.12). మనువు అగ్నిని ప్రజలందరికీ వెలుగుగా స్థాపించాడు (ని త్వా మగ్నే మను ర్దధే జ్యోతిర్జనాయ శశ్వతే, 1.36.19). మనువు ప్రాచీనకాలంలో యజ్ఞంచేసిన అంగిరసుడు, యయాతి (1.31.17), భృగువు, అంగిరసుడు (8.43.13), అథర్వుడు, దధ్యంచుడు (1.80.16), దధ్యంచుడు, అంగిరసుడు, అత్రి, కణ్వుడు (1.139.9) - వీరితోపాటు కలిపిచెప్పబడ్డాడు. దేవతలు (1.36.10), మాతరిశ్వుడు (1.128.2), మాతరిశ్వుడూ, దేవతలూ (10.46.9), కావ్యుడైన ఉశనుడు (8.23.17)[1] - వీరు అగ్నిని మనువుకి ఇచ్చారు / మనువుకోసం

1. ఈయన ఒక ప్రాచీన ఋషి; యాగం చేసినవాడు (చూ. అధ్యాయం 58 (ii))

యాజకుణ్ణి చేశారు. పైవాటిలో చివరి నాలుగు మంత్రాలలో మనుశబ్దానికి అర్థం ''మనుష్యుడు'' అని కావచ్చు.

50.2 ఇంద్రుడు వివస్వత్తు అయిన మనువుతో (వాలఖిల్యం 4.1 = 8.52.1), సాంవరణి అయిన మనువుతో (వాలఖిల్యం 3.1 = 8.51.1) సోమం తాగేడు; ఆయన వృత్రవధకోసం మనువుకి సంబంధించిన మూడు చెరువుల సోమాన్ని తాగేడు (త్రీ సాక మింద్రో మనుషః సరాంసి సుతం పిబ ద్వృత్రహత్యాయ సోమం, 5.29.7). మనువుకోసం పక్షిసోమాన్ని తెచ్చింది (4.26.4). తై.సం., శ.బ్రా.లలో మనువు పూజలూ వ్రతాలూ చేస్తాడని తరచుగా వర్ణించబడింది.

50.3 మనువు వివస్వత్తు కొడుకని ఋగ్వేదంలోనే భావించబడినట్లు కనపడుతుంది; ఆయన ఒకచోట (వాలఖిల్యం 4.1 = 8.52.1; చూ. 3.1 = 8.51.1) మనౌ వివస్వతి అని చెప్పబడ్డాడు (చూ. అధ్యాయం 18). అ.వే. (8.10.24), శ.బ్రా. (13.4.3.3.)లలోనూ, వేదాల తరవాతసాహిత్యంలోనూ ఆయనకివైవస్వత- 'వివస్వత్తు కొడుకు' అనేతద్ధితరూపం వాడబడింది. యముడు కూడా వివస్వత్తు కొడుకు; మనుష్యులలో మొట్టమొదటివాడు. అందువల్ల మానవజాతికి ఆదిపురుషులుగా మనువూ యముడూ ఒకజంట. (మనువుకీ దస్యులకీ కొన్ని మంత్రాలలో భేదం చెప్పబడింది కాబట్టి మనువు ఆర్యులకే ఆద్యుడు అనడానికి అవకాశం ఉంది.) కాని మనువు భూమిమీద ఉండే మనుష్యులకి ఆద్యుడు; చచ్చిపోయినమనుష్యులలో ఆద్యుడైనయముడు పరలోకంలో మృతులకిరాజు అయ్యాడు. అందువల్లనే శ.బ్రా. (13.4.3.3-5) లో వైవస్వతుడైన మనువు మనుష్యులకి రాజు అనీ, వైవస్వతుడైన యముడు పితృదేవతలకి రాజు అనీ వర్ణించబడింది. యాస్కుడు (నిరుక్తం 12.10) మనువు వివస్వత్తు (= ఆదిత్యుడు / సూర్యుడు)కీ సవర్ణా- (సరణ్యూ- రూపాంతరం)కీ కొడుకు అని చెప్పి (చూ. 10.17.2; అధ్యాయం 4.3.2), ఆయన్ని ద్యుస్థాన దేవతలలో ఒకడుగా పరిగణించారు (నిరుక్తం 12.34; నిఘంటువు 5.6).

50.4 శ.బ్రా. (1.8.1.1-10)లో ప్రళయకాలంలో నీళ్లలో అన్నీ ప్రాణులూ కొట్టుకుపోతుండగా ఒక చేప (ఇది వేదాల తరవాత కాలపు గాథాతత్త్వంలో విష్ణువు అవతారాలలో ఒకటిఅయింది) మనువుని ఒకనావలో పెట్టికాపాడింది అని ఒకకథ ఉంది. ఆ తరవాత మనువు యజ్ఞంచేసి తన ఆహుతుల వల్ల పుట్టిన ఇడ (ఇడా-) అనేపుత్రికద్వారా

మనుష్యజాతిని పుట్టించాడు. జలప్రళయగాథ అథర్వవేదకాలంలోనే ప్రచారంలో ఉండేదని ఆ సంహితలో ఒక మంత్రం (19.39.8) సూచిస్తుంది. ఈగాథ అవెస్తాలో కూడా ఉంది; ఇది మూల ఇండో - యూరపియన్ కాలానికి చెందినది అనడానికి అవకాశం ఉంది. ఇది సెమిటిక్ భాషలనించి ఇతర భాషలలోకి వ్యాపించిందని అంటారు; కాని ఇటువంటి ఊహకి ఆవశ్యకత లేదు.

## 51. భృగువులు

51.1 ఋగ్వేదంలో భృగువు (భృగు-) అనే పేరు ఇరవై యొక్కసార్లు వచ్చింది; ఇవికాక భృగువత్- 'భృగువు(ల)లా' అనే క్రియావిశేషణం రెండుసార్లు వచ్చింది. ఏకవచనంలో ఇది ఒకసారే వచ్చింది; అందువల్ల ఇది ఒక గాథలలో వ్యక్తుల సముదాయానికి వాచకం అనుకోవచ్చు. అగ్ని సూక్తాలలో పన్నెండుచోట్ల స్మరించబడిన భృగువులకి మనుష్యులకి అగ్ని లభించడంతో సంబంధం ఉంది. మాతరిశ్వుడు భృగువు కోసం అగ్నిని ఒక నిధిగా తెచ్చేడు (1.60.1); మాతరిశ్వుడు భృగువులకోసం దాగి ఉన్న అగ్నిని వెలిగించాడు (3.5.10). మాతరిశ్వుడూ, దేవతలూ అగ్నిని మనువుకోసం తయారుచేశారు; భృగువులు తమ శక్తితో ఆయన్ని పుట్టించారు (10.46.9). నీళ్లలో దాగిఉన్న అగ్నిని భృగువులు చూశారు (10.46.2); వారు నీళ్లలో ఉన్న ఆయన్ని పూజించి ఆయన్ని ఆయువు/ మనుష్యుడి ఇళ్లలో పెట్టేరు (2.4.2; చూ. 2.4.4). వారు అగ్నిని స్నేహితుణ్ణి మంచిస్థానంలో పెట్టినట్లు చెట్టులో పెట్టేరు (6.15.2); మనుష్యులలో నిధిలా పెట్టేరు (1.58.6). అగ్ని భృగువులు ఇచ్చిన సంపద (3.2.4). వారు ఆయన్ని మధిస్తూ ప్రార్థించారు (1.127.7) స్తుతులతో వారు ఆయన చెట్టులో (4.7.1) ప్రకాశించేటట్టుచేశారు (10.122.5) వారు ఆయన్ని భూమినాభి (అధ్యాయం 35.16) దగ్గరకి తెచ్చేరు (1.143.4). అథర్వుడ మొట్టమొదటగా యజ్ఞాలతో దేవతలని పూజించగా భృగువులు తమ సామర్థ్యం వల్ల ప్రసిద్ధులయ్యారు (10.92.10). ముఖ్యంగా అగ్నిని పుట్టించడంలో వారికున్న నేర్పు ఇతర కృత్యాలకి కూడా వ్యాపించింది; భృగువులు రథాన్ని చేసినట్లు భక్తులు ఇంద్రుడికోసం / అశ్వినులకోసం స్తుతులు చేస్తారు (= రచిస్తారు, 4.16.20; 10.39.14).

51.2 భృగువులు ఒక పురాతన జాతి అనే విషయం యాజకులు వారిని అంగిరసులూ, అథర్వులతోపాటు కలిపి ''సోమప్రియులైన మా తండ్రులు'' (నః పితరః... సోమ్యాసః,

10.14.6) అని చెప్పడం వల్లా, వారు అగ్నిని భృగువులలా (భృగువత్), అంగిరసులలా, మనువులా అర్చిస్తాం (8.43.13) అని చెప్పడం వల్లా తెలుస్తుంది. వారు ఇంద్రుడు యతుల, భృగువుల ప్రార్థనలు విన్నట్లు తమ ప్రార్థనని వినాలనీ (8.6.18); ఇంద్రుడు యతులకీ, భృగువులకీ, ప్రస్వణ్వుడికీ సహాయం చేసినట్లు తమకి సహాయం చెయ్యాలనీ (8.3.9) కోరేరు. ద్రుహ్యులూ, తుర్వశుడూ, భృగువులూ సుదాసుడు (సుదాస్-) అనే రాజుకి శత్రువులు అని ఉంది (7.18.6). పైన చివరగా ఇచ్చిన మూడు మంత్రాలలో భృగు శబ్దం నిజంగా చరిత్రలో ఉన్న ఒక జాతిని సూచిస్తుంది. ముప్పై ముగ్గురు దేవతలు, మరుత్తులు, నీళ్లు, అశ్వినులు, ఉషస్సు, సూర్యుడు - వీరితోపాటు భృగువులు సోమం లాగాలి అని ప్రార్థన ఉంది (8.35.3). సూర్యులవంటి భృగువులు వారి కోరికలన్నీ సాధించుకొన్నారు (8.3.10). ఒక మంత్రం (9.101.13) లో భృగువులు మఖుడు అనేవాణ్ణి దూరం చేసినట్లు యాజకులు కుక్కవంటి పిసినిగొట్టువాణ్ణి దూరంచెయ్యాలి అని ఉంది (అప శ్వాన మరాధసం హతా మఖం న భృగవః); ఈ గాథ (ఇంకెక్కడా లేకపోవడం వల్ల) అప్రసిద్ధం. (★మఖుడు demon = రాక్షసుడు అని మూలకర్త; తప్పుచేసినవాడు (అపరాద్ధ-) అని సాయణుడు).

51.3 పైన చెప్పిన విధంగా భృగువులు ఋగ్వేదకాలంలో ఉన్న పురోహితులు కారు; వారు ఆదికాలంలో యజ్ఞాలు చేసిన మూలపురుషులు. అంగిరసులలో అంగిరసుడూ, వసిష్ఠులలో వసిష్ఠుడూ లాగా వారిలో భృగువు ప్రధానుడు.

51.4 అగ్ని భూమికి దిగివచ్చి మనుష్యులకి దొరికింది అనే గాథలో ముఖ్యంగా మాతరిశ్వుడుకీ భృగువులకీ సంబంధం ఉంది. కాని మాతరిశ్వుడు దాన్ని స్వర్గాన్నించి మెరుపురూపంలో తెస్తే భృగువులు దాన్ని తేకపోయినా దాన్ని వెలిగించి యజ్ఞం భూమిమీద స్థాపితమై వ్యాపించడానికి దోహదం చేశారు.

51.5 అర్వాచీనవైదికగ్రంథాలలో భృగువు ఒక జాతికి ప్రతినిధి అయిన ఋషి (అ.వే. 5.19.1; ఐ.బ్రా. 2.20.7). ఆయన ప్రజాపతి రేతస్సు నించి పుట్టిన తేజస్సు; ఆయన్ని వరుణుడు పుత్రుడుగా స్వీకరించడం వల్ల ఆయనకి వారుణి 'వరుణుడి కొడుకు' అనే తద్ధితరూపం వాడబడింది (ఐ.బ్రా. 3.34.1; చూ. పం.బ్రా. 18.9.1); ఆయన వరుణుడి కొడుకు అని వాచ్యంగా చెప్పబడింది (శ.బ్రా. 11.6.1.1).

51.6 భృగుశబ్దం భ్రాజ్- 'ప్రకాశించు' అనే ధాతువునించి వచ్చింది కాబట్టి దీని వ్యుత్పత్త్యర్థం 'ప్రకాశించేవాడు' అని. భృగు- మొదట్లో నిప్పుకి ఒక పేరుఅనడంలో సందేహం ఏమీలేదని బెర్గెయిన్(Berga'gne) అభిప్రాయం; అది మెరుపు అనే అగ్ని రూపాన్ని సూచిస్తుందనడంలో కూన్(Kuhn) కీ, బార్త్(Barth) కీ, అంగీకారం ఉంది. కూన్, వెబర్(Weber) అగ్నిని ఆరాధించే పురోహితులైన భృగువుల పేరుకీ గ్రీక్‌భాషలోని ఫ్లెగు అ ఇ అనే పేరుకీ జన్మసంబంధం ఉందని ఊహించారు.

## 52. అథర్వుడు

52.1 అథర్వుడి పేరు (ప్రాతిపదిక అథర్వన్-, ప్రథమా విభక్తి ఏకవచనం అథర్వా, బహువచనం అథర్వాణః) ఋగ్వేదంలో పద్నాలుగుసార్లూ, బహువచనంలో మూడుసార్లూ వచ్చింది; అథర్వవేదంలో కూడా ఇది కొన్నిసార్లు వచ్చింది అథర్వుడు పురాతనకాలంలో పురోహితుడుగా కనపడతాడు. ఆయన అగ్నిని మథించాడు (6.16.13); యాజకుడు అగ్నిని అథర్వుడు మథించినట్లు మథిస్తారు (6.15.17). అథర్వుడు పుట్టించిన అగ్ని వివస్వత్తుకి దూత అయ్యాడు (10.21.5). అథర్వుడు మొట్టమొదటగా యజ్ఞాలతో దేవతలని పూజించగా భృగువులు తమ సామర్థ్యం వల్ల ప్రసిద్ధులయ్యారు (10.92.10). అథర్వుడు యజ్ఞాలు చేసి మొదటగా మార్గాలు చేశాడు; ఆ తరవాత సూర్యుడు ఆవిర్భవించాడు (1.83.5). అథర్వుడూ, తండ్రి అయిన మనువూ, దధ్యంచుడూ యజ్ఞకర్మని ఏర్పాటు చేశారు (ధియ మత్నత, 1.80.16). ఇంద్రుడు అథర్వుడికీ, త్రితుడికీ, దధ్యంచుడికీ, మాతరిశ్వుడికీ సహాయం చేశాడు (10.48.2). రాక్షసులని చంపే అగ్ని అథర్వుడిలా తన దివ్యమైన జ్యోతితో అజ్ఞానిని కాల్చాలి అని ప్రార్థన ఉంది (10.87.12). అథర్వవేదంలో మరికొన్ని విషయాలు ఉన్నాయి. అథర్వుడు ఇంద్రుడికోసం సోమపాత్ర తెచ్చాడు (అ.వే. 18.3.54). వరుణుడు ఆయనకి ఒక మహిమకల ఆవుని ఇచ్చాడు (పృశ్నిం వరుణ దక్షిణాం దదావాన్, 5.11.1; 7.104). అథర్వుడు దేవతల సహచరుడు, వారికి చుట్టం, స్వర్గంలో ఉంటాడు (అ.వే. 4.1.7, మొ.). శ.బ్రా. (14.5.5.22; 14.7.3.28)లో అథర్వుడు ప్రాచీనుడైన ఆచార్యుడు అని ఉంది.

52.2 బహువచనంలో అథర్వులు అంగిరసులూ, నవగ్వులూ, భృగువులతోపాటు

పితరులు అని చెప్పబడ్డారు (10.14.6). వారు స్వర్గంలో ఉంటారు; వారు దేవతలుగా పరిగణించబడ్డారు (అ.వే. 11.6.13). వారు రాక్షసులని ఒక ఓషధి (జమ్మి ఆకుల పొడి)తో నాశం చేశారు (అ.వే. 4.37.1).

52.3 కొన్ని ఋగ్వేద మంత్రాలలో అథర్వన్- శబ్దం 'పురోహితుడు' అనే అర్థంలో విశేషణంగా వాడబడింది. ఉదాహరణకి, అది ఒక సూక్త ద్రష్ట అయిన బృహద్దివుడికి విశేషణంగా వాడబడింది (బృహద్దివో అథర్వావోచత్, 10.120.9, చూ. 8). '' ఒక ఋషి మధురమైన సోమాన్ని ఘర్మం అనే హవిస్సునీ అథర్వుడిలో పోస్తాడు (ఆ సోమం మధుమత్తమం ఘర్మం సించా దధర్వణి, 8.9.7) అని వర్ణించబడిన చోట అథర్వన్‌శబ్దం 'అగ్ని' అనే అర్థంలో వాడబడింది. అథర్వులు సోమం కలుపుతారు (9.4.2), అథర్వులకి అశ్వథుడు వంద గోవులు ఇచ్చాడు (6.47.24) అని ఉన్నచోట్ల కూడా ఈ పదానికి 'పురోహితులు' అని అర్థం (★ 'అథర్వగోత్రులైన ఋషులు' అని సాయణుడు). ఈ పదానికి ఇదే ప్రాచీనమైన అర్థం అని దీనితో జన్మసంబంధం కల ఆథ్రవన్ అనే అవెస్తాలోని పదానికి 'అగ్నిని ఆరాధించే పురోహితుడు' అనే అర్థం ఉండడం ధ్రువీకరిస్తుంది. అవెస్తాలో 'నిప్పు' అనే అర్థంకల ఆతర్ ( ఇది ఆథర్ రూపాంతరం) అనే శబ్దం వేదంలోని అథర్- అనే శబ్దానికి సంబంధించినది; అథర్- నించి ఏర్పడిన అథర్య- శబ్దం అగ్నికి విశేషణంగా వాడబడింది (అగ్నిం ....గృహపతి మథర్యం, 7.1.1). అందువల్ల వ్యుత్పత్తిరీత్యా కూడా అథర్వన్‌శబ్దానికి 'పురోహితుడు' (★= నిప్పుని చేసేవాడు) అనే అర్థం (★ సాయణుడు అథర్య శబ్దానికి '' ఆగమ్యం అతనవంతంవా'' (రాదగినవాడు / గమనం (అత్- ధాతువు) కలవాడు) అని ఇచ్చిన అర్థాలు ఈ శబ్దం చరిత్ర తెలుసుకోవడానికి అవకాశం లేక ''స్థితస్య గతిశ్చింతనీయా'' అనే దృష్టితో చెప్పినవని స్పష్టం). (''పురోహితుడు'' అనే అర్థం ఉన్న) ఈ ప్రాచీన పదం దివ్యస్వభావం ఆపాదించబడిన ఒక ప్రాచీన పురోహిత కులానికి అంతకీ వాడబడింది; ఈ కులాన్ని సూచించడానికి అందులో ముఖ్యుడి పేరు (ఏకవచనంలో) సాధారణంగా వాడబడింది (★ దీనికి ఇతరోదాహరణలు అధ్యాయం 51.3లో ఉన్నాయి).

## 53. దధ్యంచుడు

53.1 అథర్వుడి కొడుకైన దధ్యంచుడి పేరు (6.16.14; 1.116.12; 1.117.22)

ఋగ్వేదంలో తొమ్మిదిచోట్ల వచ్చింది; వీటిలో ఒకటి తప్ప మిగిలినవి అన్నీ తొమ్మిది, పది మండలాలలోనూ, ముఖ్యంగా మొదటి మండలంలోనూ మాత్రమే ఉన్నాయి (★ దీని ప్రాతిపదిక దధ్యంచ్-; ప్రథమైక వచనరూపం దధ్యఙ్). ఆయన నిప్పుని వెలిగించిన ఒక ఋషి; అథర్వుడి కొడుకు (త ము త్వా దధ్యఙ్ ఋషిః పుత్ర ఈధే అథర్వణః, 6.16.14); ఆయనపేరు అథర్వుడు, అంగిరసుడు, మనువు మొదలైన ప్రాచీన యజ్వలపేర్లతోపాటు చెప్పబడింది (1.80.16; 1.139.9).

53.2 అథర్వుడి కొడుకైన దధ్యంచుడికి అశ్వినులు ఒక గుర్రంతల ఇచ్చారు; అప్పుడు ఆయన వారికి త్వష్టకి సంబంధించిన మధువు (ఉండేచోటు) చెప్పేడు (స వాం మధు ప్రవోచత్..... త్వాష్ట్రం, 1.117.22). ఆథర్వణుడైన దధ్యంచుడు గుర్రం తలతో అశ్వినులకి మధువు (ఉండేచోటు) చెప్పేడు (దధ్యఙ్ హ యన్ మధ్వాథర్వణో వా మశ్వస్య శీర్ష్ణా ప్రయదీ మువాచ, 1.116.12). అశ్వినులు దధ్యంచుడికి పరిచర్యచేసి ఆయన్ని మెప్పించారు; అప్పుడు గుర్రంతల వారికి చెప్పింది (అథా శిరః ప్రతివా మశ్వ్యం వదత్, 1.119.9).[1] ఈ గాథలో ఇంద్రుడికి కూడా సంబంధం ఉంది: ఇంద్రుడు పర్వతాలలో దాచబడిన దధ్యంచుడి గుర్రం తల వెతికి దాన్ని శర్యణావత్ (అనే సరస్సు) లో చూసి పట్టుకొన్నాడు; దధ్యంచుడి (గుర్రంతల) ఎముకలతో తొంభై తొమ్మిది మంది వృత్రులని (= రాక్షసులని) ఇంద్రుడు చంపేడు (ఇంద్రో దధీచో అస్థభి ర్వృత్రాణి.... జఘాన నవతీర్నవ, 1.84.13, 14).[2] ఇంద్రుడు (వృత్రుడనే) పాము దగ్గరనించి త్రితుడికోసం గోవులని పుట్టించడమే కాక దధ్యంచుడికీ, మాతరిశ్వుడికీ గోశాలలు ఇచ్చాడు (10.48.2). దధ్యంచుడు సోమశక్తితో తెరిచేగోశాలలు (9.108.4) ఇవే అయి ఉంటాయి. దధ్యంచుడి పేరు ఉన్న మంత్రాలలో ఒకేఒకటి (6.16.14) ప్రాచీనభాగాలలోది

---

1 సాయణుడు (1.116 12 వ్యాఖ్య) ఈ కథ వివరాలు ఇలా చెప్పేరు: "ఇంద్రుడు దధ్యంచుడికి ప్రవర్గ విద్యనీ, మధు విద్యనీ ఉపదేశించి దీన్ని నువ్వు ఇతరులకి చెప్తే నీ తల కోస్తాను అన్నాడు; అప్పుడు అశ్వినులు దధ్యంచుడి తలకోసి ఒకచోట దాచి ఆయనకి ఒక గుర్రంతల పెట్టేరు; ఆ గుర్రంతలతో దధ్యంచుడు వారికి ఋగ్యజస్సామాల్నా, ప్రవర్గ్య విషయాల్నా, మధువిద్యని ప్రతిపాదించే బ్రాహ్మణమూ చెప్పేడు; ఇంద్రుడు ఈ విషయం తెలుసుకొని వజ్రంతో ఆ తల కోసేశాడు; అప్పుడు ఆయనకి ఆయన అసలు తల అతికేరు - ఈ కథ శాట్యాయన వాజసనేయ గ్రంథాలలో విపులంగా ఉంది."

2. నవతీర్నవ అంటే సాయణుడు చెప్పినట్లు 90 x 9 = 810 అని అర్థం చెప్పడం యుక్తం; మూలకర్త 99 అని అర్థం ఇచ్చారు.

అవడమూ అందులో ఆయన అగ్నిని ఆరాధించే పురోహితుడైన అధర్వుడి కొడుకు అనీ, ఆయన కూడా అగ్నిని ఆరాధించేవాడే అనీ ఉండడమూ గమనించదగినవి. ఇతరత్రా ఆయనకి ముఖ్యంగా సోమం ఉండే రహస్యస్థలంలోనూ, ఆవులని విడిపించడంలో ఇంద్రుడితోనూ సంబంధం చెప్పబడింది. ఆయన పేరూ, ఆయనకి గుర్రం తల ఉండడమూ చూస్తే ఆయనకి దధిక్రా- అనే గుర్రంతో అసలు సంబంధం లేదని చెప్పడం అసాధ్యం. ఈ పేరుకి వ్యుత్పత్తి ప్రకారం ( దధి- అంచ్- 'పెరుగువైపు') 'పెరుగు కలవాడు' / 'పెరుగు అంటే ఇష్టం కలవాడు' అని అర్థం చెప్పవచ్చు. బెర్గెయిన్(Berga˙gne) అభిప్రాయంలో దధ్యంచుడికీ సోమానికీ/ సోముడికీ ఉత్పత్తిలో ఎక్కువ భేదం లేదు. కాని, దొరికే సాక్ష్యాధారం ఇదమిత్థమైన నిర్ణయం చెయ్యడానికి చాలదు. కాని దధ్యంచుడు మొదట్లో అగ్ని రూపాంతరమైన మెరుపుకి ప్రతీక అనే ఊహ పూర్తిగా అసమంజసం కాకపోవచ్చు. గుర్రం తల దాని ( = మెరుపు) వేగాన్నీ, అది మాట్లాడే ధ్వని ఉరుమునీ, దాని ఎముకలు పిడుగునీ సూచిస్తాయి. ఆయనకి సోమం ఉండే రహస్య స్థానంతో సంబంధం గర్దకీ సోమానికీ ఉన్న సంబంధాన్ని పోలి ఉంది. ఈ పేరుకూడా తుపాను ద్రవాలని గడ్డ కట్టించడాన్ని స్మరణకి తెస్తుంది. వేదాల తరవాత సాహిత్యంలో ఈ పేరు సాధారణంగా దధీచ- అనే రూపంతో కనపడుతుంది; మహాభారతంలో వృత్రుణ్ణి చంపడానికి ఉపయోగించిన వజ్రం దధీచుడి ఎముకలతో చేయబడింది అని ఉంది.

## 54. అంగిరసులు

54.1 అంగిరస్- శబ్దానికి ఋగ్వేదంలో ఉన్న అరవైకంటె ఎక్కువ ప్రయోగాలలో సుమారు మూడింట రెండువంతులు బహువచనంలో ఉన్నాయి ( ప్రథమైకవచనం అంగిరాః, ప్రథమా బహువచనం అంగిరసః). దీన్నించి వచ్చిన తద్ధితరూపాలు కూడా అందులో సుమారు ముప్ఫైచోట్ల ఉన్నాయి. అంగిరసులు ఒక సముదాయంగా ఒక పూర్తిసూక్తం (10.62)లో స్తుతించబడ్డారు.

54.2 అంగిరసుడు స్వర్గం కొడుకులు ( దివస్పుత్రాసః, 3.53.7 10.67.2; చూ. 4.2.15). వారు దేవతల పుత్రులైన ఋషులు (10.62.4). అంగిరసుడు అనే ఆయన వారి మూల పురుషుడవడం వల్ల వారు అంగిరసుడి పుత్రులు ( అంగిరసః సూనవః, 10.62.5) అని కూడా చెప్పబడ్డారు. కవులు వారిని 'తండ్రులు' (పితరః, 10.62.2).

'మా తండ్రులు' (1.71.2), 'మా పూర్వులైన తండ్రులు' (నః పూర్వే పితరః, 1.62.5) అని అన్నారు. ఒకచోట (10.14.6) అథర్వులూ, భృగువులతో పాటు కలిపి తండ్రులు అని చెప్పబడ్డారు; ఇక్కడ వారికి ముఖ్యంగా యముడితో సాహచర్యం ఉన్నట్లు చెప్పబడింది (10.14.3-5). వారు సర్వసాధారణమైన రీతిలో ఇతర దేవతా సముదాయాలైన ఆదిత్యులూ, వసువులూ, మరుత్తులూ (7.44.4; 8.35.14), ఆదిత్యులూ, రుద్రులూ, వసువులూ, అథర్వులూ (అ.వే. 11.8.13) - వీరితో కలిపి కూడా చెప్పబడ్డారు. వారికి సోమం ఆహుతి ఇవ్వడం ఉంది (9.62.9); వారు దేవతలలాగే ఆహ్వానించబడ్డారు (3.53.7; 10.62). వారు బ్రహ్మలు అనబడే యాజకులు (బ్రహ్మాణో అంగిరసః),7.42.1) వారు వనంలో ఉన్న అగ్నిని కనిపెట్టేరు (5.11.6); వారు యజ్ఞానికి ప్రథమమైన స్థానాన్ని (గురించి) ఆలోచించారు (యజ్ఞస్యధామ ప్రథమం మనంత, 10.67.2). వారు అమర్త్యత్వమూ, ఇంద్రుడి సఖ్యమూ యజ్ఞంద్వారానే పొందేరు (10.62.1)

54.3 అంగిరసులకి ఇంద్రుడితో చాలా సన్నిహితత్వం ఉంది. వారికి ఇంద్రుడు గోవులని చూపించాడు (8.52.3); వారికోసం ఆయన గోశాల తెరిచాడు (1.51.3; 1.134.4); వారికోసం వలుణ్ణి చంపి దాచబడిన ఆవులని బయటకి తోలేడు (8.14.8). వారితోడుతో ఇంద్రుడు వలుణ్ణి చంపి (2.11.20) ఆవులని బయటికి తోలేడు (6.17.6). వారి నాయకుడుగా ఇంద్రుడు అంగిరస్తమ- 'అంగిరసులలో ముఖ్యుడు' అని రెండుచోట్ల (1.100.4; 1.130.3) చెప్పబడ్డాడు. (ఇంద్రుడికి ఉత్సాహం కలిగించే) సోమం కూడా అంగిరసుల కోసం గోశాలని తెరిచింది అని ఒకచోట (9.86.23) ఉంది. గోవులని విడిపించడం అనే గాథలో అంగిరసుల గానానికి ఒక విశిష్టస్థానం ఉంది. వారిచేత స్తుతించబడి ఇంద్రుడు వలుణ్ణి చీల్చాడు (2.15.8); గోశాలలని తెరిచాడు (4.16.18); వలుణ్ణి చంపి వాడి కోటలు తెరిచాడు (6.18.5); చీకటి పోగొట్టి, భూమిని విశాలం చేసి, స్వర్గం కిందభాగం స్థిరం చేశాడు (1.62.5). సామగానం చేసే మరుత్తులు అంగిరసులతో పోల్చబడడం వల్ల (అంగిరసో న సామభిః, 10.78.5) అంగిరసుల గానం ఎంత విశిష్టమైనదో తెలుస్తుంది; అంగిరసుల సామాలతో పొగడబడి దేవతలు యజ్ఞానికి ఆహ్వానించబడతారు (1.107.2). పురోహితులు ఇంద్రుణ్ణి స్తుతించడానికి ఉపయోగించే సామాలు అంగిరసుల సామాలతో కొన్నిచోట్ల పోల్చబడ్డాయి (1.62.1, 2, మొ.; ★ నిజానికి ఇక్కడ పోలిక కాక

''అంగిరసులు అర్చించిన సామాలతో మేము అర్చిస్తాము' అని భేదమే చెప్పబడింది) గోవులకి సంబంధించిన గాథ ఉన్న కొన్నిచోటుల్లో ఇంద్రుడికి అంగిరసులకన్న తక్కువ ప్రాముఖ్యం వచ్చింది (★వేదగాథలలో ఇటువంటి మార్పులు తరచుగా ఉన్నాయి) ఉదాహరణకి, అంగిరసులు ఇంద్రుడి సహాయంతో (ఇంద్రేణయుజా) గోవులని గుర్రాలని శాలనించి బయటకి తోలేరు అని ఉంది (10.62.7). ఇది ఇంద్రుణ్ణి పూర్తిగా వదిలేసి ఆయన చేసిన పని అంగిరసులే చేసినట్లు చెప్పబడానికి మధ్యమెట్టు. యజ్ఞం వల్ల వారు ఆవులని బయటకి తోలేరు; వలుణ్ణి భేదించారు (10 62.2), సూర్యుణ్ణి ఆకాశంలోకి ఎక్కించారు, తల్లి అయిన భూమిని విస్తరం చేశారు (10.62 3) యజ్ఞం వల్ల వారు రాతిని చీల్చి ఆవులతో పాటు అరిచారు (4.3.11; ★ ఆవులతో కలిశారు అని సాయణుడు) సామాలతో ఇంద్రుణ్ణి అర్చిస్తూ వారు గోవులని పొందేరు (1 62 2) స్తుతులతో వారు రాతిని బద్దలుకొట్టి కాంతిని చూశారు (1.71.2). సరమ ఇంద్రుడి కోసం పణుల గోవులని వెతికిపట్టుకోవడంలో అంగిరసులకి కూడా సంబంధం ఉంది (10 108 8, 10); ఆమె వాటిని వెతికిపట్టుకోవడంలో ఇంద్రుడికీ అంగిరసులకీ సహాయం చేసిందని ఉంది(1.62.3; చూ 1.72.8). అంగిరసులే స్వయంగా పణుల గోవులని గుర్రాలని వెతికిపట్టుకొన్నారని కూడా ఉంది (1.83.4). ఈ గాథతో సంబంధం ఉన్న బృహస్పతికి (10.108.6, 11) అంగిరస- అనే విశేషణం వాడబడింది, అంగిరసుడైన బృహస్పతి రాతిని చీల్చి ఆవులని పట్టుకొన్నాడు (బృహస్పతి రాంగిరసః, 6.73.1), ఘాడి వంటి బృహస్పతి ఆవులని తెచ్చాడు (10.68.2).

54.4 ఇంద్రుడితో కలిసి ఆవులని బయటికి తోలి నీటిని విడిపించిన బృహస్పతి అంగిరసుడు అనే చెప్పబడ్డాడు (2 23.18) అంగిరస్- శబ్దం ఏకవచనంలో ఉన్నప్పుడు ఇతరత్రా ఇంచుమించు అన్నిచోట్లా అది అగ్నినే సూచిస్తుంది అగ్ని మొదటి అంగిరసుడు (త్వమగ్నే ప్రథమో అంగిరాః, 1.31.1); పూర్వుడైన అంగిరసుడు (పూర్వో అంగిరాః, 10.92.15); అంగిరసులలో జ్యేష్ఠుడు (జ్యేష్ఠమంగిరసాం, 1.127.2), వారిలో గొప్ప మేధావి (వేపిష్ఠో అంగిరసాం, 6.11.3). అగ్ని అంగిరసులలో ముఖ్యుడు (అంగిరస్తమ, 1.75.2, మొ) అని కూడా కొన్నిచోట్ల ఉంది. కాని, ఈ పదం ఒకటి రెండుచోట్ల ఇంద్రుడికీ, ఉషస్సుకీ, సోముడికీ కూడా వాడబడింది. కొన్నిచోట్ల అంగిరస్- శబ్దం స్పష్టంగా అగ్నిని సూచించేదిగా కాక ఒక ప్రాచీన ఋషిని సూచించేదిగా వాడబడింది;

కొందరు ప్రాచీనులతోపాటు పూర్వో అంగిరాః అని ఉన్నచోటా (1.139.9), అంగిరస్వత్ (1.145.3) 'అంగిరసుడిలా' అనే పదం ఒక అంగిరసుణ్ణి సూచిస్తుందని సందర్భం స్పష్టంచేసేచోటా ఈ అర్థం ఉంది. ఒకమంత్రం (1.31.17) లో కవి "అగ్నీ! అంగిరసుడా! మనువు యజ్ఞానికీ, అంగిరసుడి యజ్ఞానికీ వచ్చినట్లు మా యజ్ఞానికిరా!" అని ప్రార్థించినచోట ఈ పేరు ప్రాచీనుణ్ణే అగ్నినీ కూడా సూచిస్తుంది (మనుష్వ దగ్నే అంగిరస్వ దంగిరః).

54.5 అంగిరసులు అంగిరసుడు అనే ఋషిగోత్రానికి చెందిన నిజమైన వ్యక్తులే అనే భావం ఉందని ఋగ్వేదానుక్రమణి చెప్పిన సంప్రదాయం వల్ల తెలుస్తుంది. తొమ్మిదో మండలాన్ని దర్శించినవారు వారే అని అందులో ఉంది. అథర్వవేదం (అ.వే. 100.7.20) లోనూ, తరవాత (శ.బ్రా. 11.5.6.7, మొ.) అథర్వవేదానికి పేరుగా వాడబడిన 'అథర్వాంగిరసః' అనే సమాసం కూడా ఆ గోత్రాలకి చెందిన ఋషి కుటుంబాలనే సూచిస్తుందనవచ్చు (★వారు అథర్వవేదాన్ని దర్శించినవారు అని భావం).

54.6 మొత్తంమీద అంగిరసులు దేవతలకీ మనుష్యులకీ మధ్యస్థాయిలో ఉన్న ఒక ఉన్నతసముదాయంగా మొదట్లో భావించబడ్డారనీ, వారు స్వర్గానికీ భూమికీ మధ్యదూతగా వర్ణించబడినఅగ్నికి (చూ. అధ్యాయం 35.32) అనుయాయులనీ, వారిని పురోహితులుగా భావించడం తరవాతకాలంలో వచ్చిన పరిణామమనీ చెప్పడానికి అవకాశం ఉంది. వారు స్వర్గానికి దూతలుగా భావించదగిన అగ్ని జ్వాలలకి పురుషలారోపాలు అనడానికి కూడా కొంత అవకాశం ఉంది (చూ. ఋ.వే. 7.3.3). అంగిరస్- శబ్దానికి 'దూత' అనే అర్థం కల గ్రీకు భాషాపదమైన ఆగ్గెలోస్‌తో జన్మసంబంధం ఉండడం ఈ ఊహని సమర్థిస్తుంది. కాని వెబర్ (Weber) అంగిరసులు మూల ఇండో- ఇరానియన్ కాలానికి చెందిన పురోహితులు అని అభిప్రాయపడ్డారు.

## 55. విరూపులు, నవగ్వులు, దశగ్వులు, సప్తర్షులు

55.1 **(i) విరూపులు :** విరూపులు (విరూప-) అంగిరసులతో చాలా సన్నిహిత సంబంధం కలవారు; ఈ పేరు బహువచనంలో మూడుసార్లు వచ్చింది. అంగిరసులూ, విరూపులూ స్వర్గానికి పుత్రులు (దివస్పుత్రాసః, 3.53.7). విరూపులు ఋషులు, అంగిరసుడి కొడుకులు; అగ్నినించి పుట్టినవారు; స్వర్గాన్నించి పుట్టినవారు (విరూపాస ఇ

దృషయః...తే అంగిరసః సూనవస్తే అగ్నేః పరి జజ్ఞిరే, 10.62.5; దివస్పరి, 10.62.6) విరూప- అనేది అగ్నిని స్తుతించే ఒక వ్యక్తి పేరుగా ఒకమంత్రం (8.75.6) లో ఉంది; దీనిపై మంత్రంలో అంగిరసుడు ప్రార్థించబడ్డాడు. విరూపవత్- 'విరూపుడులా' అనే క్రియావిశేషణంలో (1.45.3) విరూపుడనే ఒక వ్యక్తే ఉద్దిష్టుడని దీనితోపాటు ఆ మంత్రంలో ఉన్న ప్రియమేధవత్, అత్రివత్ (అంగిరస్వత్ కూడా) అనే పదాలవల్ల స్పష్టమవుతుంది. ఒకమంత్రం (10.14.5) లో దీనినించి వచ్చిన వైరూపైః 'విరూపులకి సంబంధించిన వారితో' అనే తద్ధితరూపం వాడబడింది; ఇందులో యముడు అంగిరసులతోనూ వైరూపులతోనూ యజ్ఞానికి రావాలని ప్రార్థన ఉంది (★ ఇక్కడ వైరూపైః అనేది అంగిరోభిః అనే దానికి విశేషణం కావచ్చు). ఈపదం 'నానారూపాలు కల (వారు)' అనే అర్థం కల విశేషణం కాబట్టీ, ఇది పేరుగా వాడబడిన చోటుల్లో అంగిరసుడి / అంగిరసులతో ఉంటుంది కాబట్టీ ఇది అంగిరసుడికి / అంగిరసులకి విశేషణమే కాని పేరు కాదు.

55.2 (ii) నవగ్వులు: ఋగ్వేదంలో దీనికి మొత్తం పధ్నాలుగు ప్రయోగాలే ఉన్నాయి; వాటిలో ఆరుచోట్ల ఇది అంగిరసుల పేరుతో కలిసివచ్చింది. వీరు అంగిరసులు, అథర్వులు, భృగువులతోపాటు ''మా పూర్వులైన తండ్రులు'' (6.22.2), ''మా తండ్రులు'' (10.14.6) అని చెప్పబడ్డారు. ఇంద్రుడు, సరమ, పణుల గోవులకి సంబంధించిన కథలో అంగిరసులతోపాటు వీరికీ ప్రమేయం ఉంది (1.62.3, 4; 5.45.7; 10.108.5). ఇంద్రుడు నవగ్వుల సహాయంతో ఆవులని వెలికేడు (3.39.5). సోమాన్ని పిండి వారు ఇంద్రుణ్ణి స్తుతులతో స్తుతిస్తారు; గోశాలని తెరిచారు (5.29.12). ఒకసూక్తం (5.45.7, 11) లో వారి చేతులలో సోమం పిండే రాళ్ళు శబ్దంచేస్తూ ఉండగా వారు పదినెలలు అర్చించారు అని ఉంది. నవ్గాః అనే బహువచనరూపం రెండుచోట్ల విశేషణంగా వాడబడింది (★ దీనికి నూతన గమనాః ''కొత్త గమనం కలవి'' అని సాయణుడి అర్థం); వీటిలో ఒకచోట ఇది అగ్నిజ్వాలలకి విశేషణం (6.6.3). ఇది ఏకవచనంలో ఉన్న మూడుచోట్లా ఇది అంగిరసుడికి (4.51.4; 10.62.6) లేక దధ్యంచుడికి (9.108.4) విశేషణంగా ఉన్నట్లు కనపడుతుంది. దీని మౌలికార్థం ''సముదాయంగా వెళ్లే తొమ్మిదిమంది'' అనవచ్చు; ఇది బహువచనంలో విశేష్యంగా వాడబడినప్పుడు తొమ్మిదిమంది ప్రాచీన ఋషుల సముదాయాన్ని సూచిస్తుంది (★ సాయణుడు దీనికి ''తొమ్మిది మాసాలు గోవులకోసం యజ్ఞం చేసినవారు'' (నవమాసపర్యంతంగవార్థమనుతిష్ఠంతః) / ''తొమ్మిది

గోవులు కలవారు'' (నవగోయుక్తాః) అని వ్యుత్పత్తులు ఇచ్చారు (5.45.7 వ్యాఖ్య)).

55.3 **(iii) దశగ్వులు:** ఈపేరు ఋగ్వేదంలో ఏడుసార్లు వచ్చింది; వీటిలో మూడుచోట్ల ఇది ఏకవచనంలో ఉంది; రెండుచోట్ల మాత్రమే దీనితోపాటు నవగ్వుల పేరు లేదు దశగ్వులు మొదట యజ్ఞం చేసినవారు (2.34.12). ఇంద్రుడు నవగ్వులతో ఆవులని వెతికేడు; పదిమంది దశగ్వులతో సూర్యుణ్ణివెతికిపట్టుకొన్నాడు (3.39.5). ఇంద్రుడు నవగ్వులు దశగ్వులతో రాతినీ వలుణ్ణీ చీల్చాడు (1.62.4). నవగ్వులూ దశగ్వులూ ఇంద్రుణ్ణిస్తుతించిగోశాలనితెరిచారు (5.29.12). నవగ్వుడైన అంగిరసుడి మీదా ఏడు ముఖాలు కల దశగ్వుడిమీదా (దశగ్వే సప్తాస్యే) ఉషస్సులు ప్రసరిస్తాయి (4.51.4). నవగ్వుడితోపాటు చెప్పబడిన దశగ్వుడు అంగిరసులలో ముఖ్యుడు అని ఒకచోట (10.62.6) ఉంది. ఒకచోట (8.12.2) ఇంద్రుడు దశగ్వుణ్ణి రక్షించాడు అని ఉంది. ఈ శబ్దానికీనవగ్వశబ్దానికీసంఖ్యలో మాత్రమే భేదముందికాబట్టి ఇది నవగ్వశబ్దం నమూనాగా ఏర్పడినది కావచ్చు.

55.4 **(iv) సప్తర్షులు:** సప్తర్షులు అని ఒక ప్రత్యేకమైన సంఖ్యతో చెప్పబడిన ఒక ప్రాచీన ఋషి సముదాయం ప్రసక్తి ఋగ్వేదంలో నాలుగుసార్లు మాత్రమే వచ్చింది. ఒకకవి (★పురుకుత్సుడికొడుకైన త్రసదస్యువు) వారిని ''మా తండ్రులు, ఏడుగురు ఋషులు'' (అస్మాకమత్రపితరః....సప్తఋషయః, 4.42.8). వారు దివ్యులు (దైవ్యాః, 10.130.7)· మరొకమంత్రం (10.109.4) లో పూర్వులైనసప్తర్షులకీదేవతలకీసాహచర్యం చెప్పబడింది. యజ్ఞం చేయించే యాజకుల సంఖ్య ఏడు అవడం (వీరిపేర్లు 2.1.2లో ఇవ్వబడ్డాయి) వీరు ఏడుగురు అని చెప్పడానికి సూచకమై ఉండవచ్చు;[1] ఇది నిజమయితే వీరు అనాదికాలంలోని యాజకులుగా భావించబడి ఉండవచ్చు. శ.బ్రా. (14.5.2.6; బృహదారణ్యకోపనిషత్తు2.2.6) లో వీరిలో ఒక్కొక్కరికి ప్రత్యేకమైన పేర్లుచెప్పబడ్డాయి.[2] అదేబ్రాహ్మణగ్రంథంలో (2.1.2.4; చూ. 8.1.10) వారుసప్తర్షిమండలంలోని నక్షత్రాలనీ వారుమొదట్లో ఎలుగుబంట్ల రూపం కలవారనీ చెప్పబడింది. ఇలా ఈ ఋషులకి

---

1. యాజకులు ·1. హోత, 2. పోత, 3. నేష్ట, 4. అగ్నిత్ (= ఆగ్నీధ్రుడు), 5. ప్రశాస్త, 6. అధ్వర్యుడు, 7. బ్రహ్మ (= బ్రాహ్మణాచ్ఛంసి).

2. సప్తర్షుల పేర్లు: 1. గోతముడు, 2. భరద్వాజుడు, 3. విశ్వామిత్రుడు, 4. జమదగ్ని, 5. వసిష్ఠుడు, 6. కశ్యపుడు 7. అత్రి.

నక్షత్రాలకీ ఏకత్వం చెప్పడానికి సంఖ్య సమానంగా ఉండడం ఒక కారణమూ, ఋషి శబ్దానికీ ఋక్షశబ్దానికీ ధ్వనులలో సాదృశ్యం ఉండడం మరొక కారణమూ అనడంలో సందేహం లేదు; ఋగ్వేదంలో ఋక్షశబ్దానికి 'నక్షత్రం' అనీ (1 24.10) 'ఎలుగుబంటి' అనీ (5.56.3) రెండు అర్థాలూ ఉన్నాయి.

55.5 ''నవగ్వలతో ఇంద్రుణ్ణి స్తుతించే ఏడుగురు ఋషులు'' (విప్రాః, 6.22.2, మూ 3.31.5; 4.2.15) అన్నప్పుడూ, ''మనువు మొట్టమొదటగా ఏడుగురు హోతలతో యజ్ఞం చేశాడు'' (10.63.7) అన్నప్పుడూ ఉద్దిష్టులైనది ఈ ప్రాచీనులైన సప్తర్షులే కావచ్చు. ఇదేవిధంగా ''దివ్యులైన ఇద్దరు హోతలు'' (దైవ్యా హోతారా) అని ఋగ్వేదంలో సుమారు పన్నెండుచోట్ల చెప్పబడినవారు (★వేరువేరు పనులు చేసే) ఇద్దరు యాజకులకి తుల్యులు అయి ఉండవచ్చు.

## 56. అత్రి

56.1 ఋగ్వేదంలో ప్రాచీన ఋషులు అని చాలా తరచుగా చెప్పబడినవారిలో అత్రి ఒకరు. అందులో ఈపేరు ఏకవచనంలో సుమారు నలభైసార్లు ఆయన సంతానాన్ని సూచించే బహువచనరూపంలో (అత్రయః) ఆరుసార్లూ వచ్చింది. అత్రి ఐదు జాతులకి చెందిన ఋషి (1.117.3) అని చెప్పబడింది; మనువు మొదలైనమనుష్యజాతికి ఆదిపురుషులైన వారి పేర్లలో అత్రిపేరు కూడా ఉంది (1.39.9).

56.2 అగ్ని అత్రికీ (7.15.5), ఇతర ప్రాచీన ఋషులకీ (1.45.3· 10.150.5) సహాయం చేసినట్లు ఉంది. ఇంద్రుడు కూడా అత్రి ప్రార్థన విన్నాడు (8.36.7); ఇంద్రుడు ఆయనకోసమూ అంగిరసుల కోసమూ గోవులని తెరిచాడు (1.51.3). కాని అత్రి ముఖ్యంగా అశ్వినుల రక్షణకు పాత్రుడైనట్లుగా ఉంది; ఆయనకి సంబంధించిన గాథలో అశ్వినులకి ప్రమేయం ఉంది. వారు అత్రిని చీకటినించి తప్పించారు (6.50.10, 7.71.5). వారు దుష్టుడైన దస్యుడి మాయ నాశనం చేసి (1.117.3) అత్రిని (5.78.4) ఆయన గణంతోపాటు (1.116.8; 1.117.3) నిప్పుగుండంనించి కాపాడేరు. ఆయన పడిన నిప్పుగుండం మండుతూ ఉన్నది; వారు ఆయనకి బలకరమైన పానీయం ఇచ్చి దాన్నించి బయటకి తీసి రక్షించారు (1.116.8; 1.118.7). వారు మండే నిప్పుగుండాన్ని (ఋబీస-) / నివాసాన్ని (గృహ-) అత్రికి సుఖకరమైనదాన్నిగా చేశారు (10.39.9;

8.73.7); వారు అగ్ని ఆయన్ని కాల్చకుండా నివారించారు (8.73.8). వారు వేడిలో ఉన్న అత్రిని కాపాడేరు (10.80.3); వారు ఆయనికి చల్లదనం ఇచ్చి వేడినించి కాపాడేరు(1.119.6; 8.73.3); వారు మంటవేడిని అత్రికి సుఖకరమైనదాన్నిగా చేశారు (1.112.7). ఒకచోట (10.143.1,2) వారు ముసలివాడైపోయిన అత్రిని యువకుడుగా మార్చారని ఉంది.

56.3 అత్రి స్వర్భాను- అనే రాక్షసుడు దాచివేసిన సూర్యుణ్ణి వెతికిపట్టుకుని ఆకాశంలో పెట్టేడని ఒకసూక్తంలో ఉంది (5.40.6, 8). కాని వీటి తరవాత మంత్రం (9)లో ఈపని అత్రులంతా కలిసి చేసినట్లు ఉంది. అత్రి సూర్యుణ్ణి వెతికిపట్టుకుని ఆకాశంలో పెట్టేడని అథర్వవేదం (13.2.4, 12, 36)లో కూడా ఉంది. శ.బ్రా. (4.3.4.21)లో అత్రి ఋషులకి హోత (ఋషీణాం హోతా); ఆయన చీకటిని పోగొట్టేడు; ఆయన వాక్కు- (అనేదేవత) నించి పుట్టినవాడు (1.4.5.13); వాక్కుకి అభిన్నుడు కూడా (14.5.2.5)

56.4 ఋగ్వేదంలో అత్రి బహువచనరూపం ఒక సూక్తం చివరి మంత్రంలో కాని దానికి దగ్గరగా ఉన్న మంత్రంలో కాని వస్తుంది. అది (అత్రయః = అత్రిగోత్రులు) 5.39 మొదలైన సూక్తాలని దర్శించిన అత్రిగోత్రులైన ఋషులకి వాచకం. అయిదో మండలం అంతా అత్రిగోత్రులే దర్శించినట్లు సంప్రదాయం; ఏకవచన బహువచనాలలో ఈపేరు ఉన్న ప్రయోగాలలో సుమారు నాలుగోవంతు ఆ మండలంలోనే ఉన్నాయి.

56.5 ఈ పేరు బహుశా అద్- 'తిను' అనే ధాతువునించి వచ్చి ఉంటుంది; అందువల్ల దీని మౌలికార్థం 'పూర్తిగా తినేసేవాడు' అని అయి ఉండవచ్చు. దీనితో సంబంధం కల అత్రిన్- అనేపదం ఋగ్వేదంలో రాక్షసులకి విశేషణంగా తరచుగా వాడబడింది; అక్కడ దీనికి పైన ఇచ్చినఅర్థమే ఉద్దిష్టమై ఉండవచ్చు. అత్రిశబ్దమే ఒకచోట (2.8.5) అగ్నికి విశేషణంగావాడబడింది; అక్కడ దాని అర్థం కూడా ఇదే అనడానికి అవకాశం ఉంది (★సాయణుడు అత్రిం = శత్రూణాం / అన్నానాం వా భక్షకం ''శత్రువులని / అన్నాలని తినేవాడు'' అని అర్థం ఇచ్చారు). బెర్గెయిన్(Bergaigne) అత్రి పురోహితుడని చెప్పబడినా మొదట్లో ఆయన అగ్నికి ఒకరూపం అయి ఉంటాడని చెప్పేటంతవరకూ వెళ్లేరు. అత్రిపదం సప్తవధ్రిపదంతో కలిసి రావడమో లేక సప్తవధ్రిపదం అత్రిపదం ఉన్న మంత్రానికి తరవాత ఉన్న మంత్రంలో రావడమో నాలుగుచోట్ల కనపడుతుంది. సప్తవధ్రి అశ్వినుల రక్షణకు

పె ద్రుడు; ఆయన్ని అశ్వినులు బంధవిముక్తుణ్ణి చెయ్యాలని ప్రార్థన ఉంది (5.78.5, 6). సప్తవధ్రి తన ప్రార్థనలో అగ్నిధారని సదును వేశాడు (అశాయత = ★ పదుకో పెట్టేడు = ధ్వంసం చేశాడు, అనిసాయణుడు, 8.73.9). అత్రి సప్తవధ్రికి అశ్వినులు ఉష్ణగుండాన్ని సుఖకరమైనదిగా చేశారు. అందువల్ల వీరిద్దరూ ఒకరే అయి ఉంటారు.

## 57. కణ్వుడు మొదలైనవారు

57.1 కణ్వశబ్దం ఒక ప్రాచీన ఋషికీ ఆయన సంతతి వారికీ వాచకంగా ఋగ్వేదంలో సుమారు అరవైచోట్ల వచ్చింది, దీని ఏకవచన బహువచనరూపాలు ఇంచుమించు సమానసంఖ్యలో ఉన్నాయి. కణ్వుడు నృషద్- అనే ఆయన కొడుకు (10.31.11); అందువల్ల ఆయనకి అపత్యార్థక ప్రత్యయంతో ఉన్న నార్షద- అనే తద్ధితరూపం వాడబడింది (1.117.8; అ.వే. 4.19.2). ఆయనపేరు మూలపురుషులైన మనువు, అంగిరసుడు వంటి వారి పేర్లతో కలిసివచ్చింది (1.139.9). దేవతలు కణ్వుడికీ, మరికొందరికీ అగ్నిని ఇచ్చారు; వారు అగ్నిని వెలిగించి ఆయన ఆశీస్సులు పొందేరు (1.36.10,11,17). అగ్ని కణ్వుడికీ, అత్రికీ, త్రసదస్యుపుకీ యుద్ధంలో సహాయం చేశాడు (10.50.5); అగ్ని కణ్వులకి ముఖ్యుడు (కణ్వతమః), స్నేహితుడు (కణ్వసఖా) అని చెప్పబడింది (10.115.5). ఇంద్రుడు కణ్వుడికీ, త్రసదస్యుపుకీ, మరికొందరికీ బంగారమూ గోవులూ ఇచ్చాడు (వాలఖిల్యం 1.10 (=8.49.10), 2.10 (= 8.50.10)). మరుత్తులు కణ్వుడికీ, తుర్వశుడికీ, యదువుకీ సంపద ఇచ్చారు (8.7.18). అశ్వినులు కణ్వుడికి సహాయం చేసినట్లు కొన్నిచోట్ల ఉంది (1.47.5; 1.112.5;8.5.25; 8.8.20). అశ్వినులు గుడ్డివాడైన కణ్వుడికి కన్ను (= దృష్టి) ఇచ్చారు (1.118.7)

57.2 ఋగ్వేదం ఎనిమిదో మండలంలో ఉన్న సూక్తాలలో చాలావాటిని దర్శించినవారు కణ్వగోత్రులే; వాటిలో కవులు తాము కణ్వులమని చెప్పుకొన్నారు. అందువల్ల కణ్వగోత్రులు నిజంగా చరిత్రలో ఉన్నవారే. కాని వారికి ఆద్యుడైన కణ్వుడు ఋగ్వేదకాలంలో ఉన్నట్లు ఎక్కడాలేదు. రోథ్(Roth) ఆయన అంగిరసుడిలాగా థలలో వాడే అని అభిప్రాయపడ్డారు. బెర్గెయిన్ (Bergaigne) గుడ్డివాడైన కణ్వుడు రాత్రివేళలో సూర్యుడికి కాని దాచబడిన అగ్నికో సోముడికో కాని ప్రతీక అయి ఉంటాడు అన్నారు.

57.3 కణ్వుడి సంతతివాడైన మేధ్యాతిథి (ఈయనకి కాణ్వ- 'కణ్వుడి సంతతివాడు'

అనే తద్ధితరూపం వాడబడింది, 8.2.40) పేరు ఋగ్వేదంలో తొమ్మిదిసార్లు వచ్చింది; కొన్నిచోట్ల ప్రాచీనుల పేర్లని చెప్పేటప్పుడు కణ్వుడి పేరుతోపాటు ఈ పేరు వచ్చింది (1.36.10, 11, 17). ఈ పేరుకి అసలు అర్థం ''యజ్ఞంతో ఆరాధించదగిన (మేధ్య) అతిథి (అంటే అగ్ని) కలవాడు'' అని చెప్పవచ్చు. ప్రియమేధ- అనే పేరు నాలుగైదుచోట్ల కణ్వుడిపేరుతోపాటు వచ్చింది (8.5.25). ఈయన ఋగ్వేదకాలానికి ముందుకాలంవాడే; ఈయన సంతతివారు తాము ప్రియమేధులం (ప్రియమేధాః) అని (బహువచనంలో) చెప్పుకొన్నారు.

## 58. కుత్సుడు, కావ్యుడు (ఉశనుడు) మొదలైనవారు

58.1 **(i) కుత్సుడు:** ఇంద్రగాథతో సంబంధం కల ఈ వీరుడిపేరు (కుత్స-) ఋగ్వేదంలో సుమారు నలభైసార్లు వచ్చింది. ఒకచోట మాత్రం ఇది బహువచనం (కుత్సాః)లో ఒక సూక్తంలో ఇంద్రుణ్ణి స్తుతించిన సగోత్రగాయకుల పేరుగా వచ్చింది (7.25.5). కుత్సుడికి నాలుగుచోట్ల ఆర్జునేయ- (అర్జునుడి కొడుకు' అనే తద్ధితరూపం వాడబడింది (1.112.23, మొ.). ఆయన కొడుకులలో ఒకడు ఇంద్రుడి సహాయంతో ఒక దస్యుడితో యుద్ధం చేసినట్లు ఉంది (10.105.11). కుత్సుడు యువకుడు, దీప్తి కలవాడు (యూనే కుత్సాయ ద్యుమతే, 1.63.3). ఋషి అయిన ఆయన నూతిలోపడి ఇంద్రుణ్ణి సహాయం కోసం ప్రార్థించాడు (1.106.6). కుత్సుడు ఇంద్రుడి రథంమీదనే వెళ్తాడు (4.16.11; 5.29.9); ఇంద్రుడు ఆయన్ని తీసుకువెళ్తాడు (5.31.8; 8.1.11); ఆయన ఇంద్రుడి సారథి (2.19.6; 6.20.5). కుత్సుడు ఇంద్రుడివంటివాడు (4.16.10); వీరిద్దరి పేర్లూ కలిసి ఇంద్రాకుత్సా అనే ద్వంద్వం ఏర్పడింది; వీరిద్దరూ రథంమీద రావాలని ప్రార్థన ఉంది (5.31.9).

58.2 కుత్సుడు ఇంద్రుడితో కలిసి జయించిన శత్రువు శుష్ణుడు (శుష్ణ-). ఇంద్రుడు కుత్సుడి కోసం శుష్ణుణ్ణి చంపేడు (1.63.3; 1.121.9; 4.16.12; 6.26.3); శుష్ణుణ్ణి ఎదిరించడంలో కుత్సుడికి సహాయం చేశాడు (1.51.6); శుష్ణుణ్ణి ఆయనకి వశం చేశాడు (7.19.2); కుత్సుడితోనూ దేవతలతోనూ కలిసి శుష్ణుణ్ణి ఓడించాడు (5.29.9). ఇంద్రుడు కుత్సుడితో కలిసి శుష్ణుడితో యుద్ధం చెయ్యాలి అనీ (6.31.3), శుష్ణుడి మీద విజయం సాధించిన కుత్సుణ్ణి తీసుకురావాలనీ (1.175.4) ప్రార్థన ఉంది. ఇంద్రుడు

కుత్సుడికోసం దేవతలతో కూడా (4 30.2-5) / గంధర్వుడితో (8.1.11) యుద్ధం చేస్తాడు శుష్ణుడితో యుద్ధంలో ఇంద్రుడు సూర్యుడిచక్రాన్ని దొంగిలించడం జరిగింది (1.175.4; 6.31.3). శత్రువులతో యుద్ధంచేసే కుత్సుడికోసం ఇంద్రుడు సూర్యుడి చక్రాన్ని దొంగిలించాడు (4.30.4)· ఇంకొకచక్రాన్ని కుత్సుడు ప్రయోగించడంకోసం ఆయనకి ఇచ్చాడు (5.29.10). సూర్యుణ్ణి ఆపడం అనే ఈ అద్భుతకృత్యం (చూ. 1.121.10; 10.138.3) ఒక అంశంగా కల గాథ ( ఇంద్రుడు మానవుల సుఖంకోసం సూర్యుణ్ణి సంపాదించాడు అనే గాథ) కొంత చారిత్రకాశం కల గాథకి అన్వయించి చెప్పబడినట్లు కనపడుతుంది. ఇంద్రుడు సూర్యుణ్ణిసంపాదించడంలో ఆయనతనసారథి అయిన కుత్సుడికి చోటు (= తోవ) విశాలం చేశాడు అని ఉంది (6 20.5). ఆయన కుత్సుడితో కలిసి దస్యులని చంపి సూర్యుడి చక్రాన్ని ముందుకి తిరిగేటట్లు చెయ్యాలని ప్రార్థనఉంది (4.16.12). ఒకమంత్రం (10.49.4) లో ఇంద్రుడు శుష్ణుణ్ణేకాకతుగ్ర-, స్మదిభ-, వేతసులు (వేతసు-) - అనేవారిని కూడా కుత్సుడికి అధీనులని చేశాడు అని ఉంది.

58.3 కుత్సుడు ఇంద్రుడి సహాయానికీ ప్రీతిపాత్రుడే అయినా (1.33.14). ఆయన ఇంద్రుడికి శత్రువుగా కొన్నిచోట్ల కనపడతాడు: ఇంద్రుడు కుత్సుడికీ, ఆయువుకీ, అతిథిగ్వుడికీ సంబంధించిన వీరులని చంపేడు (2.14.7); ఆయువునీ, కుత్సుణ్ణీ, అతిథిగ్వుణ్ణీ పీడించాడు (వాలఖిల్యం 5.2 = 8.53.2); ఈముగ్గురినీగెలిచి యువకుడైన తూర్వయాణుడు అనేరాజుకిఅప్పగించాడు (1.53.10); ఆయనకోసం వీరిని భూమిమీద పడగొట్టేడు (6.18.13; ★ ఈ చివర మంత్రంలో సాయణుడు చెప్పినట్లు వీరిని ఇంద్రుడు కాపాడేడు అనే అర్థమే సమంజసం). దీనివల్ల కుత్సుడు నిజంగా చరిత్రలో ఉన్న ఒక వ్యక్తి అని తెలుస్తుంది. ఎందువల్ల అంటే వేదఋషుల దృష్టిలో కాంతికిసంబంధించిన దేవత ఎప్పుడూ స్నేహితుడే; చీకటికి సంబంధించిన రాక్షసుడు ఎప్పుడూ శత్రువే ఋగ్వేదంలో ఒకటి, తొమ్మిది మండలాలలో చాలా సూక్తాలు అంగిరసగోత్రుడైనకుత్సుడనే ఋషి దర్శించాడని సంప్రదాయం కూడా చెప్తుంది. కాని, బెర్గెయిన్ (Berga'gne) కుత్సుడుగాథలలో వ్యక్తిమాత్రమే అనీ, ఆయన అగ్నికి ( / సోముడికి) / (కొన్నిచోట్ల) సూర్యుడికి ప్రతీక అనీ అభిప్రాయపడ్డారు. నిరుక్తంలోని నిఘంటువు (2.20) ప్రకారం కుత్సశబ్దం వజ్రానికి నామాంతరం.

58.4 **(ii) కావ్యుడు (ఉశనుడు):** ప్రాచీనఋషిఅయినఉశనుడి (ప్రాతిపదికఉశనస్- ప్రథమైకవచనరూప ఉశనా) ప్రసక్తి ఋగ్వేదంలో పదకొండుచోట్ల వచ్చింది. ఆయన ఋషి (కవి) అని రెండుచోట్ల చెప్పబడింది; ఆయనకి కావ్య- అనే విశేషణం అయిదుచోట్ల వాడబడింది. ఆయనబుద్ధికుశలతవిశిష్టమైనది; జ్ఞానవాక్యాలుచెప్పేసోముడు ఉశనుడితో పోల్చబడ్డాడు (9.97.7); సోముడికి ఉన్న బుద్ధికుశలత వల్ల సోముడూ ఉశనుడూ ఒకరే అయినట్లుకూడా చెప్పబడింది (9.87.3). కావ్యుడైన ఉశనుడు అగ్నిని యజ్ఞానికి హోతగా నియమించాడు (8.23.17). యజ్ఞాన్నిస్థాపించినఅథర్వుడుసూర్యుడికితోవ కల్పించాడనిచెప్పినమంత్రం (1.83.5) లోనే ఉశనుడు ఆవులని ఇక్కడికి తోలేడు అని చెప్పబడింది. ఆయన ఇంద్రుడికి రక్షాపాత్రుడు (6.20.11); ఇంద్రుడు ఆయనతో కలిసి ఆనందిస్తాడు (1.51.11). ఉశనుడూ, కుత్సుడూ, మరికొందరూ తానేఅని ఇంద్రుడే చెప్పినట్లు ఉంది (4.26.1). ఇంద్రుడు కుత్సుడితో కలిసి శుష్ణుణ్ణి ఓడించడంలో ఉశనుడికి కూడా పాత్ర ఉంది (5.29.9). వృత్రుణ్ణి చంపడానికి ఇంద్రుడికి ఉశనుడు కూడా వజ్రం తయారుచేశాడు (1.121.12; 5.34.2; చూ. 1.51.10).

58.5 **(iii)** ఋగ్వేదంలోమరికొందరు ప్రాచీన ఋషుల ప్రసక్తికూడా ఉంది; వీరు నిజంగా చరిత్రలో ఉన్నవారేఅనడానికికొంతఅవకాశం ఉంది. అటువంటివారుగోతముడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, భరద్వాజుడు, వసిష్ఠుడు. వీరు, లేక వీరి సంతానంవారు, క్రమంగా రెండు, మూడు, నాలుగు, ఆరు, ఏడు మండలాలని దర్శించినవారు అని సంప్రదాయం. అగస్త్యుడు అనే ఋషి ప్రసక్తి కూడా ఋగ్వేదంలో కొన్నిచోట్ల ఉంది (1.117.11, మొ.). నిజంగా చరిత్రలో ఉన్నవారు అని చెప్పడానికి అవకాశం ఉన్న ప్రాచీనకాలపు వీరులు : సుదాసుడనే రాజు (సుదాస్-), పురుకుత్సుడు, ఆయనకొడుకు త్రసదస్యుడు (త్రసదస్యు-), అతిథిగ్వుడైనదివోదాసుడు (దివోదాస-).

58.6 మానవజాతికి, లేకకొన్నిగోత్రాలవారికి ఆదిపురుషులుగా ఈ నాలుగో భాగం (అధ్యాయాలు 50-58) లో చెప్పబడిన వ్యక్తులు, వారెంత గాథలలో వారే అయినా, పురాతనకాలంలో నిజంగా ఉన్న వ్యక్తులుగాని, నిజమైన వ్యక్తులకి కొంత పూర్వులు ఆదిపురుషులుగా ప్రాచీనకాలంలో ఉన్నవారుగా భావించబడినవారుగాని, అయి ఉంటారు; దీనికిరెండు మూడు అపవాదాలుంటేఉండవచ్చు. వారు చేసినవిగాచెప్పబడినకృత్యాలలో

కుత్సుడు, కావ్యుడు (ఉశనుడు) మొదలైనవారు
కొన్ని చారిత్రకాంశాలుగా ఋగ్వేదకవుల స్మృతిపథంలో ఉన్నవి, మరికొన్ని కార్యకారణ సంబంధం కల్పించే గాథలు; ఇంకా కొన్ని కవితాదృష్టితో కల్పించబడినవి. దేవతలతో సంబంధం ఏర్పడడం వల్ల వారికి ప్రకృతిలో క్రమబద్ధతకి ఆధారమైనసూర్యుణ్ణిసంపాదించడం వంటి గాథలతో ప్రమేయం కల్పించబడింది. ప్రాచీన పురోహితులని గురించి చెప్పిన విషయాలలో చాలా అంశాలు పురోహితులనైపుణ్యానికీ శక్తికీసాక్ష్యాధారాలుగా ఉండడానికి ఉద్దిష్టమైనవి; అందువల్ల ఈ విషయాలు అమానుషశక్తిని ప్రతిబింబించేవిగా తీర్చిదిద్దబడ్డాయి. కొందరు అనుకొన్నట్లు ఈ వ్యక్తులు ప్రకృతి శక్తులకి ప్రతీకలు అనిగాని దేవత్వం కోల్పోయి భూమికి దిగివచ్చిన దేవతలు అనిగాని చెప్పడం సమంజసం కాదు.

# V. జంతువులూ, అచేతన పదార్థాలూ

## 59. సామాన్య లక్షణాలు

59.1 వేదాలలో గాథలలో జంతువులకి కొంత ఎక్కువ ప్రమేయమే ఉంది. మానవులకీ జంతువులకీ మధ్య భేదం చాలా తక్కువగా ఉండి (అధ్యాయం 65) దేవతలకి జంతురూపాలు కూడా ఉన్నట్లు భావించబడిన అత్యంత పురాతన కాలపు ఆలోచనల అవశేషాలు వేదాలలో ఇంకా అనేకం మిగిలి ఉన్నాయి. వేదాలలో ఉన్నతస్థాయి దేవతలకి పురుషాకారం ఉంది జంతురూపం ఉన్నట్లు భావించబడిన అతి మానవ ప్రాణులు తక్కువ స్థాయికి చెందినవి అవి ఆవులా మనుష్యుడికి ఉపయోగం ఉన్నవి అయితే అర్ధదివ్యత్వం కలవిగానూ పాములా హాని కలిగించేవి అయితే రాక్షస లక్షణం కలవిగానూ భావించబడ్డాయి. ఇంతేకాక మనుష్యుడికి తనకి ఉపయోగపడే జంతువులతో సాహచర్యం ఉన్నట్లే ఉన్నతస్థాయి దేవతలకి ఉపయోగకరమైన జంతువులతో సాహచర్యం ఉన్నట్లు ఊహించడం సహజంగానే జరిగింది చివరగా చెప్పవలసింది, యజ్ఞకర్మలో దేవతలకీ జంతువులకీ సంబంధం ఆపాదించబడింది అవి వాటితో ఏదో ఒక విషయంలో పోలిక ఉన్న దేవతల అనుగ్రహాన్ని సంపాదించడానికి తాత్కాలికంగా సాధనాలు ఉండడానికి ఉద్దిష్టమైన చిహ్నరూప ప్రతినిధులు మాత్రమే ఇలా ఒక ఆకారం కల పదార్థాన్ని దేవుడుగా భావించడం కంటికి కనపడే పదార్థాలని దేవతలుగా ఆరాధించే అతి పురాతనాచారానికి ఛాయామాత్రమైన అవశేషమే అయి ఉండవచ్చు. కాని ఇలా దివ్యత్వం ఆపాదించబడిన జంతువుల ప్రాధాన్యం వేదకాలంలో శాశ్వతంగా నిలవలేదు శక్తిమంతులై పురుషాకారాలు కల దేవతలు స్వర్గంలో ఉంటారనీ, వారు అదృశ్యరూపాలతో యజ్ఞానికి వస్తారనీ ప్రచురంగా ఉన్న భావనకి జంతువులు దేవతల ప్రతినిధులనే భావన విరుద్ధమవడమే దీనికి కారణం.

## 60. గుర్రాలు

60.1 **(i)** దధిక్రా: దేవతల రథాలు లాగే గుర్రాలే కాక మరికొన్ని దివ్యశక్తిగల గుర్రాలు కూడా వైదికగాథాతత్త్వంలో ఉన్నాయి. వీటిలో ముఖ్యమైన వాటిలో దధిక్రా ఒకటి ఇది ఋగ్వేదంలో కొంత అర్వాచీనమైన నాలుగు సూక్తాలలో స్తుతించబడింది (4.38-40 7.44). అందులో ఈ పేరు పన్నెండుచోట్ల వచ్చింది; దీని రూపాంతరమైన దధిక్రావన్

పదిహేట్ల వచ్చింది (ఇందులో వస్- ప్రత్యేయం, ప్రథమైకవచనం దధిక్రాః / దధిక్రావా). ఇది ఇతర వైదికగ్రంథాలలో ఎక్కడాలేదు. దధిక్రా చాలా ప్రత్యేకత గల గుర్రం కాబట్టే నిరుక్తంలోని నిఘంటువులో (1.14) ఇది 'గుర్రం' అనే అర్థం ఇచ్చే శబ్దాలలో ఒకటిగా ఇవ్వబడింది. అది వేగవంతమైనది (4.38.2, 9; 4.39.1); గుర్రాలలో మొదటిది; రథాలకిముందు ఉంటుంది (7.44 4)· రథాలని జయించేది (రథతుర్-); గాలిలా పరిగెడుతుంది (4.38.3). దాని వేగాన్ని ప్రజలు స్తుతిస్తారు; పల్లపు ప్రదేశానికి పరిగెత్తుతున్నట్లుపరిగెత్తేఆగుర్రాన్ని ప్రతి పూరుడూ (= మనుష్యుడూ) మెచ్చుకొంటాడు (4.38.9, 3). అదితోవలలో ఉన్న వంకరలలోబాగా పరిగెడుతుంది (4.40.4). దానికి రెక్కలున్నట్లుగా కూడా భావించబడింది. అది పక్షివంటిదని చెప్పబడింది; దానిరెక్కలు పక్షిరెక్కలతోనూ ఎగిరేగద్దరెక్కలతోనూ పోల్చబడ్డాయి (4.40.2, 3). అదివాలేగద్దతో పోల్చబడడమే కాకుండా అది గద్ద అని కూడా సూటిగా చెప్పబడింది (4.38.5, 2). ఒకమంత్రం (4.40.5)లో అది కాంతిలో ఉండే హంస అనీ, అంతరిక్షంలో ఉండే వసువులనీ, వేది మీద ఉండే హోత అనీ, ఇంట్లో ఉండే అతిథి అనీ చెప్పబడింది - ఈ విశేషణాలు అన్నీ అగ్ని వివిధరూపాలకి తగినవి.

60.2 దధిక్రా శూరత్వం కలది; దస్యులని చంపుతుంది; విజయవంతమైనది (4.38.1-3,7). అది వేలసంఖ్యలో ఉన్న శత్రువులతో పోరాడేటప్పుడు వారు దానికి ఆకాశం ఉరుముకి భయపడినట్లు భయపడతారు; అది యుద్ధాలలో ధనం గెలుచుకొంటుంది; యుద్ధాలలో వివిధ జాతులవారు దాని వెనక అరుస్తూ ఉంటారు (4.38.8, 5, 4). అది దుమ్మును దండగా చేసుకొని దాన్ని రేపుతుంది; దాని కనుబొమ్మల నించి దుమ్ము అన్నివైపులకీ పడుతుంది (4.38.6, 7). అది అన్నిజాతులకీ చెందినది; తన శక్తితో అది అయిదు జాతులలో సూర్యుడు తన కాంతితో నీళ్లలో వ్యాపించినట్లు వ్యాపిస్తుంది; అది సభలని చూస్తుంది (4.38.2, 10, 4). మిత్రావరుణులు ప్రకాశించే అగ్నివంటి విజయవంతమైన ఆగుర్రాన్ని పూరులకి (= మనుష్యులకి) ఇచ్చారు (4.39.2; చూ. 4.38.1, 2); వారు దధిక్రా అనే గుర్రాన్ని మనుష్యులకి వరంగా మాకు ఇచ్చారు (4.39.5)

60.3 ఉషఃకాలంలో అగ్నిని వెలిగించినప్పుడు దధిక్రావన్- అనే గుర్రం స్తుతించ బడుతుంది (4.39.3). అది ఉషస్సులతోపాటు ఆహ్వానించబడుతుంది (4.39.1;

4.40.1); ఉషస్సులు దధిక్రావన్- లా యజ్ఞానికి రావాలని ప్రార్థన ఉంది (7.41.6) అది ఉషస్సుతో తరచుగానూ, అగ్నితో ఇంచుమించు అంతే తరచుగానూ, అంతకన్న కొంచెం తక్కువ తరచుగా అశ్వినులూ, సూర్యుడితోనూ, కొన్నిచోట్ల ఇతరదేవతలతో కూడానూ ఆహ్వానించబడింది (3.20.1, 5; 7.44.1-4; 10.101.1); కాని మొదట ఆహ్వానించబడేది దధిక్రాయే (7.44.1)

60.4 ఈ శబ్దం వ్యుత్పత్త్యర్థం అస్పష్టమవడం వల్ల అది దధిక్రా అసలు స్వభావాన్ని తెలుసుకోవడానికి ఉపయోగించదు. ఈ సమాసంలో రెండో అవయవం కృా- 'చల్లు,చెదరగొట్టు' అనే ధాతువు నించి,వచ్చినది కావచ్చు; ఇది నిజమైతే దీని అర్థం 'పెరుగు చల్లేది' అవుతుంది; ఇక్కడ పెరుగు అంటే సూర్యోదయ సమయంలోని మంచు అని రోధ్ (Roth), గ్రాస్మన్ (Grassmann) ల అభిప్రాయం. వీరిద్దరూ (ఆకాశంలో) తిరిగే సూర్యబింబానికి దధిక్రా అశ్వరూపమైన ప్రతినిధి అని అన్నారు. దధిక్రాకి ఉషస్సుతో ఎక్కువ సంబంధం ఉండడమూ, సూర్యుడు గుర్రంగానూ పక్షిగానూ తరచు భావించ బడడమూ (అధ్యాయం 14.5), ఆయన యుద్ధప్రియుడని కొన్నిచోట్ల ఉండడమూ (అధ్యాయం 14.7) ఈ ఊహకి బలం చేకూరుస్తాయి. మిత్రావరుణులు దధిక్రాని ఇచ్చారు అనే వాక్యానికి సూర్యుడు వారికి కన్ను అనే భావాన్ని అనుసంధించుకోవచ్చు. దధిక్రా అనే పేరు మెరుపుకి సూచకం అనడం సాధ్యమే అయినా అది అగ్నికి- ముఖ్యంగా సూర్యరూపంలో మెరుపురూపంలో ఉన్న అగ్నికి- ప్రతినిధి అని బెర్గెయిన్(Bergaigne) అభిప్రాయం. కాని లుడ్విగ్ (Ludw'g), పిషెల్ (P'schel), వి. బ్రాడ్కే (Bradke), ఓల్డెన్‌బెర్గ్ (oldenberg) లకి దధిక్రా దేవత కాదనీ, అది పందేలలో ప్రసిద్ధిపొంది దివ్యత్వ గౌరవం సంపాదించిన ఒక నిజమైన గుర్రం అనీ అనడంలో అంగీకారం ఉంది.

60.5 దధ్యంచుడికి గుర్రం తల ఉందని చెప్పడం వల్ల ఆయనకీ దధిక్రాకీ పేరులోనూ బహుశా స్వభావంలోనూ కూడా, సంబంధం ఉందని ఇంతకుముందే (అధ్యాయం 53.2) చెప్పబడింది.

60.6 **(ii) తార్క్ష్యుడు:** ఋగ్వేదంలో రెండుచోట్ల మాత్రమే (1.89.6; 10.178 1) వచ్చిన తార్క్ష్యుడికీ దధిక్రాకీ సంబంధం ఉంది. మూడు మంత్రాలు కల ఒక అర్వాచీన సూక్తం (10.178) ఈయన స్తుతికి ఉద్దిష్టమైంది. అందులో ఆయన దేవతల ప్రోత్సాహం

గుర్రాలు (దధిక్రా, తార్క్ష్యుడు, పైద్వం, ఏతశం మొదలైనవి)
కల బలమైన గుర్రం (వాజిన్-) అనీ, రథాలని ఓడించేవాడనీ (చూ. 6.44.4), వేగం కలవాడనీ యుద్ధాలకి పరిగెడతాడనీ వర్ణించబడింది. ఆయన ఇంద్రుడిచ్చిన వరంగా ప్రార్థించబడ్డాడు. సూర్యుడు తన కాంతితో నీళ్లలో వ్యాపించినట్లు ఆయన తన శక్తితో అయిదు జాతులలో వ్యాపించాడని దధిక్రా విషయంలో చెప్పినట్లే (4.38.10) చెప్పబడింది. ఆయన ముఖ్యంగా గుర్రంగా భావించబడ్డాడని ఆయనకి వాడబడిన అరిష్టనేమి 'దృఢమైన చక్రపు అంచులు కలవాడు' (10.178.2; 1.89.6) అనే విశేషణం వల్ల తెలుస్తుంది (ఇది వా.సం. (15, 18) లో తార్క్ష్య-, గరుడ- అనే పేర్లతోపాటు ప్రత్యేకమైన పేరుగా ఉంది). నిరుక్తంలోని నిఘంటువు (1.14) ప్రకారం తార్క్ష్య శబ్దం గుర్రానికి పర్యాయపదం. ఒకటి రెండు అర్వాచీన వైదిక గ్రంథాలలో తార్క్ష్యుడు ఒక పక్షి అని ఉంది; మహాభారతంలోనూ దాని తరవాత సాహిత్యంలోనూ తార్క్ష్యుడంటే విష్ణువు వాహనమైన గరుడుడే. మొత్తం మీద తార్క్ష్యుడు మొదట్లో అశ్వరూపంలోని సూర్యుడు అని చెప్పవచ్చు. ఈ పదం ఒక మనుష్యుడి పేరైన తృక్షి అనే పదాన్నించి ఏర్పడినట్లు కనపడుతుంది; తృక్షికి త్రాసదస్యవ- 'త్రసదస్యువు కొడుకు' అనే తద్ధితరూపం విశేషణంగా ఋగ్వేదంలో ఒకచోట (8.22.7) వాడబడింది. ఈ రూప నిష్పత్తివల్ల ఫోయ్ (Foy) తార్క్ష్యుడు (దధిక్రాలా) త్రసదస్యుపు కుటుంబం వాడైన తృక్షికి చెందిన పందెపు గుర్రం కావచ్చు అని అన్నారు.

60.7 **(iii) పైద్వం :** అశ్వినులు పేదువుకోసం తెచ్చి ఇచ్చిన (1.119.10; 7.71.5) మరొక గుర్రం కూడా గాథలలో ఉంది; దాని పేరు పైద్వ- 'పేదువుకి చెందినది' (1.116.6; 9.88.4). పేదువు అఘాశ్వ- 'చెడ్డ గుర్రం కలవాడు' (1.116.6) అని చెప్పబడడం వల్ల అశ్వినులు ఆయనకి ఈ గుర్రాన్ని ఇవ్వడంలో ఉద్దేశం ఆయనకి ఒక మంచి గుర్రం ఉండాలి అనేదే అని ఊహించవచ్చు. ఈ గుర్రం తెల్లనిది (శ్వేత-) అని కొన్నిచోట్ల ఉంది (1.116.6, మొ.). అది స్తుతించదగినది (1.119.10; 10.39.10; చూ. 4.38.2); భగుడిలా (10.39.10) మనుష్యులు పూజించదగినది (1.116.6). అది ఇంద్రుడితో పోల్చబడింది (1.119.10); ఇంద్రుడికి ప్రత్యేకమైన అహిహన్- 'పాముని చంపే (వాడు)' అనే విశేషణం దీనికి కూడా వాడబడింది (1.117.9; 1.118.9; చూ. 9.88.4). అది యుద్ధాలలో ఓటమిలేనిది; స్వర్గం కోరేది (1.119.10). ఈ సాక్ష్యాధారం కూడా, ఉన్నంతలో, ఈ పేదువు గుర్రం సూర్యుడికి ప్రతినిధి అని చెప్పడానికి అవకాశం కల్పిస్తోంది.

60.8 **(iv)** ఏతశం: ఋగ్వేదంలో ఏతశ- శబ్దం కొన్నిచోట్ల 'వేగంకల' అనే అర్థంలో విశేషణంగానూ, ఇంతకన్న తరచుగా 'గుర్రం' అనే అర్థంలో నూ వాడబడింది. బహువచనంలో ఈ శబ్దం సూర్యుడి గుర్రాలకి వాచకం (7.62.2; 10.37.3; 10.49.7). సుమారు పన్నెండుచోట్ల ఇది ఏకవచనంలో ఒకగుర్రానికి పేరుగా వచ్చింది; దీనికి సూర్యుడితో సూర్యుడి చక్రంతో, తరచుగా సంబంధం ఉంది. సవిత భూప్రదేశాలని కొలిచిన గుర్రం ( ఏతశ-, 5.81.3). వేగంకల ఏతశ- అనే దేవత ప్రకాశించే సూర్యుడి రూపాన్ని లాగుతుంది (7.66.14). కాడికి కట్టిన ఏతశం సూర్యుడి చక్రాన్ని తిప్పుతుంది (7.63.2); అది సూర్యుడి చక్రాన్ని తెచ్చింది (1.121.13; 5.31.11). ఇంద్రుడు సూర్యుడి గుర్రాన్ని ( ఏతశ-) తోలేడు (8.1.11; చూ. 9.63.8). ఇంద్రుడు సూర్యుడితో పందెంలో పాల్గొన్న ఏతశానికిసహాయం చేశాడు (1.61.15). అక్కడక్కడ ఉన్న సూచనల వల్ల పందెం గాథని గురించి తెలిసే వివరాలు: మొదట్లో వెనకపడిన ఏతశం ఊడిపోయినసూర్యుడి చక్రాన్ని ఆయనరథానికిబిగించింది; ఆతరవాత ఏతశమే ముందుకి వెళ్లింది; చివరికిసూర్యుడు ఏతశం తన రథానికి ముందు ఉండడానికి అంగీకరించి దాన్ని గౌరవించాడు. ఈ గాథకి సంతృప్తికరమైన అర్థం ఇవ్వడం అసాధ్యమనిపిస్తుంది. కాని ఏతశం సూర్యుడి గుర్రం అనడంలో సందేహానికి ఆస్కారం లేదు.

60.9 **(v)** సూర్యుడికీ, అగ్నికీ చిహ్నం అయినగుర్రం: గుర్రం సూర్యుడికి చిహ్నం అని ''ఉషస్సు తెల్లని గుర్రాన్ని నడిపిస్తుంది'' అని చెప్పే ఋగ్వేద మంత్రం (7.77.3) సూచిస్తుంది; ''దేవతలు యాగాశ్వాన్ని సూర్యుడినించిచేశారు'' అనిచెప్పే మరొకమంత్రం (1.163.2) కూడా ఈ విషయమే చెప్తుంది. ఒకరకం సోమయాగంలో గుర్రం సూర్యుడికి ప్రతినిధి అయినట్లు కనపడుతుంది.

60.10 ఇంతకుముందు చెప్పినట్లు (అధ్యాయం 35.3), మేఘమూ మెరుపుతునమూ కూడా అగ్నిగుర్రం అని చెప్పబడ్డాడు. యజ్ఞంలో గుర్రం అగ్నికి ప్రతినిధి. అగ్నిని మథించేచోటుకి అభిముఖంగా ఒకగుర్రాన్ని కడతారు. అగ్నిని తూర్పువైపుకి తీసుకువెళ్లేటప్పుడు దాని ముందు గుర్రాన్ని తీసుకువెళ్లి అది వెళ్లిన తోవలో అగ్నిని పెడతారు. అగ్నికోసం వేదిని తయారుచేసే కర్మకాండ (అగ్నిచయనం) లో గుర్రాన్ని ఉద్దేశించి ఈ మంత్రం చదువుతారు దివి తే జన్మ పరమ మంతరిక్షే తవ నాభిః పృథివ్యా మధి యోనిరిత్ (వా.సం. 11.12) ''స్వర్గంలో నీ గొప్పజన్మ: అంతరిక్షంలో నీ నాభి; పృథివిలో నీ స్థానం''. శ.బ్రా లో

కర్మకాండ అగ్నిని అగ్నితో కలుపుతుంది అని ఈ కర్మకాండకి వివరణ ఇవ్వబడింది. అదే బ్రాహ్మణం (5.1.4.5; 7.5.2.18) మెరుపు నీళ్లలోంచి/మేఘాలలోంచి దిగివచ్చిన శుక్రం అని చెప్తుంది.

## 61. ఎద్దు, ఆవు

61.1 **(i) ఎద్దు:** ఋగ్వేదంలో ఇంద్రుడు చాలా తరచూ ఎద్దు (వృషా, వృషభః, మొ.) అని చెప్పబడ్డాడు; ఈ పదం అగ్నికి ఇంతకన్న చాలా తక్కువచోట్లా ద్యౌస్ వంటి ఇతర దేవతలకి (అధ్యాయం 11.1) ఒకటిరెండుచోట్లా వాడబడింది. అధర్వవేదం (9.4.9) లో ఒక ఎద్దు ఇంద్రుడిగా సంబోధించబడింది; శ.బ్రా. (2.5.3.18) లో ఎద్దు ఇంద్రుడి రూపం అని చెప్పబడింది. అవెస్తాలో ఎద్దు వెరెథ్రఘ్న (= వృత్రహన్' ఇంద్రుడు) కి ఉన్న అవతారాలలో ఒకటి. ఒకరకం యజ్ఞంలో ఎద్దు కూడా రుద్రుడికి ప్రతినిధి. ముద్గల-, ముద్గలానీ- లకి సంబంధించిన ఒక అస్పష్టమైన గాథ (10.102) లో ఒక ఎద్దు ప్రసక్తి ఉంది (ఈ గాథని చాలామంది చర్చించారు).

61.2 **(ii) ఆవు:** భూమిమీద ఆవు చాలా ఉపయోగం ఉన్నది కాబట్టి దానికి వైదికగాథాతత్త్వంలో సహజంగానే గొప్పస్థానం లభించింది. ఉషఃకిరణాలు ఉషస్సు రథాన్ని లాగే ఆవులుగా వ్యక్తిత్వారోపం పొందేయి (అధ్యాయం 20.3). వర్షించే మేఘం ఆవు అనీ అది (మెరుపులనే) దూడకి తల్లి అనీ వర్ణించబడింది (అధ్యాయాలు 7.12; 8.3). ఈ మేఘం అనే ఆవుకి పృశ్ని అనే పేరుతో ప్రత్యేకత ఇవ్వబడింది; ఆమె మరుత్తులకి తల్లి (వా.సం. 2.16); ఆమె పాలూ (6.48.22) పొదుగూ ప్రసక్తి కొన్నిచోట్ల ఉంది (అధ్యాయం 43.2). పుణ్యాత్ములు ఉండే స్వర్గంలో అన్ని కోరికలూ తీర్చే (కామదుఘా-) రంగురంగుల ఆవులకి (అ.వే. 4.34.8) (జలం) దానం చేసే మేఘాలే ఆది ప్రతినిధులు అనడంలో సందేహం లేదు, వేదం తరవాత సాహిత్యంలో ఎంతో తరచుగా కనపడే కామధేనువుకి కూడా ఇవే ఆదిప్రతినిధులు. పాలూ, నెయ్యితో చేసే ఆహుతికి వ్యక్తిత్వారోపమైన ఇడా- ఆవుగా భావించబడడం కూడా అరుదుగా ఉంది (అధ్యాయం 43.1). అదితి కూడా ఆవు అని కొన్నిచోట్ల చెప్పబడింది (అధ్యాయం 41.10). కొన్నిచోట్ల దేవతలు గోజాతాః 'ఆవునుంచి పుట్టినవారు' అని చెప్పబడ్డారు. కాని ఆవు ప్రసక్తి చాలా తరచుగా వచ్చేది ఇంద్రుడు రాయి తీసి ఆవులని విడిపించడం అనే కథలోనే (అధ్యాయం 22.18, 24).

61.3 భూమి మీద ఆవుకి ఋగ్వేదంలోనే పవిత్రత ఆపాదించబడింది; అది అదితి అనీ దేవత అనీ సంబోధించబడింది. ఋగ్వేద కవి ఆవుని చంపకూడదని ఉపదేశించారు (8.101.15, 16; చూ. వా.సం. 4.19,20).[1] ఆవుకి వాడబడిన అఘ్న్య 'చంపకూడనిది' అనే విశేషణం కూడా దాని పవిత్రతని సూచిస్తుంది; ఇది ఋగ్వేదంలో పదహారుసార్లు వచ్చింది (దీని పుంలింగరూపమైన అఘ్న్య- మూడుసార్లు మాత్రమే వచ్చింది) అథర్వవేదం (12.4.5) ఆవుని పవిత్రమైన జంతువుగా పూజించడం పూర్తిగా స్థిరపడింది శ.బ్రా. (3.1.2.21) లో గోమాంసం (= ఆవు, ఎద్దుల మాంసం) తినేవాడు (భూమిమీద) మళ్లీ అప్రతిష్ఠకలవాడుగా పుడతాడు అని ఉంది; కాని గోమాంసం అతిథులకి వండిపెట్టవచ్చు (శ.బ్రా. 3.4.1.2; ★ రాజ్ఞే వా బ్రాహ్మణాయ వా మహోక్షం వా మహాజం వాపచేత్తదహ మానుషం ''రాజుకి కాని బ్రాహ్మణుడికి కాని పెద్ద ఎద్దుని లేక పెద్ద మేకని (చంపి) వండవచ్చు; అది మనుష్యులకి ఇచ్చే ఆతిథ్యం''; యాజ్ఞ వల్క్యుడు ''బలిసిన గోవు మాంసమైతే నేను తప్పక తింటాను'' అని చెప్పినట్లు 3.1.2.21 లో ఉంది).

## 62. మేక, పంది, కుక్క, కోతి, తాబేలు, కప్పలు

62.1 ఋగ్వేదంలో మేక ముఖ్యంగా పూషుడి రథంలాగే జంతువు (అధ్యాయం 16.1) మేక అజైకపాత్ ' ఒకకాలు కల మేక' అనే దేవతగా కూడా అందులో కనపడుతుంది (అధ్యాయం 27; బ్లూమ్‌ఫీల్డ్ ఈయన సూర్యుడే అని తై.బ్రా. (3.1.2.8) ఆధారంతో చెప్పేరు; ఋగ్వేదంలో దీనికి ఆధారం లేదు). అర్వాచీన వైదిక గ్రంథాలలో మేకకీ అగ్నికీ సంబంధం ఉన్నట్లూ మేకా అగ్నీ ఒకరే అయినట్లూ కొన్నిచోట్ల ఉంది.

62.2 వైదిక గాథాతత్త్వంలో గాడిద ముఖ్యంగా అశ్వినుల రథాన్ని లాగే జంతువుగా కనపడుతుంది (అధ్యాయం 21.5).

---

1. మాతా రుద్రాణాం దుహితా వసూనాం
   స్వసాదిత్యానా మమృతస్య నాభిః
   ప్రను వోచం చికితుషే జనాయ
   మాగా మనాగా మదితిం వధిష్ట (8.101.15)

''రుద్రులకి మాత, వసువులకి కూతురు, ఆదిత్యులకి సోదరి, అమృతానికి నివాసస్థానం, పాపం లేనిది అదితి (= అదీన) అయిన గోవుని చంపవద్దు అని జ్ఞానవంతుడైన మనుష్యుడికి చెప్తున్నాను''. ఈ సూక్తద్రష్ట భృగుగోత్రుడైన జమదగ్ని మహర్షి

62.3 ఋగ్వేద గాథలలో కుక్క ప్రసక్తి యముడికి సారమేయ- అనే మచ్చలు కల రెండు కుక్కలు ఉన్నాయి అని చెప్పినచోట వస్తుంది (అధ్యాయం 77.10). ఈ పేరువల్ల ఇవి ఇంద్రుడి దూత అయిన సరమ (అధ్యాయం 22.31) సంతానంగా భావించబడినట్లు తెలుస్తుంది. ఋగ్వేదంలో సరమ ఆడకుక్క అని ఎక్కడా సూటిగా చెప్పబడలేదు; కాని అర్వాచీన వైదిక గ్రంథాలలో ఇది ఆడకుక్క అని ఉంది. యాస్కుడు (నిరుక్తం 11.25) దీన్ని దేవశునీ 'దేవతల ఆడకుక్క' అన్నారు.

62.4 రుద్రుడికీ (దివో వరాహ మరుషం కపర్దినం, 1.114.5, మొ.) మరుత్తులకీ వృత్రుడికీ వరాహ శబ్దం విశేషణంగా ఋగ్వేదంలో వాడబడినచోట్ల పంది ప్రసక్తి ఉంది. తై సం., తై. బ్రా. లలో ప్రజాపతి వరాహరూపం ధరించి నీళ్లలోంచి భూమిని ఎత్తేడని ఉంది. విష్ణువు వరాహావతారం ఎత్తినట్లు ఉన్న అర్వాచీన గాథ దీని పరిణామమే.

62.5 అర్వాచీన సంహితలలో తాబేలుకి 'నీటికి అధిపతి' గా (? వా.సం.13.31) అర్ధదివ్యత్వం ఆరోపించబడి ఉన్నత స్థానం ఇవ్వబడింది; తాబేలే కశ్యపుడుగా ప్రజాపతితోపాటు లేక ప్రజాపతికి అభిన్నుడుగా అథర్వవేదంలో తరచు కనపడుతుంది; ఈయనకి స్వయంభూ- 'స్వయంగా పుట్టినవాడు' అనే విశేషణం ఉంది (అ.వే. 19.53.10). ఐ. బ్రా. (8.21.10) లో విశ్వకర్మ కశ్యపుడికి భూమిని ఇస్తానని వాగ్దానం చేసినట్లు ఉంది. శ. బ్రా. (7.4.3.5) లో ప్రజాపతి తాబేలుగా మారి ఆ రూపంలో ఉండి అన్ని ప్రాణులనీ సృష్టించాడు అని ఉంది (7.5.1.1). వేదాల తరవాత గాథాతత్త్వంలో విష్ణువు కూర్మావతారానికి ఇదే మూలం. తై.సం. (2.6.3.3) లో పురోడాశం (= ఆహుతిగా ఉపయోగించే బియ్యపుపిండి ముద్ద) తాబేలుగా మారుతుందని ఉంది.

62.6 ఋగ్వేదంలో ఒక అర్వాచీన సూక్తం (10.86) లో ఇంద్రుడికి ప్రీతిపాత్రమైన వృషాకపి అనే కోతి ప్రసక్తి ఉంది; దాని అల్లరి కారణంగా ఇంద్రాణి దాన్ని తరిమేసింది; కాని చివరికి దానికి మళ్లీ వారి అనుగ్రహం లభించింది (అధ్యాయం 22.33).

---

1. 'సరమా' శబ్దం స్త్రీలింగంలో ఉండడమూ, దీనికి అపత్యార్థకమైన ఢక్ (= ఏయ) ప్రత్యయం (ఇది స్త్రీలింగ శబ్దాలకే చేరుతుంది) చేరడమూ ఇది ఆడదే అని సూచిస్తాయి. ఇంతేకాక 10.108 సూక్తంలో సరమా శబ్దానికి విశేషణాలుగా స్త్రీలింగ రూపాలే వాడబడడమూ (ఇచ్ఛంతీ (1), దూతీః, ఇషితా (2), మొ.), పణులు దీనితో ''నిన్ను చెల్లెలుగా చేసుకొంటాము'' (స్వసారం త్వా కృణవై, 9) అని చెప్పడమూ అది ఋగ్వేదంలోనే ఆడదిగా భావించబడిందని స్పష్టం చేస్తాయి.

62.7 వానలవల్ల ఉత్తేజం పొందిన కప్పలు ఋగ్వేదం 7.103 సూక్తంలో ఆవులూ దీర్ఘాయుస్సూ ఇచ్చేవిగా స్తుతిపాత్ర మయ్యాయి; వాటికి మాయాశక్తులు ఉన్నట్లు భావించబడినట్లు కనపడుతుంది. కాని మేక్స్‌ముల్లర్ ఈ సూక్తం బ్రాహ్మణులని ఉద్దేశించిన హేళనకవిత్వం అని అన్నారు. ఇందులో కప్పలు అంతరిక్షంలోని పదార్థాలకి ప్రతిబింబాలు అని బెర్గెయిన్(Bergaigne) వివరణ.

## 63. పక్షులు

63.1 వైదికగాథాతత్త్వంలో పక్షుల ప్రమేయం ఎక్కువగానే ఉంది. సోముణ్ణీ సోమాన్నీ పక్షితో పోల్చడమూ, ఆయన దాన్ని పక్షి అనే చెప్పడమూ తరచుగా కనపడలాయి (అధ్యాయం 37.8). ముఖ్యంగా అగ్నిని పక్షితో పోల్చడమూ, ఆయన్ని పక్షి అనే చెప్పడమూ తరచూ కనపడలాయి; అగ్ని ఆకాశంలో గద్ద అని ఒకచోట చెప్పబడింది (అధ్యాయం 35.3) సూర్యుడుకూడా కొన్నిచోట్ల పక్షిగా భావించబడ్డాడు (అధ్యాయం 14.5); రెండుచోట్ల ఆయనకి గరుత్మత్- (ప్రథమైకవచనం గరుత్మాన్) అనే పదం వాడబడింది. వేదాల తరవాతకాలపు గాథాతత్త్వంలో పక్షిరాజైన గరుడుడు విష్ణువు వాహనం అవడానికి ఈ భావనే ఆధారమై ఉంటుంది (అధ్యాయం 17.3). వేదంలో ప్రాధాన్యం ఉన్న పక్షి ఇంద్రుడికోసం సోమాన్ని తీసుకుపోయే గద్ద; ఇది మెరుపుకి ప్రతినిధి అనుకోవచ్చు. కారకం ప్రకారం ఇంద్రుడే గద్దరూపంలో సోమాన్ని/ అమృతాన్ని పట్టుకొంటాడు. ఇలాగే అవెస్తాలో వెరెథ్రఘ్న (= ఇంద్రుడు) పక్షులన్నిటిలోకీ వేగవంతమైన వారఘ్న అనే పక్షిగా మారతాడు జర్మన్ భాషలోని గాథలలో ఓధిన్ అనే దేవత పక్షిగా మారి మధువుని దేవలోకానికి తీసుకుపోతుంది (అధ్యాయం 37.26).

63.2 శకునాలు చెప్పే పక్షుల్నీ జంతువులనీ కొందరు దేవతలు పంపుతారనే భావన అరుదుగా ఉంది. ఉదాహరణకి, ఋగ్వేదంలో గుడ్లగూబా, పావురమూ యముడి దూతలు అని ఉంది (అధ్యాయం 77). సూత్రగ్రంథాల ప్రకారం గుడ్లగూబ దుష్టశక్తుల దూత; ...ాము చంపి తిన్న జంతువు రక్తం అంటుకొని ఉన్న క్రూరమృగాలూ, శవాలని తినే రాబందులూ యముడి దూతలు. ఋగ్వేదంలో ఒక శకునపక్షి మంచి శకునం ఇవ్వాలని ఒకచోట (2.42.2, 3) ప్రార్థించబడింది (సుమంగలో భద్రవాదీ శకుంతే, 3).

# 64. హానికర జంతువులు

64.1 ఇవి సాధారణంగా రాక్షస రూపంతో లేక రాక్షస లక్షణాలతో ఉంటాయి. రాక్షసులు ఋగ్వేదంలో కొన్నిచోట్ల మృగశబ్దంతో వ్యవహరింపబడ్డారు (దీని అర్థం అడవి జంతువు ,1.80.7 5.29.4, 5 32 3) మూడుచోట్ల ప్రసక్తి ఉన్న ఒక రాక్షసుడిపేరు ఔర్ణవాభ- సాలీడు (సంతతివాడు)' (2.11 18 8 32 26 8.77 2) ఒకేచోట (2.14.4) వచ్చిన మరొక రాక్షసుడిపేరు ఉరణ- పొట్టేలు .

64 2 ఇలా ఒక రాక్షసుడి రూపంగా చాలా ప్రముఖంగా చెప్పబడినది పాము (అహి = అవెస్తా అఝి (azh')). ఇది వృత్రాసురుడికి మరొకపేరు మాత్రమే మానవజాతికి గొప్ప శత్రువైన వృత్రుడు శత్రువుని పాము (కొండచిలువ) తన ఆహారమైన జంతువుని చుట్టేసి పట్టుకున్నట్లు పట్టుకోవడం వల్ల వాడికి ఆపేరు (వృత్రుడు) వచ్చి ఉండవచ్చు (అధ్యాయం 68.5). వృత్రుణ్ణి చంపిన ఇంద్రుడు (ఈయనకి వృత్రహన్- అనే కాక అహిహన్- అనే విశేషణం కూడా ఉంది) పాముని చంపినట్లు ఉంది (8.93.2 చూ. 4 17.1) అహి, వృత్రుడూ ఒకరేనని ఈ రెండు పదాలూ ఒకే వ్యక్తికి అన్వయించి వాడబడిన సందర్భాలవల్ల తెలుస్తుంది (1.32.1.2.7-14); 'పాములలో మొదట పుట్టినవాడు' (ప్రథమజా మహీనాం, 1.32.3, 4) అనేది వృత్రుణ్ణి (వృత్రం వృత్రతరం, 1.32.5) తప్ప వేరెవ్వరినీ సూచించడానికి అవకాశం లేదు. ఇంతేకాక, కొన్ని మంత్రాలలో ఈ రెండుపదాలూ పరస్పరాన్వయంతో ఉండడం వల్ల వాటిని 'వృత్రుడనే పాము' అని అనువదించవచ్చు అహిపదం ఉపయుక్తమైన చోటుల్లో కూడా ఇంద్రుడు దాన్ని చంపి సాధించిన కృత్యాలూ వృత్రుణ్ణి చంపి సాధించినవీ ఒకటే; నీళ్ళు ప్రవహించేటట్టు చెయ్యడం, ఏడునదులని విడిపించడం, ఆవులని గెలుచుకోవడం. పాము నీళ్లని కూడా చుట్టుకుని ఉంది అని వర్ణించబడింది; ఈ క్రియని సూచించడానికి ఇతర ధాతువులతో పాటు వృ- 'ఆవరించు అనే ధాతువు కూడా వాడబడింది (2.19.2). పాము నీళ్లని మింగింది (గ్రస-) అనికూడా ఉంది. అహి ఆయుధాలు మెరుపు (విద్యుత్), ఉరుము (తన్యతుః), వర్షం (మిహ-), పిడుగు (హ్రాదుని-, 1.32.13). మరుత్తులు అహిభానవః 'అహిలా ప్రకాశించేవారు' (1.172.1) అని చెప్పబడడం వల్ల అహి ప్రకాశంతో ఉంటుందని తెలుస్తుంది. అహిపదం అగ్నికి కూడా వాడబడింది; అగ్ని ''బుసలు కొట్టేపాము, పెద్దగా పీచే గాలివంటివాడు' (1.79.1) అని వర్ణించబడ్డాడు. సోముడు శత్రువుని అహికి వశం చెయ్యాలి అని

వర్ణించబడ్డాడు. సోముడు శత్రువుని అహికి వశం చెయ్యాలి అని ఒకచోట (7.104.9) ప్రార్థన ఉంది. దీని బహువచన రూపం (అహయః) ఒక రాక్షసజాతికి వాచకంగా ఒకటి రెండుచోట్ల (9.88.4; 10.139.6) వాడబడింది; అందులో ఇది మొదట పుట్టినది (1.32.3, 4).

64.3 పాము అహిబుధ్న్యుడు (అధ్యాయం 26) అనే దేవతరూపంగా కూడా ఉంది ఈయన వృత్రుడి స్వభావంలో ప్రయోజనకారి అయిన లక్షణానికి ప్రతినిధి అనుకోవచ్చు

64.4 అర్వాచీనసంహితలలో పాము (సర్పాః) గంధర్వులు మొదలైనవారిలా అర్ధదివ్యత్వం కల ఒకజాతి. అవి భూమిమీదా, అంతరిక్షంలోనూ స్వర్గంలోనూ ఉంటాయి (వా.సం 13.5; చూ. తై.బ్రా. 3.1.1.7). అథర్వవేదంలో వీటి ప్రసక్తి తరచుగా ఉంది; దాంట్లో ఒకసూక్తం (11.9) సర్పదేవతలని ఉద్దేశించినది అని కొందరి అభిప్రాయం సూత్రగ్రంథాలలో భూమి, అంతరిక్షం, స్వర్గాలలో ఉండే పాములకి ఆహుతులు ఇవ్వాలనే విధి ఉంది (ఆ.గృ.సూ. 2.1.9; పా.గృ.సూ. 2.14.9); దేవతలూ, మొక్కలూ రాక్షసులూ మొదలైనవారితోపాటు పాములని కూడా తృప్తిపరచాలి (శాం.గృ.సూ. 4.9.3 4.15.4; ఆ.గృ.సూ. 3.4.1); వాటికోసం రక్తం పోస్తారు (ఆ.గృ.సూ. 4.8.27) పాము హానికరమైనది కాబట్టి దానికి రాక్షస లక్షణం ఉన్నట్లు సహజంగానే భావించబడింది, ఈ రాక్షస లక్షణాన్ని శాంతపరచడమే ఈ పూజ ఉద్దేశం. ఇదే ఉద్దేశంలో చీమలకి కూడ బలి విధించబడింది (కౌ.సూ. 116).

## 65. జంతువులని గురించిన పురాతన భావాల అవశేషాలు

65.1 మనుష్యులకీ జంతువులకీ మధ్య ఎక్కువ భేదం లేదు అనే పురాతన భావ అవశేషాలు తోడేలుగా మారగలిగిన మనుష్యుడు ఉన్నాడనే నమ్మకంవంటి వాటిల్లో మిగిలి ఉన్నాయి. మానవరూపంగల పులులూ (పురుషవ్యాఘ్రాయ దుర్మదం, వా.సం.30.8· శ.బ్రా. 13.2.4.2). మానవరూపం కల పాములైన నాగజాతివారూ ఇటువంటివారే;[1] నాగజాతి ప్రసక్తి మొట్టమొదటగా సూత్రగ్రంథాలలో ఉంది (ఆ.గృ.సై. 3.4.1). అర్వాచీనకాలంలో వ్యాప్తిలోకి వచ్చిన సర్పపూజకీ వృత్రుడనే పాముగాథకీ సంబంధం

---

1. విష్ణువు నరసింహావతారం ఈ సందర్భంలో స్మరించదగినది.

ఉండడానికి అవకాశం లేదు, అది ఆర్యులకి ఆదివాసులైన అనార్యులతో ఏర్పడిన సంపర్కం వల్ల సంక్రమించి ఉంటుంది. ఋగ్వేదంలో దీని విషయంలో సూచన ఏమీ లేకపోవడమూ, అనార్యజాతులలో ఇది ఎక్కువగా ఉండడమూ ఇలా చెప్పడానికి ఆధారాలు. పాములకి నివాసస్థానమైన భారతోపఖండంలో ఆర్యజాతి విస్తరించినప్పుడు అక్కడి ఆదివాసులలో సర్పపూజ బహుళవ్యాప్తిలో ఉండడం వారు గమనించి ఉంటారనడంలో సందేహం లేదు.

65.2 ఇదేవిధంగా, మానవజాతి లేక కొన్ని జాతులు లేక కొన్ని కుటుంబాలు జంతువులనించో చెట్లనించో ఉద్భవించాయనే నమ్మకానికి సూచనలు ఋగ్వేదంలో కొన్ని ఉన్నాయని చెప్పవచ్చు. 'తాబేలు' అనే మౌలికార్థంగల కశ్యప శబ్దం ఒక ఋషికీ (9.114.2), ఆ ఋషి సంతానానికీ (ఐ.బ్రా. 7.27) పేరు; కశ్యపుడు అధర్వవేదంలోనూ, ఇతరమైన అర్వాచీన వైదికసాహిత్యంలోనూ సృష్టికర్త అయిన ప్రజాపతికి చాలా దగ్గరవాడుగానో ఆయనకి అభిన్నుడుగానో తరచుగా చెప్పబడ్డాడు. శ.బ్రా.లో ఒకచోట (7.5.1.5) ప్రజాపతి తాబేలు (కూర్మ-) రూపం కలవాడని చెప్పబడింది. కూర్మ- అన్నా, కశ్యప- అన్నా ఒకటే'' కాబట్టి ప్రాణులన్నీ తాబేలు (కశ్యప-) పిల్లలు అంటారు'' అని ఆ సందర్భంలో చెప్పబడింది. ఋగ్వేదం (7.186.6,19) లో మత్స్యాసః (మౌలికార్థం 'చేపలు'), అజాసః (మేకలు) శిగ్రవః (ఒకరకం దుంపమొక్కలు), శిగ్రు-) జాతుల పేర్లుగా చెప్పబడ్డాయి. గోతమ- (ఆవు), వత్స- (దూడ), శునక- (కుక్క), కౌశిక- (గుడ్లగూబ), మాండూకేయ- (కప్ప సంతానం) శబ్దాలు ఋషుల గోత్రాలకి పేర్లుగా ఉన్నాయి. కురురాజులు తమ ఆదిపురుషులలో ఒకడని చెప్పుకున్న సంవరణుడి (ఇది ఋ.వే. 5.53.10లో ఉంది) తండ్రిపేరు ఋక్ష (ఎలుగుబంటి) అని మహాభారతంలో ఉంది. కాని హాప్కిన్స్ (Hopkins) ఋగ్వేదంలో జంతువుల పేర్లు జంతువులనించి మానవుల ఉత్పత్తి జరిగింది అనే నమ్మకాన్ని సూచిస్తాయి అనడంలో సందేహం వ్యక్తపరిచారు.

## 66. దివ్యత్వం ఆపాదించబడిన భూమి మీద పదార్థాలు.

66.1 (i) **ప్రకృతి పదార్థాలు :** ముఖ్యంగా అంతరిక్షంలోనూ ఆకాశంలోనూ ఉన్న ప్రకృతి పదార్థాలూ, శక్తులూ, భూమీ (అధ్యాయం 34) మాత్రమే కాక భూమి ఉపరితలం మీద ఉన్న పదార్థాలూ, తయారు చెయ్యబడిన వస్తువులూ కూడా ఋగ్వేదంలో దేవతలుగా భావించబడ్డాయి. మానవుడికి ఉపయోగం కలవిగా భావించబడిన అచేతన పదార్థాలు

పూజించబడ్డాయి. ప్రతి పదార్థమూ ఒక దేవతగా భావించబడడం వల్ల ఇది ఒకే దేవుడు సర్వాంతర్యామి అనే భావంపై ఆధారపడినది కాదు; ఇది విగ్రహారాధనకి తుల్యమైనది.

66.2 స్త్రీ దేవతలుగా వ్యక్తిత్వారోపం పొందిన నదులని గురించి ఇంతకుముందే (అధ్యాయం 33) చర్చించబడింది.

66.3 పర్వతాలు ఋగ్వేదంలో దివ్యత్వం గల ప్రాణులుగా తరచు భావించబడ్డాయి ఈ శబ్దం బహువచనంలో సుమారు ఇరవై చోట్లా, ఏకవచనంలో నాలుగు చోట్లా వచ్చింది పర్వతాలు విడిగా కాక ఇతర ప్రకృతి పదార్థాలైన నీళ్లు, నదులు, మొక్కలు, చెట్లు, ఆకాశం భూమి వంటి వాటిలో కాని (7.34.23, మొ.), సవిత, ఇంద్రుడు వంటి దేవతలతో కాని (6.49.14, మొ.) కలిపి స్తుతించబడ్డాయి. అవి పురుషత్వం కలవి, ధ్రువమైన స్థానం కలవి, పుష్కలమైన ఆహారంతో ఆనందించేవి (3.54.20) అని వర్ణించబడింది. పర్వతుడూ ఇంద్రుడూ ఇంద్రాపర్వతా (1.122.3; 1.132.6) అనే దేవతాద్వంద్వంగా మూడుచోట్ల స్తుతించబడ్డారు. ఈ జంట ఒక గొప్ప రథంలో ప్రయాణిస్తారు అని ఉంది; వారు యజ్ఞానికి రావాలి అని ప్రార్థన ఉంది (3.53.1). ఇక్కడ పర్వతం పురుషత్వారోపం పొంది ఇంద్రుడి సహచరుడైన దేవత అయింది.

66.4 మొక్కలకి (ఓషధి) కూడా దివ్యపురుషత్వం ఆరోపించబడింది. ఋగ్వేదంలో ఒక పెద్ద సూక్తం (10.97) అంతా వీటి స్తుతికి, వినియుక్త మయింది; ఇందులో ముఖ్యంగా చెప్పబడినది వీటికున్న రోగనివారణ శక్తి. అవి తల్లులూ, దేవతలూ అని చెప్పబడ్డాయి (4) సోముడు వాటి రాజు కాబట్టి అవి ఆయన అధీనంలో ఉంటాయి అథర్వవేదం (6.136.1)లో ముందుగా ఉపయోగపడే మొక్క ''భూమి అనే దేవికి పుట్టినదేవి'' అని వర్ణించబడింది. సంతాన ప్రాప్తికి అడ్డురాకుండా ఉండడానికి మొక్కలకి జంతుబలి ఇవ్వడం కూడా ఉంది (తై.సం. 2.1.5.3).

66.5 వనస్పతి- 'వనానికి పతి' అని చెప్పబడిన పెద్ద చెట్లు (బహువచనంలో 7.34.23 10.64.8; ఏకవచనంలో 1.90.8; వాలఖిల్యం 6.4 = 8.54.4) కొన్నిచోట్ల దేవతలుగా ప్రార్థించబడ్డాయి. ఇవి ముఖ్యంగా నీళ్లతోటీ, పర్వతాలతోటీ కలిపి ప్రార్థించబడ్డాయి అర్వాచీన వైదిక గ్రంథాలలో పెళ్ళి ఊరేగింపులు వెళ్లే తోవలో ఉన్న చెట్లని పూజించడం ప్రస్తావించబడింది (అధ్యాయం 47.3); నూతన వధూవరులు మేడి (ఉదుంబర-)

చెట్టుకి నైవేద్యం పెట్టి పూజిస్తారని సూత్రగ్రంథాలలో ఉంది.

66.6 అడవి అంతకీ వాచకమైన అరణ్యానీ- ఒక స్త్రీ దేవత– ఋ.వే 10 146లో ప్రార్థించబడింది. అందులో ఆమె మృగాలకి తల్లి అనీ ఆహారం సమృద్ధిగా కలది అనీ దున్నడం లేనిదనీ వర్ణించబడింది (బహ్వన్నా మకృషీవలాం... మృగాణాం మాతరం 6) దాని చీకటి ప్రదేశాలలో అక్షాతధ్వనులు వినపడతాయని కూడా వర్ణన ఉంది. కాని ఋగ్వేదంలోనే కాక అథర్వవేదంలోనూ, ఇంట్లో చేసే సాధారణమైన పూజలలోనూ కూడా మొక్కలకీ చెట్లకీ అరణ్యదేవతకీ చాలా తక్కువ ప్రాముఖ్యమే ఉంది. దీనికి వ్యతిరేకంగా, బౌద్ధమత గ్రంథాలలో పేరు తక్కువస్థాయి దేవతలకన్న వీటికి మానవజీవితంతో ఎక్కువ సంబంధం ఉన్నట్లు కనపడుతుంది.

66.7 **(ii) సాధనాలు:** పురుషులారోపం పొంది పూజకి అర్హత్వం సంపాదించిన అచేతన పదార్థాలలో యజ్ఞంలో ఉపయోగించే వివిధ సాధనాలు ఒకరకం. వీటికి దివ్యత్వం ఆపాదించడానికి సూచకంగా బార్త్ (Barth) ''యజ్ఞకర్మకి సంబంధించిన సర్వాంతర్యామిత్వం ' (R tual st c Pantheism) అనే అపోహలకిదారితీసే అవకాశం ఉన్నపేరు వాడేరు. ఈ వస్తువులన్నింటిలోకీ ముఖ్యమైనది యజ్ఞస్తంభం (యూప-). ఇది ఋగ్వేదం 3.8 సూక్తంలో వనస్పతి-, స్వరు- అనే పేర్లతో దివ్యత్వం కలదిగా స్తుతించబడింది. అది గొడ్డలితో బాగా నరకబడిన చెట్టు అనీ, యాజకులు దానికి దివ్యమైన మధువు (=నెయ్యి) రాసి అలంకరిస్తారనీ వర్ణించబడింది; ఋషులు నిలబెట్టిన యూపాలు దేవతలు; అవి దేవతలవడం వల్ల దేవతల దగ్గరకి వెళ్తాయి (6, 9). ఆప్రీ సూక్తాలలో పదో / పదకొండో మంత్రాలలో యూపానికి మూడుసార్లు నెయ్యిరాసి అగ్నిదగ్గర పాలి ఆహుతిని దేవతల దగ్గరకి వెళ్లేటట్టు చెయ్యమని ప్రార్థిస్తారని వర్ణించబడింది. ఆ సూక్తాలలో ఇతర మంత్రాలలో దర్భలు (బర్హిస్) దేవతగా రెండుచోట్ల (2.3.4; 10.70 4) సంబోధించబడ్డాయి; యజ్ఞశాల తలుపులు దేవులని (దేవీర్ ద్వారః) ఇంతకన్న తరచూ చెప్పబడింది.

66.8 సోమాన్ని పిండడానికి ఉపయోగించే రాళ్లు (గ్రావన్- / అద్రి-) దేవతలుగా మూడు సూక్తాలలో (10.76; 10.94; 10.175) స్తుతించబడ్డాయి. అవి చావులేనివి ముసలితనం లేనివి, స్వర్గంకన్న బలమైనవి అని చెప్పబడ్డాయి. సోమాన్ని పిండేటప్పుడు

అవి గుర్రాలలా ఎద్దులలా ఉంటాయి; వాటి ధ్వని స్వర్గం దాకా వెళ్తుంది. అవి రాక్షసులనీ వినాశాన్నీ పోగొట్టాలనీ, సంపదా, సంతానమూ ఇవ్వాలనీ ప్రార్థనలు ఉన్నాయి. రెండు ఋగ్వేదమంత్రాలలో (1.28.5, 6) రోలూ రోకలీ పెద్దగా చప్పుడు చేస్తూ ఇంద్రుడికోసం సోమం పిండాలని ప్రార్థన ఉంది.

66.9 యజ్ఞంలో మిగిలినదానికీ ( ఉచ్ఛిష్ట-, అ.వే. 11.7), అందులో ఉపయోగించే రకరకాల తెడ్లకీ అధర్వవేదంలో అత్యున్నతమైన దివ్యశక్తి ఆపాదించబడింది.

66.10 వ్యవసాయ సాధనాలైన శున-, సీర- (ఇది నాగటికర్రా, నాగలీ అయి ఉండవచ్చు) కొన్ని ఋగ్వేద మంత్రాలలో (4.57.5-8) స్తుతించబడ్డాయి; వీటికి యజ్ఞంలో పురోడాశభాగం సమర్పిస్తారు (శ.బ్రా. 2.6.3.5).

66.11 చివరగా గమనించదగినవి ఆయుధాలకి కూడా కొన్నిచోట్ల దివ్యత్వం ఆపాదించబడింది అనేది. ఋగ్వేదం 6.75 సూక్తం అంతా కవచం, విల్లు, అమ్ముల పొది, బాణాల వంటి యుద్ధసాధనాల స్తుతికి వినియుక్తమైంది. బాణం దివ్యమైనదని స్తుతించబడింది అది రక్షణ ఇచ్చి శత్రువుకి తగలాలని ప్రార్థన ఉంది (11, 15, 16). యుద్ధభేరి (దుందుభి-) అపాయాలనీ, శత్రువులనీ, రాక్షసులనీ పారదోలాలని ప్రార్థన ఉంది (29.31) అధర్వవేదంలో ఒక పూర్తి సూక్తం (5.20) దాని స్తుతికి వినియుక్తమైంది.

66.12 **(iii)** చిహ్నాలు : మానవుడు తయారుచేసిన వస్తువులు దేవతలకి ప్రతినిధులైన చిహ్నాలుగా వాడబడడం అర్వాచీన వైదిక గ్రంథాలలో అరుదుగా సూచితమైంది ఋగ్వేదంలోనే ఒక మంత్రం (4.24.10) లో ఇటువంటి చిహ్నం (బహుశా విగ్రహం) ఉద్దిష్టమైనట్లు కనపడుతుంది; అందులో కవి (వామదేవుడు) ఇలా అడుగుతున్నారు ''నా ఈ ఇంద్రుణ్ణి పది ఆవులిచ్చి ఎవరు కొంటారు? ఆయన శత్రువులని చంపిన తరవాత కొన్నవాడు ఈయన్ని తిరిగి నాకు ఇవ్వాలి'' (చూ. 8.1.5).[1] బ్రాహ్మణాలలో తరవాత కాలంలో చేరిన భాగాలలోనూ, సూత్రగ్రంథాలలోనూ విగ్రహాల ప్రసక్తి మొదలవుతుంది.[2]

---

1. క ఇమం దశభిర్మమేంద్రం క్రీణాతి ధేనుభిః
   యదా వృత్రాణి జంఘనదథైనం మే పునర్దదత్ (4 24 10)

2. ఋ వే 1.145 4 5లలో అగ్ని విగ్రహాలని గురించిన సూచన ఉందని బోలెన్‌సెన్ (Bollensen) చెప్పినది పూర్తిగా అంగీకారయోగ్యం కాదు

66.13 చాలారకాల యజ్ఞకర్మలలో చక్రం సూర్యుడికి చిహ్నంగా వాడబడుతుంది; అది ఆకారంలోనూ గుణంలోనూ సూర్యుడికి ప్రతినిధి. వాజపేయయాగంలోనూ, అగ్న్యాధాన (= అగ్నిని పెట్టడం) అనే యజ్ఞవిధిలోనూ, ఉత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలాలలో చేసే యాగకర్మలోనూ చక్రం ఈవిధంగా వాడబడుతుంది. వేదాల తరవాత కాలపు గాథాతత్త్వంలో విష్ణువు ఆయుధాలలో చక్రం ఒకటి.

66.14 సూర్యాస్తమయం తరవాత నీళ్లు తోడేటప్పుడు బంగారం కాని మండేకర్ర కాని సూర్యుడికి చిహ్నంగా వాడబడుతుంది. (శ.బ్రా. 3.9.2.9); సూర్యాస్తమయానికి ముందుకాక ఆ తరవాత యాగాగ్నిని వెలిగించవలసి వస్తే బంగారం సూర్యుడికి చిహ్నంగా వాడాలి (శ.బ్రా. 12.4.4.6); అగ్నికి వేదిని నిర్మించేటప్పుడు బంగారం బిళ్ల సూర్యుడికి ప్రతినిధిగా దానిమీద పెట్టాలి (శ.బ్రా. 7.4.1.10).

66.15 వేదకాలం ప్రాచీనదశలోనే ఉన్న లింగపూజలో, తరవాత కాలంలోలాగే, ఒక చిహ్నం ఉపయోగించబడి ఉండాలి అని రెండు మంత్రాలలో ఉన్న శిశ్నదేవాః 'పురుషాంగం దేవుడుగా కలవారు' అనే పదం వల్ల తెలుస్తుంది. కాని ఇటువంటి పూజ ఋగ్వేదంలోని అర్చనా విధానాలకి విరుద్ధం అని ఈకింది విషయాల వల్ల తెలుస్తుంది: ఇంద్రుడు శిశ్నదేవులని యజ్ఞం దగ్గరకి రానివ్వవద్దని ప్రార్థించబడ్డాడు (7.21.5); ఆయన శిశ్నదేవులని చంపి వందద్వారాలు కల కోటలో ధనరాశిని వశపరుచుకొన్నాడని ఉంది (10.99.3). వేదాల తరవాతకాలంలో లింగం శివుడి ఉత్పాదకశక్తికి చిహ్నం అయింది; లింగపూజ ఈకాలంలో కూడా భారతదేశంలో బహుళవ్యాప్తిలో ఉంది.

# VI. రాక్షసులూ, దెయ్యాలూ

## 67. అంతరిక్షరాక్షసులు

67.1 **(i)** అసురులు : మేలుచేసే దేవతలకి వ్యతిరేకులుగా చాలాపేర్లు గల హానికర వ్యక్తులు ఒకసముదాయంగా ఉన్నారు. వైదికసాహిత్యం అంతటా అసురశబ్దం పరలోకంలోని రాక్షసులకి పేరుగా ఉంది, వారు సర్వత్రా యుద్ధాలలో దేవతలతో పోరాడే శత్రువులుగా భావించబడ్డారు. వారు మానవులకి ఇప్పటికాలపు శత్రువులు అనే భావన అరుదుగానే కనపడుతుంది (ఉదా. అ.వే. 8.6.5; కౌ.సూ. 87.16; 88.1). కాని ఈ పదం 'రాక్షసుడు' అనే అర్వాచీనకాలంలో ఉన్న అర్థంలో ఋగ్వేదంలో చాలా కొద్దిచోట్ల మాత్రమే ఉంది. అందులో ఇది ఈ అర్థంలో బహువచనంలో నాలుగుచోట్ల మాత్రమే వచ్చింది దేవతలు లేని అసురులని (అసురా అదేవాః, 8 96.9) ఇంద్రుడు చెదరగొట్టాలి అని ప్రార్థన ఉంది. ఇదికాక, దేవతలకి శత్రువులుగా అసురుల ప్రసక్తి ఇంకపదో మండలంలో మాత్రమే ఉంది. దేవతలు అసురులని చంపేరు (10.157.4). అసురులని జయించడానికి అగ్నిదేవతలతో '' ఒక ముఖ్యమైన మాట (= ఉపాయం) చెప్తాను'' అన్నాడు (వాచః ప్రథమం మసీయ, 10.53.4; ★ ఇక్కడ మూలకర్త 'మాట'కి బదులు 'సూక్తం (hymn) అని అనువదించారు).[1] దేవతలు అసురలమీద శ్రద్ధ చూపేరు అని కూడా ఉంది (10.151 3 ★ ఈ శ్రద్ధ అసురులని తప్పక చంపాలి అనేదే అని సాయణుడు). ఈపదం ఒక ప్రత్యేకమైన రాక్షసుడి పేరుగా కూడా మూడుసార్లు వచ్చింది. బృహస్పతి మండే రాలితో తోడేలులాంటి అసురుడి వీరుల్నికొట్టాలి అని ప్రార్థన ఉంది (2.30.4). ఇంద్రుడు కుయుక్తులు కల పిప్రువు అనే అసురుడి కోటలని ధ్వంసం చేశాడు (10.138.3) ఇంద్రుడూ విష్ణువూ వర్చిన్- అనే అసురుడికి ఉన్న లక్షమంది వీరులని చంపేరు (7.99.5). అసురహన్- అసురులని చంపినవాడు' అనే పదంలో కూడా అసురశబ్దానికి 'రాక్షసుడు అనే అర్థమే ఉంది, ఇది ఇంద్రుడికీ (6.22.4), అగ్నికీ (7.13.1), సూర్యుడికీ (10.170.2) ఒక్కొక్కచోట, మొత్తం మూడుచోట్ల, విశేషణంగా వాడబడింది. ఒక దేవతకి ఒక రాక్షసుడితో శత్రుత్వం ఉండడం అనే ప్రాచీనమైన ఋగ్వేద భావన (దీనికి ఇంద్రవృత్రుల పరస్పర శత్రుత్వం గల రెండు గణాలు అనే భావనగా వృద్ధి పొందింది. ఈ భావనే

---

1 ఇక్కడ అగ్నిచెప్పిన ఉపాయం ''నన్ను ఆహుతు లిచ్చి సేవించండి'' (మమ హోత్రం జుషధ్వం) అనేది

బ్రాహ్మణాలలో ప్రచురంగా కనపడుతుంది. ఈ గ్రంథాలలో వీరి యుద్ధాలని వర్ణించడంలో కొత్తగా చేర్చబడిన అంశం మొదట్లో దేవతలు ఓడిపోయి చివరికి యుక్తి వల్ల జయించారు అనేది; ఈ అంశం తరచుగా చెప్పబడింది. విష్ణువు దేవతలకి సహాయం చెయ్యడం కోసం వామనావతారం ఎత్తి మూడు అడుగులు వేశాడనే గాథ దీనికి ముఖ్యోదాహరణం.

67.2 బ్రాహ్మణాలలో అసురులకీ చీకటికీ సంబంధం చెప్పబడింది (శ.బ్రా. 2.4.2.5). పగలు దేవతలకీ, రాత్రి అసురులకీ చెందులాయి (తై.సం. 1.5.9.2). కాని అసురులు కూడా ప్రజాపతి సంతానమే అనీ, మొదట్లో వారు దేవతలకి సమానులూ, దేవతల వంటి స్వభావం కలవారే అనీ తరచుగా చెప్పబడింది. హానికర శక్తులకి కూడా కొన్నిచోట్ల దేవపదం వాడబడడానికి కారణం ఇదే అయి ఉండవచ్చు (తై.సం. 3.5.4.1; అ.వే. 3.15.5).

67.3 అథర్వవేదంలోనూ ఆ తరవాతా అసురశబ్దానికి 'రాక్షసుడు' అని మాత్రమే అర్థం; కాని ఋగ్వేదంలో ఈ శబ్దం దేవతలకే వాచకంగా ప్రచురంగా వాడబడింది; అవెస్తాలో అహుర (= సంస్కృతం అసుర-) అత్యున్నతుడైన దేవుడికి పేరు. అందువల్ల 'దేవుడు' అనే అర్థమే ప్రాచీనమైనదని స్పష్టం. దేవ వాచకమైన శబ్దం రాక్షస వాచకంగా మారడానికి కారణం భిన్నజాతుల మధ్య విరోధమే అనీ, దానివల్ల వేదప్రామాణ్యం లేని (అనార్య) జాతుల అసురులు (= దేవతలు) వేదానుయాయులైన ఆర్యుల దృష్టిలో రాక్షసులు అయ్యారనీ ఈ మార్పుకి కారణం చెప్పడానికి ప్రయత్నం జరిగింది (ఇది బ్రాడ్కే (Bradke) అభిప్రాయం). కాని ఈ అభిప్రాయాన్ని సమర్థించే ఆధారమేదీ సంప్రదాయంలో లేదు. ఈ మార్పుకి కారణం వేదంలోనే జరిగిన పరిణామం ఆధారంగా ఈ కింద ఇచ్చిన విధంగా చెప్పడం శ్రేష్ఠం. అసుర శబ్దాన్ని దేవశబ్దంతో పోల్చిచూస్తే అసురశబ్దం అర్థంలో ఒక ప్రత్యేకమైన అర్థచ్ఛాయ ఉన్నట్లు కనపడుతుంది. మాయాశక్తి ఉన్నట్లు ప్రత్యేకంగా చెప్పబడిన వరుణుడికి / మిత్రావరుణులకి ఈ శబ్దం ముఖ్యంగా వాడబడింది. కాని 'కుయుక్తి పన్నాగం' అనే అర్థం కూడా ఉన్న మాయా శబ్దం హానికర వ్యక్తుల విషయంలో వాడబడింది; ఈ అర్థంలో మాయా పదానికి అసురశబ్దానికున్న చెడ్డ అర్థంతో ఎక్కువ సాహచర్యం ఉంది (10.124.5; 10.138.3). అందువల్ల వేదకవులు అసురశబ్దానికి 'మాయాశక్తి కలవాడు' అని అర్థం అని భావించి ఉండవచ్చు అందువల్ల

దీన్ని హానికర వ్యక్తుల విషయంలో వాడడానికి అవకాశం లభించింది. ఒక ఋగ్వేద సూక్తం (10.124)లో ఈపదం ఈ రెండు అర్థాలలోనూ వాడబడినట్లు కనపడుతుంది ఋగ్వేదకాలం చివరిదశకి ఈ పదాన్ని దేవతాపరంగా వాడే అలవాటు పోయింది. ఉన్నతస్థాయి దుష్టశక్తులకి వాచకమైన సాధారణ పదేమేదీ లేకపోవడమూ ఇక్కడ జానపద వ్యుత్పత్తికి అవకాశం ఉండడమూ ఈ పరిణామానికి దోహదం చేసి ఉండవచ్చు; ఇందులో మొదట ఉన్న అకారం వ్యతిరేక సూచకమని భ్రమించడం వల్ల (ఇదే జానపద వ్యుత్పత్తి) దేవతావాచకంగా సురశబ్దం సృష్టించబడింది (ఇది ఉపనిషత్తులలో మాత్రమే మొట్టమొదటగా వాడబడింది).

67.4 (ii) **పణులు:** పణులు (పణి-, ప్రథమా బహువచనం పణయః) అంతరిక్షంలో ఉండే రాక్షసులు; వీరు ముఖ్యంగా ఇంద్రుడికీ (6.20.4; 6.39.2), ఆయన ద్వారా ఆయన సహచరులైన సోముడు, అగ్ని, బృహస్పతి, అంగిరసులు - వీరికీ శత్రువులు ఇంచుమించు వీరి ప్రసక్తివచ్చినసందర్భాలన్నిటిలోనూ వీరి ఆవుల ప్రసక్తికూడా వాచ్యంగానో వ్యంగ్యంగానో ఉంటుంది (10.108; 6.39.2); ఆవులు పణుల సంపద అని కూడా సూచించబడింది (2.24.6; 9.111.2. అగ్నిపణుల ద్వారాలని తెరిచాడు అని చెప్పినచోట కూడా ఇటువంటి సూచన ఉంది (7.9.2). ఒకమంత్రం (4.58.4) లో పణులు దాచిన నెయ్యి దేవతలు ఆవులో వెతికి పట్టుకున్నట్లు వర్ణించబడింది. ఇంద్రుడు శక్తిలో పణులని అధిగమించినట్లూ (7.56.10), పణులకి మిత్రావరుణుల కున్నంతగొప్పతనం లేనట్లూ (1.151.9) వర్ణనలు ఉండడం వల్ల వారు కొంతవరకూ శక్తిమంతులే అని చెప్పాలి.

67.5 ఋగ్వేదంలో ఈ శబ్దం బహువచనంలో సుమారు పదహారుసార్లు వచ్చింది దీని ఏకవచనరూపం కూడా పణుల సముదాయానికి వాచకంగా నాలుగుసార్లు వచ్చింది ఉదాహరణకి, ఇంద్రుడు/ అగ్నీషోములు పణి దగ్గరనించి ఆవులని దొంగిలించినట్లు వర్ణన ఉంది (10.67.6; 1.93.4); తోడేలూ, తిండిపోతూ అయిన పణిని సోముడు చంపాలని ప్రార్థన ఉంది (6.51.14).

67.6 పణి శబ్దం 'రాక్షసుడు' అనే అర్థంలో కన్న చాలా తరచుగా 'పిసినిగొట్టువాడు ముఖ్యంగా 'యాజకులకి సరియైన పారితోషికం ఇవ్వనివాడు' అనే అర్థంలో ఉంది; ఈ అర్థంలో బహువచన రూపం కన్న ఏకవచన రూపమే ఎక్కువసార్లు వచ్చింది. ఈ

అర్థంసించి 'స్వర్గలోకసంపదలకి అడ్డం వచ్చే రాక్షసులు' అనేగాథాపరమైన అర్థం కూడా దీనికి వచ్చింది.

67.7 **(iii) దాసులు :** దాస- అనే పదమూ, దానికి తుల్యమైన దస్యు- అనే పదమూ, అంతరిక్షరాక్షసులని సూచించేవిగాకూడా వాడబడ్డాయి. దాసశబ్దం చరిత్ర వృత్రశబ్దం చరిత్రకి తలకిందులుగా ఉంటుంది (అధ్యాయం 68). ఇవి ఎర్రరంగుకల ఆర్యులు ఓడించిననల్లరంగుకల భారతోపఖండంలోని ఆదిమజాతులనేముఖ్యంగా సూచించినా, ఋగ్వేదంలో ఇవిగాథలలోని వ్యక్తులని కూడా సూచించడానికి తరచుగ వాడబడ్డాయి; దీనికికారణం చరిత్రకీగాథకీ భేదం పాటించబడకపోవడమే. దాసులుగా చెప్పబడిన ప్రత్యేక వ్యక్తుల పేర్ల విషయంలో ఇది ముఖ్యంగా వర్తిస్తుంది; వీటిలో కొన్ని (ఉదా. ఇలీబిశ-) అనార్యజాతులకిచెందినవ్యక్తులపేర్లేఅయినా మరికొన్నిటికి (ఉదా. శుష్ణ-) గాథాపరమైన వ్యుత్పత్తి ఇవ్వడానికి కూడా అవకాశం ఉంది (అధ్యాయం 69.2).

67.8 దాస, దస్యు శబ్దాల ఏకవచన రూపమూ (2.12.10, మొ.), (ముఖ్యంగా దస్యుశబ్దం) బహువచనరూపమూ (1.101.5) ఇంద్రుడు ఓడించిన శత్రువులని సూచించేవిగా తరచుగా వాడబడ్డాయి; ఇవి వృత్రుడిపేరుతో కలిసి కూడా కొన్నిచోట్ల వచ్చాయి (6.23.2, మొ.). ఇంద్రుడికిదస్యుహన్- 'దస్యులని చంపినవాడు' (1.100.12, మొ.) అనే విశేషణం ఉంది; ఈ యుద్ధానికి వాచకమైనదస్యుహత్యా- (1.51.5, 6, మొ.) అనేపదం కొన్నిచోట్ల ఉంది. తనకి ఆశ్రితులైన వ్యక్తులకోసం ఇంద్రుడు ముప్పైవేలమంది దాసుల్ని నిద్రపోగొట్టేడు (= చంపేడు, అస్వాపయత్, 4.30.21); వెయ్యిమంది దస్యులని బంధించాడు (2.13.9); దధ్యంచుడికోసమూ, మాతరిశ్వుడికోసమూ దస్యులగోశాలలు పట్టుకొన్నాడు (10.48.2). శత్రుత్వం వహించిన ఆర్యుల్నీ, దాసుల్నీ జయించడానికి ఇంద్రుడు సహాయపడాలనే ప్రార్థన ఉన్నచోట్లా (10.38.2, మొ.), ఇంద్రుడు ఆర్యులకీ దస్యులకీ/ దాసులకీ మధ్యభేదం తెలుసుకొంటాడని ఉన్నచోట్లా (1.51.8; 10.86.19) భూమిమీద ఉండే (నిజమైన) శత్రువులే ఉద్దిష్టులనేది స్పష్టం. ఇంద్రుడు ఆర్యులకోసం దస్యులతో యుద్ధం చేస్తాడని ఉన్నచోట్ల కూడా ఇంతే (6.18.3; 6.25.2). జయం సాధించిన ఆర్యులు ఓడిపోయిన దాసులని బందీలుగా తీసుకోవడం వల్ల దాసశబ్దం ఋగ్వేదంలో రెండు మూడుచోట్ల (7.86.7; వాలఖిల్యం 8.3 = 8.56.3) 'సేవకుడు, బానిస' అనే అర్థంలో వాడబడడం సంభవించింది; వేదాల తరవాతకాలపు సంస్కృతంలో

ఈ పదానికి ఇదే ప్రచురమైన అర్థం (ఇంగ్లీషు Slave 'బానిస' అనే పదంలో కూడా ఇటువంటి అర్థవిపరిణామమే ఉంది, ఇది Slav 'తూర్పు / ఆగ్నేయ యూరప్ (రష్యా మొ.) దేశస్థుడు' అనేపదానికి సంబంధించినది; ఈప్రాంతాల వారు మధ్యయూరప్ వారికి బందీలయ్యారు). మరొకపక్క, స్వర్గాన్ని ఎక్కే ప్రయత్నం చేసిన దస్యులని ఇంద్రుడు పడగొట్టేడనీ (8.14.14; చూ. 2.12.12), ఇంద్రుడు కాల్చి స్వర్గాన్నించి పడగొట్టిన దస్యువు (1.33.7) అనీ, ఆయనపుట్టుకనించీ ఓడించినదస్యువు (1.51.6 8 77.1-3) అనీ, ఇంద్రుడు దస్యులతో యుద్ధంలో దేవతలకి సహాయం చేశాడు (10.54 1) అనీ ఉన్నచోట్ల దస్యులంటే రాక్షసులే అయి ఉంటుంది. ఇంద్రుడు మంచునీ చీకటినీ చెదరగొట్టి దస్యువుని చంపేడు (10.73.5) అనీ, ఆయన దస్యులని చంపి సూర్యుణ్ణీ నీళ్లనీ సాధించాడు (1.100.18) అనీ, దేవతలూ దస్యులూ పరస్పరం శత్రువులు (3.29.9) అనీ ఉన్నచోట్ల కూడా ఇదే అర్థం. నీళ్లకి భర్త అయిన దాసుడు రాక్షసుడే అయి ఉంటాడు (1.32.11; 5.30.5; 8.96.18); జయం సాధించిన ఇంద్రుడు నీళ్లని ఒక సత్పురుషుడికి భార్యలుగా చేశాడు (యో అర్యపత్నీ రకృణో దిమా అపః, 10.43 8) వృత్రుడి కోటలలా (1.174.2) శరత్కాలానికి సంబంధించినవి అని చెప్పబడిన దాసుల ఏడుకోటలూ అంతరిక్షంలోవే అనడంలో సందేహం లేదు (6.20.10; చూ. 7.103.9)

67.9 దాస దస్యుల శబ్దాలకి దుష్టశత్రువు' అనేది ప్రధానార్థమూ, 'రాక్షసుడు' అనేది అనుషంగికార్థమూ కాబట్టి వీటికి సమానార్థకంగా (ఇంగ్లీషులో) friend అనే శబ్దం వాడడంలో సౌకర్యం ఉంది (★ వీటికి తెలుగులో రాక్షస శబ్దమే వాడాలి). ఇంద్రుడు ఓడించిన రాక్షసుల పేర్లకి ఇవి జాతి వాచకాలుగా చేర్చబడ్డాయి; ఇవి నముచి (5.30.7-9 మొ.), శంబర (4.30.14, మొ.), శుష్ణ (7.19.2, మొ.) శబ్దాలకి తరచుగానూ, పిప్రు (8.32.2; 10.138.3), చుమురి, ధుని (2.15.9; 7.19.4), వర్చిన్ (4.30.15 6.47.21), నవవాస్త్వ (10.49.6, 7) శబ్దాలకి కొన్నిచోట్లా, త్వాష్ట్ర (2.11.19), అహి (= వృత్రుడు, 2.11.2) శబ్దాలకి ఒక్కొక్కచోటా చేర్చబడ్డాయి.

## 68. వృత్రుడు, వలుడు మొదలైనవారు

68.1 **(i)** వృత్రుడు : అంతరిక్ష రాక్షసులలో ముఖ్యుడూ, చాలా తరచు చెప్పబడినవాడూ వృత్రుడు; వాడు ఇంద్రుడికి ముఖ్య శత్రువు; ఇంద్రుడు పుట్టినదీ

పెరిగినదీ వాళ్లే చంపడం కోసమే ('.89.5; 10.55). అందువల్ల ఇంద్రుడి అతి విశిష్టమైన విశేషణం వృత్రహన్- 'వృత్రుణ్ణి చంపినవాడు (ప్రథమైకవచనం వృత్రహా). ఈ సమాసం రెండు ఋగ్వేదమంత్రాలలో (విగ్రహవాక్యం చెప్పినట్లు) విడదీయబడింది: ''వృత్రం హనతి వృత్రహా'' (వృత్రహా వృత్రుణ్ణి చంపుగాక, 8.89.3), ''వృత్రాణి వృత్రహన్ జహి'' (ఓ వృత్రహన్! వృత్రాలని (= శత్రువుల గుంపులని) చంపు, 8.17.9). వృత్రహత్య- అనే పదమూ, అరుదుగా, వృత్రతూర్య- 'వృత్రవిజయం' అనే పదమూ ఇంద్రుడికి వృత్రుడితో జరిగిన యుద్ధాన్ని సూచించడానికి వాడబడ్డాయి.

68.2 వృత్రుడు పాము ఆకారంలో ఉంటాడని భావించబడిందని ఇంతకుముందే చెప్పబడింది (అధ్యాయం 64.2). అందువల్ల వాడికి పాదాలూ, చేతులూ లేవు (1.32.7; 3.30.8; అగ్నికి కూడా 4.1.11లో ఇలాగే చెప్పబడింది. ఇంద్రుడు చీల్చిన వాడి తల ప్రసక్తి (1.52.10; 8.6.6; 8.76.2), ఇంద్రుడు వజ్రంతో కొట్టిన వాడి దవడల ప్రసక్తి (1.52.6) కొన్నిచోట్ల ఉన్నాయి. వాడు బుసకొట్టడం (శ్వసథ-) కూడా కొన్నిచోట్ల (8.96.7; 5.29.4; చూ. 152.10; 1.61.10; 6.17.10) చెప్పబడింది. వాడి ఆయుధాలు ఉరుమూ (తన్యత్, 1.80.12), మెరుపూ, మంచూ, వడగళ్లూ (హ్రాదుని- (★ = అశని 'పిడుగు' అని సాయణుడు), 1.32.13).

68.3 వృత్రుడి తల్లిపేరు దాను-; అది ఆవుతో పోల్చబడింది (1.32.9). 'ప్రవాహం' అనే అర్థంలో నపుంసకలింగంగా కొన్నిచోట్లా, 'స్వర్గంలోని నీళ్లు' అనే అర్థంలో స్త్రీలింగంగా ఒకచోటా వాడబడిన దాను శబ్దమూ ఇదీ ఒకటే అని చెప్పవచ్చు. ఇదే పదం పుంలింగంగా వృత్రుడికీ/పాముకీ (2.12.11; 4.30.7), ఔర్ణవాభుడనే రాక్షసుడికీ (2.11.18), ఇంద్రుడు చంపిన ఏడుగురు రాక్షసులకీ (10.120.6) వాడబడింది; ఇక్కడ ఇది 'దానువు కొడుకు(లు)' అనే అర్థంలో అపత్యార్థక ప్రత్యయం లోపించిన తద్ధితరూపంగా వాడబడినట్లు కనపడుతుంది. దీని తద్ధితరూపంగా ప్రచురంగా ఉన్న దానవశబ్దం ఇంద్రుడు చూపిన ఒక రాక్షసుడికి వాచకంగా అయిదుచోట్ల ఉంది; ఈ రాక్షసుడు వృత్రుడే అనడంలో సందేహం లేదు; ఉదాహరణలు: ఇంద్రుడు కుయుక్తులుగల దానవుడి కుయుక్తులు నాశనం చేశాడు (2.11.10); నీటిని విడుదల చెయ్యడానికి ఆయన బుసలుకొట్టే దానవుణ్ణి చంపేడు (5.32.1; 5.29.4).

68.4 వృత్రుడికి ఒక రహస్యమైన (నిణ్య-) స్థావరం ఉంది; ఇంద్రుడు నీళ్లని విడుదల చేశాక అవి రాక్షసుడి మీదుగా ప్రవహిస్తూ బయటికి వస్తాయి (1.32.10). వృత్రుడు నీళ్లమీదపడుకుంటాడు (1.121.11; 2.11.19); వృత్రుడు నీళ్లలో మునిగి అంతరిక్షం (రజస్-) అడుగున (బుధ్న-) ఉంటాడు (1.52.6). ఇంద్రుడు నీళ్లని విడుదల చేసినప్పుడు వాడు శిఖరం (సాను-) మీద పడుకొని ఉంటాడనీ (1.80.5), ఇంద్రుడు వాణ్ణి చాలా ఎత్తైన ప్రదేశాలనించి పడగొట్టేడనీ (8.3.19) కూడా వర్ణనలు ఉన్నాయి. వృత్రుడికి కోటలు ఉన్నాయి; ఇంద్రుడు వాణ్ణి చంపినప్పుడు ఆ కోటలని కూడా ధ్వంసం చేశాడు (10.89.7); వాటి సంఖ్య తొంభై తొమ్మిది (7.19.5; 8.93.2).

68.5 'వృ-త్ర' శబ్దం వృ- 'కప్పు, ఆవరించు' అనే ధాతువునించి వచ్చిందనడంలో సందేహం లేదు. కవులు చాలాచోట్ల వృత్రుడు నీళ్లని ఆవరించి ఉన్నాడు అని వర్ణించారు అపో వరివాంసం (2.14.2, మొ.) 'నీళ్లని ఆవరించి ఉన్నవాణ్ణి', అపో వృత్వీ (1.52.6) 'నీళ్లని ఆవరించి'; వాడికి నదీవృత్ 'నదులని ఆవరించినవాడు' అనే విశేషణం కూడా వాడబడింది (1.52.2; 8.12.26; చూ. 6.30.4; 7.21.3). ఇవి ఈ పదం వ్యుత్పత్తిని సూచించేవే అనే విషయం స్పష్టం. ఈ వ్యుత్పత్తిని దృష్టిలో పెట్టుకొని శబ్దాలంకారంతో చెప్పిన వాక్యాలు కూడా ఉన్నాయి: ఇంద్రుడు ఆవరించిన వాణ్ణి ఆవరించాడు (వృత్ర మవృణోత్, 3.43.3); వృత్రుణ్ణి చంపి మూసి ఉన్న నీటిగోతిని తెరిచాడు (అపాం బిలమపి హితం ...... వృత్రం జఘన్వాన్ అప త ద్వవార, 1.32.11; 1.51.4). (మేఘం అనే) పర్వతం వృత్రుడి కడుపులో ఉందనీ, ఒక ఆవరణ (వవ్రి) లో ఉన్న నదులని ఇంద్రుడు గట్లు తెగ్గొట్టి పల్లపు ప్రదేశాలకి పంపేడనీ వర్ణన ఉన్నచోట (చూ. 1.57.6) కూడా ఇటువంటి భావమే వ్యంగ్యంగా ఉంది. వృత్రుడు నదులకి గట్టు (పరిధి) అని కూడా ఉంది (3.33.6).

68.6 ఇంద్రుడికి విశేషణమైన వృత్రహన్- శబ్దాన్ని వేదఋషులు 'వృత్రుణ్ణి చంపినవాడు అనే అర్థంలోనేకాక 'వృత్రాలని చంపినవాడు' అనే అర్థంలో కూడా ఉపయోగించారని పైన చెప్పబడింది. ఋగ్వేదంలో నపుంసకలింగమైన వృత్రశబ్దం బహువచన రూపమే ఉంది (ప్రథమా - ద్వితీయా విభక్తిరూపం 'వృత్రా(ణి)'); దీని ప్రయోగం చాలా తరచుగా ఉంది; ఇదికొన్నిచోట్ల ఇతరరాక్షసుల పేర్లతోపాటు కూడా వచ్చింది (7.19.4; 10.49 6) ఇంద్రుడు వృత్రాలతో చేసిన యుద్ధం ఫలితం ఆవరించబడిన (వృతాన్, 4.42.7) నీళ్లని

(7.34.3) / నదులని (సింధూన్, 8.96.18) విడిపించడమే. ఆయనపుట్టగానే చంపినది వృత్రాలనీ, ఇతర రాక్షసులనీ (6.29.6); దేవతలు ఆయన్ని పుట్టించినది వాటినీ, వారినీ చంపడం కోసమే (3.49.1). దధ్యంచుడి ఎముకలతో ఆయన తొంభైతొమ్మిది వృత్రాలని చంపేడు (1.84.13); వృత్రుడి తొంభైతొమ్మిది కోటలని ధ్వంసం చేశాడు (7.19.5).

69.7 వృత్రా(ణి) అనేపదం హన్- 'చంపు' అనే ధాతువు నించి వచ్చిన క్రియారూపాల తోనే వస్తుంది; ఇది భూమిమీద శత్రువులని కూడా సూచిస్తుందనడానికి ఉదాహరణలు దాసా న్యార్యాణి వృత్ర కరః ''దాసులైన శత్రువులని ఆర్యులుగా చేశావు'' (6.22.10); అమిత్రాన్‌దాసా వృత్రా ణ్యార్యా చ శూర వధీః ''శత్రువులైన దాసులని ఆర్యులనీ కూడా చంపేవు'' (6.33.3). ఇంతేకాక, చాలా సందర్భాలలో ఈ శబ్దం స్వర్గంలోని రాక్షసులకే కాక శత్రువులైన మనుష్యులకి కూడా వర్తిస్తుంది. కాని అటువంటిచోట్ల దీనికి 'శత్రువు' అనే సామాన్యార్థమే కాక (దీనికి 'శత్రు', 'అమిత్ర' పదాలు వాడబడ్డాయి, 6.73.2) 'వృత్రుడి లాగా రాక్షస స్వభావం కలవారు' అనే అర్థం కూడా ధ్వనిస్తుంది; ఇప్పటి ఇంగ్లీషులో friend శబ్దం మనుష్యుడికి వాడినప్పుడు 'రాక్షసుడి వంటివాడు' అనే అర్థం ధ్వనించడం దీనికి పోలికగా తీసుకోవచ్చు. ఇక్కడ జరిగిన అర్థ విపరిణామం దాస, దస్యు శబ్దాలలో జరిగిన దానికి వ్యతిరేకంగా ఉంది; వాటికి మొదట్లో ఉన్న అర్థం 'శత్రువు'; తరవాత వచ్చిన అర్థం 'రాక్షసుడు'. వృత్రా(ణి) అనే బహువచన రూపం నపుంసకలింగం కాబట్టి ఇది వృత్రుడనే వ్యక్తిపేరుకి సంబంధించిందనడానికి వీల్లేదు; ఇది 'అడ్డు' అనే ప్రాచీనార్థం కల వృత్ర శబ్దానికి సంబంధించినది అని చెప్పాలి (★ ఇక్కడ సాయణుడు వృత్రశబ్దానికి కొన్నిచోట్ల (6.34.3) 'ఉపద్రవం' అని అర్థం ఇవ్వడం గమనించదగినది); 'అడ్డు' అనే అర్థం నించి 'అడ్డగించేవాడు' అనే అర్థం వచ్చింది. అవెస్తాలో వెరెత్ర అంటే 'విజయం'; ఈ అర్థం కూడా 'అడ్డు' అనే అర్థం నించి పరిణమించినదే.

68.8 బ్రాహ్మణాలలో వృత్రుడంటే చంద్రుడనీ, ఆ చంద్రుణ్ణే అమావాస్యనాడు ఇంద్రుడు సూర్యరూపంలో మింగుతాడనీ ఉంది.

68.9 **(ii) వలుడు:** వల శబ్దం ఋగ్వేదంలో సుమారు ఇరవైనాలుగు సార్లు వచ్చింది. ఇంద్రుడూ, ఆయనసహచరులూ, ముఖ్యంగా అంగిరసులు (అధ్యాయం 54) గోవులని

విడిపించడంతో వలుడికి సంబంధం ఉంది. వలుడు ఆవులకి రక్షకుడు; ఇంద్రుడు పణి ఆవుల్ని దొంగిలించినప్పుడు వాళ్లే చీల్చాడు (10.67.6; చూ. 6.39.2). బృహస్పతి వాడి ఆవుల్ని తీసుకున్నప్పుడు వాడు వాటికోసం ఏడ్చేడు (10.68.10; చూ. 10.67.6). వాడి కోటలు ఇంద్రుడు బలవంతంగా తెరిచాడు (6.18.15); వాడి అడ్డుగోడల్ని ఇంద్రుడు చీల్చాడు (1.52.5); వాడి విరగని శిఖరాన్ని ఇంద్రుడు విరగ్గొట్టేడు (6.39.2). తై.సం. (2.1.5.1) లో ఇంద్రుడు వలుడి గోతిని (బిల) తెరచి దాంట్లో ఉన్న శ్రేష్ఠమైన జంతువుని బయటకి తెచ్చాడనీ, దాని వెనకాల వెయ్యి బయటకి వచ్చాయనీ ఉంది. కాని వల శబ్దానికి వ్యక్తిత్వారోపం లేని సందర్భాలు కూడా ఉన్నాయి. అటువంటి చోట్ల దీని అర్థం 'మూసి ఉన్నచోటు' / 'గుహ' (వృ- 'మూయు, కప్పు' అనే ధాతువు నించి). ఉదాహరణకి, ఈ పదం రెండుచోట్ల (1.62.4; 4.50.5) ఫలిగ- '(అంతరిక్ష) జలాలకి పాత్ర (= మేఘం)', 8.32.15) అనే పదంతోపాటు అదే అర్థం ఇచ్చేదిగా వాడబడింది; ఇది నిరుక్తంలోని నిఘంటువు (1.10) లో మేఘానికి సమానార్థకంగా ఇవ్వబడింది. ఇంద్రుడు ఆవుల్ని బయటకి తోలేడు; వలాన్ని (= గోతిని/గుహని) తెరిచాడు (అప వృ-, 2.14.3); ఆవులున్న వలం ద్వారాన్ని (చూ. 1.32.11) తెరిచాడు, 1.11.5). పం.బ్రా. (19.7) లో అసురుల గుహ రాతితో మూసి ఉంటుంది అని ఉంది. కొన్ని మంత్రాలలో ఈ పదానికి మౌలికార్థమూ, వ్యక్తిత్వార్థమూ కూడా చెప్పవచ్చు (1.52.5; 2.12.3; 3.34.10). ఇంద్రుడి విశేషణమైన వలంరుజ- 'వలుణ్ణి చీల్చినవాడు' అనే పదంలో వ్యక్తిత్వార్థమే ఉద్దిష్టమై ఉండవచ్చు; ఇది వృత్రఖాద- 'వృత్రుణ్ణి తిన్న (= చంపిన) వాడు' అనే పదం వెనకాలే వచ్చింది (3.45.2; చూ. 2.12.3). ''వల- అనే గోశాల (వ్రజ-) ఇంద్రుడు కొడతాడు అనే భయంతో తెరుచుకొంది (వి ఆర)'' అని ఉన్న మంత్రం (3.30.10) లో మౌలికార్థం వ్యక్తిత్వార్థంగా మారడంలో మధ్యదశ కనపడుతుంది. వల శబ్దానికి పురుషతారోపం పూర్తిగా వృద్ధి చెందలేదని చెప్పడానికి ఆధారం: ఇంద్రుడూ తదితరులూ వల- పై చేసిన ఆక్రమణని సూచించడానికి (వృత్రుడి విషయంలోలా హన్- 'చంపు' ధాతువు కాక), భిద్- 'పగలగొట్టు', దృ- 'చీల్చు', రుజ్- 'పగలగొట్టు' అనే ధాతువులు సాధారణంగా వాడబడ్డాయి అనేది. వేదాల తరవాత సాహిత్యంలో ఇంద్రుడికి తరచుగా వాడబడిన వలభిద్- / బలభిద్- అనే విశేషణంలో వల శబ్దానికీ భిద్- ధాతువుకీ ఉన్న సంబంధం మిగిలి ఉంది. ఇందులో వలుడు వృత్రుడికి సోదరుడు అనే భావన ఉంది; ఈ

రెండు పేర్లూ వల- వృత్ర- హన్- అనే ఇంద్రుడి విశేషణంలో కలిసి ఉన్నాయి.

68.10 **(iii) ఇంద్రుడి శత్రువులైన ఇతర రాక్షసులు :** అర్బుదుడి పేరు (అర్బుద-) ఋగ్వేదంలో ఏడుచోట్ల (రెండుచోట్ల అంతోదాత్తంగానూ అయిదుచోట్ల ఆద్యుదాత్తంగానూ) వచ్చింది, అన్నిచోట్లా వీడు ఇంద్రుడి శత్రువు లనే చెప్పబడింది. వీడు కుయుక్తులు గల జంతువు; వీడి ఆవుల్ని ఇంద్రుడు తోలుకుపోయాడు (8.3.19). ఇంద్రుడు వీణ్ణి పడగొట్టేడు (2.11.20; 2.14.4; చూ. 8.32.3); కాలితో తొక్కేడు 91.51.6); మంచు (గడ్డ)తో చీల్చాడు (హిమేనావిధ్య దర్బుదం 8 32.26)· తల కోసేశాడు (10.67.12). వీడిపేరు రెండుమూడుచోట్ల వృత్రుడి/ అహి పేరుతో కలిసివచ్చింది; వీరిద్దరి స్వభావమూ ఒకటే.

68.11 త్వష్టకొడుకైన విశ్వరూపుడు మూడుతలల రాక్షసుడు; త్రితుడూ, ఇంద్రుడూ వీణ్ణి చంపి ఆవుల్ని తీసుకుపోయారు (10.8,8, 9). రెండు మూడు ఇతర మంత్రాలలో వీడికి త్వాష్ట్ర- 'త్వష్టకొడుకు' లనే తద్ధిత రూపమే వాడబడింది; వాటిలో వీడికి చాలా గుర్రాలూ, ఆవులూ ఉన్నాయనీ (10.76.3), ఇంద్రుడు వీణ్ణి ఓడించి త్రితుడికి వశం చేశాడనీ (2.11.19; చూ. అధ్యాయాలు 22.22; 23.2) వర్ణించబడింది. తై.సం. (2.5.1.1)లో విశ్వరూపుడు అసురులకిసంబంధించినవాడే అయినా దేవతల పురోహితుడు అని చెప్పబడింది. మహాభారతం (5.22, దాని తరవాతవి)లో త్వష్ట మూడుతలల కొడుకూ వృత్రుడూ ఒకరే అని ఉంది.

68.12 అసుర లక్షణాలు కల (ఆసుర-) స్వర్భానువు (స్వర్భాను-) ప్రసక్తి ఋగ్వేదం 5.40 సూక్తంలో నాలుగుచోట్ల ఉంది. వీడు సూర్యుణ్ణి చీకటితో ఆవరిస్తాడని వర్ణన ఉంది. ఇంద్రుడు వీడి కుయుక్తులు నాశనం చేశాడు; అత్రి సూర్యుడి కన్ను (మళ్లీ) స్వర్గంలో పెట్టేడు. బ్రాహ్మణాలలో ఈ రాక్షసుడి ప్రసక్తి కొన్నిచోట్ల ఉంది. వేదాల తరవాతకాలపు గాథాతత్త్వంలో వీడిస్థానంలో రాహువు వచ్చాడు. ఈపేరుకి వ్యుత్పత్త్యర్థం ''సూర్యకాంతిని మరుగుపరిచేవాడు'' అని చెప్పవచ్చు.

68.13 ఇంద్రుడు చంపిన ఉరణుడు (ఉరణ-) అనే రాక్షసుడికి తొంభై తొమ్మిది చేతులున్నాయని వర్ణన; ఈ పేరు ఒకచోట (2.14.4) మాత్రమే వచ్చింది.

## 69. కొందరు దాసులు

69.1 (i) శుష్ణుడు : రాక్షస స్వభావంకల శుష్ణుడి (శుష్ణ-) పేరు ఋగ్వేదంలో సుమారు నలభైసార్లు వచ్చింది; వీడు కుత్సుడికి ముఖ్య శత్రువు; కుత్సుడికోసం కుత్సుడితో కలిసి ఇంద్రుడు వీణ్ణి ఓడించాడు (4.16.12; 5.29.9 మొ) వీడికి కొమ్ములున్నాయి (శృంగిణం, 1.33.12). గుడ్ల నించి పుట్టిన వీడిపిల్లలని ఇంద్రుడు చంపేడు (శుష్ణస్యాండాని భేదతి, 8.40.10, 11; చూ. 10.22.11); దీనివల్ల వీడు పామురూపం కలవాడని ఊహించవచ్చు. వీడు బుసకొడతాడని వర్ణించబడింది (శ్వసన- 1.54.5; చూ. శ్వస్- ధాతువూ, శ్వసథ- 'బుస' శబ్దమూ వృత్రుడి విషయంలో కూడా వాడబడ్డాయి). వీడికి ఆరుచోట్ల అశుష- అనే విశేషణం వాడబడింది; ఈపదం ఇతరత్ర ఒకేఒకచోట అగ్నికివాడబడింది; దీని అర్థం 'మింగేవాడు' కావచ్చు (అశ్- 'తిను ) వీడికి గట్టికోటలు (1.51.11) / కదిలే(8.1.28) ఒకకోట(4.30.13) ఉన్నాయి / ఉంది ఇంద్రుడు శుష్ణుడికోటలు ధ్వంసంచేసి నీళ్లని విడిపించాడు (1.51.11); శుష్ణుణ్ణి చంపి నీటికి ఆధారమైనపాత్ర (క్రివి-) సంపాదించాడు (వాలఖిల్యం 3.8 = 8.51.8) శుష్ణుడి సంతానాన్ని చంపిస్వర్గంలోని (స్వర్వతీః) నీళ్లుసాధించాడు (8.40.10). నాలుగుచోట్ల శుష్ణుడిపేరుతోపాటు కుయవ- 'చెడ్డబార్లీ పంట కలవాడు (= పంటలు పాడుచేసేవాడు) అనే విశేషణం వాడబడింది. ఈ పదం మాత్రమే ఉన్న రెండు మంత్రాలలో (1.103 8 1.104.3) కూడా ఇది శుష్ణుణ్ణే సూచిస్తుందని అనుకోవచ్చు. ఇంద్ర శుష్ణుల యుద్ధం ఫలితం ఎప్పుడూ నీళ్లని విడుదల చెయ్యడం మాత్రమే కాదు; ఆవులనీ (8.96.17) సూర్యుణ్ణీ (అధ్యాయం 58) సాధించడం కూడా దీని ఫలితాలే. ఇంద్రుడితో యుద్ధంలో శుష్ణుడు చీకట్లో సంచరిస్తాడు; వాడు 'మంచు కొడుకు' (మిహోనపాత్), దానవుడు (5.32.4). కాఠకంలో శుష్ణుడు అమృతం తన దగ్గర పెట్టుకొన్న దానవుడు అని ఉంది

69.2 పై ఆధారాల వల్ల శుష్ణుడు మొదటినించీ అనావృష్టి కారకుడైన ఒక రాక్షసుడనీ చరిత్రలో ఉన్న ఒక మానవుడైన శత్రువుకి జ్ఞాపకచిహ్నం కాదనీ తెలుస్తుంది. ఈ శబ్దం వ్యుత్పత్త్యర్థం కూడా ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తుంది; దీని వ్యుత్పత్త్యర్థం 'బుసకొట్టేవాడు (శ్వస్- / శుష్- 'శ్వాసించు' ధాతువు) లేక 'ఎండగొట్టేవాడు' (శుష్- 'ఎండు' ధాతువు) అయి ఉండాలి,

69.3 (ii) శంబరుడు: ఈ రాక్షస స్వభావుడి పేరు ఋగ్వేదంలో సుమారు ఇరవై సార్లు వచ్చింది. ఈ పేరు ముఖ్యంగా శుష్ణుడు, పిప్రువు (1.101.2; 1.103.8; 2.19.6, 6.18.8), వర్చిన్- పేర్లతో పాటు వచ్చింది. ఇంద్రుడికి పాముతోనూ శంబరుడితోనూ జరిగిన యుద్ధంలో మరుత్తుల సహాయం లభించింది (3.47.4). ఇంద్రుడు శంబరుణ్ణి నరికినప్పుడు స్వర్గశిఖరం కంపించేటట్లు చేశాడు (1.54.4). ఆయన కొండలలో ఉన్న శంబరుణ్ణి వెతికిపట్టుకొని (2.12.11) వాణ్ణి కొండమీద నించి పడగొట్టేడు (1.130.7; 6.26.5). ఆయన కులితరుడి కొడుకూ, దాసుడూ అయిన శంబరుణ్ణి పెద్ద కొండమీదనించి పడగొట్టేడు (4.30.14). తాను ఒక చిన్న దేవతని అనుకొంటున్న శంబరుణ్ణి ఆయన పెద్దకొండమీదనించి పడగొట్టేడు (దేవకంచిన్మాన్యమానం జఘంథ, 7.18.20). శంబరుడికి తొంభై (1.130.7), (సాధారణంగా) తొంభైతొమ్మిది (2.19.6, మొ.), వంద (2.14.6, మొ.) కోటలు ఉన్నట్లు చెప్పబడింది. శంబరశబ్ద నపుంసకలింగ బహువచనరూపం (శంబరాణి) 'శంబరుడి కోటలు' అనే అర్థంలో ఒకచోట (2.24.2) వచ్చింది. బృహస్పతి వీటిని చీల్చి సంపదతో నిండినకొండలోకి ప్రవేశించాడు (2.24.2). ఇంద్రుడు అతిథిగ్వుడికోసం (1.51.6) / (సాధారణంగా) దివోదాసుడికోసం (2.19.6, మొ.) / (కొన్నిచోట్ల) ఈ ఇద్దరికోసమూ (1.130.7; 4.26.3) శంబరుణ్ణి చంపేడు. ఈ రెండుపేర్లూ ఒకరినే సూచిస్తాయని చాలామంది అభిప్రాయం; కాని బెర్గెయిన్ (Bergaigne) ఈ విషయంలో సందేహం వ్యక్తపరిచారు.

69.4 (iii) పిప్రువు: ఋగ్వేదంలో పదకొండుచోట్ల ప్రసక్తి ఉన్న పిప్రువు (పిప్రు-) అనే రాక్షస స్వభావుడు ఇంద్రుడికి రక్షణపాత్రుడైన ఋజిశ్వుడికి (ఋజిశ్వన్-) శత్రువు (వాలఖిల్యం 1.10 = 8.49.10); ఋజిశ్వుడు ఇంద్రుడికి సోమం ఇచ్చి యుద్ధంలో ఆయనసహాయం పొందినవాడు (5.29.11; 10.99.11). ఇంద్రుడు ఋజిశ్వుడితో కలిసి (1.101.1, 2; 10.138.3) / ఋజిశ్వుడి కోసం (4.16.13; 6.20.7) పిప్రువుని జయించాడు. పాము (= వృత్రుడుకి) ఉన్న కుయుక్తులు ఉన్న పిప్రువు కోటలని ఇంద్రుడు ధ్వంసం చేశాడు (1.51.5; 6.20.7). ఇంద్రుడు దాసుడైన పిప్రువునీ, మరికొందరు అరుదుగా ప్రసక్తి ఉన్నవారినీ చంపి నీళ్లు వదిలేడు (8.32.2). సూర్యుడు తన రథాన్ని ఆకాశం మధ్యలో విప్పినప్పుడు ఈయన దాసుడికి సరియైన ప్రతిద్వంద్వి అని ఆర్యుడు తెలుసుకొన్నాడు; ఇంద్రుడు ఋజిశ్వుడితో కలిసి మాయావీ అసురుడూ

అయిన పిప్రువు కోటలని ధ్వంసం చేశాడు (10.138.3). ఆయన అడవి జంతువు (వంటి; మృగయ-) పిప్రువుని ఋజిశ్వుడికి వశం చేశాడు; ఏభైవేలమంది నల్లవాళ్లని చంపేడు; ముసలితనం అందాన్ని నాశనం చేసినట్లు కోటలని నాశనం చేశాడు (4.16.13) ఆయన ఋజిశ్వుడితో కలిసి నల్లని సంతానం కల స్త్రీలని (కృష్ణ గర్భాః) చంపేడు (1.101.1). పిప్రువు అసురుడూ, దాసుడూ అని కూడా ఉండడం వల్ల వీడు చరిత్రలో ఉన్న మనుష్యుడైన శత్రువే అని కొందరు పండితులు వ్యక్తపరచిన అభిప్రాయం సందేహాస్పదమే. ఇది పృ- ధాతువు నించి (ధాతువు ద్విరుక్తమై) వచ్చిన సంస్కృతపదం లాగానే కనపడుతోంది (సన్- ధాతువునించి వచ్చిన సి-ష్ణు వంటిది); దీని మౌలికార్థం 'ద్రోహి', 'వ్యతిరేకి' అయి ఉండవచ్చు.

69.5 **(iv) నముచి :** ఈ శబ్దం ఋగ్వేదంలో తొమ్మిదిచోట్ల ఉంది; ఇది వా.సం తై.బ్రా., శ.బ్రా.లలో కూడా ఉంది. ఋగ్వేదంలో నముచికి ఆసుర- 'రాక్షసులకి సంబంధించినవాడు' అనే విశేషణం ఒకచోట (10.131.4; శ.బ్రా. 12.7.1.10) ఉంది; అర్వాచీన వైదిక గ్రంథాలలో నముచి అసురుడు అనీ ఉంది. ఇంద్రుడు తనకు ఆశ్రితుడూ, సపుడికొడుకూ (సాప్య-) అయిననమి (నమీ-) కోసం నముచిని చంపినట్లు రెండుచోట్ల (1.53.7; 6.20.6) ఉంది. ఇంద్రుడు నముచిని అనేకులైన ఇతర రాక్షసుల్ని చంపినట్లే చంపేడు (2.14.5; 7.19.5; 1.53.7). ఇంద్రుడు వృత్రుణ్ణీ నముచినీ చంపి వందకోటలు ధ్వంసం చేశాడు (7.19.5). ఇంద్రుడు నముచిని చంపడంలో ఒక ప్రత్యేకత ఆయన నముచి తలని కవ్వం తిప్పినట్లు తిప్పేడు అనేది (శిరో దాసస్య నముచే ర్మథాయన్ 5.30.8; 6.20.6; మథ్- ధాతువు); కాని ఆయన వృత్రుడి తల బద్దలు కొట్టేడు (భిదః- ధాతువు). మరికొన్నిచోట్ల ఇంద్రుడు నముచి తల తిప్పేశాడనీ (నముచేః శిరో య దవర్తయః, 5.30.7), నీటి నురగతో తిప్పేసి (ఊడగొట్టేడు) అనీ (అపాం ఫేనేన నముచేః శిర ఇంద్రో దవర్తయః, 8.14.13) వర్ణన ఉంది. బ్రాహ్మణాలలో కూడా ఇంద్రుడు నముచితల నీటినురగతో కోసేశాడని ఉంది. ఋగ్వేదంలో ఒకచోట (10.131.4, 5) ఇంద్రుడు రాక్షసుడైన నముచితోపాటు కల్లు ఎక్కువగా తాగితే అశ్వినులు ఆయనకి సహాయం చేశారు; సరస్వతి ఆయనకి వైద్యం చేసింది అని ఉంది (అధ్యాయం 33.4; ★ ఇక్కడ ఇంద్రుడు నముచితోపాటు కల్లుతాగేడు అనేది మూలానుగుణం కాదు

కొందరు దాసులు (శుష్ణుడు, శంబరుడు, నముచి మొదలైనవారు) అనిగమనించాలి; నముచా వసురే ''అసురుడైన నముచిని చంపవలసి ఉండగా'' అనేదే సరైన అర్థం).

69.6 పాణిని (అష్టాధ్యాయి 6.3.75, నభ్రాణ్ణపాత్...) ప్రకారం ఈ శబ్దం వ్యుత్పత్తి ''వదిలిపెట్టనివాడు'' (న ముంచతీతి నముచిః) అని. అదే అయితే దీని మౌలికార్థం ''నీళ్లని వదిలిపెట్టకుండా ఆపిన రాక్షసుడు'' అవుతుంది.

69.7 **(v) ధుని, చుమురి :** చుమురి అనే దాసుడి పేరు ఆరుచోట్ల వచ్చింది; వీటిలో ఒకచోట తప్ప మిగిలిన అన్నిచోట్లా ధుని పేరు కూడా ఉంది. ఈ ఇద్దరి పేర్లూ ఒకచోట (6.20.13) ధునీచుమురీ అని ద్వంద్వ సమాసంగా ఉండడం వీరికున్న సాహచర్యాన్ని తెలియజేస్తుంది. ఇంద్రుడు వీరిని నిద్రపోగొట్టేడు (= చంపేడు, సిష్వప్, 2.15.9; 6.20.13;7.19.4); ఇలాగేచుమురి ఒక్కడి విషయంలో కూడా చెప్పబడింది (6.26.6). ఇంద్రుడు వీరిని శంబరుడూ, పిప్రువూ, శుష్ణులతోపాటు వీరికోటలు ధ్వంసం చెయ్యడానికి చంపేడు (6.18.8). వీరిని ఇంద్రుడు దభీతి అనే ఆయనకోసం నిద్ర పోగొట్టేడు/ జయించాడు (10.113.9); దభీతి ఇంద్రుడికి శ్రద్ధతో సోమం పిండి ఇవ్వడం వల్ల ఆయన ఈ ప్రతిఫలం ఇచ్చాడు (6.20.13; 6.26.6). ఈ ఇద్దరి పేర్లూ చెప్పకుండా ఇంద్రుడు దభీతికోసం ముప్పైవేల మంది దాసులని నిద్ర పోగొట్టేడనీ (4.30.21). ఆయనకోసం దస్యులని తాళ్లులేకుండా (అరజ్జౌ) బంధించాడనీ (2.13.9) చెప్పబడింది.

69.8 ధుని అంటే 'అరిచేవాడు' అని వ్యుత్పత్త్యర్థం (ధ్వన్- ధాతువు); ఈ పదం ఋగ్వేదంలో 'అరిచే, మండిపడే' అనే అర్థాలలో విశేషణంగా కూడా వాడబడింది. చుమురి ఒక అనార్యజాతి భాషనించి వచ్చిన పదంలా కనపడుతోంది.

69.9 **(vi) వర్చిన్- మొదలైనవారు:** వర్చిన్ పేరు నాలుగుచోట్ల, అన్నిచోట్లా శంబరుడి పేరుతోపాటు ఉంది. వాడికి అసురపదం వాడబడింది (7.99.5); కాని వాడూ శంబరుడూ దాసులని కూడా ఉంది (6.47.21). ఇంద్రుడు శంబరుడి వందకోటలు ధ్వంసం చేశాడనీ, దాసుడైన వర్చిన్‌కి సంబంధించిన లక్షమంది వీరులని చెదరగొట్టేడు / చంపేడు అనీ చెప్పబడింది (2.14.6; 4.30.15). ఈ పేరుకి 'ప్రకాశించేవాడు' అనేది మౌలికార్థం అవవచ్చు (ఇది వర్చస్- అనే శబ్దానికి సంబంధించినది).

69.10 ఇంద్రుడు వలుడు, శుష్ణుడు, నముచి వంటి రాక్షస స్వభావులతోపాటు మరికొందరిని కూడా ఓడించినట్లు చెప్పబడింది; కాని ఈ పేర్లు ఒక్కొక్క చోట మాత్రమే ఉన్నాయి. అటువంటి వారు దృభీక-, రుధిక్రా- (2.14.3, 5), అనర్శని-, సృబింద- (8.32.2), ఇలీబిశ- (1.33.12). ఈ పేర్లు చరిత్రలో భూమిమీద నిజంగా ఉన్న ముఖ్యశత్రువుల జ్ఞాపక చిహ్నాలు అయి ఉంటాయి. ఇలా చెప్పడానికి కారణాలు పైన ఇచ్చినవాటిలో చివరిరెండు పేర్లూ అనార్యజాతి వారి పేర్లులా ఉన్నాయి; వీరు ఊహలలో రాక్షసులు మాత్రమే అయితే వీరికి కూడా రాక్షస లక్షణాలని సూచించే వృత్రుడు వలుడు, శుష్ణుడు వంటి సార్థకమైన పేర్లే వాడబడి ఉండేవి.

## 70. రక్షస్సులూ, పిశాచాలూ, భూమిమీద ఇతర రాక్షసులు

70.1 (i) రక్షస్సులు : భూమిమీదే ఉండి మానవులకి హాని కలిగించే భూతాలూ పిశాచాలూ, దెయ్యాలూ వంటివాటికి అన్నిటికీ సాధారణంగా ఋగ్వేదంలో వాడబడిన పదం రక్షస్. ఇది (ఏభైకన్న ఎక్కువచోట్ల) ఏకవచనంలోనే (రక్షః), బహువచనంలోనూ (రక్షాంసి) వాడబడింది (ఇది ప్రమరంగా నపుంసకలింగం). వీటి ప్రసక్తి ఎప్పుడూ ఒక దేవతని వీటిని చంపినందుకు స్తుతించడంలోనో, వీటిని చంపమని దేవతలకి చేసే ప్రార్థనలలోనో వస్తుంది. ఋగ్వేదంలో రక్షస్సుల ప్రసక్తి ఉన్న రెండు సూక్తాలలో (7.104· 10.87) ఈ పదానికి బదులు యాతు- / యాతుధాన- అనే పదాలు దీనికి ఇంచుమించు సమానార్థకాలుగా వాడబడ్డాయి. ప్రయోగాలు తక్కువగా ఉన్న ఈ పదాలకి అసలు అర్థం 'చేతపాడి చేసేవాడు' అని. (ముఖ్యంగా యజుర్వేదంలో) ఈ పదాలు అన్ని దుష్టశక్తులకీ వాచకాలు కాబట్టి రక్షస్- అనేది జాతివాచకమనీ యాతు (ధాన-) అనేది రక్షస్సులలో ఒక అంతర్విభాగానికి వాచకమనీ అనుకోవచ్చు.

70.2 రక్షస్సులు కుక్కలరూపంలోనూ, రాబందులూ, గుడ్లగూబల వంటి పక్షుల రూపంలోనూ ఉంటాయి (7.104.20-22). ఇవి స్త్రీల దగ్గరకి సోదరుడు/ భర్త/ ప్రియుడి రూపంలో వచ్చి వారి సంతానికి హాని చెయ్యాలని చూస్తాయి (10.162.5). అవి కుక్క / కోతి రూపంలో స్త్రీలకోసం కాచుకొని కూచుంటాయి (అ.వే. 4.37.11). అందువల్ల అవి స్త్రీలకి గర్భవతులుగా ఉన్నప్పుడూ ప్రసవసమయంలోనూ హాని కలిగిస్తాయి (అ.వే. 8.6). పెళ్లి సమయంలో అవి వధువు చుట్టూ తిరుగుతూ ఉంటాయి; అందువల్ల

వాటి కళ్లకి గుచ్చుకోవాలని చిన్న కర్రముక్కలు గాలిలోకి వేస్తారు (మా.గృ.సూ. 1.10). రక్షస్సుల ఆకారాలని గురించి అథర్వవేదంలో చాలా వివరంగా చెప్పబడింది. వాటికి మానవాకారమే తలా, కళ్లూ, గుండె మొదలైన అవయవాలతో ఉన్నా, అందులో ఏదో ఒక విలక్షణం మూడు తలలూ, రెండు నోళ్లూ, అయిదు కాళ్లూ ఉండడం, వేళ్లు లేకపోవడం, పాదాలు వెనక్కి తిరిగి ఉండడం, చేతులమీద కొమ్ములు ఉండడం, ఎలుగుబంటి మెడ ఉండడం, నాలుగు కళ్లు ఉండడం వంటిది - తరచుగా ఉంటుంది (అ.వే. 8.6; హి.గృ.సూ. 2.3.7). నీలం, పసుపుపచ్చ, ఆకుపచ్చ రంగు రక్షస్సులు ఉంటాయని కూడా చెప్పబడింది (అ.వే. 19.22.4, 5). వీటిలో మగ, ఆడ కూడా ఉంటాయి; వీటికి కుటుంబాలూ, రాజులూ కూడా ఉంటాయి (అ.వే. 5.22.12; హి.గృ.సూ. 2.3.7); వీటికి చావు ఉంది (అ.వే. 6.32.2, మొ.).

70.3 యాతుధానులు మనుష్య మాంసమూ, గుర్రాల మాంసమూ తింటారు; ఆవుల పాలు తాగేస్తారు (10.87.16, 17). రక్షస్సులు రక్తమాంసాలపై వాటికున్న కాంక్ష తీర్చుకోవడం కోసం, సాధారణంగా శరీరంలో ప్రవేశించడం ద్వారా, మనుష్యులమీద దాడిచేస్తాయి. రక్షస్సులని భక్తుల శరీరాలలోకి ప్రవేశించకుండా చెయ్యాలని అగ్ని ప్రార్థించబడ్డాడు (8.49.20). ఎగురుతూ ఉండే రోగకారకమైన రక్షస్సు మానవశరీరంలోకి ప్రవేశిస్తుందని అథర్వవేదం (7.76.4) లో ఉంది. ఈ హానికర శక్తులు తినేటప్పుడూ తాగేటప్పుడూ నోటిద్వారా ముఖ్యంగానూ, ఇతర అవయవ ద్వారాలగుండానూ శరీరంలోకి ప్రవేశిస్తాయని భావించబడింది (అ.వే. 5.29.6-8; 8.6.3). అవి లోపలికి ప్రవేశించాక మనుష్యుడి శరీరంలో మాంసం పాడుచేసి రోగం కలిగిస్తాయి (అ.వే. 5.29.5, 10). రక్షస్సులు పిచ్చి కలిగిస్తాయి; మాట్లాడే శక్తి పోగొడతాయి (అ.వే. 6.111.3; హి.గృ.సూ. 1.15.5). అవి మనుష్యుల నివాసాలని ఆవరించి ఉంటాయి (కౌ.సూ. 135.9). ఈ శక్తులలో కొన్ని సాయంకాలాలలో ఇళ్లచుట్టూ నాట్యం చేస్తూ ఉంటాయనీ, గాడిదలలా అరుస్తూ ఉంటాయనీ, అడివిలో కూతలు కూస్తూ, గట్టిగా నవ్వులూ, పుర్రెలతో తాగుతూ ఉంటాయనీ వర్ణించబడింది (అ.వే. 8.6.10, 11, 14; హి.గృ.సూ. 2.3.7).

70.4 రక్షస్సులు విజృంభించే కాలం సాయంత్రం లేక రాత్రి (7.104.18). ఉదయించే సూర్యుడు వాటిని పారద్రోలడం వల్ల వాటికి తూర్పు దిక్కులో శక్తి ఉండదు (తై.సం. 2.6.6.3). రాలే తోకచుక్క రక్షస్సు ఆకారమని భావించబడింది (కౌ.సూ. 126.9).

ముఖ్యంగా అమావాస్య చీకటి దుష్టశక్తులకీ మృతుల ఆత్మలకీ అనుకూలమైన కాలం (అ.వే. 1.16.1; 4.36.3).

70.5 అవి యజ్ఞాలకి కూడా హాని కలిగించే అవకాశం ఉంది. ఋగ్వేదంలో రక్షస్సులు యజ్ఞానికి విఘ్నం కలిగిస్తాయనీ, యాతువులు ఆహుతులని పాడుచేస్తాయనీ ఉంది (7.104.18, 21). అవి దేవతారాధనకి వ్యతిరేకులు (10.182.3). యజ్ఞానికి శాపం తగలకుండా కాపాడడానికి అగ్ని వాటిని కాల్చాలని ప్రార్థన ఉంది (1.76.3). శత్రువు చేసే యజ్ఞాన్ని యాతుధానుల మాయతోనూ రక్షస్సు మాయతోనూ నిర్వీర్యం చెయ్యడానికి ఉపయోగించే మంత్రం ఒకటి అథర్వవేదం (7.70.2)లో ఉంది. ఈ దుష్టశక్తులు పితరుల ఆత్మల రూపంలో వచ్చి పితృకార్యానికి కూడా విఘ్నం కలిగిస్తాయి (అ వే 18.2.28; చూ. వా.సం. 2.29). వేదాల తరవాత సాహిత్యంలో రక్షస్సులు (అందులో రాక్షస శబ్దం కూడా వీటికి వాడబడింది) యజ్ఞానికి విఘ్నం కలిగిస్తాయనే భావన ఇంకా ప్రచురంగా ఉంది.

70.6 చీకటిని పోగొట్టేవాడూ, యజ్ఞానికి పురోహితుడూ అవడం వల్ల అగ్నే వీటిని నాశనం చేసే దేవతలలో ముఖ్యుడు; ఆయన వీటిని కాల్చాలి/పారదోలాలి/నాశనం చెయ్యాలి అనే ప్రార్థనలు తరచూ ఉన్నాయి (10.87.3, 6, మొ.). అందువల్ల ఆయనకి (మరికొందరు దేవతలకి కూడా) రక్షోహన్- 'రక్షస్సులని చంపేవాడు' అనే విశేషణం ఉంది.

70.7 ఈ దుష్టశక్తులు వాటంతట అవే కాకుండా మనుష్యుల ప్రేరణవల్ల కూడా ఇతరులకి హాని కలిగిస్తాయి. ఋగ్వేదంలో రక్షోయుజ్- 'రక్షస్సులు కలవారు (= వాటిని ప్రేరించేవారు (6.62.8); యాతుమావత్- 'యాతువులు కల (చేతపాడి చేసేవారు)' (7.104.23 8.60.20)ల ప్రసక్తి ఉంది. అభిచారం (= చేతపాడి) వల్ల బాధపడేవారు యవిష్ఠుడైన (= చాలా యువకుడైన) అగ్నికి హోమం చేస్తే రక్షస్సుల వల్ల బాధపోతుంది (తై.సం 2.2.3.2). ఒక అథర్వవేద సూక్తం (2.24)లో రాక్షసులు తమని పంపినవాళ్లే మింగెయ్యాలని ప్రార్థన ఉంది.

70.8 రక్షస్- శబ్దం అంతోదాత్తంగా పుంలింగంలోనూ ఆద్యుదాత్తంగా నపుంసక లింగంలోనూ రెండు లింగాలలోనూ ఉంది (నపుంసకలింగంలో దీనికి 'హాని' అనే అర్థం కూడా ఉంది). ఇది అథర్వవేదంలో ఒక క్రియారూపంలో మాత్రమే ఉన్న రక్ష-

'హానిచేయు' అనే ధాతువునించి వచ్చినది కావచ్చు (చూ. ఋక్ష- హాని కలిగించే ). కానీ ఇది ప్రచురంగా ఉన్న రక్ష- 'రక్షించు' అనే ధాతువుకే సంబంధించినది అని కూడా అనుకోవచ్చు. ఈ పక్షంలో దీని అర్థం 'దాన్నించి రక్షించుకోవలసింది' అని చెప్పాలి. కానీ దీని అర్థం మొదట్లో ''స్వర్గ సంపదకి రక్షకుడు'' అయి ఉండవచ్చునని బెర్గెయిన్ (Berga'gne) అభిప్రాయం.

70.9 **(ii) పిశాచాలు :** భూతాలలో పిశాచాలు (పిశాచ- / పిశాచి-) ముఖ్యమైన మూడో వర్గం. ఈ పేరు ఋగ్వేదంలో పిశాచి- అనే ఏకవచనరూపంతో ఒకే ఒకచోట (1.133.5) వచ్చింది. అక్కడ ఇంద్రుడు పసుపుపచ్చని పైభాగం కల (పిశంగభృష్టిం = ★'కొంచెం ఎరుపురంగు కల' అని సాయణుడు), నీటికి సంబంధించిన (అంభృణం = ★'శబ్దం చేసే / గొప్పవాడైన' అని సాయణుడు) పిశాచిని నాశనం చెయ్యాలనీ ప్రతి రక్షస్సునీ చంపాలనీ ప్రార్థన ఉంది. తై.సం. (2.4.1.1)లో అసురులు, రక్షస్సులు పిశాచాలు అనే మూడు శత్రు సముదాయాలు దేవతలు, మనుష్యులు, పితరులు అనే మూడు సముదాయాలకి విరోధులని ఉంది. అందువల్ల పిశాచాలకీ మృతులకీ ప్రత్యేకమైన సంబంధం ఉన్నట్లు కనబడుతుంది. పిశాచ శబ్దానికి పర్యాయంగా పరిగణించదగిన క్రవ్యాద్- 'పచ్చిమాంసం / శవాలని తినేవి' శబ్దానికి కూడా తరచు ప్రయోగం ఉంది (అ.వే. 5.29.9, మొ.). పిశాచాలు తినేసిన రోగి కండల్ని మళ్లీ రోగికి అగ్ని ఇవ్వాలని ప్రార్థన ఉంది (అ.వే. 5.29.5). అందువల్ల ఇది శవాల్ని తినే భూతాలు అనే భావం ఉంది అనుకోవచ్చు. పిశాచాలు నీటిలో ప్రకాశిస్తూ ఉంటాయనీ (అ.వే. 4.20.9; 4.37.10), మనుష్యుల నివాసాలనీ ఊళ్లనీ ఆవరించి ఉండి బాధిస్తాయనీ (అ.వే. 4.36.8) కూడా ఉంది.

70.10 ఋగ్వేదంలో పన్నెండుచోట్లా, అర్వాచీనవైదికగ్రంథాలలో ప్రచురంగానే ఉన్న అరాతులు (అరాతి-) భూతాలలో ఒక అప్రధానమైన సముదాయం; ఈ పదం పిసినిగొట్టుతనానికి వ్యక్తిత్వారోపం (రాతి = దానం; దీని వ్యతిరేకరూపం అ-రాతి); ఈ పదం స్త్రీలింగం కాబట్టి అరాతులు కూడా స్త్రీలే. ద్రుహ్- 'ద్రోహులు'ల ప్రసక్తి ఋగ్వేదంలో సుమారు పన్నెండు చోట్ల ఉంది; వీరిలో మగవాళ్లూ ఆడవాళ్లూ కూడా ఉన్నారు. అవెస్తాలో కూడా ద్రుజ్ అనే దుష్టశక్తుల ప్రసక్తి ఉంది కాబట్టి (అధ్యాయం 5.1) ఈ భావన మూలం ఇండో-ఇరానియన్ కాలానికి చెందినదే.

70.11 భూతాలలో చాలారకాలు సముదాయాలుగా ఉంటాయనేసాధారణమైన భావన కాని వీటిలో కొన్ని జంటల సముదాయాలు. ఋగ్వేదంలోనే (7.104.23; 10.87.24) ఉన్న కిమీదిన- (★మూలంలో ఉన్నట్లు కిమీదిన్- కాదు; మిథునా యాకిమీదినా) అనేది ఇటువంటి ఒకజంటల సముదాయం.

70.12 మానవుడి నిత్యజీవితాన్ని ఆవరించి ఉన్న ఈ శక్తుల స్వభావం హానిచెయ్యడమే వీటిలో ఒక్కొక్క వర్గం, సాధారణంగా దానిపేరుకితగినట్లు, ఒక్కొక్క రకం హాని చేస్తుంది ఇవన్నీ ప్రకృతిశక్తులకి సంబంధించినవి కావు; వీటిలో అధమపక్షం కొన్ని చచ్చిపోయిన శత్రువుల ఆత్మలకి సంబంధించినవి అనడానికి అవకాశం ఉంది. పైనచెప్పిన భూతాలలో ఉన్నంత వ్యక్తిత్వారోపం లేనివీ, బహుశా ఆలోచనలు కొంత పరిణతి పొందడం వల్ల ఏర్పడినవీ కూడా ఉన్నాయి: రోగం, వంధ్యత్వం, పాపం వంటి దుర్లక్షణాలు కలిగించే కంటికి కనపడని దుష్టశక్తులు గాలిలో ఎగురుతూ మానవులకి అపకారం చేస్తాయని భావించబడింది; అభిచార హోమం ముఖ్యోద్దేశం ఇటువంటి వాటిని శత్రువుల మీదకి పంపడమే.

70.13 కాని భూమిమీదఉండే ఈ శక్తులలో కొన్ని హానికరమైనవి కావు; కొన్ని పంటలు బాగా పండడానికి సహాయం చేస్తాయి; కొన్ని వధువుకి దీర్ఘాయుస్సు ఇస్తాయి. అర్బుది నాయకత్వంలో ఉన్న మరికొన్ని శత్రువులకి భయోత్పాతం కలిగించి మానవులకి యుద్ధంలో సహాయం చేస్తాయి (అ.వే. 3.24; 3.25.1; 14.1.45; 11.9.12).

# VII. పరలోక జీవితతత్త్వం

## 71. మృత సంస్కారం

71.1 వేదమంత్రాలలో చావుని గురించిన ప్రసక్తి చాలా తక్కువ. వేదఋషులు దాన్నిగురించి ప్రస్తావించినప్పుడు అది తమ శత్రువులకి ప్రాప్తించాలనే సాధారణంగా కోరుకున్నారు; తమకి మాత్రం భూమి మీద దీర్ఘాయుస్సు ఉండాలని కోరుకున్నారు. ముఖ్యంగా మృతసంస్కారం ప్రసక్తి ఉన్నచోట్ల మాత్రమే వారి ఆలోచనల్లో భావి (పరలోక) జీవితం చోటుచేసుకుంది. దహనమూ, ఖననమూ కూడా ఆదికాలం నించీ ఉన్నవే. ఋగ్వేదంలో ఒకసూక్తం (★0.16) దహనం అనే మృతసంస్కారాన్నీ, మరొకసూక్తభాగం (10.18.10-13) ఖననం అనే మృత సంస్కారాన్నీ వర్ణిస్తాయి. 'మట్టి ఇల్లు' (మృణ్మయంగృహం) ప్రసక్తికూడా ఒకచోట (7.89.1) ఉంది. అగ్ని దగ్ధులైనపితరుల ప్రసక్తీ, అనగ్నిదగ్ధులైన (= పాతిపెట్టబడిన) పితరుల ప్రసక్తీ కూడా ఉన్నాయి (10.15.14; అ.వే. 18.2.34). కాని మృతులు పరలోకానికి చేరడం కోసం సాధారణంగా అవలంబించే పద్ధతి దహనమే. తరవాత కాలపు కర్మకాండలో ఈ పద్ధతే ముఖ్యంగా చెప్పబడింది (చూ. ఆ.గృ.సూ. 4.1); చిన్నపిల్లలనీ సన్యాసులనీ మాత్రమే పాతిపెట్టేవారు; ఇంతేకాక పెద్దవారి ఎముకల్నీ భస్మాన్నీ పాతిపెట్టడం కూడా ఉంది.

71.2 అందువల్ల భావిజీవితానికి సంబంధించినగాథాతత్త్వం ముఖ్యంగా దహనకర్మ కాండతోనే సంబంధించి ఉంటుంది. అగ్ని శవాన్ని పరలోకానికి, పితరులూ, దేవతలూ ఉండేచోటుకి తీసుకువెళ్తాడు (10.16.1-4; 10.17.3). ఆయనమర్త్యుణ్ణి అత్యున్నత మైన అమర్త్యత్వస్థానంలో పెడతాడు (1.31.7). దివ్యపక్షి అయిన అగ్నివల్ల మనుష్యులు సూర్యుడి ఉన్నతస్థానానికి, పుణ్యాత్ములు ఉండేచోటూ, ప్రాచీనులు మొదటపుట్టినవారూ అయిన ఋషులు వెళ్లినచోటూ అయిన ఉత్తమమైన స్వర్గానికి వెళ్తారు (వా.సం. 18.51-52). గార్హపత్యాగ్ని మృతుణ్ణి పుణ్యలోకానికి (సుకృతస్యలోకం) తీసుకువెళ్తాడు (అ.వే. 6.120.1). అగ్ని మృతుడి శరీరాన్ని కాల్చి అతణ్ణి పుణ్యలోకంలో పెడతాడు (అ.వే. 183.71). శరీరాన్ని కాల్చే అగ్నికీ (క్రవ్యాద్-) ఆహుతుల్ని దేవతలకి తీసుకువెళ్లే అగ్నికీ భేదం చెప్పబడింది (10.16.9). అగ్ని శవాన్ని అలాగే ఉంచి (స్వర్గానికి తీసుకువెళ్లాలనీ), తన భాగమైన మేకని కాల్చాలనీ ప్రార్థన ఉంది (10.16.4).

అశ్వమేథంలో గుర్రంతో పాటు ఒకమేకనికూడా కాలుస్తారు; దీనికి ప్రయోజనం ఆ మేక పూషుడికి ప్రథమభాగంగా అత్యున్నత స్వర్గానికి ముందుగా వెళ్లి ముఖ్యాహుతి వస్తోందని దేవతలకి చెప్పడం (1.162.2, 4; 1.163.12, 13). యజ్ఞకర్మలో మృతదేహాన్ని ఒక నల్లమేకచర్మం మీద పెడతారు; బలి ఇచ్చే జంతువు ఆవు కాని మేక కాని అయి ఉంటుంది (ఆ.గృ.సూ. 4.2; కా.శ్రౌ.సూ. 25.7.19). దహనం చేసేటప్పుడు మృతుడి దేహం మీద పక్షి, జంతువు, చీమలు, పాము చేసిన గాయం ఉంటే దాన్ని అగ్నీ, సోముడూ పోగొట్టాలని కూడా ప్రార్థించబడతారు (10.16.6).

71.3 మృతుడు పొగతోపాటు స్వర్గలోకానికివెడతాడని భావన (ఆ.గృ.సూ. 4.4.7) అక్కడకివెళ్లే మార్గం చాలా దూరమైనది; ఆ మార్గంలో మృతుణ్ణి పూషుడు రక్షిస్తాడు సవిత తీసుకువెళ్తాడు (10.17.4). మృతుడికన్న ముందుగా వెళ్లి మృతుడు వస్తున్నాడని పితరులకి చెప్పే (బలి ఇచ్చిన) మేక మూడోస్వర్గానికి చేరేముందు పెద్ద చీకట్లని దాటి వెళ్తుంది (అజో నాక మాక్రమతాం తృతీయం, అ.వే. 9.5.1, 3; చూ. 8.1.8).

71.4 మృతుడికి పరలోక జీవితంలో ఉపయోగం కోసం ఆభరణాలూ బట్టలూ పెడతారు; ఈ అలవాటులో ఉద్దేశం వేదకాలంలో కూడా ప్రజలకి తెలుసు (అ వే 18 4 31). అతి పురాతనకాలంలో మృతుడి శరీరంతోపాటు అతని భార్యనీ ఆయుధాలనీ కూడా కాల్చే సంప్రదాయం ఉండేదనడానికి సూచనలు ఋగ్వేదంలో మిగిలి ఉన్నాయి (10 18.8, 9). మృతుడువెళ్లిన తోవలో జాడలు తుడిచివెయ్యడం కోసం మృతుడి శరీరానికి ఒకప్రత్యేకమైన మోపు (కూదీ-) కట్టేవారు ఇలా చేస్తే మృత్యువుకి మళ్లీ ఈ లోకానికి రావడానికి తోవ తెలియకుండా ఉంటుందని అభిప్రాయం (అ.వే. 5.19.12; చూ ఋ.వే. 10.18.2; 10.97.16).

## 72. ఆత్మ

72.1 అగ్నికాని సమాధికాని శరీరాన్ని మాత్రమే నాశనం చేస్తాయనీ మృతుడి అసలు వ్యక్తిత్వానికి నాశం లేదనీ నమ్మకం. ఆత్మకి మూర్ఛ సమయంలో కూడా శరీరాన్నించి విడిపోగల శక్తి ఉందనీ, అది మృతి తరవాత కూడా జీవించే ఉంటుందనీ పురాతన కాలం నించీ ఉన్న నమ్మకంమీద ఈ వేదాలలో భావన ఆధారపడి ఉంది. ఒక పూర్తి సూక్తం (10.58) లో చచ్చిపోయినట్లు పడి ఉన్న వ్యక్తి ఆత్మ (మనస్-) అది తిరుగుతూ ఉన్న

దూర ప్రదేశాన్నించి తిరిగి రావలని ప్రార్థన ఉంది. తరవాత కాలంలో ప్రచారంలోకి వచ్చిన పునర్జన్మ సిద్ధాంతం వేదాలలో సూచనా మాత్రంగా కూడా లేదు. కాని శతపథ బ్రాహ్మణం (10.4.3.10) లో సరైన జ్ఞానంతో యజ్ఞకర్మ చెయ్యనివారు చచ్చిపోయినతరవాత మళ్లీ పుడతారనీ అలా పునఃపునః మృత్యువుకి ఆహారం అవుతూనే ఉంటారనీ ఉంది ప్రాణ- 'ఊపిరి', ఆత్మన్- 'ఆత్మ' అనే పదాలేకాక (ఆత్మన్-, వాత- 'వాయువు' అనే పదాలు సమానార్థకాలు) చైతన్యశక్తిని సూచించడానికి అసు- 'అదృశ్యశక్తి' (ఇది జంతువులలో కూడా( ఐ.బ్రా. 2.6) శారీరక చైతన్యాన్ని సూచిస్తుంది, 1.113.16· 1.140.8), మనస్- ' ఆత్మ ( ఇది ఆలోచనలకీ, (కామక్రోధాది) మనోవికారాలకీఆధారస్థానం) అనే పదాలు కూడా తరచుగా వాడబడ్డాయి; ఋగ్వేదం (8.100.5) లోనే మనస్సు హృదయంలో ఉంటుందని భావించబడినట్లు కనుపడుతుంది. ముఖ్యంగా అథర్వవేదంలో చాలా మంత్రాలు జీవితం ఉండడం మరణించడం అసు- లేక మనస్- ఉండడం విడిచిపెట్టిపోవడం మీద ఆధారపడి ఉంటాయనే భావం వ్యక్తం చేస్తాయి. అసునీతి-, అసునీత- ' ఆత్మని తీసుకువెళ్లడం' అనే పదాలు ఇహలోకానికీ, పరలోకానికీ మధ్య ఉన్నతోవలో మృతుల ఆత్మలని అగ్ని తీసుకువెళ్లడాన్ని సూచిస్తాయి (10.15.4; 10.16.2). మృత సంస్కారవిధిలో ఉపయోగించే మంత్రాలు 'తండ్రి', 'తాత' వంటి పదాలతో మృతుడి అసువునీ మనస్సునీ కాక మృతుణ్ణిమాత్రమే సంబోధిస్తాయి. అందువల్ల ఆత్మ ఛాయామాత్రమైనదిగా కాకఅది ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం ఉన్నదిగా భావించబడిందని తెలుస్తుంది. మనుష్యులకి శరీరాన్ని విడిచిపెట్టిన తరవాతనే అమర్త్యత్వం లభించినా (శ.బ్రా. 10.4.3.9), పరలోక జీవితంలో శరీరానికి కూడా సంబంధం ఉన్నట్లు ఊహ ఉంది కాబట్టి మృతుడి శరీరానికి కూడా ఈ ఊహలలో ప్రాధాన్యం ఉంది. పరలోకంలో జీవితంలో శరీరానికి కూడా భాగం ఉంది (10.16.5; అ.వే. 18.2.20). ఇటువంటి శరీరం వైకల్యాలు ఏవీలేనిది అనే భావం ఉంది కాబట్టి (అ.వే. 6.120.3). ఇది ఈలోకంలో ఉన్నదేకాక అగ్నిశక్తి వల్ల (చూ. 10.16.6) పవిత్రితమైనది అని భావన అయి ఉంటుంది; ఈ భావన తరవాతకాలపు వేదాంతంలో ఉన్న అదృశ్య శరీర భావనకి తుల్యమైనది. దహనం తరవాత మృతుడి ఎముకలు మిగలకపోవడం (సూత్రగ్రంథాలలో దహనం తరవాత ఎముకల్ని పోగుచేస్తారని ఉంది) ఒకపెద్ద శిక్ష (శ.బ్రా. 11.6.3.11; 14.6.9.28) అని ఉండడం పరలోక జీవితంలో మృతదేహానికి ఉన్న ప్రాధాన్యాన్ని సూచిస్తుంది. ఒక

ఋగ్వేదమంత్రం (10.16.3) లో మృతుడికన్ను సూర్యుడి దగ్గరకి, అతని ఆత్మ వాయువు దగ్గరకీ వెళ్లాలని ప్రార్థన ఉంది. కాని ఈ భావం అగ్ని మృతుణ్ణి పరలోకానికి తీసుకువెళ్తాడని వర్ణించే మంత్రాల మధ్య ఉంది కాబట్టి ఇదిక్కడ మాత్రం కవితాధోరణిలో ఊహించి చెప్పినది కావచ్చు; పురుషసూక్తంలో ఒక మంత్రం (10.90.13) లో పురుషుడి కన్ను సూర్యుడు అయిందనీ, పురుషుడి ప్రాణం వాయువు అయిందనీ ఉన్న ఊహ దీనికి దోహదం చేసి ఉండవచ్చు. ఇదే మంత్రంలో (10.58.7లో కూడా) ఆత్మ నీళ్లలోకి లేక మొక్కలలోకి వెళ్తుందని చెప్పబడింది; ఈ భావనలో పునర్జన్మ సిద్ధాంతం అంకురదశలో ఉందని అనుకోవచ్చు.

72.2 దేవతల తేజస్సు వంటి తేజస్సుని పొందిన మృతుడి ఆత్మ (అ.వే. 11 1 37) పితరులు వెళ్లిన మార్గంలో (10.14.7) రథం మీద / రెక్కలతో ఎగురుతూ (అ వే 4.34.4) / అగ్ని రక్షస్సులని చంపే రెక్కలతో (వా.సం. 18.52) వెళ్లి శాశ్వతకాంతి ఉన్న ప్రదేశానికి చేరుతుంది (9.113.7). మృతుడు తనని మరుత్తులు పైకి తీసుకువెళ్లగా పిల్లగాలులూ, నీటిజల్లుల చల్లదనం అనుభవిస్తూ తన ప్రాచీన శరీరాన్ని పూర్తి రూపంలో పొందుతాడు (అ.వే. 18.2.21-26); వైభవోపేతుడైన అతను అత్యున్నత స్వర్గంలో యముడితో ఆనందం అనుభవించే పితరులని కలుసుకొంటాడు (10.14 8, 10 10.154.4, 5). ఇది ఇంటికి తిరిగిరావడం అని చెప్పబడింది (పునరస్తమేహి, 10.14 8) అతను తనవాడు అని యముడు గుర్తించాక (అ.వే. 18.2.37) ఆయన అతనికి నివాసస్థానం ఇస్తాడు (10.14.9).

72.3 శతపథ బ్రాహ్మణం ప్రకారం, ఈ లోకాన్ని విడిచివెళ్లే మృతుడు రెండు అగ్నుల మధ్యగా వెళ్తాడనీ అతను క్రూరుడైతే అవి అతన్ని దహించి వేస్తాయనీ, మంచివాడైతే పోనిస్తాయనీ సాధారణమైన నమ్మకం. వాటిని దాటినవాడు పితృలోకానికి వెళ్లే మార్గంలో కాని సూర్యలోకానికి వెళ్లే మార్గంలో కాని ముందుకి వెళ్తాడు (శ.బ్రా. 1.9.3.2, మొ.) పరమాత్మని తెలుసుకున్నవారికి రెండు తోవలు ఉన్నాయని ఉపనిషత్తులలో ఉంది వాటిలో ఒకటి (పూర్తి జ్ఞానఫలితంగా లభించే) బ్రహ్మ దగ్గరకి తీసుకువెళ్లే తోవ. రెండోది స్వర్గలోకానికి తీసుకువెళ్లేది. స్వర్గలోకానికి వెళ్లిన ఆత్మ తన సుకృతఫలితాలు అనుభవించడం అయ్యాక పునర్జన్మకోసం భూమికి తిరిగి వస్తుంది. ఆత్మజ్ఞానం లేనివారు

మాత్రం దుష్టశక్తులు ఉండే చీకటి లోకానికి వెళ్తారు, లేకపోతే అటువంటివారు పాపులుగా భూమి మీద మళ్లీ పుడతారు

## 73. స్వర్గం

73.1 పితృదేవతలూ యముడూ నివసించే స్థానం ద్యులోకం మధ్యభాగంలో (10.15.14) / అత్యున్నతస్వర్గంలో (10.14.8) / మూడో స్వర్గంలో, శాశ్వతకాంతి ఉండే ఆకాశం చాలా లోపలిభాగంలో (9.113.7-9) ఉంది. అధర్వవేదంలో కూడా అది అత్యున్నతమైనదనీ (11.4.11), కాంతివంతమైన లోకమనీ (4.34.2), నాకశిఖరమనీ (18.2.47), తృతీయనాకమనీ (9.5.1, 8; 18.4.3), తృతీయస్వర్గం అనీ (18.2.48) చెప్పబడింది మై.సం. (1.10.18; 2.3.9) లో పితృదేవతల నివాసస్థానం మూడో లోకం అని ఉంది. అది సూర్యుడిలో అత్యున్నత ప్రదేశం అని ఋగ్వేదం (9.113.9) లో ఉంది పితృదేవతలు సూర్యుడితో కలిసి ఉంటారు (10.107.2) / సూర్యుణ్ణి రక్షిస్తూ ఉంటారు (గోపాయంతి సూర్యం, 10.154.5) / సూర్యకిరణాలతో సంబంధించి ఉంటారు (1.109.7; శ.బ్రా. 1.9.3.10). వారికోసం సూర్యులు స్వర్గంలో ప్రకాశిస్తారు (1.125 6). వారికి విష్ణువు పాదంతో సంబంధం ఉంది (10.15.3). పుణ్యాత్ములు తమ ప్రియ నివాసస్థానమైన విష్ణువు అత్యున్నతపాదంలో ఆనందం అనుభవిస్తూ ఉంటారు (1.154.5). దేవతలు ఆనందంతో ఉండే చోటుకి విష్ణువు మూడడుగులు వేసినట్లు, సూర్యుడు ఉషస్సు వెనకాల భక్తులు యజ్ఞం చేసే చోటుకి వెళ్తాడు.

73.2 మంచిపనులు చేసి స్వర్గలోకానికి వెళ్లిన మనుష్యులకాంతులే నక్షత్రాలు అని ఉంది (తై.సం. 5.4.1.3; శ.బ్రా. 6.5.4.8). ప్రాచీనమానవులు, ముఖ్యంగా సప్తర్షులూ అత్రీ, అగస్త్యుడూ నక్షత్రాలుగా ఉన్నతస్థానం పొందేరని ఉంది (తై. ఆ.1.11.1.2).

73.3 ఋగ్వేదం (10.135.1) లో యముడు దేవతలతోపాటు ఒకచెట్టుకింద (సోమం) తాగుతూ ఉంటాడని ఉంది. అధర్వవేదంలో ఈ చెట్టు రావిచెట్టు (అశ్వత్థో దేవసదనః) అనీ మూడో స్వర్గంలో దానికింద దేవతలు అమృతం తాగుతూ ఉంటారనీ ఉంది (5.4.3; ఇక్కడ యముడి ప్రసక్తి లేదు).

## 74. పరలోక జీవితంలోని సుఖసంతోషాలు

74.1 పరలోక జీవితాన్ని గురించి వివరంగా చెప్పినచోట్లు ఋగ్వేదం తొమ్మిది పది మండలాలలో ఎక్కువగా ఉన్నాయి; దాని ప్రసక్తి మొదటి మండలంలో కూడా అక్కడక్కడ ఉంది. ఘోర తపస్సు చేసిన వారికీ, యుద్ధంలో ప్రాణాలకి తెగించిన వీరులకీ (10.154.2-5), అన్నిటికన్న ముఖ్యంగా, యజ్ఞాలు చేసి దానాలు ఇచ్చిన వారికీ (10.154.3; 1.125.5; 10.107.2) దేవతలు ఇచ్చే ప్రతిఫలం స్వర్గం అని భావించబడింది. అథర్వవేదం అంతటా యజ్ఞాలు చేసినవారికి లభించిచే దైవానుగ్రహం ప్రసక్తి ఉంది.

74.2 మృతులు స్వర్గంలో అతి సుఖమైన జీవితంలోకి ప్రవేశిస్తారు (10.14 8 10.15.14; 10.16.2, 5); ఆ జీవితంలో అన్ని కోరికలూ తీరతాయి (9.113 9 11). ఆ జీవితం దేవతల మధ్య (10.14.14), ముఖ్యంగా యముడూ వరుణుడూ అనే రాజుల సమక్షంలో (10.14.7) గడుస్తుంది. అక్కడ ముసలితనం రావడం అనే ప్రసక్తే లేదు (10.27.21). మృతులు అక్కడ మంచి వర్చస్సు కలిగిన దేహం పొంది దేవతలకి ప్రియులూ ఆదరణీయులూ అవుతారు (10.14.8; 10.16.5; 10.56 1). అక్కడ వారు తండ్రినీ, తల్లినీ, కొడుకులనీ చూస్తారు (అ.వే. 6.120.3); భార్యలతో పిల్లలతో కలుస్తారు (అ.వే. 12.3.17). అక్కడ జీవితంలో లోట్లూ, శరీర బాధలూ ఉండవు (10.14.8· అ.వే. 6.120.3); రోగం ఉండదు; కుంటితనం వంటి అవయవ వైకల్యాలు ఉండవు (అ.వే. 3.28.5). మృతులు ఆలోకంలో శరీరావయవపూర్ణత్వంతో ఉంటారని అ.వే , శ.బ్రా. లలో తరచుగా చెప్పబడింది.

74.3 మృతులు స్వర్గంలో దైవానుగ్రహం వల్ల వచ్చిన సుఖం అనుభవిస్తూ ఉంటారు (మదంతి / మాదయంతే) అని స్థూలంగా ఋగ్వేదంలో చాలాచోట్ల చెప్పబడింది (10.14.10; 10.15.14, మొ.). స్వర్గజీవితంలో ఉండేసుఖాలు ఋ.వే. 9.113.7-11 లో చాలా విపులంగా వర్ణించబడ్డాయి. స్వర్గంలో శాశ్వతకాంతీ, నీటిప్రవాహాలూ ఉంటాయి, అక్కడ గమనానికి అడ్డులేదు (చూ. తై. బ్రా. 3.12.2.9). అక్కడ అన్నమూ (స్వధా), తృప్తీ ఆనందాలూ, మోదాలూ, సంతోషమూ, కోరికలు తీరడమూ ఉన్నాయి. ఇందులో సాధారణ పదాలతో చెప్పబడిన ఆనందాలు కామసుఖాలు అని తరవాతకాలపు గ్రంథాలలో

వివరణ ఉంది (తై. బ్రా. 2.4.6.6; చూ. శ. బ్రా. 10.4.4.4). అథర్వవేదం (4.34.2) లో స్వర్గలోకంలో కామసుఖాలు సమృద్ధిగా ఉంటాయని ఉంది స్వర్గంలో పుణ్యాత్ములకి దొరికేసుఖాలు భూమిమీదదొరికే గొప్పసుఖాలకన్న వందరెట్లు ఉత్తమమైనవని శ. బ్రా. (14.7.1.32-33) చెప్తుంది. స్వర్గంలో వేణునాదమూ, పాటలూ వినపడుతూ ఉంటాయని ఋగ్వేదం (10.135.7) లో ఉంది; స్వర్గవాసుల కోసం సోమం, నెయ్యీ తేనే ప్రవహిస్తూ ఉంటాయి (10.154.1). అక్కడనేతిచెరువులూ, పాలూ, తేనే, కల్లూ (సురోదకాః), పెరుగూ - వీటి ప్రవాహాలు ఉంటాయి (అ.వే. 4.34.5, 6; శ. బ్రా. 11.5.6.4). లక్కడ అన్నికోరికలూ తీర్చే (కామదుఘాః, అ.వే. 4.34.8) ప్రకాశించే రంగురంగుల ఆవులు ఉంటాయి. అక్కడ ధనవంతులూ, బీదవారూ, అధికారం కలవారూ, దుర్బలులూ అనే భేదాలు లేవు. (అ.వే. 3.29.3). సంహితలలోనూ, బ్రాహ్మణాలలోనూ చెప్పబడిన ఈ స్వర్గసుఖాలు ఉపనిషత్తుల దృష్టిలో తక్కువస్థాయివి; తాత్కాలికమైనవి; వీటితరవాత పునర్జన్మ ఉంటుంది; సత్యజ్ఞానం పొందినవారే సర్వాత్మలో కలిసి అమర్త్యత్వాన్నీ శాశ్వతశాంతి అనే నిత్యానందాన్నీ పొందుతారు. పై చర్చవల్ల స్వర్గంలో పుణ్యాత్ముల జీవితం పనిచెయ్యనక్కర్లేకుండా ప్రాపంచికసుఖాలతో కూడినదిగా (★సంహితా బ్రాహ్మణాలలో) భావించబడిందనే విషయం స్పష్టమవుతుంది; అక్కడ వారు కొరతలు అనేవి లేకుండా దేవతలతో కలిసి ఉండి సంగీతం, మధుపానమూ, ఇంద్రియ సుఖాలూ అనుభవిస్తూ ఉంటారు (ఇటువంటి సుఖాలు దేవతలు కూడా అనుభవిస్తూ ఉంటారని లక్కడక్కడ చెప్పబడింది; చూ. 3.53.6).

.74.4 స్వర్గం ప్రాపంచిక సుఖాలు లభించేదిగా పురోహితులు ఊహించి చిత్రించిన మహత్త్వపూర్ణమైన లోకం; అది వీరులు ఊహించినది కాదు. అది పుణ్యకర్మలు చేసిన వారి లోకం (10.164); అక్కడ యజ్ఞకర్మలు (ఋత-) తెలిసిన పుణ్యాత్ములూ, దేవతల్ని ఆరాధించేవారూ సుఖంగా ఉంటారు. వారు యాగాలూ, దానాలూ చెయ్యడం వల్ల వారికి వచ్చినఫలితాలు (ఇష్టాపూర్త-) పొందుతారు; ముఖ్యంగా వారు యాజకులకి ఇచ్చినదానాల ఫలితాలు వారికి అక్కడ లభిస్తాయి (10.154.3), మొ.). మిగిలిన పుణ్యకర్మలు చేసినవారికన్న యజ్ఞాలు విధ్యుక్తంగా చేసినవారు శ్రేష్ఠులై ఆదిత్యుడితోనూ అగ్నితోనూ ఐక్యం పొందుతారని బ్రాహ్మణాలలో ఉంది; వారు వాయువు, ఇంద్రుడు, వరుణుడు, బృహస్పతి, ప్రజాపతి, బ్రహ్మలతో కూడా ఐక్యం పొందుతారని కొన్నిచోట్ల ఉంది (శ. బ్రా.

2.6.4.8; 11.4.4.21; 11.6.2.2, 3;తై.బ్రా. 3.10.11.6). ఒక ఋషి తన జ్ఞానం వల్ల బంగారు హంసగా మారి, స్వర్గానికివెళ్లి, సూర్యుడితో ఐక్యం అయ్యాడని తై. బ్రా. (3.10.9.11)లో ఉంది. కొన్ని రకాల యజ్ఞాలు చెయ్యడం ద్వారా మనుష్యుడు మరణించకుండానే(జీవన్) స్వర్గానికిచేరగలడని తై.సం. (6.6.9.2)లో ఉంది.

74.5 వేదాన్ని ఒక ప్రత్యేకమైన విధానంలో అభ్యసించినవాడు పునర్మరణం లేకుండా బ్రహ్మలో ఐక్యం (సాత్మతా) పొందుతాడని శ. బ్రా.(10.5.6.9)లో ఉంది. ఒక ప్రత్యేకమైన రహస్యం తెలుసుకొన్నందుకు ప్రతిఫలంగా మనుష్యుడు ఈలోకంలో మళ్లీ పుడతాడు (శ. బ్రా. 1.5.3.14). పై వాక్యాల వల్ల కర్మలకి ప్రతిఫలం, పునర్జన్మ ఉన్నాయనే సిద్ధాంతానికి బీజాలు శ. బ్రా. లో ఉన్నాయని తెలుస్తుంది. ఈ సిద్ధాంతం (నరకం ఉందనే సిద్ధాంతం కూడా) సూత్రగ్రంథాలలో ప్రాచీనమైనవాటిలోనేకాక బ్రాహ్మణాలకాలం చివరిభాగంలో అంటే, ఉపనిషత్తులలో ప్రాచీనమైనవి అయిన ఛాందోగ్యం, బృహదారణ్యకం, ముఖ్యంగా కఠం- వీటిలో పరిపూర్ణరూపంలో కనుపడుతుంది. కఠోపనిషత్తులో నచికేతుడి కథ ఉంది; నచికేతులు యముడి (మృత్యువు) లోకానికి వెళ్తే యముడు ఆయనకి ఇలా చెప్పేడు : ''స్వర్గానికి వెళ్లి అమర్త్యత్వం పొందడానికి చాలినంత పుణ్యం లేనివారు మృత్యువుకి అధీనులైసంసారచక్రంలో ప్రవేశించి శరీరం ఉన్న ప్రాణిగానో స్థావరపదార్థంగానో మళ్లీ మళ్లీ పుడుతూ ఉంటారు; ఆత్మనిగ్రహం ఉన్నవారు విష్ణువు అత్యున్నతస్థానానికిచేరుకుంటారు.'' ఇందులో అనర్హులు నరకానికివెళ్తారు అనే భావం లేదనేది గమనించదగినది.

## 75. నరకం

75.1 ఋగ్వేదకవుల దృష్టిలో పుణ్యాత్ములకి పరలోక జీవితంలో ప్రతిఫలం ఉంది కాబట్టి పాపులకి కూడా పరలోకంలో శిక్షకాకపోయినా ఏదో ఒకరకం నివాసస్థానం వారి దృష్టిలో ఉండి ఉండాలి అని ఊహించడం సహేతుకమైనదే; అవెస్తాలో నరకం ప్రసక్తి ఉందని ఇక్కడ గమనించాలి. అథర్వవేదంలోనూ, కఠోపనిషత్తులోనూ నరకం ప్రస్తావన ఉందనడంలో సందేహమే లేదు. అథర్వవేదం (2.14.3; 5.19.3)లో 'కింద ఉన్న ఇల్లు' (అధరాద్ గృహః) ప్రసక్తి ఉంది; (ఆడ) పిశాచులకీ (అర్యాయః), ఆడ దెయ్యాలకీ (యాతుధాన్యః) నివాసస్థానమైనదానికి పేరు నారకలోకం; ఇది యముడి నివాసస్థానమైన (అ.వే. 12.4.36) స్వర్గలోకానికి వ్యతిరేకమైనది. హత్యలు చేసినవాణ్ణి ఈ నరకలోకంలో

పడేస్తారు (వా.సం. 30.5). అథర్వవేదంలో ఇది 'కింద ఉన్న చీకటి' (అధమం తమః, 8.2.24, మొ.), 'నల్లని చీకటి' (కృష్ణాత్....తమసః, 5.30.11), 'గుడ్డి చీకటి' (,18.3.3) అని కొన్నిచోట్ల వర్ణించబడింది. నరకంలో బాధలు అథర్వవేదంలో ఒకచోట (5.19), శ.బ్రా. (11.6.1) లో విపులంగానూ వర్ణించబడ్డాయి; బ్రాహ్మణాలకి ముందుకాలంలో పరలోకంలో శిక్ష ఉంటుందనే భావం పూర్తిగా వృద్ధిపొందలేదు. ప్రతి వ్యక్తీ మరణం తరువాత ఒక త్రాసులో తూచబడతాడనీ, అతను చేసినవి మంచిపనులైతే మంచి ప్రతిఫలమూ, చెడ్డపనులైతే శిక్షా పొంది మళ్లీ పుడతాడని అదే బ్రాహ్మణం (శ.బ్రా. 11.2.7.33; చూ. 12.9.1.1) లో ఉంది; ఈ భావం అవెస్తాలో కూడా ఉంది. పాపులు మరణం ద్వారా నశిస్తారనేది ఋగ్వేదంలో భావన కాబట్టి అందులో నరకాన్ని గురించిన ప్రసక్తే లేదనే అభిప్రాయానికి రోథ్(Roth) తమ ఆమోదం తెలిపేరు. కాని ఋగ్వేదంలో ఏదో ఒకరకం నరకం ఉందనే అభిప్రాయానికి ఆధారం అసలు లేకపోలేదు; ఉదాహరణలు: పతిద్వేషులైన స్త్రీల వంటి పాపులూ, అబద్ధాలాడేవారూ ఈ అగాధమైనస్థానాన్ని పుట్టించారు (4.5.5). దుష్కార్యాలు చేసేవారిని ఇంద్రసోములు చీకటితో నిండిన అగాథంలో (వవ్రే) వారిలో ఒకడు కూడా మళ్లీ పైకి రాకుండా ఉండేటట్టు పడెయ్యాలి (7.104.3). తన శరీరాన్ని దాచుకొని ద్రోహబుద్ధితో గుడ్లగూబలా తిరిగే ఆమె (= రాక్షసి) అనంతమైన అగాధాలలో పడాలి (7.104.17). పగలూ, రాత్రీ మమ్మల్ని బాధించడానికి ప్రయత్నించే శత్రువు మూడులోకాలకీ కిందఉండాలి (తిస్రః పృథివీ రధో అస్తు, 7.104.11). కాని ఇటువంటి వాక్యాలు చాలా తక్కువ సంఖ్యలో ఉన్నాయి; ఇవి నరకం అనేది భూమి కింద ఉన్న చీకటి ప్రదేశం అనే భావాన్ని మాత్రమే సూచిస్తాయి కాని అంతకన్న ఎక్కువ ఏమీ సూచించవు (ఋగ్వేదం 10.10.6లో నీచి - (నీచ్యా) అనే పదం 'నరకం' అనే అర్థంలో వాడబడిందని గెల్డ్నెర్(Geldner) అన్నారు; ★సాయణుడు కూడా ఈ అర్థమే ఇచ్చారు). ఋగ్వేదకవుల ఆలోచనలు ఈలోకంలో సుఖాలపైనే కేంద్రీకృతమయ్యాయి; అవి పరలోకజీవితంలో సుఖాలవైపుకి అరుదుగా, శిక్షలవైపుకి అంతకన్న అరుదుగా, పోయాయి. మరణం తరవాత మంచివాళ్లూ, చెడ్డవాళ్లూ, అందరూ కూడా పరలోకంలో మళ్లీ పుట్టి తమ పనులకి తగిన ప్రతిఫలం అనుభవిస్తారనేది బ్రాహ్మణాల సిద్ధాంతం (శ.బ్రా. 6.2.2.27; 10.6.3.1); కాని మంచి ప్రతిఫలం కాని శిక్షకాని శాశ్వతం అని వాటిలో ఎక్కడా లేదు. యజ్ఞకర్మలు సరిగా అర్థం చేసుకుని నిర్వహించేవారు భూమిమీద వారికున్న గడువు పూర్తి అవకుండానే పరలోకానికి వెళ్తారు అనే భావన కూడా వాటిలో ఉంది (శ.బ్రా. 11.2.7.33).

75.2 మృతులకి తీర్పు ఉంటుందనే భావన వేదకాలంలో ఉందని చెప్పలేం. ఇటువంటి భావన సూచనామాత్రంగా ఉన్న ఒకటి రెండు ఋగ్వేదమంత్రాలలో స్పష్టతలేకపోవడం వల్ల ఈ విషయంలో నిర్ణయం చెయ్యడం కష్టం. తైత్తిరీయారణ్యకం (6.5.13)లో యముడి ముందు సత్యవంతులూ అబద్ధాలాడే వారూ విడదీయబడతారని ఉంది కానీ ఇక్కడ కూడా యముడు న్యాయనిర్ణేత అనే సూచన ఏదీలేదు.

75.3 మూల ఇండో-యూరోపియన్‌కాలంలోనే నరకం ఉంది అనే నమ్మకం ఉండేదని వెబర్(Weber) వాదించారు; దీనికి ఆయన చూపెట్టిన ఆధారాలు: సంస్కృతం భృగుః గ్రీక్ ఫ్లెగు అ ఇ - ధ్వనులలో ఇవి తుల్యంగా ఉండడం; భృగువు గర్వంతో ఉన్నందుకు ఆయన తండ్రి అయిన వరుణుడు ఆయన్ని నరకంలో బాధలు చూడమని నరకానికి పంపేడు అని శ.బ్రా.లో ఉన్న కథకీ పై గ్రీకుపదం పేరుగాగల వ్యక్తులు గర్వంతో ఉన్నందుకు వారికి నరకంలో బాధలు పడాలని శిక్ష విధించబడింది అనే కథకీ పోలిక ఉండడం. కానీ పాపులు నరకంలో బాధలు అనుభవిస్తారనే నమ్మకం భారతదేశంలో తరవాత కాలంలో ఏర్పడినది కాబట్టి పై రెండు కథలలో పోలిక బహుశా యాదృచ్ఛికమైనదే కావచ్చు.

## 76. పితృదేవతలు

76.1 మూడో స్వర్గంలో నివసించే దైవానుగ్రహం పొందిన మృతులు పితృదేవతలు (పితరః). ఈపదం ప్రాచీనులు లేక ప్రథములు అయినపూర్వులనిసూచిస్తుంది (10.15.8, 10); వారు ప్రాచీనమైన మార్గాలలో వెళ్లినవారు; ఇటీవల మరణించిన వారు వారిని చేరుకోవడానికి వెళ్లే మార్గాలు చేసిన ఋషులు (10.14.2, 7, 15). వారికి విష్ణువు మూడోపాదంతో సంబంధం ఉంది (10.15.3;చూ. 1.154.5). ఋగ్వేదంలో రెండు సూక్తాలు (10.15; 10.54) వారిని స్తుతించడానికి ఉద్దేశించినవి.

76.2 వారిలో నవగ్వులు, వైరూపులు, అంగిరసులు (అంగిరస్-), అథర్వులు (అథర్వన్-), భృగువులు, వసిష్ఠులు అనే విభాగాలు ఉన్నాయి (10.14.4-6; 10.15.8) వీటిలో చివరి నాలుగు పేర్లూ అథర్వవేదాన్నీ, ఋగ్వేదంలో రెండు, ఏడు మండలాలనీ దర్శించినవారుగా సంప్రదాయం చెప్పే పురోహిత గోత్రాల వారి పేర్లతో సమానం. మహాభారతంలో కూడా అగ్నిహోత్రారాధనకీ అథర్వవేదానికీ సంబంధం ఉన్నట్టు చెప్పబడింది కాబట్టి అథర్వవేదాన్ని అగ్నిహోత్రారాధకులైన అథర్వులూ, అంగిరసులూ

దర్శించారనడంలో చారిత్రకసత్యం ఉంది. అంగిరసులకీ యముడికీ ప్రత్యేకసంబంధం ఉన్నట్లు చెప్పబడింది (10.14.3, 5). పితృదేవతలలో కిందశ్రేణివారూ, ఉన్నత శ్రేణివారూ, మధ్యమశ్రేణివారూ, ప్రాచీనులూ, అర్వాచీనులూ అనే భేదాలు ఉన్నట్లు చెప్పబడింది; వారందరూ వారి సంతానం వారికి తెలియకపోయినా అగ్నికి తెలుసు (10.15.1, 2, 13). పితృదేవతలు అంతరిక్షం, భూమి, స్వర్గాలలో ఉంటారని అథర్వవేదం (18.2.49; చూ. ఋ.వే. 10.15.2) చెప్తుంది.

76.3 పితృదేవతలే (★వసిష్ఠులు) సోమయాగం చేశారని ఒకచోట (10.15.8, 9) ఉంది. వారు యముడితో కలిసి ఆనందిస్తూ ఉంటారు (10.14.10, చూ. 10.135.1; అ.వే. 18.4.10); దేవతలతో కలిసి భోజనం చేస్తారు (7.76.4). వారు దేవతల జీవితం వంటి జీవితమే గడుపుతూ ఇంచుమించు దేవతలలాగే గౌరవం పొందుతారు. ఇంద్రుడూ, ఇతర దేవతలూ వచ్చే రథం మీదే వారూ వస్తారు (10.15.10). వారు సోమప్రియులు (సోమ్యాసః, 10.15.1, 5, మొ.); యజ్ఞంలో వారు దక్షిణంవైపున దర్భాసనాల మీద కూచుని సోమం తాగుతారు (10.15.5, 6). వారు వారికోసం భూమిమీద తయారుచేసే సోమం మీద ఆసక్తితో ఉంటారు; వారు యముడితోనూ, ఆయన తండ్రిఅయిన వివస్వత్తుతోనూ, అగ్నితోనూ వచ్చి ఆహుతులు స్వీకరించాలని ప్రార్థనలు ఉన్నాయి (10.15.8-11; 10.14.4, 5). వారు వేలసంఖ్యలో వచ్చి అర్హతకు తగిన వరసల్లో యజ్ఞశాలలో కూచుంటారు (10.15.10, 11). పితృదేవతలు యజ్ఞానికి వచ్చినప్పుడు కొన్నిసార్లు దుష్టశక్తులు వారి స్నేహితుల రూపంలో వారి మధ్యకి వస్తాయని అథర్వవేదం (18.2.28) లో ఉంది.

76.4 పితృదేవతలు ఆహుతులని ఆహారంగా స్వీకరిస్తారు; ఒకమంత్రం (10.14.3) లో దేవతలు 'స్వాహా' అనే శబ్దంతో ఆహుతులివ్వడం వల్లా, పితృదేవతలు 'స్వధా' అనే శబ్దంతో ఆహుతు లివ్వడంవల్లా ఆనందిస్తారని ఉంది (స్వాహాన్యే స్వధయాన్యే మదంతి). ఇదేవిధంగా తరవాతకాలంలోని యజ్ఞకర్మలో కూడా ప్రతిరోజూ చేసే సోమాహుతులలో దేవతల భాగమూ పితృదేవతల భాగమూ వేరువేరుగా ఉంటాయి (శ. బ్రా. 4.4.22). పితృదేవతలు పూజించబడతారు; వారు భక్తుల ప్రార్థనలు వినాలనీ, వారు మంచివారని (దేవతలకి) చెప్పాలనీ, వారికిసహాయంచేసి కాపాడాలనీ, వారిసంతానం వారు మానవమాత్రు

లవడం వల్ల వారి విషయంలో ఏమైనా తప్పుచేసినా వారికి హాని చెయ్యవద్దనీ ప్రార్థనలు ఉన్నాయి (10.15.2, 5.6; చూ. 3.55.2). ఉషస్సులూ, నదులూ, పర్వతాలూ స్వర్గమూ, భూమీ, పూషుడూ, ఋభువులూ - వీరందరి అనుగ్రహంతోపాటు పితృదేవతల అనుగ్రహం కూడా ఉండాలని ప్రార్థనలు ఉన్నాయి (6.52.4· 6 75.10; 7 35 12 1.106.3). వారు వారి వంశస్థులకి సంపదలూ, సంతానమూ, దీర్ఘాయుస్సూ ఇవ్వాలని ప్రార్థనలు ఉన్నాయి (10.15.7, 11; అ.వే. 18.3.14· 18.4.62). వంశస్థులు పితృదేవతల అనుగ్రహం కోరతారు (10.14.6). వసిష్ఠుల సముదాయం వారి వంశస్థులకి సహాయం చెయ్యాలని ప్రార్థన ఉంది (7.33.1; చూ. 10.15.8). తుర్వశుడు, యదు, ఉగ్రదేవుడు వంటి కొందరు పూర్వులకి నామస్మరణ పూర్వకంగా ప్రార్థనలు ఉన్నాయి (1.36.18).

76.5 పితృదేవతలు చావులేనివారు (అ.వే. 6.41.3); వారు దేవతల మహత్త్వం పొందినవారు, దేవతలే అని కూడా చెప్పబడ్డారు (10.56.4). అంగిరసులు మొదలైన సముదాయాల వారిలో ప్రాచీనపురోహితలక్షణమూ దివ్యత్వలక్షణమూ కలిసి ఉన్నాయి. ప్రపంచోత్పత్తిలో దేవతలు చేసిన పనుల వంటివి వీరు కూడా చేసినట్లు కొన్నిచోట్ల చెప్పబడింది: వారు ఆకాశాన్ని నక్షత్రాలతో అలంకరించారు; చీకటిని రాత్రి సమయంలోనూ వెలుగుని పగటి సమయంలోనూ పెట్టేరు (10.68.11); దాగి ఉన్న కాంతిని బయటకు తీసుకువచ్చారు; ఉషస్సుని పుట్టించారు (7.76.4; చూ. 10.107.1); సోముడితో కలిసి స్వర్గాన్నీ భూమినీ విస్తృతం చేశారు (8.48.13).

76.6 శవాలని దహించే అగ్నికీ యాగాహుతులని దేవతలకి తీసుకువెళ్లే అగ్నికీ భేదం ఉన్నట్లే (10.16.9) పితృదేవతల మార్గానికీ దేవతల మార్గానికీ మధ్య భేదం ఉంది (10.2.7; 10.18.1; చూ. 10.88.15). అదేవిధంగా స్వర్గలోకమూ పితృలోకమూ వేరువేరని శ.బ్రా.లో ఉంది; స్వర్గలోకం ద్వారం ఈశాన్యదిశలోనూ, పితృలోకం ద్వారం ఆగ్నేయ దిశలోనూ ఉంటాయి (శ.బ్రా. 6.6.2.4; 13.8.1.5). పితృదేవతలు ఉండే దిక్కు దక్షిణం (శ.బ్రా. 1.2.5.17); ఈ భావన మూల ఇండో- ఇరానియన్ కాలానికి చెందినదే. విడిగా సృష్టించబడిన పితృదేవతల వర్గం మానవవర్గం కన్న భిన్నమైనది (తై.బ్రా. 2.3.8.2).

# 77. యముడు

77.1 దివ్యత్వం పొందిన మృతులకి అధిపతి యముడు. ఋగ్వేదకవుల ఆలోచనలలో పరలోక జీవితానికి స్థానం తక్కువ కాబట్టి యముడికి ఉద్దిష్టమైన సూక్తాలు మూడు మాత్రమే ఉన్నాయి (10.14; 10.135; 10.154). ఇవికాక యముడికీ ఆయన సోదరి అయిన యమి (యమీ-) కీ జరిగిన సంవాదం ఉన్న సూక్తం మరొకటి ఉంది (10 10). ఋగ్వేదంలో యముడి పేరు సుమారు ఏభైసార్లు వచ్చింది; ఈ సందర్భాలన్నీ ఒకటి పది మండలాలలో మాత్రమే (పదో మండలంలో చాలా ఎక్కువగా) ఉన్నాయి.

77.2 యముడు దేవతలతో ఆనందం అనుభవిస్తూ ఉంటాడు (7.76.4; 10.135.1). ఈయన వరుణుడు (10.14.7), బృహస్పతి (10.13.4; 10.14.3), ముఖ్యంగా అగ్ని - వీరితో కలిపి చెప్పబడ్డాడు; అగ్ని మృతులని తీసుకువెళ్లేవాడు కాబట్టి వీరిద్దరికీ ఎక్కువ సాహచర్యం ఉండడం సహజమే. అగ్ని యముడికి ఇష్టుడూ (కామ్య-, 10.21.5), పురోహితుడూ (10.52.3). దాగి ఉన్న అగ్నిని చూసినది ఒక దేవుడు అని 10.5.1.1 లోనూ యముడని 10.51.3 లోనూ ఉండడం వల్ల ఆ దేవుడు యముడే అని స్పష్టం. ఒకరినే అగ్ని యముడు, మాతరిశ్వుడు అనే పేర్లతో వ్యవహరిస్తారని ఒకచోట ఉంది (ఏకం సత్..... అగ్నిం యమం మాతరిశ్వానమాహుః, 1.164.46). దేవతల పేర్లలో అగ్నితోపాటు యముడి పేరు కూడా ఉంది (10.64.3; 10.92.11).

77.3 పై వాక్యాలలో యముడు ఒక దేవుడు అనే సూచన ఉంది. కాని యముడికి దేవశబ్దం విశేషణంగా ఏ మంత్రంలోనూ లేదు; ఆయనకి రాజన్- శబ్దమే విశేషణంగా వాడబడింది (రాజా వైవస్వతః, 9.113.8; యమాయ....రాజ్ఞే, 10.14.15); ఆయన మృతులకి రాజు (యమరాజ్ఞః, 10.16.9). మృతుడు స్వర్గానికి చేరి యముడూ, వరుణుడూ అనే ఇద్దరు రాజులని చూస్తాడు (10.14.7). ఆయన్ని స్తుతించే 10.14 సూక్తం అంతటా ఆయనకి పితృదేవతలతో, ముఖ్యంగా అంగిరసులతో, సాహచర్యం ఉన్నట్లు చెప్పబడింది (3, 5). ఆయన వారితో యజ్ఞానికి వచ్చి ఆనందిస్తాడు (3, 4, 10.15.8). తరవాతకాలపు గ్రంథాలలో (తై. ఆ. 6.5.2; ఆప. శ్రౌ. సూ. 16.6) యముడి గుర్రాల ప్రసక్తి ఉంది; వాటికి బంగారుకళ్లూ, ఇనపగిట్టలూ ఉన్నాయని వర్ణన. ఆయన జనులని ఒకచోటకి పోగుచేస్తాడు (సంగమనం జనానాం, 10.14.1); ఆయన మృతులకి

విశ్రాంతి స్థానం ఇస్తాడు (10.14.6; అ.వే. 18.2.37); నివాస స్థానాలు ఏర్పాటు చేస్తాడు (10.18.13).

77.4 యముడి నివాసం స్వర్గంలో చివరి ప్రదేశం (అవరోధనం దివః 9.133.8) మూడు స్వర్గాలలో రెండు సవితవి; ఒకటి యముడిది (1.35.6; చూ. 10.123 6) యముడికి మూడోది, అత్యున్నతమైనది (చూ. అధ్యాయం 73.3). యముడూ యమీ అత్యున్నత స్వర్గంలో ఉంటారని వా.సం. (12.63) లో ఉంది. దేవతలు నిర్మించిన (దేవమానం) యముడి నివాసస్థానం (సాదనం) లో వేణునాదం వినపడుతుంది· ఆయన్ని (స్తుతి) వాక్కులు అలంకరిస్తాయి (ఇయమస్య ధమ్యతే నాళీరయం గీర్భిఃపరిష్కృతః 10.135.7).

77.5 యముడికి సోమమూ నెయ్యీ అర్పిస్తారు (10.14.13, 14). ఆయన యజ్ఞానికి వచ్చి ఆసనం మీద కూచోవాలని ప్రార్థన ఉంది (10.14.4). ఆయన భక్తులని దేవతల దగ్గరికి తీసుకువెళ్లాలనీ వారికి దీర్ఘాయుస్సు ఇవ్వాలనీ ప్రార్థనలు ఉన్నాయి (10.14.14).

77.6 ఆయన తండ్రి వివస్వత్తు (10.14.5); తల్లి సరణ్యు (సరణ్యూ-, 10.17.1 2) ఆయనకి వైవస్వత- 'వివస్వత్తు కొడుకు' అనే తద్ధితరూపం వాడబడింది (10.14.1 మొ.). అవెస్తాలో సోమయాగం చేసిన మొదటి మనుష్యుడైన వీవఙ్హ్వాంత్ యిమ అనే కొడుకుని వరంగా పొందేడని ఉండడం వల్ల ఈ భావన మూల ఇండో- ఇరానియన్ కాలానికి చెందినదే అని తెలుస్తుంది. యముడు వివస్వత్తుకన్న గొప్పవాడనీ, ఆయనకన్న గొప్పవారు ఎవరూ లేరనీ అ.వే. (18.2.32;చూ. 18.3.61-2) లో ఉంది.

77.7 యమయమీసంవాదంలో (10.10.4) వారు తాము గంధర్వుడికీ అప్సరసకీ (అప్యా యోషా) పుట్టిన పిల్లలం అని చెప్పుకున్నారు (గంధర్వుడూ, అప్సరసా అంటే వివస్వత్తూ, సరణ్యూ అని సాయణుడు). యముడు 'ఒకే ఒక మర్త్యుడు' (ఏకస్య మర్త్యస్య) అని కూడా యమి అంటుంది (3). మరొకసూక్తం (10.13.4) లో యముడు మృత్యువుని కోరి తన శరీరాన్ని వదిలిపెట్టాడని ఉంది. ఆయన ప్రాచీనకాలపు పితరులు వెళ్లిపోయిన పరలోకానికి వెళ్లి చాలామందికి తోవ చూపెట్టేడు (10.14.1, 2). ఆయన

చచ్చిపోయిన మర్త్యులలో మొదటివాడు (అ.వే. 18.3.13). మర్త్యులు అనే శబ్దం తరవాత కాలంలో దేవతలకి కూడా వాడబడినా ఇక్కడ దానికి 'మనుష్యులు' అనే అర్థం చెప్పాలి. ఆయన మృతులలో ప్రథముడూ, ప్రాచీనతముడూ కాబట్టి తరవాత మృతులైన వారికి ఆయన అధిపతి అని భావించబడడం సహజంగానే ఉంది. ఆయన విశ్పతి 'నివసించేవారికి పతి', 'మా తండ్రి' (నః పితా) అని కూడా చెప్పబడ్డాడు (10.135.1). యముడి ద్వారా మానవులు ఆదిత్యుడైన వివస్వత్తు (వివస్వాన్ ఆదిత్యః) సంతానం అని అర్వాచీన గ్రంథాలలో చెప్పబడ్డారు (తై.సం. 6.5.6.2; చూ. శ.బ్రా. 3.1.3.4; ఋ.వే. 1.105.9). ఋగ్వేదంలో కూడా యముడికీ సూర్యుడికీ సంబంధం ఉంది; సూర్యుణ్ణి యముడు ఇచ్చిన గుర్రం (యమేన దత్తం ... అశ్వం, 1.163.2; చూ. 1.83.5) అని వర్ణించడంలో అమర్త్యులుగా మారిన మానవులకి యముడు ఇచ్చే స్థానం సూర్యమండలం అనే అంతరార్థం ఇమిడి ఉండవచ్చు.

77.8 యముడి మార్గం మరణం (1.38.5); ఒకచోట (10.165.4; చూ. మై.సం. 2.5.6; అ.వే. 6.28.31; 6.93.1) ఆయనకి మృత్యుశబ్దం ( = 'మరణం కలిగించేవాడు' అని ఇక్కడ అర్థం) విశేషణంగా వాడబడింది (యమాయ నమో అస్తు మృత్యవే). యముడు కాళ్లకు వేసే బంధం (పడ్బీశ-) ప్రసక్తి ఒకచోట (10.97.16) ఉంది. ఇది వరుణపాశం వంటిది. యముడికి ఉన్న ఇటువంటి లక్షణాల వల్లా, ఆయన దూతల వల్లా ఋగ్వేదంలో యముడు కొంతవరకూ భయకారకుడు అని భావించబడినట్లు కనుపడుతుంది. కాని అథర్వవేదంలోనూ దాని తరవాతకాలపు గాథాతత్త్వంలోనూ యముడికీ మృత్యువు తరవాత వచ్చే బాధలకీ చాలా సన్నిహిత సంబంధం ఉండడం వల్ల ఆయన మృత్యువుకి అధిదేవతగా భావించబడ్డాడు (కాని మహాభారతంలో కూడా ఆయన పరిధి నరకానికి మాత్రమే పరిమితం కాదు). అర్వాచీన సంహితలలో యముడు అంతకుడు (అంతం కలిగించేవాడు', మృత్యువు (వా.సం. 39.13), నిర్ఋతి 'రోగం' (అ.వే. 6.29.3; మై.సం. 2.5.6) వీరితో కలిపి (★వేరు వ్యక్తిగా) చెప్పబడ్డాడు; మృత్యువు ఆయన దూత (అ.వే. 5.30.12; 18.2.27, మొ.). అ.వే.లో మృత్యువు మనుష్యులకీ, యముడు పితృదేవతలకీ అధిపతి అని ఉంది (5.24.13-14); నిద్ర యముడి స్థానాన్నించి వస్తుంది (19.56.1, మొ.).

77.9 (అంతోదాత్తమైన) యమ శబ్దానికి 'కవలలు' అనే అర్థం కూడా ఉంది, ఈ అర్థంలో ఇది ఋగ్వేదంలో కొన్నిచోట్ల (సాధారణంగా పుంలింగ స్త్రీలింగాలలో ద్వివచనంలో) వచ్చింది; ఋగ్వేదంలో కొన్నిచోట్ల (ఆద్యుదాత్తమైన) యమ శబ్దం 'పగ్గం, మార్గదర్శకుడు' అనే అర్థాలలో వచ్చింది. ఋగ్వేదంలో యముడూ యమీ కవలలనే ఉంది; వీరిద్దరూ స్వర్గంలో కలిసి ఉంటారని తై.సం. (4.2.5.3), వా.సం. (12.63), శ.బ్రా. (7.2.1.10), తై. ఆ.(6.4.2) లలో ఉంది. అవెస్తాలో యిమకి కూడా 'కవలలు' అనే అర్థం కూడా చెప్పడానికి అవకాశం ఉంది (యస్న 30.3). అవెస్తాలో కాకపోయినా దాని తరవాత సాహిత్యంలో యిమకి యిమెహ్ అనే సోదరి ఉందనీ, వారిద్దరూ కలిసి మానవజాతికి ఆద్యులైన స్త్రీ పురుషులని పుట్టించారనీ ఉంది. తరవాతకాలపు భారతీయసాహిత్యంలో యముడు మృత్యువుకి అధిపతిగానూ, పాపులని శిక్షించేవాడుగానూ మారేక ఈ శబ్దం యమ్- 'నియమం (= కట్టుబాటు) చేయు' అనే ధాతువు నుంచి వచ్చిందని వ్యుత్పత్తి కల్పించబడింది; ఈ వ్యుత్పత్తిని గ్రాస్మన్(Grassmann), ల్యూమన్ (Leumann) అంగీకరించారు. కాని ఈ వ్యుత్పత్తి వేదాలలో యముణ్ణి గురించి ఉన్న భావాలకి అనుగుణం కాదు.[1]

77.10 యముడూ మృత్యువూ ఒకరే అని చెప్పినట్లు ఉన్న మంత్రం (10.165.4 చూ. 10.123.6) లో గుడ్లగూబ (ఉలూక-), పావురం (కపోత-) అనే పక్షులు యముడి దూతలని ఉంది. అందువల్ల యముడి దూత(లు) అన్నా మృత్యువు దూత(లు) అన్నా ఒకటే అని చెప్పవచ్చు (అ.వే. 8.8.11). కాని యముడి దూతలని సాధారణంగా చెప్పబడేవి రెండు కుక్కలు; వీటి ప్రసక్తి కొంత విపులంగా 10.14.10-12 లలో ఉంది. అవి నాలుగు కళ్లూ (చతురక్షౌ, పెద్దముక్కూ (ఉరుణసౌ), రంగుమచ్చలూ (శబలౌ), గోధుమరంగూ (ఉదుంబలౌ) కలవి; అవి సారమేయాలు (సారమేయౌ) 'సరమకి పుట్టినవి'. అవి మార్గాన్ని రక్షించేవి (పథరక్షీ, 10.14.11); రక్షకులు (రక్షితారౌ); అవి మార్గంలో కూచుంటాయి (అ.వే. 18.2.12). ఈ కుక్కలని తప్పించుకుని వెళ్లి యముడితోపాటు ఆనందం అనుభవిస్తూ ఉంటే పితృదేవతల దగ్గరకి చేరమని మృతుణ్ణి ప్రోత్సహించే వాక్యా-

---

1. యముడు మృతుల కాళ్లకి వేసే బంధాన్నించి ఓషధులు మమ్మల్ని కాపాడాలి అనే ప్రార్థన ఋగ్వేదం (ముంచంతు.... యమస్య పడ్బీశాత్, 10.97.16; పైన 8 వ పేరా) లోనే ఉండడం వల్ల ఈ వ్యుత్పత్తి వేదాలలో భావాలకి అనుగుణం కాదని నిరాకరించడం పునరాలోచన యోగ్యం.

ఉంది(10.14.10). మృత్యుణ్ణి రక్షణకోసం ఈ కుక్కలకి ఇచ్చి [illegible] కలిగించమని యముడికి ప్రార్థన ఉంది(10.14.11). మనుష్యుల ప్రాణాలను [illegible] (అసుతృపా) ఈ కుక్కలు యముడి దూతలుగా మనుష్యుల మధ్య సంచరిస్తూ మనుష్యులని పరిశీలించి చూస్తూ ఉంటాయి; అవి మేం సూర్యుణ్ణి చూస్తూ ఉండడానికి మాకు చిరకాలం ప్రాణాలు (మళ్లీ) ఇవ్వాలి అని ప్రార్థన ఉంది (10.14.12 [illegible] మనుష్యులలో మరణం పొందబోయే వారిని గమనించడం, యమలోకానికి వెళ్లే వాటి తోవలో పరిశీలించి చూడడం, కాపాడడం వాటి పనులని చెప్పవచ్చు. [illegible] కళ్లూ, పసుపుపచ్చ చెవులూ ఉన్న ఒక కుక్క ఈ లోకానికీ పరలోకానికీ మధ్య ఉన్న [illegible] అనే వంతెన దగ్గర కాపలా కాస్తూ ఉంటుందని ఉంది; ఈ కుక్క [illegible] దెయ్యాన్ని భయపెట్టి అది పుణ్యాత్ముల ఆత్మలని నరకానికి లాక్కుపోకుండా కాపాడుతుంది. యముడి రెండు కుక్కలూ పాపుల ఆత్మలని స్వర్గానికి వెళ్లకుండా [illegible] అవకాశం ఉన్నా ఇలా చెప్పడానికి చాలినంత ఆధారం లేదు. కాని ఋ.వే. 7 [illegible] మంత్రాలకి ఔఫ్రెక్ట్ (Aufrecht) ఇచ్చిన వివరణ సరైనదే అయితే ఈ కుక్కల పని పాపులని బహిష్కరించడమే. యముడు మనుష్యుల మధ్యకి పంపిన దూతలకి అథర్వవేదంలో బహువచనం కొన్నిచోట్ల (8.2.11; 8.8.11), ద్వివచనం కొన్నిచోట్ల (5 30.6) వాడబడింది. అందులో ఈ రెండు కుక్కలలో ఒకటి శబల- 'రంగు మచ్చలు కలది' అనీ ఇంకొకటి శ్యామ- 'నల్లనిది' అనీ చెప్పబడింది(8 1 9); శబల శబ్దానికీ గ్రీక్ కెర్బెరోస్ అనే శబ్దానికీ జన్మ సంబంధం ఉందని కొందరు అన్నారు; కాని దీన్ని కొందరు వ్యతిరేకించారు బెర్గెయిన్ (Bergaigne) (1.93) ఈ రెండు కుక్కలూ (అగ్నితో ఏకత్వం ఉన్న) యముడూ, యమీ- వీరి రూపాలే అన్నారు; తరవాత కాలపు గాథాతత్త్వంలో యముడే మృతులని తీసుకువెళ్లడానికి వస్తాడని ఉన్న అభిప్రాయం ప్రాచీనమైనదే అయి ఉంటుంది అని కూడా ఆయన (1.92) అభిప్రాయపడ్డారు. యముడి రెండు కుక్కలూ సూర్యుడూ చంద్రుడే అని బ్లూమ్‌ఫీల్డ్ (Bloomfield) అభిప్రాయం (కౌశీతకి బ్రాహ్మణం (11.9)లో అవి రాత్రీ, పగలూ అనీ శ.బ్రా. (11.1.5 1)లో చంద్రుడు స్వర్గంలో కుక్క అనీ ఉంది).

77.11 పైన ఇచ్చిన సాక్ష్యాధారాల వల్ల యముడు మృతుల ఆత్మలకి అధిపతి [illegible] నిర్ణయమే అన్నిటిలోకీ సమంజసమైనది అని చెప్పవచ్చు. మృతుల ఆత్మలకి [illegible]

ఉంటాడు అనే భావం చాలా జాతుల వారి గాథలలో ఉంది. యముడు మానవజాతికి ఆదిపురుషుడూ, మృతులలో మొట్టమొదటివాడూ అని ఉన్న వాక్యాలు ఈ నిర్ణయానికి మూలస్తంభాలు. యముడూ, యమీ = యిమ, యిమెహ్ అనే ఆద్యులైన కవలలు మానవ జాతిని సృష్టించారు అనే గాథ మూల ఇండో- ఇరానియన్ కాలానికి చెందినదే అనుకోవచ్చు. అవెస్తాలో యిమ భూతల స్వర్గానికి రాజు అనీ ఋగ్వేదంలో యముడు స్వర్గంలో ఒక సుఖమయమైన ప్రదేశానికి రాజు అనీ ఉండడం వల్ల మూల ఇండో- ఇరానియన్ కాలంలో ఆయన ఒక స్వర్ణయుగానికి రాజుగా భావించబడి ఉండవచ్చు ( అవెస్తాలో యిమ ఆదిపురుషుడు అని చెప్పే సూచనలు కూడా కొన్ని ఉన్నాయి). రోథ్ (Roth) మొదలైన కొందరు పండితులు యముడు మొదట్లో ఒక మానవుడు అనే భావన ఉందని అన్నారు. ఇ హెచ్ మేయర్ (Meyer) యమి ఇంద్రాణి వంటి ఇతర స్త్రీ దేవతలలాగే గాథలలో తరవాత కాలంలో సృష్టించబడిందని అంటూ 'కవలలు' అనే అర్థం కూడా ఉన్న యమశబ్దం పురుషుణ్ణీ ఆత్మనీ - ఈ రెండింటినీ సూచిస్తుందని అన్నారు. చాలామంది ఇతర పండితులు యముడు ఏదో ఒక ప్రకృతి పదార్థానికి ప్రతీక అని చెప్పేరు. కొందరు యముడు అగ్నికీ మరికొందరు సూర్యుడికీ, ఇంకా కొంతమంది పగలు చివరి భాగానికీ, మరికొంతమంది అస్తమించే సూర్యుడికీ ( అందువల్లనే ఆయన మృతులకి అధిదేవత) రూపాంతరం అన్నారు. మరణం ( వృద్ధిక్షయాలు) సహజమైన చంద్రుడే యముడని హిలెబ్రాంట్(Hillebrandt) అభిప్రాయం; మరణ స్వభావం గల సూర్యుడి (= ఆదిత్యుడైన వివస్వత్తు) కొడుకుకి పితృదేవతలతో సన్నిహిత సంబంధం ఏర్పడిందని ఆయన ఇచ్చిన వివరణ. కాని అవెస్తాలోనూ వేదంలోనూ యముడు భూమిమీద స్వర్గానికి / మృతులుండే స్థానానికి రాజు అని మాత్రమే ఉండడం వల్ల చంద్రుడే యముడనే భావన మూల ఇండో- ఇరానియన్ కాలంలో మాత్రమే ఉండి ఉండాలని కూడా ఆయన అన్నారు ( ఈ భావన అవెస్తాలో కాని వేదంలో కాని మిగలలేదు).

# ద్వాదశసూరి చరిత్ర

(పన్నిద్దరాళ్వారుల జీవితకవితాతపస్సాధన)



రచయిత:
"విద్యావిశారద", "ఉపనిషదుద్యానకోకిల"
**శ్రీ కె. టి. యల్. నరసింహాచార్యులు,**
సాహిత్యరత్న; భాషాప్రవీణ

వ్యవస్థాపకులు & ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల
మునునూరు : : కృష్ణాజిల్లా